ANDHRA PATRIKA

# ఆంధ్రపత్రిక

ఇరువదినాల్గవ

## సంవత్సరాది సంచిక

### శ్రీముఖ సంవత్సరము






అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

చల్లా శేషగిరిరావు


ఆంధ్రవిద్వన్మహాజనులచే వ్రాయబడిన

సారస్వత చారిత్రిక సాంఘికాదివిషయక

వ్యాసములును, చిత్రములును గలవు


ఆంధ్రపత్రికా ముద్రాలయమున ముద్రితము

6-7, తంబుశెట్టి వీధి, జార్జిటౌను, మద్రాసు

1933-వ సంవత్సరము, మార్చినెల 27-వ తేది

౧౯33-3౮

నవీన చిత్రమగు

# టీ - సెట్లు

గల

## అందమైన పెట్టె



ఒక ప్రాత్రి పెట్టెలో, ఒక టీ పాత్ర, పాల గిన్నె, చక్కెర గిన్నె, వడియకట్టు పాత్ర, రెండు చెంచాలు ముఖ్యముగ ఏ యుండును. సరికొత్త నికరము వెండితో తయారు చేయబడి అందమైన నగిషీ పెట్టెలో సమర్చబడియున్నవి. దాని మీద వెనుకకును ముందుకును జరుగుచుమూత యుండును.

**దీనివెలరూ. 140 మాత్రమే.**

టీ పాత్ర చాలపెద్దది. ఒకసారి ఆరు మందికి తయారు చేయుటకు సరిపోవును. తక్కిన వస్తువులు కూడ ఆ కొలతలలో నుండును.

ముఖ్య స్నేహితులకు విందు చేయుటకును, కుటుంబ సమావేశములలోను యిది ముఖ్యముగా నుండ దగినది. చాల అందమైనది.

సంపుటము

జరుగుడు మూత గల పెట్టె.

త్రాబేలు చిప్పతోగాని, ఆలువచిప్పతోగాని చేయబడి వెండి పూత పూయబడిన సంపుటి అలంకారములు గలది.

లోపల మేలు ముఖమలు గుడ్డ అమర్చబడియున్నది.

దీనికి సింగిలీకు పాటు పట్టి తాళము బిగము గలవు.

ఉమ్మిడి రామయ్య శెట్టి, గురుస్వామి శెట్టి కంపెనీ,

నగల వర్తకులు.

25, చైనాబజారు, మద్రాసు.] [బ్రాంచి: బొంబాయి.

# విషయానుక్రమణిక


విషయానుక్రమణిక ... ౧-౩
చిత్రానుక్రమణిక ... ౪-౬
చిత్రవివరణము ... ౭-౧౦
ప్రకటనల వివరణము ... ౧౧-౨౦
పంచాంగము ... ౧-౩౨
ప్రస్తావన ... ౩౩-౪౪॥


## గద్యవ్యాసములు


౧. రాజకీయము

సంస్థానప్రజలు—నార్ల వేంకటేశ్వరరావుగారు ... ౪౯-౫౫

౨. సారస్వతము

తెలుగుకైత తెన్నులు—బులుసు వేంకటరమణయ్యగారు ... ౫౭-౬౦
శాకుంతలము: దాని నూతనదేశము—రెబ్బాప్రగడ మందేశ్వరశర్మగారు ... ౬౧-౬౬
వాఙ్మయము : కథలు—'ధూమోహర్ రాయ్' ... ౬౭-౭౦
కొంటికెలపూడి సోమనాథకవి—కోడిదెన బాలకృష్ణయ్యగారు ... ౭౧-౭౪
తెనుగుబాస సంగ్రహింపు—ఏకాంతం వేంకటరావుగారు ... ౭౫-౭౮
పాలకురికి సోమనాథకవి : ఉదాంకగద్య—బండారు తమ్మయ్యగారు ... ౭౯-౮౦
ద్రుతస్వరూపము—జాస్తి వెంకటనరసయ్య చౌదరిగారు ... ౮౧-౮౨
కొన్నివృత్తములు-లక్షణములు—దువ్వూరి సూర్యనారాయణమూర్తిగారు ... ౮౩-౮౭
ఆంధ్రులు—రాధ—సమ్ముల వేంకటరాఘవాచార్యులుగారు ... ౮౮-౯౨

౩. నాటకము

పీనాసి లేక వెంకటరామం—టే. కామేశ్వరరావుగారు ... ౯౭-౧౦౬
తోకచుక్క—కుందుర్తి సింహరావుగారు ... ౧౦౭-౧౨౩

౪. కథలు

రాధ—'వసంతమూర్తి' ... ౧౩౦-౧౩౯
గాలిదుమారం—వెంపటి నాగభూషణంగారు ... ౧౪౬-౧౫౬
నియమనిర్వహణము—...రి వేంకట...మారావుగారు ... ౧౬౫-౧౭౫
కులమా? ప్రేమా?— ...కుమారిగారు ... ౧౭౬-౧౮౫

౫. చరిత్ర

గుప్తులేనాటివారు?— ...కృష్ణరావుగారు ... ౧౯౦-౧౯౭
బరోడా—తిరుమల ర...గారు ... ౧౯౮-౧౯౯
...ర్వేటి నగరచరిత్ర— ...మ్. వేణుగారు ... ౨౦౭-౨౧౩

౬. జీవితము

దేశభక్త శ్రీ కొండ వెంకటప్పయ్యపంతులుగారు—రాయసం వెంకటశివుడుగారు ... ౨౧౭-౨౨౧

౭. వేదాంతము

గీత-కృష్ణుడు—ఉన్నవ రాజగోపాల కృష్ణయ్యగారు ... ... ... ... ౨౨౩-౨౨౬

౮. జ్యోతిషము

అయనబలానయనము—సూరి రామసుబ్బరాయశాస్త్రిగారు ... ... ... ౨౨౮-౨౩౩

౯. వైద్యము

ప్రాచీన శస్త్రశాస్త్రము—జటావల్లభుల వెంకటేశ్వర్లుగారు ... ... ... ౨౩౯-౨౪౦

౧౦. మతము

మతముల స్వరూపము—వల్లూరి సూర్యనారాయణరావుగారు ... ... ... ౨౪౪-౨౪౫

వివాహములు—అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ... ... ... ... ౨౪౬-౨౪౮

ఖురాన్—ఉమర్ అలీషాగారు ... ... ... .. ... ౨౪౯-౨౫౩

౧౧. సంగీతము

భారతీయ రాగపద్ధతి—వింజమూరి వరాహనరసింహాచార్యులుగారు . ... ౨౫౫-౨౬౬

గానము—కుడితిపూడి అచ్చమాంబగారు ... ... ... . ... ౨౬౭-౨౬౮

౧౨. శిల్పము

బాదామి-వాతాపిపురము—కొ. నరసింహాచారిగారు ... . ... ౨౬౯-౨౭౩

౧౩. పరిశిష్టము

హింస—శ్రీ శ్రీ శ్రీ రాజా విక్రమదేవ వర్మగారు ... ... ... ౨౮౧-౨౮౨

స్వయంనిర్ణయ సూత్రము—గా. హరి సర్వోత్తమరావుగారు ... . ... ౨౮౩-౨౮౮

నా మొక—ఆదిభట్ల నారాయణదాసుగారు ... ... . ... ౨౮౯-౨౯౧

స్థానిక స్వపరిపాలనము—భూపతిరాజు వెంకటరామరాజుగారు ... . ... ౨౯౩-౨౯౭

గ్రామపునర్నిర్మాణము: స్త్రీలు—దేశరాజు భారతీదేవిగారు ... . ... ౩౦౧-౩౦౩

భారతదేశపు బీదఱికము—గోరింట సూర్యనారాయణరాజుగారు ... . ... ౩౦౪-౩౦౮

గుహుడు—కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు ... ... . ... ౩౦౯-౩౧౧

విషజంతువులు—మరకాని పరాత్పరరావుగారు ... ... .. ... ౩౧౩-౩౧౬

తెల్లకాగితము ... ... ... ... ... .. ... ౩౨౧-౩౬౪

ఆంగీరస సంవత్సరవిశేషములు ... ... .. ... ౩౬౫-౩౬౮


పద్యవ్యాసములు


విశ్వదాతకు—ఉగాదికానుక పెనుమత్స సత్యనారాయణరా ... ౪౪[illegible]

ఉగాది—సెట్టి లక్ష్మీనరసింహముగారు ... ... ...

శ్రీ భారతమాత—పసుమర్తి కృష్ణమూర్తిశాస్త్రిగారు ... ... ...

శ్రీముఖము—నేమాన సూర్యప్రకాశకవిగారు ... ... ...

శ్రీముఖాబ్దమా !—కల్వాల పార్వతమ్మగారు ... ... ... ... ౪౭

శ్రీముఖము—ఓలేటి వేంకటరామశాస్త్రిగారు ... ... ... ... ౪౮

ఉగాది—వీరభొట్ల సూర్యనారాయణశాస్త్రిగారు ... ... ... ... ౪౮

అతడు—కనుపర్తి వరలక్ష్మమ్మగారు ... ... ... ... ... ౫౫-౫౬

స్వోత్కర్ష—దివాకర్ల వేంకటావధానిగారు ... ... ... ... ... ౯౩-౯౫

మూడుకవిత—శ్రీరంగం నారాయణబాబు, కాళ్ళూరి వేంకట నరసింగరావుగార్లు ... ౯౫

కవితాపరామర్శము—దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు ... ... ... ... ౯౬

'యదాశ్రౌషం' పర్వము—దివాకర్ల వేంకటావధాని, పాటిబండ మాధవశర్మగార్లు ... ౧౨౪-౧౩౦

చెలిమి కలిమి—నిడమర్తి ఈశ్వరప్పగారు ... ... ... ... ... ౧౪౦-౧౪౫

పరమార్థ తత్త్వసారము: హలధరాచ్యుతుల తీర్థయాత్ర—చెన్నాప్రెగడ భానుమూర్తిగారు ౧౫౭-౧౬౪

భ్రమ-ప్రమాదము-కొత్తపల్లి సూర్యరావుగారు ... ... ... ... ౧౬౫-౧౮౮

సీతాసందేశము—వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు ... ... ... ౧౮౯-౧౯౦

చిక్కప్ప యొడయరు—సీరిపి ఆంజనేయులుగారు ... ... ... ... ౨౦౦-౨౦౬

వేంకటగిరి ప్రభునిరసికత—హరి రాధాకృష్ణమూర్తిగారు ... ... ... ౨౧౪-౨౧౬

అఖండగౌతమి—జి. జాషువగారు ... ... ... ... ... ౨౨౨

స్త్రీమూర్తి—ఓలేటి సీతారామమూర్తిగారు ... ... ... ... ౨౨౭

చామెకాంబ—శ్రీ శివశంకరశాస్త్రిగారు ... ... ... ... ... ౨౩౪-౨౩౮

శ్రీరామ కృష్ణతారమాలిక—వెదురుమూడి వెంకటకృష్ణారావుగారు ... ... ౨౪౧-౨౪౩

పట్టుపురుగుపాట—కర్లపాలెం కుటుంబశాస్త్రిగారు ... ... ... ... ౨౫౪

బుద్ధమూర్తి—పిలకా గణపతిగారు ... ... ... ... ... ౨౭౪

వీరాభిమన్యు !—పరుచూరి భువనేశ్వరీదేవి, పరుచూరి అన్నపూర్ణాదేవిగార్లు ... ... ౨౭౫-౨౭౭

కుంతి—దీపి సీతారత్నముగారు ... ... ... ... ... ౨౭౭

భ్రమరగీతి—కృష్ణవేణమ్మగారు ... ... ... ... ... ౨౭౮

ఆదర్శమహిళామండలి—చదలవాడ రాఘవమ్మగారు ... ... ... ... ౨౭౮-౨౭౯

సీతాకోకచిలుక—ఓలేటి నిత్యకల్యాణమ్మగారు ... ... ... ... ౨౮౦

తుమ్మెదా !—చావలి బంగారమ్మగారు ... ... ... ... ... ౨౯౨

భావన—కాళ్ళూరి వేంకట నరసింగరావుగారు ... ... ... ... ౨౯౮-౨౯౯

దేవ !—సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు ... ... ... ... ౨౯౯

మధుక్షణము—"విరాగి" ... ... ... ... ... ... ౩౦౩

"సుదాసు"ని హృదయవేదన—'ఒకరు' ... ... ... ... ... ౩౦౮

ప్రేమప్రవాసనము—ఓలేటి సీతారామమూర్తిగారు ... ... ... ... ౩౧౨

మానవప్రబోధము—కూరెళ్ళ రామ నరసింగరావుగారు ... ... ... ౩౧౭-౩౧౯

అంతరాత్మ—ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దరుగారు ... ... ... ౩౧౯

రాలుపువ్వులు—'విధురుడు' ... ... ... ... ... ౩౨౦

ప్రేమతర్కము—బసవరాజు అప్పారావుగారు ... ... ... ... ౩౨౧

# చిత్రానుక్రమణిక


త్రివర్ణ చిత్రములు:— ౧. పులి, పులి, బొబ్బిలిపులి; ౨. అంగుళీయకప్రదానము; 3. యక్షసంప్రార్థనము; ౪. ప్రాణప్రయాణము; ౫. సుగాలిపడుచు; ౬. వసంతాగమనము; ౭. శిశు; ౮. గాయని.

ఏకవర్ణ చిత్రములు:— ౧. దానము, ౧౯౭, ౨. భద్రాచలదేవాలయము, చెంతగోదావరి, ౧౯౯, 3. భారతీ! ౨౦౬, ౪. తిరువణ్ణామలైకొండ, గుడి, ౨౨౧, ౫. పాలకొల్లు పెద్దగోపురము, ౨౩౩, ౬. ఆకాశము, ౨౬౬, ౭. రాముడు సీత నోదార్చుట, ౨౭౩, ౮. తిరుచానూరు గుడిగోపురము ౨౭౯, ౯. దేవాలయ గోపురము, తిరువణ్ణామలై, ౨౭౯, ౧౦. కొండదారి, ౨౮౮, ౧౧. వృద్ధాచల దేవాలయగోపురము, ౨౯౭, ౧౨. హనుమాన్ ఘట్టము, మణికర్ణికాఘట్టము, హరిశ్చంద్రఘట్టము - కాశి, 3౦౦, ౧3. శ్రీకృష్ణుని యాలయము, పుష్కరిణి, తిరుచానూరు, 3౦౦, ౧౪. నీళ్లుతోడుట, 3౧౨.

వ్యంగ్యచిత్రములు:—౧. కాబోయే వకీళ్లకు కొన్నిసూచనలు, పు. ౭౪, ౨. బాగుపడదలచుకొన్నవారికి కొన్ని సూచనలు, పు. ౭౮, 3. కాబోయే గ్రంథకర్తలకు కొన్ని సూచనలు, పు. ౧౧౬, ౪. మాయూరు స్వాములవారు, పు. ౨౫3, ౫. పరీక్షలహడావుడి, పు. 3౧౬.

(1) 1. గౌతమీ పుష్కరము, కోటిలింగాల స్నానఘట్టము; 2. వసిష్ఠగోదావరీ పుష్కరము.—1. పుష్కరంరేవులో యాత్రికులు స్నానముచేయుట; 2. పుష్పగిరిరేవులో యాత్రికులు; 3. రాజనరేంద్రుని స్నానఘట్టము. పు. ౫౬

(2) 1. జనార్దనస్నానఘట్టము, ధవళేశ్వరము; 2. రాజమండ్రి బై యిండియన్ లీగువారి యాజమాన్యమున యాత్రికులకు సాయముచేసిన స్త్రీ వాలంటీర్లు; 3. కొవ్వూరు స్నానఘట్టము.—1. పుష్కరసమయమున ప్రజాసేవచేసిన ఏలూరు స్థానిక బాలభటసంఘము; 2. పుష్కరసమయమున బై యిండియను లీగువారి యాజమాన్యమున జరిగిన స్వదేశీ ఎగ్జిబిషనులో పాల్గొన్న వాలంటీర్లు; 3. రవిభటసంఘము. పు. ౬౪

(3) 1-2. గుంటూరు బై ఇండియన్ లీగు, వారిప్రచారము; 3. మలబారు బై ఇండియన్ లీగువారి ప్రచారము.—1. గౌతమీ పుష్కరసందర్భమున బై ఇండియన్ లీగువా రేర్పాటుచేసిన అఖిల భారతదేశీయ వస్తుప్రదర్శనము; 2. మధుర ఆల్ ఇండియా బై ఇండియన్‌లీగు ఎగ్జిబిషనులోపాల్గొన్న ఆంధ్రదేశవిక్రేతృసంఘము. పు. ౭౨

(4) 1. స్వదేశీ వస్తు విక్రయశాల, స్త్రీశాఖ, తెనాలి; 2. భారత వస్తు విక్రయశాల, స్త్రీశాఖ, బెజవాడ.—1. బెజవాడలో గాంధి వారమున గుంటూరు జిల్లాసంఘమువారు శ్రీమతి పావర్తి సుందరమ్మగారి నాయకత్వమున ఖద్దరు వస్త్రముల విక్రయించుట; 2. రాజమండ్రిలో ౧3-౭-3౨ నాడు జరిగిన రాట్నపు పోటీయందు పాల్గొన్న స్త్రీలు. పు. ౮౦

(5) 1. దివ్యజ్ఞానసమాజ సమావేశము, అడయారు; 2. జగద్గురువు, జిడ్డు కృష్ణమూర్తిగారు-కొందరుదివ్యజ్ఞానసామాజికులతో.—1. రాజధానీకళాశాల విద్యార్థిసంఘము తరఫున ఆచార్య పి. సి. రేగా రుపన్యసించుట; 2. అణ్ణామలై విశ్వవిద్యాలయాంధ్రసంఘపు వార్షికోత్సవము. పు. ౧౦౪

(6) 1. చెన్నపురి సంగీతపరిషత్తు - ప్రారంభోత్సవము-1932; 2. భారతీయ సంగీత గ్రీష్మపాఠశాల, చెన్నపురి.—1. రెండవ దక్షిణ భారత హిందీపట్టప్రదానసభ; 2. వాగ్గేయకారకరత్న, హరినాగభూషణముగారికి బందరులో సన్మానము. పు. ౧౧౨

(7) 1. అఖిలభారతమహిళామహాసభ, సప్తమసమావేశము, చెన్నపురి; 2. చెన్నపురి విశ్వవిద్యాలయము - నూతన స్త్రీపట్టభద్రులు. 1932.—1. శ్రీ అన్నపూర్ణాదేవి జాతీయ బాలికా విద్యాలయ పంచమవార్షికోత్సవము, ఏలూరు; 2. దక్షిణ భారత హిందీప్రచార సభ వారి అంతిమపరీక్షలకు హాజరయిన విద్యార్థినులు. పు. ౧౨౦

(8) 1. ఉభయ గోదావరీమండల మహిళామహాసభ, నరసాపురము; 2. కర్నూలు మహిళాసమాజము.—1. అఖిలభారతాయుర్వేద మహాసభ, 1932, మదరాసు; 2. బొంబాయిలో బర్నార్డు షా గారికి శ్రీమతి అత్యాబేగముగారి సన్మానము; 3. శ్రీ తాపీ ధర్మారావుగారికి ఆంధ్రసారస్వతసంఘమువారి వీడ్కోలు. పు. ౧౨౮

(9) 1. రాజమండ్రి వైశ్యసేవాసదనము - సంస్కృతవిద్యార్థినులు; 2.…బాలికల వ్యాయామకక్ష్య; 3.–కట్టుతరగతి; 4.–సింహాగారిపద్ధతిని బాలికల వ్యాయామము.—1. స్త్రీ సనాతనవిద్యాలయము, రాజమండ్రి; 2. స్త్రీ హితైషిణీమండలి, బాపట్ల. పు. ౧౪౪

(10) 1. ఆది హిందూ స్వస్తివిశము, హైదరాబాదు; 2. వ్యవసాయ కలాశాల ఆంధ్రసంఘము, కోయంబత్తూరు. — 1. బొంబాయి రాష్ట్రాంధ్ర తృతీయ సాంఘికమహాసభ, దాదరు; 2. ఆంధ్రబ్యాడ్మింటన్ క్లబ్బు, కల్యాణి. పు. ౧౫౨

(11) 1. పెదపులివర్రు బాలగంగాధరతిలకు పుస్తకభాండాగారపు 11-వ వార్షికోత్సవము; 2. వడ్డాది సుబ్బారాయకవిసన్మానము, రాజమండ్రి.—1. బెజవాడలో కడచిన అక్టోబరుమాసమున జరిగిన హిందీపరీక్షలకు హాజరయిన విద్యార్థులు, నిరీక్షకులు, వ్యవస్థాపకులు; 2. సారస్వతమండలి, బందరు. పు. ౧౬౦

(12) 1. ఉప్పుటూరి పున్నయ్యాగారు; 2. గుంటూరునగరపుపాలె ములోని వైశ్యవిద్యార్థి వసతిగృహము; 3. గుంటూరు అరండల్ పేటలోని దేవాలయము.—1. కీ. శే. మహాన్, శ్రీ శేషాద్రిస్వామి గారు, తిరువణ్ణామలై; 2. తిరువణ్ణామలై ఆశ్రమ మూలస్థానమునగల మూర్తి; 3. పరబ్రహ్మానందాశ్రమము, బ్రహ్మవిద్యాసదానిలయము, తిరువణ్ణామలై. పు. ౧౮౬

(13) 1. మదరాసు నేషనల్ బ్యాంకు డైరెక్టరు, శీరం బలరామ మూర్తిగారు; 2. ఈరంకి వేంకటశాస్త్రిగారు; 3. చట్టూరి సుబ్బా రావుగారు — తొమ్మిదవ ఆంధ్రవిద్యార్థిమహాసభ (బందరు) ఆహ్వాన సంఘాధ్యక్షులు; 4. జి. శ్రీరాంబాబునాయుడుగారు; 5. గోగులపాటి గంగాధరంగారు.—1. గేదెల సుందరనారాయణ నాయడుగారు; 2. మహమద్ జాఫరల్లీ సాహెబుగారు; 3. ఆలపాటి కుటుంబరావు శ్రేష్ఠిగారు; 4 బొండాడ సింహాచలమూర్తిగారు; 5. అల్లూరు నరసింహరాజుగారు. పు. ౧౯౨

(14) 1. కొల్లిపర వెంకటరమణయ్య నాయడుగారు; 2. గంటి లక్ష్మీనారాయణగారు; 3. చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు; 4. పెదసింగు వెంకటనారాయణ వర్మగారు; 5. పిశుపాటివెంకట రాయ శర్మగారు.—1. వెలగలేటి దశరథరామయ్య పంతులుగారు; 2. సర్రాజు రామకృష్ణరావు పంతులుగారు; 3. తమ్మన నారాయణ మూర్తిశ్రేష్ఠిగారు; 4. డి. వి. వరహాలు సెట్టిగారు; 5. సుబ్బా రావుగారు. పు. ౨౦౦

(15) 1. కేసరపల్లి ఆంజనేయులుగారు; 2. ఏలూరు ఆంజనేయ ధర్మశాల.—1. ఏలూరి పరంధామయ్యగారు; 2. బూదరాజు లక్ష్మీ నారాయణగారు — చెన్నపురియందు జరిగిన ఆంధ్రవిద్యార్థిసమావేశపు సంయుక్తకార్య దర్శులు. 3. ఎ. సి. సుబ్బరాయులు, వి. టి. నారా యణన్ గార్లు; 4. కొడిమెల కొండయ్యగారు పు. ౨౦౯

(16) 1. చెన్నపురి గౌరవన్యాయాధికారిణి, శ్రీమతి కె. సి. ఆచార్య సతిగారు; 2. శ్రీమతి పి. గౌరీఅమ్మాళ్ గారు; 3. శ్రీమతి చిలుకూరి లక్ష్మీనరసమ్మగారు; 4. శ్రీమతి కె. నాజరుద్దీన్ సతిగారు.— 1. శ్రీమతి, మేరీ పున్నవాధన్ సతిగారు; 2. శ్రీమతి పాలు అప్పా స్వామి సతిగారు (మదరాసు కార్పొరేషను మెంబరు) 3. శ్రీమతి మాయాదేవి గంగూలిగారు; 4. శ్రీమతి లీలా మోరేశ్వరభట్టు కన్య గారు; 5. శ్రీమతి బికాజీలింజీభాయి పాలంకోటుకన్యగారు. పు. ౨౨౪

(17) కీ. శే. ప్రొ. పి. సుబ్రహ్మణ్యంగారు.—1. కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారు; 2. కీ. శే. పండిత శ్యామసుందర చక్రవర్తి గారు; 3. కీ. శే. డా. కట్టమంచి కృష్ణారెడ్డిగారు; 4. కీ. శే. శ్రీమతి కల్యాణి వాసుదేవరాజుగారు. పు. ౨౩౨

(18) 1. కీ. శే. కోన గురవయ్యగారు; 2. కీ. శే. దేవరకొండ సూరయ్యగారు; 3. కీ. శే. ఉండ్రు తాతయ్యగారు, ఏలూరు హరి జనాశ్రమ స్థాపకులు; 4. కీ. శే. కల్యాణరామన్ గారు; 5. కీ. శే. బాపయ్యచౌదరిగారు.— 1. నరాలసెట్టి దేవేంద్రుడుగారు - సప్తమ ఆది ఆంధ్రమహాసభ ఆహ్వానసంఘాధ్యక్షులు; 2. కమతం షణ్ముఖం గారు - ఆదిమాంధ్ర మహాసభాధ్యక్షులు; 3. కృష్ణాజిల్లా ఆది ఆంధ్ర సంఘము, బందరు. పు. ౨౪౦

(19) 1. తాంబ్రములో నూతన క్షయరోగ చికిత్సావిధానము; 2. వార్తాపత్రికలు చదువుయంత్రము; 3. క్రొత్తరకము పట్టురాట్నము.— 1. 12-వ బ్రాహ్మణేతర సమ్మేళనము, తంజావూరు; 2. భారతదేశ వాణిజ్యసంఘసమావేశము. పు. ౨౪౯

(20) 1. అఖిలభారతాయుర్వేదమహాసభాధ్యక్షులు, ఎ. లక్ష్మీపతి గారు; 2. అఖిలభారతాయుర్వేదమహాసభ (లక్నో) అధ్యక్షులు, యం. ఆర్. నాయుడుగారు; 3. మైసూరుభిషక్కులు, వేంకటకృష్ణయ్య గారు; 4. కొచ్చిను కొత్తమహారాజు; 5. దొరాబ్, జె. టాటాగారు. —1. అంహోబాదు అఖిలపత్రికమత్స్య మహాసభ-ఆళ్వారు మహారాజు, మాలవ్యాగారు, ఇతరులును; 2. ఇండియా లీగుసభ్యులకు మదరాసులో సన్మానము. పు. ౨౫౬

(21) 1. షేక్స్పియరు నాటకరంగముయొక్క తాళపుచెవిని భవన నిర్మాత్రి ఎలిజబెత్తు స్కాటుకన్య యువరాజు కందిచ్చుట. 2. స్త్రీలకు క్రొత్తరకపు చెరసాల-ఆస్పత్రి, న్యూయార్కు.—1. అట్టా వాసమావేశ భవనము. 2. అట్టావా సమావేశమునకు భారతీయ ప్రతినిధులు. పు. ౨౬౪

(22) నూతనజర్మను మంత్రివర్గము.— 1. ఫ్రాంసుకును, రష్యాకును నడుమ కుదిరిన ఒడంబడికి కిరుపక్షములవారును సంతకముచేయుట, 2. ఫ్రెంచి ప్రభుత్వపు రాజీనామా. పు. ౨౮౨

(23) 1. విఠలుభాయి పటేలుగారికి న్యూయార్కున సన్మానము. 2. సుప్రసిద్ధ వైమానిక దంపతులు — అమీ జాన్సను, జె. ఎ. మాలీ సన్ గార్లు.— 1. ఎ. యం. భరతన్ గారు, కన్ననూరు; 2. యతి రాజం రాఘవానందసూరిగారు; 3. గుంటూరు హనుమద్వ్యాగ వ్యాయామమందిరసభ్యులు. పు. ౨౯౯

(24) 1. ఏనుగులు క్రికెట్టు ఆడుట; 2. లండను స్త్రీల కుస్తీ; 3. పాశ్చాత్యస్త్రీల కత్తిసాము.— 1. మద్రాసు యునైటెడ్ క్లబ్బు పురుషుల డబుల్సులో గెలుపొందిన ఆటకాండ్రు; 2. మిక్సెడ్ డబు

ల్సులో గెలుపొందిన ఆటకాండ్రు, ౩. స్త్రీల డబుల్సులో గెలుపొందినవారు ( కుడివైపున ఇద్దరు ). పు. ౨౯౬

(25) డా॥ యం. దామోదరంగారు, రెడ్డిలక్ష్మమ్మగారు, దామరాజు లక్ష్మమ్మగారు, చందన పద్మావతీ బాయిగారు.—ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావుపంతులుగారు, మల్లాది అనంతరామయ్యగారు, తేకుమళ్ల రామారావుగారు. పు. ౩౦౪

(26) కీ. శే. ఆరోగ్యస్వామి ముదలియారుగారు, కీ. శే. హాలిడ్జి గారు, కీ. శే. జాన్ గాల్స్వర్దీగారు.— కీ. శే. బయ్యా నరసింహేశ్వరశర్మగారు, కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారు, కీ. శే. శ్రీ వాసుదేవరావుగారు, కీ. శే. కొడాలి వెంకటసుబ్బారావుగారు పు ౩౧౨

(27-28) మహామఘము :— మహామఘుతీర్థము, కాశీ విశ్వనాథస్వామి ఆలయము, మహామఘుతీర్థము (౧౯౨౧-న).— కుంభేశ్వరస్వామి ఆలయము, నాగేశ్వరస్వామి ఆలయము, మహామఘుదివసమున కుంభేశ్వరస్వామి త్రైర్థికులకు దర్శనమిచ్చు మంటపము, నాగేశ్వరస్వామి ఆలయము: అంతః ప్రాకారము.— మహామఘ పుష్కరిణి, నాగేశ్వరస్వామి ఆలయము: గర్భగృహము, శార్ఙ్గపాణి దేవాలయగోపురము.— కావేరీస్నానఘట్టము. నాగేశ్వరస్వామి ఆలయమునందలి సుబ్రహ్మణ్యస్వామి గర్భగృహము రథాకృతి నున్నది, కావేరి తటమున కళాశాల, శార్ఙ్గపాణి దేవాలయము - పొందామరకొలను. పు. ౩౨౦

(29) ౧. గామాసోదరుల మల్లయుద్ధప్రదర్శనము, ౨. సర్ సామ్యూల్ హోరుగారి టెన్నిసుఆట, ౩. బెల్లను కన్య (18 ఏండ్లు) క్రికెట్టుఆడుట. ౧. నేటివిలుకత్తె. ౨. సి. కృష్ణదాసుగారి గడగంతు, ౩. మద్రాసు క్లబ్బు మిక్సెడ్ డబుల్సులో జయమును గాంచిన ఆటకాండ్రు. పు. ౩౨౮

(30) ౧. యస్. వెంకటనరసు శాస్త్రీగార్లు, ౨. ఒలింపిక్ పందెములలో ఆరుమైళ్ల పరుగు పందెమున గెలుపొందిన యం. షణ్ముఖంగారు, ౩. ప్రపంచ వీరుల ముష్టియుద్ధము, ౪. ఒలింపికు స్త్రీల పోటీయందు ఇంగ్లండు తరఫున పోటీచేసిన హోళ్ స్టైనుకన్య.— ౧. తూములూరి శివకామయ్యగారి వివిధపాత్రాభినయములు, ౨. పి. నరసయ్యగారు, ౩, ౪. తీగల వేంకటేశ్వర్లుగారి పాత్రలు, ౫. గుండ్లపల్లి సుబ్బారావుగారు, ౬. మంగిపూడి కామేశ్వరరావుగారు (మధుసేవలో రంగనిపాత్ర. పు. ౩౩౬

(31) ౧. మౌలానా మోహియుద్దీన్ బాద్షా గారు, ౨. శ్రీ రామకృష్ణపరమహంస -౧. నిజాంకళాశాల ఆంధ్రసారస్వతసమితి వార్షికోత్సవము, ౨. ఆంధ్రవిశ్వకళాశాలప్రచారణసమితి, బందరు. పు. ౩౪౪

(32) ౧. శ్రీ రాధాకృష్ణ ఆంధ్రభక్త సమాజమువారిచే జరుపబడిన ధర్మరాజులవారి పట్టాభిషేక మహోత్సవము, ౨. ఆంధ్రపత్రికా కార్యాలయమున గణపతి ఉత్సవము.—౧. జి. నరసింహంగారు, బి. ఏ. ౨. శ్రీ వాకాటి కృష్ణమూర్తి, హెబ్బణి కృష్ణభాగవతర్, యం. వేణుగోపాల నాయుడుగార్లు. పు. ౩౫౨

(33) ౧. సంస్కృత హిందీవిద్యాలయము, రాజమండ్రి, ౨. చెరుకువాడ వెంకట నరసింహారావుగారు, ౩. డా. డి. అప్పారావుగారు.—౧. సంద్యాల మునిశెట్టిగారు, ౨. ఉమర్ అలీషా కవిగారు, ౩. చోడవరపు దేవరాజుగారు, వారి ధర్మపత్ని, బెజవాడ. పు. ౩౬౦

(34) ౧. అల్లూరిసత్తెయ్యమ్మగారు, ౨. చిత్తజల్లు రామాబాయమ్మగారు, ౩. యన్. లక్ష్మీబాయిగారు.—౧. యం. యస్. ఆర్. ఎ. గుప్తగారు, ౨. టి. ఆర్. దేవరాజులుగారు, బి. ఏ. బి. యల్., ౩. గ. శ్రీ. న. ఆచార్యుడు. ౪. ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్టుగారు. పు. ౩౬౮

# చిత్రపటముల వివరణము

### అనంతరామయ్యగారు, మల్లాది

గుంటూరు నివాసము. అంధులు. గాత్రము, మురళి, మోర్సింగు, కంజీరా, మృదంగము మున్నగువానియందు మంచి ప్రవేశము కలవారు. ఆంధ్రసాహిత్యమునకు కొన్ని రచనలను గూర్చిరి.

### ఆంజనేయులుగారు, కేసరపల్లి

వీరు సుమారు 30000 రూపాయలను వెచ్చించి "ఆంజనేయ ధర్మశాల" అను పేర ఏలూరున నొక ధర్మశాలను నెలకొల్పినారు. అందు గల పాండురంగ స్వామి దేవాలయమున హరిజనులకు ప్రవేశ మొసగినారు.

### ఆచార్యులు, గ. శ్రీ. న.

స్వగ్రామము తిరుపతి. ప్రస్తుతము విశాఖపట్టణము ఆంధ్రవిశ్వ కళాపరిషత్కళాశాలలో బి. ఏ. ఆనర్సును చదువుచున్నాడు. ఆంధ్ర సంఘమునకు కార్యకర్త. వక్తృత్వ పరీక్షల కేర్పరచిన తెన్నేటి విశ్వనాథం కప్పును, తెలుగుసంఘపత్రికకును కారకుడు.

### ఉమర్ అలీషా కవిగారు, మౌలానా మౌల్వీ

పిఠాపురము. సుప్రసిద్ధ పండితుడు. ఇప్పుడు ఆధ్యాత్మిక విజ్ఞాన మహాసభను నడుపుచున్నారు.

### కృష్ణమూర్తిగారు, వాకాటి

శ్రీ రాధాకృష్ణ ఆంధ్రభక్తసమాజము గౌరవకార్యదర్శులలో నొకరు.

### కుటుంబరావు శ్రేష్ఠిగారు, ఆలపాటి

బెజవాడయందు వీరి వాసము. ధనవంతుడు; విద్యాభిమాని. ఏటేట ఆరు నెలల కాలము కుంటి, గ్రుడ్డి మొదలయిన వారికి అన్నము పెట్టు దాత.

### కొండయ్యగారు, కొడిమెల

దీనజనావనమునకు పేరు గన్నవారు. వీరు చేసిన ధర్మకార్యములకు మితిలేదు. ఎన్నో సత్రములను గట్టించినారు; పెక్కు పాఠశాలలను నెలకొల్పినారు; నీటివసతిలేని పలుతావులందు బావులను త్రవ్వించినారు. వీరు బీదల కనేక విధముల సాయపడువారు. వీరు, కీర్తిశేషురాలు తమతల్లి కోటమ్మగారి జ్ఞాపకార్థము నూజవీడుపురమున "కోటమ్మధర్మసత్ర"మని యొకసత్రమును గట్టించి తమ మాతృభక్తిని వెల్లడించిరి. జనులు వీరిని 'ధర్మాల కొండయ్య' యని వ్యవహరింప బరగిరి.

### క్రొత్త పట్టురాట్నము

పెక్కు కదురులపయి పట్టువడుకుటకు క్రొత్తగ నీ రాట్నము మదరాసు వస్త్రపరిశ్రమ శాఖవారు డైరెక్టరు వి. రామకృష్ణ గారి నాయకత్వమున కనిపెట్టిరి. ప్రదర్శకులు టెక్స్టైలు ఎక్స్పర్టు అప్పాదుగారు.

### గంగాధరంగారు, గోగులపాటి

తెనాలి తాలూకా పేరుకలపూడి వాస్తవ్యులు. వీరు ౧౯౨౮-వ సంవత్సరమున అమెరికా వెళ్లి అచటగల అయోవా విశ్వవిద్యాలయమునందు మూడు వత్సరములు విద్యనభ్యసించి B. E., M. Sc. బిరుదములను బడసి, అటనుండి జర్మనీ వెళ్లి అటగల మ్యూనిక్ విశ్వవిద్యాలయమున D. Sc. బిరుదమును బొంది "హైడ్రాలిక్ జంప్" అను ఫిలిమును తయారుచేసి స్వదేశమును జేరిరి.

### గాల్సువర్దీ, జాన్, కీ. శే.

సుప్రసిద్ధ బ్రిటీషు నవలా కారుడును, నాటకరచయితయు నగు వీ రీమధ్యనే ఆంగ్లసాహిత్యమున ప్రపంచ బహుమానము (నోబెల్ ప్రైజు)ను బడసియుండిరి.

### గుప్తగారు ఎం. ఎస్. ఆర్. ఏ.

వీరు గౌరవవంతులైన వైశ్యవంశమునకు చేరినవారు. పరోపకారపారీణులు.

### గురవయ్యగారు, కోన, కీ. శే.

కృష్ణాజిల్లాలోని కృష్ణాపురము వీరి వాసస్థలము. బీదలయందు మిక్కిలి ఆదరణగలవారు. తమ సొంత ద్రవ్యమును సుమారు ౧౫౦౦ వరకు వెచ్చించి కృష్ణాపురమునుండి వీరంకిలాకువరకు రోడ్డు వేయించినారు.

### గౌరీ అమ్మాళ్ గారు, పి.

తిరుమాగు నివాసి. ఇంగ్లాండులోను, డబ్లిన్లోను వైద్యమున ఉన్నత విద్యబడసి తిరిగి స్వస్థానమునకు చేరుకొనిరి. కొచ్చిను ప్రభుత్వమువా రీమెకు ఉపకారవేతన మొసంగిరి.

### దశరథరామయ్య పంతులుగారు, వెలగలేటి

బెజవాడలో సుప్రసిద్ధ న్యాయవాదులు. వెలగలేరు గ్రామమున శివాలయమును ప్రతిష్ఠించినారు. బెజవాడలో గోరక్షణశాలకు, శంకరమఠమునకు, ఆయుర్వేద వైద్యశాలకు భూదానములు చేసినారు

### దేవరాజులునాయుడుగారు, ఆర్.—బి.ఏ., బి. యల్.

వీరు తంజావూరునందలి తెలుగు నాయుడు కుటుంబమువారు. భీమాసంస్థలందు వీరి కతిప్రేమ.

### నరసయ్యగారు, పి.

వీరు చిత్తూరు శ్రీరామవిలాస సభలోని ముఖ్యనటకులలో నొకరు. సంగీతమున కూడ చక్కని జ్ఞానము గలరు.

### నరసింహరాజుగారు, అల్లూరు, ప్రో.

వీరిది రాజమహేంద్రవరము. ఆంధ్ర క్షత్రియులు. గొప్ప తాంత్రికులు. రాజధానియందలి ముఖ్యపట్టణములందన్నిట తమ కౌశల్యమును ప్రదర్శించి పేరువడసినవారు.

### నరసింహేశ్వర శర్మగారు, బయ్యా, కీ. శే.

వీరు కడచిన యిరువదేండ్లనుండి ప్రజాహిత జీవనమునందు ప్రాముఖ్యము వహించి యుండిరి. సంస్కరణలకు పూర్వము సామ్రాజ్యశాసనసభయందు సభ్యులుగనుండి వీరుచేసిన సేవ ననుసరించి వైస్రాయి కార్యవర్గసభ్యులుగ నియమింపబడి సుమారు నాలుగేండ్ల కాలము పనిచేసిరి. ప్రభుత్వవర్గమునుండి వీరిని వదలుకొనుట కిష్టము లేక రీడింగుప్రభువు వీరిని రైల్వేరేట్సు సలహా సంఘాధ్యక్షులుగ నియమించిరి. చనిపోవువరకును నీ రాయుద్యోగమునందే యుండిరి. వీరు దేశముయొక్క ఆర్థిక విషయములందు చాలశ్రద్ధవహించుచుండిరి. వీరు కొన్నేండ్లపాటు కాంగ్రెసు సభ్యులుగ కూడ నుండిరి.

### నాయుడుగారు, యం. జి., మేజరు

లక్నోలో డిసెంబరు నెలలో జరిగిన అఖిలభారత వైద్య మహాసభకు అధ్యక్షులు.

### నారాయణమూర్తి శ్రేష్ఠిగారు, తమ్మన

బెజవాడలో "తమ్మన తాతయ్య, నారాయణమూర్తి గారల అన్నపూర్ణ సత్రము"ను ఏబదివేల రూపాయలు వెచ్చించి స్థాపించినారు. నిత్యము యతీశ్వరులకు, భిక్షుకులకు, ఇతరులకు అన్నదానము విరివిగ జరుగు నేర్పాట్లు గావించినారు. శివాలయము నొకదానిని ప్రతిష్ఠింప పదివేలు వెచ్చించినారు.

### పత్రికలు చదువు యంత్రము

దీనిబరువు రెండుటన్నులు. ఉక్కుతో చేయబడినది. ఇది పత్రికలు చదువును; వేళచెప్పును; అడిగిన ప్రశ్నలకు జవాబుచెప్పును. యన్. మే యనువారు పదేండ్లు కష్టించి దీనిని తయారుచేసిరి.

### పరబ్రహ్మానందాశ్రమము, తిరువణ్ణామలై

ఈ యాశ్రమము ౧౯౧౮-వ సంవత్సరమున శ్రీమత్పరమహంస పరబ్రహ్మానంద యోగీంద్ర సరస్వతీ స్వాములవారిచే సగుణ నిర్గుణ బ్రహ్మోపాసన నేర్చుకొనగోరువారికై తిరుమలైప్పాల తీర్థమునకు సమీపమున నెలకొల్పబడినది. అందరు నీయాశ్రమమున స్కందమూర్తి దర్శనముచేతను, తీర్థసేవచేతను, విభూతిధారణచేతను, ఔషధసేవచేతను రోగములు, గ్రహబాధలు మొదలయినవానిని నివర్తిచేసుకొనవచ్చును.

### పున్నారావుగారు, ఉప్పుటూరు

వీరు తమ పినతండ్రిగారగు గురునాథముగారి కోరికపై గుంటూరు అరండల్ పేటలో నొక దేవాలయమును, నగరప్రాంతములో వైశ్యవిద్యార్థులకొరకు ౧౦౦౦౦ రూ. లు వెచ్చించి యొక వసతిగృహమును నిర్మించిరి. ఈ వసతిగృహమునకు వీరు తమ తండ్రిగారగు నరసింహారావుగారి పేరుపెట్టిరి.

### బికాజీ లింజీబాయి పాలంకోటక్ కన్యగారు

ట్రినిటి గానకళాశాల (ఆక్సుఫర్డు)లో శాశ్వత సభ్యురాలుగ చేర్చుకొనబడిన భారతస్త్రీ. ఈ గౌరవము బడయుటకు భారతీయులలో నీమెయే మొదటిది. ఈమె ౮౦ ఏండ్లనుండి పాశ్చాత్య గాన శిక్షణము బడయుచున్నది.

### భద్రరాజుగారు, వాడ్రేవు

తూర్పు గోదావరిజిల్లా చొప్పెల్ల గ్రామము. వీరు ఐ.సి.యస్. పరీక్షలో విజయముగాంచి బొంబాయి రాజధానిలోని "సతారా"కు అసిస్టెంటు కలెక్టరుగా నున్నారు. వీరు నియోగి బ్రాహ్మణులు. ఈ తెగవారిలో నీపదవిని పొందినవారిప్పటికి వీరే.

### భరతన్ గారు, ఎ. యం.

కలకత్తాలో జరిగిన అఖిల భారత దేశపు బరువు ఎత్తుపోటీయందు ౪౫౦ పౌనుల బరువెత్తి విజయమును గాంచిరి.

### మహమ్మద్ జాఫరల్లీ సాహేబుగారు

ఏలూరు. గొప్ప యూనానీ వైద్యులు.

### మునిశెట్టిగారు, నంద్యాలం

వీరిది చిత్తూరు. గొప్పవైశ్యవంశమునకు చెందినవారు. చిర కాలము గౌరవ న్యాయాధికారి పదవి నలంకరించి యుండిరి. చాల దానధర్మములు చేసినారు.

### మేరీ పుష్పనాథన్ సతిగారు

దక్షిణ ఆర్కాటుజిల్లా సెకండరీ విద్యాసంఘమునకు అధ్యక్షురాలుగా నియమింపబడిన ప్రథమ యువతి.

### మొహియుద్దీన్ బాద్షాగారు, మౌలానా, మహర్షి

వీరిది పిఠాపురము. వీరు గొప్పయోగశక్తి గలవారు. హిందువులకును మహమ్మదీయులకును సూఫీఇజం-వేదాంత తత్త్వోపదేశమున నొకటిగాజేర్చి భారతీయ భ్రాతృభావమును పెంపొందింప జేసినవారు. సుప్రసిద్ధాంధ్రపండితులగు ఉమర్ అలీషాకవిగారి తండ్రి. వీరు

నూరేండ్లు జీవించి ౧౯౫౮-వ సం. రం. ఫిబ్రవరి ౧౦-వ తేదినాడు పరమపదించిరి.

## రాఘవానంద సూరిగారు, యతిరాజం

బందరు నివాసము. వయస్సు ౧౭ ఏండ్లు. ఇట్టి హఠయోగ క్రియను ప్రదర్శించినవా రిప్పటి కెవ్వరును లేరు. ఈక్రియ మలబంధము, అజీర్తి రోగములను చాల సులభముగ నివర్తిచేయును.

## రామకృష్ణరావుగారు, నర్రాజు

బెజవాడ దుర్గాకళామందిరమున టాకీ డైరెక్టరుగ నున్నారు.

## రామాబాయమ్మగారు, చిత్తజల్లు

ఈమె నివాసము బందరు. కొంతకాలము నాట్యకళాసేవ యొనర్చి పెక్కు సువర్ణ పతకములను బడసి ప్రకృతము హరికథలు చెప్పుచున్నది.

## రామరావుగారు, తేకుమళ్ల, యం. ఏ., బి. ఇ. డి.

వీరు మదరాసు యూనివర్సిటీలో లిటరేచరులో యం. ఏ. పరీక్షయందును, ఆంధ్ర యూనివర్సిటీలో బి. ఇ. డి. పరీక్షయందును కృతార్థులయి లండను కేగి యచ్చటి యూనివర్సిటీలో నూతన విధాన సహితమగు భూగోళశాస్త్రమునందు డిప్లొమాకోర్సు నంది భారత దేశమునకు తిరిగివచ్చినారు. ఆంధ్రులయందేమి, మదరాసీయులందేమి ప్రప్రథమమున నిట్టి పరీక్షయం దుత్తీర్ణులయినవారు వీరే. వీరు విశాఖ పట్టణమునందు కొంతకాలము ఇంటర్మీడియేటు విద్యార్థులకుగాను ట్యూటోరియల్ కాలేజిని నడపినారు.

## లక్ష్మమ్మగారు, రెడ్డి

పత్తికొండ తాలూకా పెండేకల్లు గ్రామము కాపురము. కర్నూలు జిల్లాబోర్డు సభ్యురాలు. మరియు నీమె నాలుగు సంవత్సరములనుండి దీనబాలురకు శరణాలయ మొకటి నెలకొల్పి విద్యార్థి వేతనములుసయితమిచ్చి పోషించుచున్నది. పత్తికొండ తాలూకా కోఆపరేటివు సంఘముల కధ్యక్షురాలు. కోఆపరేటివు బ్యాంకికి డైరెక్టరు.

## లక్ష్మీనరసమ్మగారు, చిలుకూరి

డా. చిలుకూరి నారాయణరావుగారి భార్య. అనంతపురము జిల్లాబోర్డు సభ్యురాలుగా నెన్నుకొనబడినది. అదేమండలమున గ్రామ సేవాసంఘములను స్థాపించినది. 'గ్రామసేవ' అనుపేర నొక మాసపత్రికను నిర్వహింప నేర్పాట్లు చేయుచున్నది.

## లక్ష్మీబాయి కన్యగారు, యస్.

బరంపురము. తన నాట్యకళాప్రదర్శనముల ఫలముగ చాల బంగారుపతకము లీమెకు లభించినవి. బొంబాయి కృష్ణాఫిలిమువారి తెలుగుటాకీ 'సావిత్రి' యందు పాల్గొన్నది.

## లీలామహేశ్వరభట్టు కన్యగారు

బొంబాయి విశ్వవిద్యాలయమున నీయమ గణితశాస్త్రము నగ్రపీఠము నధిష్ఠించి విజయమును గాంచినది. "తాతా" విద్యార్థి వేతనమును పొంది కేంబ్రిడ్జియందు ఇంకను చదివి సామర్థ్యమును బడయబోయెను.

## వరహాలుశెట్టిగారు, డి. వి.

ఆంధ్రవిశ్వవిద్యాలయమున యం. బి. బి. యస్. అను వైద్య పట్టమును సంపాదించిన వైశ్యవర్యులు.

## వాసుదేవరావుగారు, శ్రీ. కే. శే.

నవలలు, కథలు రచియించి తెనుగుతల్లి క్రొత్త యలంకరించుచున్న భావుకులలో వీరొకరు. వీరి కథలను పెక్కింటిని భారతి, ఉగాదిసంచిక అలంకరించుకొన్నవి. కథలను పాఠకులకు నచ్చునట్లు అల్లుటయందు వీరికి మంచిశక్తిగలదు. కొన్ని నవలలనుగూడ ప్రకటించి యున్నారు.

## వెంకటనారాయణ రాజుగారు, పెదసింగు

వీరు అగ్నికులక్షత్రియులు. ఆంధ్ర–అగ్నికులక్షత్రియ మహాసభలను నాలుగింటిని వీరు జయప్రదముగ జరిపిరి. సుప్రసిద్ధ ఓడ వ్యాపారస్థులు.

## వెంకటరామయ్యగారు, జనమంచి, కీ. శే.

వీరిది రాజమహేంద్రవరము. తెలుగున మంచి పాండిత్యముగలవారు చక్కని కవన మల్లగలరు. వీరి రచనలు పెక్కులు భారతి యందును, ఉగాది సంచికలయందును ప్రకటితము లయినవి.

## వెంకటరాయశర్మగారు, పిసుపాటి

ఒంగోలుచెంతగల కరవదియందు వీరి కాపురము. జమ్మువరము ఎస్టేటు ప్రొప్రయిటరు. ధర్మాచరణమున వీరికి ప్రీతి మెండు. వీరి తండ్రిగారగు కీ. శే. వెంకటరంగయ్యగారిచే ఒంగోలులో చిరకాలముగ నడుపబడుచు వచ్చిన పి. వి. ఆర్. హిందూ మిడిల్ స్కూలును వీరు మిక్కిలి చక్కగా నడపుచు దానిని హైస్కూలుగ మార్చజేసినారు. ఆస్కూలు కొక భవనమును గూడ కట్టించినారు. మరియు వీరు తమ తండ్రిగారి జ్ఞాపకార్థము స్వగ్రామమున నొక సంస్కృత పాఠశాలను నెలకొల్పినారు. వీరు ఒంగోలు తాలూకాబోర్డు అధ్యక్షులు.

## వెంకటేశ్వర్లు, తీగల

వీరి నివాసస్థానము కృష్ణామండలములోని గుడివాడ. ఆంధ్ర దేశపు నేటి నటులలో వీరొకరు. వీరభినయించు వాటిలో చంద్రగుప్త, పటాన్, దుర్యోధన పాత్రములు ముఖ్యములు.

వేంకటనరసింహారావు పంతులుగారు, చెరుకువాడ

వీరిది మచిలీపట్టణము. వీరు కృష్ణాపత్రికా జాతీయ కళాశాలల యభివృద్ధికి ప్రధానకారకులలో నొకరు. కృష్ణాజిల్లా కాంగ్రెసుకమిటీ బందరు కాంగ్రెసు కమిటీల కార్యదర్శిగా చాలకాలము పనిచేసిరి. బందరులో జరిగిన ఆంధ్రరాష్ట్రీయ మహాసభయొక్క యాహ్వాన సంఘమునకు ప్రధాన కార్యదర్శిగా నుండిరి. వీరి దేశసేవ ప్రశంసాపాత్రము.

వేంకటరావుగారు, ఈరంకి

బందరు ఆంధ్రజాతీయ చిత్రకళాశాలా ప్రధానాచార్యులు.

వేణుగోపాలనాయుడుగారు, యది.

గొప్పకుటుంబమునకు చెందినవారు. బ్యాంకరలు, సి. పట్టాభిరాం కంపెనీ ప్రొప్రైటరు. శ్రీ రాధాకృష్ణ ఆంధ్ర భక్తసమాజమునందు గౌరవకార్యదర్శులలో నొకరు.

సత్యనారాయణగారు, కె. పి.

(మాంచెస్టరు) ఎ. యం. యం. ఐ. ఇ. ఇ.

వీరు ఆంధ్రులు. అయిదేండ్లు ఇంగ్లాండులోనుండి ఎలక్ట్రిక్ ఇంజనీరింగును పరిశోధనతో నేర్చివచ్చిరి.

సత్తెయ్యమ్మగారు, అల్లూరు

ఈమె నివాసము గోదావరిజిల్లాలోని అంతర్వేదిపాలెమున. మంచి యోగజ్ఞానశక్తి గలామె. ఆధ్యాత్మికవిజ్ఞానమహాసభ సభ్యురాలు. కడచిన ఫిబ్రవరి ౧౦-వ తేదినాడు జరిగిన మూడవ ఆధ్యాత్మిక విజ్ఞానసభ కధ్యక్షత వహించెను.

సింహాచలమూర్తిగారు, భాండాడ, శిల్పశేఖర

౧౯౨౧-౨ సంవత్సరమున వీరు జేబులో నిముడునట్టియు, సులభముగ వడుక ననువగునట్టియు నొక రాటమును తయారుచేసిరి. కడచినయేడు ఆగష్టు మాసమున పెనుగొండలో జరిగిన శిల్పపరిషత్తులో తమ శిల్పకళానైపుణిం జూపి సింహాకంకణముచేతను, శిల్పశేఖర బిరుదముతోడను సత్కరింపబడిరి. ప్రకృతము వీరు ఏమాత్రము డబ్బుఖర్చుకాని 'గాలిపంకా'ను తయారుచేయుచున్నారు

సుబ్బారావుగారు, కొడాలి, కీ. శే.

ఈ యువకవి ౧౯౦౪-వ సంవత్సరమున పెదకళ్లేపల్లిలో జనించిరి. వీరు కొంతకాలము ఆంధ్రపత్రికకు సహాయ సంపాదకులుగ నుండినారు. తరువాత బందరు హిందూ హైస్కూలులో రెండు వర్షములపాటు ఉపాధ్యాయులుగ నుండి బాలుర ప్రేమను చూరగొనిరి. అంతేకాక ఆస్కూలు కాలేజియగుటకు మిక్కిలి తోడ్పడిరి. తరువాత సుమారు మూడు సంవత్సరములనుండి గుంటూరు క్రిస్టియన్ కాలేజిలో తెలుగు లెక్చరరుగనుండి కడచిన ఆగస్టు ౧౧-వ తేదీన అకస్మాత్తుగ పరమపదించిరి. వీరికి ఆంధ్రాంగ్ల సంస్కృతములందు దక్కని పాండిత్యము గలదు. తెలుగున చక్కని కవిత్వము చెప్పగలవారు. వీరిరచనలలో కొన్ని భారతియందు ప్రకటితము లయినవి. అందు ముఖ్యమయినది 'హంపీక్షేత్రము'. వీరికి జ్యోతిషమునందును మంచి ప్రవేశము కలదు.

సుబ్బారావుగారు, గుండ్లపల్లి

చిత్తూరు శ్రీరామవిలాస సభలోని ముఖ్య నటకులలో నొకరు. హాస్యరసము వీరిసొమ్ము.

సుబ్రహ్మణ్యంగారు, పి. ప్రొ. కీ. శే.

వీరు చెన్నపురము నాంధ్రులలో పేరున కెక్కినవారు. చిరకాలమునుండి వీరు పచ్చయప్పకళాశాలయాంగ్లాచార్యపదము నధిష్ఠించి మెప్పును గన్నవారు. అరటిపండొలిచిపెట్టినటులు బోధింపగలవారు. విద్యార్థులను కన్న సంతానమువలె ప్రేమించి, వారికి సకలసౌకర్యములను సమకూరిచి వారిలో నొకరుగ మెలగెడువారు. ఆంధ్రులు, ఆంధ్రభాష అన్న చెవికోసికొనువారు. చెన్నపురియాంధ్రుల యౌన్నత్యమున కుపకరించు నెల్లకార్యములందు వీరి చేయి కలసియే యుండును. ఇట్టి యీ సాధుహృదయుడు కడచిన ౨౭-౮-౧౯౩౭ నాడు భౌతిక శరీరమును చాలించెను.

సూరయ్యగారు, దేవరకొండ, కీ. శే.

వీరిది రామచంద్రపురముతాలూకాలోని కూళ్ల గ్రామము. పాలకొల్లులో శ్రీ క్షీరారామ రామలింగేశ్వర పండిత సభకు చాలకాల మధ్యక్షులుగ నుండి దాని యభివృద్ధికి పాటుపడినవారు.

స్త్రీహితైషిణీమండలి, బాపట్ల

ఈమండలిని ౧౯౩౧-వ సం.రము జూలై నెల ౨౬-వ తేదీన శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు కొందరు పురస్త్రీల సహాయముతో స్థాపించిరి. స్త్రీలలో విద్యావిజ్ఞానములను పెంపొందించుట దీని లక్ష్యము. దీన ప్రకృతము ౪౩ గురు సభ్యురాండ్రు గలరు. దీని కీయేట కామరాజు వెంకట లక్ష్మమ్మగారు అధ్యక్షురాలును, కనుపర్తి వరలక్ష్మమ్మగారు కార్యదర్శినియు.

హెబ్బణి కృష్ణభాగవతర్ గారు

వీరు పండితులు. శ్రీరామభక్తులు. ప్రప్రథమమున చెన్నపురియందు రామాయణభారతములను ఆంధ్రమున కాలక్షేపము చేసి, ప్రస్తుతము భాగవత కాలక్షేపమును జరుపుచున్నారు.

# ప్రకటనల వివరణము

### అడికప్పచెట్టి, ఏ. వి. ఆర్. ఏ.

౫౭, బందరువీధి, మదరాసు (పు. 10)

జార్జి డ్రెల్లిన్ "సింహము" 'సుందరి', "మాలెశైన్ గ్లిసరైన్" సబ్బులకు, "ఇల్యూషన్" యుడికిలోన్, "మెంతా" టూత్ పేస్టు, మరియితర విలువైన సువాసనసబ్బులు, సుగంధద్రవ్యములు వగైరాలకు సోల్ ఏజంట్లుగ యున్నారు. హెడ్డాఫీసు: కొలంబో. బ్రాంచిఆఫీసులు, మద్రాసు, బొంబాయి, మధుర.

### ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ,

285 మార్కెట్టు, బొంబాయి 2. (పు. 19, 21)

ఈకంపెని ౬౦ సంవత్సరములకు పూర్వమే స్థాపింపబడినది. హిందూదేశమందుండు సువాసన తలనూనెలను, అత్తర్లను సప్లయిచేయు కంపెనీలలో నిది పురాతనమైనది. వీరి సుప్రసిద్ధ "కామినియా" తలనూనె, "ఓటో దిల్ బహార్" హిందూదేశమందేగాక ఇతరచోట్లగూడ ప్రఖ్యాతి చెందియున్నవి.

### డాక్టర్ ఆచంట పరబ్రహ్మాం ఎం. బి. అండు బి. ఎస్.

నేత్రవైద్యులు, రాజమండ్రి (పు. 7)

వీరు నేత్రవైద్యములో చాల అనుభవశాలురు. సాధ్యమైనంతవరకు ఆపరేషనులు లేకనే కంటివ్యాధులకుదుర్చుచుందురు. కంటికి తగిన అద్దములు యొసంగుటలోగూడ మిక్కిలి నేర్పరులు.

### ఆంధ్ర పబ్లిషింగ్ హౌస్,

తెనాలి (పు. 28)

ఇది సుమారు కొన్ని సం॥ క్రితము తెనాలిలో శ్రీయుత చివుకుల ఆదినారాయణగారిచే స్థాపింపబడినది. వీరు మూడువిధములైన డైరీలను పాకెట్ పంచాంగమును ప్రచురించిరి. వకీళ్లకు, గుమాస్తాలకుపయోగపడునటుల పెద్దసైజులో నొకటియు, జేబుకు యిమిడియుండుటకుచిన్నసైజులో నొకటియు జమ్ డైరీయని చిన్నసైజులో నొకటియు ప్రచురించిరి. వీటియందు మిగత డైరీలయందుండు విషయములన్నియు గలవు. ఈసంస్థ దినదినాభివృద్ధి గాంచుచున్నది.

### ఆంధ్రసైంటిఫిక్ కంపెనీ

మచిలీపట్నం (పు 5,25)

వీరు పాఠశాలలలోని సైన్సు శాఖలకు వలయు అన్నిరకముల గాజు, పింగాణి, యంత్రములు, ద్రావకములు వగైరాసప్లయి చేయుదురు. ఆంధ్రదేశములో యిట్టి కంపెనీలు చాల అరుదుగా నున్నని ఉన్నకొలదిలోనిది ప్రాముఖ్యతవడసినది.

### ఆనందరోజ్ వాటర్ ఫ్యాక్టరీ

రాయపేట, మద్రాసు (పు. 38)

ఈఫ్యాక్టరీవారు ఆనందరోజు వాటర్, టూత్ పౌడరు, సిరప్పులు, తలనూనెలు, అగరువత్తులు తయారుచేయించి దేశమంతటను అమ్ముచున్నారు. వీరి శాంపిల్సు 1 రూపాయికు అన్నిరకములు పంపుదురు. మద్రాసులో యిట్టి ఫ్యాక్టరీలు చాల అరుదుగా యుండుటచే వీరి దీనిని స్థాపించి అట్టి కొరతను తొలగించిరి.

### ఆయుర్వేదాశ్రమము

౧౫౧, గోవిందప్పనాయనివీధి, జి. టి. మద్రాసు.

(ఇన్నరు.) టైటిల్ ప్రక్క పు.

౧౯౧౦–వ సంవత్సరములో కీ. శే. శ్రీ వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారు, లక్షరూప్యముల మూలధనముతో దీనిని స్థాపించియుండిరి. ప్రస్తుతకాలమున, మూలబడియున్న ఆయుర్వేద వైద్యశాస్త్రము, మనప్రాంతమున యీనాటి కింత ఉచ్ఛస్థితియందుండుటకు వీరే ముఖ్యకారకులు. వీరి ఔషధముల మాహాత్మ్యము జగద్విదితమే. ఇట్టి ముఖ్య ఔషధములలో నొకటగు "జీవామృతము" పాశ్చాత్యదేశములలో సహా వాడబడియుండుటచేతనే, శ్రీపంచమ జార్జి సార్వభౌములు "వైద్యరత్న" యని బిరుదు మొసంగినటుల తెలియుచున్నది. భారతదేశమందు జరిగిన అనేకవస్తు ప్రదర్శనములందు వీరి ఔషధములు ప్రదర్శించబడి పతకములను, అనేక యోగ్యతాపత్రములను గూడ సంపాదించినవి. ప్రస్తుతము కీ. శే. గోపాలాచార్యులుగారి సోదరులగు డాక్టరు దేశికాచార్యులగారిచే చక్కగ నిర్వహింపబడుచున్నది.

### ఆర్య రసాయనశాల

ముక్త్యాల (కృష్ణాజిల్లా) (పు. 11)

౧౯౨౫ సంవత్సరమున స్థాపింపబడినది. ఉదారగుణసంపన్నులును, విద్యారసికులును, ముక్త్యాల సంస్థానాధీశ్వరులును అగు శ్రీరాజా వాసిరెడ్డి శ్రీచంద్ర మౌళీశ్వరప్రసాద బహద్దరుగారు దీనిసంస్థాపకులు. శాస్త్రీయములును గుణకరములును అగు గొప్ప ఆయుర్వేదౌషధములు ఆంధ్రదేశమునకు అందజేయుటకై ఈసంస్థను నెలకొల్పి, ఇతరత్ర లభించనటువంటిన్ని, సామాన్యులు చేయజాలనటువంటిన్ని, నమ్మకమైన ఔషధములను తయారుచేయించి ఆయుర్వేదమునకుగల ప్రఖ్యాతిని సార్థకముచేయుచున్నారు. దీనితోపాటు ముక్త్యాల నగరమున

ఉచిత వైద్యశాలనుగూడ నెలకొల్పి, తత్పరిసర ప్రదేశవాసులకు గూడ ఉచితవైద్యసహాయమును చేయుచున్నారు. ఈరెండు సంస్థలకును సుప్రసిద్ధభిషగ్వరులగు ఆయుర్వేదభూషణవేటూరి శంకరశాస్త్రిగారు ప్రధానులుగానుండి, వీటి ప్రఖ్యాతికి కారకులగుచున్నారు. వంశపారంపర్యముగా వచ్చుచున్న వైద్యానుభవముతోగూడిన, దివ్యౌషధములచే ఈసంస్థ ఆంధ్రదేశమున అచిరకాలముననే ప్రఖ్యాతిని వహించినది.

## ఇండియన్ పెనిన్స్యులర్ ఇన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

26, మౌంటురోడ్డు, మద్రాసు. (పు.12 b)

ఇది కేవలము హైందవసంస్థయై యున్నది. దీని మూలధనము, నిర్వహణము, లాభములు సర్వము భారతీయులదే. చాల ధారాళమగు పద్ధతులు గలవు. వీరి బ్రాంచి ఆఫీసు త్రివేంద్రములో గలదు.

## ఇండియన్ మ్యూచువల్ లైఫ్ అసోసియేషన్ లిమిటెడ్

హెడ్ ఆఫీసు:—69, బిగ్ స్ట్రీట్, ట్రిప్లికేన్, మద్రాసు. (పు. 42)

ఈ భీమాకంపెనీయందు సకలసౌకర్యములు గలవు. దీనిని గూర్చి మద్రాసు పురప్రముఖులు బాగుగ పొగిడియున్నారు.

## ఉమ్మిడి రామయ్య శెట్టి-గురుస్వామి శెట్టి కంపెనీ

చైనాబజారురోడ్డు, మద్రాసు (టైటిల్ ప్రక్క పు.)

ఈకంపెనీ సుమారు 30సం॥రముల క్రిందట అతిస్వల్పమగు పెట్టుబడితో ప్రారంభించబడినది. ప్రస్తుతము దక్షిణ ఇండియాలో నగల తయారుచేయు గొప్ప కంపెనీలలో నొకటియై విరాజిల్లుచున్నది. దక్షిణయిండియాలో, గృహోపకరణములగు వెండిసామాను లన్నియు యంత్రసాహాయ్యముచే తయారుచేయుటకు వీరే ప్రథములు. వీరిసంస్థ సుమారు ౨౫౦ కుటుంబములకు రక్షణయొసగునంతటి గొప్పసంస్థగ మారియున్నది. పలురకములైనసువర్ణాభరణములుతయారుచేసి, సాధ్యమైనంత తక్కువ ధరకు సరఫరాచేయుచున్నారు. అంగుళీయకములు, సువర్ణకంకణములు, టూర్నమెంటు కప్పులు వగైరాలకు ప్రత్యేకముగ ముద్రించినక్యాటలాగు విదేశీక్యాటలాగుల కేవిషయములోను తీసిపోనంతటి సుందరముగ నుండును. ప్రస్తుతము దీనికి శ్రీ యుతులు ఉమ్మిడి పాండురంగశ్రేష్ఠి, ఉమ్మిడి పార్థసారథి శ్రేష్ఠిగార్లు అధిపతులుగ నుండి కడుసమర్థతో వ్యాపారమును జరుపుచున్నారు. వ్యాపారమునకు వలయులక్షణము లన్నియు వీరియం దుండుటచేతనే వ్యాపారము దినదినాభివృద్ధి గాంచుచున్నది.

## ఏ. గోపాలస్వామి నాయుడు అండ్ సన్సు

5 పుదుపేట వీధి, పరింగిమలెపోస్టు (పు. 4 b)

వీరు పలురకములను శ్రేష్ఠమైనరాళ్లు అనగా కెంపులు, వజ్రములు, వైఢూర్యములు, నీలములు, పచ్చలు మొదలగువాటిలో వ్యాపారముచేయుచున్నారు. వీరు 4 మాసములక్రితము "వినోదిని" అను హాస్యరసప్రధానమగు సచిత్రమాసపత్రిక నొకదానిని ప్రారంభించిరి. ఆంధ్రదేశములో యిట్టి పత్రికలు చాల అరుదుగనున్నవి. అట్టి లోపమును వీరు తీర్చిరనుట కెట్టి సందియమునులేదు. ఈపత్రికాకార్యస్థానము ౨౩౭ గోవిందప్పనాయునివీధి, మద్రాసునందు గలదు.

## ఎమ్. ఆది అండు కో.,

హెడ్డాఫీసు: 39 చిన్నతంబి వీధి, మద్రాసు.

బ్రాంచి: ఎస్ప్లనేడు మద్రాసు. (పు. 20)

ఈకంపెనీవారు అనేకసంగీత పుస్తకములు, భక్తవిజయమును పాండురంగభక్తులచరిత్ర రచియించి విరివిగ అమ్ముచున్నారు. వీరి గ్రంథములలో మరికొన్ని ఆది త్యాగరాజకీర్తనములు, త్యాగరాజహృదయము.

## ఎమ్. జి. కొఠేచా అండ్ బ్రదర్సు

శాండహర్ట్సురోడ్డు పరేల్ ఆసుపత్రికి ఎదురుగ.

బొంబాయి 4 (పు. 10)

వీరు వాలంటీర్లు, సంఘములు, సేవాసంఘములు, వగైరాల చిహ్నములు, దేశీయనాయకుల చిత్రములుగూడ వ్రాసి అనేక ప్రదర్శనములందు బహుమతులు బడసిరి.

## ప్రొఫెసరు ఎం. వి. కృష్ణారావు

ఉదకమండలము. (నీలగిరి) (పు. 7.)

ఆంధ్రదేశమున వీరి నెరుంగనివారుండరు. వీరు శరీరవ్యాయామమందు అనేకులకు విద్యగరపుచు, అనేకస్వదేశ సంస్థానాధిపతుల మెప్పువడసియుండిరి. వీరు వ్యాయామముల గూర్చి గ్రంథములు గూడ రచించిరి.

## ఏలూరు అన్న, వస్త్ర, వైద్య, విద్యాదాన సమాజము

ఏలూరు (పు. 6 a)

ఈసమాజము సుమారు ౨౦ సం॥ క్రిందట స్థాపించబడినది. దీనిభవనమును, స్థలమును ప్రభుత్వమువారు ధర్మమొసగిరి. ప్రతిదినము బీదలందరికి అన్నదానము చేయుచు, సంవత్సరమునకొకతూరిడిసెంబరు ౧౫ తేదీ సుమారు ౧౫౦౦ మందికి వస్త్రదానము జరుగుచున్నది వేసవికాలమందు నాలుగు మంచినీళ్ల చలివేంద్రలు పెట్టించి బీదల దాహమును బాపుచున్నారు. ఇంతియగాక బీదవిద్యార్థులకు జీతములిచ్చుచున్నారు. ఉచితహోమియా వైద్యశాలకూడ కలదు.

## ఏలూరు గోరక్షణసమితి ఏలూరు (పు. 6 a)

సుమారు ౧౫ సంవత్సరములక్రితము స్థాపింపబడినది. మాంసవిక్రయశాలలకు కొనిపోబడు అధికపశువులను గాపాడి దీనియందు పోషింపబడుచున్నవి. దీనినుండి పాలు, ప్రజలకు విక్రయమునకు

సప్లయి చేయబడుచుండును. దీనినిగూడ నిర్విఘ్నముగ సాగించుటకు రా. బ. మోతే గంగరాజుగారు, ఎం. వి. చినరాజు, పి. గోపాలస్వామిగార్లు ముఖ్యులు.

### కత్రియవారు ట్రేడింగ్ కంపెనీ

గిర్గం, బొంబాయి. (పు. 26)

ఈ కంపెనీవారు పలురకముల తలనూనెలు, సబ్బులు, ముఖవిలాసలు, తయారుచేయుటలో హిందూదేశమంతట ఖ్యాతిగాంచియుండిరి. వీరి నం. 777. నైట్‌గోడ్ తలనూనెను అనేకమంది వాడుచున్నారు.

### కరెంటు సరిక్యులేటింగ్ లైబ్రరీ.

183, మౌంట్‌రోడ్డు, మద్రాసు (పు. 48)

వీరి బ్రాంచులు జార్జిటౌన్, మాంబళం, కోయంబత్తూరు, బెంగుళూరు నందుగలవు. మద్రాసులోని విద్యార్థులకు వీరిలైబ్రరీ వలన చాల సౌకర్యములు లభించిన వనుట నిస్సంశయము.

### కృష్ణా అండ్ కో.

౨౮౧-౨౮౨, చైనాబజారు, మద్రాసు (పు. 14)

వీరు పలువిధములైన, స్వదేశపుజవుళీల వ్యాపారముచేయువారు వీరు కృష్ణా ౧ రకం ట్వీల్లుకు ఏజంట్లుగయున్నారు. వీరివద్ద పలురకములైన సర్జీలు, ట్వీడులు, ఫ్లానెలు వగైరాలు దొరకును.

### కేరళసోప్ ఇన్‌స్టిట్యూట్, కల్లికోట (మలబారు) (పు. 30)

ఈ సబ్బుఫ్యాక్టరీని, మద్రాసు ప్రభుత్వమువారు రాజధానియందు పారిశ్రామికాభివృద్ధిచేయు నుద్దేశ్యముతో స్థాపించిరి. దీనిని స్థాపించుటలోగల ముఖ్యోద్దేశ్యము దీనివలన ధనము సంపాదించవలెననిగాక, విద్యార్థులకు యీ పరిశ్రమను నేర్పుటయే పరమావధిగా భావించుచున్నారు. ఎట్లయినను, సైన్సుశాస్త్రపరిశోధకులగు మిస్టర్. మెనన్‌వారిచే తగుజాగ్రత్తగ నడుపబడుచుండుటచే క్రమేణ వ్యాపారరీత్యాగూడ అభివృద్ధిగాంచుచున్నది. దీనియందు తయారుచేయబడు సబ్బులు హిందూదేశములో తయారుగాబడు శ్రేష్ఠమైన సబ్బులలో నొక రకమువైయున్నవి.

### కోట జయరామనాయుడు. డాక్టరు

౧౮౬, బ్రాడ్వే మదరాసు. (పు. 45)

డాక్టర్ కోటా జయరామనాయుడు గారు సుప్రసిద్ధ ఆయుర్వేదవైద్యులు. "డాక్టర్ కోటాగారి మందుల పెట్టె" చాల ప్రఖ్యాతి గాంచినది. దీనియందు సామాన్యముగ వచ్చుచుండు వ్యాధు లన్నింటికి ఉపయోగపడు ఔషధములు చాల కలవు. దూరప్రదేశముల నుండువారు సహితము రోగి లక్షణములను ఉత్తరము ద్వారా తెలిపిన వీరు సదరు వ్యాధికి తగిన ఔషధము, అనుపానములు, పథ్యము వగయిరాలు వివరముగ వ్రాసి పంపుచుందురు. ఇట్లు చేసి వ్యాధులలోచాలభాగము నివారణచేయుచున్నారు.

### కోదండరామపిళ్లెగారు, పి.

**44**, ఎస్ప్లెనేడ్, మద్రాసు. (పు. 4)

మద్రాసు రాజధానియందు ప్రథమమున ఫర్నిచరు సామానుల వ్యాపారమును ౧౮౫౮ సం॥ న వీరితండ్రి కీ॥ శే॥ పి. ఎస్. పొన్నుస్వామిపిళ్లెగారిచే ప్రారంభించబడినది. తరువాత వీరి హయాములో అత్యంతమునభివృద్ధిచేయబడుట మాత్రమేగాక యీవృత్తి అనేకులకు నేర్పి ప్రవీణులుగునటుల చేసియుండిరి. మరియు వీటికి గావలసిన యిత్తడి మరలు, బీగములు వగైరాలు భారతదేశమందు తయారుచేయబడువాటినే వీరు పట్టుదలతో ఉపయోగించుచున్నారు. వీరు శాంతస్వభావులు, ఉదారులు, చాల దానధర్మములు చేయువారు.

### గనేష్ అండ్ కో., (తంబుచెట్టివీధి, మద్రాసు.) (పు. 368)

వీరు ప్రథమములో అనేక జాతీయగ్రంథముల ప్రచురించుట చేతనే యింతటి ఖ్యాతిగాంచ గలిగిరి. నేటికినిగూడ అదేఖ్యాతి గలిగియున్నారు.

వీరు మరొకవ్యాపారమందుగూడ మార్కెటునందు ప్రాముఖ్యస్థానము నాక్రమించియున్నారు. ప్రజలందరికిని రుచించునట్టి పలువిధములైన కాఫీగింజలను తెప్పించి యమ్ముటచే వీరిపేరు ప్రతియింటను చెప్పుకొనుచున్నారు. వీరు యింటింటికివెళ్లి కాఫీగింజలను క్రయమునకు ఒసంగుచుండు పద్ధతి చాల అనుకూలమగనున్నది. బయటవూళ్లకు ౭ పౌనుల కాఫీగింజలు చిన్నబస్తాలలో తగు జాగ్రత్తతోను, వెంటనే పంపుచుండు పద్ధతి చాల అనుకూలమై ఉత్తరహిందూస్థానమందుండు దాక్షిణాత్యులకుగూడ చాల సౌకర్యము నిచ్చుచున్నది.

### గ్యారంటీడ్ రిలీఫ్ సిండికేటు, లిమిటెడ్

కలకత్తా. (పు. 12 a)

దీని కార్యనిర్వాహకులు ఎంటర్ ప్రైజర్సు అర్గనైజేషన్ **లిమిటెడ్, 14** క్లయివువీధి, కలకత్తా. బీదలకు దీనియందు చాల సౌకర్యములు గలవు. ఆంధ్రదేశమునకు ఏజంటు. వి. ఎస్. పండిట్ తాతారామమూర్తి.

### గ్రీఫ్ ప్రాడక్ట్సు (ఇండియా) ఏజన్సీ

30, చర్చిగేట్ వీధి, బొంబాయి. (పు. 9)

వీరు గ్రీఫ్ డూప్లికేటర్లు అను ముద్రణయంత్రములకు హిందూదేశపు ప్రతినిధులు వీరి యంత్రములు వివిధసైజులలో గలవు. ఇంతియేగాక వీరు పలురకముల టైప్ రైటర్లు, డూప్లికేటర్లు, తదితర పరికరములు అమ్ముచుందురు.

### గుజరాత్ ఆయుర్వేదిక్ ఫార్మసీ

అహమ్మదాబాదు (పు. 43)

వీరికి సీతారామ్ మెడికల్ స్టోర్సువారు 2/177 చైనాబజారు రోడ్డు మద్రాసు వారు సోల్ ఏజంట్లుగ నున్నారు. జీవన్ చ్యవనప్రాశ, వృద్ధశీవన్ బాల జీవన్ వగైరా సుప్రసిద్ధ ఔషధములు తయారుచేసి అమ్ముచుందురు. వీరికి మద్రాసు రాజధానియందంతటను ఏజంట్లుగలరు.

### గోపాల్జీ చాంప్సీ అండు కో.

హెడ్డాఫీసు: వర్గాశి, బొంబాయి మద్రాసు బ్రాంచి:

21, గోవిందప్పనాయకన్ వీధి (పు. 47)

వీరు శ్రేష్ఠమైన "తిలక్" మార్కు ఇంగువను తయారుచేసి అమ్ముచుందురు. ఇంతియేకాక కస్తూరీ, సాలమిశ్రి వగైరాలుగూడ అమ్ము వ్యాపారస్థులు.

### గోల్డెన్ టుబాకో కంపెనీ

విల్లి-పార్లి, బొంబాయి (పు. 19)

వీరు శ్రేష్ఠమైన కార్కు టిప్పెడ్ సిగరెట్లు తయారు చేయువారు. వీరి సిగరెట్లకు అనేకస్వదేశ ప్రదర్శనములందు బంగారు పతకములు బహూకరింపబడినటుల తెలియుచున్నది.

### జండు ఫార్మస్యూటికల్ వర్క్సు

౩౮, చైనాబజారు రోడ్డు, మదరాసు. (పు. 36)

ఈసంస్థ ౧౯౧౦ సంవత్సరమున బొంబాయిలో జండు భట్ గారి మనుమలగు శ్రీయుత, జగన్నాథ్ ఎన్. వైద్యగారిచే స్వంతముగ స్థాపించబడెను. తదుపరి ౧౯౨౦ సం॥న లిమిటెడ్ కంపెనీగా మార్చబడినది.

ఆయుర్వేద ఔషధములన్నియు నవీనపద్ధతులపై, సంపూర్ణమైన యంత్రములతో నిండియున్న పై సంస్థయందు తయారుచేయబడి ఇండియా, బర్మా, సిలోను, ఆఫ్రికా, మెడగాస్కర్, పర్షియన్ గల్ఫు, మరి యితర దేశములందును అమ్మబడుచున్నవి. కలకత్తా, మద్రాసు, పూనా పట్టణములందుజరిగిన ఆయుర్వేదౌషధ ప్రదర్శనములందు బంగారు పతకముల వీరు సంపాదించి యుండిరి.

వీరి మద్రాసు ఏజంట్లు: మెసర్సు దామోదర్ అండ్ కో., ౩౮, చైనాబజారురోడ్డు, మద్రాసు.

### జనార్దనమునాయుడు, పి. ఆర్.

ఒంగోలు (గుంటూరుజిల్లా) (పు 35)

ఇంద్రజాల, మహేంద్రజాలవిద్యల నేర్పు పుస్తకములు, దీనికి తగిన తదితరపరికరములు వీరివద్ద దొరుకును. వీటినిగూర్చి కొలది పుస్తకములగూడ ప్రచురించియున్నారు. వైద్యవిద్యయందు గూడ ప్రవేశముండుటచే కొన్ని ఔషధముల తయారుచేసి విక్రయించుచుందురు.

### జాన్ డికిన్సన్సు అండు కంపెనీ లిమిటెడ్

9, మెక్లీన్ స్ట్రీట్, మదరాసు పు 368 తర్వాత)

అన్నివిధములయిన కాగితములు, అచ్చుసామానులు, ముద్రణా యంత్రములను వీరు విక్రయించుచుందురు. వీరి హెడ్డాఫీసుఇంగ్లాండు. మదరాసులోను, బొంబాయిలోను వీరికి బ్రాంచి ఆఫీసులు కలవు.

### జి. డబ్లియు. గుడ్విన్సు అండు సన్సు

మాంచెస్టరు (పు. 8)

వీరు సుప్రసిద్ధమగు గుడ్విన్సు సబ్బుల తయారుజేయువారు. ఈసబ్బులు హిందూదేశములో చాలకాలమునుండి ప్రచారములోనున్నవి. వీరికి హిందూదేశప్రతినిధులు బొంబాయిలోని ఆల్ఫ్రెడ్ డబ్లియు బ్రూక్ (ఈస్టరన్) లిమిటెడు వారు. మద్రాసు ఏజంట్లు పి. హార్డు అండు కో.

### టమిల్నాడు ఆయుర్వేదక్ ఫార్మసీ లిమిటెడ్

44, గోవిందప్పనాయునివీధి మద్రాసు (పు. 17)

మద్రాసులో సుప్రసిద్ధ ఆయుర్వేద ఔషధముల వ్యాపారస్థులలో ఇదియొకటి. వీరి "కాయసిద్ధిమకరధ్వజము" అనేకులచే వాడబడి మంచి గుణమిచ్చినటుల అనేక యోగ్యతాపత్రములు గలవు. దీని ముఖ్యవైద్యులు ఈ. ఎస్. గోపన్‌గారు. వీరి సలహా పోస్టుద్వారాగాని, ఖుద్దునగాని పొందనగును.

### టి. వి. రెడ్డి

రాజమండ్రి (వెనుక కవరుకుమునుపు)

వీరు ధనసంపన్నులు. రాజమండ్రిలోని రెడ్డి కంపెనీ ప్రొప్రైటర్లు, కమిషన్ ఏజంట్లు, కంట్రాక్టర్లువగైరా హోదాలు గలవారు. వీరు యిటీవల కొలదికాలమునుండి విదేశములలో జరుగు గుర్రెపుపందెముల టిక్కెట్లు అమ్ముటకు అధికారమును పొందిన ఏజంట్లు. వీరికి మద్రాసులో సి. పట్టాభిరాం అండ్ కో వారు అమ్మకపు ప్రతినిధులుగ పనిచేయుచున్నారు.

### డి. జి. గోర్

31, మంగల్‌దాస్‌రోడ్డు బొంబాయి (పు. 28)

వీరు ఇండియన్ ఇండస్ట్రియల్ పెర్ఫ్యూమ్స్ కంపెనీ అను పేర నొక సుగంధద్రవ్యముల కంపెనీని స్థాపించిరి. వీరి పోమేడ్లు, తలనూనెలు, బ్రిలియంటైనులు, క్రీములు, ఊదువత్తులు, సబ్బులు దేశమంతటను గల వీరి ఏజన్సీలలో విక్రయింపబడుచున్నవి.

## డొమినియన్ ఎస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్.

హెడ్డాఫీసు 5, 6, హేర్‌స్ట్రీట్, కలకత్తా (పు. 22)

ఈఇన్‌స్యూరెన్సు కంపెనీగూడ మిగత కంపెనీలతో బాటు సౌకర్యము లన్నియు నొసంగును. వీరి ప్రత్యేక డొమినియను బాండ్లు 1000రూపాయలకు రు. 5400 లొసంగు సౌకర్యములు గలిగియున్నది.

## డోంగ్రే, కే. టి. అండ్ కో., బొంబాయి (పు. 13)

బాలుర కత్యంతోపయుక్తమైనట్టి సుప్రసిద్ధ "బాలామృతము" ను కనిపెట్టినవారలు వీరే. వీరి హెడ్డాఫీసు, బొంబాయి. మద్రాసు ఏజంట్లు: దామోదర్ అండ్ కో., చైనాబజారు

## దవేకెమికల్ వర్క్సు

బొంబాయి. 2 (పు. 29)

ఈకంపెనీవారు అనేక సుప్రసిద్ధ ఔషధములు తయారుచేసి విక్రయించుచున్నారు. అందులో స్త్రీలవ్యాధులకు వరప్రసాదమన దగిన సుందరిసాథి ముఖ్యమైనది. వీరికి దక్షిణహిందూ దేశమంతటను ఏజంట్లు గలరు.

## దామోదర్ అండ్ కంపెనీ,

చైనాబజారు, మదరాసు (పు. 18)

వీరు ప్రఖ్యాతిగాంచిన ఆయుర్వేదఔషధముల కన్నింటికిని ప్రతినిధులుగ పనిచేయుచున్నారు. వీరు అమ్ము ఔషధములలో ముఖ్యమైనవి డాక్టర్ వామన్ గోపాలగారి "అయోడైసిడ్ సరస పెరిల్లా" యున్నూ; డాక్టర్ గౌతమరావు కేశవరావుగారి "ఫాస్‌ఫరస్" మాత్రలునూ అయియున్నవి. ఇవిగాక సుప్రసిద్ధ జండూగారి ఔషధములకుగూడ వీరే ప్రతినిధులై యున్నారు.

## ధన్వంతరి ఆయుర్వేదౌషధాలయం

శనివారప్పేట, ఏలూరు ప. గో. (పు. 13)

వీరు ఆంధ్రదేశమంతటను శాస్త్రరీత్యా తయారుచేయబడిన ఆయుర్వేదౌషధములతో వ్యాపారము చేయుచున్నారు.

## నరసింహం అండ్ కో లిమిటెడ్.

18, బ్రాడ్వే, మద్రాసు (పు. 45)

ఈకంపెనీవారు స్వదేశ సిరా కంపెనీ నొకదానిని స్థాపించి కడు నిపుణతతో నిర్వహించుచుండిరి. వీరి సిరాలు దేశమంతటను వ్యాపించుచున్నవి. సిరాలు బాగుగా యున్నటుల అనేకులు శ్లాఘించియున్నారు.

## నాగేంద్రనాథ్ సేన్ కవిరాజ్ అండ్ కో, లిమిటెడ్., కలకత్తా. (పు. 23)

వీరు సుప్రసిద్ధ "కేశరంజన్" తలనూనెల తయారుచేయు వారు. హిందూదేశమందు ఆయుర్వేద ఔషధములను శాస్త్రీయముగ అనాదిగ తయారుచేయు వారలలో నొకరై యున్నారు.

## నార్తరన్ ఇండియా ఇన్‌ష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్ లాహోరు. (పు. ౨)

ఈకంపెనీకి మెసర్సు గురురాజా అండ్ కో ట్రిప్లికేన్ వారు మద్రాసు రాజధానికి ఏజంట్లు. ఈకంపెనీయందలి విశేష మేమన అన్ని సౌకర్యములు ఒకే పాలసియందు గలవు. ఎవరైనను అశక్తులైన ప్రీమియము చెల్లించ నవసరములేదు.

## నియో మోహనవిలాస్

21, సుంకురామచెట్టివీథి, జి. టి. మద్రాసు. (పు. 30)

ఈ హోటల్ గుజరాతీయులచే కొలదిమాసములక్రితము ప్రారంభింపబడినది. మద్రాసునందలి ఆర్యభవన్ కోమలవిలాస్ మొదలగు పెద్ద కాఫీహోటళ్ల మాదిరిగనే నిర్వహింపబడుచున్నది. ఫలాహారముల శాఖయేగాక చక్కని భోజనసౌకర్యములుగూడ గలవు.

## న్యూఇండియా ఎష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.,

౮/౨౧, ఫస్టులైన్‌బీచ్, మదరాసు. (వెనుక కవరులోపల)

ఈకంపెనీ ౧౯౧౯ సంవత్సరమున జమ్‌షెడ్ పురములోని సుప్రసిద్ధ "తాతాహౌస్" వారిచే స్థాపింపబడి ప్రస్తుతము ప్రపంచమంతటను వ్యాపించిన పెద్దసంస్థయైయున్నది. ఫైర్, లైఫ్, మెరైన్ బర్‌గ్లరీ, మోటారుప్రమాదము మరి యితర సర్వవిధములైన కష్టముల నుండి రక్షించుకొనుటకు దీనిభీమా ప్రజలకు చాల ఉపయోగకరముగ నున్నది. మద్రాసుబ్రాంచి మేనేజరు కె. కె. శ్రీనివాసన్ గారు కడుసమర్థతో నడుపుచున్నారు.

## న్యూ నేషనల్ హిందూ హోటల్

153, మింటువీధి, మద్రాసు (పు. 45)

వీరి హోటల్‌లో భోజనము చాల రుచిగాను, శుభ్రముగాను యుండును. నివసించుటకు గదులు వగైరా సౌకర్యములు గలవు.

## నేషనల్ ఇన్‌ష్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

౭, కౌన్సిల్‌హౌస్‌స్ట్రీట్, కలకత్తా. (పు. 35)

ఇది ౧౯౦౬ సం॥న స్థాపింపబడినది. హిందూదేశమందుండు గొప్ప భీమాకంపెనీలలో నొకటియై యున్నది. ఇది కేవలము భారతీయ సంస్థయై, హైందవులచేతనే నడుపబడుచున్నది. అన్ని విధములైన భీమాస్కీములు లిందుగలవు. వీరి ప్రీమియములు తక్కువగ

నుండినను, ఎక్కువ లాభముల పంచిపెట్టుచున్నారు. వీరి మద్రాసు బ్రాంచి మిక్కిలిసమర్థులైనట్టి టి. అనంతాచారి (బి. యే.) గారిచే చక్కగ నిర్వహింపబడుచున్నది. మద్రాసు బ్రాంచి ఆఫీసు: ౧౧౩, అర్మీనియన్ వీథి, జార్జిటౌనందు గలదు.

## పి నరసింగరావు బి. యే. బి. యల్

కాకినాడ. (పు. 18.)

వీరు వివిధకంపెనీలకు ఆంధ్రదేశపు సోల్ ఏజంట్లుగపని చేయుచున్నారు. అందు ముఖ్యముగ బిస్కట్లు, సబ్బులు, ఔషధములు, మిలోక్కల్, సుశామతైలనూనె, పింగాణీవస్తువులు వగైరా కంపెనీల ప్రతినిధులు.

## సి. రాణా అండు కో.,

3, లోయర్ చిట్‌పూర్ రోడ్ కలకత్తా. (పు. 10)

వీరు సుప్రసిద్ధ మోహిన్ ఫ్లూట్ హార్మోనియము కంపెనీ స్థాపకులగు మోహిన్ బ్రదర్సులో యిదివరకుపనిచేసియున్నారు. వీరు పలువిధములగు సంగీత పరికరములలో వ్యాపారము చేయుచున్నారు.

## పి. సి. ఏ. అండ్ కంపెనీ ఆయుర్వేదసమాజము

పెరిదేపి, (నెల్లూరుజిల్లా) (పు. 2, 3, 9, 12, 13, 14, 17)

ఈసంస్థ ౨౫ సంవత్సరములక్రిందము నెల్లూరు మండలములోని పెరిదేపిగ్రామమున ఆయుర్వేదవిద్వాన్, భిషగ్రత్న పి. సి. అయ్యవారప్పయ్య పంతులుగారిచే స్థాపింపబడినది, వీరి ఔషధరాజములన్నియు ఆంధ్రదేశ మంతట నుపయోగింపబడుచున్నవి.

## పి. హార్లు అండు కంపెనీ, లిమిటెడు

పో. బా. 237 మద్రాసు (పు 37)

వీరు లిజర్డ్ హార్డ్‌వేర్ ఫౌన్‌టెన్ కలములకు మద్రాసు ప్రతినిధులైయున్నారు. హిందూదేశపు బ్రాంచి బొంబాయినందు గలదు. ఈకలములు చౌకగయుండి చాలబాగుగ వ్రాయును. అనేకులచే వాడబడుచున్నవి.

## బొంబే లైఫ్ ఎస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.,

బొంబేలైఫ్ బిల్డింగ్సు, ఫోర్టు, బొంబాయి. (పు. 26)

ఈకంపెనీ బొంబాయిలో ౧౯౦౮ సం. సర్. లల్లూ భాయ్ శ్యామల్‌దాస్, (కే. టి. సి. ఐ. ఇ., జె. పి.) గారి యధ్యక్షత క్రింద స్థాపింపబడినది. స్త్రీల ఇన్సూరెన్సు, మ్యూచువల్ ఇన్సూరెన్సు, తక్కువ ప్రిమియములు, ధారాళమైన పాలిసీపద్ధతులు, మిగత నవీన ఇన్సూరెన్సు స్కీములన్నియు గలిగియుండుటయే దీనియందలి విశేషము. మెసర్సు కోచికార్ బ్రదర్సు., మౌంటురోడ్డు, మద్రాసు వారు యిచ్చట బ్రాంచి కార్యదర్శులుగనుండి మంచిపని చూపుచున్నారు.

## భారత్ ఇన్‌స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్.,

౬౨/౬౪ రటాన్ బజారు, మద్రాసు (పు. 12 a)

ఇది హిందూదేశమందుండు లైఫ్ ఇన్సూరెన్సు కంపెనీలలో పురాతనమైనదయి ౧౮౯౬-వ సంవత్సరమున లాలా హరికిషన్ లాల్ (బి. యే. (క్యాన్‌టబ్) బారిష్టరు గారి అధ్యక్షతక్రింద స్థాపింపబడినది. స్త్రీలు భీమా చేయుట, తక్కువ ప్రిమియములు, ఎక్కువలాభములు, సులువైన నిబంధనలుగల పాలిసీలు, యితరులకు ధర్మార్థము వినియోగించు పాలసీలపై నూటికి ౭౦ తగ్గింపు మొదలైన సౌకర్యములు గలిగియుండుటయే దీనియందలి విశేషము. మద్రాసు బ్రాంచిమేనేజరు, పి. కుప్పుస్వామి అయ్యర్ గారు, ఆంధ్రదేశమునకు డి. శాంతయ్యగారు సామర్లకోటలోను, ప్రభల వెంకట్రామయ్యగారు బెజవాడలోను ఎన్. శేషఅయ్యర్ గారు మదరాసునందును ఆర్గనైజింగ్ ఇన్‌స్పెక్టర్లుగ పనిచేయుచున్నారు.

## మదర్ ఇండియా ట్రేడింగ్ కంపెనీ

234, గోవిందప్పనాయునివీధి మద్రాసు (పు. 12 a)

వీరు రాజపుతానాలోని అబు ఆయుర్వేదిక ఫార్మసీవారి మద్రాసు ప్రతినిధులు. రాజపుత్ర స్థానములోని అబు పర్వములపైనుండి తీయబడిన మూలికలచే తయారుచేయబడిన "లోహాసవము" చాల ప్రసిద్ధికెక్కినది.

## మద్రాసు ఎస్యూరెన్సు కంపెనీ లిమిటెడ్

హెడ్డాఫీసు: లింగిచెట్టివీధి మద్రాసు. (పు. 12 b)

ఇది కొలదికాలముక్రిందటనే స్థాపింపబడినది. డైరెక్టర్లబోర్డునందు చాల గొప్పవారు గలరు. దీనిలో బీదలకు సామాన్యులకు తగిన రీతుగ సౌకర్యము గలవు.

## మద్రాసు పెన్‌సిల్ ఫ్యాక్టరీ

పోస్టుబాక్సు నెం. ౮౬, మద్రాసు. (పు. 39)

ఇది ప్రభుత్వమువారిచే స్థాపింపబడి, కొంతకాలమైన పిదప సుప్రసిద్ధ మెసర్సు పెరుమాళ్లచెట్టి అండ్ సన్సువారి కొప్పగించబడినది. వీరి చేతిక్రిందికి తీసుకొని నప్పటినుండియు చాల యభివృద్ధి గాంచుచున్నది. దీనియందు దినము ౧ కి ౨౦,౦౦౦ పెన్సిళ్లు తయారుచేయబడుచుండి, హిందూదేశమందుండు యిట్టి ఫ్యాక్టరీలలో మిన్నయైయున్నది. వీరి ట్రేడ్ మార్కు యగు "స్టార్" హిందూదేశమంతటను ప్రఖ్యాతిగాంచినది. ఈ పెన్సిళ్లు ఏవిషయములోగూడను విదేశీ పెన్సిళ్లకు తీసిపోజాలవు.

## మద్రాసు స్వదేశీ ఎంపోరియమ్, లిమిటెడ్

17. ఏ, మౌంటురోడ్డు, మద్రాసు (పు. 40)

భారతదేశమందు యిట్టి స్వదేశీసంస్థలు అనగా స్త్రీలచే నిర్వహింపబడునవి యిటీవలనే యొకటి రెండు ప్రారంభమయ్యెను.

| | | | |
|---|---|---|---|
| 20 | ౫ | ౧౬ | శు॥ ప్ర॥ బు౪౧-౯ ఉఫ౧౫-౦ శు౪౨-౨౦ కిం౧౧-౪౭ రా౫-౪౨ అహః౩౦-౧౦ఉఫ౩ రవిః౪-౪౩ దౌహిత్రకృత మహాలయః,శరన్నవరాత్రారంభః,కలశస్థాపనం, స్తన్యవృద్ధిగౌరీవ్రతయాగః భుం౦-౩౯చ౨౯ |
| 21 | ౬ | ౧౭ | ద్వి॥ గు౩౯-౫హ౧౪-౩౫ బ్ర౩౭-౨౪ బా౧౦-౧౨ రా౩-౫౭ త్యా౩-౫౪ ప్రీతిద్వితీయచంద్రోదయః భుం౦-౪౯చ౩౦ |
| 22 | ౭ | ౧౮ | తృ॥ శు౩౫-౨౪ చి౧౩-౪ వి౩౧-౪౦ తై౭-౧౫ ది౨౬-౨౭ త్యా౩-౫౦ భుం౦-౫౯చ౧ [తిథిపక్షిణ్యనధ్యాయః భు౧-౧౦చ౨ |
| 23 | ౮ | ౧౯ | చ॥ శ౩౦-౫౧ స్వా౧౦-౪౨ వై౨౫-౧౫ వ౩-౧౬ ది౨౪-౦ అహః౩౦-౪ఉఫ౪ రవి౨౮-౫౪ తులాయనం౨౯-౨౪ చతుర్థి |
| 24 | ౯ | ౨౦ | ప॥ ఆ౨౫-౩౮ వి౭-౩౫ వి౧౮-౧౭ బా౨౫-౩౮ ది౧౬-౫౮ పంచమీతిథిః రావేకు క్రాంభు౧-౨౦చ౩ |
| 25 | ౧౦ | ౨౧ | ష॥ సో౧౯-౫౭ అ౩-౫౪ జ్యే౫౬-౪ ప్రీ౧౦-౫౨ తై౧౯-౫౭ ది౧౬-౫౮ తిథిద్వయంభు౧-౩౧చ౪ |
| 26 | ౧౧ | ౨౨ | స॥ మ౧౩-౫౭ మూ౫౫-౪౦ ఆ౩-౧౪ సౌ౫౨-౧౪ వ౧౩-౫౭ రా౨౨-౦ అహః౨౯-౫౮హ౧ స్త్రీపుం॥ పూర్ణ జల॥ రవిః౫౨-౩౬ సరస్వతీపూజ అష్టమీతిథిః ఉభయానధ్యాయః భు౧-౪౧చ౫ [పూజమహానవమీభు౧-౫౨చ౬ |
| 27 | ౧౨ | ౨౩ | అ॥ బు౭-౫౧ పూషా౫౧-౨౮ శో౪౭-౪౨ బ౭-౫౧ ది౧౭-౫౦ స్వారోచిషమన్వాదిః దుర్గాష్టమీగజగౌరీవ్రతం కాళీ |
| 28 | ౧౩ | ౨౪ | న॥ గు౧-౫౩ ఏషా౫౪-౧౪ ఉషా౪౭-౩౬ అ౪౦-౧౧ కౌ౧-౫౩ ది౧౦-౫౦ రా౨౭-౮ అవమ,సుదశావ్రతం, దుర్గాహోమః, బలిదానంచ, విజయదశమి,శమీపూజ, రాజ్ఞాంపట్టాభిషేకః, అపరాజితాపూజా, సరస్వత్యుద్వాసనం, సోపపదం,బుధజయన్తీభు౨-౨చ౭ |
| 29 | ౧౪ | ౨౫ | ఏ॥ శు౫౦-౫౭ శ్ర౪౪-౧౨ సుకృ౩౨-౫౬ వ౨౩-౩౨ శేషః౦-౪౮ రా౨౩-౫౪ స్మార్తఏకాదశి గోపద్మవ్రతారంభః వేదాంతదేశికర్తిర్భు౨-౧౩చ౮ [గో౧౨వడశీతిముఖః౫౬-౪౩కువేరాక్రాంభు౨-౨౩చ౯ |
| 30 | ౧౫ | ౨౬ | ద్వా॥ శ౪౬-౨౮ ధ౪౧-౨౭ ధృ౨౬-౨౫ బ౧౮-౪౩ రా౨౯-౩ అహః౨౯-౫౦హ౨ రవిః౧౬-౦ మధ్వరామానుజైకాదశి |
| 1 | ౧౬ | ౨౭ | త్రి॥ ఆ౪౨-౫౦ శ౩౯-౩౪ శూ౨౦-౨౮ కౌ౧౪-౩౯ శేషః౨-౪౩ రా౨౫-౩౫ భు౨-౩౩చ౧౦ |
| 2 | ౧౭ | ౨౮ | చ॥ సో౪౦-౨౦ పూభా౩౮-౪౧ గ౧౫-౧౧ గ౧౧-౩౫ త్యాజ్యాభావః భు౨-౪౪చ౧౧ [క్రీడ,రాకారవేభు౨-౫౪చ౧౨ |
| 3 | ౧౮ | ౨౯ | పూ○మ౩౮-౫౪ ఉభా౩౮-౫౪ వృ౧౦-౪౮ భ౯-౩౭ ది౨-౪౭ అహః౨౯-౪౨హ౩ రవిః౩౮-౫౧ కౌముదీపూజా అక్ష |
| 4 | ౧౯ | ౩౦ | కృ॥ ప్ర॥ బు౩౮-౪౨ రే౪౦-౯ ధృ౭-౨౧ బా౮-౪౮ ది౯-౩౬ త్యా౪-౬ యాగః భు౩-౫చ౧౩ |
| 5 | ౨౦ | ౧ | ద్వి॥ గు౩౯-౪౮ అ౪౩-౦ వ్యా౪-౫౬ తై౯-౧౫ రా౨-౫౬ త్యా౪-౧౧ భు౩-౧౫చ౧౪ |
| 6 | ౨౧ | ౨ | తృ॥ శు౪౨-౯ భ౪౬-౫౨ హ౩-౩౦ వ౧౧-౦ ది౮-౩౫ చంద్రోదయోమావ్రతంకేవేభు౩-౨౫చ౧౫ [చ౧౬ |
| 7 | ౨౨ | ౩ | చ॥ శ౪౫-౪ కృ౫౧-౫౧ వ౩-౦ బ౧౨-౫౫ ది౯-౨౨ త్యా౪-౨౦ అహః౨౯-౩౨హా౪ రవిః౧-౧౬ కువేశవేభు౩-౩౫ |
| 8 | ౨౩ | ౪ | ప॥ ఆ౫౦-౬ రో౫౭-౪౧ సి౨-౯ కౌ౭-౫౪ రా౬-౧౫ త్యా౪-౨౩ భు౩-౪౫చ౧౭ |
| 9 | ౨౪ | ౫ | ష॥ సో౫౫-౧౫ మృ౬౦-౧౦ వ్య౪-౧౪ గ౨౨-౪౦ వ౧౩-౧౩ భు౩-౫౫చ౧౮ [క్షీరాన్నభోజనం భు౪-౫చ౧౯ |
| 10 | ౨౫ | ౬ | స॥ మ౬౦-౧౦ మృ౪-౧౩ వ౫-౪౦ భ౨౭-౫౮ ది౨౭-౩౦ త్యా౪-౨౬ అహః౨౯-౨౬చి౧ రవిః౨౩-౧౬ త్రిద్యుస్పృక్ |
| 11 | ౨౬ | ౭ | స॥ బు౦-౩౩ ఆ౧౦-౪౬ ప౭-౮ బ౦-౩౩ రా౧౪-౨౯ గురుమౌఢ్యనివృత్తిః భు౪-౧౫చ౨౦ |
| 12 | ౨౭ | ౮ | అ॥ గు౫-౪౦ పు౧౬-౫౬ శి౮-౨౮ కౌ౫-౪౦ ర౯-౩౪ త్యా౪-౨౨ భు౪-౨౫చ౨౧ |
| 13 | ౨౮ | ౯ | న॥ శు౯-౫౩ పు౨౨-౩౨ సి౯-౨౮ గ౯-౫౩ రా౨౮-౦ త్యా౪-౨౦ అహః౨౯-౧౮చి౨ రవిః౪౪-౫౪ భు౪-౩౫చ౨౨ |
| 14 | ౨౯ | ౧౦ | ద॥ శ౧౩-౪౦ ఆ౨౭-౩౨ సా౯-౨౩ భ౧౩-౪౦ శేషః౧-౩౨ రా౩౦-౦ త్యా౪-౧౪ [కువేరావేభు౪-౪౫చ౨౩ |
| 15 | ౩౦ | ౧౧ | ఏ॥ ఆ౧౫-౪౯ మ౩౦-౪౯ శు౮-౨౬ బా౧౫-౪౯ శేష౩-౨౩ రా౨౨-౨౨ త్యా౪-౯ ద్వాదశీతిథిః సర్వేషాం౧౧శవేక్రాం |
| 16 | ౩౧ | ౧౨ | ద్వా॥ సో౧౬-౩౯ పూఫ౩౨-౫౭ శు౬-౩౧ తై౧౬-౩౯ రా౨౨-౦ త్యా౪-౩ త్రయోదశీతిథిభు౫-౫చ౨౫ [భు౪-౫౫చ౨౪ |
| 1 | ౧ | ౧౩ | త్రి॥ మ౧౬-౩౨ ఉఫ౩౩-౩౭ బ్ర౩-౪౫ ఐ౫౬-౧౪ వ౧౬-౩౨ రా౨౫-౩౩ అహః౨౯-౮చి౩ తురవిః౬-౨ చతుర్దశీతిథిః విషువత్పుణ్యకాలః మాసశివరాత్రిః నరక౧౪, కృష్ణాంగారక౧౪ అనష్యయనరయమతర్పణంభు౫-౧౫చ౨౬ |
| 18 | ౨ | ౧౪ | చతు॥ బు౧౫-౦ హ౩౩-౪౪ వై౫౫-౨౬ బ౧౫-౦ రా౨౪-౧౮ ఆగ్రయణారంభః దర్శతిథిః దీపావళి ఘూర్జరవత్సరాదిః ధనలక్ష్మీపూజా కేదారవ్రతం సినీవాలీభుం౦-౧౦చ౨౭ [యజ్ఞరక్రాంభుం౦-౨౧చ౨౮ |
| 19 | ౩ | ౧౫ | అమా● గు౧౨-౨౩ చి౩౬-౨౭ వి౪౯-౪౭ నా౧౨-౨౩ రా౧౭-౦ పద్మకయోగః స్వాత్యభ్యంగస్నానంయాగః పిండపితృ |

1933 సం॥ అక్టోబరు నెల

| | | | | |
|---|---|---|---|---|
| కుజచారః | ౪శ॥హ౩బు౪౫-౪౬ | ౭మ॥స్వా౩బు౪౫-౧౨ | ౪శ॥స్వా౪శు౪౯-౫ | ౧౨సో॥ అనూ౪శుక్రః౩౭- [౫౧ |
| శు౫ఆ॥వి౩కు౨౩-౧౨ | ౬సో॥హ౪బు౪౬-౪౦ | ౯శు॥స్వా౪బు౧౬-౨౧ | ౭మ॥విశా౧శు౩౮-౩౭ | |
| ౧౧శు॥విశ్వృకు౧౫-౧౦ | ౮బు॥చి౧బు౪౪-౧౭ | ౧౧ఆ॥వి౧బు౪౧-౨౦ | ఆశ్వయుజమాసః | ౩౦శు॥జ్యే౧శుక్రః౩౩-౬ |
| ౧౫మ॥అనూ౧కు౪౨-౨౦ | ౧౧శు॥చి౨బు౪౪-౫౦ | ౧౪బు॥వి౨బు౫-౧౪ | ౧౧శు॥వి౨శు౨౯-౧౭ | శనిచారః |
| బు౫ఆ॥అనూ౨కు౪౨-౧౩ | పశ్చాదుదయంబు౧౫-౪౧ | గురుచారః | ౧౪సో॥వి౩శు౧౯-౦ | శు౬సో॥శ౨(వ)శనిః౧౫-౦ |
| ౬సో॥ధనురయనగః కు౫ | ౧౩ఆ॥చి౩తులబు౫౯-౫౯ | శు౬సో॥హస్తా౧గురుః౫-౦ | బ౨గు॥విశ్వృశు౮-౫౦ | బ౯శు॥శనివక్రత్యాగః |
| ౯శు॥అనూ౩కు౨౪-౩౦ | బ౧బు॥చి౪బు౧౧-౪౭ | బ౭మ॥హస్తా౨గురుః౯-౧౧ | ౫ఆ॥అనూ౧శు౧-౧౦ | [౫౨-౫౨ |
| ౧౪బు॥అనూ౪కు౪-౧౦ | ౩శు॥వృశ్చికాయన౧౦-౧౪ | ౭బు॥ప్రాగుదగురు౨౪-౫౦ | ౭మ॥అనూ౨శు౫౩-౦ | రాహుకేతుచారా |
| బుధచారః | స్వా౧బు॥౯-౫౩ | శుక్రచారః | ౭బు॥ధనురాయగశు౭-౧౩ | బ౧బు॥ధని౩రాహుః |
| శు౨గు॥హస్తా౨బు౫౦-౪౨ | ౫ఆ॥స్వా౨బు౩౪-౨౩ | శు౨గు॥స్వా౩శుక్రః౦-౧౩ | ౯శు॥అనూ౩శుక్రః౪౫-౩౪ | మఘా౧కేతుః౩౧-౫౦ |

1933 సం॥ అక్టోబరు నెల — ౧౩౪౩ ఫ॥ — సౌ॥ తులామాసము

| తేది | | | |
|---|---|---|---|
| 20 | ౪ | ౧౬ | శు॥ ప్రా॥ శు౮-౪౯ స్వా౩౦-౧౬ స్థిర౩-౨౭ బవ-౪౯ రా౧౪-౩౪ అహః౨౯-౪ చిత్రా౪ రవిః౨౬-౪౫ కార్తికస్నానవ్రతారంభః గోక్రీడనం యమ౨ చంద్రోదయః ఉత్తరశృంగః భుం-౩౨చ౨౯ |
| 21 | ౫ | ౧౭ | ద్వి॥ శ౪-౨౩ విశా౫౫-౨౨ ౨౭-౧౭ ఆ౩౬-౩౨ కౌ౪-౨౩ రా౭-౪౧ అవమ త్రిలోచనగౌరీవ్రతం రావేభుం-౪౩చ౧ |
| 22 | ౬ | ౧౮ | చ॥ ఆ౫౩-౪౨ అ౨౩-౪౨ సౌ౨౯-౧౦ వ౨౭-౮ రా౭-౫౨ త్యా౩-౪౪ నాగచతుర్థీ మూర్వాగణపతివ్రతం సంక్రాంభుం-౫౪ |
| 23 | ౭ | ౧౯ | ప॥ సో౪౭-౪౨ జ్యే౧౯-౪౨ శో౨౧-౨౯ బ౨౦-౪౨ త్యాజ్యాభావః అహః౨౮-౫౪ స్వా౧ స్త్రీపుం॥ పూర్ణజల॥ రవిః౪౭-౫ వృశ్చికాయనం౫౧-౧౫ ఘాతవస్త్రధారణం భు౧-౫చ౩ [తిర్ భు౧-౧౫చ౪ |
| 24 | ౮ | ౨౦ | ష॥ మ౪౧-౩౮ మూ౧౫-౩౦ అ౧౩-౩౯ కౌ౧౪-౪౦ ది౧౧-౪౭ త్యా౩-౪౩ రా౯-౨౨ వహ్నిపూజా మననాళ్ మహాముని |
| 25 | ౯ | ౨౧ | స॥ బు౩౫-౪౩ పూషా౧౧-౨౦ సు౧౫-౫౦ ధృ౫౨-౧౭ గ౮-౪౧ రా౧-౧౪ సేనై మొదలితిర్ భు౧-౨౬చ౫ |
| 26 | ౧౦ | ౨౨ | ఆ॥ సు౩౦-౫౬ ఉషా౭-౨౨ శూ౫౦-౪౪ భ౨-౫౪ ది౧౬-౪౭ గోష్టాష్టమి పేయాళ్వార్ తిర్ అనధ్యాయః భు౧-౩౭చ౬ |
| 27 | ౧౧ | ౨౩ | న॥ శు౨౪-౫౯ శ్ర౩-౪౭ గం౪౩-౫౦ కౌ౨౪-౫౯ ది౧౩-౨౨ అహః౨౮-౪౪ స్వా౨ రవిః౭-౨ నవమీతిథిః కృతయుగాదిః విష్ణుత్రిరాత్రవ్రతం పూధత్తాళ్వార్ తిర్ శుక్రాంభు౧-౪౮చ౭ [భు౧-౫౯చ౮ |
| 28 | ౧౨ | ౨౪ | ద॥ శ౨౦-౪౨ ధ౦-౫౮ శ౫౭-౩ వృ౩౭-౪౦ గ౨౦-౪ ది౧౯-౧౫ తిథిద్వయం వేదనిధితీ॥ పు॥ పేయాళ్వార్ తిర్ రవే |
| 29 | ౧౩ | ౨౫ | ఏ॥ ఆ౧౭-౧౬ పూభా౫౭-౨౭ ధృ౩౨-౧౬ భ౧౭-౧౬ ౭౧౪-౧౬ ద్వాదశీతిథిః సర్వేషాంబోధనైకాదశీ తులసీపద్మవ్రతం భీష్మపంచకవ్రతం భు౨-౧౦చ౯ [మన్వాదిః బిల్వ౧౨ లక్ష్మీరాభిపూజ భు౨-౨౧చ౧౦ |
| 30 | ౧౪ | ౨౬ | ద్వా॥ సో౧౪-౨౧ ఉభా౫౭-౨౩ వ్యా౨౭-౨౮ బా౧౪-౨౧ ది౨౧-౨౭ అహః౨౮-౩౮ స్వా౩ రవిః౨౬-౩౮ స్వాయంభువ |
| 31 | ౧౫ | ౨౭ | త్ర॥ మ౧౩-౨౪ రే౫౮-౩౦ హ౨౩-౪౩ తై౧౩-౨౪ ది౨౭-౫౬ వైకుంఠ౧౪ అనధ్యాయః భు౨-౩౧చ౧౧ |
| 1 | ౧౬ | ౨౮ | చ॥ బు౧౩-౨౭ అ౬౦-౧౦ వ౨౧-౦ వ౧౩-౨౭ రా౨౨-౧౫ మహాకార్తికి జ్వాలాతోరణం స్త్రీణాంచంద్రదర్శనం కేశబంధనగౌరీవ్రతం ధాత్రీవ్రతం భు౨-౪౨చ౧౨ |
| 2 | ౧౭ | ౨౯ | పూ○ గు౧౪-౨౭ అ౧-౧౪ సి౧౯-౪౦ బ౧౪-౨౭ ది౨౬-౩౮ అహః౨౮-౩ స్వా౪ రవిః౪౫-౫౪ సింధుస్నానం దత్తసావర్ణికమన్వాదిః అన్వాధానం భు౨-౫౩చ౧౩ [ఈం యాగకాలః భు౩-౪చ౧౪ |
| 3 | ౧౮ | ౩౦ | కృ॥ ప్రా॥ శు౧౭-౩ భర-౫౪ వ్య౧౮-౨౦ కౌ౧౭-౩ రా౮-౪౮ ద్వితీయాతిథిః కృత్తికాదీపోత్సవః రామతేః త్రేజ్వాలాతోర |
| 4 | ౧౯ | ౧ | ద్వి॥ శ౨౦-౪౩ కృ౯-౩౯ వ౧౮-౨౨ గ౨౦-౪౩ రా౨౫-౪ శూన్యతిథిః చాతుర్మాస్యద్వితీయా శవేభు౩-౧౫చ౧౫ |
| 5 | ౨౦ | ౨ | తృ॥ ఆ౨౫-౨౨ రో౧౫-౨౬ ప౧౯-౧౦ భ౨౫-౨౨ రా౨-౨౫ త్యా౪-౨౪ తృతీయాతిథిః భు౩-౨౬చ౧౬ |
| 6 | ౨౧ | ౩ | చ॥ సో౩౦-౧౯ మృ౨౧-౩౩ శి౨౦-౨౩ బా౩౦-౧౯ రా౧౬-౨౫ అహః౨౮-౨౬ విశా౧ రవిః౫-౩౭ చతుర్థీతిథిః విద్యానిధి తీ॥ పు॥ భు౩-౩౭చ౧౭ |
| 7 | ౨౨ | ౪ | ప॥ మ౩౫-౪౬ ఆ౨౮-౬ సి౨౧-౩౯ కౌ౩-౨ త్యాజ్యాభావః భు౩-౪౮చ౧౮ |
| 8 | ౨౩ | ౫ | ష॥ బు౪౦-౫౫ పు౩౪-౩౦ సా౨౨-౫౭ గ౮-౨౦ ది౧-౧౮ రా౨౮-౬ త్యా౪-౨౩ భు౩-౫౯చ౧౯ [అహః౨౮-౨౦ విశా౨ రవిః౨౨-౫౮ భు౪-౧౦చ౨౦ |
| 9 | ౨౪ | ౬ | స॥ గు౪౫-౨౬ పు౪౦-౧౮ శు౨౩-౪౮ భ౧౩-౧౦ శేషః౦-౩౯ పునస్త్వా॥ భా॥ |
| 10 | ౨౫ | ౭ | ఆ॥ శు౪౯-౩ ఆ౪౫-౧౪ శు౨౪-౧౦ బా౧౭-౧౫ ది౧౪-౫౮ త్యా౪-౨౦ అనధ్యాయః రాజ్ఞే భు౪-౨౧చ౨౧ [చ౨౨ |
| 11 | ౨౬ | ౮ | న॥ శ౫౧-౨౬ మ౪౯-౩ బ్ర౨౩-౧౫ తై౨౦-౧౫ ది౭-౮ శవే శుక్రాం భు౪-౩౨ |
| 12 | ౨౭ | ౯ | ద॥ ఆ౫౨-౩౩ పూఫ౫౧-౪౧ ఐ౨౧-౪౯ వ౨౨-౦ ది౯-౫౬ త్యా౪-౧౦ అహః౨౮-౧౪ విశా౩ రవిః౪౧-౨ భు౪-౪౩చ౨౩ |
| 13 | ౨౮ | ౧౦ | ఏ॥ సో౫౨-౨౦ ఉఫ౫౩-౦ వై౧౯-౧౫ బ౨౨-౨౭ ది౧౦-౫౪ త్యా౪-౫ సర్వేషాం౧౧ భు౪-౫౪చ౨౪ |
| 14 | ౨౯ | ౧౧ | ద్వా॥ మ౫౦-౫౧ హ౫౩-౩ వి౧౫-౪౦ కౌ౨౧-౩ ది౧౪-౦ త్యా౪-౦ దగ్ధః భు౫-౫చ౨౫ [౧౬చ౨౬ |
| 15 | ౩౦ | ౧౨ | త్ర॥ బు౪౮-౧౩ చి౫౧-౫౮ ప్రీ౧౧-౧౦ గ౪౯-౩ ది౨౧-౪౧ త్యా౩-౫౬ అహః౨౮-౮ విశా వృశ్చికేరవిః౫౮-౫౦ భు౫- |
| 16 | ౧ | ౧౩ | చ॥ గు౪౪-౩ స్వా౪౯-౫౩ ఆ౫-౫౦ సౌ౫౪-౬ భ౧౬-౨౩ ది౫-౩ త్యా౩-౫౨ త్రేతాయుగాంతః హరిపదపుణ్యకాలః మాసశివరాత్రిః భుం-౨చ౨౭ [౦-౧౩చ౨౮ |
| 17 | ౨ | ౧౪ | అమా ● శు౪౦-౨౫ వి౪౭-౦ శో౫౩-౨చ౧౨-౧౭ ది౩-౧౩ రా౨౮-౨౩ అన్వాధానం పిండపితృయజ్ఞః కుహూః రావేభు |

1933 సం॥ నవంబరు నెల — ౧౩౪౩ ఫ॥ — సౌ॥ వృశ్చికమాసము

| | | | |
|---|---|---|---|
| | | | |
| రా | బ౧౩ బుధ్వరవి<br>బ౭ గురుధనుర్మీకుజ | | |
| శ | కు౫సో వృశ్చిబు<br>కు౧౩ మధనుకు | | కే |
| | కు కు | ర బు | |

| కుజచారః | బుధచారః | ౧౯ అ॥ పశ్చాదస్తంబుధః | శుక్రచారః | మకరాయనగతశ్శుక్రః ౩౪-౪౭ |
|---|---|---|---|---|
| శు౪ ఆ॥ జ్యే౧ కు౩౯-౩౭ | శు౧ కు॥ విశా౩ బు౪౩-౬ | [౪౦-౫౧ | కు౪ ఆ॥ జ్యే౨ శు౨౮-౫౬ | |
| ౯ గు॥ జ్యే౨ కు౧౬-౫ | ౫ సో॥ విశా౪ వృ బు౨౯-౨౯ | ౧౨ మ॥ అనూ౨ బు౨-౫౪ | ౭ బు॥ జ్యే౩ శు౨౫-౩ | ౭ గు॥ మూ౪ శు౨౦-౫౫ |
| ౧౩ మ॥ జ్యే౩ కు౪౮-౧౮ | ౮ గు॥ అ౧ బు౨౬-౫౫ | ౧౪ గు॥ అనూ౧ బు౮-౨౮ | ౧౦ శ॥ జ్యే౪ శు౨౧-౨౯ | ౧౦ ఆ॥ పూషా౧ శు౨౮-౨౪ |
| బ౩ ఆ॥ జ్యే౪ కు౨౧-౧౦ | ౧౧ ఆ॥ అ౨ బు౩౦-౭ | గురుచారః | ౧౩ మ॥ మూ౧ ధనుః శుక్రః | ౧౩ బు॥ పూషా౨ శు౨౯-౩౮ |
| ౭ గు॥ మూ౧ కు౪౬-౨౦ | ౧౫ గు॥ అ౩ బు౨౮-౨౫ | శు౭॥ బుధః హస్త౩ గురుః | [౨౦-౧౧ | శనిచారః |
| ౧౨ మ॥ మూ౨ కు౭-౧౮ | బ౭ గు॥ బుధ వక్రారంభః | [౫౪-౧౧ | బ౧ శు॥ మూ౨ శు౧౯-౧౬ | శు౧౫ గు॥ శ౩ బు శ౨౪-౧౬ |
| | [౫౩-౨౪ | బశ౪॥ హా౪ గు౧౮-౫౨ | ౪ సో॥ మూ౩ శు౧౯-౪౯ | రాహుకేతుచారౌ నస్తః |

1934–౫ సం॥ జనవరి నెల

| తేది | | | |
|---|---|---|---|
| 16 | ౩ | ౧౫ | శు॥ప్ర॥మం౨౭-౨౦ఉషా౭-౩౪వ౩౭-౨౦బ౨౭-౨౦దిన౭-౧౪ ప్రతిపత్తిథిః, మాఘస్నానారంభః, చంద్రోదయః, దక్షిణశృంగః, యాగః భుం-౨౧చ౨౯ [భుం-౩౦చ౧ |
| 17 | ౪ | ౧౬ | ద్వి॥బు౨౧-౫౦శ్ర౩-౪౫సి౩౦-౧౧కౌ౨౧-౫౦దిన౩-౧౨అహః౨౭-౫౨ఉషా౩౪వి౫-౫౪ ద్వితీయాతిథిః శ్రక్రాం |
| 18 | ౫ | ౧౭ | తృ॥గు౧౭-౯౭ధం-౨౬శ౫౭-౯వ్య౨౩-౯గ౧౭-౧౭దిన౭-౩ అతిథిద్వయంకుక్రాంభుం-౪౦చ౨ |
| 19 | ౬ | ౧౮ | చ॥శు౧౩-౧౧పూభా౫౫-౪౧వ౧౪-౨భ౧౩-౧౧వి౧౩-౩ పంచమీతిథిః,కుందచతుర్థీ భుం-౪౯చ౩ |
| 20 | ౭ | ౧౯ | పం॥శ౧౦-౪ఉభా౫౪-౫౮ప౧౧-౮బా౧౦-౪దిన౯-౨౩త్యా౩-౫౭ అహః౨౭-౫౪ ఉషా౪ రవిః౧౮-౫౦ కుంభాయనం౪౩-౦మదనపంచమీ భుం-౫౯చ౪ [శ్రీరామానందతీ॥భు౧-౯చ౫ |
| 21 | ౮ | ౨౦ | ష॥ఆ౭-౫౬రే౫౫-౧౬శి౬-౩౧తై౭-౫౬ది౨౫-౧౬త్యా౪౯-౧వై వస్వతమన్వాదిః, |
| 22 | ౯ | ౨౧ | స॥సో౭-౪అ౫౬-౫౧సి౨-౪౪సా౫౬-౫౨వ౭-౪రా౧౮-౩౪సోపపదం, రథ సూర్యచంద్రవ్రతం, భీష్మాష్టమీ, భీష్మపంచకం, ఉభయానధ్యాయః భు౧-౧౮ |
| 23 | ౧౦ | ౨౨ | అ॥మం౭-౨౫భ౫౯-౩౬శు౫౭-౪౬బ౭-౨౫ది౨౧-౫౭అహః౨౮ శ్రీ౧రవి౩౪-౫౦ |
| 24 | ౧౧ | ౨౩ | న॥బు౯-౪కృ౬౦-౧౦శు౫౬-౫౫కౌ౯-౪౮౩-౪౩కువే భు౧-౩౮చ౮ [భు౧-౨౮ |
| 25 | ౧౨ | ౨౪ | ద॥గు౧౧-౫౮కృ౩-౫౮బ్ర౫౬-౫౯గ౧౧-౫౮రా౧౯-౧౭సుదశావ్రతం భు౧-౪౭ |
| 26 | ౧౩ | ౨౫ | ఏ॥శు౧౫-౫౭రో౯-౩౫౫౭-౪భ౧౫-౫౭ది౨౪-౨౭అహః౨౮-౬శ్రీ౨రవి౫౧-౬ ద్వాదశీతిథిః, సర్వేషాం భీష్మైకాదశీ, తిలపద్మవ్రతం భు౧-౫౭చ౧౦ |
| 27 | ౧౪ | ౨౬ | ద్వా॥శ౨౦-౪౯మృ౧౫-౦వై౫౮-౫౪బా౨౦-౪౯రా౧౦-౬శూన్యతిథిః, సోపపదం, శనిత్రయోదశీ, భీష్మద్వాదశి |
| 28 | ౧౫ | ౨౭ | త్ర॥ఆ౨౬-౧౦ఆ౨౧-౨౬వి౬౦-౧౦తై౨౬-౧౦రా౨౬-౩౩ త్రయోదశీతిథిః భు౨-౧౬చ౧౨ [భు౨-౭చ౧౧ |
| 29 | ౧౬ | ౨౮ | చతు॥సో౩౧-౩౮పు౨౮-౦వి౦-౨౪వ౩౧-౩౮రా౨౧-౫౦త్యా౪-౨౫ అనధ్యయన ౩ శ్రీహంసద్వీపక్షేత్రే వేణుగోపాల కల్యాణోత్సవః భు౨-౨౬చ౧౩ |
| 30 | ౧౭ | ౨౯ | పూ○మ౩౬-౪౩పు౩౪-౧౪ప్రీ౧-౩౮భ౪-౧౧త్యాజ్యాభావః అహః౨౮-౧౪ శ్రీ౩రవిః౭-౧౪ సింధుస్నానం, తిలపాత్రకంచుకకంబళాదిదానాని, శుక్రమౌఢ్యారంభః, చంద్రగ్రహణం భు౨-౩౫చ౧౪ |
| 31 | ౧౮ | ౩౦ | కృ॥ప్ర॥బు౪౧-౪ఆ౩౯-౪౮ఆ౨-౩౦బా౮-౨౫ది౯-౧౦యాగః శువే, శవే భు౨-౪౫చ౧౫ |

1934–౫ సం॥ ఫిబ్రవరి నెల

| తేది | | | |
|---|---|---|---|
| 1 | ౧౯ | ౧ | ద్వి॥గు౪౩-౫౩మ౪౪-౨౪సౌ౩-౫తై౧౨-౨౯దిన౨-౧౬తిరుముడిశయాళ్వార్ తిర్ వేభు౨-౫౫చ౧౬ |
| 2 | ౨౦ | ౨ | తృ॥శు౪౬-౩౩పూఫ౪౭-౫౨శో౨-౫వ౧౫-౧౩ది౫-౩౩అహః౨౮-౨౦శ్రీ౪రవి౨౩-౪౮భు౩-౪చ౧౭ |
| 3 | ౨౧ | ౩ | చ॥శ౪౭-౨౪ఉఫ౫౦-౦అం-౩౨సు౫౭-౪౦బ౧౬-౫౮ది౬-౩౧త్యా౪-౯భు౩-౧౪చ౧౮ |
| 4 | ౨౨ | ౪ | పం॥ఆ౪౬-౫౬హ౫౧-౫ధృ౫౪-౩౮కౌ౧౭-౧౦ది౧౧-౨౨హస్తార్క యోగః, కూరత్తాళ్వార్ తిర్ భు౩-౨౩చ౧౯ |
| 5 | ౨౩ | ౫ | ష॥సో౪౫-౧౧చి౫౦-౪౯శూ౪౯-౪౧గ౧౬-౩ది౧౧-౦అహః౨౮-౨౬ధని౧రవిః౪౦-౩౧భు౩-౩౨చ౨౦ |
| 6 | ౨౪ | ౬ | స॥మం౪౨-౧౯స్వా౪౯-౨౯గ౪౪-౪౪భ౧౩-౪౫ది౪-౩ త్యా౩-౫౫తిస్రష్టకాః కువే భు౩-౪౧చ౨౧ |
| 7 | ౨౫ | ౭ | అ॥బు౩౮-౩౧వి౪౭-౧౨వృ౩౮-౩౨బా౧౦-౨౫ది౩-౦రా౨౮-౧౦సీతాష్టమీ అనధ్యాయః శవేరావే భు౩-౫౦చ౨౨ |
| 8 | ౨౬ | ౮ | న॥గు౩౩-౫౬అ౪౪-౧౪ధృ౩౧-౪౬తై౬-౧౪శేషః౦-౩౦రా౨౮-౪౫అహః౨౮-౩౨గ౨రవిః౫౭-౨౬కేవే భు౪-౦ |
| 9 | ౨౭ | ౯ | ద॥శు౨౮-౪౦జ్యే౪౦-౩౩వ్యా౨౪-౩౧వ౧-౧౮శేషః౧-౬పునస్త్యాజ్యాభావః, దశమీతిథిః భు౪-౯చ౨౪ [చ౨౩ |
| 10 | ౨౮ | ౧౦ | ఏ॥శ౨౩-౨మూ౩౬-౩౧హ౧౬-౫౫బా౨౩-౨౮౪-౧౧రా౩౦-౧౩ఏకాదశీతిథిః, సర్వేషాం౧౧భు౪-౧౯చ౨౫ |
| 11 | ౨౯ | ౧౧ | ద్వా॥ఆ౧౭-౩పూషా౩౨-౨౧వ౯-౮తై౧౭-౩శేషః౨-౩౪రా౨౨-౧౮తిథిద్వయం, సావిత్రీకల్పః, శుక్రమౌఢ్యనివృత్తిః దగ్ధః భు౪-౨౮చ౨౬ [తిథిః, కలియుగాంతః, హరిపదపుణ్యకాలః, మహాశివరాత్రిః భు౪-౩౭చ౨౭ |
| 12 | ౧ | ౧౨ | త్ర॥సో౧౧-౧౧ఉషా౨౮-౧౨సి౧-౪వ్య౫౨-౧౧వ౧౧-౧౧రా౮-౫౨అహః౨౮-౪౦ధ౩ కుంభేరవిః౧౪-౨౬చతుర్దశీ |
| 13 | ౨ | ౧౩ | చతు●మ౫-౨౮ఏష్యా౫౪-౨౭శ్ర౨౪-౨౦వ౪౫-౫౦శ౫-౨౮రా౫-౨ద్వాపరయుగాదిః, అవమపద్మకయోగః అన్వాధానం, పిండపితృయజ్ఞః, సినీవాలితిథిః భుం-౬చ౨౯ |

| | | | |
|---|---|---|---|
| | | | |
| | బ౩సో కుంభే రవిః<br>శు౧౧శు కుంభే కుజః<br>బ౩శు కుంభే బుధః<br>బ౩శు తులా గురుః<br>బ౧౩సో కన్యావక్రీగు | కే | |
| ర కు బు<br>శ రా శు | | | |
| | | గు | |

| కుజచారః | బుధచారః | | | |
|---|---|---|---|---|
| కు౨బ॥ధ౧కుజః౫౩-౩ | శు౧మ॥ఉషా౨మబు | బ౧బ॥ధ౨బు౪౦-౪౯ | బ౧౦శు॥గురువక్రారం | ౧౧శ॥శ౩వశు౫౩-౨ |
| ౭సో॥ధ౨కు౬-౪౮ | [౧౪-౩౪ | ౩శు॥ధ౩కుంబు౪౪-౩౩ | [౮-౩౨ | ౧౨ఆ॥ప్రాగుదితుః౧౫-౧౦ |
| ౧౧శు॥ధ౩కుంకు౨౦-౪౮ | ౩సు॥ఉషా౩బు౧౭-౪౫ | ౫ఆ॥ధ౪బు౩౩-౩౩ | బ౧౩సో॥చి౨కన్యావగురుః | శనిచారః |
| పశ్చాదస్తంకుజః౧-౧౦ | ౫శ॥ఉషా౪బు౧౫-౪౫ | ౭మ॥శత౧బు౨౪-౪౩ | [౪౬-౪౧ | శు౬ఆ॥ధ౧శనిః౧౮-౨౨ |
| ౧౫మ॥ధ౪కుజః౩౫-౪౯ | ౭సో॥శ౧బు౧౬-౨౪ | ౮బుపశ్చాదుదయం౪౬-౦ | శుక్రచారః | శు౭సో॥పశ్చాదస్తంశ |
| బ౫ఆ॥శత౧కు౧౩-౪౮ | ౯బు॥శ౨బు౧౧-౪౫ | ౯గు॥శత౨బు౨౪-౩౮ | శు౪శు॥ధ౨మవశు౩౬-౨౭ | [౨౭-౧౮ |
| మీనాయనగ కుజ౩౫-౫౨ | ౧౧శు॥శ౩బు౯-౪౪ | ౧౧శ॥శత౩బు౨౧-౮ | ౧౩ఆ॥ధని౧వశు౫౧-౧౦ | రాహుకేతుచారౌ |
| బ౯గు॥శత౨కు౮-౫ | ౧౩ఆ॥శ౪బు౩-౯ | ౧౩సో॥శత౪బు౩౬-౪౦ | ౧౫మ॥పశ్చాదస్తంశు | బ౨గు॥ధని౧రాహుః |
| ౧౩సో॥శత౩కు౧౬-౯ | ౧౪సో॥ధ౧బు౫౮-౫౫ | గురుచారః | [౨౫ ౪౬ | ఆ౧ శ్రే౩ కేతు ౩౪-౧౦ |
| | | బ౩శు॥చి౩తులగురు౫౩-౬ | బ౪శ॥శత౪శు౧-౧౬ | |

ఓం

# ప్రస్తావన

ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే,
నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయే నమః.

శ్రీ పరమాత్మ ప్రవర్తమానం బగుచున్న అనంత విశ్వప్రవృత్తియందు భూమియందు కాల మహా తరంగములం దొక చాంద్రాయణము గతించినది భూగోళస్థులకు కాలపరిగణనమునకు సమీపమునందుగల చంద్రుని గతులు సులభగ్రాహ్యములు చంద్రగ్రహము భూమికి ౨,౩౮,౦౦౦ మైళ్లదూరమందు గలదు చంద్రగ్రహము గంటకు ౨,౧౬౦ మైళ్లచొప్పున నాకాశమార్గము నందు సంచారము చేయుచు ౨౯ దినములు ౧౨ గంటలు ౪౪ నిమిషములు 3 క్షణములకాలమునం దమావాస్య నుండి పాడ్యమివరకును భూప్రదక్షిణము చేయుచున్నది ఆచారకర్మానుష్ఠానములకు చంద్రగ్రహగతు లాదికాలమునుండియును సాధనములుగ నేర్పడినవి. కాలపరిగణనమునకు దివారాత్రములకు ప్రత్యక్షప్రమాణముగనున్న సూర్యగ్రహము సాధనముగ నున్నది భూగోళము క్షణమునకు ౧౮½ మైళ్లచొప్పున నాకాశమార్గమున నిత్య ప్రదక్షిణమును, ౨౩ గంటలు ౫౬ నిమిషములు సూర్య ప్రదక్షిణము చేయు చున్నది. ఆకాశమార్గము నందు భూకక్ష్య (Orbit) యందు నిత్యమును, సంవత్సరమును భూగోళముచేయు ప్రదక్షిణములు కాలనిర్ణయములు సూర్యోదయాస్తమయములు భూదిన ప్రదక్షిణములు కాలనిర్ణయమున కాధారములు కాల గ్రహణమునందు సూర్యోదయాస్తమయములు ప్రధానము లైనను భూమ్యక్షము, భూసంభ్రమణమార్గము నిత్యప్రదక్షిణమునందు భేదములను గల్పించుచున్నవి. అనంతమైన స్థలవిభేదము లనంతము లైన కాలవిభేదములను గలుగజేయుచున్నవి.

సూర్యమండలమునందు భూమి యొక్క సామాన్య గ్రహము సూర్యగ్రహము భూమికి ౯,౨౯,౧౦,౦౦,౦౦౦ దూరమునందున్నది, 3,33,౪3౨ రెట్లు పెద్దది క్షణమునకు ౧,౮౬,౦౦౦ మైళ్ల చొప్పున ప్రసరించుచున్న కాంతికిరణము భూమిని చేరుటకు ౪౯౯ క్షణములు కావలయును. రవి మండలమునందు భూ చంద్ర గ్రహము వలె బుధుడు, శుక్రుడు, కుజుడు, గురువు, శని, యురేనసు, నెప్ట్యూను, ప్లూటో గ్రహములు కలవు రవిమండలమునం దుపగ్రహములును వందలుకలవు బ్రహ్మాండమునం దనంతములైన సూర్యమండలములు సూర్యగ్రహములు కలవు నభోమండలమునందు ౫౦,౦౦,౦౦,౦౦,౦౦౦ నక్షత్రములు కలవు తారలు, ధూమకేతువులు, తారాగుచ్ఛములు మొదలగు నక్షత్రప్రపంచ మనంతముగ నున్నది.

ఆకాశమండలమున కాకాశగంగాపథము కేంద్రస్థానముగ నున్నది నక్షత్రమండలము లాకాశగంగాపథమున కాకర్షింపబడుచున్నవి నభోమండలమునందలి ధ్రువస్థానములకన్నను, ఆకాశగంగాపథమునందు గల నక్షత్రగణములు దూరస్థములుగ నున్నవి ఆకాశగంగామార్గము నాశ్రయించుకొని అనంతములైన నభములు (Nebulae) గలవు నభములందు విశ్వములు గలుగుచున్నవి నభములు భూమికి ౨౦,౦౦,౦౦౦ కాంతిసంవత్సరముల దూరమున గలవు దూరస్థములైన నభములు,నభోగణములు భూమికి ౧౪,౦౦,౦౦,౦౦౦ కాంతిసంవత్సరముల దూరమునందు అనగా ౮౪౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦ మైళ్ల దూరమునందు గలవు. అనంతములైన రవిమండలములు,

నభోమండలములు,నభోవిశ్వములు, తారావిశ్వములు గల బ్రహ్మాండమున కాద్యంతములు, దేశకాల నిర్దేశములు దుర్గ్రాహ్యములు.

సకల బ్రహ్మాండములకును నాధారభూతమైన చిన్మూర్తి విశ్వాధిష్ఠాతయై, విశ్వమయుడై, విశ్వసాక్షియై, దిక్కాలాద్యనవచ్ఛిన్నుడై పరమాణువునందువలె బ్రహ్మాండమునందును సమవర్తియై యున్నాడు. సాపేక్షము లైన దేశకాలపాత్రముల సంస్మరణసంకీర్తనములు నిరపేక్షవిషయసంస్మరణమునకు సాధనములు. హిందువులు నిత్యకర్మానుష్ఠానసంకల్పమునందు జేసెడి దేశ కాల పాత్రల సంస్మరణమును నూతనసంవత్సరారంభమునందు జేసెడి పంచాంగశ్రవణమును నీపరమార్థగ్రహణమునకు నిదర్శనములు.

"శ్రీశంభోరాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరో ర్దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్య దక్షిణదిగ్భాగే, కృష్ణాకావేర్యోర్మధ్యదేశే, శ్రీముఖనామసంవత్సరే, ఉత్తరాయణే, వసంతఋతౌ, చైత్రమాసే, శుక్లపక్షే ప్రథమ్యాం, రేవతీనక్షత్రే, సోమవాసరే..........." అని చేసెడి దేశకాలసంకీర్తన మాత్మసంస్మరణమునకు సాధనముగ నున్నది. చైతన్యమహార్ణవమునందు బ్రహ్మాండములు, ద్వీపములు; కల్పములు, యుగములు, మన్వంతరములు, శకములు, సంవత్సరములు తరంగములు. నూతన సంవత్సరారంభమునందు పంచాంగ శ్రవణము, ధీమంతుల కాత్మసంస్మరణమునకు వినియోగపడగలదు. సనాతనము లైన ఆచారసంప్రదాయములును ధీమంతుల కాత్మోపలబ్ధికి వినియోగపడుచున్నవి ఆత్మసంస్మరణమునకు పంచాంగశ్రవణము సంవత్సరారంభమునందు సముచితముగ నున్నది

శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్నదోషాపహం,
గంగాస్నానవిశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్,
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతానసంపత్ప్రదం,
నానాకర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.

అనంతమైన కాలచక్రమునం దత్యంతపరిమితమును ప్రాచీనసంప్రదాయాచారావృతమును నైన శ్రీముఖపంచాంగ ఫలశ్రవణమును ధీమంతుల కాత్మసంస్మరణమునకు వినియోగపడుచున్నది.

ఆంగీరససంవత్సర మంత మొందినది. చాంద్రాయణమునందు చంద్రుడు మేషరాశిగతుడై, శ్రీముఖ సంవత్సర మారంభ మైనది. శాలివాహనశకాబ్దములు ౧౮౫౫, విక్రమార్కశకాబ్దములు ౧౯౮౭, క్రైస్తవ శకాబ్దములు ౧౯౩౩, ఫసలీశకాబ్దములు ౧౩౪౧, భరతశకాబ్దములు ౫౦౭౫, కలియుగాది సౌరాబ్దములు ౫౦౩౪, సృష్ట్యాదిసౌరాబ్దములు ౧౯,౫౫,౮౫,౫౩౪ గతించినవి. కలియుగారంభమునుండియును ౮౩ చాంద్రాయణపరివృత్తులు ముగిసి ౮౪-వ పరివృత్తియం దుసత్తమ సంవత్సరము శ్రీముఖసంవత్సరము ప్రారంభ మయినది. బ్రహ్మకల్పమునందు ద్వితీయపరార్థమునందు ప్రథమవర్షమునందు, ప్రథమమాసమునందు, ప్రథమపక్షమునందు, ప్రథమదివసమునందు ౧౩ ఘటికలు, ౪౨ విఘటికలు గతించినవి. అనంత మయిన బ్రహ్మాండమునందు భూగోళ మొకపరమాణువుగను, అనంతమైన కాలచక్రమునందు చాంద్రమానాబ్ద మొకక్షణముగను ఉన్నవి. మానవ సంకల్పవికల్పములందు పరమాణుక్షణసంస్మరణము ధీమంతుల కాత్మపరిజ్ఞానమునకు సాధనభూతముగనున్నది.

శ్రీముఖ సంవత్సరమునకు చంద్రుడు - రాజు, గణకుడు_ఫలము : - శుభము, సువృష్టి, జనసౌఖ్యము, వ్యాధిశమనము, సౌమ్యబుద్ధి; బుధుడు-సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి, దైవజ్ఞుడు, ఫలాధీశుడు-దుర్గేశుడు___ ఫలము :_లోక పీడ,సువృష్టి, జనసౌఖ్యము,జలసమృద్ధి, కుసుమతృణసమృద్ధి, అభయము, దైవజ్ఞఫలసాఫల్యము; గురువు-మంత్రి, గ్రామపాలకుడు___ ఫలము:-ధనధాన్య

శ్రీముఖ

సమృద్ధి, ప్రజాసౌఖ్యము, గ్రామసౌఖ్యము; రవి-సస్యాధిపతి, నీరసాధిపతి, పురోహితుడు—ఫలము:—సమార్ఘము, చోరభయము, యుద్ధము, వృష్ట్యభివృద్ధి, తామ్రచందన రత్నమాణిక్యాదుల అర్ఘవృద్ధి, సస్యార్ఘవృష్టి, గోద్విజాతుస్సౌఖ్యము; శుక్రుడు - ధాన్యాధిపతి — ఫలము:— సువృష్టి, గోధూమశాలీక్షుసస్యాభివృద్ధి; కుజుడు—రసాధిపతి—ఫలము:—ప్రజాక్షేమము, నరపతితాపము; శని పరీక్షకుడు, ధనాధిపతి—ఫలము:— పరీక్షకమందబుద్ధి, కృష్ణద్రవ్యసమృద్ధి, ధనవిరళము, వాణిజ్యక్షయము, కృషిపీడనము; గోపాలుడు-పశుపాలకుడు— ఫలము:—పశువృద్ధి, సుభిక్షము, సస్యార్ఘాభివృద్ధి, సువృష్టి, తృణజల సమృద్ధి. చాంద్రమానాబ్దసామాన్యఫలము సర్వసస్యాభివృద్ధి, రోగరాహిత్యము, విప్రులయధ్వర్యనిరతత్వము.

శ్రీముఖాబ్దేఽఖిలా ధాత్రీ సర్వసస్యార్ఘసంయుతా,
అధ్వరే నిరతా విప్రా వీతరోగా విపై రిణః.

రాజైన చల్లని చంద్రుడు, మంత్రియైనగురువు, ధాన్యాధిపతియైన శుక్రుడు శ్రీముఖసంవత్సరమునందు మహాదుఃఖవేదన ననుభవించుచున్న ప్రపంచమునకు శాంతిక్షేమములను సమకూర్తురు గాత!

ప్రపంచపరిస్థితులు దుఃఖమయముగ నున్న విధమును ప్రపంచేతిహాసములు సహస్రముఖముల బోధించుచున్నవి. మహాసామ్రాజ్యములవలె స్వల్పరాజ్యములును, సంపన్నరాజ్యములవలె బీదరాజ్యములును ప్రపంచావృతమైన దుఃఖవేదన ననుభవించుచున్నవి. పీఠాధిపతులు, తత్త్వజ్ఞులు, రాజనీతిజ్ఞులు, ఆర్థికపండితులు, శాస్త్రకోవిదులు, చరిత్రపరిశోధకులు, కలాభిజ్ఞులు, శాంతికాములు, స్వాతంత్ర్యప్రియులు ప్రపంచమునకాసన్నముగ నున్నమహోపద్రవమును భయంకరముగ వర్ణించుచు ప్రజాహృదయమునందు భయభ్రాంతులను గలుగజేయుచున్నారు. కాని తరణోపాయము మాత్రము మృగ్యముగ నున్నది. నానాజాతిసమితిసమావేశములు

ప్రపంచపరిస్థితులు

ఆయుధవిసర్జనసభలు, ఆర్థికమహాసభలు, ఋణ నిర్ణయసభలు సమావేశము లగుచున్నను లోకవ్యవహారములు పూర్వమువలెనే సాగుచున్నవి. గతించిన అయిదేండ్లయందును ప్రపంచమునందలి ధాన్యాదులపంటలు నూటికి ౬ చొప్పున వృద్ధి నొందినవి. లోహాదుల యుత్పత్తియును అభివృద్ధిని బొందినది. గతించిన పదేండ్లయందును ప్రపంచమందలి జనసంఖ్య ౧,౮౫,౦౦,౦౦,౦౦౦లకు పెరిగినది. ప్రపంచమునందు జనసంఖ్య అపరిమితిగ నభివృద్ధి నొందినను ప్రస్తుత ముత్పన్న మగుచున్న ధాన్యాదులు ౬,౦౦,౦౦,౦౦,౦౦౦ ప్రజలను పోషించుటకు తగ్గియున్నట్లు శాస్త్రజ్ఞులు నిర్ణయించు చున్నారు. ఆస్థితి భూగోళమునందు కల్గుటకు క్రీ. శ. ౨,౧౦౦ వరకును కావలసియున్నది. అయినను ప్రబలరాజ్యములు దుర్బలరాజ్యములను స్వయంరక్షణవ్యాజమున పీడించుచున్న విధము ప్రపంచోపద్రవమునకు మూలకారణముగ నున్నది. అన్ని రాజ్యములును స్వయంరక్షణార్థము సంగ్రామసన్నాహములకయి ఆదాయమునకు మించినవ్యయమొనరించుచు దేశాదాయమును సంపదల యుత్పత్తికి గాక సంపదల నాశనమునకు వినియోగించుచున్నవి.

ప్రపంచమునందలి మహారాజ్యములలో ప్రధానసంపన్నరాజ్యమైన అమెరికా సంయుక్త రాష్ట్రములు ౮౦,౦౦,౦౦,౦౦౦ నవరనుల ఆదాయమును గతసంవత్సరము గల్గియున్నను వ్యయ మధిక మగుటచే ప్రజలు పనిపాటులు లేక దుర్భరమయిన దుఃఖవేదన ననుభవించుచున్నారు. అమెరికా దేశమునకు ఇతర రాజ్యములు కోట్లకొలది నవరనులు బాకీయున్నను స్వయముగ నితరులకు ౪,౦౦,౦౦,౦౦,౦౦౦ నవరనులు బాకీపడియున్నది. ప్రపంచమందు గల మహారాజ్యములందు అమెరికాకు గల ప్రతిపత్తి ఏయితరరాజ్యములకును లేదు. గోధుమలు మొదలగు ధాన్యాదులు, బంగారము, వెండి,

అమెరికా సం. రాష్ట్రములు

ఇనుము, బొగ్గు, సీసము, రాగి, తుత్తునాగము, పెట్రోలియము, ప్రత్తి మొదలగుపదార్థముల నుత్పత్తి చేయుటయందు అమెరికా ప్రధానస్థానము నాక్రమించుచున్నది. వ్యవసాయ, ఖనిజ, పరిశ్రమములందువలెనే పారిశ్రామిక పదార్థనిర్మాణమునందును అమెరికా సంయుక్తరాష్ట్రములే ముఖ్యస్థానము నాక్రమించుచున్నవి. లోహపదార్థ నిర్మాణములు, మోటారు నిర్మాణములు, సున్నపుపదార్థములు, వస్త్రములు మొదలగువాని నిర్మాణములందును అమెరికా ముఖ్యస్థానము నాక్రమించుచున్నది. అమెరికా దేశమునందు మనిషి కొకనికి పన్ను పదేండ్లలో ౧౨ రూపాయలనుండి ౮౦ రూపాయలకు పెరిగినది. గత సంవత్సరమునందు నిరుద్యోగుల సంఖ్య నూటికి ౨౩ చొప్పున ౩౮,౦౦,౦౦౦ పెరిగినది. గతించిన యేడెనిమిదేండ్లయందును అమెరికాదేశమునకు దిగుమతుల మొత్తమును అమెరికానుండి ఎగుమతుల మొత్తమును క్రమముగ తగ్గినవి. ౧౯౩౧ యందు వెనుకటియేటికంటెను దిగుమతులు ౬౨,౮౦,౦౦,౦౦౦ నుండి ౪౨,౯౦,౦౦,౦౦౦ నవరనులకును, ఎగుమతులు ౭,౭౬౦,౦౦,౦౦౦ నుండి ౪౮,౮౦,౦౦,౦౦౦ నవరనులకును క్షీణించినవి. అమెరికా వ్యాపారమువలెనే అన్ని దేశముల వ్యాపారమును క్షీణించినది. ప్రపంచవ్యాపారము ౧౯౩౧ యందు ౪౯౩,౭౦,౦౦,౦౦౦ నుండి ౩,౬౪,౦౦,౦౦,౦౦౦ నవరనులు, దిగుమతులందును, ౪,౩౯,౪౦,౦౦,౦౦౦ నుండి ౩,౧౮,౭౦,౦౦,౦౦౦ నవరనులు ఎగుమతులందును క్షీణించినది. ప్రపంచవ్యాప్తమైన ఆర్థికదురవస్థ సంపన్నరాజ్యమైన అమెరికా నావరించిన విధమును అమెరికావ్యవహారములు విశదము చేయుచున్నవి.

అమెరికారాజ్యమందు గతించిన నాలుగైదేండ్లయందును ధనాగారము లనేకములు దివాలాతీసినవి. అమెరికా ఫెడరలు ధనాగారమునందు ౧౫౬౦ కోట్ల రూప్యముల బంగారము నిలువయున్నను అమెరికా ప్రభుత్వము బంగారు డాలరుల చెలామణిని విసర్జించినది. అన్నివిధముల సంపన్నమై, స్వయంపోషణము గల అమెరికా సంయుక్త రాష్ట్రముల ఆర్థికపరిస్థితులు తారుమారగుచు దుఃఖభూయిష్ఠముగ నున్నప్పుడు సామాన్యరాజ్యములస్థితిగతులు చెప్ప నవసరము లేదు. రూజువెల్టుగారి విజయ మమెరికాసంయుక్తరాష్ట్రములందు మద్యపాననిషేధము నంతరింపజేసినది. సెనేటు బీరుబిల్లు నామోదించి మద్యపానమునకు, నేరములకు నుత్తేజమును గలుగ జేసినది. ఐరోపామహాసంగ్రామానంతరము పాశ్చాత్య హృదయమునందు గలిగిన ధర్మపరివర్తనము పూర్వ రూపమును తిరిగి క్రమముగ నవలంబించుట కుపక్రమించినది. సంపన్నమైన అమెరికారాజ్యముల పరిస్థితులవలె సంపన్నమైన గ్రేటుబ్రిటను పరిస్థితులును దుర్భరముగ నున్నవి.

బ్రిటిషు సామ్రాజ్యము

భూవిస్తీర్ణమునందలి ౫,౫౫,౦౦,౦౦౦ చదరపు మైళ్లయందును, ౧౮౫ కోట్లప్రజలయందును బ్రిటిషు సామ్రాజ్యము ౧,౩౯,౦౯,౭౮౨ చదరపుమైళ్ల విస్తీర్ణమును ౪౫,౦౦,౯౪,౦౦౦ ప్రజలను గల్గియున్నది. గ్రేటుబ్రిటను ౮౯,౦౦౦ మైళ్లవిస్తీర్ణమును ౪,౬౦,౦౦,౦౦౦ ప్రజలను గలిగి సామ్రాజ్యవ్యవహారములను పార్లమెంటు ద్వారా నిర్వహించుచున్నది. బ్రిటిషుసామ్రాజ్యాంతర్భాగములందు హిందూస్థానము ౧౮,౦౦,౦౦౦ మైళ్ల విస్తీర్ణమును, ౩౫,౨౯,౮౬,౮౭౬ ప్రజలను గలిగి గ్రేటుబ్రిటనుపోషణమునకు మూలాధారముగ నున్నది. గ్రేటుబ్రిటనుకును సామ్రాజ్యాంతర్భాగములకును గలసంబంధము స్వాతంత్ర్యమునుండి పూర్ణపారతంత్ర్యమువరకును వ్యాప్తమై యున్నది. సంయుక్తాఫ్రికారాష్ట్రములు, కనడా, ఆస్ట్రేలియా మొదలగు అధినివేశరాజ్యములు స్వయంవ్యక్తిత్వమును గలిగి సామాన్యముగ నార్థిక రాజకీయరక్షణస్వాతంత్ర్యము ననుభవించుచున్నవి. ఐర్లాండు స్వతంత్రరాజ్యము. ౨౬,౫౯౨ మైళ్ల విస్తీర్ణ

మును, ౩౦ లక్షలజనులను మాత్రమే కలిగియున్నను సామ్రాజ్యమునుండి విడిపోయి పూర్ణస్వాతంత్ర్యమును స్థాపింపగోరుచున్నది. గతించిన ఎన్నికలయందు డివెలిరాపక్షమునకు పూర్ణవిజయము గలిగినది. డెయిలునందుగల ౧౫౨ సభ్యులందును, ౭౧ మంది డివెలిరాపక్షమునకు చెందియుండిరి. డివెలిరాపక్షము స్వామిభక్తిప్రమాణమును చేయుటకును, సంధిపత్రమునందు నిర్ణయించిన సంవత్సరపు వాయిదాసొమ్మును చెల్లించుటకును నిరాకరించినది. బ్రిటిషుప్రభుత్వమును అయిరిషుప్రభుత్వమును, సుంకముల సమరమును (Tarif War) ప్రారంభించినవి. రెండురాజ్యములకు నార్థికముగ నపార మైన నష్టము గలుగుచున్నది. ఇతరసామ్రాజ్యాంతర్భాగములు పారతంత్ర్యపాశబద్ధములై గ్రేటుబ్రిటనునకు స్వీయప్రయోజనములకు వినియోగపడుచున్న విధమును హిందూస్థానవ్యవహారములు కరతలామలకము చేయుచున్నవి. హిందూస్థానమునందధినివేశరాజ్యములందలి బాధ్యతాయుతప్రభుత్వమును స్థాపించుటయందలి హాస్యమును శ్వేతపత్రము వ్యక్తము చేసినది.

గ్రేటుబ్రిటనునందు గతించినఇరువదియేండ్లయందును మహాసంగ్రామమునకు పూర్వమును మహాసంగ్రామానంతరమును ప్రవర్ధమానంబగుచున్న సంరంభమునందు కన్సర్వేటివుపక్షము పూర్ణవిజయము బడసి, గ్రేటుబ్రిటను చిరకాల మవలంబించి లాభమును బడసిన స్వేచ్ఛావ్యాపారము ౧౯౩౨ మార్చి ౧-వ తేదిని నిర్గమించినది. ధనస్వాములకును కార్మికులకును, రక్షణవ్యాపారులకును స్వేచ్ఛావ్యాపారులకును, సామ్రాజ్యాభిమానులకును స్వాతంత్ర్యప్రియులకును, కన్సర్వేటివులకును కార్మికపక్షావలంబులకును ప్రవర్ధమానమైన సంరంభమునందు పూర్వపక్షమునకు విజయమును, పరపక్షమునకు పరాజయమును గల్గినది. రామ్సే మాక్డోనాల్డుగారు జాతీయపక్షనాయకత్వము వహించి కార్మికపక్షవిలయమునకు తోడ్పడినవిధము బ్రిటిషు రాజకీయచరిత్రాధ్యాయమునందు విషాదకరముగ నున్నది. ౧౯౩౧ లో జరిగిన ఎన్నికలందు పార్లమెంటునందలి ౬౧౫ స్థానములందును ౪౬౯ స్థానములు జాతీయప్రభుత్వమునకు లభించి కన్సర్వేటివు పక్షమునకు పూర్ణవిజయము కలిగినది. కన్సర్వేటివుపక్ష విజయముతో గ్రేటుబ్రిటనునందును సామ్రాజ్యాంతర్భాగములందును సామ్రాజ్యాభిమానులకు సహజమైననిరంకుశత్వము ప్రబలినది.

జాతీయ ప్రభుత్వము

గ్రేటుబ్రిటనునకు ౧౯౧౪-వ సంవత్సరములో గల ౬,౪౯,౭౭౦,౦౯౧ సవరనుల అప్పు ౧౯౨౦-వ సంవత్సరమునకు ౭౮౨,౮౭,౭౯,౦౯౨ సవరనులకు పెరిగినది. ఈయప్పు ౧౯౩౨-వ సంవత్సరమునందు ౭,౬౩,౩౯,౪౨,౫౮౦ సవరనులకు తగ్గినను ౧౯౩౧-వ సం॥మునకంటె ౨,౧౬,౩౪,౨౫౫ సవరనులు హెచ్చినది. ఈయప్పునందు స్వదేశస్థులకు ౪,౩౭,౫౮,౧౯,౬౧౪ సవరనులును, విదేశస్థులకు ౧,౦౯,౧౮,౩౬,౬౫౬ సవరనులును కలదు. గ్రేటుబ్రిటనునకు అప్పు పెరిగినను ఆదాయము పెరుగలేదు. గ్రేటుబ్రిటను ఆదాయము ౧౯౧౩-౧౪ సంవత్సరమునందు ౧౯,౮౨,౪౩,౦౦౦ నుండి ౧౯౩౧-౩౨ నందు ౮౫,౧౪,౮౨,౦౦౦ సవరనులకు పెరిగినది. ౧౯౩౧-౧౯౩౨ నందు ఆదాయముకన్న వ్యయము ౧,౪౮,౦౦,౦౦౦ సవరనులు అధిక మైనది. ౧౯౩౨-౩౩-వ సంవత్సరమునందు ఆదాయవ్యయములను సరిపెట్టుటకు వ్యయము ౭౬,౬౮,౦౦,౦౦౦ సవరనులకు తగ్గింపబడినది. ఆదాయాభివృద్ధికై వేసిన సుంకములవలన ౧౯౩౨-వ సం. మార్చి మాసాంతమునకు ౧౩,౬౧,౫౨,౦౧౦ సవరనులు అధికాదాయము లభించినది. గ్రేటుబ్రిటనునందు ౧౯౧౪-వ సం॥లో మనిషి ఒకనికి పన్ను ౩ సవరనులు, ౧౫ షిల్లింగుల ౪ పెన్నీలనుండి ౧౯౩౨-౩౩ నందు ౧౫ సవరనుల ౧౮ షిల్లింగులకు పెరిగినది. ప్రపంచమునందు గల రాజ్యములలో గ్రేటుబ్రిటను ప్రజలు మనిషికి అధికతమ మైన పన్నును చెల్లించుచున్నా

రు. గ్రేట్బ్రిటను వ్యాపారము ౧౯౨౯ నందు ఎగుమతులు, దిగుమతులు కలసి ౨,౦౪,౦౩,౭౪,౨౪౨ సవరనుల నుండి ౧౯౩౨ నందు ౧౩౧,౪౩,౭౩,౮౭౩ సవరనులకు తగ్గినది. ప్రత్యేకవ్యాపారమును ౧౫౦,౫౫,౬౯,౪౭౮ నుండి ౧,౧౮,౭౩,౦౩,౧౭౯ సవరనులకు తగ్గినది. పడి పోవుచున్న వ్యాపారమును రక్షించుటకై జాతీయప్రభుత్వ మవలంబించిన రక్షణవ్యాపారవిధానమును, బంగారు నాణెముల విసర్జనమును, తాత్కాలికముగ లాభకరముగ గన్పట్టినను కాలక్రమమున నిరర్థకము గాగలదు. బ్రిటిషు రాజ్యాదాయమునకు మూలాధారములైన నౌకాదాయము, భీమా ఆదాయము, వ్యాపారాదాయము, ప్రత్తి, బొగ్గు, లోహపరిశ్రమల యాదాయము క్షీణించుచున్నపుడు వ్యాపారరక్షణవిధానమువలన రాగల యాదాయమును బ్రిటిషుప్రజలు చెల్లింతురుగాని పరదేశీయులు చెల్లింపరు. వ్యాపారరక్షణవిధానమును బ్రిటిషు స్వామ్రాజ్యమునందు బలవంతముగ వాడుకయందు పెట్టుటకు జాతీయప్రభుత్వము చేసిన ప్రయత్నములను ఒట్టావానిర్ణయములు విశదము చేయుచున్నవి.

గతసంవత్సరము అక్టోబరు ౧౭-వ తేదిని వ్యాపార రక్షణవిధానము గ్రేట్బ్రిటనునందు పూర్తిగ అమలున పెట్టబడినది. బ్రిటిషుప్రభుత్వము విదేశములనుండి దిగుమతి యగు నాహారపదార్థములమీద సుంకములను విధించుటవలన కనడా, ఆస్ట్రేలియా రాజ్యములకుపకృతిని గలుగజేసినను స్వదేశమునకు గలుగజేసిన యుపకృతి సంశయాస్పదము.

ఒట్టావా ఒడంబడిక

ఇతర రాజ్యములును గ్రేట్బ్రిటను, అవలంబించిన వ్యాపారరక్షణవిధానమును బంగారు నాణెముల విసర్జనమును అవలంబించినవి. గ్రేట్బ్రిటనునందు విదేశవ్యాపారమునకు నిరోధము గలుగుటయేకాక విదేశములందు బ్రిటిషు వ్యాపారమునకు నిరోధ మేర్పడినది. పాశ్చాత్య దేశములయందు రుష్యా, ఇటలి, జర్మని పోటీవ్యాపారమునకును, ప్రాచ్యదేశములందు జపాను పోటీవ్యాపారమునకును గ్రేటుబిటను నిలువజాలకున్నది. ఒట్టావానిర్ణయములు నిస్సహాయస్థితియందున్న హిందూస్థానమునందు బ్రిటిషు ప్రభుత్వమునకు ప్రయోజనమును సమకూర్చినను స్వదేశమునందును, విదేశములందును ఒట్టావానిర్ణయములు బ్రిటిషుప్రయోజనముల కనుకూలములు గాజాలవు. గ్రేట్బ్రిటను ప్రారంభించిన సుంకములసమరము రక్తసమరమును మించినప్రచండ సమరమునకు సాధన మగుచున్నది. బలీయమైన బ్రిటిషు జాతీయప్రభుత్వము నావహించిన సమకారాహంకారములు స్వప్రయోజనములకు వినియోగపడునటులు ధర్మప్రయోజనములకు వినియోగపడజాలవు. స్వామ్రాజ్యాంతర్భాగములపట్లను జాతీయప్రభుత్వ మవలంబించుచున్న ఆర్థికనిర్ణయములవలెను రాజ్యాంగనిర్ణయములును సామ్రాజ్యాభిమానమును సకల సందర్భములయందును విశదము చేయుచున్న విధమును నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. చర్చిలు, సర్ సామ్యుయెలు హోరు, బాల్డువిను, ఇర్విన్ప్రభువు, సర్ జాన్ సైమను, రామ్సే మాక్డొనాల్డు సాంకిప్రభువుగారులు మొదలగువారలకు పారతంత్ర్యదేశములపట్ల గల స్వాతంత్ర్యప్రదాన భావములందు స్వల్పాంతర్భేదములు గలవు కాని లక్ష్యభేదము మాత్రము మృగ్య మని ఆంగ్లరాజ్యతంత్రజ్ఞుల ప్రసంగములు, సిద్ధాంతములు, వ్యవహారములు విశదము చేయుచున్నవి. బ్రిటీషుప్రభుత్వము హిందూస్థానరాజ్యాంగ సంస్కరణముల విషయమై ప్రచురించిన శ్వేతపత్ర మాంగ్లేయ రాజ్యనీతిని తియ్యనిమాటలతోను శూన్యక్రియలతోను సువ్యక్తము చేయుచున్నది.

ఇతరరాజ్యములు

ఇతరరాజ్యముల యుదంతములును బ్రిటీషురాజ్యములచరిత్రమును అమెరికాసంయుక్తరాష్ట్రములయుదంతమును భిన్నరీతులను, భిన్నపరిస్థితులందు స్ఫురింపజేయుచున్నవి. ఫ్రాన్సురాజ్యము నెప్పటివలెను జర్మనుపిశాచము బాధించుచున్నది. ఫ్రాన్సునకు గల సైన్యబలమును

విమానబలమును ఏ యితరరాజ్యమునకును లేదు. వివిధ శాఖలందును, ౨,౧౦,౦౦౦ సైనికులు గలరు. సొంత విమానములుగాక సైనికశాఖకు ౩౦౦౦ విమానములు గలవు. ఫ్రాన్సుదేశమునకు ౧౯౩౮-౩౯ నందు ఆదాయము ౫౦,౬౪,౩౮,౭౫,౩౯౫, వ్యయము ౫౦,౬౮,౩౮,౭౫,౩౯౫ ఫ్రాంకులు. ఆదాయమునందు మూడవవంతు సైన్యమునకు వ్యయమగుచున్నది. మనిషి ఒకనికి పన్ను ౧,౧౨౬ ఫ్రాంకులు. పదేండ్లలో పన్ను ౭ రెట్లు పెరిగినది. ఫ్రాన్సు జర్మను భయనివారణకై పూర్వమువలెనే సైన్యాభివృద్ధితోపాటు రాజ్యతంత్రమును ఆరంభించినది. పెద్దరాజ్యములతోను, చిన్నరాజ్యములతోను రహస్యసంధుల నుపక్రమించినది.

ఇటలీదేశము ముస్సోలినీగారి నాయకత్వముక్రింద శాంతివ్యాజమున చేయుచున్న సంగ్రామసన్నాహములు యూరపు రాజ్యములకు ముఖ్యముగను ఫ్రాన్సుకు భయభ్రాంతులను గలుగజేయు చున్నవి. గతసంవత్సరము రాజ్యాదాయములకన్న వ్యయ మధికమయినది.

జర్మనురాజ్యమందు హిట్లరుపక్షు విజయము మహాపరివర్తనమునకు మూలమగుచున్నది. సంగ్రామానంతరము జర్మను రాజ్యమునందు ఆయుధ నియమము నిర్ణయింపబడి ఆయుధధారణము దుర్లభమైనది. హిట్లరుపక్షువిజయముతో జర్మనీ నిరాటంకముగ నాయుధధారణను పూనుకొనుచున్నది. ప్రవాసమునందున్న కైజరునకు నిర్భయముగ హిట్లరుపక్షము స్వాగత మొసగుచున్నది. కమ్యూనిస్టు,సోషలిస్టునాయకులు నిర్బంధములకు హత్యలకుపాల్పడుచున్నారు. హిట్లరుపక్షునాయకులు బహిరంగముగను రహస్యముగను జేయుచున్న దుర్ణయములు ఫ్రాన్సునందు కలవరమును గల్గించుచున్నవి. జర్మనీ ప్రభుత్వము రిపబ్లికను ప్రభుత్వమునుండి రాజాధికార ప్రభుత్వమునకు మారిన విచిత్రము గనుపడదు. జర్మను పార్లమెంటు హిట్లరుపక్షమునకు పూర్ణ నిరంకుశాధికారము నొసంగినది.

సంయుక్త రష్యా రాజ్యముల వ్యవహారములు దుర్గ్రాహ్యములుగ నున్నవి. సోవియటుప్రభుత్వము ౫ ఏండ్ల నిర్మాణవిధానము నవలంబించి పంటలను, పరిశ్రమలను, అభివృద్ధిపరచినవిధము సంశయ విస్మయములను గలిగించుచున్నది. రష్యాయందు, అమెరికా సంయుక్త రాష్ట్రములవలెనె, వ్యవసాయమును పరిశ్రమలను అభివృద్ధి జేయుటకు విశేషావకాశములు గలవు. రష్యాదేశము బొగ్గు ఇనుము రాగి బంగారము ప్లాటినము నాఫ్తా పెట్రోలియము మొదలగు ఖనిజసంపదలతో నిండియున్నది; గోదుమలు, యవలు, జొన్నలు, ఓట్సు, ఇతరధాన్యములు, బంగాళాదుంపలు, మొదలగు పంటలతోను, అడవులతోను నిండియున్నది. యూరపురాజ్యములన్నియును సోవియటు రష్యాపట్ల నిరాదరణ జూపుచున్నను సోవియటు ప్రభుత్వము గమ్యస్థానము చేరుట విశ్వప్రయత్నములను జేయుచు క్రమవికాసమును బొందుచున్నది. ౨౬,౩౭,౦౦౮ మైళ్ల విస్తీర్ణమును, ౧౧,౧౬, ౩౦,౦౦౦ జనసంఖ్యయునుగల సంయుక్త సోవీటురుష్యా రాజ్యముల పరిణామము ప్రపంచ పునర్నిర్మాణమునకు వినియోగపడవలసియున్నది. రుష్యారాజ్యమునందు సిద్ధాంతమున సర్వసమత్వమును, నిత్యవ్యవహారముల ఘోరదండనములును, నిరంకుశవ్యవహారములును, పరిపాటిమైనవి. రుష్యాయందు మానవులును యంత్రములవలె దయాదాక్షిణ్యములు లేక వ్యవసాయ పరిశ్రమాదుల యభివృద్ధికై వినియోగింపబడుచున్నారు. ముఖ్యముగ యువతు లత్యుత్సాహముతో పనులను నిర్వహించుచున్నారు. రుష్యాప్రజలకు సర్వసమత్వము సిద్ధాంతమునందు సందర్శనీయముగ నున్నను నిత్యవ్యవహారములందు భేదభావము ప్రాచీనసాంఘికవ్యవస్థలందు వలెనే పరిపాటి యై మానవప్రయత్నములకు మూలమైన ఆశాప్రోత్సాహములు దురారాధ్యము లగుచున్నవి. రుష్యాయందలి నిర్బంధములు, ఘోరదండనములు, ఫాసిస్టు దండనములను, హిట్లరు ఘోరదండనము

లను మరపించుచున్నవి. మతాధికారముతోను, రాజాధికారముతోను ధనాధికారముతోను నారంభమైన మానవ ధర్మ పరిణామమును సర్వమానవసమత్వరూపమునను సఫలము జేయుటకు సోవియట్టుప్రభుత్వము చేయుచున్న ప్రయత్నములు సఫలము గాకపోయినను మానవధర్మారాధకుల దృష్టి నాకర్షించు చున్నవి. మానవసంఘము నందు సర్వమానవ సమానత్వమును స్థాపించుటకు సోవియట్టుప్రభుత్వము వినియోగించుచున్న పశుబలము సంకల్పమునే విఫలము చేయుచున్నది. పశుబలప్రయోగమువలన పశుబలవ్యాపనము సాధ్య మగును గాని మానవధర్మాభ్యుదయ సాధ్యముగాజాలదు.

ప్రపంచమందలి సకలరాజ్యములును సాయుధపాణు లై ఆయుధరక్షణమున కర్బుదముల ద్రవ్యమును వ్యయము చేయుచు ఆయుధవిసర్జనసభలను, శాంతి సభలను చేయుట ఆయుధవిసర్జనమునకును, శాంతిస్థాపనమునకును నిరుపయోగములు. బలీయములును, సంపన్నములును, వికాసవంతములును అయిన యూరపురాజ్యముల స్థితిగతు లి ట్లుండ దుర్బలములును, దారిద్ర్యభూయిష్ఠములును, పూర్వాచారబద్ధములు నుఅయిన ఆసియారాజ్యముల స్థితిగతులు మానవధర్మాభ్యుదయాకాంక్షులకు పరమసంతాపమును గల్గించుటయందు విచిత్రములేదు.

ఆసియాఖండము భూగోళవిస్తీర్ణమునందు మూడవవంతు విస్తీర్ణమును (౧,౭౦,౦౦,౦౦౦ చదరపుమైళ్లు), జనసంఖ్యయందు భూగోళమందలి సగము జనసంఖ్యను మించిన (౧౦౧,౩౦,౦౦,౦౦౦) జనసంఖ్యను గల్గి, భూఖండములందు అగ్రస్థానము నాక్రమించుచున్నది.

ఆసియాఖండపు ప్రబోధము

ఆసియాఖండమునందు చీనాదేశము ౩౮,౭౦,౦౦౦ చదరపుమైళ్ల విస్తీర్ణమును ౪౨,౦౦,౦౦,౦౦౦ ప్రజలను, హిందుస్థానము ౧౮,౦౦,౦౦౦ చదరపుమైళ్ల విస్తీర్ణమును ౩౫౨,౮౦,౦౦,౦౦౦ ప్రజలను గల్గియున్నవి. రుష్యారాజ్యము మూడవవంతుప్రదేశము నాక్రమించుకొని ౩,౦౦,౦౦,౦౦౦ ప్రజలను కల్గియున్నది. వర్తమానకాలమునందు ప్రపంచాధిపత్యము నాకర్షించుచున్న జపాను సామ్రాజ్యము ౨,౬౦,౦౦౦ చదరపుమైళ్ల విస్తీర్ణమును ౮ కోట్లప్రజలను గల్గియున్నది.

జపానుసామ్రాజ్యమునందు ౮ కోట్ల ప్రజ లున్నను జపాను దేశము స్వల్పమైన విస్తీర్ణమును ఆఱుకోట్ల జనులను మాత్రము కలిగియున్నది జపానురాజ్యము విశాలమైన సామ్రాజ్యనిర్మాణమునకై ౧౮౬౮-వ సంవత్సరమునుండి చేయుచున్న ప్రయత్నములు ధర్మవిరుద్ధము లైనను ప్రపంచదృష్టి నాకర్షించినవి. అట్లాంటికు మహాసముద్రమునందు గల గ్రేట్బ్రిటనువలెనె పసిఫికు మహాసముద్రమునందు గల జపానుద్వీపములును మహాసామ్రాజ్య నిర్మాణమున కుపక్రమించుట ఆశోత్సాహజనకము లైనను ధర్మయుక్తములు గావు ౧౮౯౪-౯౫ నందు జపాను చీనా నోడించి కొరియా, మంచూరియా సరిహద్దులందు యాలునదివరకును గల చీనాదేశము నాక్రమించినది. ౧౯౦౪-౫లందు జపాను రుష్యానోడించి మంచూరియాయందు ప్రవేశమున కుపక్రమించినది. ౧౯౩౧-వ సంవత్సరమునందు జపాను మంచూరియాను జపానుసంరక్షితరాజ్యమునుగ జేయుట కారంభించి మంగోలియాయందు సయితము మాక్రమణమున కుపక్రమించినది. మంచూరియాయందు మూడుకోట్ల చైనాప్రజలును, పదిలక్షల కొరియనులును, నాలుగులక్షల జపానులునుఉన్నను మంచూకోసంరక్షితరాజ్యమును జపాను స్థాపించినది. సుశిక్షితమైన జపాను సైన్యములను ప్రతిఘటించుట చీనాసైన్యములకు దుస్తర మైనది. జపాను చీనాప్రజలదౌర్జన్యవ్యాజమునను మంచూరియాను జిహోలువరకును నాక్రమణము చేసినది. దుర్బలస్థితియం దున్న చీనారాజ్యమునకు జపానువస్తుబహిష్కారణమును, నానారాజ్యసమితికి విజ్ఞాపనమును ప్రతీకారమునకు శరణ్యములైనవి. జపాను నానారాజ్యసమితి నిర్ణయించిన లిట్టను కమిటీ నిర్ణయములను నిరాకరించి సంగ్రామప్రస్థానమును

చేయుటకు పూనినది. చీనాప్రజలు జపానునరాక్రమణమును నిరోధించుటకు చేయుచున్న మహాత్యాగము ప్రశంసనీయ మైనను పూర్ణసాయుధపాణు లైన జపాను సైన్యముల ప్రతిఘటనము దుర్లభముగ నున్నది. జపాను రాజ్యము లిట్టను కమిషను నిర్ణయములను, నానాజాతి సమితినిర్ణయములను నిరాకరించి నానాజాతిసమితిప్రయోజనములను నిరర్థకము చేసినది. జపాను యూరపురాజ్యములు నేర్పిన గుణపాఠమునే పునఃప్రతిపాదన జేసినను ధర్మవిరుద్ధము లైన యాక్రమణములు సకలరాజ్యముల నిరసనకును పాత్ర మగుచున్నవి.

జపానీయులు సంగ్రామమునందువలెనే వ్యాపార పరిశ్రమయందును, సాహస ధైర్యములందును జూపిన దక్షత్వము పాశ్చాత్యుల మహత్త్వ భ్రమను నిర్మూలము చేసినది. జపాను తాత్కాలికముగ మంచూకోయందు విజయములను బడసినను ప్రపంచాభిప్రాయములకును, చీనాప్రజాభిప్రాయములకును ప్రతికూలమైనవిజయయాత్రలు భావికాలమందు జపాను యోగక్షేమములకు ప్రయోజనకరములు కావు. జపానురాజ్యము సకలవిధముల సన్నిహితసంబంధము గల చీనా రాజ్యముతో మిత్రత్వము గలిగి వ్యవహరించుట శ్రేయస్కరము.

నానాజాతి సమితి

నానాజాతిసమితి గతవత్సరమునందు చీనాజపాను తగాదాలను నిర్ణయించుటకును ఆయుధవిసర్జన వ్యవహారములను నిర్ణయించుటకును జేసిన ప్రయత్నములు నిరర్థకములైనవి. జపాను జాతిసమితినిర్ణయములను ప్రతిఘటించుటయే గాక సమితినుండి విడిపోయినది. జపాను ప్రతిఘటనమునకు మహారాజ్యముల నడుమ నేర్పడిన రహస్యసంధులు కారణ మని రాజనీతిజ్ఞులు ఘోషించుచున్నారు. ముఖ్యముగ బ్రిటిషురాజనీతిజ్ఞుల యభయము జపానుప్రతిఘటనకు మూల మని వదంతులు ప్రబలినవి.

ఆయుధవిసర్జన నిర్ణయముల విషయమై వివిధరాజ్యముల లక్ష్యములును అన్యోన్యసంబంధము లేక నిరుపయోగములుగ నున్నవి. మాటలయందు, విషవాయుప్రయోగములందును, వాయువిమానోపయోగములందును ఆయుధనియమమునందును, కొంత సామ్యము కల్గినను వ్యవహారములందు భిన్నరాజ్యములు భిన్నాభిప్రాయములను వ్యక్తము చేసి జాతిసమితి నిర్ణయములను నిష్ఫలము చేసినవి. జర్మనురాజ్యము ఇతర రాజ్యములతోపాటు ఆయుధనియమధారణము నాకాంక్షించుచు క్లిష్టపరిస్థితులను సమకూర్చినది. హిట్లరు పక్షము నిర్భయముగ జర్మను ప్రజలకు ఆయుధధారణమును బోధించుచు, ప్రజలను సాయుధపాణులను చేయుచున్నది. పాశ్చాత్యరాజ్యములు చిరకాలమునుండియును అవలంబించిన పరాక్రమణవిధానమునందు మార్పు గలుగనంతవఱకును ఆయుధవిసర్జనమును, శాంతిస్థాపనమును దుర్లభములు. ధర్మబలముగాని, ఆయుధబలముగాని లేని నానాజాతిసమితి చేసెడి ధర్మనిర్ణయములు జపాను వ్యవహారమునందువలెనే ఇతరవ్యవహారములందును లోకాదరణను బడయజాలవు.

హిందూ స్థానము

హిందూస్థాన వ్యవహారములు ఇరువదేండ్లకు పూర్వము మాంటాగూగారు తెలిపినట్లు చేష్టారహితములుగను, అయోమయములుగను, దారుతుల్యములుగను వర్తమానదేశావసరములకు నిరర్థకములుగను నున్నవనుట నిర్వివాదాంశము. భిన్నమతములకును, భిన్నసంఘములకును, భిన్నరాజ్యములకును, భిన్నాశయములకును నిలయ మైన హిందూదేశ వ్యవహారములు వర్తమాన కాలావసరములకు సకలవిధములను నిరుపయోగముగ నున్నవని పరమస్వార్థపరులైన కన్సర్వేటివులును అంగీకరించుచున్నారు. దేశమోక్షమునకు నిర్బంధములవలె స్వాతంత్ర్యము నిరుపయోగ మని వాదించెడి మహానుభావులును గలరు. హిందుస్థానమునందు ౭,౦౦,౦౦౦ మైళ్లవిస్తీర్ణమును ౮,౦౮,౩౮,౫౨౧ ప్రజలునుగల ౬౦౦ స్వదేశసంస్థానములును ౧౮,౦౦,౦౦౦ చదరపుమైళ్ల

విస్తీర్ణమును ౨౭,౦౬,౧౨,౧౬౨ ప్రజలును గల ౧౧ బ్రిటిషు రాష్ట్రములును గల బ్రిటిషుభాగమును గలవు. సంస్థానములందు పలాంటు ఆబూవంటి చిన్నిపట్టణము మొదలు నైజాము రాజ్యమువంటి మహారాష్ట్రములును గలవు. సంస్థానాధీశులు స్వాతంత్ర్యమును గల్గి బ్రిటిషు రాజ్యముతో సంబంధమును గల్గియున్నారు. ప్రజలందు ౨,౩౪ ౩ లక్షలు హిందువులు, ౭౭౭ లక్షలు మహమ్మదీయులు, ౫౯ లక్షల క్రైస్తవులు, ౪౯ లక్షల సిక్కులును గలరు. హిందూదేశమునందు ౩౫ కోట్ల ప్రజలున్నను దేశసంరక్షణము బ్రిటిషు సైన్యముమీద నాధారపడియున్నది

౧౯౩౦-వ సంవత్సరమునందు బ్రిటిషు సైనికులు ౬౧,౨౮౪ ను, హిందుస్థాన సైనికులు ౧,౫౮,౬౬౦ ను గలరు. ౧౯౩౧ యందు సైన్యవ్యయమునకై ౫౫ కోట్లు వ్యయ మైనది. బ్రిటిషు సైనికునకు ౧,౨౩౭ రూప్యములును, హిందుస్థాన సైనికునకు ౪౩౩ రూప్యములును సంవత్సరమునకు వ్యయమగుచున్నవి. దేశాదాయమునందు సైన్యమునకు ౧౦౦ కి ౬౪ వంతున ఇంగ్లాండునందును ౧౦ వంతున ఫ్రాన్సునందు ౧౦త్తి వంతున జపానులోను ౭౨ వంతున హిందుస్థానమునందును వ్యయ మగుచున్నది. హిందుస్థానమునందు ప్రజలు సామాన్యముగ గ్రామములందు నివసించుచున్నారు. గతజనాభా ప్రకారము ౨,౩౬ పట్టణములును ౬,౮౫,౬౬౫ గ్రామములును గలవు. దేశమునందు గల ౩౫ కోట్ల ప్రజలయందును ౧౦౦ కి ౯౦ వంతున గ్రామసీమలందు నివసించుచు వ్యవసాయ పరిశ్రమను ప్రధానజీవనాధారముగ గలిగియున్నారు. రైతుల ఆర్థిక పరిస్థితులను పరిశీలించుటకు ఏర్పరుపబడిన సెంట్రల్ బాంకింగు విచారణోపసంఘము రైతువర్గము ౯౦౦ కోట్ల రూప్యములకుపైగా అప్పులందు మునిగియున్నట్లు నిర్ణయించినది. పంటవస్తువుల ధరప్రతులు పడిపోయిన వర్తమానక్లిష్టపరిస్థితులయందు గ్రామవాసుల దుర్భరదారిద్ర్యము, గృహపరిశ్రమల నాశనము, గ్రామసీమల యనారోగ్యము గ్రామవాసుల స్థితిని దుర్భరము చేయుచున్నది.

బ్రిటిషు ప్రభుత్వము గ్రామసీమలు

నూటయేబది సంవత్సరముల బ్రిటీషు పరిపాలనము హిందూస్థానమునందు గ్రామవాసులకు గలుగజేసిన ప్రయోజనములు సంశయాస్పదములు. రైళ్లు, పోస్టాఫీసులు, కొన్ని మండలములకు నీటివసతులుగలిగినను విద్యావ్యాపనమునందును, ఆరోగ్యసంరక్షణమునందును, రొకపోకలవృద్ధియందును ముఖ్యముగ నార్థికస్థితియందును నభివృద్ధి గలుగలేదు. హిందువులయందు ౧౦౦ కి ౪.౮ వంతునను, మహమ్మదీయులందు ౧౦౦ కి ౫.౪ వంతునను మొత్తమునను ౧,౨౫,౧౬,౧౯౭ విద్యనభ్యసించుచున్నారు. హిందూస్థాన విస్తీర్ణమునందు, ౧౦౦ కి ౩౪ వంతున ౨౨,౮౧,౬౧,౦౦౦ యకరములు సాగుబడియందున్నవి. హిందూస్థానమునందు ౧౯౨౯-౩౦ సంవత్సరమునందు వివిధతరగతులపశువులు ౨,౧౯,౮౦,౦౦,౦౦౦ కలవు. అమెరికా సంయుక్తరాష్ట్రములందు యకరమునకు రూ. ౨౧౯, గ్రేట్బ్రిటను నందు యకరము ౧ కి రూ. ౧,౯౫౯ ఆదాయమును, హిందూస్థానమునందు యకరమునకు రూ. ౩౦ ఆదాయమును దేశపరిస్థితులను చెప్పకయె చెప్పుచున్నవి.

ప్రభుత్వాదాయమునందు భూమ్యాదాయము ప్రధానాదాయము. రీసెటిలుమెంటు పద్ధతివలన భూమిసిస్తు ఇరువది ముప్పదేండ్లకొకసారి హెచ్చు చేయబడుచున్నది. లోకలు సెస్సులు మొదలగు పన్నులను రయితులు భరించుచున్నారు. భూమిసిస్తు సంవత్సరమునకు ౩౦౦ లక్షల పౌనులు వసూలు అగుచున్నది. భూమ్యాదాయము రాష్ట్రాదాయ మవుటవలన రాష్ట్రములకు భూమిసిస్తును వృద్ధిజేయుటకును సమ్మోహము కలుగజేయుచున్నది. సగటున తల ఒకటికి పన్ను ౫ రూపాయలును, ఆదాయము ౫౦ రూపాయలును గలదు. హిందూదేశమునకు, గ్రేట్బ్రిటనునందును, హిందూస్థానమునం

దును, కలసి ౯౦౦ లక్షల నవరనుల అప్పు గలదు. రయితు ప్రత్యక్షముగను పరోక్షముగను పన్నులభారమునందు విశేషభాగమును వహించుచున్నాడు. హిందూస్థానమునందుగల పశుసంపద ఏయితర దేశమునందును లేదు. పశువులు కృశించి జీవచ్ఛవములవలె నున్నవి. పల్లపుసాగుగల ప్రాంతములందు పశువులు నిలుచుటకైనను వసతులు లేవు. మెట్టప్రదేశములం దరణ్యనిర్బంధములు పశువుల క్షేమమునకు ప్రతిబంధకములుగ నున్నవి. పశుసమృద్ధిగల దేశమునందు శిశుపోషణమునకై పాలడబ్బాలును, హార్లిక్సుబుడ్లు గ్లాక్సో పౌడరు మొదలగు నిర్మితపదార్థముల నుపయోగించుట ఆయురారోగ్యైశ్వర్యములకు హానికరము. దేశావృతమైన దుర్దశ హిందూస్థానమునందలి గ్రామసీమలందు తాండవమాడు చున్నది. పార్లమెంటు ప్రసాదింపనున్న సంకుచితసంస్కరణము లైనను శ్రీమంతులకు, విద్యావంతులకు, పట్టణవాసులకు, జమీందారులకు, సాంఘికనాయకులకు నుపయోగించునటులు గ్రామవాసుల కుపయోగపడవు. ప్రభుత్వవిధానమునం దత్యంతభార మైన ప్రభుత్వవ్యయభారమును తగ్గింపని, ఆర్థికస్వాతంత్ర్యము లేని సంస్కరణములు నిరుపయోగములు.

**పరిశ్రమలు**

హింమూస్థానమునందు దూదియంత్రములు ౨౯౫, నారయంత్రాలయములు ౯౫, ఇతర నేతయంత్రాలయములు ౫౨౭, లోహశిల్పయంత్రాలయములు ౬౪౧, చిల్లరకర్మాగారములు ౧౧౨౨ చేరి ౧౧,౭౬,౦౦౦ ప్రజలకు పనిని గలుగజేయుచున్నవి. దేశమునందు గల ౧౧౩౪ బొగ్గు, మాంగనీసు, మైకాగనులందు ౨,౧౧,౦౦౧ మంది పని జేయుచున్నారు. రైల్వేలందు ౭,౩౯,౯౧౯ ఇండియనులు, ౧౪,౦౦౧ ఆంగ్లో ఇండియనులు, ౪౮౩౬ యూరపియనులు పని జేయుచున్నారు. పెద్దయుద్యోగములు చాలవరకు యూరపియనులవశమునం దున్నవి.

దేశమునందలి వ్యాపారము దిగుమతులందును ఎగుమతులందును క్రమముగను క్షీణించుచున్నది.

**వ్యాపారము**

వ్యాపారక్షయమునకు ౧. ప్రపంచావృతమైన మాంద్యము, ౨. బ్రిటీషు పరిశ్రమనిర్వాహకుల నిర్బంధము, ౩. హిందూస్థానమునందును, ఇతరదేశములందును పరిశ్రమవికాసము, ౪. స్వదేశాభిమానము, ౫. బ్రిటీషువస్తుబహిష్కరణదీక్ష మొదలగునవి కారణములు. ౧౯౨౪-౨౫ నందు ఎగుమతులు ౪౦౦ కోట్లు, దిగుమతులు ౩౫౨ కోట్లురూప్యములనుండి ౧౯౩౦-౧ యందు ౨౨౦ కోట్లకును, ౧౯౧ కోట్లకును తగ్గినవి. గ్రేటుబ్రిటనునుండి ఎగుమతులు మూడేండ్లయందు ౫౯ కోట్లనుండి ౨౯ కోట్లకును, గ్రేటుబ్రిటనుకు ఎగుమతులు ౫౨ కోట్ల నుండి ౩౯ కోట్లకును తగ్గినవి. ౧౯౩౧-౩౨ సంవత్సరములందు హిందూస్థానమున కనుకూల వ్యాపారము గోచరంబగుటకు గారణము ౧౨౦ కోట్ల బంగారు ఎగుమతి. గతసంవత్సరములయందువలె బంగారు దిగుమతి పోయి రెండేండ్లనుండియు బంగారు ఎగుమతి ప్రారంభ మైనది. ఎగుమతియగుచున్న బంగార మితరదేశములందువలె గనులయందు పుట్టినదిగాక బీదలనగ లను కరిగించుటవలన వచ్చుచున్నది. దరిద్రగ్రస్తులైన బీదస్త్రీలకు స్వల్పమైన బంగారు వెండినగలు జీవయాత్రను గడపుట కాధారములుగ నాదికాలమునుండియు నుండినవి. గ్రేటుబ్రిట నవలంబించిన బంగారునాణెముల చెలామణి నిర్ణయము హిందూస్థానము నార్థికపుసుడి గుండమున కీడ్చి ముంచివేయుచున్నది. హిందూస్థానమును బ్రిటీషు ఆర్థికజగన్నాథ రథము మారకపు నిర్ణయమునందును, అప్పునప్పులందును, వ్యాపారపరిశ్రమల నిర్ణయములందును, బంగారు ఎగుమతులందును, ఉద్యోగవేతన నిర్ణయమునందును, సైన్యవ్యయనిర్ణయమునందును, రైల్వే పరిపాలనమునందును యథేచ్ఛగను బలవంతముగను మహోపద్రవస్థితికి లాగుకొని పోవు

చున్నది. బంగారమును పాతరవేసినదని హిందూస్థానము నాక్షేపించిన యూరపురాజ్యములు బంగారమునంతను పెద్ద పాతరలు వేసినవిధము పరిహాసపాత్రముగ నున్నది. ౧౯౨౪-౨౫ సంవత్సరములందు ౭౮ కోట్ల బంగారమును దిగుమతిచేసిన హిందూస్థానము ౧౯౩౧-౩౨ లందు ౬౧ కోట్ల బంగారమును ఎగుమతిచేసినది. ౧౯౩౧ జూలై మాసమునందు ప్రపంచమునందలి ముఖ్యరాజ్యములు బంగారమును పాతిపెట్టినవిధము నీక్రింది లెక్కలు తెలుపుచున్నవి.

| | |
|---|---|
| అమెరికాసంయుక్తరాష్ట్రములు | ౧౫,౫౫,౮౯,౭౩,౫౦౦ |
| ఫ్రాన్సు | ౯,౮౧,౨౯,౮౨,౫౦౦ |
| ఇంగ్లండు | ౨,౫౭,౨౨,౬౯,౦౦౦ |
| జర్మనీ | ౧,౯౯,౨౮,౧౬,౩౦౦ |
| స్పెయిను | ౧,౬౩,౭౧,౦౨,౫౦౦ |
| జపాను | ౧,౪౭,౮౫,౭౧,౫౦౦ |
| ఆర్జెంటైను | ౧,౨౭,౧౬,౦౬,౦౦౦ |
| ఇటలీ | ౯౭,౯౨,౭౫,౫౦౦ |
| సంయుక్త సోవియటు రషియా | ౯౧,౬౬,౩౨,౫౦౦ |
| బెల్జియమ్ | ౭౦,౪౪,౯౪,౦౦౦ |
| నెథర్లాండ్సు | ౬౩,౩౧,౧౮,౫౦౦ |
| హిందూస్థానము | ౫౧,౫౪,౨౪,౦౦౦ |
| కనడా | ౩౫,౬౫,౬౯,౫౦౦ |
| ఇతరదేశములు | ౩,౦౦,౩౬,౬౧,౫౦౦ |

పై లెక్కలు ఒకకాలమునందు స్వర్ణభూమి యని ప్రసిద్ధి బడసిన హిందుస్థానము వర్తమానకాలమునందు దారిద్ర్య భూయిష్ఠమై యధోగతిపా లగుచున్న విధమును విశదము చేయుచున్నవి. హిందుస్థానమందలి బంగారమంతయును విదేశముల పాలైన తరువాత హిందుస్థానమునకు ప్రపంచవ్యాపారములందు ప్రతిపత్తి గలుగజేయుటకు రాజ్యాంగములు పూనుట ప్రపంచేతిహాసములందు విచిత్రాధ్యాయముగ పరిణమింపగలదు. రిజర్వుబ్యాంకు బంగారము లేకనో బ్రిటిషు బంగారముతోనో బ్రిటిషు రాజ్యాంగసూయాపులు నిర్మింపగలరు. ఇది హిందూస్థానము నోచిన నోముఫలము. తగిననోములను నోచి ఫలమును పొందవలసిన భారము హిందూస్థాన నివాసుల మీద నేకలదు. పరులను నిందించుట దూషించుట బాధించుట నిరర్థకము.

హిందుస్థానమునందు ౧౯౩౨-౩౩ నందు రాష్ట్రాదాయములు ౮,౪౭౨ లక్షలును కేంద్రప్రభుత్వాదాయము ౧౨,౯౯౬ లక్షలును చేరి మొత్తము ౨,౧౪,౬౯,౦౦,౦౦౦ వచ్చినది. అనేకరాష్ట్రములందు ఆదాయమునకు మించినవ్యయ మేర్పడినది. కేంద్రప్రభుత్వాదాయమునందలి ౧,౩౪,౦౦,౦౦,౦౦౦ కోట్లయందును, ౬౧,౦౦,౦౦,౦౦౦ సైన్యవ్యయమునకును ౩౪ కోట్లు రైలు అప్పు వడ్డీకిని, ౧౧ కోట్లు ఇతర అప్పుల వడ్డీలకును, ౧౩ కోట్లు సివిలు సర్వీసులకును వ్యయమగుచున్నది. కేంద్రప్రభుత్వపు టాదాయము ౧౯౨౧-౨౨ నందు ౧౧౫ కోట్ల నుండి ౧౯౩౨-౩౩ నందు ౧౩౦ కోట్లకు పెరిగినది. ఆదాయము పెరుగుటకు క్రొత్తపన్నులు విధింపబడినవి. కేంద్రప్రభుత్వవ్యయము గతించిన ౧౦ ఏండ్లయందును ౧౩౮ కోట్ల నుండి ౧౨౧ కోట్లకు తగ్గింపబడినను కేంద్రప్రభుత్వవ్యయము దుర్భరముగ నున్న దనుట నిర్వివాదాంశము. దేశాదాయమునందు సగముభాగము సైన్యవ్యయమునకు వినియోగపడుచున్నప్పుడు దేశాభ్యుదయము దుస్తరమగుచున్నది.

దేశ మనుభవించుచున్న కష్టపరంపరలను నివారించుటకై ప్రజలు, నాయకులు, ప్రభుత్వమును రాజ్యాంగములయందును, సాంఘికార్థికవ్యవస్థలయందును, పూర్వపద్ధతులను విసర్జించి నూతనమార్గము నవలంబింప గోరుచున్నారు. నూతనమార్గ సంకల్ప నిర్మాణములందు స్వదేశీయులకును విదేశీయులకును భావములందును వ్యవహారములయందును సామ్యము దుర్లభము. స్వదేశీయులందును మతభేదములు, ప్రాంతభేదములు, సాంఘికభేదములు, భాషాభేదములు, సామ్యమును

దుర్లభము జేయుచున్నవి. హిందుస్థానమునందు ౨౪ కోట్ల హిందువులు, ౭ కోట్ల మహమ్మదీయులు, ౧ కోటి బౌద్ధులు, ౮౨ లక్షల ఆరణ్యకులు, ౬౨ లక్షల క్రైస్తవులు, ౪౨ లక్షల సిక్కులు గలరు. హిందువులందు ౫ కోట్ల మంది అస్పృశ్యులు గలరు. యూరపియనులు ౧,౬౮,౧౩౪ మందియును, ఆంగ్లోఇండియనులు ౧.౩౮,౩౯౫ మందియును గలరు. భాషావిభాగమును బట్టి హిందీ ౯౬౭, బంగాలి ౪౯౨, తెలుగు ౨౩౬, మహారాష్ట్రము ౧౮౭, తమిళు ౧౮౭, పంజాబీ ౧౬౨, కర్ణాటకము ౧౦౩, ఉత్కలము ౧౦౧, గుజరాతీ ౯౧, బర్మా ౮౪ మళయాళము ౭౪, లక్షలు మాటలాడువారు కలరు. దేశమునందు గల భాషావిభేదములు, మతవిభేదములు, సాంఘికవిభేదములు, ప్రాంతవిభేదములు ప్రజాలక్ష్యమును దేశప్రయోజనములందును ప్రజాప్రయోజనములందును గాక ప్రత్యేక సాంఘికమతస్థానికప్రయోజనములయందు లగ్నము జేయుచున్నవి. విదేశీయప్రభుత్వమునకు విభేదములు రాజ్యాంగసంస్కరణములను సకలవిధముల నిరుపయోగము చేయుటకు వినియోగపడుచున్నవి.

హిందుస్థానమునందు సంస్థానములు విశేషభాగము హిందూసంస్థానములు. మహమ్మదీయులు హిందూసంస్థానములందు ప్రాబల్యము బడయుటకు చేయుచున్న

**హిందూమహమ్మదీయ రాష్ట్రములు**

ప్రయత్నములకు కాశ్మీరు, రాంపూరు, సంస్థానములందు మహమ్మదీయులు చేయుచున్న ప్రబలాందోళనము నిదర్శనము. బ్రిటిషు రాష్ట్రములందు అస్సాము, బీహారు, ఒరిస్సా, మధ్యరాష్ట్రములు, ఢిల్లీ, మద్రాసు, సంయుక్త రాష్ట్రములు, ఉత్కళము, హిందువుల నధికముగ గలిగి యున్నవి. బెలూచిస్థానము, బంగాళము, సరిహద్దు రాష్ట్రములు, పంజాబు, సింధు, మహమ్మదీయులను అధికముగ గలిగి యున్నవి. రాష్ట్రములందును కేంద్రప్రభుత్వమునందును హిందూసాంఘిక వాదులకును మహమ్మదీయ సాంఘికవాదులకును స్వీయసంఘప్రకర్షణమునకై ప్రబలమైనసంఘర్షణ జరుగుచున్న విధము రౌండు టేబిలు సమావేశములు, మహాసభలు, పత్రికావాదములు విశదము చేయుచున్నవి. సాంఘికవిభేదములు విదేశాధికారులకు స్వాధికారసంరక్షణమునకు సకలవిధముల వినియోగపడుచున్నవి. యూరపియనులు ౩౫ కోట్ల ప్రజలయందును ౧,౬౮,౧౩౪ మంద మాత్రమే యున్నను అపారమైన ప్రత్యేకరక్షణములను కోరుచున్నారు. నిమ్నజాతులును హిందువులే యైనను ప్రత్యేకరక్షణను కోరుచున్నారు. హిందూమత నాయకులైన సనాతనధర్మపరాయణులు రాజ్యాంగసంస్కరణములయందు ప్రత్యేక రక్షణమును గోరుచున్నారు. ఈ విభేదములు భేదోపాయబీజములను నాటుట కవకాశములను సమకూర్చినది. బ్రిటిషు ప్రభుత్వము నిర్ణయించిన సాంఘికపరిష్కారము హిందూస్థానము నావరించినదురవస్థకు నిదర్శనముగ నున్నది. మహమ్మదీయులకు వంగరాష్ట్రమునందు ౧౧౯, ఆంగ్లోహైందవులకు ౪, యూరపియనులకు ౧౧, వ్యాపారస్థులకు ౧౯ స్థానములు నిర్ణయింపబడినవి. పంజాబునందు మహమ్మదీయులకు ౧౦౦ కి ౫౧ వంతున స్థానములు నిర్ణయింపబడినవి. మహమ్మదీయులు అల్పసంఖ్యాకులైనరాష్ట్రములందును అధికసంఖ్యాకులైనరాష్ట్రములందును మహమ్మదీయులకే అధికప్రాతినిధ్యము కల్పింపబడినది. అస్పృశ్యులకు ప్రత్యేకనియోజకవర్గము కల్పింపబడినది. హిందూసంఘమునకు చెందిన అస్పృశ్యులు సాంఘికవ్యవస్థలందువలెనే రాజకీయములందును ప్రత్యేకింపబడినందున గాంధిమహాత్ముడు నిరశనదీక్షను పూని పూనా యొడంబడికను సాధించుట హిందూసాంఘిక రాజకీయ చరిత్రయందు దివ్యాధ్యాయముగ నున్నది.

గత వత్సరమునందు ఎఱవాడ చెఱసాలయందు నిమ్నజాతుల నాయకులకును హిందూనాయకులకును

**పూనా యొడంబడిక**

ఏర్పడిన ఒడంబడిక హిందూసంఘమునకును అస్పృశ్యులకును అమూల్యమైన ప్రయోజనమును సమకూర్చినది.

అస్పృశ్యులు సంయుక్తనియోజకవర్గముల ద్వారా మద్రాసునందు ౩౦, బొంబయి సింధునందు ౧౫, పంజాబునందు ౮, బీహారు ఒరిస్సాలందు ౧౮, మధ్యరాష్ట్రములందు ౨౦, అస్సామునందు ౭, బంగాళమునందు ౩౦, సంయుక్తరాష్ట్రములందు ౨౦, మొత్తము ౧౪౮ స్థానములను పొందగలరు. కేంద్రప్రభుత్వమునందు సామాన్య స్థానములందు ౧౦౦-కి ౧౮ వంతున స్థానములు అస్పృశ్యులకు సంక్రమింపగలవు. ఉద్యోగములందు సంఖ్యానుసారము అస్పృశ్యులకు ఉద్యోగములు లభింపగలవు. విద్యాదివ్యయములందు యుక్తమైన మొత్తము అస్పృశ్యుల విద్యాభ్యాసాది సౌకర్యములకై వినియోగపడవలయును. ఈ యొడంబడికను పూనానగరమునందు శ్రీయుతులు మాలవ్యా, అంబేద్కరు, సాంకెన్, శ్రీనివాసన్, సప్రూ, జయకర్, రాజా, బిర్లా, శివరాజు గార్లు మొదలగు నాయకు లామోదించిరి. ఈ యొడంబడికవలన హిందూ సంఘాభ్యుదయమునందొక నూతనాధ్యాయము ఆరంభమైనది. పూనాయొడంబడిక సనాతనులకును సంస్కర్తలకును ప్రస్తుతము సంఘర్షణమునకు మూలమైనను కాలాంతరమునందు 6 కోట్ల దీనులకు విమోచనము గలుగజేయుటవలన హిందూమతమునకును సంఘమునకును మానవధర్మమునకును అమూల్యమైన ప్రయోజనములను సమకూర్పగలదు. రాజ్యాంగసంస్కరణములు గలుగజేయగల పరోక్షఫలను నిమ్నజాత్యుద్ధరణము.

హిందూస్థాన పరిస్థితులను సావకాశముగ నవలోకించెడివారలకు ఈ ప్రస్తావనయందు తెలుపబడిన లెక్కలు విదేశీయప్రభుత్వమునకు సామ దాన భేదదండోపాయముల ప్రయోగమునకు గలయవకాశములను విస్పష్టము చేయుచున్నవి. కాంగ్రెసు గ్రామసీమలందు ౧౦౦ కి ౮౦ వంతునగల ప్రజలకు రాజకీయములు గోప్యవిషయములు. పట్టణములందు గలనాయకులను సంతృప్తిపరచుట ప్రభుత్వమునకు సుకరము. కాంగ్రెసు ౧౮౮౫ సంవత్సరమునుండియును ప్రజాప్రబోధమునకై చేయుచున్న ప్రయత్నములు జగద్విఖ్యాతములు. ౧౯౩౧ యందు గాంధీ-ఇర్విను ఒడంబడిక జరుగుటయును మహాత్ముడు ఆగస్టుమాసమునందు రెండవ రౌండు టేబిలు సభకు వెళ్లుటయును హిందూరాజ్యాంగ చరిత్రయందు శాంతిపర్వముగ నున్నది. ౧౯౩౧ డిసంబరు మాసారంభమునందు ప్రభుత్వము పశ్చిమోత్తర రాష్ట్రమునందు నిర్బంధ విధానమును ప్రారంభించినది. ౧౯౩౨ జనవరి ౪ తేదిని మహాత్ముడు ముఖ్యనాయకులతో నిర్బంధింపబడిరి. గతసంవత్సరమునందు కాంగ్రెసు అవలంబించిన శాసనోల్లంఘనవ్యవహారములును, ప్రభుత్వమవలంబించిన నిర్బంధశాసనపరంపరలును చరిత్రాంశములు. విల్లింగ్డను ప్రభువు మహాత్మునితో సంప్రదించుటకైన నిరాకరించుటయును శాంతికాముడైన గాంధీమహాత్ముని నిర్బంధించుటయును శాంతిస్థాపనకు సాధనము గాజాలదు.

ఇర్విను ప్రభువు రెండు దేశముల ప్రజాప్రతినిధులను సంప్రతించి రాజ్యాంగనిర్మాణమును చేయుట కవకాశము గల్గింపబడగలదని ౧౯౩౦ అక్టోబరునందు చేసినప్రకటనము కాలక్రమమున నిరర్థక మైనది. ౧౯౨౮ నందు సర్ జాన్ సైమను కమిషనుతో నారంభమైన హిందుస్థాన రాజ్యాంగ సంస్కరణ విమర్శనలు మూడు రౌండు టేబిలు సమావేశములతోను, ఈ మాసమందు ప్రచురింపబడిన శ్వేతపత్రముతోను ఇంతవఱకును పరిసమాప్తి నొందినవి. రెండు మాసములలో జాయింటు పార్లమెంటరీ కమిటీ సమావేశమై రాజ్యాంగశాసనమును నిర్మాణము చేయనున్నది. శ్వేతపత్ర రహస్యములను గ్రహించినవారలకు శాసనస్వరూప స్వభావములందు ఆశాకాంతులు గోచరముకావు. బ్రిటిషుజాతీయప్రభుత్వపు సామ్రాజ్యధురంధరత్వాభిమానము, చర్చిలుగారి ప్రతిఘటనము, శామ్యుయెల్ హోరుగారి సామోపాయములు, నిరంకుశాధికారుల నిర్లక్ష్యదురభిమానములు, సాంఘికుల స్వప్రయోజనములు, యూరపియనుల స్వప్రయోజనసంరక్షణములు, రాజ్యాంగ

నిర్మాణమును దేశప్రయోజనమునకు నిరుపయోగము చేయునని వివిధపక్షములవారును ఘోషించుచున్నారు. ఈ ఘోష సంభాషణలందును, తీర్మానములందునునుండునంతవఱకు దేశమునకు ప్రయోజనము గలుగదని ప్రపంచ చరిత్రానుభవము విశదము చేయుచున్నది. ప్రపంచమంతయును స్వాతంత్ర్యమునకై పరితపించుచున్న సమయమందు నిర్బంధశాసనములును, తాత్కాలికోపశమన సంస్కరణములును, ౩౫ కోట్ల ప్రజలుగల హిందూస్థానమునకు సమాదరణీయములు గాజాలవు.

కాంగ్రెసు ప్రజాశయములను నిర్భయముగ వ్యక్తము చేయుటకును సఫలము చేయుటకును నేర్పడిన జాతీయమహాసంస్థ. కాంగ్రెసు ఆబాలగోపాలమునకును పూజ్యమైనసంస్థ. దేశభక్తులెందఱో కాంగ్రెసు రక్షణమునకై మహాత్యాగము జేసిన విషయము సర్వత్ర విదితము.

కాంగ్రెసు నిర్బంధవిధానము

హిందూస్థానమునందు దాదాభాయి, తిలకు, దాసు, నెహ్రూ, సరోజిని, పటేలు, గాంధిగార్లు మొదలగు వారి నామములను సకలసంఘములును, పక్షములును పూజించుచున్నవి. బ్రిటీషురాజ్యాధికారులును కాంగ్రెసు గౌరవప్రతిష్ఠల నంగీకరించిరి. కాంగ్రెసు సంస్థలను కాంగ్రెసు వ్యవహారములను నిర్మూలముచేయుటకు ప్రభుత్వ మవలంబించిననిర్బంధవిధానము దేశమునందంతటను నశాంతిని పెంచినది. ౧౯౩౨ నందు దేశమునందు సకలవ్యవహారములందును ఆర్డినెన్సుల రాజ్య, మారంభమునందు తాత్కాలికముగను, తదనంతరము శాశ్వతముగను స్థాపింపబడినది. గతసంవత్సరమునందు ౧౨ ఆర్డినెన్సులు ప్రకటింపబడినవి. ఆర్డినెన్సులద్వారా ఆగస్టు ౨౨ వఱకును ౫౫,౯౯౦ పురుషులు, ౨,౭౦౪ స్త్రీలు నిర్బంధింపబడిరి. ఢిల్లీయందు ప్రభుత్వప్రతిషేధము నిరాకరింపబడి శ్రీ పండిత ప్యారిలాలు శర్మగారి యధ్యక్షతక్రిందను ౪౭-వ కాంగ్రెసు గూడినది. ఆంధ్ర కేరళ తమిళాది రాష్ట్రములందును కొన్ని మండలములందును ప్రతిషేధింపబడిన కాంగ్రెసు సభలు జరుపబడినవి. ప్రభుత్వాధికారులు కాంగ్రెసు వాసన గలవారి నందరిని నిర్బంధించిరి. ద్రవ్యము నపహరించిరి; భవనాశ్రమాదుల నాక్రమించిరి. కలకత్తానగరమునందీమాసాంతమునందు ౪౮-వ కాంగ్రెసు గూడనున్నది. ప్రభుత్వ మవలంబించిన నిర్బంధవిధానము దురంతకార్యములకును, దౌర్జన్యములకును, రహస్యాచరణములకును సాధనమైనది. శ్రీ బినదాసుకన్య సర్ స్టాన్లిజాక్సనుగారిని వధించుటకు ప్రయత్నించినది. వంగదేశమునందును నితర ప్రాంతములందును విప్లవోద్యమము వ్యాపించినది. దేశమునందంతటను నిర్బంధశాసనములను ప్రతిఘటించుటకు దేశారాధకులకు రహస్యమార్గములు శరణ్యములైనవి. దురంతములు నధికారులవలె ప్రజానాయకులును నిరసించుచున్నారు. విప్లవోద్యమమును రహస్యమార్గములను ప్రతిఘటించుటకు సాధనము ప్రజాశయములను సఫలముచేయుటగాని నిర్బంధవిధానము సాధనముగాదని వివిధదేశముల రాజ్యాంగముల చరిత్రములును విశదముచేయుచున్నవి. సంకుచితములైన రాజ్యాంగ సంస్కరణములును తీవ్రమైన నిర్బంధవిధానమును స్వాతంత్ర్య యుగమునందు శాంతిస్థాపనమునకు సాధనము గాజాలదు.

సైమను కమిషనుతో నారంభమైన నూతన రాజ్యాంగ నిర్మాణవిధానాంకురములు బహిష్కరణమునకును మూడురౌండుటేబిలు సమావేశములందు ఖండనమండనములకును పాత్రమై మార్చి ౧౭ తేదీయందు శ్వేతపత్రరూపమున వెలువడినవి.

* శ్వేతపత్రము

శ్వేతపత్రమునందు సూచింపబడిన రాజ్యాంగసంస్కరణబీజములు హిందూస్థానమునందేపక్షమువారికిని సంతృప్తిని కలుగజేయలేదని మితవాదులు, వర్తకసంఘములు, మహమ్మదీయులు, సిక్కులు, హిందువులు, పత్రికలు, శాసనసభలు, వ్యక్తముచేసిన యభిప్రాయములు విశదముచేయుచున్నవి. అతివాద కన్సర్వేటివు పక్షమువారికోరికలే సఫలము లగునని శ్వేతపత్ర

*పాఠకుల యుపయోగార్థము శ్వేతపత్ర మనుబంధముగను ప్రచురింపబడినది.

ములోని సూచనలు విశదపరచుచున్నవి. బ్రిటిషుజాతీయ ప్రభుత్వ మిదివరకే సిద్ధపరచిన రాజ్యాంగ సంస్కరణ శాసనము వాడుకప్రకారము పార్లమెంటరీ జాయింటు కమిటీసమక్షమున ప్రతిపాదితమై చర్చింపబడి శాసనరూప మున త్వరలో వ్యవహరింపబడుట తథ్యము. జాయింటు కమిటీ నిర్మాణము, హైందవప్రాతినిధ్యము, సంస్కరణనాట కరంగమునకు పరిపాటియైన అంగోపాంగములు. జాతీయ ప్రభుత్వము వెంటనే రాజ్యాంగసంస్కరణములను ఆచర ణయందు పెట్టుటకు తలపెట్టిన విషయమును శ్వేతపత్ర మందలి అంతరార్థము సూచించుచున్నది. సంస్కరణ ముల ప్రయోజనము కేంద్ర ప్రభుత్వమునుండి రాష్ట్ర ములకు వ్యాపించునదియును, రాష్ట్రములనుండి కేంద్ర ప్రభుత్వమునకు వ్యాపించునదియును, ఉభయమార్గము లకు శ్వేతపత్రము సూచించినంతవఱకైనను వ్యాపింప కుండునదియును, కాలగర్భమునందు గలదు. హిందూస్థాన రాజ్యాంగములందు సంపూర్ణపరివర్తనము గలుగవలసిన యవసరమును శ్వేతపత్ర మంగీకరించు చున్నది. కాని దానియందలిసూచనలు మాత్రము భిన్నమార్గము నవ లంబించుచు, రాజ్యాంగములను వెనుకకు మరల్చు చున్నవి.

**ఫెడరేషను**

హిందూస్థానమునందు గల బ్రిటిషు భాగములును, సంస్థానములును సంయోగ సమాఖ్య సంయుక్తపాలన మునందు చేరుటయందు గల సాధక బాధకములు బ్రిటిషుఇండియా ప్రజల కును, సంస్థానప్రజలకును, సంస్థానా ధీశులకును తెలిసినవిషయములు. హిందుస్థానమును ఏకముఖమునను సకలదేశప్రయోజనమునకై ఫెడరేషను రాజ్యాంగపాశబద్ధము చేయుట శరణ్య మని రాజ్యాంగ తత్త్వవేత్తలంగీకరించుచున్నారు. శ్వేతపత్రము కేంద్ర ప్రభుత్వాధికారబద్ధ మైన ఫెడరేషను పూర్ణరాజ్యాంగ నిర్మాణమునకు గమ్యస్థానమని నిరూపించుచున్నది. సంస్థా నాధీశులు బ్రిటిషువిభాగములు దేశాభ్యుదయమునకై స్వప్రయోజనములను విసర్జించి మహాత్యాగమును జేయవలసినశుభసమయము సంప్రాప్తమైనది. ఈశుభ సమయమునందు హిందూదేశవాసు లందరును జాతిమత కులస్థలదశాభేదములను, స్వీయప్రయోజనములను పూర్ణ ముగ విసర్జించినగాని ఫెడరేషను చిరకాలమునకై నను సాధ్యము గాజాలదని దేశవ్యవహారము లనంత ముఖములను వ్యక్తముచేయు చున్నది. కేంద్ర ప్రభుత్వ మందు గలుగగల స్వల్పాధికారలాభములకు భిన్నసం ఘములకును వివిధపక్షములకును వివిధప్రయోజనముల కును వివిధమతములకును వివిధరాష్ట్రములకును ప్రవర్ధ మానమగుచున్న సంరంభము ఫెడరేషను రాజ్యాంగ స్థాపనమును దూరస్థము చేయుచున్నది.

**భాషాప్రయుక్త రాష్ట్రములు**

ఫెడరేషను రాజ్యాంగమునందు కొంత ప్రయో జన మేర్పడినను ఆప్రయోజనములు ఆంగ్ల విద్యావంతుల కును, శ్రీమంతులకును, పట్టణవాసుల కును, జమీందారులకును, వ్యాపారస్థ లకును, యూరపియను సంఘములకు ను, సంఘాభిమానులకును వినియోగపడినటులు ౧౦౦ కి ౮౦ వంతున గ్రామసీమనివాసులగు నిఱుపేదలైన వ్యవసాయదారులకు వినియోగపడదు. ఫెడరేషను ప్రజలకు వినియోగపడుటకును, రాష్ట్రీయస్వపరిపాల నము కొంతవఱకైనను ప్రజలకు సార్థక మగుటకును విశాలమైన హిందుస్థానమును భాషాప్రయుక్తరాష్ట్ర ములుగ విభజించుట ప్రథమసాధనము. వ్యయభారము నందు విశేషభాగము భరించునట్టియును, జనుల యందు ౧౦౦ కి ౮౦ వంతున నున్నట్టియు వ్యవసా యదారులకు నూతనరాజ్యాంగములయందును పూర్వము వలెనే పన్నులను చెల్లించుట తప్పని దైనను లాభము మాత్రము మృగ్యముగ నున్నది. ఉత్కళరాష్ట్రమును వలె నితరభాషాప్రయుక్త రాష్ట్రములను నిర్మించుట వలనను జనసామాన్యము రాజ్యాంగములందు ప్రమేయ మును గల్పించుకొనుట కవకాశములు లభించెడివి. సర్

సామ్యుయలు హోరుగారును, బ్రిటిషు ప్రభుత్వమును ఆంధ్రరాష్ట్రనిర్మాణవిషయమై ఆంధ్రులు చేసిన విన్నపమును నిరాకరించుటకు గారణము మద్రాసు ప్రభుత్వమును, మద్రాసు రాజకీయపక్షములును చూపిన నిరాదరణయే కారణమై యుండవలయును. భావికాలమునందును పూర్వమునందువలెనేమంత్రులకును,గవర్నరులకును సన్మానసంచారములకును, వరప్రదానములకును, గౌరవప్రతిష్ఠలకును అఖండావకాశములను సంరక్షించుట బ్రిటీషు రాజ్యనీతి యని శ్వేతపత్రపరిశీలనము పరిస్ఫుటము చేయుచున్నది. ఫెడరేషను సాధ్యమైనపుడు కేంద్రప్రభుత్వమునందు స్వల్పబాధ్యతయును, కేంద్రప్రభుత్వమునందు బాధ్యత గలిగినపుడు రాష్ట్ర ప్రభుత్వములయందు కొంత బాధ్యతయును గలుగవచ్చును. అప్పుడైనను గవర్నరు జనరలును గవర్నరులును పూర్ణమైన నిరంకుశాధికారమును గలిగియుందురు.

రాజ్యాంగ విధానమునందు హిందూస్థానముతో సంబంధము గల బ్రిటిషు హక్కులకు కొంతవఱకును రక్షణము లేర్పడుట ధర్మము. ఇర్విను ప్రభువు రక్షణములు ముఖ్యముగను హిందూస్థాన ప్రయోజనములకై వినియోగపడు నని నాయకులందు విశ్వాసమును గల్పించెను.

రక్షణములు

శ్వేతపత్రమునందు నిరూపితములైన ౧. సైన్యరక్షణము ౨. బ్రిటిషు వ్యాపారరక్షణము. 3. రైల్వే పరిపాలన రక్షణము. ౪. ఆర్థికప్రయోజన రక్షణము. ౫. నిరంకుశాధికార రక్షణము. ౬. పౌరసేవోద్యోగ స్వత్వరక్షణము. ౭. శాంతిన్యాయరక్షణము ౮. స్వల్పసంఖ్యా ప్రయోజన రక్షణము ౯. యూరపియను ప్రయోజన జనరక్షణము మొదలగు రక్షణము లన్నియును స్వాతంత్ర్యమునకును హిందూస్థాన ప్రయోజనములకును ప్రతికూలములనుట నిర్వివాదాంశము. గవర్నరు జనరలునకును గవర్నరులకును ఆర్డినెన్సుల నిర్మాణాధికారమును వ్యయనిర్ణయాధికారమును శాసనసభాభిప్రాయములకు వ్యతిరేకముగ నున్నపుడు స్వాతంత్ర్యము సకలసందర్భములందును మృగ్యముగ నున్నది. రాష్ట్రీయస్వాతంత్ర్యమును నిరాధారమని సాంఘికాభిమానుల యభిప్రాయమని చెన్నరాష్ట్రశాసనసభయం దంగీకృతమైన ప్రతిపాదనములును విస్పష్టము చేయుచున్నవి.

గాంధీమహాత్ముడు రెండవ రౌండుటేబిలుసమావేశసమయమునందు లండను నగరమునందు యథార్థమైన రాష్ట్రీయస్వాతంత్ర్యము తనకు సంతృప్తిని గలుగజేయునని తెలిపినపుడు నాయకులందఱును మహాత్ముని పరిహాసించిరి. కార్యనిర్వాహకవర్గము శాసనసభలకు బాధ్యతను వహింపక గవర్నర్లకు బాధ్యత వహించెడి రాజ్యాంగములు స్వాతంత్ర్యప్రతికూలములు గాని, అనుకూలములు గావు. శ్వేతపత్రము గవర్నర్ల నిరంకుశాధికారమును పూర్వమువలెనే సంరక్షించుచున్నది. పౌరసేవోద్యోగులకు సకలసందర్భములందును సంరక్షణములను నిరూపించుచున్నది. ప్రజాధికారమును సంకుచితము చేయుటకు కొన్నిరాష్ట్రములకు రెండు శాసనసభలు నిర్ణయింపబడినవి. హిందూస్థానమును బంధించుచున్న బ్రిటిషు కవచమునందు ఒకబంధన మైనను శిథిలము చేయబడలేదు. దేశస్వాతంత్ర్యమునకును శాంతిస్థాపనమునకును నిర్బంధముల ననుభవించుచున్న గాంధిమహాత్ముడును కాంగ్రెసు నాయకానుచరులును విమోచనమును బడయక రాజ్యాంగప్రణాళికను సిద్ధము చేయబూనుట నిరర్థకము. కాంగ్రెసు నాయకానుచరులను నిపుడు తల పెట్టినటులు ప్రభుత్వము మెల్లమెల్లగ విడుదలచేసినను బ్రిటీషుప్రభుత్వమునందు హృదయపరివర్తనమును రాజ్యాంగనిర్మాణములందు యథార్థమైన స్వాతంత్ర్య బీజాంకురములును గలుగక దేశమునందు శాంతియును సంతృప్తియును బ్రిటీషు ప్రయోజనములకు కొంతమైనను ఉపకృతియును గలుగజాలవు.

రాష్ట్రీయ స్వాతంత్ర్యము

చెన్నరాష్ట్రము ప్రభుత్వలక్ష్యమునందు సుపరిపాలితరాజ్యము. విల్లింగ్డను ప్రభువుగారి మెప్పులను బడసినది. ద్వంద్వప్రభుత్వవిధానమునందును రెండు భాగములును సమష్టి కుటుంబమువలెను చెన్నరాష్ట్రము పనిజేసినవి. రాష్ట్రమునందు శ్రీమంతులకును నిరంకుశాభి మానులకును సాంఘికాభిమానులకును గల ప్రతిపత్తి ప్రజాహితపరాయణులకు దుర్లభము. జస్టిసు పక్షము శ్రీ బి. మునిస్వామి నాయుడుగారికి జూపిన నిరాదరణము ప్రజాహృదయము నావరించిన మాంద్యమునకు నిదర్శనము. సాంఘికబలవిభేదములమీద నాధారపడి యుండెడి పక్షబల మెప్పుడును ధర్మాధారము లేక స్వప్రయోజనములకు నయితము నిరుపయోగ మగును. ఒకవైపున నధికారప్రాపకము, రెండవవైపున స్వప్రయోజనపరాయణు లైన స్వపక్షావలంబనుల దయాదాక్షిణ్యములు సామాన్య ధర్మనిర్వహణమును నయితము దుస్తరము చేయుచున్నవి. మద్రాసు శాసనసభయందు జమీందారులప్రాబల్యమును సంఘాభిమానుల దురాలోచనలు ధర్మాధార రహితమైన జస్టిసు పక్షవిలయమునకు వినియోగపడినవి. మద్రాసు శాసనసభయందు ప్రబలముగ నున్న సంఘాభిమానమునకు శ్వేతపత్రమువిషయమై శాసనసభయందు జరిగినచర్చ నిదర్శనముగ నున్నది. బీహారు శాసనసభవలెను మద్రాసు శాసనసభ శ్వేతపత్ర మసంతృప్తికరముగ నున్నదనియైనను తీర్మానింప జాలకపోయినది. సర్ పరశురామ పాత్రోగారి ప్రసంగము మద్రాసు శాసనసభ రాజ్యాంగవిధానమునకు స్వాగతము నొసంగనున్న విధమునకు నిదర్శనముగ నున్నది. శ్వేతపత్రము కొన్ని రాష్ట్రములకు రెండుశాసనసభలను నిర్దేశించుచున్నను మద్రాసురాష్ట్రమునకొకశాసనసభ నేనిర్దేశించుట సహకార ఫలమని యూహింపదగియున్నది. సాంఘికపక్షబలముమీద నాధారపడియున్న శాసనసభలు గతకాలమునందుచేసిన వ్యవహారములను స్మరించినప్పుడు సాంఘిక ప్రాతినిధ్యము ప్రబల మగు భావిశాసనసభలు చేయగల వ్యవహారము లాశాజనకములు గాజాలవు. రాజ్యాంగ సంస్కరణములు ప్రజలకు సమకూర్పగల ప్రయోజన మత్యల్పమని గతానుభవమువలె భావికాలానుభవము విశదము చేయగలదు. గతించిన ౧౦ఏండ్లయందలి శాసనసభల వ్యవహారములను అవలోకించినపుడు జమీందారులు సాంఘిక నాయకులు నాయకత్వమునకును, మంత్రిపదవులకును, నధికారాదరణమునకును అవలంబించగల వ్యవహారక్రమము విశదమగుచున్నది. స్థానికసంస్థల వ్యవహారము లధికారసిద్ధికై సాంఘికనాయకానుచరులు నిర్భయముగ నవలంబించగల వ్యవహారవిధానమును విస్పష్టము చేయుచున్నవి. ప్రజాపక్షాభిమాను లైన శ్రీ మునిస్వామినాయుడుగారిని బోలిన నాయకులు సాంఘికమత దశాభేదములులేని ప్రజాపక్షమును కేవలము ప్రజాక్షేమమునకై స్థాపించి నడిపించవలసిన శుభసమయము సంప్రాప్త మైనది. సంకుచితమైన రాజ్యాంగములనైనను ప్రజాక్షేమమునకై వినియోగించుటకు సేవాపరాయణుల కవకాశములుగలవు. నాయకులు ప్రజలు స్వాభిమానమును, సంఘాభిమానమును విడచి ప్రజాక్షేమమునకై పాటుపడుటకు భగవదనుగ్రహము గలుగుగాత!

చెన్నరాష్ట్రాదాయము ౧౯౩౩-౪ నందు రూ. ౧౭,౯౬,౭౧,౦౦౦ లు. ఆదాయమునందు భూమ్యాదాయము రూ. ౭,౫౭,౬౯,౦౦౦ లు. వ్యవసాయదారులు భూమిసిస్తుతోపాటు సెస్సులను, ఇతరములైన పన్నులను చెల్లించుచున్నారు. వ్యవసాయదారుడు ప్రత్యక్షముగను పరోక్షముగను పన్నులందు ౧౦౦ కి ౮౦ వంతునను చెల్లించుచున్నాడు. వ్యవసాయదారులకు నిలయములును దేశాదాయమునకు సాధనములును, అధికప్రజలకు నివాసస్థానములును ఐన గ్రామసీమల క్షేమస్వాతంత్ర్యముల మీద స్వరాజ్యసౌధము నిర్మితము గావలసియున్నది. ధర్మాధారముగల ప్రజాపక్షనిర్మాణ మీప్రయోజనమును కొంతవరకైన సమకూర్పగలదు.

**ఆంధ్ర రాష్ట్రము**

మద్రాసు రాష్ట్రాంతర్భాగమైన ఆంధ్రరాష్ట్రము దేశావసరములకవసరమైన విధమున నాత్మవికాసమును బొందజాలక పరితపించుచున్నది. వర్తమాన ప్రజాప్రబోధయుగమునం దధికారాదరణ ప్రాపకములు నిరాదరణీయములైనను నిత్యవ్యవహారములందు సామాన్యప్రజాలక్ష్యము నాకర్షించుచు నవసరము లగుచున్నవి. దేశాభ్యుదయమున కవసరములైన బాటలకును, వంతెనలకును, జలాధారములకును, విద్యావ్యాపనమునకును, వైద్యసహాయమునకును ఉచితరీతిని నాంధ్రావని కుపకృతి గలుగుటలేదు. దక్షిణమున కావేరీనదికెన్ని యో వంతెనలు గలవు. కృష్ణాగోదావరీ నదులు రాజమార్గమునందున్నను వంతెనలు లేవు. శ్రీపానుగల్లు రాజాగా రాంధ్రవిశ్వవిద్యాలయమును స్థాపించినను డాక్టరు సుబ్బరాయనుగారు సంకుచితముచేసిన పుణ్యమును కట్టుకొనిరి. ప్రతిభావంతులైన శ్రీరాధాకృష్ణ పండితుని యాజమాన్యము క్రింద నాంధ్రవిశ్వవిద్యాలయము రూపరేఖావిలాసములను బడయుట పురోవృద్ధికి శుభచిహ్నము. శ్రీ పండిత రాధాకృష్ణ, పండిత వెంకటరామనుగారల యుపదేశానుసారముగ నాంధ్రదేశమునందలి ప్రథమమధ్యమ కళాశాలలు విద్యాప్రవృత్తిని వర్తమానావసరముల కనురూపముగ నిర్ణయించుట సమంజసము. అనంతపురము కళాశాల నాంధ్రవిశ్వవిద్యాలయానుబంధ కళాశాలను చేయుటకు విశ్వవిద్యాలయనిర్వాహకులును, రాయలసీమవాసులును, ప్రభుత్వాధికారులును పనిబూనుట శ్రేయస్కరము. ఆదర్శములందును భావములందును, భాషయందును, ప్రయోజనములందును సామ్యముగల విశ్వవిద్యాలయమునకును, కళాశాలకును, సంబంధ సాహచర్యములు శ్రేయోదాయకములు. వివిధప్రభుత్వశాఖలందును నాంధ్రప్రయోజనములు నిరాదరణమును బడయుచున్నవి. ప్రజాపోషణమున కవసరమైన తుంగభద్ర జలాశ్రయము మెట్టూరు ప్రాజెక్టువలె నధికారాదరణమునకు పాత్రము గానున్నది. సకలవ్యవహారములందును నాంధ్రవ్యవహారముల కాదరణము గలుగకున్నది. ద్వంద్వప్రభుత్వానంతర మీనిరాదరణ మధికమగుచున్నది. కొన్ని శాఖలం దాంధ్రులు ప్రధానాధికారులుగ నున్నను వారి ప్రధానాధికారమే వారిసంకల్పసిద్ధికి ప్రతిబంధకముగ నున్నది. ఆంధ్రులకు సహజమైన మోమోటమును, ఆంధ్రేతరవాతావరణమును, పక్షప్రయోజనములును, నిస్సహాయత్వమును ప్రధానాధికారులకును కార్యాచరణమునందు ప్రతికూల పరిస్థితులు గలుగుచున్నవి. శ్రీమునిస్వామినాయుడుగారు ప్రధానమంత్రిగనున్నను ఆంధ్రోద్యమమునకు అవసరమైన పోషణ ప్రోత్సాహములు లభింపలేదు. శ్రీబొబ్బిలి మహారాజాగారు ప్రధానమంత్రిపదవిని స్వీకరించినతోడనే వారి ఆంధ్రోద్యమాభిమానము చల్లపడినది. శ్రీబొబ్బిలి రాజాగారు ఉత్కళరాష్ట్ర సరిహద్దుల నిర్ణయసందర్భమందు శ్రీకల్లికోట రాజాగారిని ప్రతిఘటించుటకు విరమించిరి. అదృష్టవశమున వ్యవసాయశాఖకు శ్రీయుత శ్రోంతి రామమూర్తిగారును, పరిశ్రమశాఖకు రామకృష్ణగారును ప్రధానాధికారులుగ నేర్పడినను వ్యవహారాచరణములందు వారి యవకాశము లత్యంతపరిమితములుగనున్నవి. వైద్యశాఖయందును, విద్యాశాఖయందును ప్రతిభావంతులైన యాంధ్రులకు దేశక్షేమమునకు పనిబూనుట కవకాశములు సంకుచితము లగుచున్నవి.

కాంగ్రెసు ప్రయోజనములకు కాంగ్రెసు నిర్ణయించిన ప్రత్యేకాంధ్ర రాష్ట్రవిభాగము ఆంధ్రులకు స్వతంత్రాచరణమున కవకాశము గలుగజేసినది. పదేండ్లకు పూర్వము మద్రాసీనామమే శరణ్యమయిన ఆంధ్రు లిప్పుడు దేశమునందంతటను ఆంధ్రనామముతో గౌరవమునకు పాత్రులుగ నున్నారు. రాగల సాంఘిక పక్షప్రభుత్వరాజ్యాంగములందును నాంధ్రోద్యమమునకు హృదయమైన ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము పోషణమును బడయదని శాసనసభల వ్యవహారములు విస్పష్టము చేయుచున్నవి.

ప్రతికూల వాతావరణముగల ఉత్కళులకు రాష్ట్రనిర్మాణము నంగీకరించుటయును, అనుకూలవాతావరణముగల ఆంధ్రులకు రాష్ట్రనిర్మాణము నిరాకరించుటయును ప్రభుత్వహృదయము నావరించిన సంకుచిత స్వభావమును వెల్లడిచేయుచున్నవి. ఆంధ్రుల స్వాతంత్ర్యప్రియత్వమును, ఉదారస్వభావమును, సహనశీలమును ఆంధ్రరాష్ట్రసిద్ధికి ప్రతిబంధకములుగ నేర్పడినవి. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకై యువజనులు వారిశక్తిసామర్థ్యములను వినియోగించి కార్యసిద్ధిని బడయుట వర్తమాన ప్రపంచావృతమైన విషమావస్థయందు పరమావసరమై యున్నది. ఆంధ్రోద్యమమునకు పితామహులై మహాత్యాగమును జేసి కష్టముల ననుభవించిన దేశభక్త వేంకటప్పయ్యపంతులుగారనారోగ్యము వలన కార్యభారమును నిర్వహింపజాలకున్నారు. కార్యశూరులైన యువకులు నాయకకవచమును ధరించి ఆంధ్రోద్యమమును నడుపవలసిన యవసరము గలిగినది. ఆంధ్రయువజను లాత్మోపలబ్ధికి, స్వధర్మనిర్వహణమునకు బూనుకొనుట భావ్యము.

రాయలసీమ

ఆంధ్రావనియం దాదికాలమునుండియును రాయలసీమ తెనుగు సీమ. కవిబ్రహ్మతిక్కన సోమయాజి తన కవిత్వమహత్వమున నాంధ్రావనికి మోదముగల్పించినటులు శ్రీకృష్ణ దేవరాయలు రాజకీయసాంఘికార్థిక సారస్వతాది సకల విషయములందును నాంధ్రావనికి ప్రమోదమును కల్పించిన మహాపురుషుడు. ఆంధ్రత్వమును తిక్కనసోమయాజివలె పెద్దనామాత్యుడు, రామ రాజభూషణుడు, శ్రీకృష్ణదేవరాయలు మొదలగు మహానుభావులు రక్షించి పోషించిన విధమున కాంధ్రేతిహాసములు ప్రత్యక్ష ప్రమాణములు.

ఆ. వె. తెలుగదేలయన్న ! దేశంబు తెలుగేను
తెలుగువల్లభుండ తెలుగొకండ,
ఎల్లనృపులు గొలువ నెఱుగవే బాసాడి
దేశభాషలందు తెలుగు లెస్స !

శ్రీకృష్ణదేవరాయ విరచితమైన ఆముక్తమాల్యద తెలుగు బాషకు దేశభాషలందు గౌరవమును కల్పించినది. ఉత్తరాంధ్రులకును, పశ్చిమాంధ్రులకును తిక్కనవలె పెద్దనయును, ప్రతాపరుద్రునివలె శ్రీకృష్ణదేవరాయలును పూజాపాత్రులు. రాయలకాలమునందు పాడిపంటలకును, వైభవవిలాసములకును, ధైర్యసాహసములకును, కళానిర్మాణములకును, నవ్యసారస్వతరచనలకును, స్వాతంత్ర్యప్రియత్వమునకును నిలయమైన రాయలసీమ వర్తమానకాలమం దనుభవించుచున్న విషాదావస్థ సకలాంధ్రాదరణమునకును తగియున్నది. రాయలసీమ నావరించిన విషాదావస్థకు కారణములు ప్రభుత్వనిరాదరణమును, నవకాశాభావమునుగాని రాయలసీమవాసుల సాహససంస్కార వివేకాభావములు కావు. దుర్బలస్థితియందున్న ఉత్తరాంధ్రులును, రాయలసీమాంధ్రులును గలిసి పనిజేసి ఆంధ్రాభ్యుదయార్థమైన ఆంధ్రరాష్ట్రస్థాపనము జేయుటకు భగవదనుగ్రహము గలుగుగాత !

భగవదనుగ్రహమువలన శ్రీముఖ సంవత్సరారంభమునందు ౨౮-వ సంవత్సరాదిసంచికను ఆంధ్రమహాజనులకు సమర్పింపగలిగినందులకు వ్యాసకర్తలకును, చిత్రకారులకును, కవులకును, నితరమహాశయులకును నిర్వాహకులు కృతజ్ఞులు. వర్తమాన దేశకాలపరిస్థితులందు పత్రికాప్రచురణమును, సంవత్సరాది సంచికాప్రచురణమును దురారాధ్యముగ నున్నవి. నిర్బంధశాసనములు భావస్వాతంత్ర్యమును, సంభాషణస్వాతంత్ర్యమును, ప్రచురణస్వాతంత్ర్యమును వజ్రపాశములందు బంధించినవి. ప్రచురణవిషయములందును, చిత్రపటములందును నిషిద్ధవిషయములను, సమ్మతవిషయములను నిర్ణయించుట దుర్లభము. ప్రజాహృదయము నాకర్షించెడి పటములు, వ్యాసములు, విమర్శనలు వ్రాయగల యవకాశములు, ప్రచురింపగల యవకాశములు పరిమితములు. విషమపరిస్థితులందును ఆంధ్రమహాజనుల సహాయపోషణాదరణములవలన శ్రీముఖసంచికను సంవత్సరాదిని

ప్రచురింపగలభాగ్యము కలిగినందుకు సంచికానిర్వాహకులు కృతజ్ఞులు.

మొదటిసంవత్సరాదిసంచిక బొంబాయియందు సాధారణసంవత్సరాదిని తత్త్వవివేచక ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది. శ్రీముఖసంచిక చెన్నపురియందు స్వీయాంధ్రపత్రికా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది. కడచిన ౨౮ ఏండ్లయందును ఆంధ్రావనియందును, హిందుస్థానమునందును, ప్రపంచమునందును రాజకీయ మతసాంఘికార్థిక సాహిత్య లలితకళాదులందు గలిగిన వికాసమును సంచికయందలి వ్యాసములు, పద్యములు, కథలు, గేయములు, చిత్రపటములు విశదము చేయుచున్నవి.

ఆదికాలమునుండియును ఆంధ్రావనియందు సంస్కృతాంధ్రములకును ప్రాచీన నవీనమార్గములకును సంరంభసాహచర్యములు సహజముగ గలిగినవి. ఆసంరంభ సాహచర్యములందు

సారస్వతము

ఆంధ్రసారస్వతము స్వయంవ్యక్తిత్వమును బడసి వికసించినది. వర్తమాన యుగము నందు ప్రపంచమంతయును నవీనభావములతో తాండవమాడుచున్నది. మానవజీవయాత్రను ఆనంద ప్రదము చేయుటకు కావ్యములు, లలితకళలు ప్రాచీన నవీనభేదములు లేక రసానందమును గలుగజేయుచున్నవి. గతించిన పదేండ్లయందును సారస్వతమునందు వెలసిన నవీనసాహిత్యనిర్మాణములు ఖండన మండనములకు పాత్రమైనను క్రమవికాసమును పొందుచు విద్యావంతుల హృదయముల నాకర్షించుచున్నవి. దేశమంతయును రాజకీయ సాంఘికమతాది విషయములందు స్వాతంత్ర్య ప్రాప్తికై పరితపించుచున్నపుడు సారస్వతమునందీపరితాపము ప్రతిబింబించుచుండును. యువజనులు నవజీవననిర్మాణమునకై మహాత్యాగమును జేయుచున్నపుడు సాహిత్యరచనలందు వారిత్యాగము సహజముగ ప్రతిబింబించు చుండును. సంచికయందు ప్రచురించిన వ్యాసములును, గీతములును, కథలును, విమర్శనలును ఆంధ్రయువజన హృదయా వృతమైన భావపరివర్తనమును విశదము చేయుచున్నవి. సకల నిర్మాణములకును స్వాతంత్ర్యము మూలాంకురము. స్వాతంత్ర్య విలసితములైన రచనలు ప్రాచీన నవీనభేదమును, సంస్కృతాంధ్ర భేదమును లేక ప్రజాదరణమును బడయుచున్నవి.

రా. బ. వీరేశలింగము పంతులుగారాంధ్రోద్యమమునకు మూలపురుషులైనటులు ఆంధ్రచిత్రకలాభ్యుదయమునకు శ్రీయుత కీ. శే. దామెర్ల రామారావుగారు మూలాంకురమును నాటిరి.

త్రివర్ణ చిత్రములు

ఆంధ్రచిత్రకలాభ్యుదయము వారి దక్షత్వమును విశదము చేయుచున్నది. ఈసంచికయందు ౮ త్రివర్ణ చిత్రములును, అనేకములైన సాధారణ చిత్రములును ప్రచురింపబడినవి. త్రివర్ణ చిత్ర పరిశీలన మాంధ్ర చిత్రకళా వ్యక్తిత్వమును తెలుపుచున్నది. రూపరేఖావిలాస విన్యాసములందును, రంగులందును, భావములందును, చిత్రరచనలందును ఆంధ్రయువజనులు చూపుచున్న వ్యక్తిత్వము చిత్రములందు వెల్లడియగుచున్నది. వివిధ ప్రాంతములందును ఆంధ్రయువజనులు స్థాపించిన చిత్రకళా భవనములు ఆంధ్రుల చిత్రకళా ప్రావీణ్యమునకును, నభిరుచికిని నిదర్శనములు. ఇతర రంగములందువలెనే సారస్వత చిత్రకళారంగములందును అవకాశాభావము లాంధ్రుల పురోభివృద్ధికి ప్రతిబంధకములుగనున్నవి. శ్రీముఖసంచికముఖపటము నవీనమార్గము నవలంబించుచున్నది. దేశమునందు సనాతనులను, సంస్కారులను కలవర పరచుచున్న హరిజనసమస్య ముఖపత్ర విషయము. బ్రాహ్మణ క్షత్రియవైశ్య శూద్రులు సనాతన ధర్మమును విసర్జించి నవీనాచార వ్యవహారములను, నూతన వేషభాషలను స్వీకరించినను అస్పృశ్యులు మాత్రము పూర్వమువలెనే శ్రీరామ భజనలను చేయుచున్నారు. దేవాలయ ప్రవేశవిషయమై జరుగుచున్న ప్రతిఘటనము నుపశమింపజేయుటకు శ్రీరాముని సేవించు

చున్నారు. సనాతన ధర్మపరాయణులు అనివార్యమైన సంస్కరణమును హృదయపూర్వకముగ నామోదించి హరిజనులకును నితరవర్ణములకుగల మానవస్వాతంత్ర్యమును ప్రసాదించి హిందూమత సంఘధర్మమును రక్షింతురు గాత!

ఆచారపాశబద్ధమైన ప్రపంచవ్యవస్థలందు నవజీవన ప్రవాహము ప్రసరించుచు ఆచారపాశబంధములను శిథిలము చేయుచున్నది. ప్రపంచమునందంతటను నవజీవన నిర్మాణమునకు ప్రయత్నములు జరుగుచున్నవి. అనుకరణము పారతంత్ర్యమునకును, నిర్మాణము స్వాతంత్ర్యమునకును చిహ్నములు. ప్రపంచమునందంతటను సకల రంగములందును స్వాతంత్ర్యసమరము ప్రవర్ధమాన మగుచున్నది. రాజకీయ సాంఘికార్థిక మత సాహిత్య కళానిర్మాణములు నవజీవనకాంతుల నపేక్షించుచున్నవి. నిరంకుశాధికారులకు రాజకీయ స్వాతంత్ర్యము గిట్టదు. సనాతనులకు సాంఘికసంస్కరణము పనికిరాదు. మతాచార్యులకు మతసంస్కారము పాపభూయిష్ఠము. ధనస్వాములకు ప్రజాస్వాతంత్ర్యము భయంకరము. సాహిత్యకళాభిమానులకు నవీనమార్గము లుపద్రవకరములు. స్వాతంత్ర్య ప్రియులైన వీరులు, ధీరులు, కవులు, గాయకులు, కళాభిజ్ఞులు స్వాతంత్ర్య యుగస్థాపనమునకు వారిశక్తిసామర్థ్యములనువినియోగించవలసినయావసరము కలిగినది. ఆంధ్రదేశ భాగ్యోదయము స్వాతంత్ర్య ప్రియులైన యువజనులమీద నాధారపడి యున్నది. గతించిన పదేండ్లయందును నాంధ్ర మహాజనులు (స్త్రీపురుషులు) చేసినత్యాగమాంధ్రులకు కర్తవ్యమునుబోధించుచున్నది. సాహిత్యకళారచనలందును, సంఘమతాచారములందును నాంధ్ర మహాజను లవలంబించుచున్న స్వాతంత్ర్యమును సంచికయందలిరచనలు తెలుపుచున్నవి. శ్రీముఖ సంవత్సరమునం దాంధ్రులును, సమస్తలోకములును గీతాంతమునందు సంజయుడు ధృతరాష్ట్రునకు జేసిన ధర్మోపదేశానుసారముగ యోగారూఢులై, కార్యపరాయణులై కామితార్థములను బడయుదురు గాత!

శ్లో. యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః,
తత్ర శ్రీర్విజయోభూతిర్ధ్రువానీతిర్మతిర్మమ.

# విశ్వదాతకు—ఉగాదికానుక

పండిత, పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారు

పండింపనేర్చిరి పట్టభూములు రైతు లోలిమై నాణిముత్యాల పంట
వ్రాయంగ నేర్చిరి బడిదిద్దుబాలకుల్ నవ్యార్థభవ్యసత్కావ్యములను
ఊఁకొట్టనేర్చిరి ప్రాకృతాంగనలును రాజకార్యములు విభ్రాజితముగ
చర్చింపనేర్చిరి ఛాందసబ్రాహ్మణు లస్పృశ్యతాదోష మంతరింప
అమలభవదీయ విశ్రాణనమునఁ జేసి-యహరహంబును వెలువడునట్టి యాంధ్ర
భారతీ పత్రికలఁ దనివారఁ జదివి;-యెంత ధన్యుఁడవోయి! నాగేశరాయ!

[1]ఆరంగాంచుట విశ్వదాతృసుకర ప్రారంభసద్ధర్మముల్
బారుల్ దీరిచి వేణునాదమిళితవ్యాసంగ లీలాస్యలై
హేలాలాస్యము చేయుచున్ సరిగ నాగేశాఖ్య, హర్షంబునన్
శ్రీరాగంబునఁ బాడఁజొచ్చి రహహా శ్రీశైలభిల్లాంగనల్.

[2]భద్రమహీధ్రసానుతల భాసితగైరికధాతునూల ల
క్షుద్రభవద్విహాపితవిశోభిత గోపుర చంచలామహో
భద్రకదీపపఙ్క్తులు విభావరులం దగఁగూడి చిత్ర చి
త్రాద్రి సుసత్త్వవర్ణములయట్టులు వెల్గెడు విశ్వదాతృఁడా!

---

౧. విశ్వదాత, శ్రీ నాగేశ్వరరావుగారు శ్రీశైలయాత్రికులకు సల్పినదానముల గూర్చినది.
౨. భద్రాచల శ్రీరామాలయమునఁ బెట్టించిన ఎలక్ట్రిక్ దీపములఁ గూర్చినది.

కాబోయేకొన్ని చిత్రకారులకుసూచనలు

(నా యూహాప్రపంచమున)




నేను—ఇన్కమ్టాక్సు ఉద్యోగిని సదర్శించినప్పుడు

(ఈ చిత్రము కేవలము నా యూహాప్రపంచమున కల్పితము. పన్నుచెల్లించువా
పరముకాని డిపార్టుమెంటువారిని నిందించుటకు కాదు)






శ్రీముఖ భామినీమణులు చెల్వపుఁ జక్కఁలుగాఁగ జంద్రసూర్యు,
శ్రీ ము ఖ పద్మసూర్యుఁడయి రేయిఁబవల్ విహరించు విష్ణు, వి
శ్రీ ము ఖ వత్సరమ్మున సమృద్ధముగా ధనధాన్యవాహన
శ్రీ ము ఖ సంపదల్ గలుగఁజేసి, జగంబులఁ బ్రోచుఁగావుతన్.

శ్రీముఖమ్మంపెను శిశిరాధమునకు మధ్వాచార్యుఁడలుకమై నాంటిపెట్టి
ముదముమై నూతనచ్ఛదములం గొమ్మలగమిదాల్చె మాధవాగమనమునకు
ఖరకరత్వము క్రమక్రమమున హెచ్చంగ రవియుచ్చగతి మేషరాశిఁ జొచ్చె
సంరంభమున సర్వజనులు శ్రీరామలీలాసమారంభాభిలాషులైరి
వచ్చె; వచ్చెఁ, గ్రొత్త వత్సరం బిది మహో
త్సవదినంబటంచు జనపదనగ
రముల జనులు మిగులఁ బ్రమదంబునొందిరి:
ముదముల పెనుగాది యిది యుగాది.

— సెట్టి లక్ష్మీనరసింహము, కవితాసమితి.

# శ్రీముఖము

ఓలేటి వెంకటరామశాస్త్రిగారు

శ్రీముఖంబున నొప్పఁ జెలువొందుచున్న
శ్రీముఖాబ్దము శుభశ్రీలు మీకొసఁగు.

శ్రీ, ముఖమై తనర్చ వెలసిల్లెడు శ్రీముఖవత్సరంబు శో
భామహనీయమై బహు శుభప్రదమై తగు టేమి వింత? స్వ
శ్రీ మహిమంబుఁ దన్ముఖమె చెప్పక చెప్పుచునుండె నాంధ్రులా
రా! మహితాత్ములార! సుఖులై మనుఁడీ నవవర్షలక్ష్మితోన్.

శ్రీముఖమున నభినవ సు-శ్రీ, ముఖములఁ దనరఁ ద్యాగశీలురు దేశ
క్షేమంకర సత్కృతి దీ-క్షామహితులు నగుదు సర్వజను లాంధ్రమునన్.

శ్రీముఖము మీకు సౌఖ్య-శ్రీముఖ నిఖిలేప్సితార్థ సిద్ధు లిడి బహు
క్షేమములు గలుగఁజేయుచు-నోముత మానందవార్ధి నోలార్చి మిమున్.

---

# ఉగాది

పీరుభొట్ల సూర్యనారాయణశాస్త్రిగారు

శ్రీరామ లీలాసమారంభ చిత్తులై ప్రజలెల్ల భక్తి తత్పరతనుండ
శ్రీమంతముగ నెల్లభూమిజముల్ పూచి తొలగు తుమ్మెదల విందునకు బిల్వ
మురువుగా బల్లవంబుల మెక్కి పరభృతసందోహములు పాటలందుకొనగ
ఖగవాహనుని గుడికడ, మంటపంబులో భూసురుల్ పంచాంగమును పఠింప
వచ్చెనంచు నూత్నవర్షరాజము మహో
త్సవదినంబటంచు సమత లేని
రహిని యాడిరంత బ్రజలెల్ల చోటుల
ముదములకును నాది యిది యుగాది.

---

# సంస్థాన ప్రజలు

నార్ల వేంకటేశ్వరరావుగారు

నేడు ప్రతిభారతీయుని దృష్టియు భారతదేశభావి రాజ్యాంగవిధానముపై బరగుచున్నది. అఖిలభారత సమాఖ్య యేర్పడునా, యేర్పడదా? కేంద్రప్రభుత్వమున బాధ్యత లభించునా, లభింపదా? మున్నగు ప్రశ్నలకు ప్రతివారును ప్రత్యుత్తర మొసగ యత్నించుచున్నారు. దీనికై కమిటీలు, కాన్ఫరెన్సులు మొదలగునవి యేర్పాటు గావింపబడుచున్నవి. స్వదేశసంస్థానాధీశులను అఖిల భారతసమాఖ్యలో సభ్యులుగ జేయుటకు భగీరథప్రయత్నములు చేయబడుచున్నవి. కేంద్రప్రభుత్వమున బాధ్యత సంపాదించుటకు సర్వశక్తులు వినియోగింపబడుచున్నవి. ఇది యంతయు బాగుగనేయున్నది. కాని సంస్థానప్రజలనుగూర్చి యెవ్వరును విచారింపకుండుటయే శోచనీయము!



వ్యాసకర్త.

1931-వ సం.పు జనాభాలెక్కలప్రకారము స్వదేశ సంస్థానములలో 8,08,38,528 మంది ప్రజ లున్నారు. ఆ లెక్కలప్రకారమే యావద్భారతదేశమున 35,14,50,689 మంది ప్రజ లున్నారు. దీనినిబట్టి భారతదేశప్రజలలో నైదవవంతునకు పైగా స్వదేశసంస్థానములం దున్నట్లు విదితమగుచున్నది. సంస్థానప్రజల సంఖ్య బ్రిటను దేశపు జనసంఖ్యకు దాదాపు రెట్టింపుగ నున్నది.

ఇట్టియెడ భారతదేశము సర్వతోముఖముగ నభివృద్ధి నందవలెనన్న సంస్థానప్రజల మంచిచెడ్డలనుకూడ నారయవలదా? కాని యట్లు జరుగుట లేదు. అఖిల భారతకాంగ్రెసుమహాసభ సంస్థానప్రజల పేరైనను తలపెట్టదు. ఇక ప్రభుత్వమన్ననో సంస్థానముల యాంతరంగికపరిపాలనయందు సాధారణముగ జోక్యము కలిగించుకొనదు. ఇట్లు సంస్థానప్రజల దిక్కుదశ నారయువా రెవరును లేకపోవుచున్నారు.

దీని కుదాహరణముగ రౌండుటేబిలుసభాప్రాతినిధ్యమును పేర్కొనవచ్చును. ఇంతవరకు మూడు రౌండుటేబిలుసభలు జరిగినవి. ఈసమావేశముల కన్నిటికిని పెక్కుమంది సంస్థానాధీశులు ఆహ్వానింపబడిరి. కాని సంస్థానప్రజలతరఫున నొక్కప్రతినిధియైనను పిలువబడలేదు. సంస్థానాధీశుల ప్రతినిధులను పిలిచినప్పుడు, సంస్థానప్రజల ప్రతినిధులను వేరుగ పిలువ నగత్యమేమని కొందరు ప్రశ్నింపవచ్చును. కాని చరిత్రజ్ఞానమున్న ప్రతివానికిని పాలకుల దృక్పథమును, పాలితుల దృక్పథమును వేర్వేరని తెలిసియుండును. దీనికి భిన్నముగ నెక్కడైన నున్నదో నది రామరాజ్యములోనే! ఇట్టియెడ సంస్థానాధీశులే సంస్థానప్రజలకు ప్రతినిధులని చెప్పుట సాహసము. కేవలము సాహసమేకాదు, హాస్యముకూడ.

నేను పైన నిరూపించినట్లు సంస్థానప్రజల గతిని గూర్చి విచారించువా రెవ్వరును కానవచ్చుట లేదు. ఇది భారతదేశాభివృద్ధికి తీరని ప్రతిబంధకము కాకమానదు.

అందువలన సంస్థానప్రజల స్థితిగతులనుగూర్చి పరిపూర్ణముగ శ్రద్ధతీసుకొనుట ప్రతిభారతీయుని ధర్మమై యున్నది.

మొత్తముమీద భారతదేశప్రజలే నిరుపేదవారు. సంస్థానప్రజ లంతకన్న నిరుపేదలు. ఈవిషయము నొక్క చిన్నవిషయమునుబట్టి నిరూపింపవచ్చును. 1921-వ సం.పు జనాభాలెక్కలప్రకారము బ్రిటిషుఇండియాలో సగటున చదరపుమైలునకు 196 మందిచొప్పున నివసించుచుండిరి. కాని స్వదేశసంస్థానములందు 113 మందిచొప్పున మాత్రమే నివసించుచుండిరి. ఇట్లు రెండుసంఖ్యలమధ్యను విపరీతభేద ముండుట కొకకారణమే కలదు. అది సంస్థానప్రజల ఘోరదారిద్ర్యమే.

సంస్థానప్రజలలో రెండుతరగతు లున్నవి. మొదటి తరగతివారు గ్యారంటీడుభూస్వాములు. వీరిని వివిధ సంస్థానములలో వివిధనామములతో వ్యవహరింతురు. దక్షిణమహారాష్ట్రసంస్థానములందు వీరిని జాగీరుదారు లందురు. రాజపుత్రస్థానపు సంస్థానములందు వీరిని ఠాకూరు లందురు. కథియవాడుసంస్థానములందు వీరినే ముల్‌గిరాస్సియా లందురు. వీరి కందరికిని ప్రత్యేకాధికారము లున్నవి. వీరి స్థిరచరాస్తులు బ్రిటిషుప్రభుత్వమువారిచేత గ్యారంటీచేయబడియున్నవి.

వీరుకాక తక్కినప్రజ లందరును రెండవతరగతి క్రిందకు వత్తురు. ఈరెండవతరగతివారే సంస్థానముల నిక్కువమైన ప్రజలని చెప్పవచ్చును.

సంస్థానప్రజలలో నూటికి 70 మంది వ్యవసాయముమీద జీవింతురు; 15 మంది వర్తకవ్యాపారములు, చేతిపనులు మున్నగువానిమీద బ్రతుకుదురు; 10 మంది కాయకష్టముతో పొట్టపోసుకొందురు; తక్కిన 5 గురును సంస్థానోద్యోగులుగను,భృత్యులుగను ఉందురు. మొత్తముమీద సంస్థానప్రజలకు (బ్రిటిషుఇండియాప్రజలకు వలెనే) సేద్యమే ప్రధానవృత్తియని చెప్పవచ్చును.

మైసూరు, తిరువాన్కూరు, కొచ్చిను, బరోడా, గ్వాలియరు మున్నగు ఏకొలదిసంస్థానములలోనో తక్కినవానియందు పరిశ్రమలు లేవనియే చెప్పవచ్చును. అక్కడక్కడ కొన్నిసంస్థానములందు ప్రత్తిఫ్యాక్టరీలు, నారఫ్యాక్టరీలు మొదలగునవి యున్నను, అవి సంస్థానాధీశులు తమ సొంతలాభములకై పెట్టుకొనినవి. వీనివలన ప్రజల కెట్టిలాభమును లేదు.

పెక్కుసంస్థానములందు గృహపరిశ్రమ లున్నవి. కాని రాజపోషణ లేనికారణముచే నవి తగినట్లు వృద్ధినందుట లేదు. వీనిపై నాధారపడువారికి రెండుపూటలును కడుపునిండ గంజికూడ దొరకుట కష్టము. ఇక, కూలినాలి చేసుకొనువారి సంగతి వేరుగ చెప్పనక్కరలేదు. వారికి సంవత్సరమున కారుమాసములు మాత్రమే పని దొరుకును. అప్పుడైనను కష్టమునకు తగిన కూలిడబ్బులు లభింపవు. అందువలన వారు విధిలేక పొట్టపోసుకొనుటకై బ్రిటిషుఇండియాకు వచ్చుచుందురు.

ప్రజాసామాన్యపు స్థితి యిట్లుండ విద్యాధికులును, స్వతంత్రజీవనోపాధి గలవారును, స్వచ్ఛందవృత్తి నేర్చినవారును క్రమముగ సంస్థానములను వీడి బ్రిటిషుఇండియా చేరుచున్నారు. వీ రెల్ల రిట్లు గావించుటకు సంస్థానములందు వ్యక్తిస్వాతంత్ర్యముగాని, శక్తిసామర్థ్యప్రదర్శనావకాశముగాని, ఆస్తి భద్రతగాని లేకుండుటయే కారణము. ఇట్లు పెక్కుమంది లేచిపోవుచుండుటవలన సంస్థానముల జనసంఖ్య తగ్గిపోవుచున్నది. దీని కుదాహరణముగ ఆళ్వారుసంస్థానమును పేర్కొనవచ్చును. 1901-వ సం॥లో దీని జనసంఖ్య 8,28,489; 1911-వ సం॥ లో 7,31,668; 1921-వ సం॥లో 7,01,154. 1931-వ సం॥పు జనాభాలెక్కలప్రకారము దీని జనసంఖ్య పెరిగినదో, లేక మరికొంత తగ్గినదో నాకు సరిగ తెలియదు.

సంస్థానప్రజలు దుర్భరదారిద్ర్యావస్థయందు మునిగియున్నను పన్నులకు కొదువలేదు. విధింపబడుచున్న క్రింది పన్నుల పట్టికవలన విషయ మంతయు కండ్లకు కట్టినట్లు కనుపడగలదు—

వ్యవసాయదారులు చెల్లింపవలసినవి:

1. భూమిశిస్తు
2. ఆస్తిహక్కు-పన్ను (భూమిశిస్తు మొత్తములో 1-0-0 కి 0-4-0 చొప్పున)
3. కరవుపన్ను (భూమిశిస్తు మొత్తములో 1-0-0 కి 0-1-0 చొప్పున)
4. కరవుభీమాపన్ను
5. పాడిపశువులపై పన్ను
6. ప్రత్తిపై పన్ను
7. పశువిక్రయమునకు పన్ను
8. నేతిపై పన్ను
9. పశుగ్రాసముపై పన్ను
10. ధాన్యాదుల విక్రయమునకు పన్ను
11. బాలికావివాహమునకు పన్ను
12. పెండ్లిపెద్దలపై పన్ను
13. పునర్వివాహములకు పన్ను
14. ఫలవృక్షములకు పన్ను
15. బెల్లమునకు పన్ను
16. పంచదారకు పన్ను
17. తపాలాపన్ను
18. కూరగాయలపై పన్ను

(ఇట్లు కృషీవలుని ఆదాయములో నూటికి 60వంతులకు పైగా పన్నుల క్రిందనే చెల్లిపోవును.)

నగరవాసులు చెల్లింపవలసినవి:

1. నగరములోనికి దిగుమతియైన వస్తువు లన్నిటి పైనను సుంకము
2. ఇంటిపన్ను
3. బండిపన్ను
4. యుద్ధఋణమునకై పన్ను
5. పశుగ్రాసముపై పన్ను
6. నేతి యుత్పత్తిపై పన్ను
7. నేతి దిగుమతిపై పన్ను

వ్యవసాయదారులు కానివారందరును చెల్లింపవలసినవి:

| | |
|---|---|
| 1. వడ్డీవ్యాపారి, చిల్లర దుకాణదారుడు వగైరాలకు | రు. 4-0-0 |
| 2. వడ్రంగి, దర్జీ వగైరా | 3-8-0 |
| 3. కమ్మరి | 3-0-0 |
| 4. ఊడ్పుకూలీలు, కోత కూలీలు వగైరా | 3-0-0 |
| 5. దూదేకువాడు, సాలీ వగైరా | 3-0-0 |
| 6. తదితరులు | 2-0-0 |

ఈ పన్ను లన్నియు నిట్లుండ నవానగరుసంస్థానములో నొకవిచిత్రమైన పద్ధతి యున్నది. బ్రిటిషుఇండియాలో కల్లు, సారాయి, గంజాయి, నల్లమందు మున్నగు మత్తుపదార్థములలో స్వేచ్ఛగ వ్యాపారము సల్పుటకు వీలులేదు. ప్రభుత్వమువారు పాటపెట్టి, దానిలో నెక్కువ పాడినవానికి వాని నమ్ముకొను నధికార మిత్తురు. ఇట్లే నవానగరుసంస్థానమునందు పొగాకు, కిరసనాయిలు, పెట్రోలు, అగ్గిపెట్టెలు వగైరా యిజారాపాడినవారే అమ్ముకొనవలెను. పైన పేర్కొనబడిన వస్తువుల కొక్కొకదానికిని రు. 75,000 మొదలు రు. 1,50,000 వరకు ఇజారా మొత్తముక్రింద తీసుకొనబడుచున్నది. ఇట్టి ఘోరము సభ్య ప్రపంచములో మరెచ్చటను కానరాదు.

ఇట్లే తక్కినసంస్థానములందును ఘోరముగ పన్నులు విధింపబడుచుండును. కొన్ని సంస్థానములందు చావుపుట్టుకలకు కూడ పన్ను లున్నవి. మరికొన్నిటియందు ఫకీరులు, సన్యాసులు, భిక్షుకులు సహితము పన్ను చెల్లింపవలెను. గవర్నరులుగాని, వైస్రాయిలుగాని, తదితర ప్రభుత్వోన్నతోద్యోగులుగాని సంస్థానములను దర్శింపవచ్చినప్పుడు వారి విందులకు, వినోదములకు, ఆటలకు, పాటలకు వెచ్చింపబడు లక్షలకొలది ధనమంతయు ప్రజలే భరింపవలెను. తుద కనాథలగు స్త్రీ లుదరపోషణనిమిత్తమై పిండివిసరుకొన్న, తిరుగలి కింతచొప్పున వెంకటేశ్వరుని ముడుపు కట్టవలెను.

విపరీతముగ నిట్లు పన్నులు విధింపబడుటయే కాక వానిని వసూలుచేయుటయందు కూడ చాల కాఠిన్యము చూపబడును. ఉదాహరణముగ భూమిశిస్తుకు గైకొనవచ్చును. ఇది ధనధాన్యరూపములలో నేది లాభకరమైన నట్లు వసూలుచేయబడును. నూర్చి కళ్ళమునం దుంచిన ధాన్యమును వానలు వచ్చినను, వరదలు వచ్చినను సంస్థానోద్యోగులు వచ్చువరకు రైతు ఇంటికి తీసుకొనిపో వీలు లేదు. దీని నతిక్రమించిన బహు కష్టనిష్ఠురములకు పాలు గావలసివచ్చును.

ప్రజల నిన్ని బాధలు పెట్టి వసూలుచేయు ధనము పరిపాలనావసరములకు గాని, ప్రజోపయోగమునకు గాని వినియోగింపబడునా ? లేదు. అదియంతయు సంస్థానాధీశుని విదేశసంచారమునకు, విలాసయుతజీవనమునకు వెచ్చింపబడును. ఈక్రింద పేర్కొనబడిన పట్టికవలన పైవిషయము తేటతెల్లము కాగలదు :—

| సంస్థానపు పేరు. | సకటుంబ తలకుపన్ను | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
|---|---|---|---|---|---|
| కాశ్మీరు | 6.0.0 | 20 | 0 6 0 | 0.3.0 | 2 |
| బికనీరు | 16.8.0 | 20 | 0.5.0 | 0 4.0 | 3 |
| ఇందూరు | 13.8.0 | 17 | 0.7.0 | 0.2.0 | 3 |
| ఆళ్వారు | 11.4.0 | 25 | 0.3.0 | 0.1 0 | 2 |
| పాటియాలా | 11 4.0 | 25 | 0.3.0 | 0.2.0 | 2 |
| నవానగరు | 22.8.0 | 45 | 0 6.0 | 0.4.0 | 3 |
| కపుర్థల | 11.4.0 | 25 | 0.7.0 | 0.3.0 | 3 |
| కచ్చి | 22.8 0 | 25 | 0 2.0 | 0.1.0 | 1 |

నేను పైన నుల్లేఖించిన పట్టికవలన ప్రజలవద్ద నుండి పిండబడిన ధనమంతయు సొంతఖర్చులక్రిందనే చెల్లిపోవుననియు, ప్రజోపయోగసంస్థలకు నామమాత్రముగ కొలదిధనముమాత్రమే ఖర్చుపెట్టబడుననియు స్పష్టపడుచున్నది. ఈవిషయమై యింకను వివరముగ తెలుసుకొనగోరువారు నేను 1932 జూన్ నెల 'భారతి'లో "సంస్థానాధీశులు—నూతనరాజ్యాంగవిధానము" అను శీర్షికతో వ్రాసిన వ్యాసమును చూడదగును.

ఈవిషయము లన్నియు నిట్లుండ పెక్కుసంస్థానములందు కడుఘోరమైన బానిసతనపు పద్ధతి యొకటున్నది. చాల రాజపుత్రస్థానపు సంస్థానములందును, కథియవాడుసంస్థానములందును బానిసకులము లున్నవి. 1921వ సం. పు జనాభాలెక్కలప్రకారము రజపుత్రస్థానమందును, మధ్యభారతవర్షమందును చకారు, దరోగాకులములకు చెందినట్టి బానిసలు 1,60,735 మంది యున్నారు. ఈబానిసకులములకు వివిధసంస్థానములలో వివిధనామము లున్నవి. వీనిలో దరోగాలు, చకారులు, హుజూరీలు, రావణరాజపుత్రులు, చేలాలు, గోలాలు అనుకులములు ప్రధానమైనవి.

ఈబానిసలస్థితి గర్భనిర్భేదకముగ నుండును. వారికి వ్యక్తిస్వాతంత్ర్య మణుమాత్రమైన నుండదు. వారి శరీరాత్మలు రెండును మహారాజులవి. ఉసురులు నిలుపుకొనుటకు వలసినవానికంటె వా రధికముగ ధనధాన్యముల నుంచుకొన వీలు లేదు. అట్టిచో వారి కెట్టి ఆస్తియు నుండదని వేరుగ చెప్పవలెనా ? బ్రతికినన్నాళ్లు బానిసతన మొనర్చినందులకు వారికి ముట్టు ప్రతిఫలము డొక్కలునిండని గంజిమాత్రమే. సంస్థానాధీశులు తమ పుత్రికల వివాహమందు ధనకనకవస్తువాహనములతో పాటు బానిసల భార్యాపుత్రికలనుకూడ కట్నముక్రింద నివ్వవచ్చును. బానిసజాతులవారి వివాహములుగాని, విడాకులుగాని మహారాజుల దయాధర్మభిక్షములపై నాధారపడి యుండును. ఏబానిసయైనను కష్టములను భరింపలేక మరొకసంస్థానమునకు పలాయనమై తలదాచుకొనినయెడల వానిని నిర్బంధించి వెనుకకు పంపవచ్చును.

జోధపూరుసంస్థానపు చట్టములలోని క్రిందిభాగములవలన బానిసల స్థితిని కొంతవరకు గ్రహింపవచ్చును:—

"యజమానిహోదాకును, అవసరమునకు తగినట్లు దొరగాలు సేవ చేయకపోయినచో నతడు చట్టసమ్మతముగ వలసిన సేవను చేయించుకొనవచ్చును.

"దొరగాల సంఖ్య, యజమానిహోదాకును అవసరమునకును మించినయెడల నతడు కావలసినవారినే యుంచుకొని తక్కినవారిని తగ్గించవచ్చును. ఈవిధముగ తగ్గింపబడినవారు యజమాని పిలిచినప్పుడెల్ల పనిలోనికి రావలెను; యజమానిగృహమున జరుగు వివాహాదిశుభకార్యములలో వచ్చి సేవచేయవలెను; యజమాని కోరినంతకాలము పనిచేయవలెను. ఇట్లు సేవచేసినంతకాలము యజమాని దొరగాలకు తిండి పెట్టవలెను.

"రాజపుత్రులు తమ గృహములలో పుట్టిపెరిగిన దొరగాల కూతుండ్రను తమ పుత్రికల వివాహసందర్భమున కట్నముక్రింద నివ్వవచ్చును. హోదాగల రాజపుత్రులు దొరగాకుటుంబములనుకూడ కట్నముక్రింద నివ్వవచ్చును.

"తన హోదాకును, అవసరమునకును మించిరను, కారణముచేత యజమాని సేవనుండి తగ్గించుటవలన వేరొకచో పనిచూచుకొనిన దొరగాల కుమార్తెలను కూడ నతడు కట్నముక్రింద నివ్వవచ్చును."

ఈచట్టము ప్రస్తుతము కాగితముపైన లేదు. కాని దానిలోని విషయములన్నియు అమలునందున్నవి. దొరగాకులమువారు చదువుసంధ్యలు లేనివారగుటచేత వారికి పై చట్టము తొలగింపబడినసంగతి తెలియదు. ఒకవేళ ప్రజాహితకాంక్షి యెవడైన వారికీసంగతిని తెలుపయత్నించిన వాడు శిక్షకు పాత్రుడు కావలసివచ్చును.

ఇట్లే తక్కినసంస్థానములందును చట్టము లున్నవి. కోటాసంస్థానములో బానిసకులమువాడెవ్వడును సంస్థానోద్యోగములో ప్రవేశింప వీలులేదు. ఉద్యోగములన్న పెద్దపెద్ద పదవులు కాదు. బానిసకులమువాడెవడును పోలీసుభటుడుగాగాని, సైనికభటుడుగాని, చేరుటకు కూడ వీలులేదు. అంతేకాదు; అదివరకే సంస్థానోద్యోగములో నున్నవారినందరి నొక్కసారిగా తొలగింపవలసినదిగ కోటాసంస్థానము 1920 సెప్టెంబరు 20-వ తేదిని ఆజ్ఞను జారీ చేసెను.

బికనీరుసంస్థానములో 1921-వ సం.పు జనాభా లెక్కలప్రకారము చకారు, దొరగాకులజులైన బానిసలు 10,884 మంది యుండిరి. ఐనప్పటికిని బికనీరుసంస్థానాధీశుడు నానాజాతిసభకు ప్రతినిధి; వెర్సైలీసుసంధిపత్రముపై సంతకపుదారుడు.

ఆళ్వారుసంస్థానమునందు మొత్తము 5,179 మంది బానిసలు గలరు. బానిసతనమును న్యాయవిరుద్ధమొనర్చుచు నొకచట్టము గావింపబడినను, నేటికిని ఆళ్వారునందు బానిసతనము సుస్థిరమై యున్నది. ఐనను 1929 జులై 5-వ తేదీని భారతకార్యదర్శిగారు ఆళ్వారుమహారాజుగారిని క్రిందివిధముగ స్తుతించిరి :—

"జీవితపథము లన్నిటియందును ప్రతిభావిశేషములను ప్రదర్శింపగలిగినవాడు. అతని సంస్థానము సుపరిపాలనాచిహ్నాభరితమై యొప్పుచున్నది."

ఈ 20-వ శతాబ్దమునకూడ నాగరకప్రపంచమంతయు గర్హించు బానిసతనమును సహించు సంస్థానాధీశుల నిట్లు పొగడుటయేకాక సంస్థానములందసలు బానిసతనమే లేదని కూడ బ్రిటిషుప్రభుత్వము వాదించుచున్నది. నానాజాతిసమితియొక్క ఆరవకమిటీ యాజమాన్యమున 1926-వ సం.లో జరుపబడిన అంతర్జాతీయ బానిసతనపు సభలో బ్రిటిషుప్రతినిధి యిట్లు పలికెను:—

"సామాన్యముగ బానిసతనమనునది భారత సంస్థానములందు లేదని భారతప్రభుత్వము సంతృప్తి జెందినది."

నే నింతదనుక వ్రాసిన యుదంత మంతయు చదివినవారికి పై విషయము సత్యవిదూరమని వేరుగ చెప్పవలెనా!

ఈ బానిసతనమే కాక నిర్బంధ సేవ (Forced Labour) అనుమరొక ఘోరమైన ప్రథ దాదాపన్ని సంస్థానములందు నున్నది. దీనిక్రింద చాకలి, మంగలి, కుమ్మరి, వడ్రంగి, దర్జీ ;— వీరువారనేల, సమస్తజనులును సంస్థానమునకును, సంస్థానోద్యోగులకును ప్రతిఫల మపేక్షింపకయే సేవచేయవలెను. చివరకు స్త్రీలకుసహితము—వారు యువతులైనను వృద్ధులైనను, సధవలైనను, విధవలైనను— దీనినుండి విముక్తి లేదు. వృద్ధుడ ననిగాని, వ్యాధిపీడితుడ ననిగాని చెప్పి దీనినుండి తప్పించుకొన వీలులేదు. సర్వజనులును సర్వావస్థలందును సేవచేసితీరవలసినదే! కిక్కురుమన్నచో కొరడా వ్రేటులనుగాని, కారాగార వాసమునుగాని కొనితెచ్చుకొన్నట్లే. జరాభారముచేత పనిచేయజాలనని మొరపెట్టుకొన్నందుల కొక అరువదేండ్ల వృద్ధస్త్రీ బహిరంగవీథులలో లాఠీలతో మోదబడుట తా నెరుగుదునని చడ్డరుగారు తమ గ్రంథములో (Indian Princes Under British Protection, P. 37) వ్రాసిరి.

మహారాజు వేట కేగునప్పుడు కంటకయుతమగు ఘోరారణ్యములలోను, గ్రీష్మాతపతప్తమైన సైకతస్థలములందును, నిశితశిలాభరితములగు పర్వతశ్రేణులపైనను పరవతోల ప్రజలు నిర్బంధింపబడుచుందురు. బ్రిటిషు ప్రభుత్వోన్నతోద్యోగులు సంస్థానముల దర్శింప నేగినప్పుడు రైలుమార్గమున కిరుప్రక్కలను మండుటెండలోను, పుండువంటి చలిలోను ప్రజలు కాపలా కొరకు నియమింపబడుచుందురు.

బందీసంస్థానము నిర్బంధసేవను గూర్చి 1922-వ సం.లో ప్రకటించిన క్రింది రెగ్యులేషనువలన ప్రజల కిది యెంత బాధాకరమో హృద్గతము కాగలదు:—

1. మంగళ్లు యథాప్రకారము క్రింద చూపిన సేవను చేయవలెను :—

(ఎ) సంస్థాన కార్యాలయములందు దీపములను వెలిగించుట.

(బి) అట్టి కార్యాలయములకు సున్నము కొట్టుట, అలుకుట.

2. తెలికలవాండ్రు సంస్థానావసరములకు, త్రాళ్లను పేనవలెను. దీనికి ప్రతిఫలముగ వారికి తిండి పెట్టబడును.

7. ఈడిగవాండ్రు వంటచెరకు సప్లయిచేయవలెను; త్రాళ్లను కూడ పేనవలెను. వీరికి తెలికలవాండ్ర కిచ్చు ప్రతిఫలమే యివ్వబడును.

8. తమలపాకుబేరగాండ్రు తెరలు, తడికలు సప్లయి చేయవలెను.

9. కసాయివాండ్రు దేవస్థానముల నగారాల కుచితముగ తోళ్లను సప్లయిచేయవలెను.

10. భిల్లులు వార్తావహులుగ పనిచేయవలెను ; గస్తీ తిరుగవలెను. ప్రతిఫలముగ వారికి భోజనము పెట్టబడును.

12. రైతులు సంస్థానకార్యాలయములలోని వంటశాలలకు పైకము పుచ్చుకొనకుండ పిడకలు సప్లయి చేయవలెను.

16. సత్రములలో గాని, బహిరంగప్రదేశములలో గాని రాత్రిపూట మకాముచేయువారు యథాప్రకారము సుంకము చెల్లించుకొనవలెను.

21. సంస్థానమునకై చేయబడిన సేవకు ప్రతిఫలముగ తిండి పెట్టబడును. సంస్థానోద్యోగులకు చేయబడిన సేవకు ప్రతిఫలముగ కూలి యొసగబడును. ఈ సేవ నంతయు తరతరములుగ దానిని గావించుచున్నవారే చేయవలెను. వీరు సేవను చేయ నిరాకరించిన కఠినముగ శిక్షింపబడుదురు.

ఇట్లు సంస్థానప్రజలు నిర్బంధసేవక్రింద బాధపడుచున్నారు. వీరి కష్టములగూర్చి విని, హృదయము కరిగినవాడై దీనబంధు సి. యఫ్. ఆండ్రూసుగారు పరిస్థితులను గూర్చి స్వయముగ విచారణ సల్పుటకై రాజపుత్రస్థాన

మునకు బయలుదేరిరి. కాని రాజపుత్రస్థానపు సంస్థానములు ఆండ్రూసుగారు తమ రాజ్యములలో నడుగుపెట్టుటకు వీలులేదని యుత్తరువు గావించినవి. సత్యప్రకటన యన్న వీరి కింతభయ మేలనో!

సంస్థానప్రజల కష్టము లింతటితో పూర్తినందినవా? లేదు. పులులు మున్నగు వన్యమృగములు ఆవులు, మేకలు మొదలగు పశువుల నెత్తుకొనిపోయినను, తుదకు మనుష్యులను చంప నారంభించినను ప్రజలు వానిని సంహరింప వీలులేదు. ప్రజలే వానిని చంపినయెడల మహారాజుగారికి మృగయావినోద మెట్లు లభించును? టైమ్సు ఆఫ్ ఇండియా మున్నగు పత్రికలలో వేటబొమ్మలను వేయించుకొను టెట్లు సంభవించును?

ఇట్లు సంస్థానప్రజలు పెక్కు కష్టముల బడుచున్నారు. వారి ప్రస్తుత దుస్థితిని గూర్చియు, భావిపరిణామమును గూర్చియు శ్రద్ధతీసుకొనుట మన విధ్యుక్తధర్మము. అట్లు గావింపనియెడల, నేను తొలుత నే నుడివినట్లు భారతదేశము సర్వతోముఖముగ నభివృద్ధి నందజాలదు.

---

# అతడు

కనుపర్తి వరలక్ష్మమ్మగారు

అతడు దేవుడు భారతజాతి కిపుడు
సంఘమత రాజకీయాదిసకలకార్య
బంధమోక్షంబు లాతనిపరము జేసి
భక్తులై కొల్చుచున్నారు భరతజనులు.

అతడు ప్రభువు; చెల్లు నతని యాజ్ఞ నిఖిల
జగతి శాసనముపగిది సవ్యముగను
సార్వభౌముల శాసనసమితికైన
నడ్డు కలదేమొకాని లే దతని నుడికి.

అతడు జ్ఞాని యిలసుఖదుఃఖాది ద్వంద్వ
ములకు లేశమైనను మది కలగ డతడు
యెంత యొరపిడి పెట్టిన నేమియైన
కనియు కనకుండు వానిని కచ్చితముగ.

అతడు భక్తుడు తన కార్యవితతి నెల్ల
భగవదర్పితముగ జేయు బాధగనడు
సఫలమైనను మఱి యది విఫలమైన
నీశ్వరేచ్ఛయె యని మది నెంచుగాని.

అతడు భూసురుడే నిజం బరమరేల?
దయయు సత్యంబు శౌచంబు తపము విద్య
బ్రహ్మచర్యంబు నాదియౌ బహుళదివ్య
బ్రాహ్మణోచితగుణముల వరలుగాన.

అతడు సుక్షత్రియుడు ధీరు డాహవమున
కేల శస్త్రంబు పట్టక కీర్తనీయ
శాంతిసమరాన శాత్రవసమితి గెల్చి
విజయలక్ష్మిని గైకొను విభవ మొసగ.

అతడు కోమటి పుట్టువుచేత నిజము
మూలపడియున్న రాటాన నూలువడికి
కాసువీసంబు పోనీక ఖద్ద రమ్మి
దేశమున కర్థలాభంపు తెరువు జూపె.

అతడు శూద్రుడు వ్యవసాయి యనవరతము
సేవచేయుచు యాతని జీవితార్థ
మతని సేవను భారతజాతి గాదు
పూత మగుచుండు మానవజాతి యెల్ల.

అతడు చండాలు డిచ్చచే నాదినుండి
యగ్రజాతుల రాయిడి నహరహంబు
పొందరానట్టి బాధల బొందుచున్న
పంచముల గావ ప్రాణమే పణము సేసె.

అతడు ధనికుడు లేమి లే దతని కెపుడు
కానలయు సొమ్మనిన జాలు కాళ్లముందు
కుమ్మరిల్లును ద్రవ్యంబు కోరినంత
దేశహితములు దానితో దీర్చు నతడు.

అతడు పేదలలో పేద యరసిచూడ
భోగభాగ్యంబు లాతని పొంతబోవు
కుఱుచకొల్లాయి గట్టును గుడిసె నుండు
మేకపాలను ద్రాగుచు మిడుకుచుండు.

అతడు కఠినుడు సందియ మందనేల ?
నియమపాలనమున సదా నిశ్చయముగ
తాను తనవారు తన శిష్యతతిని నెందు
నియతిమీరిన నిష్కృతి నెఱి విధించు.

అతడు సదయుడు నవనీత మతని మనసు
కరగు పేదల కష్టంపు కథలు వినిన
పేదనారాయణు లనుచు పేరుబెట్టి
కొలుచు వారిని సతతంబు కూర్మితోడ.

అతడు నీతిరతుడు కాన నఖిలకార్య
వితతియందును నాతని విపులనీతి
సూత్రమై కానుపించును చొచ్చిచూడ
పూలసరమున దారంబు పొసగునట్లు.

అత డహింసావ్రతుడు కాన నహరహంబు
పాలనము సేయుచుండు నాపరమవ్రతము
చీమకైనను గోరడు చెఱుపు నతడు
అఖిలజీవంబు లాతని కాత్మసమము.

అతడు సత్యము సత్యమే యతని రూప
మునను నిల జన్మమొందెను కాన నతడు
ప్రాణముల వీడ సమ్మతిపడునుగాని
సమ్మతింపడు వీడంగ సత్యపథము.

అతడు ధర్మము కావున నవని తనదు
సర్వకర్మంబులను ధర్మసరణి నడపు
నెంతలాభంబు రానున్న నేమియైన
పాల్పడడు ధర్మహీనంపు పనికి నతడు.

అతడు ప్రేమమయుడు నిజం బవని నెందు
పగతు రనువారు కాన మప్పరమఋషికి
రాల రువ్వినవారిని పూల రువ్వ
చెంప నొకవైపు గొట్ట నాచెంప జూపు.

అతడు రాముడు నామవిఖ్యాతియందు
రామనామంబు ఏరీతి రాజ్యమేలు
భారతీయహృదయరాజ్యభాగములను
క్రాలు నారీతి నిష్ప డాఘునుని పేరు.

అతడు విశ్వగురు డతని యమలవాణి
విశ్వమానవహితదమై వెలయుగాన
దేశదేశాల నాతని దివ్యసూక్తు
లహరహంబును స్మరియింతు రఖిలజనులు.

అతడు మహనీయగుణుడు మహాత్ము డరయ
భారతాంబ నోములపంట భవ్యమూర్తి
అతని నెవ్వ రనుసరింతు రమలభక్తి
ధన్య మవ్వారి జన్మంబు ధన్యమవని.





1. గౌతమీ పుష్కరము, కోటిలింగాల స్నానఘట్టము; 2. వశిష్ఠగోదావరీ పుష్కరము.



1. పుష్కరంరేవులో యాత్రికులు స్నానముచేయుట; 2. పుష్పగిరిరేవులో యాత్రికులు; 3. రాజనరేంద్రుని స్నానఘట్టము.

# తెలుఁగుకైతతెన్నులు

సాహిత్యవిద్యాప్రవీణ, బులుసు వేంకటరమణయ్యగారు

ఆంధ్రవాఙ్మయము గ్రంథరచనము సంస్కృతవాఙ్మయము ననుసరించియే యారంభింపఁబడి నేఁటివఱకు నారీతినే యనుసరించుచున్నదను నంశము విశదమయియున్నది. కాని కొన్ని విషయములలో మాత్రము మీఁది రెండు వాఙ్మయములకును భేదము కన్పించుచున్నది. ఆంధ్రలాక్షణికు లాభేదముల ననుసరించి లక్షణములను వ్రాయక గీర్వాణమునే యనుసరించి తదనుకూలములగు లక్షణములనే వ్రాసినట్లగపడుచున్నది. ఆంధ్రగీర్వాణవాఙ్మయములందు గోచరించు పరస్పరభేదములను, లాక్షణికుల లక్షణనిర్వచనములను, నట్టివియెడఁ జేయవలసిన మార్పులను వివరించుటయే యీతద్వ్యాసలేఖకుని ముఖ్యోద్దేశము.

సంస్కృతాలంకారికులు వాఙ్మయమును మొత్తముపై ముత్త్రివిధములుగ విభజించియున్నారు. ప్రభుసమ్మితములగు వేదశాస్త్రములు మొదటి తెగలోనివి. సుహృత్సమ్మితములగు నితిహాసపురాణములు రెండవతెగగతిఁ జెందియున్నవి. కాంతాసమ్మితములగు కావ్యములు మూఁడవతెగలోనివై యున్నవి. మహాభారత మితిహాసమనియు, రామాయణ మాదికావ్యమనియు నాఁటినుండి నేఁటివఱకుఁ బండితపామరవ్యవహారము. కాన భారతము కావ్యము కాఁజాలదు. దానిని వ్రాసిన వ్యాసభట్టారకుఁడు కూడఁ దా జయమును నితిహాసమును వ్రాయుచున్నట్లు చెప్పియుండుట పైవిషయమునకు దార్ఢ్యము నాపాదింపఁగలదు.

ఆంధ్రవాఙ్మయమునందలి మొదటిగ్రంథము మీఁదిభారతమునకుఁ గల యాంధ్రీకరణమే యగుచున్నది. ఆదికవియగు నన్నయభట్టు తా మహాభారతకావ్యమును వ్రాయుచున్నట్లు చెప్పియున్నాఁడు.[౧] మహాభారతము వ్యాసరచితభారతమున కాంధ్రీకరణమైనట్లు నతఁడే వ్రాసియున్నాఁడు.[౨] న్యాయమునుబట్టి నన్నయభట్టు తాఁ బురాణమునే రచించుచున్నట్లు చెప్పవలసియున్నది. అట్లు చెప్పనందున నియ్యెడల నొకవిషయము నూహింపవలసియున్నది. పురాణేతిహాసకావ్యములకు సంస్కృతమునందే భేదము కలదు కాని యాంధ్రమున భేదము లేదనియు, నాంధ్రమునఁ బురాణేతిహాసములు కూడఁ గావ్యములే కావచ్చుననియుఁ దేలినది. కావుననే బసవపురాణము, జైమినిభారతము, నృసింహపురాణము, మార్కండేయపురాణము మొదలగునవి యన్నియు నాంధ్రమునఁ బ్రబంధములనియే వాడఁబడుచున్నవి. అయ్యవి రసమును బాగుగఁ బరిపోషించుచున్న వనుటలో సందేహము లేదు. వేయేల? అలంకారగ్రంథములను వ్రాయుచున్న లాక్షణికులుకూడఁ దమ గ్రంథములు కావ్యములనియే చెప్పియున్నారు.[3] కావున నాంధ్రుల మతమునఁ గవి వ్రాయు గ్రంథములన్నియుఁ [‘కవికర్మ కావ్య’మ్మను వ్యుత్పత్తినిబట్టి] గావ్యము లగునని తేలుచున్నది. కాని లక్షణగ్రంథములను వ్రాయు లాక్షణికులు కవులు కాఁగలరా? లక్షణగ్రంథములలో వారొసంగిన యుదాహరణములను బట్టియే వారు కవులు కాఁగలరని నిశ్చయింపవలసియున్నది. విచారింపఁగా వారు లక్షణగ్రంథములను గావ్యములనుట సరిపడదుగాని లక్షణాతిరిక్తములగు [శాస్త్రగ్రంథాతిరిక్తములగు] గ్రంథములన్నియుఁ గావ్యములేయని వారి మతమును నిశ్చయింపవచ్చును.

---

౧. అయినను దేవా! నీ యనుమతంబున విద్వజ్జనంబుల యనుమతంబునం జేసి నా నేర్చువిధంబున నీకావ్యంబు రచియించెద నని.
—ఆది. ప్రథ. ౨౦.

౨. క. జనసుత కృష్ణద్వైపాయనముని వృషభాభిహితమహాభారతబం
ధనిరూపితార్థ మేర్పడఁ, దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్.
—ఆది. ప్రథ. ౧౬.

3. ఉ. నీ వొనరింపఁబూనిన యనేకమహాకవివాఙ్మయోపకారావహమైన కావ్యము మదంకితమై వెలయంగఁ జేయుము.
—నరసభూపాలీయము ౧-౧౬.

ఉ. ...వడ్డినామకవిసత్తముఁడన్ రఘువర్యుపేర శృంగారరసాలవాలమను కావ్యము సేతు జగద్ధితంబుగన్.
—శృంగారరసాలవాలము, ప్రథమపరిచ్ఛేదము.

మఱియు సంస్కృతవాఙ్మయమునఁ బ్రబంధపదము గ్రంథసామాన్యపరముగ వాడఁబడుచున్నది. అలంకారశాస్త్రగ్రంథమగు ప్రతాపరుద్రీయము ప్రబంధమైనట్లు విద్యానాథపండితుఁడు వ్రాయుచున్నాఁడు.[౪] ఆంధ్రమునమాత్రము ప్రబంధపదము కావ్యసామాన్యపరముగ వాడఁబడుచున్నది. కాన నాంధ్రులమతమున లక్షణగ్రంథములు ప్రబంధములు కాఁజాలవు. కావున నొక వాఙ్మయమున నొకరీతి ప్రసిద్ధములైన శబ్దము లితరవాఙ్మయమున వేఱొకయర్థమునే బోధించి తత్తదనుగుణముగ మాఱుచుండును.

ఆంధ్రలక్షణగ్రంథమగు కావ్యాలంకారచూడామణినిబట్టి కావ్యము గద్యపద్యమిశ్రభేదంబుల ముత్త్రివిధము లగునని తెలియుచున్నది.[౫] పెద్దిరాజు, దండి రచించిన కావ్యాదర్శము ననుసరించి యీ లక్షణభేదములను బరిగణించెననుట స్పష్టము. ఈ మీఁది భేదపరిగణనము సంస్కృతవాఙ్మయమునకు సరిపడుచున్నదిగాని యాంధ్రవాఙ్మయమున కనుగుణమైనట్లు కన్పింపదు. నన్నయ మొదలు నేఁటివఱకుఁ గల కవు లందఱును వ్రాసిన పద్యకావ్యములు గద్యవిరహితములై యుండుట లేదు. గద్యలుకూడ మీఁది పద్యకావ్యములందు లెక్కకుమిక్కిలిగనే యున్నవి. మీఁది లక్షణమును బట్టి యివి యన్నియు మిశ్రకావ్యములు [అనఁగాఁ జంపూగ్రంథములు] కావలసి వచ్చుచున్నవి. కాని గద్యములుగల కావ్యములుకూడఁ బద్యకావ్యములుగనే చెప్పఁబడుచున్నవి. కాన నాంధ్రమున వేఱుగఁ జంపూగ్రంథములు లేవు. ఒకవేళఁ గొన్ని గ్రంథములయొక్క నామములందుఁ జంపూపదములు కానవచ్చుచున్నను, నయ్యవి సంస్కృతచంపువుల యాంధ్రీకరణము లగుచుండుటచేతనే యట్లు చెప్పఁబడుచున్నవని నిశ్చయింపవలెను.

పై వాడుకనుబట్టి గద్యసహితములగు పద్యప్రబంధములుకూడఁ బద్యకావ్యములక్రిందనే లెక్కింపఁబడుచుండుటచేఁ గేవలము పద్యకావ్యములగునవి [గద్యరహితములగునవి] కూడ వానియందే చేరియుండుట లెస్స. కాని నిర్గద్యములగు పద్యకావ్యములకు మనవారు "నిర్వచనోత్తరరామాయణము", "నిర్వచనకుమారసంభవము" అని నిర్వచన విశేషణమును దగుల్చుచున్నారు. న్యాయమునుబట్టి యిది యనవసరమని చెప్పవలసివచ్చుచున్నది.

పైని వివరింపఁబడిన యీ భేదములంబట్టి పెద్దయకవి వివరించినట్లుగాక వేఱొకరీతి లక్షణములు చెప్పవలెను. ఆంధ్రమునఁ గావ్యములు గద్యపద్యభేదములచే రెండువిధములు. గద్యము లెక్కువగ నుండి పద్యములు లెక్కకుమాత్ర మున్నవికాని, కేవలగద్యమయములగునవికాని గద్యకావ్యములు; పద్యబాహుళ్యముకలవికాని, కేవలపద్యమయములగునవికాని పద్యకావ్యము లనఁబడును. ప్రబంధమనునది కావ్యమునకుఁ బర్యాయపదము. ఈ మీఁది విషయము లనే గ్రహింపవలెను.

సంస్కృతమునఁ గల దృశ్యకావ్యముల సంఖ్య నానాఁటికిని బెరుఁగుచువచ్చి యిప్పటికిఁ బైఁగా దృశ్యభేదములు చెప్పఁబడియున్నవి. ముఖ్యములగునవిమాత్రము నాటకప్రకరణాదులు పది కలవు. కావున నాటక మొక దృశ్యభేదమనియు, దృశ్యసామాన్యవాచకము కాదనియు నెఱుఁగవలెను. ఈదృశ్యకావ్యము లన్నియును మిశ్రకావ్యములని గీర్వాణాలంకారికులు చెప్పియున్నారు.[౬] నాట్యము లన్నింటియందును గద్యములును, బద్యములునుగూడ నుండుటచే నీరీతిగఁ జెప్పఁబడినదని మనము తెలిసికొనవలెను.

ప్రాచీనాంధ్రవాఙ్మయమున దృశ్యకావ్యము లున్నట్లగపడదు. అందులకుఁ గల కారణ మన్యత్ర విమర్శనీయము. వీథినాటకములు కొన్ని ప్రాచీనకాలమునుండియు వ్యవహారమునను, బ్రచారమునను నుండియుండవచ్చును. అట్టియెడ నవి దృశ్యకావ్యములుగనే బరిగణింపఁబడియుండవచ్చును. అన్నివిధములగు దృశ్యకావ్యములును నాటకములనియే యాంధ్రమునఁ బిలువఁబడుచున్నవి. మఱియు దృశ్యకావ్యములే కాక తదతిరిక్తములగు గ్రంథభేదములు కొన్ని నాటకములని పిలువఁబడుచున్నట్లు శ్రీనాథుని వీథినాటకము, క్రీడాభిరామము మొదలగు గ్రంథములనుబట్టి తెలియుచున్నది. అయ్యవి వీథినాటకములని పిలువఁబడుటలోఁ గల యథార్థమగు కారణము మృగ్యముగ నున్నది. ఏది యెట్లున్నను నాంధ్రమున నాటకపదము దృశ్యసామాన్యపరముగ వాడఁబడుచున్నదని చెప్పవలెను. పలురీతుల నిప్పు డెల్లెడ దృశ్యకావ్యము లన్నియు నాటకములనియే వ్యవహరింపఁబడుచున్నవి.

ఆంధ్రమున సంస్కృతమునందువలె నాటకములను మిశ్రగ్రంథములలోనికిఁ ద్రోయ వీలులేదు. కాని కొన్ని మిశ్రములు కావచ్చును. Shakespeare మహాకవి వ్రాసిన Merchant of Venice మొదలగు గ్రంథములవలెఁ గొన్ని నాటకములు కేవలపద్యాత్మకము లయియున్నవి. వీరేశలింగకవిగారట్లే రచించియున్నారు. కొన్ని కేవలవచనరూపము లగునవియుఁ గలవు. కాఁగా సంస్కృతముయొక్క రీతుల ననుసరించి వ్రాయఁబడిన మిశ్రకావ్యరూపములగు నాటకములు కొన్నియు, నాంగ్లము ననుసరించిన కేవలపద్యాత్మక

---

౪. శ్లో. ప్రతాపరుద్రదేవస్య గుణా నాశ్రిత్య నిర్మితః, అలంకారప్రబంధోఽయం సన్తః కర్ణోత్సవోఽస్తు వః. —ప్రతా. ౧-౯.

౫. గీ. అట్లు కవికృతమైన కావ్యత్రయంబు, గద్య పద్య విమిశ్రసంపాద్య మండ్రు
నగరముఖ్యాష్టదశవర్ణనములచేతఁ, బరఁగు నదియును దివ్యప్రబంధ మనఁగ. —చూడామణి ౩-౯౧.

౬. శ్లో. మిశ్రాణి నాటకాదీని తేషా మన్యత్ర విస్తరః. —కావ్యాదర్శః, పరి. ౧.

నాటకములు కొన్నియు, స్వతంత్రముగ గద్యరూపమున రచింపఁబడిన నాటకములు కొన్నియు నాంధ్రమునఁ గలవని నిశ్చయింపవలెను. కావున నేతద్రీత్యనుగుణముగ లక్షణములను వ్రాయవలసియున్నది.[౨]

ఈదృశ్యకావ్యవిషయమునమాత్రము లాక్షణికు లేమియు వ్రాసియుండలేదు. అందులకుఁ గల కారణము మొన్నమొన్నటివఱకు నాంధ్రమున నాటకములు లేకుండుటయేయని యెఱుఁగవలెను. అప్పకవి యొక్కఁడుమాత్రము కొంచెము నాటకవిషయమును వ్రాసినట్లున్నది. కాని యావిషయ మాంధ్రవాఙ్మయమునకుఁ గాని, సంస్కృతవాఙ్మయమునకుఁ గాని సంబంధించియుండలేదు. ఈవిషయము నా రచించిన "ఆంధ్రాలంకారచరిత్రము" [History of Telugu Poetics] నందు విపులముగ విమర్శింపఁబడియున్నది. ఆవిషయమునుబట్టి యప్పకవికాలమున నాటకములు లేవనికూడ స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది.

సంస్కృతాలంకారికులు దోషములను నిరూపించు సందర్భమున గల్లకటిశబ్దములు మొదలగునవి కొన్ని గ్రామ్యములనియు (పామరవ్యవహారముననే యున్నవనియు), నందుచే నట్టివానినిఁ బ్రయోగింపరాదనియుఁ జెప్పియున్నారు. ఆంధ్రాలంకారికులుకూడ గతానుగతికముగ నారీతినే గల్లకటిశబ్దములను బ్రయోగింపరాదని చెప్పియున్నారు.[౩] సంస్కృతకవులు తద్వాఙ్మయమున కనుగుణముగఁ జెప్పుటచే నాంధ్రకవులును దదనుసారముగఁ దెలుఁగుపదములనే — తత్పర్యాయములను నసభ్యపదములను [బుగ్గ - ముడ్డి అనువానిని] దోషములుగాఁ బరిగణించుట యుచితమైనది. ఆంధ్రమునఁ గూడఁ బత్నములయెడ మీఁది గల్లకటిశబ్దములు దోషములు కావని మాయభిప్రాయము కాదు. కాని యాంధ్రవ్యాపయమును విశదీకరించునపుడుమాత్ర మన్యాంధ్రమురీతిని యత్నమాంధ్ర ముపయోగించుట కష్టము. మఱియు నీయుదాహృతపద్యమునఁ జన్నులు, కన్నులు ననుపదములుకూడ గ్రామ్యములని చెప్పఁబడియున్నవి. కాని యివి పామరవ్యవహారముననే కాక పండితవ్యవహారమునఁగూడ నున్నవి. కావుననే మూర్తికవి తొలుదొల్త వానిని దోషములలోఁ లెక్కించియున్నను "చన్నులు", "కన్నులు" అనుపదముల నుపయోగించి చక్కని పద్యము నొకదానిని వ్రాసియున్నాఁడు.[౫] దానింబట్టి యతని మనసులో నవి దుష్టములు కానట్లే తోఁచియున్నట్లూహింపవచ్చును. మఱొక సంగతి. "కన్నులు, చన్నులు" అని చెప్పినచో దుష్టములనియు, "కన్నుఁగవ, చన్నుఁగవ" అని చెప్పినచో శుద్ధములనియుఁ బండితులు తలంచుచున్నారు. అట్టి ప్రయోగములు చాలఁగఁ గానవచ్చుచున్నవి. కాన "కవ" శబ్దమును జేర్చినంతమాత్రమున మీఁదిపదములు దుష్టములు కాకుండుటకును, లేనిమాత్రమున దుష్టము లగుటకును గల కారణము దురూహ్యముగ నున్నది. కాన నిట్టి వెట్లున్నను దుష్టములు కావనవలసియున్నది.

కొన్ని పదములు కొన్నియెడల దుష్టములు, కొన్నియెడల సుష్ఠువులు నగుచుండును. "బుగ్గ" శబ్దము పెద్దవారియెడను, కాంతలయెడను నుపయోగించుట సరసము కాఁజాలదు. కాని పసిపిల్లలవిషయమై "పాలబుగ్గలు" మొదలగు ప్రయోగములు రసావహము లనుటకు సందేహము లేదు. కావున బాగుగఁ బరిశోధించి దుష్టపదపరిగణనము చేయుట లెస్స.

సంస్కృతలాక్షణికులు దోషములలో ఛందోయతిభంగములను జూపి ప్రాసభంగమును విడిచిరి. ప్రాసము వారి మతమున శబ్దాలంకార మగుటచే నది కానున్నను గావ్యమునకుఁ గొఱఁత లేదు. ఆంధ్రులకు ప్రాసము యతివలెనే ముఖ్యమగుటచే వారు ప్రాసభంగమును దోషముగ నిరూపింపవలసియున్నది. కాని సంస్కృతలక్షణానుకరణమే ముఖ్యముగ రచింపఁబడిన యాంధ్రలక్షణములలోఁ (చాలవఱకు) బ్రాసభంగము దోషముగా నీయఁబడియుండలేదు. కానఁ దద్విషయప్రతిపాదనము ముఖ్యము.

ఇట్లు గీర్వాణాంధ్రవాఙ్మయములకుఁ గొన్నివిషయములలో భేదము కాన్పించుచుండుటచే పరిశీలనముగ లక్షణములు వ్రాసినచో నుపయోగము ముఖ్యము. కానఁ దత్తద్వాఙ్మయానుగుణముగ లక్షణములను వ్రాయవలసియున్నది.

---

౨. దృశ్యకావ్యములవిషయమై యాంధ్రమునఁ జేయవలసిన మార్పులనుగుఱించి నే నిదివఱకు సమదర్శినిలోఁ బ్రకటించిన "దృశ్యకావ్యములు" అను వ్యాసమును జూడఁదగు.

౩. పామరవ్యవహారైకప్రసిద్ధం గ్రామ్య ముచ్యతే.—

"శోణితాబ్జస్పృశః కామం శ్యామగల్లకటిస్థలాః." గల్లకటిశబ్దౌ కపోలజఘనపరత్వేన గ్రామ్యప్రయుక్తౌ. — ప్రతాప. దోష. 16.

౪. క. పామరుల భాష గ్రామ్యము, భామిని కటిగల్లములు విభాసిల్లు ననన్
గోమలి చన్నులు కన్నులు, కామునిపండువు లొనర్చెఁ గడువడి ననఁగన్. —నరస. ఆశ్వా. iv. 10.

౫. చ. ఘనత నృసింహుఁ జూడఁగల కన్నులు కన్నులు వాని కౌఁగిటం, జనవున నేపుచూపఁగల చన్నులు చన్నులు వాని మోవికిం
జొనిపిన పాటలాధరము జున్నులు జున్నులు వాని మేనఁ జేర్చిన సరసాంగవల్లికల చెన్నులు చెన్నులు వో తలోదరీ!
—నరస. ఆశ్వా. vi. 78.

వాఙ్మయము సర్వదా ఒక్కరీతినే యుండదు. కాలాను సారముగను, భాషాంతరములతోడి సంబంధమువలనను ప్రతివాఙ్మయమును మాఱుచునే యుండును. చరిత్రగ్రంథము లరుదుగ నున్న గీర్వాణవాఙ్మయమున నిక్కాలమున పరిపిగ నవి బయలుదేఱుచున్నవి. నాటకరచనాప్రణాళికూడఁ జాలవఱకు మాఱిపోయియున్నది. అట్లే యాంధ్రమున నాటకములు లేని లోపమును, గద్యగ్రంథము లరుదుగ నున్న లోపము నిక్కాలమునఁ బూర్తిగఁ బూరింపఁబడినది. భారతదేశమం దల్లెడల నాంగ్లభాషాధ్యయనము ముఖ్యముగఁ బరిగణింపఁ బడుచుండుటచేఁ దద్వాఙ్మయరచనాప్రణాళి మనవారిచేఁ గైకొనఁ బడినది. తత్ఫలితముగఁ గల్పితేతివృత్తములు, దుఃఖాంతములు నగు నాటకములును, విశేషముగఁ గల్పితేతివృత్తము కల్గి నూతనరీతులఁ ద్రొక్కి పండితపామరహృదయంగమములగు వచనకావ్యములును [ఆంగ్లమున Novel అనఁబడు గ్రంథమున కనుకరణ మగుటచే నీరీతికావ్యము "నవల" యని పిలువఁబడుచున్నది] మన వాఙ్మయమునను బయలువెడలినవి. కథానకము లనుపేరిటఁ జిన్నకథల విషయమైకూడ మనవారు పట్టుదల పూని రచనల సాగించుచున్నారు. కథతోడి సంబంధము లేక కేవలభావమే ప్రధానముగఁ గల ఖండకావ్యములకుఁగూడ నిక్కాలమునఁ బ్రాధాన్య మీయఁబడుచున్నది. అవి కాక "గేయము" లనుపేరిట వింతనడకలు గల పాటలు వెల్వడుచున్నవి. నూతనచ్ఛందములతో విలసిల్లు "ముత్యాలసరములు" కూడ వాఙ్మయమున నగ్రస్థానము నలంకరించుచున్నవి. ఇట్టి నూతనరచన లింక నెన్నేని కలవు. వాఙ్మయమునకు లక్షణము వ్రాయునపుడు వాఙ్మయభాగములగు వీనికి లక్షణములను వ్రాయుట కూడ నత్యవసరమై యున్నది.

సంస్కృతప్రాకృతముల మేళవింపు కల గ్రంథములును, స్వతంత్రముగఁ బ్రాకృతమున రచింపఁబడిన గ్రంథములును జాల కలవు. ప్రాకృతము వ్యావహారికభాష యనుటలో సందేహము లేదు. ఆంధ్రమున గ్రాంథికభాషలోనే గాని వ్యావహారికభాషలోఁ బ్రాచీనకాలమున గ్రంథములు రచింపఁబడినట్లగపడదు. కొన్ని లక్షణగ్రంథములలోమాత్రము వచనభాగములుమాత్రము వ్యావహారికభాషలో నుండుట కన్పడుచున్నది. మొన్నమొన్నటివఱకును వాడుకబాసకు వాఙ్మయమున నుచితమగు స్థానము లేకపోయినది. కాని చాలమంది పండితులుకూడ దాని నుద్ధరింపఁ గంకణము కట్టుకొని తగినప్రచారములోనికిఁ దీసికొనివచ్చుచున్నారు. వ్యావహారికభాషలో వ్రాయఁబడిన "యెంకిపాటలు" మొదలగు గ్రంథములు రమణీయముగ నున్నవనుటలో సందేహము లేదు. వాఙ్మయమంతయు వాడుకబాసలోనే యుండవలెననుట సరికాదు; కాని గద్యభాగములును, నందుఁ జిన్నచిన్న దృశ్యభాగములు, చిన్నకథలు, సాంసారికనవలలు వ్యావహారికభాషయందు రచింపఁ గలిగిన సౌలభ్యము, సౌకుమార్యము గ్రాంథికభాషలో వ్రాసినఁ గలుగుట యరుదని చెప్పవలెను. కావున మీఁది వాడుకబాసలో వ్రాయఁబడిన వాఙ్మయభాగములకుఁగూడ నుచితరీతి లక్షణ మవశ్యకరణీయమై యున్నది.

నవయుగమున రచింపఁబడిన యీనవలాదిగ్రంథములవలన వాఙ్మయమునకుఁ బరిపోషము కల్గునా? విజ్ఞాన మభివృద్ధినిగాంచునా? అని కొందఱు ప్రశ్నింపవచ్చును. గతానుగతికముగఁ జాలమంది వీనివలన నేమియుఁ బ్రయోజనము లేదని తలంచుచున్నారు. కాని సంఘములను బాగుగ సంస్కరించి మంచిదారులలోఁ బెట్టుటకు మీఁదినవలలు మొదలగునవి యుపయోగించు ననుటలో సందేహ మక్కఱలేదు. వానివలన వాఙ్మయసేవ జరుగుటలో నవకాశములు కలవు. కాని కొందఱు గ్రంథకర్తలు తమకు గ్రంథరచనకు వలయుసామర్థ్యము లేకున్నను లేనిభారమును బైవైచికొని వాఙ్మయమునకుఁ జెడపురుగులై కొన్ని యపప్రచారములను, వర్తనలను బోషించుచున్నారు. అట్టివానిఁబట్టియే యుత్తమగ్రంథములకుఁగూడ వన్నెతఱుగును. కాని విచారించి చూచినచో నన్నివిధము లగు వాఙ్మయభాగములు వాఙ్మయోపచితికై పాటుపడుచుండుటచే నవలలాదిగ నన్నింటియందును నుత్తమగ్రంథములు లేకపోలేదని తెలిసికొనవలెను.

గీర్వాణాంధ్రవాఙ్మయములకుఁ గల మీఁది వ్యత్యాసములను, నేనొనర్చిన కొలఁది సూచనలను బరిశీలించిన, తత్తద్వాఙ్మయముల కుచితములగు లక్షణముల నొనర్చుట కర్తవ్య మని ప్రాజ్ఞులు నిశ్చయింతురని నానమ్మకము.

# శాకుంతలము, దాని నూతనసందేశము

### రబ్బాప్రగడ సుందేశ్వరశర్మగారు

[ఇటీవల నేను కడలూరుజైలులో నుండఁగాఁ బూర్వపశ్చిమ గ్రంథములనుగూర్చి విమర్శచేయుట కవకాశము లభించినది. మహాకవి కాళిదాసకృత "అభిజ్ఞానశాకుంతలము"నుగూర్చి నే నపుడు విమర్శచేయఁగా స్ఫురించిన అంశములను పైశీర్షికక్రింద కొవ్వూరున నాంధ్రగీర్వాణ విద్యాపీఠముయొక్క విద్యార్థులు జరిపిన గణపతి నవరాత్ర సందర్భమున నుపన్యాసపూర్వకముగాఁ బ్రచురపఱచియుంటిని. పండితులును, విద్యార్థులునుఁగూడ తదుపన్యాసాంశములను వ్యాసపూర్వకముగాఁ బ్రచురింపఁ బ్రోత్సాహపఱచినందున నే నీవ్యాసము రచనకుఁ గడంగితిని.]

శాకుంతలమునుగూర్చి వివిధభాషలలో వివిధవిమర్శకులు వివిధరీతులఁ జర్చించియుండిరి. వాని నన్నిటిని చర్వితచర్వణముగ నిచ్చటఁ దెలుపుట నాముఖ్యోద్దేశము కాదు. నేను నూతనములని భావించిన యంశములనే యిందుమూలముగాఁ దెలుపుట నాముఖ్యోద్దేశము.

#### శాకుంతలము, ఇరువదియవ శతాబ్దము

పరిశోధకుల మతముప్రకారము 'అభిజ్ఞానశాకుంతలము'ను కాళిదాసు రచించి ఇప్పటికి ౧౫ వందల సంవత్సరములు, లేక ౧౬ వందల సంవత్సరములు అయినవి. ఇంతకాలమునుండియు "కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతలా" అనే ఖ్యాతిని నిలుపుకొనుచూ వచ్చినది. ఈ సంవత్సరశతములలో భారతదేశములో నే కాదు, ప్రపంచ మంతటిలోను సంఘజీవనము, కవిత్వము, సాహిత్యము, ప్రజల రుచులలోను పెక్కుమార్పులు-మార్పులే కాదు-విప్లవములు జరిగినవి. కాని దేశకాలము లెట్టి మార్పును చెందినను, శాకుంతలముమాత్రము ప్రతిదేశకాలములవారికిని వాడని సొంపుతో, తరుగని నెత్తావితో నూతనానందమును, సందేశమును బ్రసాదించుచునే యున్నది. అందులకే గైటీపండితుఁడు ప్రపంచములోని సౌందర్యానందదాయకములైన నిఖిలపదార్థములును "శకుంతల"లో లీనమైపోయినవని పాడినాఁడు.

కాని వర్తమానములో మనము చూచుచుండఁగా, చూడకుండఁగా, మనకు తెలిసియుఁ దెలియకయు, మనదేశము, ప్రపంచముఁ గూడ భావాలలో, రూపాలలో, మానవజీవితముయొక్క సర్వవ్యవస్థలలో సినీమాఫిలిముల వలె అతితీవ్రగతిని మారిపోవుచున్నవి; అప్పుడే మారిపోయినవి. పాశ్చాత్యదేశములలో చూడుఁడు: కవిసార్వభౌముఁడని పేరుపొందియుండిన 'షేక్స్పియరు' నందును, కవికోకిలమనుకొనఁబడిన మిల్టనుయందును రుచి తగ్గుచున్నది. బెర్నార్డుషా, మేగ్జిమ్‌గార్కీ మున్నగు కవులు ప్రజల నెక్కుడుగా నాకర్షించుచున్నారు. భావి మానవసంఘము ఎటులుండవలెనో చూపించుటకు రష్యాలో సర్వతోముఖమైన యొక మహాపరిశోధన జరుగుచున్నది. ఇటలీలో నట్టిదే మఱొకటి జరుగుచున్నది. భారతదేశములో గాంధిగారి నాయకత్వమున (హెచ్చుగా ప్రజల మానసికపథములో) విప్లవము జరుగుచున్నది. వ్యష్టిదృష్టిపైనను, వ్యక్తియొక్క రాజకీయస్వాతంత్ర్యముపైనను నాధారపడిన ప్రస్తుతప్రజాస్వామ్యములు (Democracies) సంఘ

దృష్టి, సంఘక్షేమమునకు సుముఖమైన సాంఘిక స్వామ్యము (Socialistic Govts.)గా మారుచున్నది. స్త్రీ పురుషులకుఁ గల పూర్వసంబంధములు మారుచున్నవి. "ఆస్తి", "ధనసంపాదన", "స్వార్జితము"అను శబ్దములకు ప్రస్తుతము రూఢమైన యర్థములు ఈ నూతన సభ్యతలో నంగీకరింపఁబడవు. కోట్లకొలఁది సోదరమానవులను,జంతుజాలమును అస్త్రశస్త్రములచేతను, నితరదారుణమారణ సాధనములచేతను నాశనముచేయుట "యుద్ధ" మనియు, అట్టి నాశముచేయువారలు "వీరు"లనియు గౌరవింపఁబడు రోజులు పోవుచున్నవి. దేశమునకును దేశమునకును మధ్య గల దేశాభిమానమును, రాజకీయకుడ్యములను భేదించి — విశ్వమంతటను గాకపోయినను — మానవ సంఘమంతకును ఏకన్యాయము, ఏకకల్యాణము సిద్ధింపఁ గల రాజకీయనిబంధనలతోఁ గూడిన నూతనసంఘనిర్మాణమును అహింసాప్రేమలఁ బునాదిగాఁ గొని నిర్మించవలెనని రోలెండు, గాంధీ, షా, అరవిందఘోషు మున్నగు జిజ్ఞాసువులు తపస్సుచేయుచున్నారు.

ఈరోజులలో రాజులను, రాణులను గుఱించిన కావ్యములు ప్రజలకు రుచింపవు. వారి ప్రణయములతో, వారి విరహములతో మనకు నిమిత్తము లేదు. సంఘము కొఱకు నిరంతరపరిశ్రమ చేసెడు ఆ సామాన్యజనుఁడే మనకు గౌరవనీయుఁడు వాని సర్వతోముఖాభ్యుదయమే మన లక్ష్యము. వాని కంట మెఱుఁగిని అవ్యాజప్రేమ రసాలు, వాని జీవితములో కలిగే ఒడుదుడుకులు మాకు ఇతివృత్తములు, స్థాయిభావాలు, ఉద్దీపకములు. విశ్వ మానవప్రేమలో మునిఁగిపోవడమే మాకు పరమానందము. ఈదృష్టిలో నడచుటకు ప్రారంభించిన మానవ సంఘమునకు మీ 'శకుంతల'లో నేమైనను నూతనసందేశము గలదా అని నవీను లందురు. "ఆఁ, కలదు. శకుంతల కావ్యకల్పతరువు, తప్పకుండా ఉన్నది. మీరు చూచుకొండు"అని నా జబాబు. ౩౦౦ సంవత్సరముల క్రితము వ్రాసిన షేక్స్పియరు నాటకాలు వర్తమానంలో కొంచెం వాడడం ప్రారంభించినవి. ౧౫౦౦ సంవత్సరములనుంచియు శాకుంతలకావ్యకుసుమము అమృతంగానే ఉన్నది, ఇందుచేత నేగదా!

### నూతనసందేశము

"అహో, మధుర మాసాం దర్శనమ్' అన్నాఁడు దుష్యంతుఁడు, కణ్వాశ్రమములోనికి ప్రవేశించి యనసూయాప్రియంవదలతో శోభించుచున్న శకుంతలను చూచుటతోడనే. ఈ "మధురిత్వము" అంతఃపురాలలో పనిపాటు లేక వందలకొలఁది తనవంటి జీవులనే దాసీలుగఁ జేసికొని, ఇంతమంది దాసీ లున్నందుకు గర్వించుచు, ఈవిధముగానే గర్వించుచున్న, నిరంకుశత్వము చలాయించెడి పురుషవ్యక్తియొక్క చిత్తరువును వక్షస్థలముమీఁద పెట్టుకొని మొఖమల్ సోపాలపై ఒకస్త్రీవ్యక్తి దొర్లుచూ ఉంటే, ఆసంగతి ఏదూతికరామో ఆయనకు చెప్పితే అంతమైన ఆయన ఆమెనుగూర్చి భావనచేసే —(నిజముగా అమధురమైన) మధురదర్శనం కాదు. అవ్యాజమైన భూతకరుణాప్రేమరసాలతో నిండిపోయిన హృదయంతో, ఆధిక్యన్యూనత్వములు లేని సఖీభావముతో, స్థూలదృష్టిలో మనము స్థాణువు లనుకునే బాలరసాలము, వనజ్యోత్స్నల కలయికలలో ప్రణయమహిమను వీక్షించే ముగ్ధత్వంతో, శరీరలావణ్యము, సౌకుమార్యము చూచినప్పుడు బద్ధకపు నాయికానాయకుల చరిత్రంతో గ్రథితమైన కావ్యములయందభిరుచిగ వారలకు మనస్సు "చిప్పుక్క" మనునట్లు స్వయముగా మొక్కలకు సఖులతోఁ బాటు కుండతో నీళ్లు పోసే శకుంతలాదర్శనము—ఇది మధురదర్శనము. ఇదియే ప్రథమశకుంతలాదర్శనము దుష్యంతునికి. పేశలగాత్రియైన యాశకుంతల మృదుబాహువులపైన నధిష్ఠించిన ఆసేచనఘటము అనఁగా నేమి? పండితమోతీలాల్ భోగియొక్క మేజామీఁద రాట్నము అనఁగానేమో దీనికిని అదియే అర్థము. పరిశ్రమయొక్క గౌరవసౌందర్యములు అందులో చూపించినాఁడు, కాళిదాసు. ప్రతి

దినము సంఘముయొక్కయు, విశ్వముయొక్కయు సేవా రూపకమైన కార్యములు చేయకుండఁగనే విశ్వమునుండి ఎట్టి ఆహారమును వ్యక్తి గైకొనరాదను ప్రాచీనసూత్ర మం దిమిడియున్నది. షేక్స్పియర్ మున్నగు విఖ్యాతకవులయొక్క నాయికలు ఈనాఁడు రష్యాలో పౌరస్వాస్థ్యము నొందఁజాలరు. కాని కాళిదాసుశకుంతలను, పింగళిసూరనార్యుని సుగాత్రిశాలీనులను సాదరముతో నా రాహ్వానించి బహుమానించెదరు. కేవలబాహ్యేంద్రియస్వచ్ఛతయే గాదు, లావణ్య మనఁగా. ఒక మహాద్భావము, దానియందు మన స్సంతర్లీనమగుట, దానిని గుఱించియే ప్రేమపూర్వకముగ (విధిపూర్వకముగఁ గాదు.) పరిశ్రమించుటయే నిజమైన లావణ్యమునకు లక్షణము. ప్రకృతి లావణ్యములో తనలావణ్యమును లీనముచేసినది,శకుంతల. అట్టి లావణ్యమే శకుంతలహృదయార్ణవంలో దుష్యంతుని మనస్సు నైక్యము చేసినది; సుగాత్రిహృదయారవిందంలో శాలీనుని మనోభృంగాన్ని స్థిరంగా బంధించేసింది.

### కణ్వాశ్రమము

కాళిదాసు వర్ణించిన కణ్వాశ్రమము ఆధునిక లోకోత్తరపురుషులైన రోలెండు, గాంధీ, షా మున్నగు వారు స్వప్నాల్లో చూస్తూన్న నూతనమానవలోకం. ఇంకా వారు స్వప్నాల్లో చూడందికూడా నేమోనని నానమ్మకం.

మానవుల మధ్యనే కాదు, చరాచరాత్మకమైన యఖిలజంతుజాలమునకును ఈ పుణ్యభూమిలో సామరస్యము కుదిరినది. అది "సర్వభోగ్య" మైన యాశ్రమము ( అం ౧. శ్లో. ౧౪. ). అందు ఏవ్యక్తికిని ప్రత్యేకస్వత్వము (Private right or proprietor-ship) లేదు. సహకారము అందలి వ్యక్తులకు సహజలక్షణ మైనది. "స్పర్థ" (Competition) వలన నొకవ్యక్తితలను మరి యొకటి తన్ని బయటకు రావలెనను నాధునిక పరిణామవాదుల కట స్థానము లేదు. మన భావప్రపంచములో నిప్పటికిని గూడ వృక్షాల మొదళ్లను పిల్లకెరటాలు సేవిస్తూనే ఉన్నవి. బాలసహకారంక్రింద నున్న దుర్బలమైన వనజ్యోత్స్న సహకారము నంటి ప్రాకి సృష్టికి శోభావహమైనది. లోకమంగళకరమైన యజ్ఞాలయొక్క ఆజ్యధూమములవల్ల రంగు మారిపోయిన వృక్షాల లేతచిగుళ్లలో సంపూర్ణాత్మార్పణముయొక్క సౌందర్యము గోచరించుచున్నది. ఆమాలినీతీరపు పచ్చికబయళ్లలో, ఘోరవ్యాఘ్రాలతో కూడిన అటవీమధ్యమున నిర్భయంగా లేళ్లు పిల్లలతో "చంగుచంగు" మని నేత్రపర్వముగా గంతులువేయుచు, దర్భగడ్డిని హాయిగా కబళించుచున్నవి. ఒకమూల నదిలో హంసలు విలాసంతో ఈదుతున్నాయి. లేడిపిల్ల మూతికి దర్భగడ్డి గీచుకపోయినపుడు మన శకుంతలదగ్గరకు చికిత్సకు వచ్చును. ఈమె ఇంగుదీఫలతైలము మూతికి రాచి వ్రణవిరోపణము చేయును. తాను తినే నివరధాన్యంతో ఆశ్రమవాసులు మానవులకే కాదు, లేడిపిల్లలకు, చిలుక పిల్లలకుఁగూడ నాతిథ్య మిచ్చెదరు. అందులకే చెట్ల తొఱ్ఱలలోనుండి నివరధాన్యములు నిరంతరము రాలుచుండును. అంతేకాని చిలుకలకు తినుటకు ఫలములు లేక కాదు. రమ్యమైన ఆకోకిలగానాలు, మయూరనృత్యాలు, లతాగృహాలు, ఫలభారమునవంగి వినమ్రశోభాయమానములైనవృక్షాలు, మాలినీకణ వాహినులైన, అరవిందసురభులైన,వనవాయువులు ఇట్టిఆశ్రమంలో కణ్వునివంటి తపశ్శాలి, విశ్వద్రష్టయొక్కఅధ్యక్షతనుమెలఁగే స్త్రీపురుషులభావాలు ఉన్నతపథంలో చరించకతప్పదు. "ఒక ఆదర్శనీయమైన వాతావరణమును, ఒక పవిత్రవ్యక్తినిమాత్రము రచించండి. మిగత మనుష్యసహస్రాలకు మీ రేమియు బోధించ నక్కఱలేదు. ఆవ్యక్తిసమీపములోని ఆవాతావరణములో వారిని వదలివేయండి. వారే సుసాంగత్యము వలన లోకపూజ్యులైన ప్రతిభావంతులుగాఁ దయారగుదురు"అను నాదేశముగూడ నిందులో కలదు.

శకుంతల ఆశ్రమహృదయంతో తన్మయత్వం పొందిపోయినది. మొగ్గలకొరకు ఆమె మల్లెలకు నీరు పోయలేదు. తాను పోషించుచున్న లతావృక్షాలు పువ్వులు, కాయలు, పండ్లతో శోభించుచుండఁగా, తాను, అలంకారప్రియురాలు, నేర్పరి అయ్యును, ఒక్క "పల్లవాన్ని" కూడ పుణకడానికి హృదయం జలదరించే నిశితమైన అహింసాభావంతో విరాజిల్లుచున్నది, ఆమెమనస్సు. చరాచరయుతమైన ఆశ్రమమే ఆమెకు గురువు, సఖి, ప్రణయమూర్తి. చివరకు 'ఆశ్రమమే ఆమె' అను నద్వైతభావ మామెకు సిద్ధించినది. అందులకే ఆమె అత్తవారింటికి వెళ్లుచుండఁగా "సర్వై రనుజ్ఞాయతామ్" అని కణ్వమహర్షి యనుటతోడనే సచేతనమయిన అఖిలసృష్టియు ఒక్కమారు తటాలున స్తబ్ధమైనది. లేడిపిల్లల హృదయాలు శకుంతలామయ మగుటవలన తినేతినే దర్భకబళాలు నోట్లోనుంచి జారిపోవుచున్నవి. ఆడేఆడే నెమళ్లు ఆటమరచిపోయినాయి. లతలనుండి జారే పాండుపత్రాలు వియోగబాష్పాల్లా భాసించినాయి. ఈసానుభూతిని శకుంతల ఎలా అందుకున్నది? సార్వభౌమునకు అంతఃపురములో, దివ్యభోగాలతో కూడిన అంతఃపురములో, పట్టమహిషిగాఁ ప్రవేశింపఁబోవుచున్న ఆముహూర్తమునఁగూడ వనజ్యోత్స్నలతను మఱచిపోవద్దని చెలులకు మఱీమఱీ చెప్పినది. గర్భమంథర అయ్యు తన్ను వెంటనంటివచ్చుచున్న ఆ లేడి సుఖప్రసవమైన సంగతి తప్పక హస్తినాపుర ముత్తరముల్వ్రాయుమని తండ్రిని కోరినది. ఈఘట్టంలో శుకమహాఋషి యొక్క భూతమయజీవితం జ్ఞప్తికి వచ్చుచున్నది.

ఆశ్రమజీవితము లోకానుభవమునకు వ్యతిరేకమా ?

భారతీయదృక్పథములో నిహము అనిత్యమైనను, లోకసంగ్రహార్థము చేయఁబడు నైహిక కార్యములు ఆముష్మికతుల్యములే. ఆశ్రమము ఇహములోఁగూడ నున్నతసంకల్పమునకు స్థానము. చక్రవర్తియైన భరతుని జననమునకు శకుంతలాదుష్యంతు లాశ్రమములోనే సంకల్పించిరి. ఇంతేకాక ఈయాశ్రమము సర్వశాస్త్రములకు, కళలకు, పరిశోధనలకు నిలయము. అందుచేతనే లోకమును నడిపింపఁగల మహానాయకు లనేకమంది ఆశ్రమములోనే జన్మించి అచ్చటనే సుశిక్షితులైరి. శకుంతలాపుత్రుఁడైన భరతసార్వభౌముఁడేకాక కుశలవులు వాల్మీక్యాశ్రమములోను, పురూరవపుత్రుఁడు చ్యవనాశ్రమములోను శిక్షను పొంది ప్రతిభాశాలు లైరి. లోకకంటకుఁడైన తారకాసురుని పరిమార్పఁగల వీరుఁడు స్థాణ్వాశ్రమములో జనించినాఁడు. సూర్యవంశములోఁ ప్రసిద్ధుఁడైన రఘుమహారాజు జననమునకై ఆశ్రమములోనే నందినీధేనుప్రసాదము పొందఁబడినది. కాళిదాసకృతకావ్యములలో నెచ్చట చూచినను నాశ్రమజీవితముయొక్క యాత్మతృప్తియు, పవిత్రతయేకాక లోకసమస్యాపరిష్కారములకును, లోకనాయకులకొఱకును ప్రజలు ఆశ్రమమువైపుననే తమ దృష్టిని కేంద్రీకరించునట్లు రచించును. అందుచే నీయాశ్రమములు కేవలము పురాణగాథలతో కాలక్షేపముచేయు, లోకజ్ఞానములేని వ్యక్తులతో కూడుకొనియున్నవి కావని తెలుపుటయే కవిహృదయము. శాకుంతలములో ఈభావమును కణ్వుని పాత్రరచనములోనే యోగ్యముగా వ్యక్తపఱచినాఁడు. కణ్వుఁడు, ఒకమూల శకుంతలానిర్గమనమును గూర్చి చరాచరాత్మకమైన అఖిలజంతుజాలమునకును తెలుపఁగల విశ్వమయహృదయుఁడు. ఆయన ఉపమానములును ఎంతసేపు, ఆజ్యము, హవిస్సు, అగ్నిహోత్రుఁడు—వీటికి లోఁబడియుండును. కాని ఇట్టివ్యక్తి చతుర్థాంకములో శకుంతలకు చేసిన 'శుశ్రూషస్వ గురూన్' అనుశ్లోకములోని యుపదేశములు ఎంత లోకానుభవయుక్తముగా నున్నవి! ఆ విధముగానే "యాస్య త్యద్య శకుంతలేతి" అనే శ్లోకంలో ఆరోపితమైనను పుత్రీప్రేమను ఎంతో మనోహరముగాను, పాత్రౌచిత్యభంగము లేకుండఁగాను రచించినాఁడు. అచటనే "వనౌకసోఽపి సంతో లోకజ్ఞా వయమ్" అని అనిపించినాఁడు కణ్వునిచేత. అందుచేత కాళిదాసుని యాశ్రమ







(2) 1. జనార్దనస్నానఘట్టము, ధవళేశ్వరము; 2. రాజమండ్రి బై యిండియన్ లీగువారి యాజమాన్యమున యాత్రికులకు సాయముచేసిన స్త్రీ వాలంటీర్లు; 3. కొవ్వూరు స్నానఘట్టము.







1. పుష్కరసమయమున ప్రజాసేవచేసిన ఏలూరు స్థానిక బాలభటసంఘము; 2. పుష్కరసమయమున ఆల్ ఇండియాను లీగువారి యాజమాన్యమున జరిగిన స్వదేశీ ఎగ్జిబిషనులో పాల్గొన్న వాలంటీర్లు; 3. రవిభటసంఘము.

మిహాపరములకు కూడలిస్థలము; లోకనాయకుల కుత్పత్తి శిక్షణనిలయము; ఉన్నతాదర్శతేజఃపుంజములను ప్రపంచమునకు ప్రసరింపఁజేయఁగల కేంద్రము; ప్రకృతిరామణీయకమును, సౌందర్యమును వీక్షించి అందులో నిజవ్యక్తిని తన్మయత్వం పొందించఁగల విహారస్థలము. ఇదియే "సబర్మతీలు", "శాంతినికేతనాలు." వ్యక్తిసభ్యత, అహంభావము, మారణయంత్రశక్తులు, వర్తకపు పోటీల మధ్య భ్రమించుచు, అంతర్ముఖదృష్టిశూన్యమైన, మానవకల్యాణభంగకరమైన నేటి రాజకీయజీవితమునకు ఈమహాకవి యాశ్రమసందేశమే శరణ్యము. కపటమెఱుఁగని మనుజుల మానవజాతి కలసిమెలసి యుండు జీవితము ఇచ్చటనుండియే ప్రపంచమునకు వ్యాప్తము కావలెను. ఈసందేశము నేనెఱిఁగినంతవఱకు పూర్వపాశ్చాత్య (బహుశః ప్రాచ్యకావ్యములలోఁగూడ) కావ్యములలో నెచ్చటను కానరాదు. గతశతాబ్దములో వర్డ్స్వర్త్ (WordsWorth) కొంచెము ప్రకృతిసందేశమును లోకమునకు ప్రచురించెను. కాని ఈ సందేశమునకు మూలపీఠము కాళిదాసే.

### శృంగారరసప్రధాన్యమునకు హేతువేమి?

మన సాహిత్యశాస్త్రములోనేమి, కావ్యములలోనేమి, ముఖ్యముగా కాళిదాసకృతకావ్యములలోనేమి శృంగారరసమునకు ప్రాధాన్య మీయఁబడినది. ఇందునుగూర్చి నేను రఘువంశమును చేపట్టినప్పటినుండియు తర్కించుచుంటిని.

శృంగారము అనఁగా కామ్యసంభోగేచ్ఛ గాదు. విశ్వశృంగారకరమైన సృష్టి, దాని వికాసమునకు అవసరమైన సమీకరణశక్తి (Synthitical force), వ్యక్తియందలి పృథగ్భావమును, పృథక్స్థితిని తగ్గించి ఐక్యసంధాయకమైన సమీకరణభావమును,సమరసస్థితిని పోషించుటయే ఇందలి తత్త్వము. తన సంస్కారమునకు అనురూపమైన మఱియొక వ్యక్తిలో తన హృదయమును కలిపివేయుటకు వ్యక్తి నిరంతరము తపించుచుండును. మనోజగత్తులోని ఈప్రేమపరమాణువుల యేకరాశియే విశ్వముయొక్క నైతికబలమును కాపాడుచున్నది. అటులనే స్థూలప్రపంచములోఁగూడ ప్రతి పరమపరమాణువును మఱియొక అణువులో లీనమై ఉభయులయొక్క వ్యక్తిసమిష్టిలో నుండి ఒక నూతనరూపమును, సౌందర్యమును ప్రదర్శించుటకు కోరుచుండును. కోరుటయే కాదు, తపించుచుండును. ఈతాపము పరమాణువులలో నున్నంతకాలము ఈవిశ్వము ఉత్పత్తివికాసములతో శోభిల్లుచుండును. మన కన్నులయెదుట కనఁబడుచున్న ఆచిన్ని ఇసుకరేణువు, రేణువుగా నిలచి వర్ధిల్లుటకు కారణమేమి? దాని కారూపము నిచ్చుటకుఁగాను తమ వ్యక్తిత్వమును దానియందు అర్పణచేసికొనినసహస్రాధికమైనపరమరేణువుల(Electrons) యొక్క ఆసంయోగాభిలాషయే (Synthitical tendeney). అట్టి "సమీకరణేచ్ఛ" ఆఇసుకరేణువులోని ప్రతిపరమపరమాణువులోఁగూడ నున్నదని భౌతికశాస్త్రజ్ఞులు రుజువుచేయఁగల కాలము సమీపమున నున్నదని నాకు తోఁచుచున్నది.ఇందుచేతనే శృంగారముపిమ్మట కరుణకును, అటుపిమ్మట వీరమునకును సాహిత్యములో ప్రాధాన్య మీయఁబడినది. ఇతరరసములు వ్యక్తిలోని పృథగ్భావమును ప్రకోపింపఁజేయును. కనుక వానికి అగ్రస్థానమివ్వఁబడలేదు. ఏశక్తివలన ఈయఖిలవిశ్వమునకు మూలమైన పరమపరమాణువులు పరమాణువులుగాను, అవి అణువులుగాను,అవి ద్వ్యణుకాదులుగాను సృష్టిస్థితుల కొఱకును, లోకకల్యాణముకొఱకును బంధింపఁబడుచున్నవో, అదియే శృంగారము; అదియే విశ్వపోషకశక్తి; అదియే విశ్వప్రేమలో వ్యక్తిహృదయమును ముంచివేయఁగల శక్తి. ఈదృష్టిలోఁ గొంతకాలమునకు మనుష్యుల శృంగారములనేకాక పార్థివపరమాణువులయొక్క సంయోగవియోగములనుగూర్చికూడ కావ్యములను వ్రాయుట అసమంజసము కాదని తోఁచుచున్నది.

శాకుంతలముయొక్క సందేశము సత్యవిజయము

శకుంతల సత్వమూర్తి. కేవలము సత్వము కార్య సమర్థకముగాదు. లోకసంగ్రహార్థము మహత్కార్యమును ఘటింపఁజేయవలసివచ్చినపుడు సత్వము రజస్సుతో చెలిమి చేయును. ఇదియే సత్వమునకు పరీక్షావస్థ. తన పవిత్రతను కాపాడుకొనుచు, తానుపొందవలసిన కార్యసిద్ధిని పొందుచు చివరకు తన చెలిమిని కోరిన రజస్సునుకూడ సత్వమయముగఁ జేసికొనవలెను.

కాని రజస్సుయొక్క స్నేహములో శకుంతల ప్రమాదము నొందినది. తన సత్వప్రకృతిని మరచినది. అతిథి సత్కారధర్మము చ్యుతమైనది. సత్వ"శూన్యహృదయ" అయినది. అందుచే హృదయతాపపూర్వకమైన తపస్సును చేసి, తిరిగి తన సాత్వికప్రకృతి నుద్ధరించుకొనవలెను. ఇదియే దుర్వాసశ్శాపమునకును, తత్ఫలితముగా దుష్యంతుఁడు శకుంతలను మఱచి ప్రత్యాదేశము చేయుటలోను గల భావము. సత్వపరమైన తపస్సు భౌతికవాసనల కతీతమైన ఉన్నతపథములో చేయవలెను. అందుచేత నామె మరీచ్యాశ్రమమునకుఁ గొంపోఁబడినది. ఇక్కడ రజోరూపుఁడైన దుష్యంతుఁడుకూడ తప్తహృదయుఁడు కావలెను, పవిత్రమూర్తిగ నావిర్భవింపనున్న శకుంతలాసమాగమమునకు నధికారమును పొందవలెనన్న. ఇదియే కవిహృదయ మనుటకు మఱియొక నిదర్శనము.—శకుంతల పతిగృహమునకు పోవునపుడు ఆమెపట్ల సాత్వికసానుభూతిని (ప్రేమపూర్వకముగ) చూపుట సాత్వికహృదయలక్షణము. దుష్యంతుఁ డంగుళీయకదర్శనానంతరము శకుంతలాస్మృతివలనఁ గలిగిన పశ్చాత్తాపమును, విరహమును అనుభవించుచుండఁగాఁ బ్రకృతికి దుష్యంతునిపట్లఁ గల "భయభక్తుల" వలన వసంతఋతువు శోభను పోషించుట మానివేసి స్తబ్ధమై పోయినది. ఇది రజోంశగల రాజునకు చేయవలసిన మర్యాద.

తుద కుభయులు సత్త్వప్రధానమైన మరీచ్యాశ్రమములోఁ గలసిరి. అంతకుఁ బూర్వము రజస్సుయొక్క వేగములోఁ దొందరగా భర్తపట్ల మాట్లాడిన శకుంతలకు తన్నవధీరణచేసిన పతిదర్శనము, హృదయము సాత్వికమగుటవలననే ప్రేమకరుణలకు విరుద్ధమైన యెట్టి యుద్రేకమును గలిగింపలేదు. ఆవిధముగనే (దుష్యంత మందిరమునకు శకుంతలాసహితంగా వచ్చిన ఘట్టంలో) కణ్వశిష్యులు తాము న్యాయమని నమ్మిన అంశమును దుష్యంతునియెదుట నతని సభలో చెప్పవలసి వచ్చినపుడు దుష్యంతుని అధికారముగాని, అతనియొక్క హోదాగాని వారిని చలింపఁజేయ లేదు. "మూర్ఛంత్యమీ వికారాః ప్రాయే ణైశ్వర్యమత్తేషు" అని సార్వభౌముని యెదుట ఆయనలోఁగల దోషమును ఖండితముగఁ దెలిపిరి. మహాపరాధముచేసిన వ్యక్తి తనను సమీపించినపుడు వాని నవ్యాజప్రేమతో గౌరవించుట యెంత సాత్వికమో సత్యధర్మములు ప్రతిపాదింపవలసి వచ్చినపుడు వ్యక్తులయందలి యధికారగౌరవములను మరచి పైనుండి శతఘ్నులు వర్షించుచున్నను నిర్భయముగఁ బ్రకటించుటగూడ అంత సాత్వికలక్షణమే.

చివఱకు సత్వరజస్సంయోగమునకుఁ బ్రయోజనమైన లోకసంగ్రహము సిద్ధించినది. సార్వభౌముఁడైన, ఈభారతభూమిని తననామముచేఁ బ్రసిద్ధి నొందఁజేసిన భరతుని జననము జరిగినది. సత్వము తిరిగి స్వస్థానమునకుఁ బోవలెను. నాగరికవ్యామోహములలోఁ గేవల మైహికభోగములమధ్య సత్వమునకు రుచి లేదు; ప్రమాదముకూడ కలదు. ఆశ్రమజీవితమునకుఁ దాను మఱలుచు తన్ను నమ్మిన రజఃప్రకృతినిగూడ సత్వమయముఁ జేసికొను శక్తి తనకుఁ గలదు. అందులకే ఈమహారాజుగారికిఁగూడ సన్న్యాస మిప్పించి ఆశ్రమపథానికి తీసికొనిపోయినది శకుంతల.

# వాఙ్మయము: కథలు

'రామమోహన్ రాయ్'

ఏదేశీయులనైన నాచారవ్యవహారములుగాని, సామాజికాభిప్రాయములు, నాగరికత, వాఙ్మయము గాని యేస్థితియం దున్నది తెలియగోరుచో ప్రథమమున వారి కథాసాహిత్యముయొక్క స్థితిగతులు గమనించిన చాలును, సర్వము కరతలామలక మగును. ఏజాతి కథాసాహిత్యమును సర్వతోముఖముగ నుపయోగించుకొనునో, యాజాతి శీఘ్రౌన్నత్యమును బొందుననుట ధ్రువము. మానవులకు వారి పూర్వుల యౌన్నత్యమును జ్ఞప్తికి తెచ్చి కర్తవ్యము బోధించుటకును, జీవనరంగమున క్లిష్టసమస్య లెదుర్కొనుచో మార్గము చూపుటకును కథలవలె నుపకరించు వేరొక పరికర ముండబోదు. మనసు నొవ్వకుండ బోధించుట, విసుగుదల గలుగకుండ నుపదేశించుట, మనుష్యులను వారికి తెలియకుండగనే కఠినకర్తవ్యముల ప్రవర్తింపజేయుట కథల ప్రధానోద్దేశ్యములు. ప్రథమమున కథ లీయుద్దేశ్యములకై నిర్మింపబడినను, కాలక్రమమున అవిగూడ నాగరికతతో పాటుగ వృద్ధిజెంది వాఙ్మయమున ప్రధానస్థాన మాక్రమించినవి. సాంఘిక రాజకీయములలో, నైతిక ధార్మికబోధలలో, విజ్ఞానశాస్త్రములలో, కళలలో కథలకు ప్రవేశములేని తావు లేదు. వేయేల, కథాశూన్యమైన వాఙ్మయమునకు విలువయే లేదనిన కథల యాధిక్యము బోధపడును.

## కథల పుట్టుక: ప్రాచీనగాథలు

ప్రాచీనభారతీయు లీకథల యుపయోగమును గమనించి వాని నన్నివిధముల కార్యరూపమునకు దెచ్చి ప్రపంచమున కాదర్శప్రాయులైరి. నేడీప్రపంచమం దతిప్రాచీనములుగా దలపబడుచున్న "ఈసప్ నీతికథలు" మొదలగు కథావాఙ్మయ మంతయు భారతీయుల కథల కనుకరణములే! వారు నిత్యజీవనము మొదలు బ్రహ్మపదార్థము వరకు నన్నివిషయముల కథలనే యుపయోగించి యనంతలాభమును బొందిరి. మానవసమాజమున కేనాడు తన యాంతరికభావముల వ్యక్తీకరించుకొనగలుగు శక్తి గలిగెనో యానాడే కథలుగూడ జన్మించెను. కాని, మానవజాతు లన్నిటిలో నార్యజాతిమాత్రమే యీ యవకాశము నధికముగ నుపయోగించుకొనినది. ఉదాహరణరూపముగ నేమి, స్మరణరూపముగ నేమి మానవసమాజమున కథల యావశ్యకత గలిగినది. బాలురు తమ పూర్వుల మనోరంజకవృత్తాంతములు స్మరించుటలందును, వృద్ధులు తమ విదగ్ధానుభవములు తెలుపుటయందును కథలు జన్మించినవి. ప్రథమమం దవి దంతకథలుగానే వ్యాపించెను గాని, సమాజమందలి కృతిశక్తితో బాటుగ వానితో సంఘర్షణ మొనరించుచు వాఙ్మయరూపము ధరించెను.

ఈ కథాసాహిత్యమున ఋగ్వేదమందలి 'వృత్రాసురవధ' కథ యతిప్రాచీనము.

"వృత్రుడను రాక్షసు డొకడు వెలుతురును, జలమును సముద్రమం దొక చీకటికోణమున బంధించియుంచెను. ఇంద్రుడు తన వజ్రముతో ఘోరాహిరూపు డగు వృత్రుని సంహరించి మానవుల కొఱకు వెలుతురును, నీటిని చెరవిడిపించి యాకాశమం దుంచెను."

—ఋగ్వేదము.

ఇది యార్యుల ప్రథమనివాసమగు ధ్రువమండలమందలి ప్రకృతివైచిత్ర్యముల కాపాదింపబడిన కథారూపము. మన కిపుడు నేత్రానందకరముగ మాత్రమే కనబడుచున్న యీ ప్రకృతిసౌందర్యమున ప్రాచీనార్యు లొక నిగూఢతత్త్వము నూహించిరి. ఎంతకు దరుగని దీర్ఘరాత్రములు, మనోహరమైన యుషస్సు, తరువాత దరిలేని పగళ్లు, ఎండలు, వానలు, ఒకదానివెనుక నొకటిగ క్రమముదప్పక వచ్చుచుండుట చూచి, వీనివెనుక నేదియో యొక మహాశక్తి యుండితీరవలయునని వా రూహించిరి. ఆయూహతో జీవాధారములగు వెలుతురును, నీటిని ప్రసాదించుచున్న యాశక్తికి వారు తమ కృతజ్ఞతను సూచించుచు నారాధన లారంభించిరి. కాని, ప్రజాసామాన్యమున కీపూజ లెవనికొఱకో, యెందులకో బోధపడకుండుటచే గ్రంథకారులు ప్రకృతిచిత్రములకు కథారూపము గల్పించి వానిద్వారా పూజావశ్యకతను బోధించిరి. ఈ కథారూపమున చేయబడిన బోధ యెంతవరకు కార్యకారియో చెప్పుట కార్యులు తమ యాదిమనివాసమును వీడి వేలకొలది సంవత్సరములు గడచిపోయినను, వారు నాటి తమ పూజలను మరువలేకపోయిరనువిషయమే చాలును.

పై కథయే ప్రాపంచిక కథాసాహిత్యమం దతిప్రాచీనము! ధార్మిక కథానకముల కాదిమరూపము!

క్రమక్రమముగ కథానకములలో నభివృద్ధి గలుగసాగెను. 'ప్రకృతి పూజ' బోధించుటకు గ్రంథరూపము గైకొనిన కథలు నూతనమార్గములు ద్రొక్కెను. ఆర్యులు ప్రతివిషయమును బోధించుటకు, వివరించుటకుగూడ కథలనే యాశ్రయించిరి. ధర్మబోధనములం దవి యగ్రస్థానము వహించినవి. తత్త్వోపదేశములం దవి యాచార్యపీఠము నలంకరించెను. ఉపనిషత్తులు, బ్రాహ్మణములు లోనగువానిలో గల జాబాలి, నాచికేతు మొదలగు ఉపాఖ్యానము లీవిధమైనవే. ఆనాడు వారు కథలను విడచి పొడిపొడిమాటలతోడనే ధర్మములు బోధించియున్న నేడు హిందువులలో ధర్మ తత్త్వజ్ఞానములు స్వాభావికధర్మములుగా పరిణమించియుండక పోవును. అతిక్లిష్టములైన ధార్మికవిషయముల సుస్పష్టములు చేయుటలోను, ప్రజాసామాన్యము నకు మనసునకు దట్టునట్లు బోధించుటలోను కథలవలె నితరమైన వేవియు నుపకరించియుండవు.

## కథారచన: మధ్యయుగము

క్రమముగ కథారచనమునగూడ నూతనమార్గము లవలంబింపబడెను. కవులు తమ యభిప్రాయములను, స్వభావములను అతిమానవ సృష్టికి దవిలించి తమ్ము మాటుపరచుకొనసాగిరి. ఈవిధములైన గాథలలో మనకు తెలియవచ్చునంతవరకు 'జాబాలీ సత్యకాముని కథ' ప్రథమము.

"జబలాపుత్రుడగు సత్యకాము డొకనాడు 'హారిద్రుమతు' డను ఋషివద్దకు బోయి బ్రహ్మచర్యాశ్రమ మొసంగ బ్రార్థించెను. గౌతముడు (హారిద్రుమతుడు) సత్యకాముని కులగోత్రములు తెలియగోరెను. సత్యకాముడు తన గోత్రము తన తల్లికిగూడ తెలియదనియు, ఆమె తన యౌవనకాలమం దనేకస్థలముల బనిచేయుచు దన్ను గనెనని చెప్పెననియు తెలిపెను. గౌతము డాతని సత్యసంధతకు మెచ్చి బ్రాహ్మణేతరుడైయిన నిట్లు చెప్పడని నిశ్చయించుకొని యాతని కుపనయన మొనరించెను. తరువాత హారిద్రుమతుడు నాలుగు వందల గోవుల నాతనిపర మొనరించి యామందను వేయి యగునంతదనుక మేపి, వెనుక తన్ను చేర నాజ్ఞాపించెను. ఆత డా యాలమందను వేయి యగునంతవర కనేకవత్సరములు మేపి గురువువద్దకు బయలుదేరెను. మార్గమం దాతని కొక యెద్దు, హంస, నీటిపక్షియు బ్రహ్మోపదేశ మొనరించెను."

—ఛాందోగ్యోపనిషత్తు.

మానవులు తమ స్వభావములను, ఊహలను అతిమానవసృష్టికి గల్పించిన కథలలో నిదియే మొదటిది. దీనితో కథాసాహిత్యమున ద్వితీయాశక మారంభమయ్యెనని చెప్పవచ్చును. ఇట్టికథలు ప్రథమమున కర్తల వినయశీలము రక్షించుటకే యుద్దేశింపబడినను కాలక్రమమున నివి మానవాతిమానవసృష్టుల సంబంధము దృఢపరచుట కుపయోగించెను. అతిమానవసృష్టియందుగూడ మానవులలోగల తెలివితేటలు, యుక్తిచాతుర్యములు, జ్ఞానము గలవని ప్రజల కివి తెలియపరచెను.

ఈమాదిరికథలను బౌద్ధులు, జైనులు తమ మతప్రచారములం దధికాధికముగ నుపయోగించుకొనిరి. బౌద్ధుల, 'జాతకకథలు' జైనుల 'నందీసూత్రములు' నిట్టికథలతో నిండియున్నవి. ఈకథలు వారి మతకర్తల మాహాత్మ్యముల నెల్లడించుటకు, మానవమానవేతరజాతుల సంబంధము దృఢపరచి వారి ప్రధానసిద్ధాంతమగు నహింసాధర్మమును విశ్వజనీన మొనర్చుటకు నధికముగ నుపయోగించినవి.

కాలక్రమమున కథాపాత్రములలో తీవ్రమగు పరివర్తన గలిగిపోయెను. జంతువులు పాత్రలుగా గల కథలు ప్రథమమున నేయుద్దేశములపై జన్మించినను క్రమముగ వాని యనుపపత్తి యధికము గా జొచ్చెను. పశువులు, పక్షులు - భూతములు, పిశాచములు - శరీరాంగములు, చేతనములు, అచేతనములు - పాత్రములై కథలను నిర్వహింపసాగెను. ప్రజ లెల్ల రీవిధములగు కథలలో స్వాభావికత్వముపైననే ప్రాముఖ్య మించిరి.

మానవామానవపాత్రలతో నీకథలు చాలకాలమువరకు వినోదార్థముగ దంతకథలుగానే యుండెనని మహాభారతమువలన తెలియవచ్చుచున్నది. ఆదినములలో వీనికి సాహిత్యమం దెట్టి స్థానము లభించియుండలేదు. కాని యేనాడివి దేశికత్వము వహించి నీతిధర్మార్థశాస్త్రాదులతో సంబంధము గలిగించుకొనియెనో నాటినుండి వీనికి సాహిత్యమున స్థానము లభించెను. 'పంచతంత్రము', 'హితోపదేశము' మున్నగు గ్రంథము లిట్టికథల సంగ్రహములే.

తరువాత దార్శనికులు న్యాయ, సాంఖ్య, వేదాంత సిద్ధాంతములు ప్రజలకు సుబోధము లొనరింప నీకథలనే యుపయోగింపసాగిరి. ఈవిషయమున తత్త్వవేత్తలు వా రూహించినదానికన్న అధికముగ నుపకృతినే బొందిరని చెప్పవచ్చును. చదువుట కాసక్తి గల్పింపని నీరసవిషయములందుగూడ కథ లాసక్తి గల్పించెను. కథలచే నిర్జీవపదార్థములకు జీవము గలిగెను.

ఖగోళ, భూగోళ, గణితశాస్త్రజ్ఞులుగూడ కథల యావశ్యకతను గుర్తించి తమ బోధనలలో వీనినిగూడ చొప్పించిరి. వీనిలో గణితశాస్త్రము కథలను విస్తార ముపయోగించుకొని సర్వతోముఖవ్యాప్తి గాంచెను.

ఈవిధముగనే శాస్త్రజ్ఞులు సాంఘిక, సామాజిక, నైతిక, రాజనైతికజీవనములలోని లోటుపాట్లు విమర్శించి బోధించుటకు కథలనే యుపయోగింప సాగిరి. వీనివలన సమాజముయొక్క మూలము దృఢతరమై, జాతీయత ప్రజల హృదయములలో నాటు

కొనియెను. యుక్తిప్రయుక్తులు, సమయోచితబుద్ధి, చాతుర్యము, విమర్శనాశక్తి ప్రజలలో వృద్ధిబొందెను.

ఈసమయముననే కథారచన నూతనపథముల ద్రొక్కెను. ఎవ్వడో యొకవ్యక్తిని కేంద్రముగ గైకొని ప్రజలలో వ్యాపించియున్న దంతకథల నెల్ల నాతని కంటగట్టు ప్రయత్నములు మొదట జరుపబడిన దీకాలముననే. మహాభారత మీప్రయత్నములయొక్క ప్రథమఫలితము. దానియం దుపాఖ్యానముల మూలమున రాజకీయ, నైతిక, ధార్మికోపదేశములు హృదయంగమములుగా రచింపబడియున్నవి. ఆదినములలోనే నాటికి ప్రజాలోకమున ప్రచలితములైయున్న దంతకథ లన్నియు ప్రోవుచేయబడి నాటి యాచారవ్యవహారములు, వైజ్ఞానికసంపద మన కిపుడు తెలియుట కాధారము లయ్యెను. పురాణము లన్నియు నీవిధములైన కథాసంగ్రహము లే.

వీనివెనుక గుణాఢ్యపండితుని బృహత్కథ జ్ఞప్తికి వచ్చుచున్నది. దౌర్భాగ్యవశమున అది లభించుటలేదు గాని, యందలి విషయములను సోమదేవసూరి యొక్క 'కథాసరిత్సాగరము', క్షేమేంద్రకవియొక్క 'బృహత్కథామంజరి' యను గ్రంథములనుండి యూహింపవచ్చును. ఇందలి వన్నియు మనోవినోదమునకై యుద్దేశింపబడి ప్రజలలో వ్యాపించియున్న కథలే. వీనియందు ధర్మప్రచారముకన్న మనోరంజనమునకే ప్రాధాన్య మీయబడినది.

## కథారచన : అంతిమయుగము

'బృహత్కథ' రచింపబడినకాలమునాటికే యార్యుల కథాసారస్వతమున మధ్యయుగ మంతమొంది తృతీయయుగ మారంభమయ్యెనని చెప్పవచ్చును. కాలక్రమమున ప్రజల యభిప్రాయములతో పాటు కథాసంవిధానముగూడ మారుమార్గములు ద్రొక్కసాగెను. అంతవరకు దేశము, ధర్మము, సంఘము, నీతి—వీనికొఱకు స్వార్థము త్యజించి యేకాగ్రముగ పాటుపడిన సమాజమున ప్రత్యేక జాతివ్యక్తిలాభములు గమనింపబడసాగెను. దాని ననుసరించి ధర్మముకొఱకై సాహసమును బోధించిన కథలుగూడ మార్పుజెంది స్వార్థమును, లౌకికోన్నతిని ప్రోత్సహింపసాగెను. యాత్రలు, సాహసకార్యములు, ఆశ్చర్యకరములగు నద్భుతక్రియాకలాపములు, స్వార్థనిర్వహణమునకై యొనరించు కూటచాతుర్యములు నీకథలలో నిండియున్నవి. మోసము, వంచన, నిర్భీకత్వము, సాహసము, ఏవిధముగనైన స్వకార్యముల నిర్వహించుకొనుట—ఈ మొదలగువానిని ప్రోత్సహించుట వీని ప్రధానోద్దేశ్యము. ఇవి యించుమించుగ నేటికాలమం దాంగ్లభాషలో ప్రచలితములై యున్న సాహసిక (Adventurous) కథలను బోలి వాని ప్రథమరూపములుగా గనబడుచున్నవి. వీని జన్మమును మనము 'బృహత్కథ' రచింపబడు కాలమునం దూహింపవచ్చును. కథాసరిత్సాగరమందలి (బృహత్కథ లభ్యముగాకుండుటచే మనము దీనినే యాధారముగ తీసికొనవలయును) 'వత్సరాజకథ' యీవిధములగు కథల కాదిమరూపము.

"వత్సరాజు కౌశాంబీనగరాధిపతి, విద్వాంసుడు, సుందరుడు. ఆతడు తాను వరింపదగిన కన్య యుజ్జయినీనగరాధిపతియగు చండమహాసేనుని పుత్రి వాసవదత్తయే యని నిశ్చయించుకొని యామెను బెండ్లాడ దలచెను. కాని తానుగా కన్యను వాంఛించుటవమానమని యాతడు శంకించి తన యుద్దేశమును తనలోనే యణచిపెట్టెను.

"ఉజ్జయినీపతియగు చండమహాసేనుడుగూడ తన కల్లుడు గాదగినవాడు వత్సరాజొక్కడేయని నిశ్చయించుకొనియు, తమ యుభయవంశములమధ్య చిరకాలమునుండి జ్వలించుచున్న శత్రుత్వమును దలపోసి, తానుగా బోయి కన్య నిచ్చుట యవమానమని తలచెను. కాని యాతడు వత్సరాజు నల్లునిగా చేసికొను ప్రయత్నమును వీడలేదు.

"వత్సరాజునకు వేటయందు తమకము మెండు. ఒకప్పు డాతడు కొలదిపరివారముతో వేటకు బోవ మహాసేను డాతని మోసబుచ్చి చెరగొని తీసుకొనిపోయి, తన పుత్రికయగు వాసవదత్తకు సంగీతము నేర్ప నాతని నియమించెను.

"వత్సరాజు బందియైన వార్త విని యాతని మంత్రి యౌగంధరాయణుడు పిచ్చివాని వేషమున ఉజ్జయిని చేరి, మహాసేనుని గుట్టుమట్లెల్ల దెలిసికొని, యొకనా డుత్సవములలో మునిగి పట్టణ మెల్ల ప్రమత్తమైయున్న సమయమున కావలివారల వంచించి, వత్సరాజును వాసవదత్తతోగూడ కోటదాటించి కౌశాంబి చేర్చెను. తన నగరముచేరి వత్సరాజు వాసవదత్తను పట్టపురాణి నొనర్చెను."

—కథాసరిత్సాగరము.

బృహత్కథారచనానంతరము సంస్కృతభాషాసాహిత్య మీమాదిరికథలతోనే నిండియున్నది.

క్రమముగ నీకథలు మార్పులు బొందుచు 'దశకుమారచరిత్ర' రచించుకాలమునాటికి ప్రౌఢత్వము చెందిపోయెను. ఇదియే సంస్కృతభాషలోని కథాసాహిత్యమున కంతిమదివసము. దశకుమారచరిత్ర రచింపబడినతరువాత సంస్కృతభాషలో స్వతంత్రకథారచనము జరుగనేలేదు. ఈకథారచనతోబాటు సంస్కృతవాఙ్మయాభివృద్ధిగూడ నిలిచిపోయెననియే చెప్పవచ్చును. ఇదియే భారతజాతుల యౌన్నత్యప్రతిభల కంతిమకాల మగుటగూడ విచిత్రము.

## ఆంధ్రభాష : కథలు

సరిగ నీదినములలోనే యాంధ్రభాష ప్రథమపర్యాయము పుస్తకరూపము ధరించెను. నన్నెచోడుడు, నన్నయ, తిక్కన మొద

లగు కవివరేణ్యులు తమ మృదుమధురపదజాలముల నాంధ్రవాఙ్మయము నలంకరించి, యాంధ్రభాషను ప్రాపంచికభాషలలో కెల్ల నతిసుందర మనిపించిరి. కాని యేకారణముననో యాంధ్రకవు లెల్లరు తమ దృష్టిని సంస్కృతగ్రంథముల నాంధ్రీకరించుటలోనే కేంద్రీకరింపజేసిరి. వారు స్వతంత్రరచనలపై మన సుంపనే లేదు. ‘Italian of the East’ అని పేరొందిన యాంధ్రభాషలో అర్ధశతాబ్దము వెనుక నొకటిరెంటికన్న స్వతంత్రగ్రంథములు లేనే లేవు. అంతవరకు రచింపబడిన గ్రంథములైన సామాన్యప్రజల కర్థముగాని బంధకవిత్వములో, గర్భనిర్భేద్యమగు శైలిలో, దురవగాహమైన శృంగారముతో నిండి ప్రజల కుపయోగకారు లగుటకు బదులు వారిలోని యుత్సాహశక్తి నణచివైచినవి. ప్రజావిజ్ఞానమునకు దోడుపడుటకు బదులు కథలొక్కటే విధముగ భార్యాభర్తల సంయోగవియోగములను వర్ణించుటతోడనే తృప్తిజెంది, చివరకు కథయన ‘స్త్రీపురుషసంభోగవర్ణన’ యను నర్థమునకు వచ్చెను. ఈకారణముననే ప్రజలలో ఏవిధమగు విజ్ఞానముగాని, విద్యాభిలాషగాని గలుగక ఆంధ్రజాతి, భాష, సాహిత్యము లెదుగుబొదుగులు లేక పుట్టినపు డెట్లో యట్లే యుండిపోయినవి.

కాని, ఇరువదవ శతాబ్దము నంతమున వీరేశలింగంపంతులుగా రాంధ్రభాషకు గల యీలోపమును గుర్తించి దానిని పూడ్చ శక్తిగొలది ఆంధ్రకథా సాహిత్యమునకు బునాదులు వైచిరి. ఆయన నైతిక, ధార్మికవిషయములు బోధించుటకు, సాంఘికాచారముల యుక్తాయుక్తముల విమర్శించుటకుగూడ కథలనే యుపయోగించి యాంధ్రజాతిలో చైతన్యము గలిగించిరి.

వీరి తరువాత ఆంధ్రభాషలో కథారచనమునకై పాటుపడినవారిలో మధిర సుబ్బన్నదీక్షితులు, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగార్లు ముఖ్యులు.

దీక్షితులుగారి ‘కాశీమజిలీ’ కథలు కేవలము మనోరంజనమే ప్రధానోద్దేశ్యముగా నిర్మింపబడి తమ యుద్దేశ్యమును సంపూర్ణముగా నిర్వహించుకొనినవి. నమ్మ నర్హములు గాకపోయినను, చిత్రవిచిత్రసంఘటనలతో హృదయరంజకములైన యాకథ లాంధ్రులలో పుస్తకపఠనాభిలాష కల్పించెనని చెప్పక తప్పదు. దీక్షితులుగారు తమ కథలలో పూర్వుల మార్గములనే యవలంబించి స్త్రీపురుషుల సంయోగవియోగములనే వర్ణించుటకు ప్రాధాన్య మిచ్చిరి. మానవుల మానసికప్రవృత్తులు, స్వభావవైచిత్ర్యములు, నైతికపతనాభివృద్ధులను వర్ణించి, మానవుల నైతికజీవనమునకు, దేశాభివృద్ధికి తోడుపడవలసిన కథలు కేవలము సంభోగవర్ణనములకే యుపయోగింపబడుట విచారకరము.

లక్ష్మీనరసింహంపంతులుగారు కథారచనమున కేవలము స్వాతంత్ర్యము గైకొనిరి. సమయోచితమైన హాస్యముతో, మృదుమధురమగు శైలిలో వారి కథ లాంధ్రవాఙ్మయమునకు నూతనాలంకారములు సమకూర్చెను. అవి యాంధ్రుల హృదయమున నూతనభావములు రేకొలిపి వారి పురోభివృద్ధికి తోడుపడెను. వీరేశలింగంపంతులుగారు నిర్మించిన పునాదులకు లక్ష్మీనరసింహంపంతులుగారు సుధాలేపన మిచ్చిరి. వీరితో ఆంధ్రులలో కథారచనాభిలాష కొంతవరకు వృద్ధిజెందెను. తత్ఫలితముగ పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణగార్ల వంటి యొకరిద్దరు కథాలేఖకులు బయలుదేరి తమ అమృతమగురియు లేఖినులచే నాంధ్రభాష కుజ్జీవనశక్తి నిచ్చుచున్నారు. కాని, యాంధ్రభాషకుగల యీ లోప మొకరిద్దరు గ్రంథకర్తలచే దీరునది కాదు. ఇంతవర కితరభాషాగ్రంథముల నాంధ్రభాషలోనికి దిగుమతిచేయుచున్న యాంధ్రరచయితలెల్లరు తమ మాతృభాషకు గల స్వతంత్రగ్రంథలోపమును దీర్ప బద్ధకంకణులు గావలసినదే.

గతార్ధశతాబ్దినుండి యాంధ్రభాషలో పదులకొలది మాసికపత్రికలు జన్మించినవి. వానిలో నేయొకటిరెండో లోపమును దీర్ప కొలదిగానైన ప్రయత్నించినవో గాని తక్కిన వెల్ల వ్యర్థకలహములలో చిక్కుకొని, పరస్పరదూషణమునే పరమార్థముగా చేసికొనియెను. ‘ఆనందభారతి’ వంటి యొకటిరెండు పత్రికలు కథాప్రచురణమునకే దొరకొనినను ఏకారణముననో యవి పైకి రాలేకున్నవి. కథాప్రచురణమునకే ప్రత్యేకముగ బనిసేయకున్నను ఆ లోపమును దీర్ప ప్రయత్నించుచున్న మాసపత్రికలలో ‘భారతి’ ప్రసిద్ధము. ‘భారతి’ యాంధ్రభాషలో ఉత్తమకథాలేఖకుల దయారుచేసి కథాసాహిత్యమును పోషింప శక్తికొలది ప్రయత్నించుచున్నను, ఆప్రయత్నము లేలనో సంపూర్ణఫలితము నూపలేకున్నవి. దీనికి ‘భారతి’ పత్రికయొక్క ప్రయత్నలోపమునుగాని, యాంధ్రుల యసమర్థతనుగాని కారణముగా చెప్పజాలము. చిరకాలమునుండి యాంధ్రహృదయముల బాదుకొనిపోయిన పరతంత్రత (ఆంధ్రు లెప్పుడు ఇతరజాతుల ననుకరించుటకు, ననువదించుటకే ప్రయత్నించుచున్నారు.), విద్వల్లోకమున కథాసాహిత్యముపై గల యసూయయు గారణము. ఇకనైన రచయితలు కథలపై యీసువీడి వాని యుపయోగములు గ్రహించి, స్వతంత్రభావములతో నూతనరచనలు సాగించి ఆంధ్రజాతి, భాషా, సాహిత్యముల పురోభివృద్ధికి మార్గదర్శకు లగుదురుగాక!

# కోటికెలపూఁడి సోమనాథకవి

కోణిదెన బాలకృష్ణయ్యగారు

విస్మృతకవిసమాజమునకుఁ జేరినవారిలో సోమనాథుఁ డొక్కఁడై యున్నాఁడు. ఈతని చరిత్రము కీ. శే. వీరేశలింగముపంతులుగారి కవులచరిత్రమున కెక్కియుండ లేదు. కీ. శే. గుంటుపల్లి సోమయ్యగారు దమచేఁ బ్రకటింపఁబడిన "ప్రబంధకల్పవల్లరి"యను మాసపత్రికయం దీతని కృతి నొకదానినిఁ బ్రకటించుదనుక నీతని వృత్త మాంధ్రలోక మెఱుంగదు. సమగ్రమగు నాంధ్రకవుల చరిత్రమును రచింపఁదలంచువారి కిది యుపకరించునను తలంపున సోమనాథకవివిషయము నిట వివరించుచున్నాను.

సోమనాథుఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; ఆత్రేయసగోత్రుఁడు; సోమయామాత్య పౌత్రుఁడు; కోటీశ్వరభట్టారకపుత్రుఁడు. ఇతనికి "శారదాభరణాంక"యను బిరుద మున్నట్లు ఏతత్కవివిరచితమగు విష్ణుమిత్రోపాఖ్యానపు గద్యమునందలి "నిఖిలవిద్యానిరాతంక, శారదాభరణాంక, సకలవిద్వజ్జనవిధేయ" యను వాక్యమువల్లఁ దెల్లమగుచున్నది. నిజముగ నితఁడట్టి విద్వత్కవిసార్వభౌముఁడని యాతని గ్రంథము వేమొగంబులఁ జాట సమర్థంబై యొప్పుచున్నయది. ఈతని యింటిపేరు నివాసగ్రామనామము ననుసరించి 'కోటికెలపూఁడి' యని పెట్టికొనఁబడియుండును. ఇది యాంధ్ర దేశజుల సంప్రదాయమునకు వ్యతిరేకము గాదు. కోటికెలపూఁడి యను గ్రామ మొకటి గుంటూరుమండలమునందలి ఒంగోలుతాలూకాలోను, మఱియొకటి కృష్ణామండలమునందలి నందిగామ తాలూకాలోను నున్నవి. ఈరెంట నెయ్యది సోమనాథుని నివాసగ్రామముగ నుండెనో తెలిసికొన నాధారము గానరాదు. ఇమ్మహాకవి విష్ణుమిత్రోపాఖ్యాన మను ప్రౌఢకావ్యము నొకదానిని రచియించియున్నాఁడు.

ఈయుత్తమకావ్యమునకుఁ గాటుపల్లి (గుంటుపల్లి) తిప్పమంత్రి కృతినాయకుఁడై యంకితము గొనియున్నాఁడు. తన కీగ్రంథము నంకిత మొనర్పఁ దిప్పన ప్రార్థించిన విషయము నీక్రింది పద్యములవలనఁ గవి తనగ్రంథమునఁ దెలుపుడు చేసియున్నాఁడు:—

మ. "సరసాగ్రేసర కోటనార్యుని తనూజా! సోమవిద్వత్పురం
దర నీచాటువచోవిజృంభణము లుద్ఘాటించు నర్థేందుశే
ఖరకోటీరకుటీరకోటరలుఠద్గంగోర్మిధారా శివం
కర ఘుంఘుంఘుమ చక్రచంక్రమచమత్కారప్రగల్భార్భటిన్.

చ. కోటికెలపూడి సోమవిభు కోటయసోమ! సరస్వతీశిరః
కటక కిరీటరత్న ఘటికామహనీయ ధగద్ధగ ప్రభా
పటలతిరస్క్రియాధిగత పాటవము ల్భవదీయవాక్యము
ల్కుటిలవిరోధిమోధ కవిలోకకశోరవనీకుఠారముల్.

క. కావున నీ విత్తెఱఁగున
గావింప నుపక్రమించు కావ్యము నాకున్
గావింపు మంకితముగా
ప్రావీణ్యము మెఱసి కవిసుపర్వవరేణ్యా!"

సోమనాథుని కవితాప్రాగల్భ్యమున కీపద్యములును నిదర్శనములు.

## కాలము

సోమనాథుని కాలమును దెలిసికొనవలెనన్నచో విష్ణుమిత్రోపాఖ్యానకృతిభర్తయగు గుంటుపల్లి తిప్పనా

మాత్యుని చరిత్రమును పరిశీలించినఁగాని తెలియఁబడదు. కావునఁ దిప్పమంత్రినిగుఱించి యించుక విమర్శింతము. ఈతిప్పమంత్రి యింటిపేరు తొలుతఁ "గాటేపల్లి" యని యుండి కాలక్రమమున నది "గుంటుపల్లి"గా మాఱినది. వీరు నందవరవంశజులు. గుంటూరుమండలమునం దీగుంటుపల్లివారు సుప్రసిద్ధులై, విద్యావితరణాదిసుగుణవిరాజమానులై కీర్తి నార్జించియున్నారు. వారిలో వినుకొండదండనాథపదవి నలంకరించి యాసీమను పరిపాలించిన ముత్తమంత్రియు, నాంధ్రదేశమున నాబాలగోపాలమునకు విప్రవినోదులచే జ్ఞప్తికిఁ దేఁబడుచున్న గుంటుపల్లి భాస్కరుఁడను విద్యల భాస్కరుఁడును పేరెన్నికఁగన్నవారు. తిప్పన తండ్రితాత లందఱును నాకాలమున గుంటుపల్లి నగ్రహారముగాఁ బరిపాలనసేయుచుండిరి. ఈగుంటుపల్లి వినుకొండకుఁ బూర్వదిగ్భాగంబున నున్నది. క్రమముగా వీరికి ముత్తమంత్రికాలమున వినుకొండపరగణాకు దండనాథపదవి లభించినది. క్రీ. శ. పదునాఱవ శతాబ్దమున మల్కిభరాముఫాదుషా గోలకొండఁ బాలించుచుండెను. ఈ మల్కిభరామునిఁ బొన్నిగంటి తెలగనార్యుఁ డీక్రిందిపద్యమున వర్ణించియున్నాఁడు:—

సీ. "తెలివిసింగంపు గద్దియల రాతెఱగంటి
దొర లెల్ల మోగ్పఁ జేతులనె కొల్వఁ
బూని యేఁబదియాఱు మానిసినెలవుల
పుడమిఱేం డ్లాశీగంబులకుఁ జొరఁగ
శివి మున్నిటిలోఁ దీవు లన్నియు నేలు
మన్నీలు మెట్టుఁదామరల కెరఁగఁ
దన తేజ సుడిగట్టు వెనుకచీఁకటి నెల్ల
విరియించు తమ్ముల విందుగాఁగ
గీ. వెలయు మలికిభరాముని గొలిచి..." (యయాతిచరిత్రము)

ఈ యిబ్రహీముఫాదుశాహి క్రీ. శ. ౧౫౫౦—౧౫౮౧ వఱకు రాజ్యము సేసియున్నాఁడు (ఆం. క. చ. ద్వి. భా. పుట ౨౫౬). ఈతనికి సామంతుఁడై వినుకొండ పరగణాను పాలించుచున్న రామలింగభాస్కరుఁ డను నాతఁడు పైఁబేర్కొనఁబడిన ముత్తమంత్రిని దత్తుఁడుగ స్వీకరించెను. క్రీ. శ. ౧౫౭౮—౧౫౮౯ (శా. శ. ౧౫౦౦—౧౫౧౧) వఱకుఁ బరిపాలనకార్యమునందు ముత్తన తన దత్తుతండ్రికి సాయపడుచుండెను. (చూ. గుంటుపల్లి ముత్తమంత్రిచరిత్రము.) దీనినిఁబట్టి యాకాలమునకు ముత్తమంత్రి దాదాపు ఇరువదేండ్లప్రాయము గలవాఁడని యూహింప నవకాశము గలదు. ఈముత్తనపై ననేకులగు కవులు రచించిన చాటువులు గలవు. వానిలో నొకటిరెంటిమాత్ర మీక్రింద నుదాహరించుచున్నాను:—

మ. "శతమన్యుం డమరావ తేలఁగ సురల్పత్రాల పాలైరి, సం
గతి బాతాళము శేషుఁ డేలఁగ ఫణుల్గావే వటించేది, యీ
క్షితి నీ వేలఁగ వీరముత్త! మనుజు ల్శ్రీగంధము ల్పువ్వులం
చితరాజాన్నములు న్దుకూలచయము ల్గైకొందు రెల్లప్పుడున్."

శా. "నావిద్వత్కవితా విశృంఖలవచో నైపుణ్యభాగాశ్రధా
రావష్టంభ విజృంభణంబునకు నౌరా! వీరముత్తప్రధా
నావిర్భూతవితీర్ణి గల్గవలె, లేదా యన్యుల న్వేఁడనా?
ఛీ వాచార్భటి! ఛీ కవిత్వము! ఛి ఛీ ఛీ యర్థకాంక్షారతుల్!"

ఉ. "అంగకళింగవంగమగధాదుల నెవ్వని వ్రాఁతకమ్మ తీ
వెం గనుపట్టు గుంటుపలి వీరయముత్తని వ్రాలుజూచి తా
రెంగిలిముచ్చు మంత్రు లిఁక నేటికి సిగ్గు మొగానఁ జేర్పగో
బంగరువంటి యాకులను బల్మరు గోకుదు రాత్మనామముల్."

ఈ వదాన్యశిరోమణి మహావీరుఁడు, దాశార్హచరిత్రమను కృతికి నాయకుఁడు, దాతయు నై కవుల పొగడ్తల నజరామరంబగు యశశ్శరీరముచే నాంధ్రలోకమునఁ బ్రకాశించుచున్నాఁడు.

విష్ణుమిత్రోపాఖ్యానకృతిపతి తిప్పన కీముత్తన అన్న కుమారుఁడు. తిప్పమంత్రియన్న యగు పెదవీరంరాజునకుఁ గల నల్గురుపుత్రులలో ముత్తన మూఁడవవాఁడు. క్రీ. శ. ౧౫౭౮—వ సంవత్సరము నాఁటికి ముత్తన కిరువదేండ్ల ప్రాయము గలిగియుండునని పైన సూచించిన దానినిఁ బట్టి, జనకస్థానమున నీతనికిఁ గల యిరువురన్నల యొక్కయు, నీతని తండ్రి, పినతండ్రి (తిప్పమంత్రి) యొక్కయు వయఃపరిమితిని ఒకొక్కరిమధ్య మూఁడేండ్ల వ్యత్యాసముతో లెక్కించి, తండ్రికిఁ గుమారునకు







 1-2. గుంటూరు బై ఇండియన్ లీగు, వారి ప్రచారము; 3. మలబారు బై ఇండియన్ లీగువారి ప్రచారము.





1. గౌతమీ పుష్కరసందర్భమున బై ఇండియన్ లీగువా రేర్పాటుచేసిన అఖిలభారతదేశీయ వస్తుప్రదర్శనము;
2. మధుర ఆల్ ఇండియా బై ఇండియన్ లీగు ఎగ్జిబిషనులో పాల్గొన్న ఆంధ్రదేశ విక్రేతృసంఘము.

నడుమ నిరువదేండ్ల కాల ముండునని నిశ్చయించినచోఁ బెదవీరంరాజుతమ్ముఁ డగు తిప్పామాత్యుఁడు క్రీ. శ. ౧౫౩౫ వ సంవత్సరప్రాంతమున నున్నాఁడనిస్పష్టమగు చున్నది. కావున విష్ణుమిత్రోపాఖ్యానకృతికర్తయగు సోమనాథుఁడును క్రీ. శ. ౧౫౩౫-వ సంవత్సరప్రాంత మున నున్నాఁడని నిశ్చయింపనగును. ఒక వేళఁ బైఁ జెప్పఁబడిన కాలనిర్ణయము సరియైనది కాదని తలంచి నను విష్ణుమిత్రోపాఖ్యానము ౧౫౩౧-వ సంవత్సరము నకుఁ బిమ్మట, ననఁగా మనుచరిత్రమున కించుక తరువా తను, వసుచరిత్రమునకుఁ బూర్వమునను రచింపఁబడె ననునది నిర్వివాదాంశము.

సోమనాథుఁడు గీర్వాణకవుల నుతించి, పిదపఁ గవి త్రయమును, నాచనసోముని, దన తండ్రియగు కోట సచి వుని మాత్రము స్తవ మొనర్చియున్నాఁడు, చూడుఁడు:—

గీ. "సాహితీధుర్యు నన్నపాచార్యవర్యు
నుభయకవిమిత్రు సుమనఃపయోజమిత్రు
శబ్దగుంభాధికోల్లాసు శంభుదాసు
సుకవికువలయగణసోము సోముఁ దలఁతు.

క. ప్రతిభట విద్వత్కవిసం
హతికరటి ఘటామృగేంద్రు నస్మద్గురు నూ
ర్జితనిర్జిత ఫణిపతి గీ
ష్పతి కొటికలపూఁడి కోటసచివునిఁ దలఁతుఁ."

సోమనాథుని తండ్రి కోట సచివుఁడును గొప్పపండి తుఁడనియుఁ, గుకవికుంజరఘటాపంచాననుఁడనియు దీనిని బట్టి విశదమగుచున్నది.

## గ్రంథరచనము

విష్ణుమిత్రోపాఖ్యాన మైదాశ్వాసములుగల ప్రౌఢ కావ్యము. ఇందలి యితివృత్త మొక పురాణగాథకు సంబంధించినది. ఇందుఁ గథాభాగమున కెక్కువ ప్రాధా న్యము నిచ్చి సముచితవర్ణనాసమంచితముగ సోమనా థుఁడు రచించియున్నాఁడు. రచనాపద్ధతి చాలదనుక మనుచరిత్రమునకుఁ బూర్వమునఁ గల శ్రీనాథ పినవీర నాదుల ఫక్కి ననుసరించియున్నది. ఇతని కవనధాటి నిజ ముగ "నిందుశేఖరకోటీరకుటీర కోటర లుఠద్గంగోర్మిధారా ప్రగల్భాగ్భటి"కిఁ దీసిపోని రీతిని మిగులఁ బ్రౌఢమైయున్నది. శైలి కఠినమని వేఱుగఁ జెప్పఁబనియుండదు. కావ్యమం తయు నారభటీవృత్తి ప్రాముఖ్యము వహించియున్నది. గ్రంథమంతయుఁ జాలదనుక సంస్కృతపదబంధురమై పెద్దనార్యుని మృదంగనిస్వనసాదృశ్యమును దలఁపిం జేయుచున్నది. ఇందు నుపమాదిప్రశస్తాలంకారములు జిత్రింపఁబడియున్నవి. సోమనాథుని రచనాకౌశలము నెఱిఁగింపఁగల కొన్ని పద్యముల నాతని విష్ణుమిత్రోపా ఖ్యానమునుండి యిట నుదాహరించి దీనిని ముగించు చున్నాను:—

శా. "ధరణీశాగ్రణి తారకాతరళముక్తారత్న చిత్రాతప
త్రరుచివ్రాతము దిగ్దరీవలనసూర్యంపశ్య గాఢాంధ సు
స్మరమై పర్వశశాంకమండల సహస్ర శ్రీసముల్లాస త
స్కరమై పర్వఁగ నొప్పె సర్వజన దృగ్వ్యాపారపర్వంబుగన్.

సీ. సమరట్టఘోట్టాణ సంఘట్టిత క్రోడ
ఖురపుటీ పక్ష సంక్షుభిత మగుచు
పృథివీధరస్పర్ధి పృథురథప్రథిత ప్ర
దారాభిఘాత మేదస్వి యగుచు
పటుతరోద్భట వీరభట చక్రవాళ ని
ష్ఠురపదాస్ఫోటనస్ఫురిత మగుచు
గాఢకంధరసదృక్షుస్కంధగంధ సిం
ధురకర్ణ తాళవర్తులిత మగుచుఁ

గీ. దరుణదాశరకంఠకందళకడార
మేదురాకార రణరంగ మేదినీ ప
రాగనికురుంబకం బంబరమున కెగసి
యరుకుఁ గబళించె రాహుగ్రహంబుఁబోలె. ఆ. ౨

ఉ. చందన శైలవాతకలికక్షతిచే నతిచిత్రచైత్ర సం
క్రందనుఁ డల్కమై నగనగచ్ఛద గుచ్ఛము లుత్తరింప నం
దంద సముద్భవిల్లు రుధిరావళిఁబోలె వనంబులందు నా
నందము సంఘటించె నయనంబులకు న్దరుణప్రవాళముల్. ఆ. ౩

మ. చటులాస్ఫోటతరాట్టహాసలహరీ ఝంపానిరాఘాట ప
ర్యటనాడంబర భిన్నదిక్తటకటాహ క్రోడవాటంబుఁగా

నటనక్రీడ యొనర్చు కాలగళు కంఠస్థూలకాకోలరు
ఘుటికాజాలము బర్వినట్లు నిసుడె ఘోరాంధకారచ్ఛటల్. ఆ. ౪

చ. తన మది విష్ణుమిత్రుఁడు పదంపడి యచ్చెరునంద నందివా
హన, సరసీరుహాసన బలాసురశాసన, పావకేనసం
దన, దనుజాబ్ధినాయక, సదాగతిపై శ్రవణాదిదేవతా
జనసహితంబుగా నసురశత్రుఁ డదృశ్యత నొందె నంతటన్. ”ఆ. ౫

మచ్చునకుఁగా సోమనాథుఁ డాంధ్రశబ్దబాహుళ్యముగ రచించిన సీసపద్యము నొకదాని నీదిగువ నుదాహరించుచున్నాను:—

సీ. “జిగిమీరు నడుగులేఁ జిగురు నిబ్బరఁపు డా
లెరసంజకెంజాయ కెదురు సూప
క్రొక్కారు మెఱుఁగునిగ్గులకు సిగ్గులుగుల్క
మెయితళ్కు లపరంజిమిసిమి జిల్క
నవయవంబుల తావు లచ్చంపు పచ్చక
ప్పూరపు వాసనలకు బిరుదుగట్ట
సొలపుటల్లార్చు చూపుల దువాళములుఁ చూ
పుల వింటిజోగుతూపుల నదల్ప

గీ. వివిధ భూషణ భూషణ భవదగణ్య
పుణ్యలావణ్యరూపనై పుణ్య లగుచు
కౌశికద్వార వేదికాంగణములందు
నిర్జరాంగన లేతెంచి నిలచి రపుడు.”

కాబోయే వకీళ్లకు కొన్ని సూచనలు (నా యూహాప్రపంచమున)



# తెనుఁగు బాస సంప్రతింపు

కవికొండల వేంకటరావుగారు

విద్యాభ్యాసము గానప్పుడు నాకు ముద్దుముద్దుగాఁ బెద్దలు కొన్ని నేర్పియున్నారు. ఏమని?—

"శ్రీకంఠ చాపఖండన............."

"నలదమయంతు లిద్దఱు..........."

"ఓయమ్మ నీకుమారుఁడు............"

మొదలైన వాకకొన్ని నేర్పియున్నారు. ఆనేర్పినది పుస్తకమునుండి కాదు. ముఖథా మాతామహుఁడో, పితామహుఁడో కంఠథా వచ్చేటట్టు తొడపాశము పెట్టి మఱీని :— ఆతరువాత పుస్తకముపట్టి పాఠాలు వల్లించి యుపాధ్యాయులకట్టళ్లఁ బడ్డ యీవెనుకను బోధపడ్డది, తొల్త నేర్చినవి పద్యాలు అని, ఛందోబద్ధములు అని, అచ్చుపొత్తములం గనవచ్చునవని, యీలాగే వ్రాయవలెనని. ఎక్కడ? పాఠశాలలో. అదంతా యవగాహనము చేసికొని యీప్రకారముగఁ గనఁబడిన పొత్తమునల్ల చదివి యర్థము చేసికొని, యర్థము చేసికొనడమే కాకుండ నాప్రకారము పద్యము కట్టడము, గద్యము కట్టడము సయితమలవఱచుకొనియున్నాను. పాఠశాలను విడిచిపెట్టి స్వేచ్ఛగాఁ దిరగడము వచ్చినది కొంతకాలానకు. అప్పుడు భజనలంట, భాగవతములంట, బొమ్మలాటలంట, పొలముపాటలంట—పట్టిన పుస్తకములను విడిచిపెట్టి చూచుట ప్రారంభించినాను. ప్రారంభించి యందలి తత్త్వమేమా యని యూహించుకొనుచు "ఆగేయములు, ఆపదములు, ఆపాటలు అచ్చుపడియున్నట్టయినా" యని యాలోచించుచున్న సమయములో వీథినే "స్త్రీలపాటలు, కామమ్మకత, హరినామసంకీర్తనాలు, గురూపదేశము" అనే కేక వినఁబడినది. వెంటనే ఆ విక్రయదారునిఁ బిలచి వానిచేతిలో నున్న పొత్తముల దొంతి నందిపుచ్చుకొని యొకవరుసగా సంగ్రహించినాను—(౧) పెద్దబొబ్బిలిరాజుకథ, (౨) కామమ్మకత, (౩) ఊర్మిళాదేవి నిద్ర, (౪) ఋషుల యాశ్రమము, (౫) సారంగధరనాటకము, (౬) రామదాసుచరిత్ర, (౭) చిలుకముగ్గుల పాట, (౮) మైరావణ చరిత్ర, (౯) సర్వాయిపాపడి కథ, (౧౦) ధర్మాంగదచరిత్ర.—

వెంటనే వాని నన్నిటం గల పుటలఁ దెనుంగునుం గనుంగొనుచుఁ జదువమొదలిడితిని. నేను జిన్నప్పుడప్పెద్దలముం దొప్పగించిన యప్పద్దెంబుల నచ్చునఁ గన్నప్పుడెంత ముదంబు ముప్పిరిగొన తమకంబున నేర్వఁ దొడంగితినో యిప్పుడిప్పామరుల ముఖథా విన్నపదంబుల నచ్చునం గన్నప్పుడుకూడ నంతగ ముదంబు ముప్పిరిగొన నంత తమకంబున నేర్వఁదొడంగితిని—తొడంగి పాఠశాలలఁ జదివినదెల్ల కల్ల యని గ్రహించి సమస్తమును వాచా వల్లింపఁగడఁగితిని. అమ్మహార్తమున నాముందు భాషార్ణవం బందగించినదై సామాన్యసమతలంబున నున్నదల్ల పర్వదినంబుల నుబికిన ట్లుబికి గద్యంబుఘక్కిని, సాయంసంధ్యానిత్యోత్సాహమునఁ దరంగితం బైన తెఱంగు దరంగితంబైన దగుచు పద్యంబు వడుపునను, వసంతమలయానిలోత్తుంగసంగీతప్రమోదితం బైనపగిది గేయంబుచాయను విడంబించినది. మఱియు

నట్లే యూహార్ణవం బందగించి భావమయ, రసమయ, నాదమయమై ప్రబోధించినది.

గద్యము, పద్యము, గేయము,
భావము, రసము, నాదము.

ఏభాషను జూచిన బాహిరవిభజనంబునఁ బొడకట్టున వమ్ముఁడే—గద్యము, పద్యము, గేయము. ఆంతరంగిక విభజనంబునఁ బొడకట్టున వమ్ముఁడే—భావము, రసము, నాదము.

ఏతద్విభాగంబులపాళ్లెట్లుప్రవహించి మన తెనుంగు బాస వర్ధిల్లినదియు, వర్ధిల్లునదియు దిఙ్మాత్రముగఁ జర్చించి సూచించుటయ యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశ్యము.

బాహిరవిభజనంబున నక్షరశిక్ష గమనింపనగు. ఆంతరంగికవిభజనంబునఁ గవిత్వపు దక్షత గమనింపనగు.

గద్యమున కుదాహరణమ్ము :— "అని స్తుతించిన నగ్ని దేవుం డమ్మహీదేవుదేహంబున సన్నిహితుండగుటయు నమ్మహాభాగుండు గండుమీరి పొముపుగొండ నఖండసంధ్యారాగప్రభామండలాంతర్గతుం డగు పుండరీకవనబంధురుండునుం బోలె—"

పద్యమున కుదాహరణమ్ము :—

'ఇంకిటునిన్ను నమ్మ నను నేమిటికిం గెరలించె దెంతయుం
బొంకము గాని యీవలనిబొంకులుమాచవిగావు రుక్మిణీ
పంకజపత్రనేత్రకును బ్రాణపదంబులుగాని వల్లవీ
కింకర చాలుఁజాలు నడికింపకు నింపకు లేనికూరుముల్.'

గేయమున కుదాహరణమ్ము :—

"యిన్నివయినముల్ వ్రాసివున్నది జాబుకమ్మలోను
ఆమాటల కేమన్నాడండి వెంగళరాయుడు
కలకల కలకల కల నవ్వి వెంగళరాయుడు
రాజుగారి వోపౌరుష మైనా యింతే నన్నాడు
తన్ను పిలిస్తే తానే పోవలె బూచీబేటికిని
మమ్ముపిలిస్తే మేమే పోవలె బూచీబేటికిని [డా
తాను కొప్పుపెట్టుకొని కోకకట్టుకొని కోటలో వున్నా
మూతికి మీసం లేకవున్నాడా కోటకులోగాను
యెక్కడలేని కోపం వచ్చె వెంగళరాయుడికి
చదువుకొన్న వోజాబు లక్కడ చించివేసినాడు
చించివేసిన జాబు లక్కడ తగలబెట్టినాడు
జాబులు తెచ్చిన బేగిరావుల చెంపలుకొట్టించి
మెడపట్టుక నెట్టించినాడురా వెంగళరాయుడు
గోడుగోడున దుఃఖపోయిరి హర్కారీలేమి"

బాహ్యదృక్కు కమ్ముఁడింటను నక్షరశిక్షణంబు సర్వసామాన్యలక్షణముగఁ బొడగట్టును. సర్వసామాన్యలక్షణమ్మగు నయ్యక్షరనిర్మాణవైచిత్ర్యమునువిడనాడి యొక నిమేసము చూతము. గద్యంబునం దక్షరంబు లెల్ల మాటలుగ మాఱి యామాటలయొక్క పొందిక దానికి మూలాధారమైన ట్లగపించుచున్నది. పద్యంబునం దక్షరంబు లెల్ల గణములుగఁగూడి యాగణములయొక్క చందము దానికి మూలాధారమైన ట్లగపించుచున్నది. గేయమునం దక్షరంబులెల్ల లయప్రవాహమునఁ దూఁగాడుచుఁ దల్లయగతుల యందము దానికి మూలాధారమైన ట్లగపించుచున్నది.

"తాను కొప్పుపెట్టుకొని కోకకట్టుకొని కోటలో వున్నాడా" యని యన్నప్పు డున్న యూపును, లయ లేకుండఁ జేసి "కొప్పుంబెట్టుక కోకకట్టుకొని తాఁ గోటన్ నివాసస్థుఁడా" యని వ్రాయవచ్చును. దానికే గణనియామకమును బోఁద్రోచి "తాను కొపెట్టుకొని కోక్కట్టుకొని కోటలో నున్నాడా" యని వ్రాయవచ్చును.

సర్వసాధారణముగ వచనమున నుపయోగించు 'కోటలో' ననుపదము గణముల నిమిత్తమై 'కోటన్' అనియును, లయకోసమై 'కోటలో' యనియును మార్పఁబడినది. మఱియు 'కొప్పెట్టుకొని' యన్నది గణముల నిమిత్తమై 'కొప్పుంబెట్టుక' యనియు, లయనిమిత్తమై 'కొప్పుపెట్టుకొని' యనియు వ్రాయఁబడినది. గద్యంబులం 'గడుంగడులు,' 'పొరింబొరులు', పద్యంబులం 'దొక్కొర్తుకలు', 'ఆకె' లు, 'ఆంద్రుదు' లు,

'నావుడు' లు, 'అనవుడు' లు, గేయంబుల 'హో'లు, 'గల్ల' లు మున్నగు చిత్రవిచిత్రప్రయోగంబు లగపించు. భాషాప్రియులు గమనించియే యుందురు.

ఇఁక నాంతరంగికవిభజనదృక్పథంబునుండి పరిశీలింపఁ గడంగుదము. భావము, రసము, నాదము నను వానినిఁ బరీక్షించిచూతము.

బాహిరవిభజనంబునం గొన్న గద్యపద్యగేయములలో సర్వసామాన్యలక్షణం బక్షరశిక్షయని యెట్లు నిర్దేశించి చూపినారమో యట్లే యాంతరంగికవిభజనంబునం గొన్న భావరసనాదమ్ములకుఁ గూడ నొక సర్వసామాన్యలక్షణంబుగ కవితయనుదానిని నిర్దేశింపవచ్చును.

సత్యము, అహింస యెట్లో కవితయును నొక విహితధర్మముగ మానవుఁ డెంచవలయును. సూక్ష్మదృష్టి ననుకొని సాక్షాత్కరించుకొనఁదగినదే కాని స్థూలదృష్టి నిదమిత్థ మని నిర్వచింపవీలుగానిది. అయిన యత్నింపనగు. భావ మనునది రాయిభంగి సుస్థిరము. రసమనునది ప్రవాహమువోలె వార్ద్రమై జాలువాఱునది. నాదమనునది పక్షివలె నెగసి యథేచ్ఛను విహరించునది. భావప్రధానమగు కవిత కుపమానముగ స్థూలదృష్టి నుదాహరణమ్ము సూపుఁడన్న నొక పెద్దకొండను జూపింతును. కొండ కేవలము తన గొప్పదగు సుస్థిరరూపమున గోచరమగునది. అట్టిది భావప్రధానమగు కవిత. రసప్రధానమగు కవిత కుపమానముగ స్థూలదృష్టి నుదాహరణ మిమ్మన్న విరహమును గైకొమ్మందును. విరహము కనఁబడక, వినఁబడక మన గుండెకాయ నూఱక తహతహ మనిపించు. అట్టిది రసప్రధాన మగు కవిత. నాదప్రధానమగు కవిత కుపమానముగ స్థూలదృష్టి నుదాహరణ మొసంగుఁడన్న కోయిలకూఁతను విన మందును. కొమ్మలమాటునుండి కోయిల కూసికొనుచు మనల నాకర్షించుచున్నది. అట్టిది నాదప్రధాన మగు కవిత.

ఇప్పు డాంతరంగికవిభాగములను బాహ్యదృష్టి నవలోకింతము. కేవలభావములు తఱచుగ గద్యమున వెలువడును. కర్తృకర్మక్రియానుక్రమణమున నర్థము తేటతెల్లమగునట్లు మాటలఁ గూర్చుకొనుచు వ్రాయుట గద్యమునఁగనుచుందుము. – 'రాముఁడుకుక్కనుగొట్టెను.' రసమిళితముగ నుబికించుటకుఁ గ్రమశః మాటలకూర్పు చాలదు. ముందుమాట వెనుకకు, వెనుకమాట ముందుకు లోనిరసోద్రేకమునుబట్టి మాఱును – 'లేనికూరుము లడికింపకు నింపకు' అనుచోట 'అడికింపకు నింపకు లేని కూరుముల్' అన్నట్లు. ఈప్రక్రియ కుపకరణము పద్యము. నాద మొలికింపనెంచుచో ముందుమాటను వెనుకఁబెట్టి, వెనుకమాటను ముందు బెట్టి కేవల గణవిభజనమ్ము జూచుకొన్నమాత్రమున నే చాలదు; లయనుగూడ దిద్ది తీర్చవలయును. రాగాలాపము లిందు కుదాహరణమ్ములు.

హృదయస్థ మగు రసమున కొకవిధమగు స్వేచ్ఛ, యొకవిధమగు విముక్తి గల్గించుటయ నాదప్రధానమగు కవితయొక్క ప్రధానాశయము.

ఒక నిమేసము పాఠకులు నిమీలితనేత్రు లగుచు బాహిరవిభేదమ్ముల,నాంతరంగికవిభేదంబుల నెల్లను మఱచి పోయి వాని నన్నింటనుం గల సర్వసామాన్యలక్షణమ్ములను జతపఱచి వితర్కింపనగు. అక్షరశిక్షణమ్ము, కవితాలక్షణమ్ము రెండునుం గవగ సాక్షాత్కరించి సారస్వత నిర్మాణమును బ్రతిష్ఠాపన మొనర్చుచున్నవా, లేదా?

కనీస-లక్ష్యంబు లగు నక్షరశిక్షణమును, కవితాలక్షణమ్మును విడనాడక, మఱియునుం గద్యపద్యగేయ రూపములకు దూరముగఁ జనక, భావ రస నాదములను మేళవించుకొనుచు నేభాష తన సారస్వతవిరచనమున కెక్కుడు సాయపడునదియో యాభాషయ యుత్తమ భాష, యావిరచనమ కొనియాడఁ దగిన విరచనమ్ము.

అట్టిభాష నాయూహలోఁ దెనుంగనియును, దానికి సాధనసంపత్తి 'రగడ, మంజరి, ద్విపద' తరగతి యని

యును నొక్కి వక్కాణింతు. ఏమన రగడలు, ద్విపదలు, మంజరులు మున్నగునవి గద్యమునకు మాటల కూర్పు నందు చేరిక మైనవి; మీఁదుమిక్కిలి గణముల యొఱపు విఱుపులను మెఱయునవి; పై పెచ్చు లయను వెలయునవి; ఆదినుండి యంతమువఱకు నక్షరశిక్ష నసమానప్రియము లైనవి. అందుచే నయ్యవి యొక్కుమ్మడి భావమును మది గుదురుపఱచి, రసము నుదుటు నెద నుబికించి, నాదమున నవనాళులఁబులకిఁ ప్రజ్ఞావంతములుగఁ జేసి యేతన్మాలమున నాంధ్రావలి కమందానంద మొనఁగూర్చుచున్నవి.

ఇంతకంటె నెక్కుడు సంప్రతించుట కాలహరణమేమో!

---

బాగుపడ దలచుకొన్నవారికి కొన్ని సూచనలు (నా యూహాప్రపంచమున)



# పాలకురికి సోమనాథకవి: అక్షరాంకగద్య

బండారు తమ్మయ్యగారు

కడచిన రెండుసంచికలలోను బ్రకటితములైన సోమనాథుని పంచప్రకార, నమస్కారగద్యలను, అందుఁ గూర్చి నేను వ్రాసిన పరిచయవాక్యములను పాఠకమహాశయులు పరికించియుందురు. సోమనాథుని అక్షరాంకగద్య నిప్పుడు ప్రకటించుచున్నాను. వెనుకటివానివలె నిదిగూడ బసవస్తోత్రపరమే. అకారము మొదలు క్షకారము వఱకు వర్ణసమామ్నాయమునఁ గల యేఁబదియక్షరములతోను వరుసగ నీగద్యపాదప్రథమాక్షరములు గూర్పఁబడుటచే దీని కీపే రొసంగఁబడినట్లు తోఁచుచున్నది. ళకారమును లకారభిన్నముగాఁ బాటించియు, ఆద్యంతాక్షరము లగు "అక్ష" లతో వేఱొకపాదమును జేర్చియు సోమనాథుఁ డిందు మొత్తము ౫౨ పాదములను గూర్చి నాఁడు. పంచప్రకారగద్యయందలి ద్వితీయ తృతీయ చతుర్థ పంచమగద్యలవలెను, నమస్కారగద్యవలెను నిదిగూడ మాత్రాగణబద్ధ మయియున్నది. పంచప్రకారగద్యలోఁ జతుర్థగద్యమందలి పాదములు (జయదురితపరిహరణ-జయసుకృతవరచరణ-జయనిక్కృతరవికిరణ- మొదలయినవి) అయి దేసిమాత్రలుగల గణములు రెండింటితోఁ గూర్పఁబడుటయు, వానిలోఁ బ్రతిమూఁడుపాదముల కొకయనుప్రాసముచొప్పున అనుప్రాసనియతి పాటింపఁబడుటయుఁ జదువరులు గమనించియే యుందురు. ఈయక్షరాంకగద్యపాదములుగూడ నట్లే అయిదేసిమాత్రలు గల గణములు రెండింటితోడనే గూర్పఁబడి పాదాంతమున మాత్రము ప్రణవాంకితము లయినవి. మఱియు అనుప్రాసనియతి యిందు మూఁడుపాదములకుఁ గాక నాలుగు పాదముల కొకయనుప్రాసముచొప్పునఁ బాటింపఁబడినది. పంచప్రకారగద్యయందలి చతుర్థగద్యమునకును దీనికిని బాటింపఁదగిన ముఖ్యభేదము, మొదటిదానియందలి పాదములు సర్వలఘుఘటితము లగుటయు, నిం దానియమము పాటింపఁబడమియు నని గుర్తింపఁదగును.

ఈ గద్యనుగూడ నాయొద్ద నున్న యేకప్రతిని బట్టియే ప్రకటించుచున్నాను. ప్రత్యంతరము దీనికిని లభింపలేదు. కావున వెనుకటిగద్యలలోవలెనే యిందుఁగూడ అర్థము సుగమము కానితావులందు అసలుపాఠములను పుటయడుగులఁ గనఁబఱచి నాసవరణపాఠములను గుండలీకరణమునఁ జూపితిని. సోమనాథుఁ డీయక్షరాంకనియమముతో నీగద్యనేకాక చంపకమాలికావృత్తములలో "(క)కారనుతం బసవేశ పాహి మాం" అనుమకుటముతో అక్షరాంకపద్యములనుగూడ రచించినాఁడు. వానికిఁగూడ నాయొద్ద నొక్క ప్రతియే యున్నది. అందు లేఖకదోషము లపరిమితముగా నుండుటచేఁ బలుతావులఁ గవిపాఠములను గుర్తింప వలనుగాకున్నది. మచ్చున కందలి పద్యము లొండురెండు లేఖకదోషములు సవరింపక నే యుదాహరించుచున్నాను.—

"చ. కరుణి సుకర్తృకప్రణుత
కల్మషదూరగ, కద్రువాత్మజా
భరణ, కనత్కళానిధిక
ళంకికపర్ద, కపాలమాలికో
త్కరధర, కల్పితాంబుజభ
వాండకరండకదంబ, కర్మసం

హారవిషకర్మకర్మఠ, క
కారనుతం బసవేశ, పాహి మాం."

"చ. చతురకళావిధిజ్ఞ, చ
తురాగమవేద్య, చతుర్ముఖాచ్యుతా
ర్చిత, చరితార్థసేవిత, చ
తుర్దశలోకనుతాంతరంగ, చ
ర్చిత సకలోపలాలన, చ
రాచరలింగ దృఢాంగ, చతురు
ద్ధృతరవిచంద్రమానల, చ
కారనుతం బసవేశ, పాహి మాం."

అక్షరాంకగద్య

శ్లో. జయజయ బసవాఖ్య స్స్వానుభూత్యేకసాఖ్యః
ప్రథమగణపవిత్రః ప్రస్ఫురద్భక్తిగోత్రః,
ప్రణమితబుధవర్య స్స్వయదైశ్వర్యధుర్యః
ప్రథితవృషభరూపః ప్రాజ్యమానప్రతాపః.

అపిచ శివశృంగార ఓం ఆదిపదవిస్తార ఓం
ఇహపరసుఖాధార ఓం ఈషణాత్రయదూర ఓం
(ఉద్ధుర)[౧]గుణోపేత ఓం ఊర్ధ్వరేతోజాత ఓం
ఋషభనామఖ్యాత ఓం ౠజమాయాతీత ఓం
ఌశ్లాఘ్యసందేశ ఓం ౡజనకసంకాశ ఓం
ఏకాంగవీరేశ ఓం ఐక్యసౌఖ్యావేశ ఓం
ఓమితిపదోన్నద్ధ ఓం ఔప(రా)[౨]పరశుద్ధ ఓం
అం(ధ్యాన)[3]సుసమృద్ధ ఓం అఃకలితగుణబద్ధ ఓం
కలిమలాపహశౌర్య ఓం ఖలనిరసనాచార్య ఓం
గరళమర్దనవర్య ఓం ఘనశి(వార్చనధుర్య) ఓం
ఙపురాణాధికా[౪] ఓం చతురకవితాపూర ఓం
ఛద్మేతరాచార ఓం జగదతిశయోదార ఓం
ఝగుణనీరసనిపుణ ఓం ఞ(వి)[౫]దూరమతివరణ ఓం
టక్కాది(కా)[౬]చరణ ఓం ఠవరవిహితాదరణ ఓం
డమరు(శ్రుతి)[౭]వేత్త ఓం ఢాళానుగతచిత్త ఓం
ణప్రతాపో(ద్వ్ర)[౮]త్త ఓం తత్త్వసా(ఖ్యోన్మత్త)[౯] ఓం
థవరహిత(గణసఖ్య)[౧౦] ఓం దమితతనుగుణసౌఖ్య ఓం
ధర్మపాలనముఖ్య ఓం నవనందినాథాఖ్య ఓం
పరమపదసుఖసార ఓం ఫలితజగదుపకార ఓం
బసవలింగకుమార ఓం భక్తిభాండాగార ఓం
మచ్చిదంతఃకరణ ఓం యమిజనార్చితచరణ ఓం
రతిపమద(పరి)[౧౧]హరణ ఓం లలితభసితాభరణ ఓం
వరదలీలాసక్త ఓం శమితవిషమో(ద్రి)[౧౨]క్త ఓం
షడ్వర్గనిర్ముక్త ఓం సహజజంగమభక్త ఓం
హరగణసితచ్ఛత్ర ఓం ళళితకీర్తికళత్ర ఓం
క్షురవిముఖచారిత్ర ఓం అక్షరస్తుతిపాత్ర ఓం
శివకర(శ్రీ)బసవనదండనాథ ఓం
నమస్తే నమస్తే నమస్తే నమః.

శ్లో. అకారాదిక్షకారాంత మకరో దక్షమాలికాం,
ప్రసాదీసోమనాథాఖ్యో బసవస్య కృపానిధేః.

ఇతి (శ్రీ)బసవాక్షరగద్యం సంపూర్ణమ్.

---

౧. ఉద్ధృత, ౨. శే, 3. ద్యాను, ౪. ప్రాశితూర్య, ౫. మ, ౬. రా, ౭. గాకృతి, ౮. ద్వే, ౯. ఖ్యాతేత్త, ౧౦. గుణలౌక్య, ౧౧. నిరు, ౧౨. ద్భు.







1. స్వదేశీ వస్తు విక్రయశాల, స్త్రీశాఖ, తెనాలి; 2. భారత వస్తు విక్రయశాల, స్త్రీశాఖ, బెజవాడ.





1. బెజవాడలో గాంధివారమున గుంటూరు జిల్లాసంఘమువారు శ్రీమతి పావర్తి సుందరమ్మగారి నాయకత్వమున ఖద్దరు వస్త్రములు విక్రయించుట; 2. రాజమండ్రిలో ౧౩-౪-౩౨ నాడు జరిగిన రాట్నపు పోటీయందు పాల్గొన్న స్త్రీలు.

# ద్రుతస్వరూపము

జాస్తి వెంకటనరసయ్యా చౌదరిగారు

కేవల నకారమనియు, ఆగమాదేశావ్యయప్రత్యయాత్మకం బయి యుత్వవిశిష్టం బగు నకారమనియు, రెండు ననియు ద్రుతస్వరూపమునుగూర్చి మతభేదము లుండకపోలేదు. అందుఁ జిన్నయసూరి కెయ్యదభీష్టమో తెలిసికొనుటయే యీవ్యాసమునకుఁ బ్రయోజనము. సిద్ధాంత మయినను, గాకపోయినను—విషయములఁ జర్చించి నిర్ణయించుభారము పండితులకే వదలి నాకుఁ దోఁచిన విషయముల నిందుఁ బొందుపరచుచుంటిని.

ద్రుత మనఁ జలనభావము గల దని తాత్పర్యము. అనఁగా నొల్లనిచో మఱుఁగుపడునది కాఁబట్టి దీనికీనామము వచ్చినది. "నకారంబు ద్రుతం" బని చిన్నయసూరి ద్రుతమునకుఁ జెప్పిన లక్షణము. ఇచ్చట "ఆగమాదేశావ్యయప్రత్యయాత్మకంబయి యుత్వవిశిష్టం బగు నకారం" బని యధ్యాహారము చేయవలసియుండును. ఎందుల కధ్యాహారముచేయవలయునో, ఇంతవిషయము నధ్యాహార్యముగా వదలి కేవలము "నకారంబు ద్రుతం" బని చిన్నయసూరి చెప్పుటకుఁ గారణ మేమో? చివరకు నారయుదము. ప్రస్తుతము సూరి తనవ్యాకరణమందు నుదాహరించినవానింబట్టి ద్రుతస్వరూపము నెట్లుగ్రహించినాఁడో విచారింతము.

"ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళము లగు" (సంధి-౧౬) నను సూత్రముచే ద్రుతప్రకృతికముమీఁద నున్న పరుషములకు సరళాదేశము విధింపఁబడినది. "ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికము" లని గదా సంజ్ఞ. ౧౩-వ సూత్రము ద్రుతప్రకృతికస్వరూపమును జెప్పుచున్నది. ఇట ద్రుతప్రకృతికము "పూచెను" అనునది. "ను" అనునది ద్రుతము గనుక యది యంతమం దున్నది గాఁబట్టి "పూచెను" అనుపదము ద్రుతప్రకృతిక మయి ద్రుతకార్యమును బొందుట తటస్థించినది. అనఁగా నుత్వవిశిష్ట మగునకారము ద్రుత మని తెలియుచున్న దనుట. కనుకనే పరుషమునకు సరళాదేశము వచ్చి "పూచెను గలువలు" అనురూపము సిద్ధించినది. మఱియు "ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాషనగు" (సంధి-౭౪) నను సూత్రముచే ద్రుతమునకు సంశ్లేషమును విధించుచున్నాఁడు గదా? కేవలనకారమే ద్రుత మగుపక్షమున సంశ్లేషము విధింపకయే "పూచెన్ గలువలు" అని సంశ్లేషరూపము సిద్ధించును. "సంశ్లేషం" బనఁగా మీఁదిహల్లుతోఁ గూడికొనుట గదా? అనఁగా ద్రుతములో నున్న అచ్ భాగము పోయినచో మీఁది హల్లుతోఁ గూడికొనుట తటస్థించును. ద్రుతమునకు సంశ్లేషము విధించినాఁ డనఁగా ద్రుతస్వరూపమునకు లోపముఁ జెప్పినాఁ డని గ్రహింపవలయును. దీనింబట్టి చూడ నుత్వముకూడ ద్రుతములోఁ గొంతభాగ మనియు, నందువలననే "అవసానంబునందు ద్రుతస్వరంబునకెని ద్రుతంబునకెని లోపంబు బహుళంబుగా నగు" (సంధి-౩౧) నను సూత్రముచే ద్రుతస్వరమునకు లోపము విధించినాఁ డనియు విశదమగుచున్నది. ద్రుతస్వరమునకు లోపమువచ్చినచో "వాఁడు వచ్చెన్" అనియు, ద్రుతమునకు (ఉత్వవిశిష్ట నకారమునకు) లోపము వచ్చినచో "వాఁడు వచ్చె" అనియుఁ, బక్షంబున స్వత్వం బున్నయెడల "వాఁడు వచ్చెను" అనియు రూపములు సిద్ధించుచున్నవి. ఇంకను "పక్షంబున స్వత్వంబగు. స్వత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావం" బను చిన్నయసూరి కుదాహరణములు "పూచెను గలువలు, వచ్చెను గోవులు" ఇత్యాది రూపములే గదా! అనఁగా ద్రుతమునకు నుత్వవిశిష్ట మగు నకారము ప్రకృతిభావ మని తెలియుచున్నది. ద్రుతములోఁ గొంత స్వరభాగముకూడఁ గలదని తాత్పర్యము. మఱియు "లుప్తపుదర్థకంబున కెదుతదర్థంబులు ద్రుతాంతంబు లగు' (క్రియా-౩౬) నను సూత్రమున కిచ్చిన యుదాహరణములఁ బరికించినచో నీ విషయమునే బలపఱుచుచుండుట విశదముగాఁగలదు.

".....కలిగెదను, .....కలుగుదను" ఇత్యాదులు.

ఆగమాదేశావ్యయప్రత్యయాత్మకమయి యుత్వవిశిష్టమగు నకారమేగదా ద్రుతమని చెప్పవలయునంటిమి. కారణ మేమో విచారింతము.

సూరిగారి వ్యాకరణములో నెచ్చట విచారించినను ద్రుత మేతద్రూపముగానే కాన్పించును, గాని యేతద్భిన్నముగా నెక్కడఁ గానరాదు. క్రమముగా లక్ష్యములఁ బరికింపుఁడు. ఆగమాత్మకం బయి యుత్వవిశిష్టం బగు నకారంబున కుదాహరణము:

"తృతీయాదులకు నుగాగమంబగు" (తత్స-౮) నను సూత్రమున కుదాహరణము లన్నియు (రామునిచేతను, రామునితోడను ఇత్యాదులు) నాగమాత్మకం బయి యుత్వవిశిష్టం బగు నకార మంతమందుఁ గలవి గనుకనే ద్రుతాంతము లయి (రామునిచేతఁ గొట్టఁబడి, రాముని

తోఁట్లుం జెలిమి ఇత్యాది) ద్రుతకార్యములఁ బొందుచున్నవి. మఱియు, "సమాసంబుల నుదంతంబు లగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు" (సంధి-౨౫), "ఉదంతస్త్రీసమంబులకును, బుంపులకు, నదంతగుణవాచకంబులకును దనంబు పరం బగునపుడు నుగాగమం బగు" (సంధి-3౫), "లుప్తశేష మునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు" (సంధి-3౬), "కలిసినఁజులు పరంబు లగునపుడు నుగాగమం బగు" (క్రియా-౨౧) ఇత్యాదులందు నుగాగమంబు గూడ ద్రుతమే యయి ద్రుత కార్యంబులఁ బొందుట యందఱకుఁ దెలిసినవిషయమే.

ఆదేశాత్మకం బయి యుత్వవిశిష్టంబగు నకారమున కుదాహరణము: "లిఙ్గాట్టుల నుఙ్గున కెను నువర్ణంబులగు" (క్రియా-౧౬) నను సూత్రముచే నాదేశముగా విధింపఁబడు "ను" వర్ణంబు ద్రుతము గనుకనే యంతమందుఁ గలపదంబు ద్రుతకార్యంబులఁ బొందుటతటస్థించుచున్నది.

అన్యయాత్మకం బయి యుత్వవిశిష్టం బగు నకారమున కుదాహరణము: "కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి" (సంధి-౨౧) అను సూత్రముదగ్గఱ నిచ్చిన 'అదియును' అను సముచ్చయాంతముకూడ ద్రుతప్రకృతిక మనియే గదా సూరి యభిప్రాయము. ఇట్లే 'మఱియును' 'అపుడును' ఇత్యాదు లన్నియు ద్రుతాంతములే యగును. కావున, అన్వయాత్మకం బగు నువర్ణంబు ద్రుతం బని చెప్పుట కభ్యంతర ముండ దనుకొనియెద.

ప్రత్యయాత్మకంబయి యుత్వవిశిష్టమగు నకారమున కుదాహరణము: "నువర్ణంబు ద్వితీయ" (తత్స-౨) యను సూత్రముచే విధింపఁబడు నుప్రత్యయము ద్రుతము గనుకనే తదంతమగు పదము ద్రుతాంత మయి (రావణుం బరిమార్చె ఇత్యాది) ద్రుతకార్యములఁ బొందుటకు వీలగుచున్నది. "లకారంబునకు డుప్రథమపురుషమునకు" (క్రియా-౮) నను సూత్రముచే విధింపఁబడు నుత్తమపురుషైకవచన ప్రత్యయమగు "ను" అనునదికూడ ద్రుతమే గనుక "వెళ్లుచున్నాను" ఇత్యాదులు ద్రుతప్రకృతికము లగుచున్నవి. ఇంకను "తుమర్థభావలక్షణంబులందు నుజె యగు" (క్రియా-౪౦), "నలయ్యాది క్రియలకుం గర్త యగు భావంబునందు నుజె యగు" (క్రియా-౧౨౨) మొదలగు సూత్రములందు విధించిన "ను" వర్ణకంబుగూడఁ బ్రత్యయాత్మకం బై యుత్వవిశిష్ట మగు నకారమునకు నుదాహరణమే యగును. ఇట్లు విచారింపఁగా "నకారంబు ద్రుతం"బను సూరిగారి (సంజ్ఞా-౧౭) సూత్రమునకు, 'ఆగమాదేశాన్వయప్రత్యయాత్మకం బయి యుత్వవిశిష్టం' బగు నకారం బని వ్యాఖ్యానము చేయఁదగియున్నది.

కాని ద్రుతస్వరూపములో నున్న యుత్వమున కెంతవఱ కావశ్యకత గలదో విచారించుట ముఖ్యము.

ద్రుతస్వరమున కంతగాఁ బ్రాధాన్య మున్నటులఁ గాన్పింపదు. స్వరము లోపించినను నకారముయొక్క ద్రుతత్వము చెడదు. (నకార మనఁగా "న్" హల్లుమాత్రమే; ఉచ్చారణసౌకర్యార్థ ముకారము) ద్రుతకార్యములఁ గూడఁ జేయవచ్చును. అందువలననే కొన్నిస్థలములందు స్వరమునకు లోపమువిధించుట తటస్థించినది. 'వచ్చెను' అను పదములో సంధి ౨౦-వ సూత్రముచే ద్రుతస్వరమునకు లోపము చేసినచో 'వచ్చెన్' అనియు, ద్రుతలోపముచేసిన 'వచ్చె' అనియు నుండును. (న్ అనుదానికి బదులు ౯ అనియు వ్రాయుట గలదు) కాని నకారము లోపించి స్వరముమాత్ర మున్నచో నెక్కడఁ గానఁబడవు. ఒకవేళ ద్రుతమునను లోపము చెప్పినను, అజ్ఝల్ సముదాయమునకే వర్తించును గాని యొక్క నకారము లోపించి స్వరము మిగిలియుంటఁ గాంచము, కాంచఁబోము. వచ్చెను + గోవులు—ఇట సంధి, ౧౮-వ సూత్రముచే ద్రుతమునకు లోపము రాఁగా 'వచ్చె గోవులు' అనియు, సంశ్లేషము వచ్చినచో 'వచ్చెన్గోవులు' అనియు నుండును. ఈవిధముగా సహజసరళము పరమయినను, ఆదేశసరళము పర మయిననుగూడ సంశ్లేషరూపము వచ్చి ద్రుతస్వరము లోపించును. అవసానము పర మయినను ద్రుతస్వరము లోపించును. స్థిరవర్ణము పరమయిననుగూడ లోపించుట గలదు. ఐచ్ఛికముగా నిట్లుంతట (ఉన్నాను-ఇత్యాదులందక్క) ద్రుతస్వరము లోపించుటఁ జూడ ద్రుతస్వరూపములో నకారమున కున్నంత ప్రాధాన్యము స్వరమునకు లేనట్లు తోఁచెడిని. కావున స్వరము లోపించినను, నకారములో ద్రుతత్వమునకు లోటేమి రాదనియు, నకారము ద్రుత మని వాడవచ్చుననియు, నీ యభిప్రాయము మనమునం దిడుకొనియే సూరి ద్రుతలక్షణము చెప్పునప్పుడు "నకారంబు ద్రుతం" బని చెప్పినాఁ డేమో యనియుఁ దోఁచుచున్నది. ప్రథమా బహువచనమగు 'లు' ప్రత్యయమునకు 'ఉ' కారము లేకున్నను "జలముల్, ఫలముల్" ఇత్యాదులందు శేషించిన లకారమే వెనుకటి ప్రథమార్థమును దెలిపినట్టులు, ద్రుతసంజ్ఞ గలిగిన 'ను' శబ్దముయొక్క 'ఉ'కారం బుచ్చరింపఁబడకున్నను మిగిలిన నకారముమాత్రమే మునుపటియర్థంబును బోధించును. మఱియు ద్రుతప్రకృతికముల పట్టికలోను, కన్ + దోయి ఇత్యాది (సంధి ౧౯-వ సూత్రపులక్ష్యము) స్థలములందుఁగూడ స్వరలోపముచేసి నకారహల్లుమాత్రమే ద్రుతముగా నుదాహరించియున్నాఁడు. ఇంకను "కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి"(సంధి-౨౧)అను సూత్రములో ద్రుతమునకు మాఱు నకారమని వాడియుండెను. కావుననే ద్రుతకార్యములు వచ్చి-అదియునున్నాక, దివంబునుంబోలె-అనురూపంబులు సిద్ధించినవి. అనఁగా ద్రుతమును నకార మనియు వ్యవహరింపవచ్చు నని తెలియుచున్నది.

ఇంతకు, నాగమాదేశాన్వయప్రత్యయాత్మకం బై యుత్వవిశిష్టం బగు నకారంబు ద్రుతంబనియు, స్వరము లోపించినను నకారము వెనుకటియర్థమును వీడకుండు ననియు, నకారమును ద్రుత మని వాడవచ్చుననియు, సూరి యభిప్రాయముకూడ నియ్యదియే యైయుండునేమో యనియుఁ దోఁచెడిని.

# కొన్ని వృత్తములు—తన్మత భేదములు

దువ్వూరి సూర్యనారాయణ మూర్తిగారు

వాఙ్మయము వేదకాలమునుండియు గద్యాత్మకముగను, పద్యాత్మకముగను విరాజిల్లుచుండుట సర్వవిదితము. దాన నొక శాఖగా నుండి చిరకాలమునుండియు వాడఁబడుచు గద్యపద్యాత్మకముగఁ బెంపొందుచున్నది యాంధ్రభాష. ఇయ్యది పద్యాత్మకముగా వాడుకలోనికి రాకమునుపు కొన్నిరకములగు దరువులవలెను, చిన్న చిన్న గేయములవలెను తాళానుగుణముగఁ బాడుకొనఁబడుచుండెడి దని విమర్శకు లనేకులు వ్రాసియుండిరి. రానురాను గద్యముకన్నఁ బద్యమున శ్రుతిసుఖము హెచ్చుగ నుండుటచే జనుల కత్యంతప్రేమ పాత్రములై కొన్ని విధములగు నియమములచేఁ గొన్ని పద్యములు బయలుదేరినవి. ఇట్టివి ప్రబంధరూపములుగను, దృశ్యకావ్యరూపములుగను నభివృద్ధి నందినవి. అట్టికావ్యములందలి వృత్తములు పెక్కురకములగు నడకలు కలిగి భిన్నభిన్ననామ విశేషముల నందినవి. వాని వాని నామముల ననుసరించి యీవృత్తమున కిన్నిపాదములనియు, పాదమున కిన్ని యక్షరములనియుఁ గూడ నేర్పరుపఁబడినవి. ఆనియమము ప్రకారము కూర్చుటలో నడక చెడిపోకుండునట్లును, సుకరముగ నా యావృత్తముల వ్రాసికొనఁగోరువా రేతన్నియమానుసారముగ నడువవలెననియు కొన్నిగణము లేర్పడినవి. గణ మనఁగాఁ గొన్ని గురులఘువుల సమూహము. ఈయవి యక్షరముల నాశ్రయించియుండును. వీనినే "హ్రస్వం లఘు, సంయోగే గురు, దీర్ఘంచ" అని పాణిని మొదలగువారు చెప్పియున్నారు. ఇట్టి గురులఘువులతోఁ గూడిన గణములయొక్క నడక నాశ్రయించిన కూర్పే వృత్తమనఁబడును. ఈవృత్తపాదమున కెన్నక్షరము లున్న నన్నవఛందమనిగూడ లక్షణకర్తలు పేరుపెట్టియున్నారు. ఆఛందము లిరువదియారనిగూడ విభజింపఁబడినవి. ఈఛందములఁ బుట్టిన వృత్తసంఖ్య కొన్నికోట్లతరబడి కలదు. ఈఛందములలోఁ జేరినవి సమవృత్తములనియు, దాఁటినవి విషమవృత్తములనియు వీని విభాగము. ఇట్టి వృత్తములలో ననేకవిధములగు వర్ణావృత్తులు రానురాను బయలుదేరినవి. అట్టి యావృత్తిలో ననిర్వాచ్యమగు సుఖము శ్రవణమునకు కలుగునని పూర్వులు తలఁచియుంట నట్టి యావృత్తి చేయవలయునను నొకనియమము కొంతకాలమునకు బయలుదేరినది. మఱికొంత నాగరికకాలము రాను శ్రుతిసుఖార్థము నిలుపు వర్ణసంతతి నియమబద్ధమై తప్పక నాయావృత్తములఁ బరిగణింపఁబడుచు శాసనమైనది. ఈశాసనము లనేకరీతులగు నామములతో లక్షణగ్రంథముల నుదయింపఁజేసినవి. అట్లగుచు మఱికొంత బలమును సంపాదించినవై యిట్టి నియమముల దాఁటరాదనియుఁ, బద్యకవితల్లునా రంద ఱీనియమములనే పాటింపవలెననియు, నట్లుచేయక గ్రంథముల వ్రాసిన నట్టికృతి నందినవారికి గొప్పగొప్ప కష్టములు వాటిల్లుననియు, అట్టిగ్రంథము దుష్టప్రబంధమనియు, నాకవి కుకవి యనియుఁ జాటినవి. ఇంకను నిట్టినియమములకు ప్రమాణము తగ్గునేమో అనియే గణగ్రహములు, గణయోనులు, గణాధిదేవతలుగూడ కల్పింపఁబడినవి. తత్తద్గణములకు ఫలములుగూడ నియమింపఁబడినవి. నాఁటినుండియు భాషాసంప్రదాయ మొండు మారుట తప్ప లక్షణకర్తల ఛందోనియమములు రవంతయుఁ జెక్కుచెదరలేదు. కాని రానురాను కొన్ని బిగింపులు సడలినవి. భీమన పదియతులనే చేయ మఱికొంద ఱిరువదియొక్క యతిని, అప్పకవి మొదలగువారు నలువదికి పైఁగను కల్పించియున్నారు. వారిలోవారే యఖండాదిప్రాచీన యతుల ఖండించుచు స్వమతధ్వజముల నాటియున్నారు. ఇట్లే వృత్తములలోఁగూడ లక్షణకర్తలు కొన్నిభావభేదముల నందియున్నారు. ప్రకృతమున నావృత్తములఁగూర్చి కొన్ని యస్పష్టవిషయములను, వారివారి మతభేదములను నీక్రిందఁ బొందుపఱుతును —

## ౧. జలధరవవృత్తము

"నననననలు నసల నొడఁబడి, నయపనయవిధిఁ దనుపు రే
చన మనుయతిని నిలుపఁగ మహిని, జలధరవమగు గురువుతోఁగా."

పైవృత్తమున రెండుపాదములని గ్రహింపవలెను. లక్షణము, లక్ష్యముగూడ నదియే. దీనిలో యతిస్థానము "మనువు" అనఁగా పదునాల్గక్షరములు దాఁటినవెనుక నని చెప్పఁబడినది. ఇయ్యది యప్పకవీయమున "ధరణీధరగతి" అను నామాంతరము నంది యీ లక్షణముగనే యున్నది యతులుమాత్రము పాదమునకు రెండేసి

గలవు. ఎనిమిది అక్షరముల తరువాత నొక యతియు, పదునాలు గక్షరములు దాటినవెనుక నొక యతియు నిలుపఁబడినవి. తక్కిన లక్షణము సమమే. పైకవిజనాశ్రయుని లక్షణమందు మొదటిపాదమున నకారమునకును రెండవపాదమున చ జ లకును యతి నిలుపఁబడినది.

## ౨. మానిని

"కారకముల్ క్రియఁ గన్గొన నేడు భ
కారము లొక్క గకారముతో
గారవమై చనఁగా యతి పం(డెటు
గల్గిన మానిని కామనిభా"

పై పద్యపాదమునకు మూఁడుస్థానముల యతి కనుపించుచున్నది. కాని "పండెటు" అని స్పష్టముగాఁ బాదమున కొక్క యతియే యని చెప్పినాఁడు. ఈవిషయ మప్పకవి స్పష్టముగాఁ జెప్పి యథాసంభవముగ లక్ష్యపద్య మిచ్చియున్నాఁడు. అనఁగా నందు పాదమున విచ్ఛేదత్రయము గానుపింపదు. ఇఁక ఛందోదర్పణమున నేతద్భిన్నమార్గ మంగీకరింపఁబడినది, చూడుఁడు:

"......అద్రిభవేవ్యసురు న్విలసిల్లు రసత్రయచిత్రయతుల్,
పన్నగ నొంద త్రిభాసురవిశ్రమభంగిగ మానిని......"

పై లక్షణమున "రసత్రయ" అను శబ్దముచే షడ్రసములు గాన నాఱక్షరముల వ్యవధానముగా మూఁడుయతులని కవి స్పష్టపఱచినాఁడు. ఆశబ్దముచే పదునెనిమిది యనుటకు వీలులేదు, 'చిత్రయతుల్' అని బహువచన మున్నదిగాన. లక్ష్యమును జూడుఁడు.—

"వన్నె యొసర్చిన వాహిని యాతని
వామపదంబున వాలె ననన్"

ఇట్లే నాలుగు పాదములందును నారక్షరముల వ్యవధానముగా యతిత్రయము నిలుపఁబడినది. తక్కిన విషయములలో లక్షణకర్తల కైక్యము లేకపోలేదు. పైరీతి పదునెనిమిది యక్షరములు దాటినవెనుక యతియన్నను నితరులకన్న భిన్నమే.

## ౩. లయగ్రాహి

"ఇం బడరగా భజసనంబులకొనన్
భజసనంబులు భకారము నొడంబడ లయగ్రా
హిం బరగఁ జెప్ప కలశంబడినయట్లు య
గణంబు కృతిమీఁద నమరుం బరహితార్థీ"

పై లక్షణమున గణముల స్వరూపముతప్ప మ తేవిషయమును చెప్పఁబడి యుండలేదు. వృత్తములకువలె ప్రాసము కనఁబడుచున్నది. ప్రాసయతులే తత్తత్స్థానముల నిలుపఁబడినవి. కాని యవెన్ని చోటుల నిలుపవలెనో తెలియదు. పాదమునకు మూఁడుపట్టుల కనఁబడుచున్నవి. అనంతుని ఛందమున "ఏకోనచత్వారింశన్మాత్రాగర్భితంబు త్రింశదక్షరంబులైన లయగ్రాహియగు" అని మాటలతో చెప్పఁబడినది. లక్షణమునను, లక్ష్యమునను గూడ యతులవిషయము గానరాదు. "ప్రాసముల్ గ్రందుకొని" అనుటవలన వృత్తప్రాసములు, ప్రాసయతులు గూడ గ్రహింపనచ్చును. అప్పకవీయమున నీయగమ్యములు వాచ్యములైనవి. గాన దానిరీతి చూచుకొనినఁ బైవన్నియు సరిగ నుండును.

## ౪. లయవిభాతి

ఈవృత్తము విషయమున నంద ఱేకీభవించియే యుండిరి. అప్పకవీయము ననుసరించియూడ నాల్గుయతులు పాదమున నుండవలెనని తేలుచున్నది. కాని యప్పకవిలక్షణ పద్యమును గొంత దిద్దవలసి యున్నది. "నసనద్వయము వెనుక నసగంబులను నిలిపి" అని యున్నది. ఇది కేవలము లక్ష్యవిరుద్ధము. ద్వయమనుచోట త్రయమని యుండవలెను. ఇయ్యది యచ్చుతప్పో, పరిశీలనకర్తల లోటో అయి యుండవలెనుగాని యన్యథా గాదు.

## ౫. త్రిభంగి

ఈవృత్తమువిషయమై భిన్నాభిప్రాయము లున్నవి. కవిజనాశ్రయమున నాలుగు నగణములును, రెండు సగణములపై భమసగలు పాదమునకుఁ గలిగియుండునని చెప్పఁబడినది. మఱియు "వడిదప్పన్ ప్రాసము లోప్పన్" అని యతి లేదనిగూడ చెప్పియున్నాఁడు. అనంతుని ఛందమున ఆరు నగణములును, ససనమసగలును పాదమునకు లక్షణమని చెప్పఁబడినది. ఇతర విషయము లేమియుఁ జెప్పఁబడి యుండలేదు. లక్ష్యదృష్టిని జూడ మొదటి రెండుపాదముల రెండు ప్రాసయతు లున్నవి. మూఁడు నాల్గుపాదముల మూఁడేసి ప్రాసయతు లగపడుచున్నవి. ప్రాసము, కలదు. ఈలక్షణమును, కవిజనాశ్రయుని లక్షణమును జూడ నేమియు సంబంధ మున్నట్లు లగపడదు. ఇఁక, అప్పకవీయమును జూచిన నారు నగణములును రెండు సగణములును భమసగములు పాదమునకు లక్షణ మన్నట్లు తెలియుచున్నది. కాని పద్యమునందు నగణము లాఱును, ససభసగములును పాదమునకు లక్షణమని చెప్పఁబడినది. ఇది లక్ష్య విరుద్ధము. ససభమసగలని దిద్దిన సరిపడును. తక్కిన విషయముల నియ్యది యస్పష్టముగ నున్నది. రెండుపద్యము లుపయోగించి లక్షణము చెప్పియును నీతఁడు సందేహరహితముగాఁ జెప్పలేకపోయినాఁడు. "పద్యతిభంగిన్" అని పద్యమునఁ జెప్పిన పదమునకు సరియగు నర్థ మగుపడదు. ప్రాస కలదు. పాదమునకు రెండుప్రాసయతు లైన ట్లగపడుచున్నది. కవిజనాశ్రయమున "వడిదప్పన్" అనెడి నియమము దీనిచే బాధింపఁబడెడి. ఎనిమిదింట యతిస్థానము. అక్షరగణనముంబట్టి యప్పకవిది, యీతనిది

యొక్క ఛందమున నే పుట్టినవని మాత్రము చెప్పవచ్చును. కవిజనాశ్రయుని త్రిభంగి త్రిభంగిగానే యున్నది.

## ౬. విషమసీసము

ఇయ్యది కవిజనాశ్రయుని హృదయస్థమైనను గ్రంథమందు నామమాత్రమే వాడఁబడినదిగాని లక్షణ మేమియుఁ జెప్పఁబడి యుండలేదు. దీనిపేరైనను నుత్సాహవృత్తలక్షణమున వాడఁబడినది. తల్లక్షణావసరమున,

"ఉ, త్సాహ మయ్యె నిదియునుం బ్రశస్తముగ నొనర్ప ను
ర్వీహితోరుచరిత యదియె విషమసీస మై చనున్".

అని చెప్పఁబడినది. తరువాత నిద్దానిక్రిందుగ నాటవెలఁది యొండు జేర్పఁబడినది.

"ప్రాలువల్లు లీల నోలిని నిలిపి యా
గణమె కాని యొండు గణము లిడక
అభినుతార్థరచన లభినుతమై యుండ
చెప్ప విషమసీస మొప్పు కృతుల."

చూడ నీరెంటియందును గూడ విషమసీసవిషయ మేమియు స్పష్టముగా తేలియుండలేదు. కాని ఉత్సాహావృత్తముక్రింద నొక గీతిఁగాని, యాటవెలఁదిఁగాని జేర్చిన విషమసీస మగుననియు, గీతి యందు ప్రాసయతులు నిలుపవలెననియు లక్ష్యమునుబట్టి గమ్యము. మఱియు నీగ్రంథమున నే సర్వసీససామాన్యలక్షణములఁ జెప్పు వేరొక సీసమందు,

"యతులు ప్రాసంబు లిష్టసంగతుల నడువ
నదియె సమసీస మలరును తుదను గీతి
పరగ విషమసీసంబగు......"

ఇట్లు చెప్పఁబడినది. ఇచ్చటకూడ నేవృత్తముక్రింద గీతిని చెప్పవలెనో, గీతిలోఁగూడ నేయే నియమముల పాటింపవలెనో చెప్పియుండలేదు. గీతికిని నాటవెలఁదికిని నభేదము లక్షణకర్తలలోఁ బ్రసిద్ధముగాన, అనఁగా (గీతిస్థానమున నాటవెలఁదియు, నాటవెలఁదిస్థానమున గీతియు వాడెడి వాడుక యుంటచే) లక్షణస్థమగు "గీతి" యను పదమునకును, ఉత్సాహవృత్తముక్రిందదియగు నాటవెలఁదికిని అభేదముని గ్రహింపవలెను. ఈవిషయము అనంతుఁడు స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. లక్ష్యముగూడ సరిపోయినది. ఇఁక అప్పకవీయమునఁగూడ పైరీతినే చాలవరకు జెప్పఁబడినదిగాని గీత మందు ప్రాసయతులే నిలుపవలెనను నియమ మతఁడు సెప్పియుండ లేదు. చూడుఁడు, గీతిమాత్ర మిచ్చెదను.

"దోలుకృష్ణయంచు దోరంపు టుత్సాహ
మీఁద గీత మొకడు మేలగింప
విషమసీస మనఁగ వెలయు కామెపలీశ
జమ్మిచెంత నున్న, చతురవచన"

ఇందు ప్రాసయతులు నిలుపఁబడనేలేదు. ఇట్లప్పకవి మత మీవిషయమున మాత్రము వేరైనది. ఇఁక ఛందోదర్పణ మతాను సారము :—

"ప్రాసములును వడులు భాసురంబుగ నిట్లు
విలసితముగ నాట వెలఁదియందు
నుత్సుకత నొనర్చి యుత్సాహమదినిల్ప
విషమసీస మమరు......"

అనెడి లక్షణమందు ప్రాసయతు లనుకొన్నను సరిపడుచునే యున్నవి. కేవలయతులే యనుకొన్న నప్పకవిరీతిని సరిపోవుచున్నవి. ఇఁక నీలక్షణకర్తల మతముల ననుసరించి కొందఱు చిన్నమార్పు కవిజనాశ్రయమునఁ జేసినారు. ఎట్లన,

"ఉ, త్సాహ మయ్యె నిదియునుం బ్రశస్తముగ నొనర్పగన్"

అనెడిచోట

"ఉ, త్సాహమయ్యె గీతియును బ్రశస్తముగ నొనర్పగన్"

అని దిద్ది గీతివిషయముగూడ స్పష్టపరచినారు. మఱియు కవిజనాశ్రయుని సర్వసీసలక్షణపద్యమునఁగూడను "అదియె సమసీస మలరును తుదనుగీతి" అనెడి లక్షణమున "అలరును" అనుపదమునకు బదులుగా "ఉత్సాహ" అని దిద్దినారు. దీనిచే నిచ్చటఁగూడ దేనిక్రిందుగా గీతి రచించిన విషమసీస మగునో యనెడి పైశంక తొలఁగినది. కాఁగా నుత్సాహవృత్తముక్రిందుగ నొకగీతినిగాని, ఆటవెలఁదినిగాని ప్రాసయతులతో నిలిపిన విషమసీస మగునని కవిజనాశ్రయ ఛందోదర్పణమతమును, ప్రాసయతులు లేని గీతమే యని యప్పకవిమత మును అయియున్నవి.

## ౭. వడిసీసము

కవిజనాశ్రయమున "మున్నెకొన్న యతిపాదమందెల్ల నడరిన వడిసీసమనఁగఁ బరగు" అని లక్షణము చెప్పఁబడినది. లక్ష్యముగూడ సరిపోయినది. అనంతుఁడుగూడ నీమతమునే యవలంబించినాఁడు. అప్పకవిమాత్రము "ఆది నేవడి నిల్పి రావడే పదమెల్లఁ జేయ నయ్యది వడిసీస మయ్యె" అని లక్షణమును జెప్పి లక్ష్యము తద్భిన్నముగా నిచ్చియున్నాఁడు, చూడుఁడు.—

"విజయసారథిఁగాని వినుతింపఁగా నొల్ల
గిరినాయకునిగాని కీర్తిసేయ"

పైపాదాదిని ప్రాణియతి నిలిపి రెండవ యర్ధమందు వర్గయతి నిలుపఁబడినది. మూఁడవ పాదమందు మాత్రము స్పష్టముగా నేకయతి నిలుపఁబడినది.

"పద్మనాభుని గాని పాటింపఁగా నొల్ల
సాఁకీనపతిఁగాని ప్రస్తుతింప"

ఈపాదమందు సభిన్నమగు వర్గయతి నిలుపఁబడినది. దీనినిబట్టి చూడ లక్షణమందలి పదశబ్దాభిప్రాయ మెంతవఱకు సార్థకమో తెలియకున్నది. సీసపాదార్ధమే తాను పదమని గ్రహించినట్లు తేలుచున్నది. అట్టిఖండమున నొక్క యతిగాక మరొకయతి నిలుప వీలు లేదు గాన. ఇట్టివిషయమున నన్యోన్యము భేదము కనుపించుచున్నది.

## ౮. ప్రాసనీసము

కవిజనాశ్రయమున నిద్దాని లక్షణ మిట్లున్నది —

"వృత్తంబునకువలె వెలయ నాల్గడుగుల వెస ప్రాసములు నిల్పి
విరతు లునుప ప్రాసనీసం బగు" అని.

ఈపాదచతుష్టయ ద్వితీయతుల్యహస్తమ్ము గీతియందుఁగూడఁ బొడగట్టుచున్నది. ఇచ్చట ననంతుని మతమున గీతమందు ప్రాస నియమ మగుపడదు. ఈతని లక్షణమునఁగూడ గీత విషయమునే చెప్పియుండలేదు. ఈ నియమము ననుసరించియే కొందఱు ప్రాసనీస లక్షణమునందే కలిపి యక్కిలి ప్రాసనీసమునకు లక్షణము నుభయ లక్ష్యభూతదృష్టితోఁ జెప్పినకవిజనాశ్రయుని పద్యమును గొంచెము సవరించిరి. "దీనిపశ్చిమార్ధంబున" అనెడిచోట "దీని" తీసి "గీతి" అని దిద్దిరి. అప్పుడర్థము—గీతిన్ = గీతమందునను, పశ్చిమార్ధంబునన్, ప్రాసనీసపాద ద్వితీయ భాగమునను, వేరొక్క ప్రాసమైనన్ = ప్రాసనీసమం దేప్రాస నిలుపఁబడెనో తదభిన్నమై తదధికమైన మఱియొక ప్రాసమును నిలుపఁగా నని చెప్పవలెను. ఇట్లు చెప్పుకొన్నచో ప్రాసాక్కిలిప్రాసనీసములలో ననంతుఁడును నీతఁడును సఖ్యపడుదురు. అప్పుడు కవిజనాశ్రయమందలి పద్యలక్షణమున గీతియందలి ప్రాసనియమమును నాల్గవసీస పాదఖండద్వయమందలి ప్రాసనియమమును నక్కిలి ప్రాసనీసమున కుదాహరణములుగాని ప్రాసనీసోదాహరణములుగావని గ్రహింపవలెను.

కవిజనాశ్రయునికన్న విశేషముగ వృత్తప్రాస, సర్వతః ప్రాసలను సీసద్వయము నప్పకవ్యనంతులు సెప్పియున్నారు. అందప్పకవీయమున

"ప్రాస మారంధ్రుల, పదిలంబుగా నిల్ప,
అక్కిలి ప్రాసనీసాఖ్యమగును."

అని లక్షణము చెప్పఁబడినది వృత్తప్రాసనీసమునకే పూర్వ ముద్రణప్రతిలో నక్కిలిప్రాసనీసమనుపే రుండెడిదని యాపేజీలోఁ గ్రిందిభాగమున వ్రాయఁబడినది. అట్లయిన నిది పైలక్షణకర్తల మతముల కంటె భిన్నమగుచున్నది. గీతపాదచతుష్టయమందును ప్రాస నిలుపవలెనని వారిరువుర మతము. గీత ప్రథమచతుర్థ పాదములలోనే నీనియమమున్నచాలును అని యప్పకవీయమతము. ఎట్లయినను భేదము తప్పలేదు. అనంతుఁడుగూడ నీవృత్తప్రాసనీసమును జెప్పెనుగాన నప్పకవీయమందలి నామమును మార్పక చూతమన్న ననంతుఁడు గీతిలోనేపాదమందుననుగూడ ప్రాస కావలెనని చెప్పియుండలేదు. లక్ష్యమునఁగూడ లేదు. కాన నీవిషయమున భీమనరంగరాజులే కలిసిరిగాని యప్పకవిమతము వేరైనది. సర్వతఃప్రాసనీసమున నిద్దరు నేకీభవించియే యుండిరి. ఇయ్యది కవిజనాశ్రయమందలి ప్రాసనీసమం దంతర్భవింపదు. దీన పాదచతుష్టయమందును వృత్తమునకువలె ప్రాస నిలుపవలెను. సర్వతఃప్రాసమున ప్రాసయు, యతిస్థానమున ప్రాసయతులును నయియుండవలెను.

## ౯. త్రిపద

ఇయ్యది మూఁడుపాదములతో నుండునుగాన నానామము సార్థకము. దీనికి ప్రాస మున్నది. యతి లేనట్లు గానవగు. ఈవిషయ మప్పకవి స్పష్టపరచినాఁడు, "వళిలేక నలరారుఁ ద్రిపద" అని. కాని ప్రథమపాదమధ్యమున యతిస్థానమందువలె గుర్తు నిలుపఁబడినది. అయ్యది యచ్చుతప్పయి యుండనోపును. లక్షణకర్తలు సందేహముగాఁ బద్యముల వ్రాయుట, యిట్టి ప్రమాదములఁ గలిగించుట సహజమే. మఱియు నది పాదచతుష్టయభ్రమ గలుగఁజేయుచున్నది. ఈ ప్రథమపాదయతివిషయమున నప్పకవీయముననేకాక తక్కినవారి గ్రంథములఁగూడ నిట్టి భ్రాంతియే కనఁబడుచున్నది. చూడుఁడు.—

కవిజనాశ్రయమున—"త్రిదశేంద్రు లారగు, పదియగు నెడనకున్"

ఛందోదర్పణమున—"సరవిఁ బ్రాసమునంది సురపతుల్ నలువురు"

అప్పకవీయమున—"తొలుతను నల్వురింద్రులు రెంట మూటను"

పైవారలు యతివిషయమును గూర్చి చెప్పకున్నను, కూడదని చెప్పిన యప్పకవిగూడ నిట్టి సందేహమునకు తావు లేకుండ వ్రాయలేకపోయినాఁడా? కాదు. ఇది కేవలము మనస్సంకోచమే. కవిజనాశ్రయమున యతి యున్నదా, లేదా? అను నిర్ధారణ లేకపోవుటచేతను, తద్విషయ మేమియు లక్షణమున వాచ్యము గాకయే యతి కాననగుటచేతను అనంతుఁడుగూడ గోడపై పిల్లివాటముగ నెట్లనుకొన్నను బాధ కలుగదని సందిగ్ధముగాఁ జెప్పియున్నాఁడు. కానినాఁడు "నలువురు సురపతుల్" అని చెప్పినచో నీయాక్షేపణమే కలుగకుండునుగదా? మఱియొక సంగతి - కవిజనాశ్రయుని లక్షణలక్ష్యములలో విరోధ

మున్నట్టున్నది. దానికి సరియగు నర్థము కుదురకున్నది. పైవారి లక్షణమైన నావృత్తమునకు సరిపడుట లేదు. తప్పని యనుటకైనను సాహసము చాలదు. ఏమందురా? అయ్యది

వసంతశస్థానదోళ్,

"బిసరుహోద్భవగణం,
బిసరుహానేత్రే గణమో బర్కళివవు
బిసరుహానేత్రే త్రిపదిగే"

అనెడి కన్నడలక్షణమునకు సరిపడియున్నదని క్రింద వ్రాయఁబడి యున్నది. అయ్యది యపరిచితమగుటయే కారణము. పైకన్నడ వృత్తమునఁగూడ ప్రథమపాదమందు యతి కలదనియే సూచించుచున్నది. కాని యీభేదముల నేది నిశ్చయమో ప్రమాణగ్రంథలక్ష్యము దొరకువఱకును నిర్ణయింపఁజాలము. ఈపైవారి లక్షణమునకుఁ గవిజనాశ్రయుని లక్షణమును సరిపున్నవలెనన్న రెండవపాదమును "గదియ రెంటను మూటను" అనెడిచోట "గదియ రెంటిటను మూటిటను" అని సరిచేసిన భేదము నాటిల్లక గణము లంమాత్రము సరిపడును.

## ౧౦. చౌపద

దీని లక్షణమన్నింటియందును సమముగానే యున్నది. అనంతుఁడుమాత్రము పాదాంతమందు లఘువునే నిలిపినాఁడు. తక్కిన వారి లక్ష్యముల గురు వున్నది.

## ౧౧. షట్పద

ఇయ్యది రంగరాట్ ఛందమున స్పష్టముగా నున్నది. ఆరుపాదములలో నుండుట నిద్దానికీనామము వచ్చినది. ఆ రింద్రగణములు ఒక చంద్రగణమును నొ దత్రయమగునని దీని లక్షణము. ప్రాస గలదు. వడి లేదు. చంద్రగణము మూఁడారు పాదములనే యుండును. కవిజనాశ్రయమునను నీయర్థమే చెప్పఁబడెనుగాని పద్యము ప్రభ్రష్టమైనది. ముద్రణ పాదవిభాగముగా లేదు. ప్రాసము కొన్నిపాదముల పోయినది. గణముల కూర్పు పోలేదు. దాని నీక్రిందిరీతి సవరించిన లక్ష్య లక్షణ సమన్వయముగా నుండును.—

"త్రిదశేంద్రగణములు,
కుదుర నిర్మాణిడి కదియ నంత్యంబునఁ జంద్రుఁగూర్చి,
తుది యిట్లుగాఁ గూర్పవది యతిలేక ష
ట్పదమగు మల్లియారేచనాక్ష్య!"

ఇంక నప్పకవీయమున నీలక్షణ మంతయు సరియగురీతినే యున్నది గాని లక్ష్యపద్యమున "పాద మీమూటితో నాల్గుఁ జేసిన" అని యున్నది. ఈ 'నాల్గు' అనుదాని కర్థ మున్నట్టు లగుపడదు. రెం డేను మార్చిన సరిపడును. కాని దీని యైదారుపాదముల "భాసిల్ల మూఁడవ నీమూటి రెట్టించి" అని దిద్దవలెను.

ఇట్లు లక్షణకర్తలలో ననేకభేదము లనేకస్థలములఁ గనఁబడుచున్నవి. ఇంకను కొన్ని వృత్తములలోఁగూడ నిదేవిధముగ నున్నవి. విస్తరభీతిమగించితి. ఈయిక్కట్లు సామాన్యముగాఁ బూర్వలక్షణముల దిద్దుటవలనవచ్చుచున్నవి. రాను రాను మూఁడునాల్గు శతాబ్దముల నాఁటికిఁ గవి తన గ్రంథమునఁ బ్రయోగించిన పదములు నశించి యధికపాఠమయము లగుచున్నవి. ఇట్లే కొంతకాలమునకు నిరర్థకములుగూడ నగుచున్నవి. ఈదిద్దులు పూర్వమునుండియు వచ్చుచునే యున్నవి. నూతనముగ నొకవ్యాకరణము వ్రాయవలెనన్న పండితుఁడు కొన్ని ప్రయోగముల ప్రమాణగ్రంథముల మార్పఁజేసి ఇట్టివిశేషములు తత్పూర్వులు చెప్పియుండలేదనియు, నేనే క్రొత్తగా పరిశీలించి చెప్పితిననియుఁగూడ చెప్పుట మనము ప్రౌఢవ్యాకరణ, అప్పకవీయాదులలోఁ జూచుచునే యున్నాము. ముఖ్యముగా నతికష్టములగు నీవిషయముల నొక్కొక్కపర్యాయమునం దిమిశింపవలెనన్న నస్పష్టత లెక్కువగానే యుండును. కాని యేకచ్ఛందోజాతములై నామసాదృశ్యమునుగూడ నందుచు వానివాని నియమములలోను, గణములలోను భేదము లక్షణకర్తలలోఁ గనఁబడుట శాస్త్రప్రామాణ్యబుద్ధి తగ్గుటయేకాక మొదటనే చెప్పిన శాస్త్రకర్తల యాశయమునకు మూలచ్ఛేదమగుచున్నది. ఇయ్యది వారివారి స్వతంత్రతలను దెలుపుచున్నదిగాని నియమబద్ధ మగుటలేదు. ఇట్లు వృత్తములలోనేకాక యతులలోఁ, బ్రాసములలో, మఱియు ననేకవిషయములలో నిట్టి మతభేదము లుంటచేతనే శాస్త్రము కఠినమై పెక్కుమార్గముల తొక్కుచున్నదనుట సర్వవిదితవిషయమని యింతటితో విరమించుచున్నాను.

# ఆంధ్రులు–రాధ

సముద్రాల వేంకటరాఘవాచార్యులు గారు

ఆంధ్రమున నేడొక క్రొత్తయుగము జరుగుచున్నది. ఈ యుగపరివర్తనమున నాంధ్ర సాంప్రదాయము లన్నిటిలోను మార్పు రాకతప్పదికాదు. నూతనసన్నివేశమున గల్గిన ఆంధ్రమానసికసంస్కారము భాషలో గూడ దాని క్రొత్తపోకడలను జూపుచున్నది. శిల్పమున గూడ దాని పలుకుబడి చెల్లకపోలేదు. ఆంధ్రులలో విప్పారుచున్న నూతనవికాసమునకు గల కారణము లన్నిటియందును వంగభాషాశిల్పములు ప్రధానములు. వానితోగూడ చైతన్యమతము తెలుగునాటిలో కాలూన గలిగినపిదప నాంధ్రుల మాధురీవృత్తి వికసింపదొడగినది. నేడాంధ్రమున నేయింట జూచినను వంగీయచిత్రకళా నైపుణ్యము చేవలుదేరిన కృష్ణుని చిత్రపటములు. ఈ చిత్రశాల కంతటికిని మహారాణి రాధాదేవి. అచటినుండి రాధాదేవి నికుంజపుంజములలో నున్న కృష్ణుని దోడ్కొని యాంధ్రయువక హృదయములలో ప్రవేశించినది. అచ్చట జరుగుచున్న నూతననృత్యవిలాసమే నేడాంధ్రలలితకళలలో గోచరించుచున్న నూతనజ్యోతిర్విలాసము. సర్వతో మధురమగు నీరాధాతత్త్వమును ప్రాచీనాంధ్రు లెట్లు సంగ్రహించికొనియుండిరి?

ఆంధ్రులకు రాముడు ప్రాణాధికప్రియుడు. 'శ్రీరామ' చుట్టనిది వారి కలము సాగదు. 'సీతారామ పరబ్రహ్మణే నమః' అననిది భిక్షుకుడు జోలె తెరువడు. చిలుకలకు భాషాభ్యాసము రామనామము తోనే మొదలగుచున్నది. సంతోషకరమగు విషయము విన్నపుడు 'రామరామ' యనకుండ వారూరకొనలేరు. రాముని స్మరింపకుండ రాగము సాగదు. ఆంధ్రగాయక శిఖామణి, కర్ణాటకసంగీతసుధానిధి యగు త్యాగరాయలు తన గీతము లన్నియు హృదయముతో రాముని కర్పించెను. సుప్రసిద్ధాంధ్రభక్తుడగు గోపన్న రామదాసైపోయెను. వేయేల తుదమునుండి దేవతార్చనవఱకు తెలుగుజీవిత మంతయు రామమయము. రాముడు పూర్ణముగా నుత్తరాహుడైనను కైకమూలమున దాక్షిణాత్యసంబంధము గలిగినది. మరియు నాయవసరమున రాముడు దండకారణ్యమున,—తెలుగునాటి గుండెలలో పెక్కుసంవత్సరము లుండెను. అందువలన నాంధ్రులలో రామతత్త్వము పూర్తిగా నిమిడిపోయినది. అంత మాత్రమున కృష్ణుడు తెలుగువారి కపరిచితు డని చెప్ప రాదు. ఆంధ్రులు కృష్ణు నెరుంగుదురు. కాని వారి హృదయముల గరచినవాడు గోకులద్వారకాకృష్ణుడేకాని రాధాకృష్ణుడు గాడని తలంచుటకు గారణములు లేకపోలేదు.

నన్నయకుపూర్వము పద్యరూపక మగు తెలుగు వాఙ్మయము శాసనములో గన్పించుచున్నను మహాభారతాంధ్రీకరణమె గ్రంథరూపమున దొలుదొల్త కన్పించుచున్నది. అంతవరకు తెలుగునాటిలో కావ్య రచనము ఒకరూపమును దాల్చియున్నట్లు లేదు. అందువలన నప్పటికి విశేషప్రచారములో నుండి జాతిమతధర్మముల ప్రచారమున కుపయోగించు గ్రంథముల ననువదించుటతో నాంధ్రవాఙ్మయము రూపుగొన్నది. కావున నీకాలమును పౌరాణికయుగమని చెప్పవచ్చును. నన్నయ

మొదలుకొని అల్లసానివానివరకు గల కవు లెల్ల రా
యుగమున పురాణేతిహాసములను దెలిగించిరి. రామకృష్ణ
కథలేకాక యెన్నియో శైవపురాణములు తెలిగింపబడి
నవి. కలముబట్టగలిగిన కవియెల్ల యేపురాణమునో,
ఇతిహాసమునో తెలిగింపక విడువలేదు. ఇంత విచ్చల
విడిగా నాయాంధ్రీకరణము కొనసాగినను రాధాచరిత్ర
ప్రతిపాదకమగు బ్రహ్మవైవర్తముగాని, దేవీభాగవతము
గాని తెలిగింపబడలేదు. ఈతెలిగింపబడిన యేగ్రంథము
నందును రాధాకృష్ణసంబంధము గానరాదు. శృంగార
రసపరమావధిని ముట్టిచూపిన శ్రీనాథాదికవులుగూడ
రసస్వరూపులని చెప్పబడు నీరాధాకృష్ణులదెస జూడని
కారణము తెలియరాదు. విజయనగరసమ్రాట్టగు కృష్ణ
రాయల కాలమున నాంధ్రకవితాపితామహుడు నూతన
కావ్యధోరణికి దారి చూపెను. అప్పటినుండి తెలుగు
వాఙ్మయమున నైతికప్రబోధము, మతరేఖలు సన్నగిల
జొచ్చి లాలసత్వముతో గూడుకొన్న శృంగారము
ప్రధానస్థానము నాక్రమించెను. రాజు లట్టికావ్యము
లను ప్రోత్సహించుటచే నానాడును, తరువాతను ప్రబం
ధములు కుప్పతెప్పలుగా వెలసినవి. అపుడు పురాణ
ములుకూడ యనువదింపబడినవి. కాని వాని గౌరవము
సడలిపోయినది. అందువలన పురాణములలోని రామ
కృష్ణకథలను సంగ్రహించి నూతనకల్పనలతో కావ్య
ములు రచించిరి. ఈకృష్ణరాయల కాలముననే రాధకు
తెలుగువాఙ్మయమున దొలుదొల్త స్థానము లభించినది.
చింతలపూడి యెల్లనార్యుడు 'రాధామాధవ'* మను
కావ్యమును రచించెను. కర్ణాటాధిపుడగు కృష్ణరాయని
రాధామాధవకావ్యముచే మెప్పించి 'రాధామాధవకవి'
యని పేరుగాంచినట్లు తనకావ్యమున నెల్లనార్యుడు చెప్పి
కొనియున్నాడు. కవితారహస్యవేదియు, కవియు నైన
కృష్ణరాయల దలయూపించిన యీకావ్యముపేరుగూడ
నాంధ్రులు వినియున్నట్లు తోచదు. ఇందలి యితి
వృత్తము 'లక్ష్మీనారాయణులు వైకుంఠమునం దుండగా
లక్ష్మికి రామావతారము స్మృతికి వచ్చినది. ఆ
దివ్యమంగళదేహునితో గలిసి, యామె మరల నొక
సారి క్రీడింప గోరికపడి మగనితో చెప్పుటకు సిగ్గుపడి
శివుని స్మరించినది. ఆత డరుదెంచి కొన్ని పూర్వ
వృత్తాంతములను జెప్పి ప్రసంగవశమున లక్ష్మియుబలాట
మును దెలిపి జగన్మోహన మగు కృష్ణావతారమును
ధరింపబోవుచున్నాడు గనుక యావేషమున లక్ష్మికి కోర్కె
చెల్లింపుమని వెడలిపోయెను. విష్ణు వీమాట నంగీకరించి
సఖీసమేతముగా లక్ష్మిని గోకులమున నవతరింపగోరెను.
ఆమె యట్లే బృందావనసమీపమునం గల యొకపల్లెలో
సహస్రగోపునకు బుత్రికయై జన్మించెను. ఆమెపేరు రాధ,
సఖీజనులవలన కృష్ణసౌందర్యమును రాధయు, నారదుని
వలన రాధాసౌందర్యమును కృష్ణుడును విని పాణిగ్రహణ
మున కభిలషించుచుండిరి. రహస్యముగా దౌత్యములు
సాగించిరి. కాని రాధికకు స్వయంవరముచాటింపబడియెను.
అన్ని దేశములనుండి రాజు లరుదెంచిరి. స్వయంవరములో
రాధ కృష్ణుని వరించెను. కృష్ణుని రాజు లెదిరించి పరాజితు
లైరి. రాధికాసోదరుడగు భద్రకుడుగూడ కృష్ణు నెదిరించి
ఓడిపోయెను కృష్ణుడు రాధికతో బృందావనమున కరుదెంచి
వసంతోత్సవములు, జలవిహారములు మొదలగు సమస్త
క్రీడలతో యమునాపులినములను ధన్యమొనరించెను." ఈ
కథనుబట్టియె యిది రుక్మిణీకల్యాణానుకరణమని తలంప
నగును. దీనిలోని కవిత్వము రసవంతమై నాటి కవుల
కవిత్వమున కెందును దీసిపోవుటలేదు. ఇట్లుండియు దీని
కేలనో ప్రచారము గలుగదయ్యెను. ఈసమయమునకు
పాతికసంవత్సరములు రమారమి మునుముందు గజపతుల
యేలుబడిలో చైతన్యదేవుడు గౌడదేశమునుండి బయలు
దేరి గోదావరీతీరమున కరుదెంచి తన భక్తిసుధ నట
వెల్లువగట్టించెను. ఆభక్తివెల్లువ రాజధానివరకు ప్రాకలే
దనుకొనుటకు వీలు లేదు. ప్రాకియుండుటచేతనే నూతన

* చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందలి అముద్రిత ప్రతి.

మగు నీరాధాప్రస్తావ మాకవిచంద్రుడు వాఙ్మయము లోనికి దీసికొని రాదలంచెను. కాని చైతన్యభక్తిరేఖ లద్దానిలో జొనుపుటకు వెనుకాడెనని తోచుచున్నది.

విజయనగరరాజ్యపతనానంతరము తెలుగు వాఙ్మయలక్ష్మి తంజనగరమునకు బయనమునకట్టినది. తంజాపురాంధ్రనాయకులు తెలుగుభాషాపోషణమునకు దలపూనిరి. వీరు కృతికర్తలును, కృతిభర్తలును నై యాంధ్రభాష నభివృద్ధిజేసిరి. ఈ ప్రభువుల సభలలోనె రాధావాఙ్మయము తెలుగులో నించుక కాలూనగలిగినది. రాధాశబ్దము తెలుఁగునాటిలో శాశ్వతముగా నెలకొల్పిన గౌరవము వీరు చూరగొనిరి. వీరి యాదరణమున రాధికాసాంత్వనము రచింపబడినది. తెలుగుకోడెకాండ్ర కందరకును కలకండవంటిదైన యీగ్రంథమును క్రొత్తగపరిచయముచేయనక్కరయుండదు. తద్గ్రంథకర్త్రి యగు ముద్దుపళని సుప్రసిద్ధురాలు. ఆమె కవనముగూడ చాల ముద్దు గురియుచుండును. కాని ఈ గ్రంథరచనమునం దామె యంతగా శ్రద్ధ వహించినట్లు గానరాదు. ప్రాచీనసంస్కృతవాఙ్మయమునం దాపాత్ర యెట్లు పోషింపబడినది తెలిసికొనుట కామె ప్రయత్నింపలేదు. సాధారణముగా నామెకాలమునాటికి లోకులు చెప్పుకొనుచున్న కొన్ని జనశ్రుతుల నాధారముగా నుంచికొని యామె యీకావ్యము రచింపబూనుకొనెను. అది ప్రబంధమగుటచేత దానిలో తా నుపయోగించికొన్న పాత్రనామములనుగురించి విచారించు టామె కవసరము లేకపోయెనేమొ? ఇక నది శృంగారప్రబంధ మైనపుడు, తన పోషకు డగు రాజు కుల్లాసము కల్పించుట కట్టి కావ్యము వ్రాయుచున్నపుడు పాత్రౌచిత్యవిచారణము మాత్ర మేల అవసరపడియుండును? ఈ కావ్యసృష్టిలో రాధాపాత్రకు సంఘటిల్లిన యధఃపతనము ఇంతింత యని చెప్పరానిది. భావోన్నతి, కల్పనాశక్తి, రసస్ఫూర్తి యున్నంత మాత్రమున దానిని విచ్చలవిడిగా నుపయోగించుట ఎవ్వరు నంగీకరింపరు. సమస్తమానవాదర్శపురుషుడును, భారతాచార్యుడును నగు శ్రీకృష్ణునకు ప్రేమపాత్రురాలగు నాయిక చేయదగిన పనులుగా నందలి వర్ణనలు కన్పింపవనుటకంటె నిచట విస్తరింప నొల్లను. మొత్తముమీద నాకావ్యరచనమునాటి కాంధ్రుల కా పాత్రనుగురించి అంతియే తెలియును. చైతన్యదేవు డాంధ్రమునుండి చిదంబరముగుండ మధురవరకు తన భక్తిసిద్ధాంతమును వెదజల్లుచుబోయినను దానియం దాంధ్రులకు విశ్వాసగౌరవము లుదయింపలేదని దీని వలన తెలియుచున్నది.

దీనికి బిదప నాంధ్రులలో ప్రచారముగల గ్రంథము రాధామాధవసంవాదము. దీనిని వెలిదండ్ల వెంకటపతి రచించెను. ఇతడు క్రీ. శ. ౧ ౦౦ ప్రాంతముల నుండి యుండునని తలపబడుచున్నది. ఈకావ్యము 'ముద్దుపళనికావ్యమునకు మేలుబంతి' యట. అది నిజమే కాదగియున్నది. రాధికాసాంత్వనమున గన్పింపని కొన్ని నూతనాంశము లిందు గలవు. పెండ్లిలేని రాధిక కితడు పెండ్లిచేసినాడు. కాని లోకమునకువలె నాతనికిని నరుని పేరు తెలియదు. సాంత్వనములోని యిళాకళ్యాణమున కిందు రాధాకృష్ణుల ప్రథమానురాగము వర్ణింపబడియున్నది. శుకసందేశము రెండిటియందును గలదు. శ్రీదామునకు బదు లిం దుద్ధవుడు పేర్కొనబడినాడు. రాధాకృష్ణసంవాద ముభయులు కల్పించినను ముద్దుపళని కృష్ణుడు రాధికాపాదములపై బడి పాదాహతిని ధన్యుడై యుండ, పౌరుష మడ్డువచ్చినదిగాబోలు, నితని కృష్ణుడు పాదదాసుడ ననిమాత్రము చెప్ప సాహసించినాడు. సాంత్వనమునందలి రాధ బృందావనమునందె యుండి పోయెనుగాని సంవాదములోని రాధ ద్వారకాపురి కేగి సవతులకు కయ్యమును గల్పించి తాను సవరించి రుక్మిణీ సమానత్వమును గ్రహింపగల్గినది. ఇందులోని మరొక విశేషము- రాధ శ్రీకృష్ణుని బెండ్లియాడినది. ఈగ్రంథమునం దానాటికి రాధాకృష్ణసంబంధమగు దురభిప్రాయముల బారద్రోలుటకు కవి చాల ప్రయత్నించెను. వావి

వరుసల యవసరము, పాతివ్రత్యము వీనియొక్క యుచ్చాటనముకొరకు గవి చూపించిన యుక్తివాదము. దృష్టాంతములు గమనించినచో నేటి కొందరు నవయువకుల సంస్కారదృష్టికి కాతడే మార్గదర్శకు డైనట్లు తెలియగలదు. ఈతడెన్ని గాఢప్రాణాయామములు చేసి, మసిబూసి మారేడుకాయ జేసినను తన కావ్యప్రపంచమున రాధను పతివ్రతను, నీతిబద్ధయగు ప్రియురాలిని కావింపలేకపోయెను. ఏమైనను ఇతడు రాధను కొంతవర కాదర్శ ప్రాయనుగా జేయుటకు ప్రయత్నించెను.

తరువాత రాధామాధవసమాగమము * కన్పించుచున్నది. దీనిని నిశ్శంక వెంకటపతి రచించెను. ఇందలి కథానాయికయగు రాధకూడ నందుని చెల్లెలే. లేకలేక కలిగిన చిన్నికుమారుని యశోద యింటిపనులలో సరిగా జూడదని నందుడు రాధను కృష్ణపోషణమునకు నియోగించెను. ఆమెయు నతని నల్లారుముద్దుగా బెంచి పెద్దవానిని చేసెను. ఇంతలో రాధ బాగుగా వయసువచ్చినదవుటవలన తగిన బంధుపుత్రున కిచ్చి పెండ్లిచేసెను. ఆమె కాపురమున కేగినది. తరువాత క్రమక్రమముగా గృష్ణుని వయసుతోగూడ రాధానురాగము పెరుగజొచ్చినది. ఒకనాడు మనసుపట్టలేక కృష్ణు డొక ముదియవ్వను జీరి రాధకడకు బంపెను. ఆమెయు లోకమునకు జంకుచున్న రాధ, కందులకు తగిన కొన్ని ఐతిహ్యములు చెప్పి యొప్పించెను. ఆడినమాట తప్పక రాధ యమునాతీరమున కరుదెంచి కృష్ణుని స్థిరానుగ్రహమునకు బాత్రురాలయ్యెను. ఇదియును నైతికాదర్శమున బూర్వపుగ్రంథములకు దోడబుట్టువే కాని దీనిలో నొక విచిత్రమగు కథ కలదు.—

శ్రోతలు 'రాధ నేల శ్రీకృష్ణు డిట్లు ప్రేమింపవలసివచ్చె'నని కథకుని ప్రశ్నించిరి. సూతు డిట్లు చెప్పదొడంగెను? " సముద్రమథనకాలమున జన్మించిన దివ్యపదార్థములను ఇంద్రోపేంద్రులు పంచుకొనిరి. విష్ణువు కౌస్తుభమును, లక్ష్మిని రొమ్మున నెక్కించుకొనెను. అపుడు వారితో బుట్టిన యచ్చరకన్నెలలో 'హరిహారిణి' యను నామెను విష్ణువు సేవకురాలినిగా గ్రహించెను. తరువాత నొకనాడు వేసగిలో మందరసానువుల శృంగారక్రీడల దేలుచున్న లక్ష్మీనారాయణులకు 'హరిహారిణి' రాక యభ్యంతరమును గల్గించెను. దీని కిందిర యోపలేక 'నీవు మగనాలవై భూమిం బుట్టు' మని శపించెను. (అది యాకాలమున దేవతలకు విధించు నొక శిక్షగాబోలు.) ఆమెను ప్రార్థించి తన్మూలమున గృష్ణానుగ్రహమును బడయ నాతడు భూలోకమున నేనును నందనందనుడనై జనియింతును గావున నీవును జనింపుమనియు, నచట నాసేవ లభించుననియు నచ్చజెప్పినందున నామె నందుని చెల్లెలై పుట్టి యతని సేవించి యాతని యనుగ్రహమునకు పాత్రురాలయ్యెను." ఇదియే కృష్ణునికి రాధ మేనత్తయగుటకు కన్పించుచున్న గ్రంథాధారము. దీని నెచట కవి సేకరించెనో తెలియరాదు. పిదప పేర్కొనదగినది రాధాకృష్ణవిలాసము.† ఇది కృష్ణదాసు కృష్ణదాసునిచే రచింపబడినది. ఇది గీతగోవిందరసాలంకృతమని గద్యలో జెప్పబడియున్నది.

దీనిలోని కథాసంగ్రహ మిది: "కృష్ణుడు బృందావనము విడచి ద్వారకలో గాపురము పెట్టెను. మరల గోకులము మొగము చూడలేదు. గోపిక లోపికలులేక యుండిరి. వారిలో పెద్దభాగము రాధది. చెలికత్తె నొకర్తును చేరబిలిచి తన యవస్థను చెప్పి కృష్ణుని దోడ్కొనిరమ్మని ద్వారక కంపినది. ఆమె సముద్రమును గూడ దాటి ద్వారక కేగి రుక్మిణీసమేతు డైయున్న కృష్ణుని దర్శించెను. శ్రీకృష్ణుడు గోకులములోనివారందరి క్షేమము లడిగెను. దూతిక క్రమముగా జెప్పుచు రాధను దడవి యామె కష్టములు వెళ్లబోడి రాధ పంపిన

* అముద్రితప్రతి. చెన్నపురి ప్రా. లి. పుస్తకభాండారము.

† అముద్రితము. చెన్నపురి ప్రా. లి. పు. భాం.

హార మొసంగెను. కృష్ణు డది గ్రహించి రాధను మరువ లేదని, భౌతికసౌఖ్యవాంఛల గునుల జేయు నొక దీర్ఘోప న్యాస మొసగి యేకాంతమున నీ కొక వృత్తాంతము జెప్పెదు నని రుక్మిణీమందిరమున కంపెను. రుక్మిణియు దూతిని వెంటదోడికొని మందిరమున కేగి సుఖాసీనం గావించి రాధాకృష్ణుల పూర్వసంబంధము గూర్చి ప్రశ్నిం చెను. ఆమె గీతగోవిందానుసారము వర్ణింపసాగెను." ఇంతటితో గ్రంథ మాగిపోయినది. ఇందును 'పచ్చిశృంగా రపు' తళుకులు లేకపోలేదు. గ్రంథ మసమగ్రమవుటచే నేమియును చెప్పవీలులేదు. కాని యిప్పటికిని రాధా చరిత్రమును గురించిన సంస్కృతవాఙ్మయవాసన లాంధ్రు లకు చేరవచ్చిన వని చెప్పవచ్చును.

గోపీనాథుని వెంకటపతి తెనిగించిన శ్రీకృష్ణజన్మ ఖండము రాధాచరిత్రమున నూతనయుగమును తెలుగు నాటిలో వెలయించినది. అది బ్రహ్మవైవర్తములోని యొక భాగమని చెప్పినచో చైతన్యదేవుని భక్తిసిద్ధాంతము నెడల నాంధ్రులకు గలిగిన గౌరవాదులు తెలిపినట్లే కాగలదు. దానిలో నేటి రాధాతత్త్వపుబునాదు లన్నియు బయల్ఫ వించియున్నవి. ఇందలి రాధ మానవిగాదు; త్రిమూర్తుల కతీతురాలు; సర్వసృష్టిసంచాలిని; సంహారిణి. ఆమె ముగురమ్మల మూలపుటమ్మ; ప్రకృతిస్వరూపిణి; శ్రీ కృష్ణునకుగూడ ధ్యేయురాలు. ఇటు లెంతయో గలదు. ఈ తత్త్వమును విస్పష్టము గావించు కథ లెన్నియో దానిలో గలవు. వాని నన్నింటి బేర్కొనుట కిచట దావులేదు. కాని యొక్కసారి యధఃపతితమై నీచశృం గారరసాలంబ నైయున్న రాధ దీనివలన శక్తిస్వరూపి ణియు, మహాప్రకృతియు నైపోయినది. దీనికి ములుగు పాపయారాధ్యుని దేవీభాగవతము వన్నెదెచ్చినది. కాని

యది యింకను ముద్రింపబడకపోవుటచేత ప్రచారము లోనికి రాలేదు. 'కింకవీంద్రఘటాపంచానను' లీకారత లేకుండ దేవీభాగవతము దెలిగించి ముద్రింపించిరి. దాసు వారి దేవీభాగవతముగూడ ఇచట స్మరింపబడదగినది. వీనివలన రాధాస్వరూపము పూర్వోక్తప్రబంధ స్వరూప మునకన్న భిన్న మని యాంధ్రు లెరుగగలిగిరి. ఈ యెరు కకు చిలకపాటి రామానుజశర్మగారి గోపీకథాకౌముదియు, బ్రహ్మవైవర్తపురాణపు గద్యానువాదమును నుత్తేజము కల్గించినవి. వెంకటపార్వతీశ్వరకవులయొక్కయు, సాహితీ సమితిసభ్యులయొక్కయు, మరికొంద రధునాతనకవుల యొక్కయు ప్రేమగీతములు, వంగభాషానువాదములు విద్యాధికులలో నీనూతనతత్త్వమున కొకరూప మొసంగ జాలినవి. వీనియన్నిటికంటెను జనసామాన్యమునందు రాధ యొక్క ప్రాచీనానౌచిత్యక్షాళనమునకు మిక్కిలి తోడ్పడి నది, పానుగంటివారి పరమార్థరాధాకృష్ణనాటకము. ఈ క్రొత్తవింతలో నేడెన్నియో గ్రంథములు రాధాచరిత్రము నకుసంబంధించినవి ప్రచురింపబడుచున్నవి. అవి యన్నియు నిచట పేర్కొనజాలనందులకు జింతిల్లుచున్నాను. ఇంత వరకు ప్రాచీనకాలమున నాంధ్రులు రాధ నెరుంగరని యు, వా రెరుగగల్గిన రాధ ప్రబంధములలో గన్పించు చున్నదే యనియు కాలక్రమమున సంస్కృతవాఙ్మయ సాహాయ్యముతో రాధయొక్క అధునాతన మూర్తి వారి లక్ష్యమునకు చేరువయ్యెననియు నది సంస్కృతవంగ భాషానువాదములచేతను, వంగీయశిల్పమువలనను ఆంధ్ర వాఙ్మయపరిష్కారములయం దొక నూతనత్వమును వెల యించుచున్న దనియు తెల్పితిని. దీని యాథార్థ్యమును మరొక్కమారు విన్నవించెదను. పాఠకోత్తమా, సెలవు.

# స్వోత్కర్ష

దివాకర్ల వేంకటావధానిగారు

నే నుత్కృష్టకవీంద్రనాయకుఁడ నా నెయ్యమ్ము నార్జింప భూ
జానుల్ పెక్కురు క్రిందుమీఁదులయి ప్రాగ్జన్మాత్మసంపాదితా
న్యూనాఘ మ్మొక హేతువౌటఁ గృతకృత్యు ల్గారు, నా కేమి? సు
శ్రీ నార్జించుతలంపు గల్గినఁగదా చింతింతుఁ దన్నష్టికై.

భూరమణాగ్రసేవ కవిపుంగవలక్షణ మంద్రు పూర్వు లా
దారులు నాకు నచ్చవు, సదా ననుఁ గొల్చుచు నాకవిత్వ సు
శ్రీరమణీయగాత్రియును జెంత వసింపఁ జరించెదన్ గడే
కారియటంచుఁ దిట్టుదురు గాత మెఱుంగని మూఢమానవుల్.

ఆకాలమందు నే లేకపోయితిఁగాని తిక్కన్న తిక్కను దీర్చియుందు
నాకుఁ బ్రశిష్యుఁడైనందున శ్రీనాథు నొక్కింత గంభీరవాక్కు లలమె
నాజన్మమందు నాయనుజన్ముఁడే కానఁ బెద్దన్న సుమశయ్యఁ బేర్చుకొనియె
నాయొక్క స్వేచ్ఛాతినవ్యసూత్రజపమ్ము చేమకూరకు రససిద్ధిఁ గొలిపె
నందతిని మించి లోకు లానందవార్ధి-నోలలాడఁగఁ జేతు, వా రొక్క-రొక్క
రొక్క-విషయమ్మునందె పేరొంది రేనో-సర్వసంపూర్ణసుగుణవిశారదుండ.

నాఁటివారల నెత్తితి మాటవరుస-కంతియేకాని మశకహస్త్యంతరంబు
వారలకు నాకు, భాషలో భావమందు - వేషమునఁగూడ భేదమే విస్తరిల్లు.

ఎగుబుజమ్ముల సేలువ, మొగమునందు - మృగమదపు బొట్టు, దిగ్జయముద్రితములు
కంకణమ్ములు కరములఁ గ్రాలు పూర్వుఁ-డెవఁడు నగ్గని యిపుడు మోమెత్తఁగలఁడు?

నిర్విశేషకమైన నెమ్మోముకాంతులు విశదవిద్యుద్దీపవిధము దోఁపఁ
గనులఁ దాల్చిన సులోచనపు బిళ్లలదాఁక ముంగురు లనయమ్ము మురిసియాడ
పెల్లవేసినరీతిఁ దెల్ల 'యాఘారమ్ము' మోఁకాలిచిప్పల ముట్టుచుండ
ముంజేతిపై నున్న ముగ్ధఘంటానాద మేవేళఁ గవితాజయేచ్ఛఁ దెలుప [దిరుగు
మొగముపైనూఁదుకొనఁగ మబ్బులుగ మార్పు-గనెడు 'సిగరెట్టు'పొగఁ జూచికొనుచుఁ
నన్ను వాణియె ప్రియునిఁగా నెన్నుకొనియె-నితరకాంతలు ప్రేమించు టేమిలెక్క?

నాకవితాస్రవంతి గగనస్థలవీథుల సంచరించు న
స్తోకమహస్సు, తద్రసమధుగ్రహణంబు వచోవధూటికిన్
జేకుఱు డింకఁ గేవలులు నీరసబుద్ధు లెటు ల్గ్రహింత్రు నా
కే కఠినం బొకప్డు పరికించుట దాని మహావిలాసముల్.

పెనగల వేఁపురీతి నతిచిత్రగతిస్ఫురణంబుతోఁ గడున్
గనగనలాడుచుండుఁ బదకల్పన, నాచెవి కింపునింపు దా
నినె గయికొందు వ్యాకరణనిష్ఠురమే యగుఁగాక! భాష యే
యనుసరణంబు సల్పు ననయంబును భావతరంగరాజికిన్.

కాలము నతిక్రమించు లోకైకకృతిని - నా కుషస్సులుగాని సంధ్యాకషాయ
గౌరవముగాని యితరభాగ్యములుగాని - యన్యు లొనరించురీతి వర్ణ్యములుగావు.

ఏడ్చుటయన్న నాకుఁ గడు నింపు ఘటింపుచునుండు, నెందు కే
వేడ్చెదవన్నఁ గారణ మొకింతయు నాయెడ గోచరింప దే
నేడ్చుటకోసమే యిట జనించితి నింతకు నాసమమ్ముగా
నేడ్చెడువారు లేరనుచు నెంచెద నీ భువనత్రయమ్మునన్.

కుక్కలు కూయుమాత్రమునఁ గూలునె జంగము గౌరవంబు, న
వ్యక్కవితావిశేషముల నారయఁజాలక మూఢమానవుల్
పెక్కుగు పెక్కురీతుల వివేకము వీడి విమర్శసేతు రా
శక్కికి నుత్తరం బిడి సవాల్లొనరించుట నాకు సిగ్గగున్.

ఏవిధి నెంత బాగుగ రచించిన కావ్యములైనఁగాని యీ
ర్ష్యావశులౌచు మెచ్చ రవురా సమకాలమువారలంచుఁ బ్ర
జ్ఞావిశదప్రభావుఁడగు సత్కవియౌ భవభూతి నెట్టివాఁ
డై వచియించువాఁడొకో? శిలాక్షర మాతని మాట నేఁటికిన్.

భావము భావ మందు వది ప్రస్తుతకాలమునన్ గవీంద్రుఁ డె
ట్లో వివరించినన్ దుద కయోమయమై కనుపట్టుచుండ రాఁ
బోవు నభాగ్యు లెట్లు రసమున్ గ్రహియించి సుఖింతు రన్నచోఁ
గోవిదుఁ డొక్కఁడున్ గలుగకుండిన నాదియె దోష మంతయున్.

వాంతి నాఁపంగఁజాలని భంగి మనము - వెలి కుబికివచ్చుకవితను నిలుపలేము,
కవి కవిత్వమ్ముఁ జెప్ప లోకమ్ము మెప్ప - లాశగొల్పుటవలనఁ గా దాత్మకొఱకె.

హాయిగఁ బాటపాడికొను నామ్రవితర్దికలందుఁ బంచమ
స్థాయిని గూర్చి లోకము నజస్రము మోదసుధాతరంగడో

లాయితమానసంబుగ వెలార్చి నిదాఘమునందు జీవితా
శాయమె లేనియట్లు నలువంకలఁ జూచు పికమ్ము, లెందుకో!

అజ్ఞానభయదఘోరాంధకారసయోధిఁ దరియింపఁగా నాకుఁ దరణియగుచుఁ
బ్రాక్తనదేశీయపద్ధతు లన్నచో నతిజుగుప్సాభావ మలవరించి
సంఘబంధమ్ము లిచ్ఛామాత్రమునఁ ద్రెంపఁ గలిగిన సాహసబలము నిచ్చి
కలుష మెడల్చి లోకక్షేమ మొనఁగూర్చు క్రొత్తమార్గమ్ములఁ ద్రొక్కఁ జేసి
కడకు న న్నింతవానినిగా నొనర్చినట్టి యాంగ్లభారతీచరణాబ్జములకు
దీప ముంచినయంత నే దినదినమ్ము ముదముతో శీర్షమును వంచి మ్రొక్కుకొందు.

---

# మా దు క వి త

శ్రీరంగం నారాయణబాబు, కాళూరి వేంకటనరసింగరావుగార్లు

ఐక్య నవనీతభావప్రపంచమందు
    చంద్రికను నేను సుధల శశాంకు డతడు
మధురపూర్ణిమాశర్వరి మాదుకవిత.

.........................................

సన్మధురభావజలజంపు సరసి నేను
కళల విరియించు శబ్దభాస్కరు డతండు
మలయుకేకుల వాసన మాదుకవిత.

.........................................

విపులభాషా మనోహర విపినసీమ
కులుకు లేమావిప్రాయంపు గున్న నేను
చవుల విరియింప జేయు మాధవు డతండు
మరగి పాడు వనప్రియ మాదుకవిత.

.........................................

తేరు పసరునిగ్గుల వరిపైరు నేను
తొలకరించెడు నునుమబ్బుతునుక యతడు
మంచిరుచుల కమ్మని పంట మాదుకవిత.

.........................................

మోహములముద్ద, వగుతొలిము ద్దతండు
లలన తడిబుగ్గ సిగ్గు గులాబి నేను
మదిని "జిల్లను" సుఖమెల్ల మాదుకవిత.

.........................................

జానగు "మహాత్మ" వడుకు విన్నాణ మతడు
ఎంతొ మెత్తనౌ వలిపట్టు ఏకు నేను
తీగసాగెడు పూత దేదీప్యమాన
మంజుమోహనసూత్రమ్ము మాదుకవిత.

---

# కవితా పరామర్శము

దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

కవన మల్లుట సుకరంబె గాని శ్రోత్ర
జనముఁ దన్పుట కరము దుష్కరము కవికి
నెచటనే నింత చ్యుతి తోఁచెనేని వారు
గోడుగుడుతురు తమకొంప కూలినట్లు.

పూర్వకవిపద్య మను భ్రాంతిఁ బొగడఁ దొడఁగి
యింతలోనన తత్కర్త నెదుటఁ గాంచి
యాపొగడ్త తెగడ్తసేయంగఁ దివురు
ఖలుఁడు పడుపాటె వానికిఁ గఠినశిక్ష.

ఆర్యకవివాక్కును రసజ్ఞుఁ డనుభవించు
నొనర లాలించి యువతిని యువకుఁడట్లు,
అట్టివాక్కునె తార్కికుం డనుభవించు
నసువు లెడలఁగ నలిపి దయ్యంబువోలె.

ఒకఁడు పదముల సొంపు, వేఱొకరుఁ డర్థ
మరయు, రసికుండు రసమె పద్యమున నరయు,
సాలె వస్త్రము, సెట్టి భూషణము లరయఁ
దరుణియెడ రూపవిభవంబె తరుణుఁ డరయు.

చెవులపండు వొనర్తురు కవులు కలవి
పంచికాసుఖరవముల మించునుడులఁ
దవిలి నొప్పింతు రాత్మమేధాప్రగాఢ
ముసలవిస్మరహతులచే మూర్ఖవితతి.

ఒరుల శ్రుతిపుటముల లక్క కరఁగిపోసి
నట్టి పాపులకే కాక, యక్కటకట
కాకవిసముచ్చరితకర్ణకటుపదంబు
ఆలకించుట యితరుల కేలఁ గలుగు?

శుష్కములు, పూతిగంధముల్, శ్రుతికఠోర
ములును నగు పల్కులను గూర్చ, వెలువరింప
నధమకవి పడు శ్రమ శ్రోత లనుభవించు
నట్టిశ్రమమున నెన్నవయంశ మగునొ?

కాకవితామూకతలన్
గాకవితయె దోష మెట్లనన్ దుఃఖంబున్
మూకత కూరుచు నొకనికె
కాకవిత యనేకదుఃఖకారణము గదా?

పామరాళికిఁ బాండితి వలయునేని
మిగిలిన త్రిషష్టికళలను మెదుపరాదె?
నీదు తప్పేమి సుకవితా, నిన్నె యేఁతు
రింతకును పూర్వవైర మేమేని కలదొ?

బొత్తిగా నీరసంబైన రిత్తకృతికిఁ
బ్రబలయత్నాన నొదవు సారస్యకలన
లంబకుచముల కొఱపు జల్తారురవికె
బిగువునం గల్గు నున్నతివిధము కాదె?

అవియె శాస్త్రంబు లవియె శబ్దార్థములును
వారె గురువులు నయ్యు నవ్వారిగాఁగ
దనరు మార్పులు కవితాపథమ్మునందుఁ
బలుకుల వెలంది చూచు చూపుల కొలంది.

ఒకశబ్దమ? ఒకయర్థమ?
ఒకభావమ? ఒకరసంబ? ఓహో! నీచూ
డికి నెన్నిట నిడవలెనో
యి కవీ, నీపాటు జేనికేనియుఁ గలదా?

[ నీలకంఠదీక్షితుని కృతికిఁ దెలుఁగు ]

# 3. నాటకము

## పీనాసి లేక వెంకటరామయ్య*

కే. కామేశ్వరరావుగారు

### దీనిలోని పాత్రలు

వెంకటరామయ్య
హనుమాయమ్మ—వెంకటరామయ్య భార్య
సీతారామయ్య—హనుమాయమ్మ తమ్ముడు
రంగారావు—వెంకటరామయ్య కొడుకు
నాగన్న—బంట్రోతు
ముసలయ్య—వైజు
దేవతార్చనపుబ్రాహ్మడు, నాయిళ్లు, వైద్యుడు మొదలైనవాళ్లు.

### 1-వ అంకము

#### ఒకటో రంగం

(రాజమండ్రి, వెంకటరామయ్యయిల్లు.)

(మంచంమీద వెంకటరామయ్య వెలికిల పడుక్కుంటాడు. హనుమాయమ్మ మరొక మంచంమీద కూచుంటుంది. రంగారావు నిద్ర పోతూవుంటాడు.)

హను:—ఏమండోయి!

వెంక:—ఊఁ, ఏమిటే?

హను:—మిమ్మల్ని ఒక టడుగుతాగాని కోప్పడక చేస్తానంటారా?

వెంక:—అ దేమిటో చెప్పు మొదట.

హను:—చేస్తానంటే చెప్తా.

వెంక:—చెప్పరాదూ పోనీ మొదట.

హను:—అలాగ కాదు. మీరు 'ఊఁ' అనండి.

వెంక:—ఏడిసేవు. ప్రతిజ్ఞలు కూడాను మన బతుక్కి. ఇంకముందు ప్రమాణాలు, వాగ్దానాలు, ఒట్లు అణాచీటీమీద రాయించడాలు చేయించుకుంటేనేగాని యేపనీ చెయ్యనేచెయ్యవు కామోసు! చూసిచూసి కోర్టుకుకూడా యెక్కిస్తావేమో! వెధవప్రయోజకత్వం.

హను:—అదుగో, మాటకుముందే కసురుతూవుంటే నేను చెప్పేదేమిటి నా మొహం.

వెంక:—నెమ్మదిగా 'చెప్పుబాబూ' -ని అంటే చెప్పేవూ?

హను:—మీ నైజం తెలిసినదాన్ని కాబట్టి మొదట ఊఁ అనిపిస్తే మెత్తపడతారేమో అని అనుకున్నాను. అంత ముద్దుముచ్చట్లు కూడానా! ఎప్పుడూ లేవు ఈజన్మకి.

వెం:—ఇప్పటికైనా చెప్తావా, లేదా? నువ్వు గిజామన్నా సరే, నేనైమొదట మాటయిచ్చాను. ఇస్తేమట్టుకు అన్నట్టు చేస్తానన్నమాటేమిటి?

హను:—అలా అయితే సరి. ఇంక ఊఁ అనిపించినా లేదు, ఆఁ అనిపించినా లేదు. నే నడిగింది మరేం లేదు. మెడలో గౌరుగళ్లీ అరిగిపోయి యెక్కడికక్కడికి రాలిపోతూంది. చెరిపించి నానుగొలుసు చేయిస్తారేమో అని.

వెంక:—ఏమిటే! చెరిపించడమే!

హను:—అరిగిపోయిందికదా పోనీ అని......

వెంక:—నీ కింకా యెప్పుడు బుద్ధొస్తుందో చెప్పు నాకు, తెలియకడుగుతాను. చెరిపించడమే! బాబో! చెరిపించడమే! నువ్వు నిజంగా జ్ఞాన ముండి అడిగినమాటేనా యిది? నిద్రపోవడం లేదుకదా?

హను:—ఆ. నిద్దరే, యేకనిద్దర. కళ్లు విప్పలేకుండా వున్నాను.

వెంక:—మేలుకుని అన్నమాటలే అయితే, సరి యింక నే నేం చెప్పడం......ఆవస్తువు మొదట చేయించినప్పుడే మజూరీ దండగయింది. తరుగు సరే అనుభవించేంకదా. మళ్లీ మరోమారు తరుగు, మజూరీదండగ పెట్టాలనుకుంటున్నావుటే తెలివితక్కువదానా.

---

* ఈ చిన్న నాటకం 1928-వ సం. సెప్టెంబరు నెలలో 'శ్రీ కృష్ణాష్టమీ వ్రత' మనే ప్రహసనానికి పూర్వం రచించబడింది. ఇటీవల దీనిలో చిన్న చిన్న మార్పులు చెయ్యబడ్డాయి.
—కే. కా.

హను:—అది నిన్నా మొన్నా చేయించిన వస్తువా యేమిటి, మళ్లా యెక్కడ మజూరీకి పొయ్యనవడానికి? మా పుట్టింటూరు పెట్టిన వస్తువేకా? మీడబ్బేమీ ఖర్చయిపోలేదు. అరిగిపోయిన వస్తువుని మూలపడేసి వుంచడ మెందుకని చెరిపించి గొలుసు చేయించమన్నాను. ఇంతేనా నే నడిగింది, అంతకంటే మరేమేనా వుందా?

వెంక:—అదిగో, మళ్లా ఆముక్కే అంటావు. చెరిపించడమంటే మళ్లా యెంతమకాకత్తు దండుగో, యెంత తరుగుదండుగో నీకు తెలియకుండా వుంది. ఆమకాకత్తుడబ్బు పెడితే మరొక కాసు వస్తుంది. వింటున్నావా? కంసాలాళ్లకు మకాకత్తులకింద తగలేసుకునేబదులు ఆడబ్బిచ్చి చులాగ్గా ఒకకాసు కొనుక్కుని వుంచుకో కావాలంటే. ఆపైని నీయిష్టం, నే చెప్పవలసిం దేదో చెప్పేసేను.

హను:—ఏమీ డబ్బుదండగ లేకుండానే సంసారం గడుస్తుందా యేమిటి. తిండితింటే దండగ, బట్టకట్టుకుంటే దండగ.

వెంక:—నువ్వెంతకైనా తెగించినదానివి. నీతో యింక వాద మేమిటి? నాదే బుద్ధితక్కువ. ఇంకైనా వూరుకుంటూ...ఇవాళ యినప్పెట్టెపూజ పెంద్రాడే చేసుకున్నాను. వేగిరం పడుక్కుందామంటే నువ్వు పడుకోనిస్తావూ?

హను:—నాకు మొదటే తెలుసిది గొంతెమ్మకోరి కవుతుందని...పోనీ మరోసంగ తడుగుతా, వినండి.

వెంక:—ఈమారు చేతిమురుగులు చెరిపించ మంటావు; అంతేనా అంతకంటే మరేమేనా వుందా? నీతో మాటాడకుండా వూరుకుంటేనే మేలు.

హను:—మళ్లా అలాంటి దే మడగనులెండి. బాగా బుద్ధితెచ్చేరు.

వెంక:—మరేమి టడగాలో వేగిరం అడిగేసెయ్యి, పడుక్కుంటాను.

హను:—మరేం లేదు. పెట్లో కాసు లూరికేపడున్నాయి. ఇప్పుడందరూ కట్లకాసులపేరు చేయించుకుంటున్నారు. నాకు కూడా చేయిస్తారేమో అని.

వెంక:—ఓసి నీబుద్ధి కూలా! మజూరీదండగ లేని కబురు నాకు చెప్పేవుకాదే మొత్తంమీద!

హను:—ఊరికే ఆకాసులు పడున్నాయికదా అని.

వెంక:—నేనూ వూరికే పడున్నాను, ఉద్యోగం సద్యోగం లేకుండా. నన్నూ చెరిపించేసి యేమేనా చేయించుకుంటే చేయించేసుకో, తీరిపోతుంది.

హను:—ఇలాంటి అవాచకా లాడతారనే యేమీ చెప్పకుండా రెండుచేతులా నోరుమూసుకుంటున్నా. నోరు నొక్కుకుని కాలక్షేపం చేస్తున్నా.

వెంక:—ఇదిగో. ఆఖరిమాట నే నొకటి చెప్తా విను. నీ కంతగా నగలముచ్చ టుంటే ఆకాసులన్నీ పేరుగా కట్టుకుని మెళ్లో వేసుకో, ముచ్చట తీరేటట్లూ. అంతేగాని నేనై ఒక్కదమ్మిడీ ఖర్చు పెట్టను.

హను:—సరి. మీ రెంతసేపు చెప్పినా గవ్వల్లాగా, గంటల్లాగా గలగల మోగుతూ అవి మెళ్లో కట్టుకుని తిరగమంటారు. అంతేగా మీరిచ్చే గొప్పసలహా. అది వస్తువా, వాహనమా? ముచ్చట తీరిపోయింది లెండి. ఇన్నాళ్లకి కింక మరెప్పుడూ ఏజన్మకైనా అడగకూడదన్న బుద్ధొచ్చింది. చాలుచాలు, ఎవరేనా వింటే నవ్విపోతారు కూడాను.

వెంక:—నన్ను వేపుకుతినక యింకేనా పడుక్కో, నామీద దయ వుంచి.

హను:—ఈ భూమిమీద పశువులా తిరుగుతూవుంటే సరికాని మనిషిలా తిరుగుతూవుంటే యేదో వొక టడగా లనిపిస్తుంది, అందంకోసమో, చందంకోసమో, ముచ్చటకోసమో, మోజుకోసమో.

వెంక:—అయితే నన్ను చంపుకుతినడం మానవా యేమిటి? ఏదో ఆఖరుమాట చెప్పు.

హను:—నాకోసమని యేమీ అడగను. మహాప్రభో, అడగనుగాక అడగను. బుద్ధొచ్చింది, అడగను మరి.

వెంక:—అయితే పడుక్కో పోయి.

హను:—......

వెంక:—......

హను:—పిల్లాణ్ణి మా స్తే నామట్టుకు నాకే సిగ్గేస్తూంది, మీ కెలాగుందో కాని. మొల కొక్క గోగతాడేనా చేయించి పెడుదురూ. అదేనా చూసి సంతోషిస్తాను.

వెంక:—ఇవాళ నీ కేదో శనిగ్రహం పట్టింది అదే వస్తువులు చేయించు చేయించు చేయించుఅంటూంది. ఇది నీకు పుట్టినబుద్ధి కాదు. నే నిక్క డుండను. వీధిలోకి పోయి పడుక్కుంటా. (లేచి తనలో) ఇంతచీకట్లో అవతలికి వెళ్లడమే!

హను:—అయ్యో రాతా! (వెంకట్రామయ్యచెయ్యి పట్టుకుని) ఇదికూడానా, అపరదెష్ట. పడుకోండి. మరి మాటాడను.

ముచ్చట్లన్నీ పెళ్లినాడే తీరిపోయేయి. ఇంక మీతో పల్లెత్తు మాటంటే అడగండి. ఒట్టు. సరా యింక?

వెంక —అలా గేదో చెప్పి నన్ను బతకనియ్యి. అబ్బబ్బ! ఊళ్లో ఏఆడదానికీ లేని యీ వస్తువులదయ్యం నీకుమాత్రం యెందుకు పట్టాలి?

హను:—నే నింక జవాబు చెప్పనన్నాగా. మీ రెన్నను కున్నా సరే. ససేమిరా జవాబుచెప్పను. అన్యాయపు మాటలంటే యెవళ్లనుభవం వాళ్లది అని వూరుకుంటా. మీలాంటివాళ్ల దగ్గిరుంటే జీవాలన్నీ కుంగిపోయి బతుకే భారమనిపిస్తుంది. మనస్సుకు సంతోషంలేని బతుకు బతి కేమిలాభం? (పడుక్కుని) మెలకువకంటే నిద్రే సుఖం.

వెంక:—......

హను:—......

వెంక:—(లేచి) ఏమేవ్!

హను:—(పలకదు.)

వెంక:—ఇదిగో! ఏమేవ్!

హను:—ఎందుకూ వూరికేను?

వెంక:—వంటింటి తలుపు బాగా వేసేవో లేదో, నేను వెళ్లి చూసి రావా లేమిటి?

హను:—బాగా వెయ్యక మ రెలా వేస్తానూ?

వెంక:—దక్షిణంవైపు తాళం బాగా పడిందా?

హను:—ఊఁ.

వెంక:—చూసిరా అక్కర్లేదుకదా?

హను:—ఊఁ, ఊఁ.

వెంక:—అయినా నీకు చెప్పేకంటే వెళ్లి చేసుకుంటేనే మెరుగు. (వెళుతున్నాడు.)

హను:—(లేచి) మీ కంతనమ్మకం లేకపోతే నే నేం చెయ్యగలను? నే వెయ్యడంమట్టుకు వేసేను

వెంక:—అయినా చూసొస్తే మంచిదిగా.

హను:—ఏదొచ్చినా అతేగాని మితిలే దీమనిషికి. మూకేగాని సంసారపుగొడవ నా కక్కర్లేదనుకున్నా రేమిటి?

వెంక:—నిన్ను లెమ్మన్నానా యేమేనేనా? నువ్వు పడుక్కో, పోయి నేను వెళ్లి చూసొస్తాను.

హను:—మీ రలా తిరుగుతే సుఖంగాక మరేమిటి? ఎక్కడేనా సుఖపడే పంతుంటేగా. అతిజాగర్త, అతివాదస్తం.

(వెంకటరామయ్య లాంతరుపట్టుకు వెళతాడు. అతనివెంట హనుమాయమ్మ వెళుతుంది.)

వెంక:—(లాంతరు పట్టుకువెళ్లి తలుపులు, కిటికీలు చూస్తూ) దక్షిణంవైపు తాళం గట్టిగానే వేసింది. (మరోతలుపుదగ్గిర) ఇదికూడా తిన్నగానే వేసివుంది. (కిటికీదగ్గిర) ఇది తెరిచివుంటే ప్రమాదం. అమ్మబాబో! ఇంటి గుట్టంతా వొక్కక్షణంలో తెలిసిపోదూ. కొంప తవ్వేసుకోడ మన్నమాట. (కిటికీ రెక్కలు వెయ్యును) నాలుగు మూలలాకూడా వొకమారు చూసేస్తేనే మంచిది. (మంచాలకిందా, పెట్టెలపక్కనీ వెతుకుతూ, కిందా పైనీ చూసి) ఈ యింటికి అటక లేదు కాబట్టి సరిపోయింది. లేకపోతే బహుప్రమాదం. ఇంక పోయి పడుక్కుంటా. (వెనక్కి చూసి) నువ్వుకూడా లేచి వచ్చేవూ? (పడుక్కుంటాడు.)

హను:—మీ జాగర్తకీ, నాజాగర్తకీ భేదం చూద్దామని. (పడుక్కుంటుంది)

వెంక:—...............

హను:—...............

వెంక:—(పడుక్కుని లేచి) ఇనప్పెట్టెతాళం మాడడం మరిచిపోయేను. (చూసివచ్చి) గట్టిగానే వేసే. (పడుక్కుని) ఇంత జాగ్రత్తపడ్డాకూడా నమ్మడానికి వీలులేదు. మళ్లా రాత్రి మూడునాలుగుమార్లు లేచి చూస్తూవుండడంబట్టి తినడానికింత కూడు వుంటూంది. లేకపోతే వొక్కరాత్రిలో—ఎందుకూ అనుకోడం అంతమాట.

హను:—ఇంకా పడుకోరూ?

(తెర వాలును)

రెండో రంగం

(పొద్దున్న, అదేయిల్లు.)

(హనుమాయమ్మ స్నానంచేసి తడిగుడ్డలతో వచ్చి పొయ్యి రాజేస్తుంది.)

హను:—ఇహ యిప్పుడు కర్రలకోసం వెతుకులాడి చావాలి. కావలసిన కూరేనా యింతవరకూ తెప్పించేరా యేమేనా, అదేం ప్రాలుబ్ధమోకాని. (జుత్తు దులుపుకుంటూ) ఒరే రంగా! (లోపల) అమ్మా, వస్తున్నానే.

మొదట అన్నానికి యెసరు తగలెట్టి తరువాత మాట చూస్తాను.

(వారపు బండీకి తాడుకట్టి లాగుతూ, రెండో చేత్తో కర్రపుల్ల పట్టుకొని రంగారావు వస్తాడు.)

బాబూ, రంగా, నాన్నతో చెప్పనాయనా, మరేమో అమ్మ కూరలు తెప్పించమం దని. వేగిరం వెళ్లి చెప్పనూ.

రంగా:—ఊఁ. (వెళతాడు)

హను:—ఎంత శాంతంగా వూరుకుందామన్నా వూరుకోపడదు కదా—పోని ఆయన్నెందుకు రవ్వపెట్టడమని. మొగాళ్లుకూడా ఆడదాని సుఖం కొంతచూడాలి. (పొయ్యి వూదుతూ) ఇవో పచ్చిమొద్దులు. ఎంతకని యేడవడం. మళ్లా మాస్తే బుడ్డెను కిరసినాయిలు వీటి మొహాన్ని పోసేను. వెలగందే! ఇదంతా లాభమే! గోదావరిలో కొట్టుకొచ్చిన మొద్దులు చవగ్గా యిచ్చేసేరు. తెచ్చి పడేసేరు, అదేం తెలివితేటలో కాని. (పొయ్యి వూదును) ఎప్పుడూకూడా పీనాసితనమున్న మనుష్యులు తాము సుఖపడరు, ఒకళ్లని సుఖపడనియ్యరు.

(వెంకటరామయ్య వస్తాడు.)

వెంక:—ఏమిటే, అప్పుడే యేదో గొణుక్కుంటున్నావు?

హను:—ఏమిటని చెప్పనూ? మీ ధర్మాన్ని తెచ్చిపడేసేరు, పచ్చి మొద్దులు. ఎంతవూది చచ్చినా పొయ్యిలోంచి నీరు కారుతుందికాని నిప్పు పుట్టదు. (వూదును.)

వెంక:—అన్నిటికీ విసుక్కుంటే యెలాగే? ఇంత చవగ్గా మరో అప్పుడొస్తాయేమిటి?

హను:—ఎలా వస్తాయి! మీవంటి తెలివితేటలున్నవాళ్లుంటేనా! ఇలాంటివి పచ్చిమొద్దులు కదా! నీటిలో వేస్తే మునుగుతాయికాని తేలవుకదా! ఇలాంటివి ఆడవాళ్లు బతకాలన్నా ళ్లెవళ్లేనా తెచ్చుకుంటారా, పోనీ చెప్పండి?

వెంక:—ఏదో యీపూటకు కానీ. వాటి నన్నిటిని నాగన్న చేత యెండలో పడేయిస్తా.

హను:—ఎండలో కాకపోతే నీటిలో వేయించండి. మిమ్మల్ని యిక్కడికి పిలిచింది యేమేనా కూరలు తెప్పించిపెట్టం డని.

వెంక:—ఏంకూరలు తెప్పించమన్నావు? ఇంట్లో యిన్ని వుంటూ వుంటే!

హను:—ఏంకూరలు కొనితెచ్చి పడేసేరని అలా అంటున్నారు?

వెంక:—కొని తెస్తేనే వున్నట్టు, లేకపోతే మరి లేనట్టూ నేమిటి?

హను:—ఇన్ని మాట లెందుకు? పోనీ ఫలానాకూర వండమని చెబుదురూ. నాకు చాలు. అనుభవించేవారు మీరు. కూర వుంటే తింటారు, లేకపోతే మానుకుంటారు.

వెంక:—పెరట్లో తోటకూర లేదా, బచ్చలికూర లేదా—?

హను:—వీటితోనేనా యింట్లో కూరలని వేగిపోయేరు? ఈవెధవకూర లెన్నాళ్లని తినగలరు? పొద్దున్నా అదే, సాయింత్రం అదే. తినితిని జిహ్వ చచ్చి పోయింది.

వెంక:—ఇవాళమట్టుకి కేదో యింత వండి పడెయ్యి. సాయింత్రాని కేదోకూర తెప్పిస్తా.

హను:—తెప్పించండి మానుకోండి. అధికంగా ఖర్చుపెట్టేస్తే విచారించాలికాని, బతకడానికి కావలసిన ఖర్చేనా పెట్టుకోకపోతే యెలాగ?

వెంక:—పొదుపు జాగ్రత్త అంటే నీ కేం తెలుసు నీమొహానికి?

హను:—మీజాగర్త నెవళ్లూ పొదు పనరు, పీనాసితన మంటారుకాని. ఇంతకీ వాకెందుకు లెండి. మీరే యెలాగో దేవుళ్లాడుతారు.

వెంక:—సాయింత్రాని కేదేనా కూర తెప్పిస్తా నన్నాగా.

హను:—నాగన్న నేనా పంపించండి, లేదా మీరేనా బగ్గీమీద వెళ్లి పట్టుకురండి. ఎలాగో వోలాగ వొయ్యకపోతే యింక బతికే దారి కనబడదు.......వెళ్లండి మరి. వెళ్లి యేదో ముందు ప్రయత్నం చెయ్యండి.

వెంక: —ఇదిగో! వెళుతున్నాగా. (వెళ్లును).

హను:—ఎంత మితంగా మాట్లాడదామన్నా సాధ్యమైతేగా. నా వోర్పు, నెమ్మది యెందుకూ పనికిరాకుండా వున్నాయి. రంగా! అబ్బాయి!

[లోపల] వస్తున్నానే.

( రంగారావు వస్తాడు )

రంగా:—ఎందుకే అమ్మా?

హను:—బాబూ! నాన్నకు మరు పెక్కువగాని, మరోమారు చెప్పిరా అమ్మా, కూరలు తెప్పించమని.

రంగా: —ఊఁ. (వెళ్లును)

హను:—(ఎసట్లో బియ్యం పోస్తూ) శివభవ విఘ్నేశ్వరుడా, వినాయకుడా, గణాధిపతీ స్వామీ, సాయపడు. అగ్నిహోత్రుడా, తండ్రీ, సాయపడు. చప్పున కావాలి. (అని నాలుగు బియ్యపు గింజలు పొయ్యిలో వేస్తుంది.)

( తెర వాలును )

మూడో రంగం

(అదేయిల్లు, పొద్దున్న.)

(వెంకటరామయ్య కుర్చీమీద కూచుంటాడు. రంగారావు వస్తాడు.)

రంగా:—నాన్నా! అమ్మేమోనే, మరేమోనే, బజారి కెవళ్లనేనా పంపించమంది.

వెంక:—(తనలో) అదన్నమాటేగాని మరోమాట లేదింక. తలుచుకుందంటే చెవులు తడికెలు కట్టేటట్లా చెప్పి చేయించుకుంటుంది....నాగన్నా!

(లోపల) వస్తున్నానండి బాబూ.

(నాగన్న వస్తాడు)

వెంక:—ఒరే నాగన్నా!

నాగ:—బాబూ!

వెంక:—నువ్వు మరేమో బజారి కెళ్లి యిదిగో యీ బేడ తీసికెళ్లి చవగ్గా వున్న కూరలు మూడునాలుగు తీసుకురా. వెళ్లు మరి.

నాగ:—చిత్తమండి. (వెళుతూ వెనక్కి తిరిగివచ్చి) బాబుగారండీ, మరి యేమేం కొనుక్కురమ్మన్నారో సెలవిస్తారా.

వెంక:—నీమొహంలా గుంది! నన్నడిగితే యేలాగు? బజారు కెళుతూన్నవాడివి నువ్వా, నేనా? అక్కడేమేం కూర లున్నాయో చూసి చవగ్గా బేరంచేసి యేవో మూడునాలుగు కూరలు తీసుకురా, చాలు. వెళ్లు.

నాగ:—అదికాదండి, చిత్తమండి. (చిక్కంపట్టుకుని వెళుతున్నాడు.)

(ఒక ముసలిబిచ్చగాడు వీధివాకిటిలోకి వస్తాడు.)

బిచ్చ:—మారాజా! కాస్త బిచ్చ మేయించండి బాబూ! మారాజా!

వెంక:—(లేచివెళ్లి) నీ కేం బుద్ధిలేదూ. అంత గట్టిగా అరుస్తావు. ఎటూకానివేళ యిప్పుడు బియ్య మెయ్యమంటావు. నువ్విక్కడేం మూట దాచిపెట్టే వేసేవ, బియ్యం మైపోయేయి. పో, పో.

బిచ్చ:—బాబూ, ముసిలాడినండి, బాబయ్యా. చలికిచచ్చిపోతున్నానండి బాబూ. మీపాదాలకి దండాలండి నాయనా. రెండు బియ్యపుగింజ లేయించండి పెబువులూ!

వెంక.—ఇంకా కేక లేస్తావు. నీ కేం బుద్ధిలేదూ? తేరగా యెవడు పెడతా డనుకున్నావు? బియ్యం మైపోయేయి. ఏమేనా కూలీనాలీ చేసుకో, పో.

బిచ్చ:—ఓపిక లేదండి బాబయ్యా. ముసిలాడినండి బాబయ్యా. మీపాదాలకి దండాలండి, మారాజా.

వెంక:—ఇంకా వెళ్లేవా లేదా? ఒరే నాగన్నా! (తనలో) ఇప్పుడే కాదూ వాణ్ణి బజారుకి పంపేను.

బిచ్చ:—(తనలో) ఈమారాజు కొట్టేమారాజుకాని పెట్టేమారాజు కాడు. (పైకి) సెలవు బాబయ్యా, తండ్రీ. (వెళుతున్నాడు.)

(వెంకటరామయ్య యథాప్రకారంగా కూచుంటాడు. ఒక విద్యార్థి వస్తాడు.)

వి:—అయ్యా!

వెంక:—ఎవరు వారు?

వి:—నేనండి. ఒక విద్యార్థిని. బీదవాడినండయ్యా.

వెంక:—ఏం వచ్చేవు?

వి:—ఇక్కడే వీరేశలింగంస్కూలులో నాలుగోఫారం చదువుకుంటున్నానండి. ఏదో వారాలు చేసుకు బతుకుతున్నానండయ్యా. జీతం కట్టడాని కందరినీ అడుక్కొస్తున్నానండి.

వెంక:—అయితే యేమంటావు?

వి:—తమ రేదేనా తమకు తోచిం దిస్తే తమపే రందరితోను చెప్పుకుంటానండయ్యా.

వెంక:—అయితే?

వి:—ఏమేనా జీతంకోసం తమరిని సహాయం చెయ్యమని అడుగుతున్నానండి అయ్యా.

వెంక:—ఏమిటి! డబ్బిమ్మంటావా?

వి:—ఏదో పావలో, బేడో తమకు తోచింది ఇప్పిస్తే జీతం కట్టుకుంటానండి బాబూ!

వెంక:—ఇప్పుడు నాదగ్గిర చిల్లర లేదు. వెళ్లిపో.

వి:—మీకు తోచిం దిప్పించండయ్యా!

వెంక:—నాదగ్గిర చిల్లరంటూ వుండదు. కావలిస్తే వొక పిడికెడు బియ్యం పట్టుకువెళ్లు.

వి:—తమరి కటాక్షం. నన్నేం చెప్పమన్నారండి.

వెంక:—నీకు వీలైతే అలా చెయ్యి. లేకపోతే వెళిపో.

వి:—సెలవు పుచ్చుకుంటానండి. తమ దయ.

వెంక:—వెళ్లయితే.

(విద్యార్థి వెళిపోతాడు)

(తనలో) అబ్బబ్బ! ప్రాణాలు పోతున్నాయి. తెల్లవారి లేచిందిమొదలు మళ్లా పడుక్కునేవరకూ యెవడు మాట్లాడినా డబ్బిమ్మనేకాని, డబ్బిస్తాను పుచ్చుకో అన డదేంఖర్మమోకాని. తెల్లారడమంటూ లేకుండా యెప్పుడూ రాత్రయివుంటేనే బాగుండును. మరి—రాత్రి దొంగలభయం బాబోయ్! ఇ దుత్త పాపిష్ఠి ప్రపంచకం. ఛీ ఛీ!

(నాన్నా! నాన్నా! అంటూ రంగారావు వస్తాడు)

రంగా:—నాన్నా!

వెంక:—ఓయ్!

రంగా:—నాన్నా! మన పక్కింటావి డేమోనే ఒకపావలా వుంటే బదులిమ్మని అమ్మదగ్గిర కొచ్చింది. మరేమో అమ్మ నిన్నడిగి తెమ్మంది నాన్నా, ఇయ్యి.

వెంక:—(తనలో) ఇదెక్కడి గోలరా నాయనా! ఒకటి వదిలితే వొకటి. ఇప్పు డొకవేళ బదులిస్తే మళ్లీ వాళ్లు తిరి గిస్తారా. అది వుత్తమాట. వాళ్లకేను పాత బాకీ అయిపోయి కాలదోషం పడుతుంది, నాకేమో యిప్పుడిప్పుడే అప్పిచ్చిన ట్లుంటుంది. ఇంతకీ మాయింటిదానిసంగతి తెలిసేవుంది. ఇంట్లో లేవని పొమ్మనపద్దూ...ఇవ్వనంటే బాగుండదు. ఇలా చెప్తా. (పైకి) రంగా, వెళ్లి అమ్మతో 'నాన్నదగ్గిర చిల్లర లేదుట' అని చెప్పు, పో.

రంగా:—ఊఁ. (వెళతాడు)

వెంక:—(తనలో) ఇంకముం దిలాగే చెప్పి వదుల్చుకుంటూ వుంటాను. ఇంకా పీడిస్తే చేతిలో పైసేనా లేదని అనేస్తాను.

(ఒక యాయవారపు బ్రాహ్మడు తాటాకుగొడుగు వేసుకుని తలమీద తడిగావంచా పెట్టుకుని, తడుపుపంచ కట్టుకుని, వొక గావంచా నడుముకి బిగించుకుని వస్తాడు. అతని యెడమచేతిలో రెండు వంకాయిలు, వొక పొట్లకాయి వుంటుంది. కుడిచేతిలో చెంబు. ఎడమచేతి చంకకింద పంచాంగంకట్ట. కుడిభుజంమీద అటుయిటు వేలాడుతూ మూడు బియ్యపుమూట లుంటాయి. ఇంట్లోకి వచ్చి చెంబు నేలమీద పెట్టి గొడుగు కింద పెడతాడు.)

యాయ:—సీతారామాభ్యాం నమః. అమ్మా యివాళ తదియా శుక్రవారమండి. పగలు పదింటికి విదియ మిగులు వదులుతుందండి. పగలేగాని రాత్రి వర్జాలు లేవండి.

(వెంకటరామయ్య బియ్యం వేస్తాడు. యాయవారపు బ్రాహ్మడు వెళతాడు. ఒక ముష్టిది వస్తుంది.)

ము:—అయ్యా! ఇంతధర్మం పెట్టించండి బాబూ! ధర్మతండ్రు లండి నాయనా. దిక్కులేని పచ్చిని తండ్రీ. రెండురాత్రుల నుంచి పిల్లలికి, నాకూ వణ్ణం లేదండి బాబూ.

వెంక:—వెళిపో.

ము:—నాయనా, నా పెనిమిటి, పిల్లలు, నేను కరగపురం వుద్యోగాని కెళ్లేమండి బాబూ! అక్కడ నా పెనిమిటి కలరావచ్చి కాలం చేసేడు తండ్రీ. తిరిగి మావూరు నెల్లూ రెళిపోతున్నామండి, తండ్రీ. పిల్లలికీ, నాకూ రెండురోజులనుంచి తిండి లేదండి మారాజా!

వెంక:—వెళ్లమని చెప్తే నీకుకాదూ?

ము:—ఇంత అన్నముంటే పెట్టించండి బాబూ!

వెంక:—వెళిపోతావా గెంటించెయ్య మన్నావా?

ము:—మారాజులు పెట్టనిబాబులు! (వెళిపోతుంది)

(నాగన్న వస్తాడు.)

వెంక:—నాగన్నా, కూరలు తెచ్చేవూ?

నాగ:—తెచ్చేను బాబూ!

వెంక:—ఏమేమిటి తెచ్చేవో, చెప్పు.

నాగ:—ఇయిగోనండి బాబూ! (కూరలు చిక్కంలోంచి వంచుతున్నాడు.)

వెంక:—నాగన్నా! వాటి నలాగుంచి వెళ్లి ఆ అరమారులో వున్న తూనికరాళ్లూ, తక్కెడా పట్టుకురా.

నాగ:—చిత్తమండి బాబూ! (వెళ్లి, తెస్తాడు.)

వెంక:—దేని కెంతెంత డబ్బు ఖర్చుపెట్టేవో చెప్పు.

నాగ:—మరేమోనండి, ఈ అనపకాయండి, మూడు కాన్లండి.

వెంక:—అర్ధణా కడగలేక పోయేవుట్రా. బేరంచేసి కూరలు తెమ్మని చెప్పలేదూ. చెప్పకపోడం నాదే బుద్ధితక్కువ.

నాగ:—మరేమోనండి, ఎన్నిమా ర్లడిగినా అర్ధణా కియ్యనన్నాడండి. ఆఖరికి కాళ్లట్టుకున్నా సరే యియ్యనన్నాడండి.

వెంక:—ఊఁ ఊఁ. తర్వాత.

నాగ:—మరి యింకానండి. ఒకపలం పచ్చిమిరపకాయలు తెచ్చేనండి. అర్ధణా పుచ్చుకున్నాడండి.

వెంక:—అప్పిడే ధర జాస్తి అయిపోయేయిరా. ఇవి వాడిపోయేయేమిట్రా.

నాగ:—లేదండి బాబూ, పై కలా గుంటాయి. కాని కోరికితే నసాళాని కంటిపోద్దండి. అలాంటి కాయలండి.

వెంక:—సరేలే. సరిగ్గా వున్నాయో లేదో తూచు. (నాగన్న తూచుతాడు. సరిగ్గానే వున్నాయి) తర్వాత ?

నాగ:—తరువాత వంకాయిలంగడివగ్గిరి కెళ్లేనండి. అక్కడ రెండురకాలుంటే చవగ్గా వున్నాయని యీరకం తెచ్చేనండి.

వెంక:—తూచు చూద్దాం. చిల్ల రేమేనా మిగిలిందేమో మొదట చెప్పు. ఏదీ లెక్కచెప్పు.

నాగ:—(లోపల లెక్కపెట్టుకుని) మూడణాలు ఖర్చయిపోయేయండి.

వెంక:—మూడణా లెక్కడిపిరా ?

నాగ:—కాదు బాబూ, ఆనపకాయి మూడుకాన్లండి, పచ్చిమిరపకాయి లద్దణాఅండి, వంకాయ అద్దణాఅండి. ఎంతయిందండి బాబూ?

వెంక:—కానీ మిగిలింది. ఇత్తూగానిలే. మొదట తూచు. (నాగన్న తూస్తాడు. అరవీసెడు కొంచెం తక్కువవస్తాయి) తక్కువ తూపింమకొచ్చేవేంరా పశువా ?

నాగ:—మంచిరకం కాయ లంతకంటే మొగ్గగా తూయనన్నాడండి. కాయ యేలాంటిదో సూడండి బాబూ. (ఒకకాయ అందిస్తాడు.)

వెంక:—(చూసి) పుచ్చుకాయ తెచ్చేవేమిరా వెధవా ?

నాగ:—ఈకాయ చూడండి బాబూ. (ఇంకొకకాయ అందిస్తాడు.)

వెంక:—(చూసి) ఇదీ పుచ్చుకాయేరా వెధవా? అన్నీ పుచ్చుకాయలే తెచ్చేవేమిటిరా వెధవా?

నాగ:—లేదండి బాబూ. మంచియేనండి.

వెంక:—ఓరి నిర్భాగ్యపు వెధవా! అన్నీ పుచ్చుకాయలే తెచ్చేవురా! నీతెలివి తేటలు తగలెయ్యా!

నాగ:—లేదండి బాబూ.

వెంక:—ఛీ! వెధవా! లేదంటావు, అన్నీ పుచ్చుకాయలే తెచ్చి.

నాగ:—అంచేతే చవగ్గా యిచ్చేస్తా నన్నాడండి. మంచియైతే యివ్వనన్నాడండి.

వెంక:—వెధవా, మళ్లీ తిన్నగా వెనక్కి వెళ్లి యీకాయ లిచ్చేసి మంచికాయలలాగ యిస్తానంటే పట్టుకురా, లేకపోతే మూడు కాన్లు అడిగి పుచ్చేసుకుని వెళిపో రా. తెలిసిందా ?

నాగ:—తెలిసింది బాబూ. వెళ్లి, నన్నెందుకు దగాచేసేడో అడిగి దెబ్బలాడతా బాబూ. (కాయలు చిక్కంలోకి యెత్తుతున్నాడు.)

వెంక:—దెబ్బలాడితే డబ్బు లియ్యడేమో, మెల్లిగా అడుగు.

నాగ:—అలాగే ఆడి పని సెప్తానండి బాబూ. (పోతున్నాడు)

వెంక:—ఇదిగో, బియ్యం బాగుచెయ్యాలి వేగిరం రా.

నాగ:—చిత్తం బాబు (వెళతాడు)

(నాన్నా ! నాన్నా ! అంటూ రంగారావు వస్తాడు)

రంగా:—అమ్మ నిన్ను మడికట్టుకుని అన్నానికి రమ్మంది. వేగిరం రా నాన్నా, అన్నం తిందాం.

వెంక:—దేవతార్చనపు బ్రాహ్మడొచ్చి దేవతార్చన చేసివెళ్లేడా?

రంగా:—అప్పిడే వచ్చి వెళిపోయేడు. వేగిరం కట్టుకో నాన్నా, తిందాం.

వెంక:—పద వస్తున్నా. (తనలో) డబ్బే యీ ప్రపంచకం, యీ ప్రపంచకమే డబ్బు. చివరి కొక్కదమ్మిడీ అయినా సరే చెయ్యి జారిందంటే మరి వెనక్కి తిరిగి రాదుకదా, శివ! శివ! అప్పటికీ యెంతో జాగ్రత్తగానే వుంటాను (పోవును)

## మూడో రంగం

(అదే యిల్లు)

(వెంకటరామయ్య, రంగరావు విస్తళ్లదగ్గిర కూచుంటారు. హనుమాయమ్మ వడ్డిస్తుంది.)

హను:—ఆచింతలపాత్తు పంచ యెన్నిమడత లేస్తూ యెన్నిరకాలగా కడితేమట్టుగు వొళ్లు కనబడకుండా వుంటుంది? అడుగడుక్కి చింకేకదా. పోనీ కొత్తది కొనుక్కోమంటే యిదిగో అదిగో అంటారు.

వెంక:—నాకు తెలియక అడుగుతాగాని క్రొత్తదిమట్టుకు చిరిగిపోకుండా వుంటుందేమిటి?

హను:—ఎప్పటికీ చిరిగిపోకపోతుందేమిటి?

వెంక:—ఆమాత్రానికి కొత్త దెందుకు కొనుక్కోమంటావు. నీకు కొంచెమైనా తెలివుందా ?

హను:—నాకు తెలివి, తేటా యేలాగా లేవులెండి, మరెవళ్లేనా పెద్ద మనుష్యులు భోజనానికి వస్తే యేలాగ చెప్పండి.

వెంక:—వచ్చినప్పటి మాటకదా.

హను:—పోనీ వచ్చేరే అనుకోండి.

వెంక:—ఇవన్నూకు పెట్లో పడేసి ఆరవేయుంచిన మడిపంచ కట్టుకుంటా.

హను:—మీ వుపాయాలూ, మీ గణాలూ మీకే నచ్చాలి గాని మరెవరికీ నచ్చవు.

వెంక:—అలాగ తెలివి తెచ్చుకుంటే బాగానే వుంది.

హను: —(వడ్డిస్తూ) రాత్రికి కూరలు తెప్పిస్తానన్నారు, తెప్పించేరా?

వెంక:— ఓ! నీకు కావలసినన్ని కూరలు తెప్పించి పడవేయించేను. ఇంకా మళ్లా వారంరోజులవరకూ కూరలమాట యెత్తవద్దు. చాలాప్రియంగా వున్నాయి బజారులో. ఏమేం తెచ్చేడో తర్వాత చూడు కావాలంటే.

హను:—అలాగయితే సరేలెండి. (వడ్డిస్తుంది) ఇవాళమట్టుకు మళ్లా ఆతోటకూరే వండేను, మరోప న్నాగం పన్ని.

వెంక:—ఒకటి రెండు, రెండొకటి చెయ్యమని శాస్త్రమే చెబుతూ వుంటే.

హను:—......

వెంక:—......

హను:—మొన్న మాచెల్లెలిదగ్గరనుంచి వచ్చిన వుత్తరం చదివేరా?

వెంక:—చదివేను.

హను:—ఆవూళ్లో వున్న మూడోఫారంవరకూ చదివేడుట. పైచదువు మనవూళ్లో వుంచి చెప్పించగలవా అని అడుగుతూ రాసింది.

వెంక:—ఆవుత్తరానికి నే నప్పుడే జవాబు రాసేసేను. ఇక్కడ మన వూళ్లో చదువు అట్టే బాగుండదనీ, మంచిమంచి టీచర్లు లేరనీ, యీస్కూ ల్లుత్తదగా చేస్తున్నాయనీ రాసేసేను.

హను:—(బుగ్గలు నొక్కుకుని) జవాబుకూడా రాసేసేరా, వీలు లేదని? పోనీ వున్నవిధంగానే చదువుకుంటాడు, రమ్మన లేకపోయేరూ? మనతోపాటు యింట్లో పడుండును, కుర్రాడు.

వెంక:—ఒకవేళ వాణ్ణి రప్పిస్తే యేమేం ఖర్చులౌతాయో ఆలోచించేవూ? వాడి జీతాలకి, వాడి పుస్తకాలకి, వాడి తిండికి, వాడి మందుకి యింకా మనకు తెలియని ఖర్చు లెన్ని వున్నాయో!

హను:—మీకే యిరస్తాపరస్తా యెవ్వరూ లేరు. పోనీ మీకే యేమో చదువుకొనే పిల్లలున్నారు, వాడికికూడా చదువు కెక్కడ పెట్టడం అనడానికేనా యీనాటి కొక్క వెధవపుట్టేడు, మీకు యేభైయేళ్లు, నాకు ముప్ఫైయేళ్లు వచ్చేక. వీడు పెరిగి పెద్దయే దెప్పుడు? వీడిచదువుకి మీరు ఖర్చుపెట్టే దెప్పుడు?

వెంక:—నువ్వలా తెలివిలేకుండా మాట్లాడకు. నాకు తలనొప్పి వస్తుంది. వాళ్లకీ వీళ్లకీ డబ్బు ఖర్చుపెట్టేస్తూ వుంటే మన సంసార మెలాగా నెగ్గడం? మన పిల్లాడికి నాలుగుపైసలేనా మిగల్చాలా?

హను:—మీదరిద్ర మెప్పుడూ యిలాగే వుంది. ఆతంత్రికేగా కొడుకు మీరు!

వెంక:—పోనీ నువ్వు సంపాదించినప్పుడు వాళ్లు తెలియకుండా అందరికీ పెడుదూగానిలే.

హను:—నేను సంపాదించడం, మీరు సంపాదించడం వొహలాగే వున్నాయి.

వెంక:—ఇంక నాతో వాదించకు. మజ్జిగ వెయ్యి, వెళ్లిపోతాను.

హను:—పోనీ కడుపునిండా భోజనమేనా చెయ్యండి. మీ రెవరికీ దమ్మిడీసొమ్ము పెట్టక్కర్లేదు.

వెంక:—మజ్జిగ పోసెయ్యి. మరేం వద్దు.

హను:—కడుపునిండా అన్నమేనా తినకపోతే యెలాగ బతకడం?

(బాబుగారండీ, తలుపు తియ్యండి. అని పిలుపు వినవస్తుంది.)

వెంక:—అడుగో! అడుగో! నాగన్న వచ్చేడు. బజారులో యేం చేసుకొచ్చేడో, కనుక్కోవాలి. తొందరగా మజ్జిగ వెయ్యి.

హను:—అదేం తొందరమ్మా! (మజ్జిగ పోసి) కొంచెం తాపిగా భోంచెయ్యండి. ఏమంత తొందరపను లున్నాయని హాడావిడిగా భోంచెయ్యడానికి?

వెంక:—భోజనమయింది. (చెయ్యి కడుక్కుని) వస్తున్నా, వస్తున్నా. (తలుపుతీసి) వచ్చేవూ బజారునుంచి?

నాగ:—వచ్చేనా బాబూ! ఆధరకి మంచిరకం కాయ లియ్యనన్నాడండి బాబు. అంటే డబ్బు లిచ్చెయ్య మన్నానండి. ఇచ్చేసేడండి మూడుకాన్లున్నూ. (వెంకటరామయ్యచేతి కిచ్చును.)

వెంక:—మంచిపని చేసేవు. అలా తెలివితేటలుగా పని చేసేవంటే యెప్పటికేనా పనికొస్తావు నువ్వు. మొద్దులాగుంటే యేలాగు?

నాగ:—చిత్తం బాబయ్యా!

వెంక:—రాత్రికి బియ్యం లేవు. వెళ్లి బియ్యం బాగుచెయ్యి. ఒక్కరాయేనా వుండకూడదు. ఉంటే మళ్లా బాగుచేయిస్తా. వెళ్లి బాగుచెయ్యి. తర్వాత యింటికి పోదూగాని.

(తెర వాలుతుంది)





1. దివ్యజ్ఞానసమాజ సమావేశము, అడయారు; 2. జగద్గురువు, జిడ్డు కృష్ణమూర్తిగారు - కొందరుదివ్యజ్ఞానసామాజికులతో.





1. రాజధానీకళాశాల విద్యార్థి సంఘము తరఫున ఆచార్య పి. సి. రేగా రుపన్యసించుట;
2. అణ్ణామలై విశ్వవిద్యాలయాంధ్రసంఘపు వార్షికోత్సవము.

నాలుగో రంగం

(అదే యిల్లు, సాయంత్రం నాలుగుగంటలకి.)

(వెంకటరామయ్య కుర్చీమీద కూర్చునివుంటాడు. హనుమాయమ్మ చాపమీద కూర్చుంటుంది.)

హను:—ఇవాళ యెన్నో కూరలు తెప్పించేసే నన్నారు. ఏవీ యెక్కడా కనబడవేం?

వెంక:—ఆ నాగన్నకి డబ్బు లిచ్చి మూడునాలుగు కూరలు తీసుకు రారా అన్నాను. అంటే వాడు తెలివితక్కువవెధవ—అనపకాయ, మిరపకాయలు, వంకాయలు తెచ్చేడు అందులో వంకాయలు పుచ్చువని తిరిగి పంపేస్తే ఆషావుకారు డబ్బు లిచ్చి పంపించేసేడు.

హను:—ఇవేనా యెన్నో కూరలని చెప్పేసేరు! బంట్రోతుకి యేమేం కూరలు తేవాలో చెప్పాలి కాని వాణ్ణి తెమ్మంటే వాడి కేం తెలుస్తుంది. అయినా అన్ని పచ్చిమిరపకాయ లెందుకు తెప్పించేరు? ఫలహారం చేస్తారా యేమిటి?

వెంక:—అదిగో నువ్వు వూహా లేకుండా మాటాడుతూ వుంటావు. ఎందుకేనా పనికొస్తాయి. ఒకవేళ పచ్చడి చెయ్యవనుకో. పచ్చిమిరపకాయలు నంచుకుని తినెయ్యొచ్చు. అయినా యీ కూరగాయలు కాదుగాని, మహా ఖర్చై పోతూంది డబ్బు. రూపాయి మారుస్తే చేతిలో వుండడం లేదు.

హను:—ఔను చేతిలో వుండక పెట్లో వుంటుంది లెండి.

వెంక:—ఇదిగో నువ్వాడదానివి. ఆడవాళ్లకేం తెలుస్తుంది డబ్బు విలువ?

హను:—నిజమే ఆమాట!

వెంక:—ఆమాట నిజమే.

హను:—అదేం చింతో, యెప్పుడూ ఖర్చైపోతూంది, ఖర్చైపోతూందనే బెంగెట్టుకుంటారు. మీ రేమేనా డబ్బైపోతూన్నట్టు కలలుగంటూ వుంటారేమోగాని నిజంగా మీ చేత్తో వొక్క దమ్మిడీయేనా, అవసరమప్పుడేనా ఖర్చుపెట్టి యెరగరు.

వెంక:—డబ్బువిలువ నీకు తెలియదని మొదటే చెప్పేసేను. ఇంకెందుకు ఇన్నిమాటలు?

హను:—పోనీలెండి ఆగొడవంతా నా కెందుకుగాని నే నొక టడుగుతాను వింటారా?

వెంక:—ఊఁ, చెప్పు.

హను:—ఇవాళ మన యింటిపక్క నున్న సుందరమ్మగారు, సీతమ్మగారు, మరివచ్చి కొల్లూరివారు వీళ్లంతా చిత్రనళీయ నాటకం చూడడాని కెళతారుట. నన్నుకూడా పంపించండి వాళ్లతో, చూసివస్తా.

వెంక:—వాళ్లందరిలాగా నువ్వూ గయ్యాళిగా తయారైపోతా వేమి టింక? ఇళ్లు వాకిళ్లు విడిచిపెట్టుకుని నాటకాలకి, సినీమాలకి వెళ్ళడమేమిటి వాళ్ల మొహం? మళ్లా తిరిగి యింటికి వచ్చేప్పటికి వొక్క దమ్మిడీ సామానైనా మిగులుతుందా? దోచుకుపోరూ? ఆ ఆడవాళ్లని పిలుచుకువచ్చి బుద్ధిచెప్పు.

హను:—సరి, మీ నాదస్తాని కేమిటిలెండి. నాకు లేని సుఖం వాళ్లకేనా కలగనియ్యండి. మిమ్మలిని అడిగేటప్పుడే అనుకున్నా, యిదేలాగా వుత్తమాటే అని.

వెంక:—వెర్రి ఆలోచనలు పెట్టుకోక జ్ఞానం వచ్చి బతుకు.

హను:—(నెమ్మదిగా) ఇదో వింతబందిఖానా. ఇలాంటి మొగుడితో నేకాబట్టి కాపరం చేస్తున్నాకాని మరొకర్తె అయితే సుఖానికి మొహంవాచి చచ్చేది.

వెంక:— తెలివితక్కువగా కబుర్లు చెప్పకు. నాకు తలనొప్పి.

హను:—పోనీలెండి. నాకు నాటకంవద్దు, సినీమాలు వద్దు గాని రవికెలు నాలుగు కుట్టించి పెడుదురూ. అన్నీ చిరిగిపోయేయి. తొడుక్కుని వీధిగుమ్మంలోకి వెళ్లడానికి సిగ్గేస్తూంది.

వెంక:—ఒకటి విడిచిపెడితే వొకటి, ఒకటి విడిచిపెడితే యింకొకటి. నువ్విప్పు డడిగి తేమట్టు కెలాగ? ఈమారు బజారికి వెళ్లినప్పుడు చెప్పు.

హను:—ఈకాస్తకీ బజారంతా గాలించా లేమిటి? మనవీధుల్లోకే కావిళ్లతో గుడ్డ లమ్మ తెస్తారు ఎవరేనా. వస్తే పిలుస్తాలెండి.

వెంక:—ఇప్పుడు వచ్చేరా యేమిటి, వచ్చినప్పుడు పిలుద్దూగానిలే.

('రవికెలగుడ్డలు, పరికిణీగుడ్డలు, జాకెట్లగుడ్డలు. పట్టుగుడ్డలూ' అని కేకలేస్తూ యిద్దరు నాయిళ్లు వస్తారు.)

హను:—(ఉలికిపడి) అదిగో మాటల్లోనే వచ్చేరు. వాళ్లకు వెయ్యేళ్లాయుష్షు. వెళ్లి పిల్చుకురానా?

వెంక:—శివ! శివ! (నిట్టూర్పు విడుచును.)

హను:— ఓబట్టలబ్బి! యిలా రండి.

('వస్తున్నామమ్మా!' అని ఇద్దరు నాయిళ్లు—ఒకడు బట్టలకావిడితోనూ, వొకడు అరగజంబద్దతోనూ—వస్తారు.)

హను:—ఇలా వీధిచావిడిలోకి రండి.

నాయిల్లు:—అలాగనే అమ్మా.

హను:—ఏమండోయి, పిలిచేను.

వెంక:—మంచిపని చేసేవు! (తనలో) ఇంట్లోకి రమ్మన్నాక యిప్పుడు పొమ్మంటే బాగుండదు. బేరంచేసి యెక్కువ ఖరీదని పొమ్మంటాను.

హను:— అబ్బీ! రవికలగుడ్డలు తీయించు.

1-వ నా:—తీస్తానండి అమ్మగారు.(గుడ్డలు తీస్తూ)ఇది వాయిల్ సిల్కు రకమండి. జపాన్‌లో తయారుచేసేరు. చాలా బాగుంటుందండమ్మా. ఇది పట్టుమీద రంగురంగుల పువ్వులండి. చాలా పసందుగా వుంటుంది. ఇప్పుడిదే కొంటున్నారండీ అంతా. ఖరీదుకూడా తక్కువేనండి.

వెంక:—అయితే దానిఖరీదెంతో చెప్పు.

1-వ నా:—బాబూ! గజం రెండురూపాయలండి. అందరికీ రెండుంపావలా కిస్తున్నామండి. తమదగ్గిర బేర మాడకూడదని చెప్పేసి రెండే చెప్పేమండి.

వెంక:—(తనలో) అమ్మబాబో! ఇంక పొమ్మంటే బాగుంటుంది.

1-వ నా:—(మరొకటి తీసి) ఇది కేవలం చిలకపట్టండి.(మరొకటి తీసి) ఇది దక్షిణాదిపట్టండి. (మరొకటి తీసి) ఇది కాశీపట్టండి. (మరొకటి తీసి) ఇది జర్మనీనుంచి నిన్ననే వచ్చిందండి. ఇంకా చాలారకా లున్నాయండి. అయ్యగారి సెలవైతే చూపిస్తామండి. (ఇంకా అనేకరకాల గుడ్డలు తీసి వెంకటరామయ్యముందర పోగవేస్తాడు. వెంకటరామయ్య యేమీ తోచక చూస్తూవుంటాడు.)

హను:—నా కిది బాగుంది. పైగా ఖరీదు తక్కువ. ఇది పుచ్చుకోండి.

1-వ. నా:—(తనలో) ప్రాణాలు వొంట్లో లేనట్టుగా కూచున్నాడేం? (పైకి) తమరు వేగిరం యేదోమాట సెలవిప్పిస్తే...చాలవీధులు తిరగాలి. ఒక్కయింటిదగ్గిరే వుంటే మాకు పనిగాదు. బాబూ మీకు తోచినమాట అడగండి.

వెంక:—(హనుమాయమ్మతో) నీ కిప్పుడు పట్టుగుడ్డలు వద్దులే, మరొకమాటు కొందూగాని. ప్రస్తుతం నూలుగుడ్డలుకొనుక్కో. (నాయడివైపు చూసి) నీదగ్గర నూలుగుడ్డలులేవు నాయడూ?

1-వ. నా:—(గుడ్డలు సర్దుకుంటూ) బాబూ, కేవలం నూలుగుడ్డలు లేవండి. తమవంటి భాగ్యవంతులే పట్టుగుడ్డలు వద్దంటే మరెవరు కొంటారండి. అయ్యా! మీ కంతిగా కావాలంటే వాయిల్ సిల్కుందండి, నూలుగుడ్డమీద పట్టుపువ్వులండి.

హను:—పోనీ, యీమాటు కోరెండుగజాల పట్టుగుడ్డ పుచ్చుగోండి. మళ్లీ బజారి కెళ్లినప్పుడు నూలుగుడ్డ తెచ్చిపెడుదురుగాని.

వెంక:—(తనలో) ఎంచేతో నామనస్సులో సంకటంగా వుంది. (పైకి) నాయిల్లూ, పట్టుగుడ్డ యిచ్చేఖరీదు చెప్పండి.

1-వ. నా:—బాబూ! మొదటే చెప్పేనండి. గజం రెండురూపాయిలని. బేరం లేదండి. సిసలైన ధర. తమవంటి ప్రభువులదగ్గిర బేరం చెప్పమండి. అసలుఖరీదుకే చెప్పేనండి.

వెంక:—(తనలో) పోనీ రూపాయికి అడిగితేనో. అయినా పన్నెండణా లంటాను. కాదు—(పైకి) నాయడూ గజం అర్ధరూపాయి చేసుకో. మరి బేర మెందుకు?

1-వ. నా:—(తనలో) ఇదేమిటి? (వెంకటరామయ్యతో) అయ్యా, కొన్నఖరీదు రూపాయపదిహేనణాలండి. అణా లాభమండి.

వెంక:—నువ్వు విన్నాసరే వినకపోయినాసరే అలా గిచ్చేయి. డబ్బు వూరికే వస్తుం దనుకున్నా వేమిటి?

2-వ. నా:—గుడ్డమట్టుకు వూరికే వస్తుం దేమిటండి? (తనలో) ఎంత ఆశ్చర్యం!

వెంక:—నువ్వలాగ యిచ్చేవంటే వొకగజంగుడ్డ తప్పకుండా పుచ్చుకుంటా.

1-వ. నా:—ఒక్కగజంగుడ్డా అండి! (తనలో) వింతమనిషి!

హను:—పోనీ రెండుగజాలేనా పుచ్చుగోండి. రెండురవికె లౌతాయి.

వెంక:—ఎందుకులే. మళ్లా మరొకమారు కొనుక్కుందూగాని. నాయుడూ, నేను చెప్పినట్టిచ్చెయ్యి.

1-వ. నా:—మమ్మల్ని చంపేసినాసరే యివ్వనండి బాబు.

వెంక:—ఎందుకు వెళిపోతా, వలాగ యిచ్చెయ్యి. ఇచ్చేసి మరీ వెళిపో.

2-వ. నా:—మమ్మల్ని మీరు చంపి పాతేసినాసరే యియ్యమండి.

వెంక:—(తనలో) ఇప్పుడు కనక పిల్లని వెళిపోనిస్తే మరెప్పుడూ యింతచవగ్గా దొరకదు. (గుడ్డ లాక్కుని, పైకి) ఇయ్యి, యియ్య కేంచేస్తావు? అర్ధరూపాయంటే యెనిమిదణా లన్నమాట. కాస్తా కూస్తానా.

1-వ. నా:—(ఆశ్చర్యపడి, తనలో) ఇదేమి మనిషి! గుడ్డలాక్కుంటాడు! (వెంకటరామయ్యతో పైకి) బాబూ మాగుడ్డ మా మొహాన్ని పారెయ్యండి. పోతాం. (గుడ్డలాగుతాడు. వెంకటరామయ్య వదలడు.)

వెంక:—ఇచ్చెయ్యమంటేనే ఆగదకు......

2-వ. నా:—మే మియ్యమండి. మాగుడ్డ మానెత్తిని పారెయ్యండి, పోతాం. (ఇద్దరు నాయిళ్లూ కలిసి గుడ్డలాగుతున్నారు. గుడ్డ చిరిగిపోతుంది. వెంకటరామయ్య తూలిపడతాడు.)

హను:—మీరు కొనకపోతే కొనకపోయేరుగాని వాళ్ల గుడ్డ లాక్కుంటే యెలాగు చస్తారూ?

1-వ. నా:—మాగుడ్డ చింపేసేరు. ఖరీదు కట్టెయ్యండి.

వెంక:—నువ్వు లాగేవు, వాడు లాగేడు, చిరిగిపోయింది.

1-వ. నా:—అరే! మాగుడ్డ మీరు లాక్కుంటే మేము లాగమూ?

వెంక:—మీరు లాగితే చిరగమూ?

1-వ. నా:—(తనలో) ఈమనిషికి గట్టిగా బుద్ధిచెప్పాలి.

2-వ. నా:—(తనలో) వీడిపని పట్టించాలి.

1-వ. నా:— ఇచ్చెయ్యండి ఆముక్క ఖరీదు.

వెంక:— ముక్క ఖరీదూ లేదు, గిక్క ఖరీదూ లేదు, పో.

2-వ. నా:—(ఆగుడ్డ తీసుకుని కావిడి బుజాన్ని వేసుకుంటాడు) దండమండి.

1-వ. నా:—సెలవండి. ( వెళతారు )

వెంక:—పొండి, పొండి.

హను:—మీకు చాదస్తమా, పిచ్చా, వెర్రా, పీనాసితనమా, నన్ను చంపడమా.

( తెర వాలుతుంది )

---

## 2-వ అంకము

### ఒకటో రంగం.

(పొద్దున్న)

(వెంకటరామయ్య వాలుకుర్చీలో కూచుంటాడు.)

వెంక:—(తనలో) ఇప్పటికి యేభై యేళ్లు వచ్చేయన్నమాటేగాని నా చేతులతో వొక్క దమ్మిడీ అయినా సంపాదించి, యిది నా ఆర్జన అన్నమా ఎరగను. నా తండ్రిగారు, నా తాతగారు వారంతా ఆమహానుభావు లేం సంపాదించేరో అదే నేను యెప్పటి కప్పటికి జాగ్రత్తగా దాచివుంచడమేగాని నేనై ఆ ఆస్తి కొక్క దమ్మిడీ డబ్బులు చేర్చియెరగను. 'ఉద్యోగం పురుషలక్షణ' మని పెద్ద లంటారు. కాని నాకు సంతకం చెయ్యడానికి నేర్చుకున్న విద్యేగాని అంతకంటె మరి నాలుగుముక్క లేనా హెచ్చు రావు. సరి, వున్నస్థితి యిది. ఇట్టి సందర్భంలో డబ్బు యెలాగ సంపాదించడమని ప్రశ్న...సరే యిలాగ చేస్తే ఏమిటీ. పోనీ పుస్తకాలు రాయడం వచ్చినా బాగుండేది. రెండు చేతులతోను రాసిపారేస్తాను. అబ్బ! తిన్నగా అక్షరం ముక్క లేనా రాయడం చేతకాదు. ఊహల కేం బోలె డున్నాయి. పోనీ యిన్ని వూహ లున్నప్పుడు వీటి నమ్మితేనో. వీటిని బుర్రలోంచి విడిగా తీసి అమ్మలేముగా. అంటే బుర్రతో అమ్ముకోవా లన్నమాట. ఏడిసినట్టుగానే వుంది. యోచన చేస్తే యిలాగే తేలుతుంది. ఒకటి కాదు. అన్నీ అంతే. అంతూ లేదు, పొంతూ లేదు. యోచన చెయ్యడం మానేసినవాడే వుత్తముడు. నా కామాత్రం తెలియకపోవాలీ, యిన్నేళ్లొచ్చి? నేను చేస్తూన్న పనే అది కాదూ. సరి, అయితే డబ్బురావడ మెలాగా అని. కొంతమంది బొమ్మలు రాసి అమ్ముతారు. వాళ్లకుకూడా కొంత లాభం వస్తుందట. అది నేర్చుకుంటేనో. ఔను నిజమే! ఇప్పుడు నేర్చుకోవాలి. అరవై యేళ్లొచ్చి చదువుకోక మన్ను కొట్టుకుంటూనా. అన్నట్టు ఏదైనా అలాటి చదువులన్నీ లేతతలకాయలప్పుడు నాటుతాయిగాని ముదురువాటికి పనికిరావు. కాస్సే పలాంటి పని చేస్తే తలనొప్పొస్తుంది. ఆబాధ యెక్కడ పడనూ. అదేం బాగులేదు. తలనొప్పి రాకుండాఖండే పనిలో దిగి డబ్బు సంపాదించాలి. చదువు కేంలే వెధవ చదువు. నాకోస మది పుట్టలేదు. దానికోసం నేను పుట్టలేదు. మరి...లచ్చయ్య కోమటి, ఒక్క లచ్చయ్య కోమటేమిటి. కోమట్లంతా భాగ్యవంతులే, కోటీశ్వరులు, లక్షాధికారులు! వీళ్ల కింత భాగ్య మెలాగ వచ్చింది? వర్తకమేనా కారణం, మరేమేనా? మరేముంది వాళ్ల మొహం, నామొహం. వర్తకమే కారణం. అంటే వర్తక మెప్పుడూ లాభమే కాని నష్టం కాదన్నమాట. ఒకవేళ నష్టమే వుంటే వీళ్లంతా దాన్నే పట్టుకు యెందుకు దేవుళ్లాడతారు! నిజమే. పోనీ వర్తకం చేసిమాస్తేనో?

(వీధితలుపు తడుతూ 'అయ్యా, పంతులుగారూ' అని కేక వినవస్తుంది.)

వస్తున్నా. ఎవరు వారు? (తలుపు తియ్యగా వొక నాయిడుకుర్రాడు వొక అచ్చునోటీసిస్తాడు) ఏమి టిది?

నా:—బాబూ, వూళ్లో అందరికీ మానాయుడుగారీనోటీసు లియ్యమని చెప్పేరండీ. తమకికూడా వొకనోటీ సిచ్చేనండి. బాబూ సదువుతే తెలుస్తుందండి. సెలవండి. (వెళతాడు.)

వెంక:—(తలుపు వేసి, కుర్చీమీద కూచుని, నోటీసు చదువును) "అయ్యా, ఇందువల్ల ఊళ్లో యెల్లవారికీ తెలియజేయడమేమనగా, మేము మాతాలూకు పెద్ద బట్టలషాపును సుమారు రు. 2500 (రెండువేల అయిదువందలు) ఖరీదైనదానిని మాయొక్క ప్రస్తుతఅవస్థలనుబట్టి అమ్మివేయవలసివచ్చి రెండు

వందలరూపాయిలకే యిస్తున్నాను. కావలసినవారు సాయంత్రం 5 గం. లకి మా కొట్టుదగ్గరికి రావలసినది.

ఇట్లు
బట్టలకొట్టు యజమాని,
బజారుపక్కని 5-వ సందులో
చిన్నమేడపైని, రాజమండ్రి."

(ఆశ్చర్యంతో చూస్తూ) ఓహోహో! నమ్మడానికి వీలు లేకుండా వుంది! నాకు యోచన కలగడమేమిటి, కలిగిన వెంటనే యిటువంటి అవకాశం చిక్కడమేమిటి! ఆ దేవుడు పంపించినట్టుగా యెదురయింది. అదన్నీ 2500 రూపాయలు కాస్తాహుస్తా డబ్బు కానుకదా! అటుంటేది 200 రూపాయిలికి, వెనం రెండువందల రూపాయలు. ఏమి ఆశ్చర్యం! ఎంత లాభం! మా తాత, మా నాన్న యిలాగ వాళ్ళ జన్మంలో సంపాదించేరా? వాళ్ళ తెలివి తేటలు లదోమోస్తరు. అయితే యిది కొని మళ్ళా తిరిగి అమ్మేస్తే చెప్పలేనంతలాభ ముస్తుంది. ఇలాంటిఅవకాశం పోగొట్టుకోగూడదు. మరేముంది? ఇలాంటివి కనక మరో నాలుగైదు వచ్చేయంటే యింకేముంది, మా తాత, మా నాన్న సంపాదనలతో సమానమై పోతుంది నాఆర్జనకూడా. అయినా ఆలోచిస్తా. ఈఅవకాశం మట్టుకెన్ని యిబ్బందులొచ్చినా విడిచిపెట్టను.

(నాన్నా! నాన్నా! అంటూ రంగారావు వస్తాడు.)

రంగా:—నాన్నా! అమ్మ నిన్ను మడికట్టుకోమంది. రా నాన్నా, భోంచేద్దాం. నాన్నా, అమ్మేమోనే నాకింత పప్పేస్తానంది. రా నాన్నా.

వెంక:—వస్తున్నా, పద. (వెళతారు)

రెండో రంగం

(సాయంత్రం)

(వెంకటరామయ్య కుర్చీమీద కూచుంటాడు)

వెంక:—(తనలో) తప్పకుండా యీ వ్యవహారంలో జోక్యం కలుగజేసుకోవాలి. ఈ అవకాశం పోగొట్టుకుంటే బతుకు నిరర్థకమైపోతుంది. నా తెలివి, నాజ్ఞానం అడవిని కాచిన వెన్నెల అయిపోతాయి. (ఆలోచించి) ఏమోయ్! ఒసేయ్! ఇల్లా రా, ఒక్కమారు.

[లోపల 'వస్తున్నా' అని జవాబు. హనుమాయమ్మ వస్తుంది.]

హను:—ఏమంత అదావిడిగా పిలిచేరు?

వెంక:—రా చెప్తా.

హను:—(పరికించి చూసి) అదోమోస్తరుగా వున్నారేం?. ఎప్పుడూ లేని వింతకళకాంతు లొచ్చేయి మనిషికి!

వెంక:—(నవ్వుతూ) నిజంగా?

హను:—నిజంగానే! ఏజన్మానా నవ్వెరగరు, ఇవాళ నవ్వుతున్నారు కూడా! అదెందుచేతో!

వెంక:—నిజంగానే? అదేమి టలా గంటావు? నే నెప్పుడూ నవ్వుతూనే వుంటాను.

హను:—ఆనవాల కేంలెండి. నిజంగానే వింతగా వుంది నాకు కూడా.

వెంక:—(తనలో) దీనికి వ్యవహారమంతా ముందే చెప్పెయ్యకూడదు. దానిలో వుండే రసం పోతుంది. ఆపని అంతా పూర్తి చేసుకుని వచ్చి అప్పుడొక్కమారుగా చెప్తే గక్కి కడుతుంది. అది ఆశ్చర్యపడి నేనెంతటివాణ్ణో అనుకుంటుంది. అలా చేస్తేనే చాలా తమాషాగా వుంటుంది.

హను:—మళ్ళా ఆలోచనలో పడ్డారేం? చెప్పండి, ఏదో చెప్తానని మీరేగా అన్నారు.

వెంక:—ఇప్పుడప్పుడే నీతో చెప్పను. తర్వాత చెబుతా.

హను:—పోనీ లెండి అయితే. మీతో అంతా కళాకళలు. క్షణం నవ్వు, క్షణం విచారం.

వెంక:—పోనిద్దూ — నాగన్నా! ఒరేయ్!

('బాబుగారండీ!' అంటూ నాగన్న వస్తాడు)

నాగన్నా! వెళ్ళి ముసలయ్యని బగ్గీకట్టుకురమ్మను వేగిరం. టైమయిపోయింది.

నాగ:—చిత్తం బాబూ! (వెళతాడు.)

(వెంకటరామయ్య గుడ్డలు వేసుకొని యినప్పెట్టెలోంచి నోట్లు తీసుకుని జేబులో పెట్టుకుంటాడు.)

హను:—మీసంగతంతా చూస్తే యేదో నాటకంలా గుంది. ఇంత వేగిరం వీధిలో కెళుతున్నారేం యివాళ? అదీ యింత సంతోషంతో?

వెంక:—నీ కెప్పుడూ నవ్వుతాలే. వేళా పాళా లేదు. నే నిప్పుడప్పుడే చెప్పను. చెబితే దాంట్లో వుండే స్వారస్యం పోతుంది. వెళ్ళి తిరిగివచ్చేక. (నవ్వుతాడు.)

హను:—పోనీలెండి. మీ రిప్పుడు సంతోషిస్తే నే నప్పుడు సంతోషిస్తా. అంతేనా, అంతకంటె మరేమేనా వుందా? చెప్పక పోయేక మిమ్మల్ని యెన్నిమార్లడిగితే యేం లాభం?

(నాగన్న వస్తాడు)

నాగ:—అయ్యా! బాబుగారండీ! బగ్గీ వచ్చిందండి.

వెంక:—వచ్చిందీ, అయితే సరి. (వడిగా పోతూ) ఏమేయ్! వీధి తలుపు వేసుకో. జాగ్రత్తసుమీ, దొంగలుపడేరు. గడియ గట్టిగా వెయ్యి. మళ్లా యిప్పుడే వస్తా. (వెళ్లును)

హను:—(గడియ వేస్తూ) ఇవాళ యేదో విశేష ముంది. అన్నిరోజుల్లాగా లేదీరోజు! (తలుపు వేస్తుంది.)

(నాగన్న వస్తాడు)

నాగ:—అమ్మగారండీ!

హను:—ఏం? (తలుపు తీస్తుంది.)

నాగ:—గడియ గట్టిగా యేసేరో లేదో అయ్యగారు సూసిరమ్మన్నారు.

హను:—చూసిరమ్మంటే పిల్చేవేం?

నాగ:—గడియవెయ్యడం సూడడ మెలాగండి?

హను:—అది మీ అయ్యగారినే అడుగు.

నాగ:—సిత్తమండమ్మా. (వెళ్లును)

హను:—(గడియ వేసూ) వెర్రిబ్రాహ్మడు, వెర్రినాగన్న!

(తెర వాలుతుంది)

మూడో రంగం

(బజారులో సందు)

(ముగ్గురునాయిళ్లు వస్తారు)

3-వ. నా:—వస్తాడో లేదో!

2-వ. నా:—కసూర్తిముండాకొడుకు, రాకేం?

1-వ. నా:—వాడే రాకపోతాడూ?

2-వ. నా:—(3-వ. నాయుడితో) ఏమని చెప్పేవురా నువ్వు?

3-వ. నా:—మరేం లేదు. ఆనోటే సిచ్చేసి వచ్చేసేను.

2-వ. నా:—మంచిపని చేసేవు! మరేం అనుమానం తట్టలేదుకదా వాడికి?

3-వ. నా:—నే నేమేనా మాట్లాడితేగా? అచ్చునోటే సిచ్చి వచ్చేసేను.

2-వ. నా:—మంచిపని చేసేవు!

1-వ. నా:—(దూరంగా చూసి) అదిగో రోయ్! వాడిబగ్గే! సందు మళ్లింది!

2-వ. నా:—(చూసి) భేష్! వహ్వా! అనంతశయనంలాగ వూగులాడుతూ వస్తూందిరా!

1-వ. నా:—ఆహాహా! ఏమి చక్కనిశబ్దం! ట్రకట్రక కట్రకట్ర! వేరే గంటవాయించ నక్కర్లేదు. అ దేం స్వరం?

3-వ. నా:—ముసిలిస్వరం! ముసిలిస్వైరు! పాతడొక్కుబండి! ట్రక, ట్రక, కట్రకట్ర!

1-వ. నా:—ఉత్తపీనాసిముండాకొడుకు!

2-వ. నా:—గండి యింక లోపలికి పోదాం కనబడితే పని చెడుతుంది.

1-వ. నా:—(తక్కిన యిద్దరితో) ఒరేయ్! మీ రెంతమాత్రం నవ్వడంగాని, కేకాకోళం చెయ్యడంగాని వుండకూడదు.

2-3-వ. నా:—ఉఁ, ఉఁ. (నవ్వుకుంటూ వెళుతున్నారు.)

నాలుగో రంగం

(అదేసందులో ఒక చిన్న మేడ)

(వెంకటరామయ్య బగ్గీ దిగుతాడు. బగ్గీ వెళ్లి దూరాన నిలుచుంటుంది.)

వెంక:—ఏమయ్యోయి, ఎవరూ లేరు. పలకరేం?

3-వ. నా:—అయ్యా, యిక్కడే దయచెయ్యండి.

వెంక:—ఇక్కడేకామూ బట్టలకొట్టమ్మకం? నువ్వేకామూ నోటీసు తెచ్చేవు?

3-వ. నా:—ఔనండి బాబూ నేనే. ఇక్కడికి దయచెయ్యండి, మేడమీదికి.

వెంక:—వస్తున్నా. (తనలో) నాపుణ్యం పుచ్చింది. మరెవరూ రానట్టేవుంది. పోటీ లేకపోతే యిట్టే తెమిలి పోతుంది. (మేడ యెక్కుతాడు. ఇద్దరునాయిళ్లెదురొస్తారు. వెంకటరామయ్య వాళ్లను పోల్చుకొని కొంచెం భయంతో) (పైకి) ఇక్కడ మీ రున్నారేం? (ధైర్యంతో) నిన్న మీరే కాదూ గుడ్డ లమ్మతెచ్చేరు మాయింటికి?

1-వ. నా:—ఔను బాబూ మేము గుడ్డ లమ్ముతాం.

వెంక:—(భయంతో) ఇక్క డెక్కడా బట్టలు లేవేం? బట్టలకొట్టమ్ముతున్నారుకామూ?

2-వ. నా:—ఔనండి.

వెంక:—(తనలో) వీళ్లు మర్యాదగానే మాట్లాడుతున్నారు గాని మరేం ప్రమాదం రాదుకదా. (ధైర్యం తెచ్చుకుని) మరి నోటీసు లెందుకు పంచిపెట్టేరు?

1-వ. నా:—మీదగ్గిర నోటీసుందా అండి?

వెంక:—ఇదిగో వుంది. (నోటీసుని పైకి తియ్యగా 1-వ నాయడు లాక్కొంటాడు.)

1-వ. నా:—ఇదొక్క నోటీసే ముద్రించేం.

వెంక:—(భయంతో) అలా చేస్తారా యెవరేనా?

1-వ. నా:—ఆమాటకేంలే. నిన్న నువ్వేకదూ గజం రెండు రూపాయిలు చేసేసుడ్డని అర్ధరూపాయి కడిగి మే మియ్యం బాబోయ్ అని యేడుస్తూవుంటే గుడ్డ పట్టుకులాగి చింపి పారేసేవు?

2-వ. నా:—ఆ గుడ్డముక్క ఖరీదిమ్మని యెంత బతిమాలుకున్నా యిచ్చేవూ? నీపీనాసితనం మమ్మల్ని కొట్టేయ్యాలనా?

వెంక:—నేను లాక్కోలేందే!

1-వ. నా:—పైగా అబద్ధా లాడతావూ! ఎవ రనుకున్నావు?

వెంక:—నువ్వేకాదూ చింపుకున్నావు?

2-వ. నా:—ఇంక నీఅబద్ధాలు కట్టిపెట్టు.

వెంక:—క్షమించరాదూ? కొడతారేమిటి? నన్నేంచేస్తారు?

1-వ. నా:—ఏంచేస్తామా? నీదగ్గర డబ్బు లాక్కుని పంపిస్తాం. అరుస్తే చంపేస్తాం.

2-వ. నా:—నీదగ్గర యెంత డబ్బుందో చెప్పు, మొదట.—చెప్పవేం?

వెంక:—డబ్బు లేదు.

1-వ. నా:—లేదంటావేం? పట్టుకోండిరా ఒరేయి!

(ఇద్దరునాయిళ్లూ వెంకటరామయ్యని పట్టుకొంటారు. అన్ని జేబులూ వెతికి 1-వ నాయడు రూపాయిలనోట్లు తీసుకుంటాడు.)

1-వ. నా:—మేము చెప్పినంతా తెచ్చేవులే, రెండువందల రూపాయిలూ. ఇంక విడిచిపెట్టెయ్యండిరా. ఇంకేనా నీ పీనాసితనం పోయిందా? మరెప్పుడూ అమ్మవచ్చినవాళ్లని బాధపెట్టకు. నిన్ను కొట్టకుండా విడిచేసేం. అందుకు సంతోషించు. అరిచేవో, గొంతుక నొక్కేస్తాం. పో, కిందికి.

వెంక:—(పోతూ) చంపెయ్యండి. నాడబ్బు—

1-వ. నా:—మాట్లాడకుండా పో.

వెంక:—నాడబ్బు—

1-వ. నా:—పొమ్మంటే.

(వెంకట్రామయ్య వెళిపోతాడు. నాయిళ్లు నోట్లు లెక్కపెట్టుకుంటూ 'మహా బాగా శాస్తిఅయిందిరా' అంటూ నవ్వుకుంటారు.)

(తెర వాలుతుంది.)

అయిదో రంగం

(వెంకటరామయ్య యిల్లు)

(వెంకటరామయ్య తలుపుతడుతూ 'తలుపు తియ్యేయ్, తలుపు' అని కేకవేస్తాడు హనుమాయమ్మ, 'వస్తున్నా, వస్తున్నా,' అని తలుపుతీస్తుంది. వెంకటరామయ్య యింట్లోకి వెళ్లి మాటాడకుండా మంచం మీద కూలబడతాడు)

హను:—అలా గున్నారేం? వెళ్లేటప్పు డంతచక్కగా వున్నారు.—మాటాడరేం?

వెంక:—(మాట్లాడకుండా నిట్టూర్పులు విడుస్తాడు.)

హను:—పైకి చెప్పండి. ఏం జరిగిందో. వెళ్లేటప్పుడే అనుకున్నాను, ఏదో వుపద్రవం తెచ్చిపెడతారని. లేకపోతే యెన్నడూ నవ్వనిమనిషి యివాళ నవ్వడ మేమిటి నామోహంగాని...... మాటాడరేం. నాకు భయం వేస్తూంది. చెప్పండి చప్పున.

వెంక:—నాడబ్బోయి! నాడబ్బోయి! జ్వరం! జ్వరం! శాలువ! శాలువ!

హను:—అ దేమిటమ్మా, అట్లా మాట్లాడుతున్నారు, డబ్బేమిటి? జ్వర మేమిటి? ఏమిటో చెప్పండి తిన్నగా నన్ను రక్షించి.

వెంక:—నాడబ్బు పోయిందోయి! డబ్బు పోయింది. లాక్కున్నారు. బాబోయి జ్వరం! హు హు హు హు.

హను:—(తనలో) డబ్బు లాక్కున్నారా. దీని అర్ధమేమిటో తెలియకుండా వుందమ్మా! (పైకి) కట్టుకథలా చెప్తే యేలాగు? అదేమిటో తిన్నగా చెప్పండి, డబ్బెవరు లాక్కున్నారూ?

వెంక:—డబ్బోయి! డబ్బోయి!

హను:—(నెమ్మదిగా) ఇదేమిటమ్మా, యింతట్లోనే జ్వరసంధీ! ఏమిటో నాకు వొక్కముక్కా అర్ధంకావడం లేదు. (గట్టిగా) ఇదిగో, చెప్పేముక్క లేమిటో నిదానంగా చెప్పండి. కంగారు పడొద్దు.

వెంక:—నాకు జ్వరం వచ్చిందోయి. శాలువ శాలువ! నారెండు వందలోయ్.

హను:—(వెంకటరామయ్యకి శాలువ కప్పుతుంది.)

ఇదిగో! వింటున్నారా. ఓయ్! నా కేం అర్ధం కావడం లేదు. ఆరెండువంద లేమిటో చెప్పండి.

వెంక:—......

హను:—అడిగినమాటకు జవాబు చెప్పండీ.

వెంక:—నాడబ్బోయ్! బాబోయ్!

హను:—నాగన్నా, నాగన్నా ఇలారా వోకమాటు.

('అమ్మా, వస్తున్నానండి' అని అంటూ నాగన్న వస్తాడు.)

హను:—నాగన్నా!

నాగ:—అమ్మగోరండి.

హను:—అయ్యగారిలాగ మతిగోరగక మాటాడుతున్నారు. నాకేం తోచకుండా వుంది. ఇవాళ బగ్గీమీద యెక్కడికెళ్లేరో, యేమిటో చెప్పు.

నాగ:—అమ్మా, నేను బగ్గీతో యెల్లలేదండి.

హను:—మరి నువ్వుకూడా వెంట వెళ్లేవుకామా.

నాగ:—నన్ను యిల్లు సూసిరమ్మన్నారు కాదండి అయ్యగోరు, తమరితో తలుపేసుకోండని చెప్పి మల్లీ యెల్లిపోయేనండి, అయ్యగారిని కలుసుకుందామని. అయ్యగోరు కొరకేలేదండి. ఆమట్టు గారికోసం బజారంతా యెతికియెతికి కాపడకపోతే యింటికెలిపోయేనండి.

హను:—అయితే నువ్వు అయ్యగారితో వెళ్లలేదూ?

నాగ:—ఎల్లలేదండమ్మా. కావలిస్తే అయ్యగారినే అడిగి సూడండి, నామాట అబద్ధమైతే. ఆరే నన్ను సంపెత్తారు.

హను:—ఛీ! వెధవా! అవసరం మాలిన మాట లాడకు. నువ్వు వెళ్లి ముసలయ్యని పిలుచుకురా. జరిగిన సంగతంతా వాడు చెప్తాడు.

నాగ:—చిత్తమండి అమ్మా పిలుస్తానండి. (వెళతాడు.)

హను:—ఈలోపల దిష్టి తీస్తా. (వెంకటరామయ్యకి దిష్టి తీస్తుంది. ముసలయ్య వస్తాడు. వచ్చి నేలమీద కూచుని చెంపలికి చేతు లానించుకుని కూచుంటాడు.)

హను:—వచ్చేవూ ముసలయ్యా!

ముస:—చిత్తమండమ్మా. లేస్తే కూకోలేను, కూకుంటే నెగలేనం డమ్మగారూ.

హను:—ముసలయ్యా! ఇవాళ అయ్యగా రెక్కడి కెళ్లేరు సాయంత్రం?

ముస:—చిత్తమండమ్మా, అయ్యగా రెల్లేరండి.

హను:—సాయింత్ర మెక్కడికి షికా రెళ్లేరని అడుగుతున్నా.

ముస:—అదండీ, తమ రడగటం?

హను:—చెప్పు వేగిరం.

వెంక:—బాబోయ్! నాడబ్బోయ్!

ముస:—అమ్మా, అయ్యగారండీ 'ఒరే ముసలయ్యా వోరేయ్, వోక పెద్దబట్టలకొట్టు రెండువేలరూపాయిల ఖరీదుది రెండొందల కిచ్చేత్తున్నారురా. అక్కడికెల్తున్నారా' అన్నారండి. 'సిత్త మండి మాప్రభో నాకీనాం దయసేయించాలండి' అన్నానండి. 'నువ్వు యేరే అడగాలిట్రా, యెదవా' అన్నారండి. 'ముసలి ముండా వోణ్ణి, యేలినవారి కటాచ్చం' అన్నానండమ్మా.

హను:—అయితే యెక్కడికి తోలుకెళ్లేవు బగ్గీని?

ముస:—బజారెంటండి.

హను:—బజారులోనేలే, యెక్కడికీ అని.

ముస:—నాకు కల్లాపడవండి, మాప్రభో. అయ్యగా రాపమన్న చోట ఆపి బండీ దిగి కూకున్నసోటే కునుకుపాట్లడ్డానండి.

హను:—ఎక్కడ ఆపేవో జ్ఞాపకం తెచ్చుకో.

ముస:—చిత్తమండి, గాపకం లేదండి.

హను:—అయినా ఆలోచించు.

ముస:—సుర్తు లేదండమ్మా. కల్లాపడవు. ముసిలోణ్ణి. ఇం కెంత కాల ముంటానండమ్మా? బేగే యెలిపోతానండి.

హను:—సరేకాని నీకు జ్ఞాపకం లేదూ.

ముస:—లేదండమ్మా.

హను:—అయ్యగా రొచ్చేటప్పుడు బండీలో కేకలెట్టేరా?

ముస:—లేదండమ్మా, బగ్గీచప్పుడేగాని మరేమీ యినపడలేదండి.

హను:—ఊఁ, అంతా నాఖర్మం.

వెంక:—ముసలయ్యా, నాడబ్బేదిరా? ఒరేయ్, డబ్బిచ్చెయ్యి.

ముస:—బాబూ! అయ్యా!

హను:—నువ్వెళ్లి అవతల కూచో. మళ్లా పిలుస్తా.

వెంక:—నన్ను కొట్టి చంపెయ్య మన్నానోయ్! కొట్టనుగాక కొట్ట న్నారోయ్! నాడబ్బు! బాబోయ్!

హను:—కొట్టలేదుకదా! అమ్మయ్య! నాగుండెలు కుదుటపడ్డాయి. ఇదిగో వెధవడబ్బు పోతేపోయింది. దెబ్బలు కొట్టనందుకు సంతోషించండి.

వెంక:—నాడబ్బు పోయింది. చచ్చిపోతాను. ఇంక బతకను. బతక నోయ్ బాబూ.

హను:—వెధవడబ్బుకోసం ఆలాగు బెంగపెట్టుకు యేడిస్తే యెలాగ? నన్ను తగలేసినంత డబ్బుంది యింట్లో.

వెంక:——నే బతకను, బాబోయ్! బతకను. నే చచ్చిపోతా, చచ్చిపోతా.

హను:——ఇంక నాకేం దారి నాయనా. ఇదిగో మొదట భోం చెయ్యండి. కొంచెం పొట్లో స్తిమితంగా వుంటుంది.

వెంక:——ఆకలి లేందే. జ్వరం బాబోయి జ్వరం.

హను:——ఇదిగో, నామాట విని యింత జావో, కాఫీనో తాగండి, చేసిస్తా. తర్వాత నిద్రపడితే తెల్లవారేటప్పటికి సర్దుకుంటుంది.

వెంక:——నాకు తిండొద్దోయి! నేను బతకనోయ్!

హను:——నాకేం దిక్కురా భగవంతుడా! నాగన్నా! నాయనా! తండ్రీ! ఇలాగ రా బాబూ, వొక్కమాటు. ('వస్తున్నానండి అమ్మా' అని నాగన్న వస్తాడు). నాగన్నా, వెళ్లి వైద్యుడి గారి నొకమాటు పిలుచుకురా, అయ్యగారికి వొంట్లో బాగుండ లేదని.

నాగ:——చిత్తమండి అమ్మా, పిలుచుకొస్తా. (వెళతాడు).

హను:——ఇదుగో నామాట కాస్త వినుదురూ.

వెంక:——నాదగ్గర డబ్బులేదు, నాయనా, డబ్బు లేదు.

హను:——ఎవరా నాయిళ్లు? ఏ నాయుడు లాక్కున్నాడు?

వెంక:——...............

హను:——అడిగినదానికి జవాబు చెప్పండి.

వెంక:——...............

హను:——ఏ నాయిళ్లు లాక్కున్నారో, యేం గొడవో? వెళ్లేటప్పుడే అనుకున్నాను యిలాటి వుపద్రవం వస్తుందని. లేకపోతే యెన్నడూ లేని కళకాంతులు రావడమేమిటి మొహానికి. ఏజన్మానా వవ్వెరగని మనిషి, నవ్వడమేమిటి? అయ్యో దేవుడా! ఏదో యింత తిని తిరుగుతూన్న మనిషిని తిన్నగా తిరగనిచ్చేవు కాదు. పాపిష్టి దేవుడా యింకేం దిక్కు?

( నాగన్న వస్తాడు )

నాగ:—అమ్మా, డాక్టరుగారిని తీసుకొచ్చేనండి.

హను:—ఇలా రమ్మను నాయనా. ఇలా రండి బాబూ.

( వైద్యుడు వస్తాడు )

అయ్యా! యెవరో నాయిళ్లు మావారిదగ్గిర డబ్బు లాక్కున్నారుట. వొళ్లు తెలియకుండా వచ్చిపడ్డారు.

వైద్యు:—(ఆశ్చర్యంతో) ఏమిటే, డబ్బు లాక్కోడమే!

హను:—ఎవరో దుర్మార్గులు లాక్కున్నారుట.

వైద్యు:—అయితే పోలీస్‌చార్జీ యిచ్చేరా, లేదా యింకాను?

హను:——ఇప్పుడే యింకా వచ్చిపడ్డారు

వెంక:——నాడబ్బోయి! నారూపాయిలోయ్!

వైద్యు:——అదేమిటే అప్పుడే సంధించింది!

హను:——ఒళ్లు తెలియకుండా పడిపోతేనే.

వైద్యు:——వెంకటరామయ్యగారూ...ఏమండోయి! వెంకటరామయ్యగారూ!...పిలుస్తే పలకరేం?

హను:—అసలు స్మారకం లేందే. ఏదేనా మంచి మందిచ్చి రక్షింతురూ బాబూ. మిమ్మల్నే నమ్ముకున్నాను. మీరే బతికించాలి.

వైద్యు:——ఈమాత్రానికే అంత భయమెందుకండీ. మరేం భయం లేదండమ్మా. ఇలాంటి జబ్బులు లక్ష కుదిర్చేం. నెత్తిమీద వెంట్రుక లెన్ని వున్నాయో అన్ని కుదిర్చేను. ఇదో లెక్కా యేమిటి?

హను:——మీమీదే భారం వేసేను. మీరే రక్షించాలి.

వెంక:——నాడబ్బోయి! నారూపాయిలోయ్!

వైద్యు:——మీరు మరేం భయపడకండమ్మా నేను మందిస్తాను. రేపటితో అదే తగ్గిపోతుంది. నేను యింటికి వెళ్లి మందు పంపిస్తాను. ఆమందు మూడుగంటల కొకమారు చొప్పున యివ్వండి. టక్కున కట్టేస్తుంది, రేపటికి. మీ బంట్రోతుని పంపించండి.

హను:—అన్నం పెట్టించమన్నారా?

వైద్యు:—ఇప్పట్లో అన్నం విషతుల్యం. అంతకంటె వేరే చెప్పక్కర్లేదు. ఆయన అంతగా ఆకలంటే, యింత గోధుమజావో, లేక సగ్గుజావో మరంటే కాఫీవో యియ్యండి. ఆయనకనక అడగడా, భేష్ నిరాహారంగా వుంటేనే మంచిది. ఉపవాసం కంటె శ్రేష్ఠమైన మందే లేదసలు. రేపటిమాట చూద్దాం. నిమ్మళిస్తే రేపే లఘువుగా పథ్యం పెట్టొచ్చు. మరి నేను సెలవు పుచ్చుకుంటానండి. నాగన్నను పంపించండి మందుకి.

హను:—ఏదో మంచిమందిచ్చి తమరే రక్షించాలి. మిమ్మలినే నమ్ముకున్నాను.

వైద్యు:—మరేం ఫర్వాలేదండమ్మా. మీరుమట్టుకు భయపడకండి.

హను:—మంచిదండి.—నాగన్నా!



 1. చెన్నపురి సంగీతపరిషత్తు - ప్రారంభోత్సవము-1932; 2. భారతీయ సంగీత గ్రీష్మపాఠశాల, చెన్నపురి.





1. రెండవ దక్షిణభారత హిందీపట్టప్రదానసభ; 2. వాగ్గేయకారకరత్న, హరినాగభూషణముగారికి బందరులో సన్మానము.

నాగ:—అమ్మా.

హను:—వారితో వెళ్లి, వారు మందిస్తారు, పట్టుకురా.

నాగ:—చిత్తమండి. (ఇద్దరూ వెళతారు.)

వెంక:—నాడబ్బోయి, బాబోయ్! నే నియ్యను బాబోయ్!

హను:—నాకు వణు కేసుకొస్తూంది. ఈరాత్రి యెలాగ గడుస్తుందో యేమిటో? సూర్యనారాయణమూర్తీ, తండ్రీ, రక్షించు. నాయనా! నిన్ను చూడనిరోజున నేను భోంచెయ్యను. తండ్రీ తిరపతి వెంకటేశ్వరులూ, కాచు నాయనా. ఈజబ్బు నిమ్మళిస్తే నీకొం డెక్కి నీదర్శనం చేసి నీకు పదితులాల వస్తువు చేయించి పెడతాను బాబూ, రక్షించు రక్షించు...

ముసలయ్యా!

("ఓయ్ అమ్మా" అంటూ ముసలయ్యా వస్తాడు.)

ముసలయ్యా! నువ్వు వెళ్లి దేవతార్చనపు శాస్త్రుల్లుగారి నడిగి మంత్రించిన విభూతి తీసుకురా, పో.

ముస:—చిత్తమండి. (వెళతాడు)

వెంక:—నాయనోయ్, బాబోయ్!

హను:—ఏమీ, యెందుకూ?

వెంక:—నన్ను చంపెయ్యి, నాడబ్బిచ్చెయ్యి.

హను:—అయ్యో డబ్బా! ఇదెక్కడి డబ్బమ్మా! ఇదిగో మీరు నాకుకాదు. ఆడబ్బుకి ముడివేసేరు. విన్నారా? ఓయ్!

వెంక:—రెండువందల రూపాయిలోయ్!

(నాగన్న వస్తాడు)

హను:—ఏదీ మందు తెచ్చేవా?

నాగ:—ఇదిగోనండి, వైనమంతా తమతో మనవిచేసేనన్నారండి డాక్టరుగారు.

హను:—ఔనులే......మందు తాగండీ......మిమ్మల్నే......విన బడలేదూ.

వెంక:—రెండువందల రూపాయిలోయ్!

(దేవతార్చనపు బ్రాహ్మడూ, ముసలయ్యా వస్తారు)

దేవ:—అమ్మగారు నాకోసం కబురుపంపేరుట.

హను:—మంత్రించిన విభూతి తెచ్చేరా?

దేవ:—చిత్తం తెచ్చేనండి. ఇదిగోనండి.

హను:—ఆ దక్కడ వుంచి నేను మీ కో రూపాయిన్నర యిస్తాను. మాతమ్ముడు సీతారామయ్య కొక టెల్లిగ్రాపు వేయించి పెట్టండి, వేగిరం రమ్మని, మాబావకు వొంట్లో నిమ్మళంగా లేదనీ, మరేమో వేగిరం రావలసిందనీ.

దేవ:—మరేం భయంలేదండమ్మా.

హను:—వేయించండి మొదట.

దేవ:—చిత్తం చిత్తం.

హను:—(డబ్బిచ్చును) వేగిరం వెళ్లిరండి.

దేవ:—సెలవండి. (వెళ్లును)

(మంత్రించిన విభూతిని హనుమాయమ్మ వెంకటరామయ్యకి పెడుతుంది.)

వెంక:—బాబోయ్! బాబోయ్! కొట్టేయ్! కొట్టేయ్!

హను:—(వెంకటరామయ్యవొళ్లు చూచి) అబ్బో! జ్వర మెంత వుమ్మరంగా వుందో! ఏమిటే నాకు దిక్కు? నాగన్నా! ఓనాగన్నా!

నాగ:—అమ్మా!

హను:—ఇదిగో నువ్వు వెళ్లి వైద్యుడిగారిని మరొకమాటు పిలుచుకురా. వేగం రమ్మను.

నాగ:—చిత్తమండి. (వెళ్లును)

(దేవతార్చనపు బ్రాహ్మడు వస్తాడు)

హను:—అప్పుడే వచ్చేసేరేం? వేసేరా?

దేవ:—అమ్మ, నాకు మరేమో ఇంగ్లీషు రాదు కాదండి. అంచేత మా అబ్బాయి కాడబ్బిచ్చి బైసికిలుమీద వెళ్లి టెల్లిగ్రాపు వేసి రమ్మని పంపించేనండి.

హను:—మంచిపని చేసేరు.

దేవ:—అమ్మా! నే నొకటి మనవిచేస్తాను. ఆలోచించి తమకి నచ్చితే చెయ్యండి, నచ్చకపోతే మరేమి అభ్యంతరం లేదు.

హను:—ఏమి టది? చెప్పండి.

దేవ:—మనవిచేస్తా. పూజారిరమణయ్య మొన్న యిలాంటిదే వొక ళ్లకి వస్తే యిట్టే కుదిర్చేసేడు. అతను మహాఘట్టివైద్యుడని దేవాలయంచుట్టూవున్న కాపా ళ్లంతో చెప్పుకుంటారండి.

హను—అలాగే చూద్దాం లెండి. ఇప్పు డొకవైద్యుణ్ణి పెట్టేంకదూ.

దేవ—ఔను లెండమ్మా. అది కాకపోతే, కంసాలి వీరబ్రహ్మాన్ని పిలిపించినా సరే. అతనూ ఘట్టివాడేనండి. మొన్న 'నాకు విరోచనాలమాత్ర వొక టిప్పించవోయ్ వీరబ్రహ్మం' అని అడిగితే మహాఘుంచిమాత్ర యిచ్చేడండి. ఆమాత్ర పుచ్చుకున్నాక

రోజుల్లా నలభైవిరోచనా లయి వొంట్లో కల్మషం లేకుండా కొట్టేసింది. ఆఖరికి లేచి నిలుచోడానికి వొంట్లో వోపిక లేకపోయినాకూడా విరోచనాలు కట్టలేదండి. ఒంట్లో యేమీ కల్మషం మిగలలేదండి. అలాంటివైద్యుడు. మహాఘటికవైద్యుడు!

హను:—ఇప్పటిమట్టుకు మనకు తెలిసినవైద్యుణ్ణే పెట్టేంకదూ.

( వైద్యుడు వస్తాడు )

దేవ:—వచ్చేరా తమరు. దయచేయండి. తమంత ఘటికవైద్యుడీవూళ్లో లేడని ప్రసిద్ధి! మహామంచివైద్యం!

హను:—బాబూ, మళ్లా మీ గోనూటు చెయ్యిచూడండి. నాకు ధైర్యం చెప్పండి తండ్రీ!

వైద్యు:—( చెయ్యిచూసి ) ఇందాకంటే. అయితేనుట్టుకు జ్వరం కాస్త అధికంగా వుంది. అంతేగాని మరేం లేదు. మీరు నాగన్నని పంపించండి, మరొకమందుకూడా యిస్తాను. అదీ, నేను మొదట పంపించినమందూ రెండూ కలిపి వేస్తూవుండండి. మరేం భయపడకండి. అదే తగ్గిపోతుంది, తెల్లారేటప్పటికి.

హను:—మిమ్మలినే నమ్ముకున్నాను. మీమీదే రక్షించే భారమంతా వేసేను.

వైద్యు:—మరేం భయం లేదండమ్మా. నే నున్నాకదండి. ఆయన ప్రాణానికి నాప్రాణ మడ్డేస్తా. సరా మీకింక నమ్మక మేనా?

హను:—ఏదో రక్షించండి బాబూ. (వైద్యుడు వెళతాడు. హనుమాయమ్మ దేవతార్చనపు బ్రాహ్మడివైపుచూసి) శాస్త్రుల్లుగారూ! మీ రివాళ రాత్రి యిక్కడే వుండిపోవాలి. నే నొక్కర్తెను, ఆడదాన్ని. ఇంట్లో మరేమొగసహాయం లేదు మీరు నామాట తీసెయ్యక యిక్కడే వుండాలి.

దేవ:—చిత్తం అలాగేనండమ్మా. తమ రన్నిమాట్లడగాలా అండి. నాగావంచా యీబెంచీబల్లమీదో, ఆగచ్చుమీదో వేసుక యిక్కడే పడుక్కుంటానండమ్మా.

(తెర వాలుతుంది)

ఆరో రంగం

( పొద్దున్న )

(వెంకటరామయ్య మంచంమీద పడుక్కుని వుంటాడు. దగ్గరబల్లమీద హనుమాయమ్మ కూర్చునివుంటుంది. దేవతార్చనపు బ్రాహ్మణుడు నిలబడివుంటాడు.)

హను:—అయ్యా! శాస్త్రుల్లుగారూ! మీరు రైలుస్టేషనికి వెళ్లి మా తమ్ముడు వచ్చేడేమో వొకమాటు చూసి, వచ్చివుంటే వేగిరం తిన్నగా మనింటికే తీసుకురండి. ఊరంట పెత్తనానికి వెళ్లనియ్యకుండా మొదట యిక్కడికే తీసుకురండి.

దేవ:—చిత్తమండి. ఆలాగే తీసుకొస్తానండి.

హను:—వేగిరం వెళ్లిరండి. మళ్లా యేదేనా పని వుంటుంది.

దేవ:—అలాగేనండి. ఇక్కడున్నట్టుగా వెళ్లి చక్కా వస్తానండి.

హను:—వెళ్లిరండి. (దేవతార్చనపు బ్రాహ్మణుడు వెళతాడు.)

( నాగన్న వస్తాడు )

నాగ:—అమ్మా!

హను:—ఊఁ. ఎందుకు?

నాగ:—పోలీస్ సబిన స్పెట్టరుగా రొచ్చేరండి. పంతులుగారితో ఏదో మాట్లాడవలసిన పనుందిటండి. తమ సెల వైతే వొస్తారండి.

హను:—ఇలా రమ్మను లోపలికి.

నాగ:—చిత్తమండి. ( వెళతాడు )

( పోలీస్ సబ్ ఇనస్పెక్టర, నాగన్న వస్తారు.)

హను:—(తలుపుచాటున నించుండి) కూర్చోండి ఆ కుర్చీమీద.

పో. స:—( కూచొనును ) నిన్న పంతులుగారి నెవళ్లో దోచుకుపోయేరని మాకు వైద్యుడుగారు తెలియజేసేరు. దాని విషయమై సంగతులు తెలిసికోడానికి వచ్చేను. పంతులుగారిని పిలిపించండి, అడుగుతా.

హను:—వారి కొంట్లో యేమీ నెమ్మదిగా లేదు. సుస్తీగా వున్నారు. ఆదోపిడివిషయమై నాకు తెలిసినంతమట్టుకు నేను ఈ కాగితంమీద రాసివుంచేను. తాము చూడవచ్చు. నాగన్నా, ఈకాగితం వారి కియ్యి.

నాగ:—చిత్తమండి. ( కాగిత మందిస్తాడు )

పో. స:—( కాగితం చదివి ) దీనిలో మాకు కావలసిన తబిసీళ్లన్నీ లేవు. ఇంకా అనేకసంగతు లడగాలి.

హను:—వారికి జబ్బుగా వుంది. ఇప్పట్లో అంతకంటే యెక్కువ చెప్పడానికి తెలియదు. వారికి నిమ్మళించేక రెండు మూడు రోజు లయేక వస్తే తక్కినసంగతు లన్నీ తమకి మనవిచేస్తారు.

పో. స:—మంచిది అలాగే. ఈచోరీలో కూపీతియ్యడానికి కీకాగితంలో వున్న తబిసీళ్లు చాలవు. ఇంకా తెలియవలసినవున్నాయి. ఇప్పటికి సెలవిప్పించండి. మళ్లీ వస్తా.

హను:—మంచిది. (పోలీస్ సబ్ యినస్పెక్టరు వెళ్లును)

నాగన్నా!

నాగ:—అమ్మగారండీ!

హను:—నువ్వు వెళ్లి వైద్యుణ్ణి పిలుచుకురా, అయ్యగారు వొంటిమీద తెలివిలేకుండా పడుకున్నా రని చెప్పి.

నాగ:—చిత్తమండి. (దేవతార్చనపు బ్రాహ్మడు, సీతారామయ్య వస్తారు)

హను:—తమ్ముడూ! (కంట నీరు పెట్టుకుంటుంది)

సీత:—విచారించకు. మరేం ఫర్వాలేదు. ఏదో యెప్పుడూ వొంటికి జబ్బు చెయ్యకుండా వుంటుందాయేమిటి? మంచి వైద్యుడిచేత మందిప్పిస్తే అదే తగ్గిపోతుంది. ధైర్యం విడవ కూడదు, ఎప్పుడూకూడాను.

హను:—(విచారిస్తుంది)

సీత:—ఇవాళ యేమేనా ఆహారం తిన్నాడా బావ?

హను:—ఒంటిమీద స్పృహే లేందే. ఇంటికి కెలాగ వచ్చిన మనిషి అలాగే పడుకున్నారు.

సీత:—అలాగా?

(వైద్యుడు వస్తాడు)

హను:—చెయ్యి చూడండి నాయనా!

సీత:—చెయ్యి చూడండి బాబూ!

వైద్యు:—(చెయ్యి చూసి) హెచ్చుతగ్గ లేం కనపడడం లేదు. ఇది మనోవ్యాధి. దీనికి మం దేమిచెయ్యడం. డబ్బు—

వెంక:—నాడబ్బోయ్! బాబోయ్! రూపాయిలోయ్! డ బ్బెవరు తెచ్చేరు?

హను:—తెలివి వచ్చిం దిప్పటికి.

వైద్యు:—(తనలో) ఇది చావుతెలివి కాదుకదా!

వెంక:—డబ్బు డబ్బు!

వైద్యు:—మీరు డబ్బుమీదే దృష్టి పెట్టుకోకండి.

వెంక:—రెండువందల రూపాయిలోయ్!

సీత:—బావా!

వెంక:—డ బ్బెక్కడరా?

వైద్యు:—ఇది మనోవ్యాధండీ. బంట్రోతుని పంపించండి. జ్వరం తగ్గ డానికి మందిస్తా.

హను:— సీత:—మంచిమం దియ్యండి బాబూ.

హను:—డబ్బుకోసం వెనక్కి తీసే మనుష్యులం కాదుగదా. ఏదో మీరు మంచిమం దిచ్చి మమ్మల్ని బతికించాలి.

వైద్యు:—ఎంతమాట! అటువంటిభయ మేం పెట్టుకోకండి. నాది పూచీ. చూద్దురుగాని బంట్రోతుని పంపించండి, మందిస్తా. (వైద్యుడు వెళతాడు. ఇద్దరు కోమట్లు వస్తారు.)

1. వ. కో:—అమ్మగారూ! అయ్యగా రున్నారాఅండి?

వెంక:—బాబోయ్! రూపాయిలోయ్!

హను:—అయ్యగారికి జబ్బుగా వుంది. ఇప్పుడు కాదు, నాలుగురోజు లయేక రండి.

2. వ. కో:—వారితో పనుందండమ్మా.

హను:—ఏంపని?

1. వ. కో:—వారికి కొంత డబ్బిస్తాం.

వెంక:—డబ్బిస్తారా? ఇయ్యండి. తెండి.

1. వ. కో:—అయ్యా! వినండి.

వెంక:—(లేచి కూచుని) ఇయ్యండి మొదట.

హను:—మీరు పడుకోండి మొదట.

సీత:—పడుకో బావా!

వెంక:—నువ్వోచ్చేవుట్రా! ఉత్తరం రాయండే!

సీత:—ఊరికే, నిన్ను చూద్దామని.

వెంక:—డ బ్బేదీ డబ్బు?

1. వ. కో:—అయ్యా, మేము మీకు డబ్బిస్తాం. మా కోపని గాసి పెట్టాలి. మాది గొడుగుల వర్తకం. ఈవూళ్లో చాలాయేళ్ల నుంచి మేము యీవర్తకం చేస్తున్నాం. మాగొడుగులు చాలా మంచివనీ, తమరు పదిహేనేళ్లనుంచీ మాకంపెనీగొడుగులే వాడుతున్నా మనీ, ఇంత చవకైన, యింత నాణ్యమైన గొడుగు లీవూళ్లో లేవనీ తమరు రాసియివ్వాలి.

వెంక:—కలం కాగితం యివ్వండి, రాసిస్తా.

1 వ. కో:—చిత్తం. (వెంకటరామయ్య రాసిస్తాడు. కోమట్లు చదువుకుంటారు)

1 వ. కో:—అయ్యా! ఈ నూరురూపాయలు పుచ్చుకుని మమ్మల్ని కృతార్థుల్ని చెయ్యాలి.

వెంక:—రెండువందలు పోయేయి. అవి యిచ్చేయండి.

హను:—ఆడ బ్బక్కడ పడేసి వెళ్లండి.

1 వ. కో } చిత్తమండి. (కోమట్లు వెళతారు)
2 వ. కో }

వెంక:——నూరురూపాయి లిచ్చేనూ. కొంతేనావచ్చింది. అమ్మయ్యా! చచ్చిపోయినా ఫర్వాలేదు. ఏంసుఖం! ఏంసుఖం!

హాను:——అలాంటి మాట లేమిటి? మందు పుచ్చుగోండి.

వెంక:——మందుకూడా డబ్బు తగలెయ్యాకయేమి శాశ్వతమని. ఏంసుఖం! ఏంసుఖం! దగ్గిరి కొచ్చింది.

హాను:——ఏమిటి?

వెంక:——చావు.

హాను:——అబ్బా! అలాంటి మాట లాడతారేమిటి. ఏమండీ!

సీతా:——బావా!......అయిపోయింది! ఇంకేమున్నది!

హాను:——నాయనోయ్! (మూర్ఛపోతుంది)

(తెర వాలుతుంది)

---

కాబోయే గ్రంథకర్తలకు కొన్ని సూచనలు (నా యూహాప్రపంచమున)



# తోకచుక్క

[ దృశ్యము ]

కుందుర్తి నరసింహారావుగారు

( నాంది )

తోడిచుక్క

మానవా! యిట్టినడిరేయి మనకుమనకు
మాట కలియుట యెట్లోయి?—మంచిచెడ్డ
లేను చెప్పినయవి నిజమైననాడు
నాతఘుకువంటి చిఱునవ్వు నవ్వి పొమ్ము!

మాటేని మరచిపోయిన
వారని మిము దట్టు వింతవచ్చెను; మీలో
మీ రేమనుకొన్నారో
ఊరకచూచుటకె వచ్చియున్నాను సుమీ!

౧

( సందె చీకటి )

పేరయ్య

సరే—

వీర్రాజు

మీ రంతా రావాలి.

పేరయ్య

సరేలేద్దూ—వొస్తానంటినిగా?

వీర్రాజు

అదుగో: ఇంకా 'వొస్తాను' అంటూ నీవొక్కడిమాటే చెపుతావేం? అమ్మాయీ, పిల్లలూ అంతా రావాలి—

పేరయ్య

ఇంటో గొడ్డూ గోదా వుంది—

వీర్రాజు

ఒక్కపూటభాగ్యానికేనా?

పేరయ్య

పసిబిడ్డతల్లి— అది రాకపోతే యేం లేద్దూ: మేమంతా వున్నాంగా నీబొజ్జ గరిగించటానికి—ఇల్లుగుల్ల జేసెయ్యం ఒక్కరోజులోనే!

వీర్రాజు

అబ్బా! ఎంత లేనివాళ్లవయినా ఆమాత్రం పెట్టలేకపోం లేద్దూ! ఆమాట కేంగాని, అమ్మాయి రాకపోతేమాత్రం వూరుకోను; ఇదివరకు సప్తాహానికి రాలేదు, నవరాత్రిళ్లకు రాలేదు,—అబ్బా! ఎంతగొప్పవాళ్లైతేమటుకు మాయింటి కొక్కపూట భోజనానికి రాంగానే అరిగిపోతారేవిటి? ఏదో మాతోపాటు, ఉప్పో కారవో—

పేరయ్య

ఇదుగో, నువ్వట్టా అంటే యిహ నే నేం జెప్పేది? ఒక వూళ్లో వున్నవాళ్లం రాకపోతావా, పోకపోతావా! ఏదో, యిప్పు డంటే దానికాస్త పథ్యం, అవీ జరగాలి సుమ్మీ. నెత్తురుగుడ్డును వెంట తీసుకురావటానికి వీల్లేదు. అసలే రొంపభారంతో యేడుస్తున్నది. నడవలేదు, అని—

వీర్రాజు

నడవటం! నడవటం దేనికీ,—బండి పంపిచ్చకుండా, వొచ్చి తీసుకురాకుండా వుంటానా?—ఇదుగో అబ్బాయ్! ఇవ్వాళమాత్రం మీ యింటో పొయిరాజెయ్యనియ్యను, తెలిసిందా?

పేరయ్య

ఏదోలే, నాయనా, ఒక్కగా నొక్క కొడుక్కి వొడుగు జేసుకుంటున్నావు. నీ కష్ట సుఖాలుమాత్రం—అయితే నూ, అమావాస్యముందఱ పెట్టుకున్నావేఁవిటీ తగలాటఁ వంతానూ? కటికిచీకటాయె, ఖర్మం! వీళ్లందఱ్నీ ఒకటికి రెండుసార్లు పిలిస్తేగాని రారు—పాడు,—ఈ నెల్లో వెనకెప్పుడూ కుదర్లేదేఁవిటీ నీకు లగ్గాలు?

వీర్రాజు

ఏదో, అకస్మాత్తుగా వొచ్చిందీ వ్యవహారం; మా అమ్మ మంచాన బడదా? ఏదో ఆకాస్త శుభం చూసిపోతా, నాయనా, కానీకానీ అని పీక్కుతింటం మొదలెట్టింది— ఆదుర్దా పడితే, యేఁవుందీ, అవధాన్లుగా రెప్పుడో అప్పుడు తేల్చేస్తాడు: మనకేం తెలుసా, పాడా?—వెధవ చీకటి, కష్టంగానే వుంది; మన పల్లెకొంపల్లోనే యీ దౌర్భాగ్యంగాని, అట్టా రాణీపేటలో చూండు: కొత్తగా మెలెట్టర్ వేశారట. ఊరంతా వెలిగిపోతుంది, చూడు— ఆరుమైళ్లదూరాని కావెలుతురు—

పేరయ్య

ఆఁ—అబ్బే—రాణీపేటలో లైట్ల వెల్తురా అది?

వీర్రాజు

అప్పుడే సూర్యుడు పుడుతున్నాడా మరి?

పేరయ్య

అటువైపాకాశమంతా పట్టపగల్లా వుంది; దీపాలైతే యింతదూరం రావయ్యా—

వీర్రాజు

ఎందుకు రావయ్యా? ఇటు చింతతోపులోంచి చూస్తే మినుకుమినుకుమంటూ—

పేరయ్య

అవ్వన్నీ నక్షత్రాలే గాని—నాకో అనుమానంగా వుంది—

వీర్రాజు

ఏఁవిటి?

పేరయ్య

వొఠ్ఠి అనుమానఁవే—

వీర్రాజు

చెబుదూ—

౨

[ ఆరుబైట ]

వెంకు

అమ్మో......

సుబ్బి

ఏఁవిటిరా?

వెంకు

బాబో......

సుబ్బి

ఏడిశావు, కుంక!

వెంకు

అక్కా! అక్కా!

సుబ్బి

ఏఁవిటిరా?

వెంకు

బాబో!

సుబ్బి

ఛీ!—నోరు మూసుకో—

వెంకు

బయం! అమ్మమ్మను పిలూ.

సుబ్బి

భయమైతే అమ్మమ్మెందుకూ, ఆడదీ? తాతయ్యను పిలుస్తే దుడ్డుకఱ్ఱతో వొదిలిస్తాడు భయఁవంతా.

వెంకు

అమ్మమ్మను పిలూ! అదుగో—ఉంకోటి!—అమ్మమ్మను పిలూ.

సుబ్బి

ఏఁవిటి గాడిదా ?

వెంకు

అట్లైతే నేను లోఁపలికి పోతానమ్మా !—పిలూ—

సుబ్బి

అదుగో, లోపలికి పోగూడదురా అంటే— అంతా బ్రాహ్మలూ, మడీ......ఆ గంతా, బొంతా వేసుకోని వాళ్లను తాకుతావా యేఁవిటి ఖర్మం ?

వెంకు

నే పోతానమ్మా—పిలూ !

సుబ్బి

ఏఁవొచ్చిందిరా యిక్కడ ?

వెంకు

వొస్తుంది, మొస్తుంది—నే చెప్పలేనే దానిపేరు—అమ్మమ్మకు తెలుసు— అమ్మో; నాకూ తెలుసు —ఆఁవె శాస్త్రాల్లో చెబుతుండేదే,—అది--అమ్మమ్మని పిలూ...

సుబ్బి

అదేఁవిటో చెప్పు.

వెఁకు

ఆఁవెను పిలవ్వే— ప్రారిథేనూ !

సుబ్బి

ఏఁవిటో చెబితే...............!

వెంకు

నీ క్కనపట్టం లేదుటే?— ఇంకా బాఁగా కనపట్టం లా. అదొచ్చిందంటేనా, అమ్మో, యిహా మనం బతుకుతాఁవా?—ఒస్తుంది: ఒహాటే ననుకున్నా, అమ్మయ్యో!

సుబ్బి

అబ్బ ! చంపుతున్నావురా— రాకసా యేఁవిటి ?

వెంకు

ఛీ! రాకసైతే నాకు భయఁవా? ఆభయం నిన్ననే పోయింది—ప్రతిరాత్రీ అమ్మమ్మ యెన్ని రాకసులకథలు చెప్పడంలేదూ !—రాకసంటే మహా మన అమ్మమ్మకంటే పెద్దదా యేఁవిటీ ?

సుబ్బి

మిడికావ్—తాడిచెట్టం తుంటుంది, తెలుసా ?

వెంకు

ఉంటే యేఁవే?— బామ్మ మడిగట్టుకున్నప్పుడు నువ్వు పోయి తాకూ, ఆఁవె యెంతెత్తు లేస్తుందో !......

సుబ్బి

ఇంతకూ నీయెత్తులన్నీ దేనికీ ?

వెంకు

నాకు భయఁ వేస్తుంది —

సుబ్బి

ఎందుకు చెప్పరా !

వెంకు

అదొస్తుంది—

సుబ్బి

ఏది ?

వెంకు

నీ నెత్తి ! దానిపేరు నేను చెప్పలేను—అమ్మో ! గుండెలు పగలవే! ఇంకొక్కనిమిషం—ఉండు.....అదొచ్చిందంటే నిన్నిక్కడే వొదలిపెట్టి నేను గభాలున యింటో దూరి తలుపు వేసుకుంటా నమ్మాయ్ !

సుబ్బి

పరవాలేదులే, చెప్పు.

వెంకు

ఆపేరే ?

సుబ్బి

ఊఁ !

వెంకు

దానిపేరే ?

సుబ్బి

బాద్దా, తెలిసిందా ?

వెంకు

నువు బాదు, నరుకు—అమ్మో! దానిపేరు చెప్పడఁ వే!—ఆగు—నన్ను పోనీ—

సుబ్బి

చెప్పవు(టా?

వెంకు

నన్నుపోయి నాన్నచాటున నాక్కోనీయవే—

సుబ్బి

ఓరి, యెగతాళా?

వెంకు

ఎగతాళి! ఎగతాళేఁవిటి, ఒహచెంప వొచ్చి ఊరిమీద పడుతుంటే నే!

సుబ్బి

ఓయమ్మో! బందిపోట్లు(టా?

వెంకు

బందిపోట్లైతే తప్పెట లుండవ్రా?

సుబ్బి

పేద్దపేద్దకొరువు లున్నయ్యా?

వెంకు

ఆ, ఆ—అమ్మో! కొరివిదయ్యమేవ్!

సుబ్బి

బాబో......

## 3

[ నడివీథి ]

రెడ్డి

నీళ్లురా, నీళ్లు—కావళ్లు బైటెయ్యండిరా; పరిగెత్తండి, పరిగెత్తండి—

పోలిసెట్టి

ఇంతకూ అది మాలపల్లా, తురకపాలెఁవా?

సూరిగాడు

సాలెగూడెం సామీ—

వీరన్న

హేఁ, కాదుం(డా—కోయోళ్లొచ్చి ఆడ దిగారంట, పొద్దున్నే; ఆళ్ల గుడిసెల్లో యేందో......

రామస్వామి

వాటకుబళ్లేవో దారినిబోతున్నయ్యనుకుంటా(నా—వాళ్లేదో ఒక్కొక్కటే ముట్టించి సర్దుకుంటూ వుండొచ్చు—

రెడ్డి

అయినా పోయి చూద్దాం, రారాదూ?

రామస్వామి

రండి, రండి.

పోలిసెట్టి

బండి, బండి—అబ్బే! ఉత్తబండేరా—నువ్వన్నట్టు—

వీరన్న

పోదురు సెట్టెయ్యా! నువు రాకపోతే యీాడే కూకోద్దూ; మాం పోతుండం—పదన్నా పద!—ఏయ్ సిన్నాఁవో, ఆడ కఱ్ఱుండది, తీస్కొ లగెత్తుకురాయే—

రామస్వామి

ఒరి, నే సెప్పులు దొడుక్కొనొస్తా వుం(డా—

పోలిసెట్టి

నేనుగూడా శాలువా గప్పుకోని వొస్తావుండండి.

వీరన్న

డుబ్బు! చాల్వాకి, నీకేం సలేస్తుండదా సావుకారయ్యా, ఓ సెంప వూరు దగలడుతుంటే?

పోలిసెట్టి

ఎరేయ్, నేం జెప్తానుం(డా: ఊరంటుకుంటే మంటలు కనబడవు(టా? పొగలు రావు(టా?—అంతా వుత్తది, అది నిప్పుకాదు—

రామస్వామి

నిజం, నిజం.





(7) 1. అఖిలభారతమహిళామహాసభ, సప్తమసమావేశము, చెన్నపురి ; 2. చెన్నపురి విశ్వవిద్యాలయము- నూతన స్త్రీపట్టభద్రులు. 1932





1. శ్రీ అన్నపూర్ణాదేవి జాతీయ బాలికా విద్యాలయ పంచమవార్షికోత్సవము, ఏలూరు;
2. దక్షిణ భారత హిందీప్రచార సభవారి అంతిమపరీక్షలకు హాజరయిన విద్యార్థినులు.

వీరన్న

ఏటి సాఁవీ, నిజం? ఎవరేదంటే అదీ నీకు?—అయితే, చెట్టెయ్యా, నుప్పు కాకుంటే యేందంటావు నువ్వు?

పోలిసెట్టి

అదేఁవిటో కనుక్కోటానికేగా మీ రంతా పోవటఁ విప్పుడు?

వీరన్న

ఆఁ. పోయి సూసొస్తాఁ వుండు.

పోలిసెట్టి

నే నక్కడికి పోకుండానే కనుక్కొంటాఁ చూడు—

రెడ్డి

ఎట్టానయ్యా, ఎట్టా?

వీరన్న

సో దడగత్రాడా.

పోలిసెట్టి

అదీ మీ ఆడాళ్లేగా చెప్పేది!

వీరన్న

మాఆడోళ్లు సెప్పేదంతా మీరు నమ్ముకుంటారుగాని మేం నమ్మం—అది తెచ్చేబియ్యం తింటాంగాని, ఆ పాటంతా మేఁ వెరగం.

రెడ్డి

అయినా, చెప్పన్నా, చెప్పు.

పోలిసెట్టి

అప్పుడేనా? ఇం కాసే వుండాలి.

వీరన్న

ఆఁ. అదంతా తగలడి బూడిదైందాక. అప్పుడంటాడు 'చూశావా, నుప్పూ లేదు గిప్పూలే' దని!

పోలిసెట్టి

అరె, తగలట్టం లేదురా అంటే— అంతవరకు నాకు తెలుసు; ఆపైన అయ్యవార్నడిగితే తెలుస్తుంది —

రెడ్డి

ఎవరు? పేరయ్యశాస్త్రుల్నా?

పోలిసెట్టి

ఆయన్నే—వీర్రాజుగారింటో యివ్వాళ దిట్టంగా గారెలు బడ్డట్టునై౨, ఆలస్యంగా వొస్తున్నాడు—

వీరన్న

ఇంటాడయ్యో, ఇంటాడు— ఆమైనొచ్చి మనమీద బడ్డాడంటే, ఆనిండుబొట్టకింద నల్లుల్లాగా నలిగిపోవాలిసిందే మనఁవంతానూ—

పోలిసెట్టి

ఆయనకేంరా, మహారాజు— భోజనఁవైందా, శాస్త్రుల్లు గారూ?

పేరయ్య

మీరు వెళ్లలేదేం? మీక్కూడా విందేగా యివ్వాళ?

పోలిసెట్టి

విందు సరేగాని మిమ్మల్నిప్పు డోహ ప్రశ్న అడగదలచుకొన్నాం, కూచోండి.

పేరయ్య

ఇప్పుడు కూచున్నేట్టు లేదు: నాకు మనసులో ఒక ఆలోచన పుట్టి గందరగోళం చేస్తుంది; అది తేలక తన్నుకుంటున్నా యిందాకణ్నించీ—నన్ను పోనీండి—

పోలిసెట్టి

ఏఁవిటండీ అంతకష్టం? మాకు చెప్పగూడదూ?

పేరయ్య

ఇస్, మీకేం తెలుస్తుం దాసంగతి? అది అర్థంకావడఁ వంటే సామాన్యమా?

వీరన్న

సామాన్యఁవా? సామాన్యఁవా? సెట్టిగారు శాస్త్రుల్లుగారి కింద మారితేగాని తెలీదు.

పేరయ్య

ఏడిశావ్ లే, కుంక!

వీరన్న

ఔనండీ మరి: చాస్త్రాలన్నీ సదవకపోతే యెట్టా వొస్తుం దేఁవిటి మరి?

పేరయ్య

శాస్త్రాలు చదివితేనేనా మా కీ శాస్త్రీపే రొచ్చింది?

పోలిసెట్టి

అది పుటకల్లోనే వుందిరా—

రెడ్డి

బెంహ దేముడు రాసిపెట్టాడు.

పేరయ్య

ఆ బ్రహ్మదేవుడి చేష్టలమీదే మా కిప్పుడు పోట్టా టొచ్చింది: అకస్మాత్ ప్రళయఁ వొస్తుందని అవధానంటాడు; ప్రథమపాదంలో ప్రళయం రాదని నేనంటాను; అదీ యిదీ గాదు పెద్దప్రాణఁ వేదో లేచి పోతుందండీ అని చదువుతూ, సంధ్యా లేని సన్నాసి వీర్రా జంటాడు. వాళ్ల కుట్టాడు-మాలముక్కలు చదివేగుంటడు అర్థంలేకుండా వాగి నన్ను మండిస్తాడు—

పోలిసెట్టి

దేన్ని గురించండీ యిదంతాను?

పేరయ్య

ఆఁ, అదంతా కుట్టుకుంకలు మీకు చెప్పగూడదు. మొత్తంమీద దేశాని కేదో పెద్ద అరిష్టం వొస్తుంది—

రెడ్డి

దేశానికేకద, మనవూరికి కాదుగా—

పోలిసెట్టి

ఆహా! మొత్తంమీద పల్నాటిరెడ్డి ననిపించావ్: దేశమంటే యేఁవిటో తెలేదయ్యా నీకు? ఓరి నీ—మన వూరుకూడా దాంటోనే వుంటుంది—

రెడ్డి

ఆఁ! మనవూర్ని పొట్టన బెట్టుకున్నే దేశ మొకటి వొచ్చిందిగా యిప్పుడు? గడ్డపాఱతో గుండెలు చితికేట్టు పొడిచెయ్‌నే!

పేరయ్య

మొనగాడవేగాని, యిదుగో, యివ్వాళ మీ రంతా స్నానంచేసి చక్కహా మడీ భోంచెయ్యండి—

పోలిసెట్టి

ఏం, గ్రహణం పట్టిందా శాస్తుల్లవారూ?

పేరయ్య

ఛా, అమావాస్యరాత్రి గ్రహణఁవేఁవిటిరా, అర్ధాన్నం? ఇందుకనే మీ కేఁవీ చెప్పగూడదనేది—

పోలిసెట్టి

పోనీ, మా కొద్దులెండి: అరుగో, చలపతీ వాళ్లొస్తున్నారు. వాళ్లకైనా చెప్తారా, చదువుకున్న వాళ్లు—మేఁవంతా విన్నన్నా వింటాం—

రామస్వామి

అన్నట్టు, ఆళ్లంతా యేఁవిటట్టా పరిగెత్తుకొస్తున్నారు?

పోలిసెట్టి

కొంప మునిగింది—ఏదో వొచ్చిపడ్డదండీ—

రామస్వామి

శాస్తుల్లుగారూ, చెప్పరూ?

పేరయ్య

లోకఁవంతా ప్రకాశవంతంగా కినబట్టం లేదుట్రా మీకు?

రామస్వామి

అంటే?

పేరయ్య

"...ఆత్మీయమయూఖకందళ శిఖానిష్ఠ్యూతధారా సుధా విధులఙ్, భానుగభస్తితప్తమగు నీ విశ్వంబు........"

రామస్వామి

అమ్మయ్యో! ఆకాశఁవంతా అట్టా మండిపోతుందేం?

పోలిసెట్టి

అమావాస్యనాడు చంద్రుణ్ణి పుట్టిస్తున్నార్రా అయ్యవారు!

రామస్వామి

మునుపు కతల్లో యెవరో పుట్టించారటగదండి ?

పేరయ్య

కాళిదాసు, కాళిదాసు —

రామస్వామి

మేఁవంతా మీకాళ్లదాసులం బాబో— మమ్మందర్నీ రచ్చించాలి—అరిష్టఁవేఁవిటో సెప్పాలి—

రెడ్డి

అదేం చంద్రుడండి సామీ?

చలపతి

అదేదో 'ప్లానెట్.'

వీర్రాజు

అరవైయేళ్ల కిందట మాతాతలనాఁడోహసా రిట్టాగే పుట్టిందిట ; అప్పుడు హైదరాబాదు దివాను అంతర్ధానఁవైనాట్ట—ఇప్పుడిదెందుకు పుటినట్టు ?

చలపతి

ఇంగ్లండులో ఒహసారి యిట్టాగే పుట్టిందిట ; ఆఘనాన్నే కింగెడ్వర్డును కిందబెట్టారుట...ఇప్పుడెందుకు పుట్టిందిది ?

కేశవరావు

మీరు 'లాజికల్'గా ఆలోచించండి : అంతకంటే గొప్ప 'మిస్‌హాప్'స్పప్పుడు యిటువంటి దేఁవన్నా పుట్టిందా? విక్టోరియా 'డెత్త'ప్పుడుగాని, విజయనగర్ 'ఫాల'ప్పుడు గాని, డాక్కలకరు వొచ్చినపుడు గాని—?

వీర్రాజు

ఎన్నిసార్లు మింగినా గవ్వంత సూర్యుడితో కడుపు నిండక, భూలోకం మింగటానికొచ్చిన రాహువేమో యిది ?

చలపతి

సూర్యుడు గవ్వంతైతే భూమి రవ్వంత కాదూ ? ఆమాత్రం జాగ్రఫీ— ?

అవధాని

కేతువు కాదు—ధూమకేతువు—

కేశవరావు

ఈప్లానెట్ పేరేఁవిటిరా ?

చలపతి

అస్ట్రానమర్ నడగాలి ; అబ్జర్వేటరీకి రాస్తాను—

వీర్రాజు

ఊరంతా వెలిగిపోతుంది...హాఁహాఁ !



# 'యదాశ్రౌష' పర్వము

(శ్రీమహాభారతాంతర్గతము)

దివాకర్ల వేంకటావధాని, పాటిబండ మాధవశర్మగార్లు

భారతాగమకర్తారం శ్రీవిష్ణో రపరాకృతిం,
ఛందసాం తం నియంతారం వ్యాసం వందావహే భృశం.

నియతాత్ముఁడు వేదచతు-ష్టయనిష్ఠితుఁ డాంధ్రవాణి సర్వస్వము న
న్నయభట్టారకు చరణ-ద్వయి కంజలిసేతు మతులభక్తినియుక్తిన్.

హరిహరనాథ పాద జలజార్పితవర్తనుఁ డాంధ్రకావ్యకృ
ద్వరగురుమూర్తి, యోగపరిపాలితచిత్తుఁడు, సుందరాంగకుం
డురుమహిమాన్వితుండు, కవియోగివరేణ్యుఁడు, తిక్కయజ్వ సు
స్థిరకరుణాప్రసన్నుఁ డయి చేకొనుఁగావుత మా నమస్కృతుల్.

ధృతరాష్ట్రుఁడు సంజయుని కిట్లని చెప్పఁదొడంగె.—

ఆయతచాప మెక్కిడి ధరాధిపు లెల్లరుఁ జూచుచుండ వై
హాయసవీథికాభ్రమితయంత్రఝషంబును నేలఁ గూల్చి కౌం
తేయుఁడు యజ్ఞసేనధరణీపతిపుత్రి హరించెనంచు నే
నేయెడ వింటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

ద్వారక నింద్రనందనుఁ డుదారగతి న్నవయౌవనాంగి న
వ్వారిజనాభు సోదరి సుభద్రను బల్మి హరించెనంచునుఁ
వీరశిరోవతంసములు వృష్ణికులస్థులు పాండవాగ్రజుఁ
జేరిరటంచును న్విని విశీర్ణజయాశుఁడ నైతి సంజయా.

దివిషదధీశ్వరాత్మజుఁడు దివ్యశరప్రకరంపుఁ గల్మిచే
నవిరళవర్షముం గురియు నాత్రిదశప్రభు నడ్డగించి, ఖాం
డవవనముం దుషర్బుధు నొనర్చెను తోషితచిత్తునంచు నా
చెవులకు సోఁకినప్పుడె విశీర్ణజయాశుఁడ నైతి సంజయా.

జ్వాలదనలార్చిరుత్కలము జాతుషవేశ్మమునందు పాండుపు
త్రులు జననీసమేతముగ త్రుంగకయుండ సహాయభూతుఁడై

సిలుగులు మాన్చి యావలికిఁ జేరిచె పారశవుండటన్న వా
ర్తలు చెవిసోఁకినప్పుడె నిరస్తజయాశుఁడ నైతి సంజయా.

క్షితిపకులావతంసుని విచిత్రబలాఢ్యుని మాగధావనీ
పతిని వృకోదరుం డతని పట్టణమందె మహాబలప్రసా
ధితనిజదోర్ద్వయమ్మున గతింపఁగఁ జేసె నటన్న వార్త నా
శ్రుతిపథగామి యైనపుడె శుష్కజయాశుఁడ నైతి సంజయా.

అనఘులు పాండుపుత్రులు దిశాంతము లెల్ల జయించి, నమ్రులై
జనపతు లెల్ల రూఢిగము సల్పుచునుండఁగ రాజసూయముల్
బూనరిచినారు వైభవవిభూషితు లౌచు నటన్న వార్త నే
వినుట తటస్థమైనపుడె వీతజయాశుఁడ నైతి సంజయా.

అతిపరితాపభారజనితాశ్రుజలౌఘనిరుద్ధకంధరన్
బతిగతచిత్త, నేకవసనన్ ద్రుపదక్షితిపాలనందినిన్
బతులెదుటన్ సభాస్థలి కనాథవలె న్దగ నీడ్చిరన్న సం
గతి వినినప్పుడే విజయకాంక్షను నేను పరిత్యజించితిన్.

పాపుఁడు దుస్ససేనుఁడు సభన్ ద్రుపదాత్మజకట్టుపుట్టముల్
తేఁపకు తేఁపకుం గఱకుదేరిన రోషము రేఁగ, లాగునాఁ
డాపతిదైవ వస్త్రముల కంతమె లేదను వార్త నాశ్రవః
ప్రాపితమైనయప్పుడె పరాస్తజయాశుఁడ నైతి సంజయా.

కితవవరేణ్యుఁడౌ శకుని కిల్బిషవర్తన మూఁతగాఁగ సం
స్తుతబలులైన సోదరులతో యమనందను నక్షకేళి ని
ర్జితు నొనరించి రాజ్యము హరించిరి మత్సుతులన్న వార్త నా
శ్రుతిపథి సోఁకినప్పుడె విలుప్తజయాశుఁడ నైతి సంజయా.

అన్న మహానుభావుని యమాత్మజు ప్రీతునొనర్ప ధర్మసం
పన్నమనస్కులై యడవిపా లయిపోయిన పాండవుల్ వ్యథా
చ్ఛన్నులుగాక అయ్యోడల సల్పు మహాద్భుతవిక్రమంబు లే
నెన్నఁడు వింటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

అనఘుఁడు ధర్మపుత్రుఁడు వనాంతరసీమ వసించునప్పుడున్
ఘనులు మహాతపోనిధులు కాననవాసులు భైక్షభోజనుల్
మునులు సమాపితాధ్యయనభూషితులైన మహీసురాళిచే
ననుగతుఁ డయ్యె నంచు వినినప్పుడె నే జయకాంక్ష వీడితిన్.

స్వీకృతభిల్లరూపుఁ డగు శ్రీశివదేవుని యుద్ధకేళి న
స్తోకమహాస్త్రవిద్యఁ బరితోషితచిత్తు నొనర్చి, యమ్మహా
శ్లోకునివల్ల గోత్రరిపుసూనుఁడు పాశుపతాస్త్రరాజమున్
జేకొనె నంచు విన్నపుడె శీర్ణజయాశుఁడ నైతి సంజయా.

సూనృతవాక్యశోభితుఁడు శూరశిఖామణి యర్జునుండు పం
చానను నోర్చి యుద్ధమున, నాకము జేరి బలారితోడ గీ
ర్వాణమహాస్త్రముల్ చదివి భండనపండితుఁ డయ్యెనంచు నా
వీనుల సోఁకినప్పుడె అపేతజయాశుఁడ నైతి సంజయా.

వివిధాస్త్రజ్ఞులు పాండవు-లెవరును జేరరాని చోట నెక్కరణినో వై
శ్రవణుని గూడి చరించుట-చెవిసోఁకినయప్డె విజయచింత విడిచితిన్.

వరబలభూరిగర్వితు లవార్యపరాక్రమవిగ్రహుల్ సురా
సురులకుఁగూడ దుర్జయులు, శోషితవైరులు కాలకేయు లా
నరనిశితేషుసంతతివినాకృతచేతను లైరటంచు నె
త్తరి వినియుంటినో యపుడె దగ్ధజయాశుఁడ నైతి సంజయా.

పరబలకర్షణుండు, బలవైరిసుతుం డసురప్రమాథముం
జరుపఁగ నేఁగి యచ్చట నిశాచరసంఘము నుక్కడంచి, ని
ర్జరపతిమన్నన ల్వడసి స్వర్గపురాగతుఁ డయ్యెనంచు నె
త్తఱి వినియుంటినో యపుడె దగ్ధజయాశుఁడ నైతి సంజయా.

న్యాయము వీడి యప్పుడు మదాత్మజు లందఱు ఘోషయాత్రకుం
బోయిన చిత్రకేతువను భూరిబలాఢ్యుఁడు వారి బంధిత
ప్రాయులఁ జేయ నర్జునుఁడు బంధవిముక్తులఁ జేసెనంచు నే
నేయెడ వింటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

యక్షాకారము దాలిచి- దక్షిణదిక్ప్రభువు పాండుతనయజ్యేష్ఠున్
యక్షప్రశ్న లడిగి దయ- నీక్షించుట యెఱిఁగి విజయతృష్ణ విడిచితిన్.

కోమలికృష్ణతో విరటుకొల్వున గూఢనిజస్వరూపులై
నేమముతోడుగాఁగ నివసించెడి వీరుల పాండుపుత్రులన్
మామకనందనుల్ కనుగొనంగ సమర్థులు గాకపోయిరం
చేమొయి వింటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

విరటుని యాలమంద మన వెంగలు లప్పుడు కొల్లగొట్టఁగా
నరుఁ డొకఁడే మదీయపృతనం గల యోధుల నెల్లరన్ భయం

కరపటుమార్గణమ్ముల విఖండితగర్వులఁ జేసెనంచు నె
త్తఱి వినియుంటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

తనకయి మత్స్యభూవిభుఁ డుదారగుణాలయ నుత్తరాహ్వయం
దనయ నొసంగ జిష్ణుఁడు ముదంబునఁ దా వరియింప కాత్మనం
దనునకు పెండ్లి చేసెడు మనంబునఁ నామె గ్రహించెనంచు నే
వినుట తటస్థమైనపుడె వీతజయాశుఁడ నైతి సంజయా.

ద్యూతములోన మత్సుతుల కోటువడె న్సకలమ్ము బాంధవ
వ్రాతపరిచ్యుతుం డయి యరణ్యముపా లయిపోయె నట్టి కుం
తీతనుజన్ముఁ డింతటి యనీకిని చేర్చుకవచ్చెనంచు నే
నేతఱి వింటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

ఈయఖిలప్రపంచమును ఎవ్వని యేకపదాక్రమమ్ముగా
మ్రోయునో వేదముల్, పరమపూరుషుఁ డావసుదేవసూతియే
పాయక పాండునందనుల భారము పూనినవాఁ డటంచు నే
నేయెడ వింటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

ఖలమతులౌ సుయోధనుఁడు కర్ణుఁడు గొల్వున సంధివాక్యముల్
వలికెడు వాసుదేవు చెఱఁ బట్ట యతించుటఁ జూచి తన్మహో
జ్జ్వలమగు విశ్వమూర్తి రభసంబునఁ జూపె ముకుందుఁ డన్న యా
విలమగు వార్త విన్నపుడె విద్ధజయాశుఁడ నైతి సంజయా.

కొలువుఁ దొలంగి పాండవులకు న్మొగమై తన యేఁగుత్రోవ గ
న్నుల మలినాశ్రువుల్ దొరఁగ నూల్కొను శోకముతోడ నొంటియై
నిలిచిన గొంతి నూఱడిల నెయ్యములాడి ముకుందుఁ డేఁగెనన్
బలుకులు విన్నయప్పుడె విపన్నజయాశుఁడ నైతి సంజయా.

మంత్రియై యాత్మబంధుఁడై మాధవుండు - శంతనుతనూభవుఁడుకుంభసంభవుండు,
పాండుపుత్రులకే మేలు పల్కిరంచు - విన్నయప్పుడె జయకాంక్ష వీడుకొంటి.

దేవదేవుండు కృష్ణుండు దివ్యవిక్ర - ముండు పార్థుండు దివ్యమ్ము గాండివమ్ము
ఉగ్రవీర్యమ్ము లీమూఁడు నొకటఁ కలిమి - విన్నయప్పుడె వీడితి విజయకాంక్ష.

అనిమొన నిల్చి బాంధవవధాత్మకమౌ నిజపాపకృత్యముం
గనుగొని మోహకశ్మలవికారము సోఁకినఁ గ్రుంగిపోవు న
ర్జునునకు విశ్వరూపమును జూపి రణోన్ముఖుఁ జేసె శౌరి య
న్ననుడులు విన్నయప్పుడె వినష్టజయాశుఁడ నైతి సంజయా.

మోసముచేత పాండవులు భూరిధనుశ్శర వేది, నస్త్ర స
న్న్యాస మొనర్చి మృత్యువు దనంతట దా వరియింప నున్న గం
గాసుతుఁ దీవ్రబాణములఁ గాఁడియ వెట్టిన వార్త మచ్ఛ్రవో
న్న్యాసము గన్న యప్పుడె వినష్టజయాశుఁడ నైతి సంజయా.

అప్పుడు సాయకవ్రణితుఁడై శరతల్పమున న్శయించి పెన్
దప్పిక గొన్న కౌరవపితామహు వాంఛిత మూఁది యమ్ములన్
గుప్పి రసాతలాంతమునకు న్విమలాంబువు లిచ్చె పార్థుఁ డం
చెప్పుడు వింటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

కృతనిఖిలాస్త్రశస్త్రుఁడు వరిష్ఠసమిత్తటకేళి కర్కశా
యతభుజవిక్రముండును మహారథుఁడౌ కలశీసుతుండు పాం
డు తనయులందు నుత్తముల నొంపఁడ చంపఁడ యంచు నాశ్రవో
గతమయినప్పుడే నిజము కష్టజయాశుఁడ నైతి సంజయా.

దృష్టసమిద్విహారు నమరేంద్రతనూభవు సంహరింప, మా
కాప్తులు, యోధమూర్తులు, మహారథు లూర్జితసత్వులైన సం
శప్తకు లేఁగి వానికి వశమ్మయి చచ్చిన సంగతుల్ శ్రవః
ప్రాప్తము లైనయప్పుడె నిరస్తజయాశుఁడ నైతి సంజయా.

పవనుఁడు పాకశాసనుఁడు పంకజబంధుఁడు సర్వదేవతల్
బవరమునందు పార్థుల కభంగురహా విజయమ్ము గూర్పఁగాఁ
దివురుచు నస్మదీయులకు తీరని కష్టము గల్గఁజేయుటల్
చెవులకు సోఁకినప్పుడె విశీర్ణజయాశుఁడ నైతి సంజయా.

ప్రాపితశస్త్రసంగరకళాప్రతిభుండగు కుంభజన్ము మే
ధాపటుతాప్రకల్పితము తామరమొగ్గర మన్యయోధదు
ష్ప్రాపము ఫల్గునాత్మజుఁడు బాలకుఁ డొక్కఁడె చించివైచె నట్
పాపపు వార్త విన్నపుడె భగ్నజయాశుఁడ నైతి సంజయా.

మాలిమిమాలి బాలు నభిమన్యుని పల్వురు గూడి యేకమై
వ్రాలి జయద్రథాదులు బలాత్కృతి చంపుట, ఫల్గునుండు దు
శ్శీలుని సైంధవున్ నిహతుచేయ ప్రతిజ్ఞ వహించుటల్ శ్రవ
శ్శూలములైన యప్పుడె విశుష్కజయాశుఁడ నైతి సంజయా.

తునిమెద సింధుభూపతిని తోయజమిత్రుఁడు పశ్చిమాద్రికిన్
జనుటకు పూర్వమే యని ధనంజయుఁ డప్డు ప్రతిజ్ఞ వట్టె త







1. ఉభయ గోదావరీమండల మహిళామహాసభ, నరసాపురము; 2. కర్నూలు మహిళాసమాజము.







1. అఖిలభారత ఆయుర్వేద మహాసభ, 1932 మదరాసు; 2. బొంబాయిలో బర్నార్డ్ షా గారికి శ్రీమతి అత్యాబేగముగారి సన్మానము;
3. శ్రీ తాపీ ధర్మారావుగారికి ఆంధ్రసారస్వతసంఘమువారి వీడ్కోలు.

ధ్వనన మొనర్చి శత్రుకుల మంతయుఁ జూచుచునుండ నంచు నే
వినుట తటస్థమైనపుడె వీతజయాశుఁడ నైతి సంజయా.

అలసినవంట ఫల్గునుని యశ్వము లచ్యుతుఁ డుగ్రసంగర
స్థలముననే హయమ్ములకు దాహముతీర్చెడు నంట యింతని
శ్చలమఁట మాధవార్జునుల స్థైర్యము శౌర్యము ఇట్టిఘోరవా
ర్తల వినినప్పుడే నిజము దగ్ధజయాశుఁడ నైతి సంజయా.

బవరములో వృకోదరుఁడు భగ్నరథుండయి చేతఁ జిక్కినన్
దవిలి వధింపఁజూడక మదజ్వరితుండయి వింటికొప్పుతో
జవురుచు చిన్నవోవ పెలుచన్ జెడుమాటల నాడిపుచ్చుటల్
చెవులకు సోఁకినప్పుడె విశీర్ణజయాశుఁడ నైతి సంజయా.

మాయఁ మారి మాధవుని మంత్రబలంబునఁ జేసి మున్ను రా
ధేయుని కింద్రుఁ డిచ్చిన యుదీర్ణబలమ్మగు శక్తి ఘోరమా
యాయుతుఁడౌ ఘటోత్కచునియంద వృథాయయిపోయెనంచు నే
నేయెడ వింటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

ప్రాయగతున్ ధరాసురుని పట్టి వధించె నధర్మరీతి కౌం
తేయుల శ్యాలకుం డనుచు తీవ్రరుషాయుతుఁడైన ద్రౌణి, నా
రాయణ మస్త్ర మేసినను ప్రాణమువాయరు పాండవేయులం
చేయెడ వింటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

మును ద్రుపదాత్మజాతకచముం గొనినప్పుడు పల్కినట్టు లా
రణమున దుస్ససేను రుధిరమ్మును భీముఁడు త్రావుచుండఁగా
ననఘుఁడు ధర్మపుత్రుఁడు దయం గని వారణ జేసెనంచు నే
వినుట తటస్థమైనపుడె విద్ధజయాశుఁడ నైతి సంజయా.

పాయక యేమహాస్త్రవిదు బాహుబలంబును నమ్మి మత్సుతుం
డీయని సేయఁగాఁదొడఁగె నిఫ్డు ముదంబున నట్టివాఁడు రా
ధేయుఁడు ఫల్గునాస్త్రముల తీవ్రతకున్ బలియయ్యెనంచు నే
నేయెడ వింటినో యపుడె హీనజయాశుఁడ నైతి సంజయా.

అరిబలకాలమూర్తి, సమరావని శౌరికి సాటి, మద్రభూ
వరుఁడు, గదారణప్రథితబాహుబలుండు, యమాత్మజాతుచే
దురమునఁ గూలెనన్న కడుదుఃఖకరంబగు ఘోరవార్త నె
త్తఱి వినియుంటినో యపుడె దగ్ధజయాశుఁడ నైతి సంజయా.

ఈకలహప్రసంగమున కేది నిమిత్తమొ, అట్టి ద్యూతమం
దేకపటమ్మునో సలిపి యింతలుచేసిన పాపి సౌబలుం
డాకృతిగొన్న మాయ, సమరావనిలో సహదేవసాయకా
నీకహతుం డటంచు విని నిక్కవమే జయకాంక్ష వీడితిన్.

మాయలమారి మాధవుని మాటలపై, రణకేళి డస్సి ద్వై
పాయననామకహ్రదమునం దొకయించుక విశ్రమింపఁగాఁ
బోయిన నాకుమారు ననఁబోలని నిష్ఠురవాక్కు లాడి కౌం
తేయులు నొంచిరంచు విని నిర్గతధైర్యుఁడ నైతి సంజయా.

ఆగతి మత్సరించిన మహాబలనందనుతో గదారణో
ద్యోగనిమగ్ను మత్సుతుని యూరుతలంబున మోఁదె యుద్ధక
ర్మాగమవైఖరిన్ విడిచి యాదవుపంపున భీముఁడంచు క
ర్ణాగత మైనయప్పుడె పరాస్తజయాశుఁడ నైతి సంజయా.

ఏలికదైన్యముం గని సహింపక ద్రోణతనూజముఖ్యు లు
ద్వేలరుషావిమూఢులయి వేఁగి, సుషుప్తినిమగ్నులైన పాం
చాలుర ద్రౌపదేయులను జంపిరి నిర్దయులై యటన్న వా
ర్తాళిని విన్నయప్పుడె నిరస్తజయాశుఁడ నైతి సంజయా.

ద్రౌణి క్రుధాప్రపూర్ణుఁడయి దారుణమౌ ద్రుహిణాస్త్ర మేయఁగా
దాని మహాప్రభావమును దానన శాంతముజేసి నిర్జిత
స్థాణుఁడు శక్రనందనుఁడు ద్రౌణిశిరోమణి గొన్నవార్త నా
వీనుల సోఁకినప్పుడె అపేతజయాశుఁడ నైతి సంజయా.

'స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు.'

# ౪. క థ లు

## రా ధ

'వసంతమూర్తి'

౧

ఆ అమ్మాయిని "రాధా" అని పిలుస్తా రందరూ. శరీరచ్ఛాయ నలుపే. అయితే నేం? ఆ కళ్లు! వింతరకమైన వెల్తురు పరిమళిస్తుంది వాటిలోంచి. ఇంక నవ్వో? గవ్వల గిలకరింతే. మా అక్కయ్యతో ఆడుకోడానికి ప్రతిరోజూ ఆమె మాయింటికి వస్తుంది. ఆమెని గురించి నాకు తెలిసిన దింతవరకే.

"నే ననుకున్నకన్న ఆమెకు నన్ను గురించి ఎక్కువ తెలిసి ఉండాలి. కాకపోతే అలాగ ఎందు కంటుంది?...నా భావన గాలిలాగ పరుగెత్తుతోందే? చిన్నతనముచేత ఆమె అన్న మాటల కింత వ్యాఖ్యానమా?" అనుకుంటూ నా గదిలోకి వెళ్లాను. "దాసీదాని కింత చొరవా? సరే. 'మీతమ్ముణ్ణి పెళ్లాడతా' నని ఆమె అన్నదే అనుకుందాం. మా అక్కయ్యకి లేని తొందర దాని కెందుకూ? అబ్బ! ఎంత కేక వేసింది! 'అబ్బాయిగారూ, ఈ అమ్మాయి మీపెళ్లా మంటుండీ' అంటుందా?" నాకోపము చల్లారలేదు. మరి రెండు చీవాట్లు పెట్టుదామని వెనక్కి తిరిగాను.

"సుధా! ఏమిటిరా, అంత ఎగిరేవు? పాపము, సూరమ్మ ఏడుస్తోంది. అది అన్నమాటలు నిజమో, అబద్ధమో తెలుసుకోకుండా ఊఁ...చీవాట్లు పెట్టేయడమే?"

"ఏమిటే అంది? నన్ను పెళ్లాడతానందా? లేనిపోని మాటలు కల్పించి—"

"లేనిపోని మాటలా? పోనీ, అడుగు"—"ఏం, రాధా? నిజమేనా? అబద్ధమా?"

"..............................."

"అదిగో చూశావా?"

"నామీద అనుమానము పడుతున్నాడు. ఊరుకుంటావా రాధా?"

"నిజమే."

నీళ్లు చిలకరించగానే అణిగిపోయే పాలపొంగులాగు నా కోపము అణిగిపోయింది. ఏమనాలో తోచిందికాదు. అక్కయ్య పకాలున నవ్వి "ఏం? ఇప్పు డేమంటావు?...సూరమ్మా!" అని కేక వేసింది.

సూరమ్మలో తప్పు లేదు. పెరట్లోకి వెళ్లి దానికోసము వెతికాను. గడ్డిమేటి చాటున నిలబడి కళ్లు ఒత్తుకుంటోంది.

"సూరమ్మా, నీతప్పు లేదు. ఓస్, ఇంతమాత్రానికే యేడవాలా?" అన్నాను. ఏడు పాగలేదు. చెయ్యిపట్టుకు క్రిందికి లాగి- పాపము చిన్నప్పుడు నన్నెత్తుకుని ఆడించేది. పడవలమీద కూర్చోపెట్టేది, మాఅమ్మ వద్దన్నాను. నేను తినమని బలవంతముచేసినా ఏమీ తినడానికి పుచ్చుకునేది కాదు-"అయితే నామోటారు కారులో ఎక్కవన్నమాటే" అన్నాను.

నా చిన్నతనములో ఒకకాపు నన్ను బైసికలు ఎక్కించి తీసుకువెళ్లాడుట. మధ్య దారిలో క్రింద పడ్డాను. దెబ్బ తగిలి రక్తము వచ్చింది. అమ్మ కోపము పడుతుందేమో అని సూరమ్మ ఏడవడ మారంభించింది. తరవాత ఆకాపుతో "నేను పెద్దవాణ్ణయాక కారు కొని దానిలో నిన్నెక్కించి పడతోస్తాను లే" అనీ, తనతోటి "నాకారులో ని న్నెక్కిస్తానులే" అనీ అన్నానని సూరమ్మ చెప్పుతూంటుంది. ఈసందర్భములో చిన్ననాటి మాట జ్ఞాపకము చెయ్యడమే క్షమాపణ కోరడమని ఇలా అన్నాను.

ఓస్! ఏడుపంతా ఎక్కడికో యెగిరిపోయింది. పకాలున నవ్వి "ఏమండీ, అబ్బాయిగారూ! అంత కోప్పడ్డారు?" అంది. ఆ అమ్మాయి అలా అంటుందనుకోలేదు.

జరిగినదానికి వింతపడుతూ వెనక్కి వచ్చాను. హాస్యాలు ఆఖరయినట్లు లేదు. మా అక్కయ్య చావడిలోంచి రావడానికి బయలుదేరింది. రాధ ఆవిడపైట పట్టు[illegible]ని వెనక్కి లాగుతోంది.

"అబ్బ! వదలవే పైట లాగేస్తావేమిటి?"

"అడగనంటే వదుల్తాను."

"వదిలీ, అడగనులే."

"సుధా—అ...బ్బ చెయ్యితియ్యి, ఊపిరి సలపడము లేదు. ఏమంటావురా అయితే."

"ఏమిటే అనడము? హాస్యము ఎక్కువైపోతోంది. వాళ్లు నియోగులు; మనం వైదికులం? వాళ్లమ్మ వింటే ఏమంటుంది?"

అక్కయ్య నోరు విప్పగానే రాధ పారిపోయింది

"ఏమంటుంది? ఇంతకన్న మంచివా డెక్కడ దొరుకుతా డంటుంది ఇంకేమంటుంది?" మాట్లాడకుండా నాగదిలోకి వెళ్లి పోయాను. రాధ గభీమని బయటికి దాటేసింది. నాపద్యాలపుస్తక మెవరు తెరిచారూ!

"అక్కయ్యా! నాపుస్తక మెవరూ తీశారు పైకి?"

"నేను" అన్నది రాధ.

"రాధ తీసిందట."

* * * * *

భోజనము చేస్తున్నాము. అమ్మ పప్పులోకి నెయ్యి వడ్డిస్తూ "సూరమ్మ నెవరేనా ఏమిటేనా అన్నారేమిట్రా?"

"ఏం? ఇంకా ఏడుస్తోందా ఏమిటి?"

"ఏమన్నారేమిటి?"

"అలా గడగండి, అమ్మగారూ" అని నూతిపెగ్గిర్నుంచి సూరమ్మ

"ఏమీ లేదూ. అక్కయ్య రాధని 'రాధా, రాధా ఎవర్ని పెళ్లాడతావే?' అని అడిగిందట తక్షణం ఆవిడగారు సావిత్రిలాగ 'మీతమ్ముణ్ణి పెళ్లాడతా' నందిట" పెద్దక్కయ్య నవ్వి చప్పట్లుచరిచింది. అమ్మ "అదేమిటే, శాంతా, అంట్లచేతితోటే!" అంది.

శాంతక్కయ్య నవ్వు మానలేదు. వదినగారి కంతు వచ్చింది. అక్కయ్య చెయ్యి కడుక్కోడానికి ఆవిడచేతిమీద నీళ్లు పోస్తూ "సుధా! మీ రాగనక్కరలేదు చెప్పండి."

సూరమ్మ ఊరంత కేకవేసి కడుపు చెక్కలయేట్టు నవ్వుతూ "అబ్బాయిగారూ! ఈఅమ్మాయి మీ పెళ్లమండీ" అంది. చిన్నక్కయ్య అందుకుని "నీఅంతరము చూచి మాటాడమన్నారు పెళ్లికొడుకుగారు" అంది. అంతా నవ్వారంభించారు నేను లేచి చెయ్యి కడుక్కుని చుట్టుతిరిగి వీధిచావడిలోకి వచ్చాను. "ఆపకీ సుకాన్ని ఈడనే గొడరేసి" అని పాడేసరికి రాధ గుమ్మము దగ్గర కొచ్చి నిలబడింది. వేద తొట్లో లేచి కూర్చుంది "వేదా! లేచావూ!" వేదవతి చిరునవ్వు నవ్వింది. మాటలు రావు గాని లేకపోతే ఏదో ఒకటి అనేదే గభీమని తొట్లోంచి ఎత్తుకుని "పడవెక్కి భద్రాద్రి పోదామా" అని గంతాను రాధ నవ్వుతోంది. "రాధా వేదని అక్కయ్య కిచ్చేయి" అన్నాను. ఆమె వస్తూంటే వేద "దా దా" అని చెయ్యి ఊపి, తీరా దగ్గిరికి రానిచ్చి నావీపువైపు తల తిప్పింది. రాధ పకపక నవ్వడ మారంభించింది. అచ్చంగా "సరిగమపధనిస" గవ్వలు గిలకరించినట్లు, మువ్వలు మోగినట్లు, బంగారుగుండ్లు దొర్లించినట్లు. "ఏది ఏది మరొక్కసారి-" "స రి గ మ ప ధ ని స". ఏదో వింత అందముంది ఆగొంతులో. కోయిలస్వరము కాదు, నెమలి కంఠముకాదు, తుమ్మెదరొదకాదు. వీటి నన్నిటిని మింగి నెమరువేస్తున్నట్లుంది. గోడకి చేరబడి రాధ ఒక తేనవ్వు విస్మయము తోటి ఆమెవైపు చూచాను. కలువపువ్వుల అమాయకత్వము ఆముఖములో నురుగుకట్టింది. ఉషఃకాంతు లా నల్లని నుదురుమీద నృత్యము చేశాయి నక్షత్రా లాకళ్లల్లో గంతులు వేస్తున్నాయి. నాగస్వరానికి సర్పములాగు క్షణకాలము ముగ్ధుడయాను. వీధిలోంచి ఉరుములాగ నాన్న మాటలు వినబడ్డాయి గభీమని ఆమెచేతులు పట్టుకు లేవదీసి "ఊఁ, వే ని తీసుకుపో త్వరగా!" అన్నాను.

## ౨

మధ్యాహ్నము అమ్మ పడుకుని నిద్రపోయింది. గదిలో కూర్చుని 'కృష్ణపక్షము' చదువుతున్నాను. ఎండ తెరలుతెరలుగా భూమి నావరిస్తోంది. చంద్రకాంతంమొక్క ఆకులు వేలవేసింది. చిన్న పిట్ట ఒకటి రెమ్మలమధ్య వాలి ఏదో పొడుచుకు తింటోంది. అక్కయ్య చావడిలోంచి "సుధా" అని పిల్చింది. వెళ్లి, "ఏం?"

"చెప్పు రాధా."

"మరేమోనే, మీ అక్కయ్య పిక్క ఒకటి నాదగ్గిరుంది. ఇప్పుడావిడ చెమ్మవేశారు. ఆవిడ తన పిక్కని బతికించుకోకుండా నాపిక్కని చంపవచ్చునా?"

"గవ్వ లాడుతున్నారా? మరేం పని లేదా యేమిటి?"

"ఏం చెయ్యమన్నావు?"

"చదువరాదూ, ఏదేనా పుస్తకం?"

"ఆఁ! పుస్తక మనగానే జ్ఞాపకము వచ్చింది. ఏది, సుధా, యెంకిపాటల పుస్తక మియ్యి."

"నేను పట్టుకురానా?"

"ఊఁ వెళ్లు" రాధ ఒక్క పరుగున వెళ్లింది. అక్కయ్య "అబ్బ! చంపేస్తోందిరా!"

"ఏమిటీ?"

"ఆపాటలు పాడమని నిన్నడగమని చంపేస్తోంది. ఆఁ నువ్వే అడగమన్నాను. అడగకుంటే అన్నం తింటున్నా, నీళ్లు తాగుతున్నా, పూలు కట్టుతున్నా, 'ఏమండీ! అడగరూ' అని పీకేస్తోంది."

"ఎప్పుడు వింది?"

"రోజూ వింటోంది."

పుస్తకం పట్టుకుని రాధ వస్తోంది ఈ పిల్ల చర్య కొంత వింత గొల్పింది.

"ఏ పాట పాడమన్నావూ?"

"రాధ నడుగు.—ఏది రాధా?"

"బాగుంది. నేను పాడమన్నానా ఏమిటి?"

"అయితే పుస్తకము సొరుగులో పెట్టేయి."

"ఊఁ."

అంటూ పుస్తకమందించింది వేళ్లు తగిలి రక్త ముద్రిక్తమైంది. ఆ మెబుగ్గలకి రక్తము చిందింది. ఆ కళ్లు ఎందుచేతనో చూడలేకపోయాను గుండె గాలికి రావి ఆకులాగ కొట్టుకుంది. చెయ్యి వణికింది. పుస్తకం జారింది.

"అదేమిట్రా పాడవూ?"

"పోనిస్తూ."

"అయితే పుస్తకం ఎందుకు తెమ్మన్నావు?"

"నువ్వా? నేనా?"

"ఎవరో. పాడుదూ."

"ఆడనీ సుకాకని ఈడనే గడయేసి.
.................. . .. . ..."

"ఊఁ ఇంకోటి. ఏదీ పుస్తక మిలా ఇయ్యి......ఇదిగో."

"అబ్బే యిది కాదండీ. నేను చూపిస్తా......ఇదిగో యిది."

"ఇయ్యి."

"అబ్బ. మీ రిద్దరూ!"

"యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి,
యెంకి నావొంకింక రాదోయి రాదోయి"

"అమ్మ రాధా, గడుసుదానవే!"

"ఏం?"

"ఏం లేదు. పాట కానీ."

"చెక్కిట చిన్ని మచ్చ, చెపితే చాలదు లచ్చ"

అక్కయ్య పకాలున నవ్వి, "అమ్మ రాధోయి, ఇంత గడుసుదాని వనుకోలేదే...అమ్మాయి! రాధే...." అంటూ లోపలికి వెళ్లబోయింది. రాధ ఆవిడ పైట పట్టుకుని "అబ్బ, ఇప్పుడే పడుకున్నారండీ. లేపకండీ" అని అడ్డపడింది.

అక్కయ్య వెనక్కి వచ్చి, "ఏదీ సుధా! తక్కినదికూడా కడతేరా పాడు. ఇంకా ఏముందో చూదాము."

"పాడను. ఏమన్నావు. రాధగడుసుతన మేముం దిక్కడ?"

"...(నవ్వు)...ఏది రాధా నీమచ్చ ఏదీ?" అంటూ రాధ బుగ్గ నా వైపు తిప్పబోయింది

"అ...బ్బ."

"ఇదిగో సుధా, రాధ చెక్కిటి చిన్నిమచ్చ."

రాధ అక్కయ్యనోరు మూసేసింది.

ఈ అమ్మాయి అమ్మాయిలాగ లేదు.

## 3

ఒంటిగంటకి బళ్లు పూయించాడు పయిడయ్య అంతా బళ్లలో కెక్కుతున్నారు పల్లకి రాలేదు సొమ్ము పుచ్చుకునికూడా సమయానికి రాలేదని అమ్మకి చాలా కోపముగా నుంది.

"బ్రహ్మం, వెళ్లు."

"ఊఁ...అదుగో."

పల్లకి వచ్చింది. అన్నయ్య కూర్చున్నాడు. అత్తా, దొడ్డమ్మ, పిన్ని అక్కతలు జల్లారు. బాజాలు మోగుతున్నాయి. అమ్మ పెద్దక్కయ్య కేదో చెప్పింది. ఆవిడ రాధ ఇంటికి వెళ్లి చిన్నక్కయ్యనీ, రాధనీ తీసుకు వచ్చింది. చిన్నక్కయ్య ఒక బండీలో కూర్చుంది. కాని రాధకి చోటు లేకపోయింది. "మాబండీలో కొంచెం చోటుంది ఇక్కడికి పంపండి" అని మా అప్పలన్నయ్య కేకవేశాడు. రాధ వచ్చింది. నేను చెయ్యి అందించాను. పట్టుకుని పైకెక్కింది.

"ఫిడే లెవరిది?"

"నాదే."

"ఎన్నాళ్లాయి నేర్చుకుంటున్నావు?"

"రెండేళ్ల నుంచి."

"ఇంకేం, గానపాటకు లెవ్వరూ అక్కర లేదన్నమాటే."

రాధ నవ్వింది. "ఏదేది? మళ్లీ." అన్నాడు, అప్పలన్నయ్య.

"ఊరుకో ఊరుకో. ఊపిరి సలపదు."

ఏదో విపరీతభావము గాలి తెరలుగా వచ్చి నా హృదయాన్ని కమ్ముకున్నది. విరామము లేకుండా వాసనలు గుప్పే సుగంధ రాజకుసుమంలాగు, ఆయాసపడకుండా మెరిసిపోయే నక్షత్రంలాగు రాధ నవ్వడమారంభించింది. నూటికి ముగ్గురున్న బ్రాహ్మలలో ఇన్ని శాఖ లెవ

ఏర్పరిచారా అనే ఆలోచనలో పడవలసేవుకి బల్లు వచ్చాయన్నమాట మరచిపోయాను.

## ౪

మా విడిదికి మేడ ఉంది. నేనూ, అప్పల నరసింహం అన్నయ్యా, మా తమ్ముడూ కూర్చుని తమలపాకులు వేసుకుంటున్నాము.

"తమ్ముడూ, ఒక పద్యం చదువురా."

"పద్యం కాదు. పాట పాడతాను. విను"

"ఏదో ఒకటి."

"యెంకి వొంటిపిల్ల లేదోయి లేదోయి"

"..........................."

"ఒక్క నవ్వే చాలు వొజ్జిర వైడూరాలు"

అన్నట్టు నవ్వనగానే జ్ఞాపకము వచ్చింది. "ఆపిల్ల ఏదీ? ఏం పేరు?"

"రాధ."

"రాధా?"

"ఆఁ."

"మాట మాట."

"తమ్ముడూ, పాటకానీ."

పాడక పోడానికి కారణము లేదు. పాడితే అనుమానము పడతాడేమో. అన్నట్టు ఇతని కాసంగతి తెలీదు.

ఆమె మెళ్లోనున్న చప్పుడవుతుంది.

"చెక్కిట చిన్ని మచ్చ
చెపితే చాలదు లచ్చ
ఒక్క నవ్వే యేలు వొజ్జిరవైడూరాలు"

రాధ వచ్చింది. అప్పలన్నయ్య ఆమెకేసి తిరిగి "ఒక్కనవ్వే యేలు వొజ్జిరవైడూరాలు" అన్నాడు. రాధ ఈమారు నవ్వలేదు. దృష్టి పాటమీద ఉన్నది.

"మెళ్లో పూసలపేరు తల్లో పూవులపేరు"

"అబ్బే. అలాకాదురా; మెళ్లో ముత్యాలపేరు—తరువాతి యేమిటి?"

రాధ మెళ్లో ముత్యాలపేరుంది. నా కళ్లామెవైపు తిరిగాయి. ఆనాటి 'మచ్చ' మాట జ్ఞాపకమువచ్చి "చెక్కిట చిన్నిమచ్చ" కూడా ఉంది. "అదికూడా పాడవోయి" అన్నాను. రాధ సిగ్గుచేత తలవంచేసింది. పాట ఆరంభిద్దామని గొంతుసవరించి,

"రాసోరింటికైన రంగూ తెచ్చేపిల్ల
నా సామ్ముద్ర నాసుండె నమిలీ మింగినపిల్ల"

"వణుకుతావేం?"

"గొంతుకులో ఏదో అడ్డుపడింది. వస్తా" నంటూ వరండాలోనికి వెళ్లాను. క్రింద నుంచి "సుధా!"

"ఆఁ"

"రాధేదీ?"

"ఇక్కడుంది."

"ఇలా రమ్మను."

"రాధా! అక్కయ్య పిలుస్తోంది."

నేను తిరిగి వచ్చి, "నియోగులికీ, వైదీకులికీ తేడా ఏమిటన్నయ్యా?"

"వాళ్లు—కర్మలకి పనికిరారు!"

"మనం?—ఉద్యోగాలికా!"

"ఎక్కడికిలే, అసలు తేడా లేమీ లేవు. అనుకుంటే తేడాలెన్నైనా వస్తాయి."

"పురోహితుణ్ణడుగుదామా?"

"ఊఁ. పిలవరా చంద్రశేఖరం."

"వద్దు. వద్దుండు. నేను రప్పిస్తాను.

"నిండార బొలు నఖండగోదావరి
దాగిన చాళుక్యనాగరికత"

"ఎక్కడ నేర్చావురోయి ఈఘక్కి. వెంకటశాస్త్రిగారిదిలాగుందే. కానీ."

"పల్లెపదాల జీవము నిల్పికొన్న ప
ల్నాటివీరుల రక్తనాళపటిమ"

"భేష్. బాగుంది. రాధా. ఇలా రా. మూలనక్కావేం?"

పురోహితుడూ, శాస్త్రులు గారూ, పినతండ్రిగారూ వచ్చారు.

"ఏమండోయి శాస్త్రులుగారు, బ్రహ్మగారు ఇలా వచ్చారు?"

"ఇదిగో మనవాడి పద్యాలు విందామనే."

"పద్యాలు వినడం కంటె పెద్దపనికే రప్పించాడు మిమ్మల్ని, పద్యాలు చదివి."

"ఏమిటి కథ?"

"నియోగులికీ మనకీ సంబంధా లెందుకు లేవు?"

"ఆచారం లేదు."

"అధికారగర్వం ఉంది వాళ్లకి, ఆచారాల గర్వం మనకి."

"సరి. ఏకోతీకొండదిగదు."

"పెళ్లి సంబంధాలవల్ల ఈరెండు భాగాలూ కలిసిపోతే నూటికి ముగ్గురున్న బ్రాహ్మల గతి ఇప్పటికంటె బాగుపడదూ?"

"పిల్లికి గంటకట్టేవా రెవరూ?"

"ఇది పిల్లిటండీ?"

"మీ ళ్లివ్వరు, వా ళ్లివ్వరు. మరి పె ళ్లెలాగ అవడం?"

"మాటవరస కంటున్నాను. నా కివ్వడాని కెవరేనా సిద్ధపడతా రనుకోండి. మీరు పెళ్లిచేయిస్తారా?"

"ఏ మంత అవసరము, వాళ్ల పిల్లని చేసుకోడానికి?"

"చూశారా? ఆప్రశ్న రావలసిన అవసర మేమిటనే నే నడిగేది."

"పోనిస్తూ. దానికేం గాని ఒకపద్యం చదవరా?"

"చదవ్వోయి. చూద్దాం, వాటిమాటకేం?"

"నశిలేని నడురాత్రి నడురాజు గిల్గింత
కడరి యుప్పొంగెడి కలువనవ్వు.
వగరా చిగురు మెక్కి పొగులు కోవెలగొంతు
బిగుతౌట కలరు జాబిల్లి నవ్వు
వేశ్య జాడగ బోవ వెలికిదీయుచు నూరు
జడు బోడగాంచు వజ్రంపు నవ్వు—"

"భేష్, ఎవర్రా వ్రాశారూ?"

"అర్జునా ఫల్గునా యనును కేకలనైచు
బాలుర గాంచు మేఘాల నవ్వు
కలసి యానందరసవర్ష ములను గురిసి
మోడుబోయిన నాగుండె మొలక లేసి
కిసలయావృతగా జేసె కీరవాణి
ఏది వినిపింపు నీ నవ్వు నికొక సారి"

"ఏది? ఆ ఉయ్యాలపద్యం చదువు!"

"ఏలాలతాజాల డోలాసమాలోల
బాలామణీగాన భాసురములు"

ఏలాల......మొదటి, రెండు, మూడు కాలములలో చేతిని ఉయ్యాలతీరుని ఊపుతూ చదివాను. చె య్యూపుతూంటే రాధ నవ్వింది. "గ్రామఫోన్ ప్లేట్" అన్నాడు అప్పలన్నయ్య. మా పినతండ్రి "ఊఁ. బాగానే ఉంది కథ!" అన్నాడు. నాగుండెలో రాయి పడింది.

"బ్రహ్మగారూ, కబురు వచ్చింది. రావాలి" అని అన్నయ్య వచ్చి పిల్చాడు. పినతండ్రి గారు, రాధ మాత్రమే ఉన్నారు.

"ఏదీ, సుధా! ఏమి టాపాదం?–వగ రా?"

"వగరా చిగురు మెక్కి పొగులు కోవెలగొంతు బిగుతౌటకలరు జాబిల్లి నవ్వు"

"అబ్బే—మార్చాలి ఈపాదం. వ్రాసుకో."

"నేను వ్రాస్తేగా?"

"నాదగ్గిర బొంకకు మరి! ఈపిల్ల నిమోసుల పిల్లా ఏమిటి?"

దొరికి పోయాను. "ఊఁ."

"అనుకున్నదే. ఊఁ."

"నికటస్థమౌ పెంటి నెరుగక మొరలిడు
చక్రవాకము గాంచు చంద్రు నవ్వు"

అని వ్రాయి......అదేమిటి ఆబాజాలు?"

"భోజనానికి వెళ్లుతున్నారు."

"నువ్వు రావూ?"

"మేము చద్దన్నము తిన్నాము."

"సరే. నే వెళ్లాలి మరి." అని ఆయన లేచి వెళ్లిపోయారు. ఏదో పెద్దబరువు గుండెలమీదనుంచి లేచిపోయింది.

"రాధా! నీఫిడేల్ ఏదీ?"

"అదుగో."

నేను వెళ్లి తెచ్చి, "ఊఁ. వాయించు."

"అబ్బ, ఇప్పు డేమిటి?"

"ఇప్పుడే మరి. ఎవరూ లేరు. చాలా బాగా వాయించాలి మరి."

"సా......"

"ఊఁ. ఎవరేనా వస్తారు మరి!"

"సారినీదా—పీ రి బో ణి......"

"భేష్. ఎవరిదగ్గర నేర్చుకుంటున్నావు? ...... ఏమిటది ఉంచుండు. సాలీడు. నేను దులిపేస్తాను." అని ఆమె ముంగురులమీది సాలీడు దులిపాను. ఆమె కదలలేదు.

"ఇంకొకటి."

"స్వరరాగసుధారస......"

"ఊఁ. ఇదొకటా నీనవ్వుకి తోడూ? అవునుగాని అన్నట్లు నీపె ళ్లెప్పుడు?"

"ఊఁ."

"చెప్పమ్మా, సిగ్గులకేమీ?" అంటూ అప్రయత్నముగా నామె చెయ్యి పట్టుకున్నాను. ఆమె తీసికో యత్నించలేదు.

"మీ పెళ్లో?"

"......... అవుసుగాని, ఎవర్ని పెళ్లాడతావని మా అక్కయ్య అడిగితే ఏమీ ఆలోచించకుండా 'మీతమ్ముణ్ణి పెళ్లాడతా' నంటావా?"

"ఏమిటి ఆలోచించడము?"

"మీరు నియోగులు, మేము వైదికులం."

"అయితే?"

"మీకూ మాకూ సంబంధా ల్లేవే...........అయినా ఏమి చూచి పెళ్లాడతా నన్నావు? అందమా? ఏకోశానా లేదే?"

"ఎవ రన్నారూ?"

"అద్దం. ఎవ రనాలి. చిన్నప్పుడు కాల్చిన చుట్టమచ్చ నుదురు మీ దుంటే అదీ........వరో సంగతి. నువ్వూ నేనూ ఒప్పుకుంటే సరిపోతుందా? మీ అమ్మో?"

"అమ్మ ఏమనదు."

"చిన్నతనము నీకు. ఇదేం బజారునుంచి మిఠాయి తేవడ మనుకున్నావా? మీఅమ్మ కిష్టమే అనుకో. మీ మామయ్య, పిన్ని, మీఅత్త, అమ్మమ్మ, వీరంతా నిన్ను నా కివ్వనిస్తారా? 'వైదీకపాడికి మన పిల్ల నివ్వడమేమి' టనరూ? చిన్నపిల్లవి. నీ కీసంగతులు తెలియవు. ఏ మంటావు?"

రాధ మెల్లిగా నాచేతిలోని చేయ్యి తీసేసుకుంది. నా మనస్సులో తుపాను బయలు దేరింది.

"ఏ మంటావు? నిజమా? అబద్ధమా?" అని తలమీద చెయ్యి వేసి ముఖము పైకి ఎత్తాను.

"నిజమే" అని ఆమె తలవంచేసి ఫిడేలు తీగని బిగుతుచేసి వదులు చేస్తోంది. కుడిచేతిలోని ఫిడేలుకర్ర తీగలమీద గంతులు వేస్తోంది.

తూ. తుత్తు తుత్తుత్తూ......

"తూతూపాకా. వాళ్లు వస్తారు. వెళ్లు. ఫిడేలు నేను సర్దుతాలే." ఆమె లేచింది. రెండు నీటిచుక్కలు నాచేతి మీద పడ్డాయి.

ఎవర్నేమి టనడము? ప్రాచీనాచారమనే మత్తగజము ఆచారవంతులవీథులలో విచ్చలవిడిగా విహరిస్తుంది. దాని కెవరేనా అడ్డు వెళ్లితే దాని కాలిక్రింద పడి నలిగిపోవలసినదే! ఆచారదౌర్జన్యము వారికి రోహిణికార్తి ఎండవలె కనబడితేనే కాని ఏవిధమైన మార్పూ అవసరమని యెంచేవాళ్లే ఉండరు. రాధాసుధాకరులు ఆ నలిగినవాళ్లలో ఇద్దరు.

*  *  *  *  *  *

రాత్రి. పడవలు మెల్లగా సాగుతూన్నట్లు పిల్లినకర్రకి కట్టిన మువ్వలు చెప్తున్నాయి. గట్టుమీది చెట్లు నాదాకా వచ్చి కొంచెం వాగి, నన్ను చూచేకాబోలు గుసగుసలాడుకుంటూ కదిలిపోతున్నాయి. పాపము వీటిగ తేమిటి? పుట్టిన దగ్గిర్నుంచి చచ్చేదాకా ఒకేచోటున పడి ఉండాలి. నక్షత్రాలు కునికిపాట్లు పడుతున్నాయి. వాటికీ ఎదుగే లేదు. ప్రపంచము, ఎందరో అనేటట్లు విశ్రాంతిగృహము కాదు. గాలిరాకకి వెదురుపొదలు సంగీత మారంభిస్తే నన్ను పొందలేరని చెప్పేసి వెళ్లిపోతున్నాడు మందపవనుడు.

"పడవ ఒడ్డుకి పెట్టవోయి."

"ఎవరు?" అని బయటికి చూచాను. బాబు, ఇంకా ఎవరో. అక్కయ్య "సుధా"

"ఆఁ."

"ఇలా రా." వెళ్లాను.

"రాధకి ఏమిటో కావాలిట. కొని పెట్టు."

"ఏం కావాలీ?"

"దాహం వేస్తోంది."

కొంతదూరం వెళ్లాము.

"సోడా తాగుతావా?"

"అబ్బే ఛీ!"

"మజ్జిగో?"

"ఊఁ."

దూరంగా దీపం మినుకు మినుకు మంటోంది. దగ్గరకి వెళ్లాము. దీపంలాగే కునికిపాట్లు పడుతోంది గొల్ల మనిషి.

"మజ్జి గుందా?"

"ఆఁ. ఎంతటిది?"

"ఒక అర్ధణా దియ్యి. రాధా, నీ కెంతది కావాలి. చూడిది."

"మీరు తాగండి చెప్తాను."

నేను తాగి "అబ్బో" అన్నాను. రాధ "ఏదీ. ఎంత మిగిల్చారేమిటి?" అని నా చేతిలోని పిడత తాను తీసుకుని తాగడ మారంభించింది. పిడత తీసుకోబోతే వదలలేదు

"అదేమిటి రాధా!"

"ఏం?"

"నేను ఎంగిలి చేసినది తాగుతావా?"

"ఏం తాగితే.........అదుగో పడవ మళ్లా ఒడ్డు కొచ్చేసింది. రండి. వెళదాము." పరుగులో ఆమె జారింది. నేను పట్టుకుని ఆమెతల రొమ్ముకదుముకున్నాను. పడమటి మేఘాలు పక్కున నవ్వాయి.

*  *  *  *

౫

మునపటివలె రాధ మాయింటికి రావడములేదు. ఎందుచేతనో తెలియ లేదు.

"అక్కయ్యా, రాధ రావడము మానేసిందేం?" అక్కయ్య అమ్మకేసి చూచింది.

"ఏం రాకపోతే? ఎప్పుడూ నీపాటలు వింటూ కూర్చోమన్నావేమిటి? వాళ్లమ్మకి జ్వరమట."

"ఊహుఁ."

*  *  *  *

"కాఫీపొడుము పట్టుకురాగల్రా ఎక్కడేనా, మీబావగారికి టీ పడదట?"

"రాధగారింట్లో ఉంటుందేమో!"

"రాధ యింట్లోనా? మీఅమ్మ ఏమంటారో?"

"ఏమి? అడగకూడదూ?"

"పోనీ పట్టుకురండి. మీఅమ్మతో చెప్పకండి. వీళ్లనీ, వాళ్లనీ ఎందుకు అడగడ మంటారు."

బయలుదేరాను. కాని "మీఅమ్మ ఏమంటారో" అన్నమాట చెవులలోను, గుండెమీదా రింగుమంది. రాధ నడగడము అమ్మకిష్టము లేదూ? వారింటికి వెళ్లి "రాధా"

"ఆఁ." అంటూ బయటికి వచ్చింది.

"కాఫీపొడు ముందా?"

"ఊఁ." అని వెళ్లి పట్టుకొచ్చింది.

"రావడము మానేశావేమి?"

"అమ్మ కోప్పడుతోంది."

"మీఅమ్మ కెలా గుంది?"

"ఏం?"

"జ్వరమట."

"అబ్బే, లేదే! ఎవ రన్నారూ?"

*  *  *  *

"అమ్మా, రాధకి శారదాబిల్లు రాకుండా పెళ్లి చేసే యత్నంలో లేరేమిటి?"

"లేకేమి? యిదిగారా ఎవరూ దొరకకపోతే మన సుధని కట్ట మంటుండట వాళ్లమ్మ, మంగళసూత్రం."

నా వళ్లు జల్లుమంది. ములిగేవానికి కట్టెపుల్లలాగు నిరాశలో ఈఆశ యేమిటి?

*  *  *  *

"అమ్మా, రాధకి పెళ్లివారొచ్చారు. కుర్రవాడు తెల్లగా బాగున్నాడు."

"వాళ్ల యింటిపే రేమిటి?"

"ఎందుకురా నీకు వాళ్ల గొడవలు, నీచదువేదో చూసుకోక?"

"ఏం, అడిగితేను?"

"అబ్బే! తెలియదురా!"

"ఏమమ్మా అడిగితే?" నా కళ్లునుండాయి గోరుచుట్టుమీద రోకటిపోటు.

*  *  *  *

పఠనమందిరములో పేపరు చదువుతున్నాను. రాధఅన్నయ్య శుభలేఖ ఇచ్చాడు. లోకమంతా ఊపిరిబిగబట్టింది. "నీరాధని ఇంకొకని కిచ్చేస్తున్నారోయి" అంటూ కవరుమీది బొమ్మ ఎర్రనవ్వు నవ్వింది. ఏదో మాట్లాడబోయాను. మాట రాలేదు. దగ్గబోతూ బయటికి వచ్చేశాను. ఇంటి కెళ్లి "అక్కయ్యా! రాధకి పెళ్లిగాబోలు. ఇదిగో శుభలేఖ. వాళ్లన్నయ్య ఇచ్చాడు."

"కాబోలంటున్నావు. చూడలేదేమిటి?"

"ఎందుకు చూడడం? లేదు."

*  *  *  *

"ఇవాళ రాధపెళ్లిట."

"అయితే?"

"మీరు వెళ్లరూ?"

"ఊహుఁ. పిలిస్తేనా?"

"భేష్. ఈనాటకం బాగుంది. ఏమనుకున్నారో?"

*  *  *  *

సాయంకాలము. పెళ్లివారింట్లో బాజాలు మోగుతున్నాయి. అప్రయత్నంగా ఆవైపు వెళ్లాను.

రాధ పసుపుబట్టలు కట్టుకుని అరుగుమీద నిలబడి ఉంది. ఆగిపోయా.

"అదిగో రాధ. మరొకడి సొత్తయిపోయింది. అయితే నాకేమీ కాదన్నమాటే ఆ అభిమానం, ఆ పాటలు, నవ్వులు సృష్టికర్తకి గచ్చకాయలే? అంత ఆకర్షణకి కారణం ఏమీ లేనా? ఈమె నాకేమీ కాదూ, నే నీమె కేమీ కానూ?"

"అన్నయ్యా! ఎవరూ భోజనానికి రాలేదేం?" ఒళ్లంతా గగుర్పొడిచింది. ఈమె నాకు చెల్లెలా? నేను పొరపాటుగా ఎంచి బాధపడ్డాను. "చెప్తాన్లే". లేకపోతే ఆ స్నేహాని కర్థమేమిటి? ఈమె నాకు చెల్లెలే.

## ౬

పెళ్లయిపోయిన దగ్గర్నుంచి రాధ మాయింటికి రావడము మొదలుపెట్టింది. ఇంక భయము లేదుకదా అని కాబోలు వాళ్లమ్మ కాని, మాఅమ్మకాని ఈరావడాని కభ్యంతరపెట్టలేదు. తెర కాస్తా బలిసింది. కాబట్టి "ఏది రాధా, ఏదీ నీనవ్వు" అని నే నన్నా. "అన్నయ్యా! ఈపాట పాడు"మని ఆమె అన్నా తప్పించేవారెవరూ లేరు. ఆమెకూ నాకూ ఉన్న—తప్ప మిగిలిన వన్నీ ఉన్నాయి, ఈ పరిచయస్నేహాలలో.

రాధవివాహ మయింది, నీవివాహము మాటేమి టంటారు పాఠకులు. అవనిగడ్డనుంచి ఒకసంబంధము వచ్చింది. నా కెందుచేతనో వివాహమంటే వైముఖ్యం పోలేదు. మునుపు, ఆమె ఉన్నది కనక, ఇప్పుడో ఆమె దాటిపోయింది కనకేమో? ఈసంగతి మావాళ్లకి తెలియదు. ఈసంబంధము చూచి రమ్మన్నారు. పిల్లకళ్లలో తేజస్సు లేదు. నవ్వితే ఏడ్చినట్లు లేదుకాని అదెలాగో ఉన్నది. సంగీతములో 'మ' 'ప' 'భ' లకి తేడా లేదు ఉచ్చారణలో. పిల్లగాత్రం సఫేదు రంగు, అర్ధణాబిళ్లకి పాదరసం పూసినట్టు. నల్లగా ఉంది. తెలివితేటలు లేవు. ముద్దుమొహం అని చెప్పి తోశేశాను. శారదాబిల్లు ప్రాచీనాచారవంతుల కోలాహలముతో, పెళ్లిబాజాలతో, గుర్రపుబండీ పల్లకీలతో ప్రవేశించింది. సంబంధాల అలజడి చాలామట్టుకు తగ్గింది. మావాళ్లకీ రహస్యంగా పెళ్లిచేయడ మిష్టములేదు. ఇదీ నయమే ననిపించింది.

పరశాఖిలోని పిల్ల నే వివాహమాడతానని చాలామార్లు ఇంట్లో అంటూ వచ్చాను.

"బిల్లు ఒకటి అవతరించిందిగా? ఇంక ఏపిల్లయితేనేం?" అనేది మాఅమ్మ. ఈలోపుగా మాఅక్కయ్య నేస్తురాలి కొకర్తెకి (వారు ములికినాడువారు) కూతు రున్నదట. చేసుకోవలసినదని ఆమె మాఅక్కయ్యకి వ్రాసింది. మాఅమ్మకి వైశాఖసంబంధము లిష్టములేకపోయినా ఆపిల్లనైతే ఒప్పుకుంటా నంది. నేను 'పిల్లని చూడనక్కరలేదు. మన మెరిగిన పిల్లేకదూ?' అన్నాను. రాధ కాకపోయిన తర్వాత నింకే పిల్లయితేనేం?

* * * *

నా కిస్తానన్న పిల్లలందరి భోగట్టాలూ రాధా కనుక్కునేది. ఈపిల్లసంగతి ఆమెకు తెలియదేమో. ఒకనాడు మాఅక్కయ్య ప్రసంగవశాత్తు, "బందరెళ్లేటప్పుడు" అంది.

"బందరా! మీ కెందుకు బందరూ?" అంది రాధ.

"మాతమ్ముడికి పెళ్లికి."

"ఏమిటే! కుదిరిందా ఏమిటి?"

"ఆఁ."

"వాళ్లింటి పేరు?"

"హిందూపురంవారు."

"అదేం పేరు? వెలినాళ్లే?"

"కాదు. 'మాశాఖవాళ్ల పిల్లని చేసుకోను, వైశాఖలోనేగాని' అని వాడు పట్టుబట్టాడు. అందుకని వైశాఖపిల్లని చూశాము. నీళ్లు జల్లితే పాలపొంగులాగ అణిగిపోయింది, ఆమె ఉత్సాహము.

"అయితే ఎప్పుడు బయలుదేరుతారు?"

"మాఘమాసంలో."

* * * *

శాఖాభేదాలు మాసిపోవాలని సంఘంలో కల్లోలం పుట్టిద్దామని నాఆశయం. చేసిచూపిన తర్వాత ఆరంభిద్దామని ఊరుకున్నాను. మళ్లీ ఏమొచ్చిందో రాధ మాయింటికి రావడము మానివేసింది. ఏమిటిరా విశేషమని కనుక్కుంటే ఆమె వ్యక్తురా లయినట్లు తెలిసింది. కాని పాపం వంట్లో బాగుండక బాధపడుతూ చిరాకుగా నుంటుందట. ఒకనాడు మందుకి డాక్టరుగారింటికి వెళ్లాలని వాళ్లమ్మ మాఅమ్మతో చెప్పింది.

"సుధా! వాళ్లమ్మాయికి వంట్లో నయములేదుట. వాళ్లబ్బాయి ఊళ్లో లేడుట. వెళ్లి మందుకు తెచ్చిపెట్టరా పాపం!" అంది మాఅమ్మ. మందు తీసుకుని వాళ్లింటికెళ్లి "పిన్నిగారూ" అని కేక వేశాను.

"రండి" అని ధ్వని.

లోపలికి వెళ్లాను. మంచముమీద ఆమె పడుక్కుంది. కూర్చోమని మంచంపట్టెమీద కొట్టింది.

"బందరు ఎప్పుడు వెళ్తారు?"

"నీ కెవరు చెప్పారు?"

"మీ అక్కయ్య."

"నువ్వు వస్తావా?"

ఎందుచేతనో నావైపే చూస్తున్న ఆకళ్ళలో జలజల నీరు క్రమ్మింది. ఆనీళ్లు నాకు కనబడకూడదని గాబోలు తల పక్కకి త్రిప్పింది.

"ఏం రాధా?"

"................ .."

"ఎందు కేడుపు?"

వంటవసారాతలుపు గాబోలు కిర్రుమంది. గభీమని కళ్లు తుడుచుకుని,

"ఏం లేదు. దూరంగా నిలబడండి. అమ్మ వస్తోంది."

"పిన్నిగారూ!"

"వస్తున్నా నాయనా! కూర్చో. ఎంతో ఆలస్యము లేదు."

"మం దివ్వనా రాధా?"

"మందా, ఎందుకు? రోగానికా, యోగానికా?"

నా కామెమాటలు వింతగొల్పాయి. చికాకెత్తింది. మందక్కడ పెట్టి, "రెండింటికీ మం దివ్వగలరమ్మా? ఇప్పుడే వస్తానుండు" అని వచ్చేశాను.

ముహూర్తము సమీపస్థమౌతున్నకొద్దీ నాఉత్సాహ మెక్కువౌతోంది. ఎవరో కోతిని కట్టుకుంటాను. ఇకముందు రాధాసుధాకరులకి శాఖ లడ్డురాకూడదు.

శుభలేఖలకి పైవిలాసాలు వ్రాస్తున్నాను. రాధఅన్నయ్య వచ్చి పిలిచాడు. వెళ్లాను. "మాయింటికి ఒకసారి రండి. మాచెల్లి తీసుకురమ్మంది." అన్నాడు. ఎందుకో? వెళ్లాము.

మంచమువీూద ఆమె అలాగే ఉంది. గది చీకటిగా నుంది. నడికప్పులోంచి సూర్యకిరణ మొకటి గదిలో దూరి కొంచెము వెలుతు రిచ్చింది. రాధ కూర్చోమని సైగచేసింది. ఎక్కడా కుర్చీ లేదు. దగ్గిరికి వెళ్లి నిలబడ్డాను. కూర్చోమని మళ్లీ సైగచేసి, "మ రెప్పుడూ కూర్చోమనను లెండి" అంది. నాకడుపు చెరువై పోయింది. ఎందుచేతనో పాతవిషయాలన్నీ గుండెని కమ్మాయి. అనలేక అనలేక "ఏం చెల్లెమ్మా!" అన్నాను. రాధ మూతివీూద చెయ్యిపెట్టుకుని కూర్చోమంది మూడోసారి. "కూర్చో నాయనా, నామూలాన్నుంచే వచ్చిం దింతాను. అప్పు డిచ్చేస్తే ఏబెంగా లేకపోవును." అన్నాదావిడ, కళ్లు వత్తుకుంటూ. ఝంఝామారుతానికి అరటిచెట్టులాగ కొట్టుకుంది మనస్సు. రాధపక్కన కూర్చున్నాను. ఆమె నాచుట్టూ అరసున్నలాగు పడుకుని నన్ను ఒత్తింది. తల మంచపట్టెమీద పెట్టి, చేతులు నాకాళ్లమీద వేసింది. ఒళ్లు గప్పుమంది. ముత్యాల్లాగ కన్నీరు రాలుతోంది. ఓడవడానికి ధైర్యము చాలలేదు. పక్కమీది పగడాలపేరు తీసి నాతలమీద పడేసింది. వెల్లకిల పడుక్కుని ఏదో మాట్లాడబోయింది. మొగముదగ్గిరికి వెళ్లాను. నాముఖము రెండు చేతులా తడివి గొణుగుతోంది. ఇంకా దగ్గిరికి వెళ్లాను. నాముఖం తన చెక్కుల కదుముకుని "మళ్లీజన్మకి" అంది. సరి సరిలేదు. అంతా అంధకారం.

"ఈమె నా చెల్లెలా? భార్యా?"



# చెలిమికలిమి

కవితావినోద, డాక్టరు నిడమర్తి ఈశ్వరప్పగారు, బి. ఏ.

ఎఁగి నఁగి నొక్క యడవిమధ్యమునందు - మఱ్ఱి చివరకొమ్మ తొఱ్ఱలోన
వాస మేర్పరించి పావురముల జంట - చిరము గాపురంబుఁ జేయుచుండె.

పతియె దైవంబని సతి - పతిసేవలఁ జేయుచుండుఁ బతియుం బత్నీ
వ్రతుఁడై యనురక్తిని సం-తతము మెలంగును భళి! భళి! ధన్యులు వారే!

తెలవాఱ మేల్కాంచి కలకలఁగూయుచు ననురక్తినొండొంటి నభిసరించు
నిదురలో రాతిరిఁ జెదరిన యీఁకల ముక్కుల నొండొంటి చక్కఁజేయుఁ
గనుశోభకై పొంగి తనివోక యొండొంటి నట్టుల వాంచి కన్నానిచూచు
నుత్సాహ మేపార నొయ్యారముం జూపి యొండొంటి వలపించి మెండువలచు
మొదల మెలిగొని సొక్కుచుఁ బుడమినెల్ల-దంపతులచిత్తశుద్ధి కాదర్శ మిడుచు
రెండు తనువు లున్నను జీవ మొండెయనుచుఁ-బక్కిజత గాంచె బుద్ధి నద్వైతసిద్ధి.

తమతమ మోహముం బెనుప దాఁగిలిమూఁతల నాడువో నిరుం
జముల నడ్లో సైఁచు నిమసమ్ము వియోగము, గాని దీర్ఘకా
లము బెడబాయనోపవు; కలస్వనముల్ చెలఁగంగ నవ్విహం
గమ మిథునంబు మేఁత నెమకన్ జనుఁ గాననసీమ జోడుగన్.

అందునందున గింజల నారగించి - నిర్మలంబైన సెలయేటి నీరు ద్రావి
కష్ట మన నెట్టిదో యెఱుంగకయ హాయిఁ-బుచ్చుచుండె దినము లా కపోతయుగము.

కాంత కంత ఫలించెను గర్భశుక్తి - పుట్టె ముక్తాఫలములట్లు మూఁడు గ్రుడ్లు
తల్లిపొదుగంగ నవి చిన్న పిల్ల లయ్యె - బెంటిపాలింటి తొలిచూలిపంట యనఁగ.

ఎగురలేనట్టి గున్నల నింట డించి - తొంటియట్టులఁ బోలేవు మింటి కిపుడు
పోయినను మేఁత కవి జాగుసేయలేవు - పట్టిలాగదె వాత్సల్యబంధనమ్ము!

వచ్చియున్ రాని యెఱకల వరుస దిద్ది - చిట్టిచిన్నారులను ముద్దు బెట్టికొనుచు
గూఁడు విడరా దటంచును బోడిఁ జెప్పె - పరువున నెమెరఁ దెత్తుమం చరుగుదెంచు.

పుక్కిట నిడు నెరనట్టుల - నిక్కించుచు రెక్కలార్చు నిసుఁగుల కడులే
ముక్కులఁ బెట్టుచు మఱిమఱి - మక్కువతో సాఁకు వారి మాతాపితరుల్.

ఒకనాఁ డామగనాలు మేఁతదినుచో నొక్కింతయుం గూడు నో
టికిఁ బోకున్న గుభిల్లుభిల్లునను గుండె ల్కొట్టుకొన్నంత "నా
కకటా! చేయిడి కుక్షిలోఁ గలఁచినట్లయ్యెన్ ప్రియా!" యన్న వే
వికలస్వాంతత మళ్లె నావిహగము ల్వీక్షింపఁగాఁ బిల్లలన్.

వ. అంత—

అంచల నడలించి అంబుజంబులఁ ద్రుంచి సరసులఁ గుమ్మి కశ్మలము నించి
తొండంబు దండిగా నిండించి నీటిని కుంభస్థలమ్ములఁ గుమ్మరించి
చెట్టుఁబుట్టల నెట్టి చెరచెర శితదంతములఁ గొట్టి చిఱుతగుట్టలను ద్రోలిచి
కాన మృగావళిఁ గారించి పలుమాఱు దుమ్మెత్తి నెత్తిపైఁ జిమ్మికొనుచు
మఱ్ఱిచెంత నిలిచె నొక్క మదగజంబు - కొమ్మలను లీలమైఁ బెళుక్కనను విఱిచి
కొమ్మతోడుతఁ బక్షినీడమ్ముగూల్చి - పక్కి-గూఁటిని బిల్లలఁ ద్రొక్కి చనియె.

దవుదవ్వుల నాకృత్యముఁ - జివచివ వచ్చుచును గాంచి చెదరిన మతితోఁ
గువకువఁ గూయుచు నాకల-రవము లెలుంగెత్తి యార్తరావ మొనర్చెన్.

ముక్కుకొనఁ దన యురమునఁ బొడిచికొనుచు-వివశయై కనుఁదోయి నశ్రువులు రాలఁ
జంచువును విప్పి కడు విలపించి లలన - కాంతునకుఁ బల్కె గద్గదకంఠ యగుచు.

ఎక్కడ దాపురించె మన కీ మదసింధుర? మేది దిక్కు? బల్
రక్కసిఁబోలె వచ్చి సుతరత్నములం దనపొట్టఁ బెట్టెనే!
యెక్కరణిం దరింతు నిఁక నీ విపదంబుధి? యే నభాగ్య, నా
యుక్క తలంగు టెట్లు? సుతుఁ డొక్కరుఁ డేనియు దక్కఁ డక్కటా!

వ. అని యిటుల దుర్భరశోకానలపరితప్తచిత్తయై బహుభంగుల విలపించు పులుంగునెలంత
కప్పోతు కపోతం బిట్టు లనియె:

అట్టిటుఁ దల్లడిల్లి హృదయం బిదె వేఁగుచు నున్నదైన నే
దిట్టఁడ నైతిఁ జుమ్మి; పరిదేవనమేల? వృథాప్రయాసమా
యెట్టటు లేడ్చియేమి? దివికేఁగిన బిడ్డలు మళ్లి వత్తురో?
బిట్టుగ నేడ్వఁబోకు మిఁక బేల! ననుం గని శోక మాఁపవే.

నాయర్ధాంగము నీ విటు - లాయత చింతాబ్ధి దోఁగి యనిశంబును "హా
హా!" యన నీ యర్ధాంగం - బే యలమట నొందునో యని యెంచవదేలా?

నీదు శోకంబునకుఁ గొంత ప్రోది యగున-టంచు దుఃఖంబు లోలోన నణఁచికొంటి
నాకు నిన్బోలెఁ బెనువంత లేక కాదు - జీవితేశ్వరి యిట్లు హాపోవవలదు.

వ. అనుచుం గొంత శోకోపశమనంబుఁ జేసి మఱియు నిట్లనియె.—

నట్టడవి న్వసించి యిదె నాకమటంచుఁ దలంచి యెన్నఁడే
చెట్టను జేయ కేరికిని, జిత్తము నీపయి హత్తియుంచినన్
గట్టడి మాయఁ జేసి మముఁ గాఱియవెట్టుట నీకు ధర్మమా
పుట్టిననాఁటనుండియు నపూర్వకృపామతిఁ బ్రోచు దైవమా!

కొంతవడికి వారిసుమంత శాంతినంద - నాతిదూరస్థ తరురాజ మాశ్రయించు సద్విజోత్తముఁ డొక భ్రాతృసముఁడు వచ్చె - నొరుల విపదవస్థలఁ బరామరిక విధిని.

ముంగలవానిఁ గాంచఁగఁ గపోతయుగంబున కంతకంత కు
ప్పొంగిన శోకవార్ధి కనుబొందల దూఱి యవారియౌచు ను
త్తుంగతరంగసంగతిని దూఁగుచు సశ్రువులై చెలంగ న
య్యంగన బావు రావురని యారవముం బొనరించి దీనతన్.

"అన్నా, నీమొగ మెట్లు చూతుఁ? గడు సిగ్గౌచున్నదే! మున్నమొ
న్న న్నీ విందుఁ గృప న్మముం గనఁగ రా నందించి నీచుట్టు నా
గున్న ల్చేరుచు 'మామ, మామ' యనరే? కూర్మి న్విలోకింపవే?
కన్నారం గని సంతసింపఁగల భాగ్యం బున్నదే నా కిఁకన్!

"అంగజుఁబోలు నంగజుల నందఱ నొక్కనిమేషమందునన్
మ్రింగిన రాక్షసాంగనను; నిష్కృతియుం గనరాని దుష్కృతిన్
బొంగుచుఁ బూర్వజన్మమున భోరున నెందఱ నేడిపించియో
క్రుంగుచునుంటి నిట్టు లతిఘోరవిచారభరంబునం గడున్.

"ఉన్నె నాయట్టిపాపాత్మ యుర్విలోన! - లేదు, నిజము, ముమ్మాటికి లేదు లేదు
కూడదోయన్న! ననుఁ జూడఁగూడదన్న!-అఘము లంటును నీ కన్న" యనె నతండు-

"ఇది మీ పూర్వకృతాపరాధఫల మయ్యెంగాని, నమ్ముండి, నేఁ
టిదిగా దూఱడిలుండు, మీమదిని మొండిం జేయుఁడీ, మీరలా.
ముదిమిం దూలినవారు కారు, చిఱుతల్, ముందుండు సంతానసం
పద నా దీవెన తథ్య మౌను, తొలి మీ స్వాస్థ్యమ్ముఁ బోషింపుఁడీ.

"అమ్మా! చెప్పెద నొక్కమాట, వినుమా యాదేవదేవుండె సం
బ్రమ్మం జెందుచు నొక్కొక్కప్పుడిటులే బంగారపుం బొమ్మలన్
నెమ్మిం గైకొనిపోవుచుండు దివికి న్నేస్తంబుఁ జేయంగఁ జె
ల్లెమ్మా! నమ్ముము నీసుతుల్ సుఖులె; చాలింపంగదే నీ వెతన్."

వ. అని కొంతతడ వందుండి సాంత్వవచనంబుల సాంత్వనంబు సాంతంబుగాఁ బలికి వారి యలమట నపనయించి నుగుడ వత్తు నంచు వెడలె.

అంత వేఱొక వృక్షమ్మునందుఁ గ్రొత్త-గూడు నొకదాని నిర్మించికొనియె నవ్వ
క్రమముగా వారు మరల సుఖమ్ముగనిరి - కాలమేగాదె దుఃఖాబ్ధివేలఁ జేర్చు!

మాసము లతిక్రమింపఁగ - నాసాధ్వికి మరల గర్భ మయ్యెను; మది సం
తోసిలుచు, భయముఁ జెందుచుఁ-బ్రాసవదినములఁ దలఁచుచు భామిని యనియెన్.—

"లీలమెయిం జరించి యవలీలఁ దరుప్రకరంబుఁ గూల్చి క
ల్లోలము సేయు చివ్వని విలోకనమాత్రన భీతిఁ గొల్పు శుం
డాలము వల్లభా! మరల నాకను వేళల నేమి చేయునో
వీలగునప్పుడే మనము వేఱొక కానకుఁ బోవఁగూడదే?"

వ. అని తన యుద్దేశము సూచించినంతఁ గాంతుండు.—

"ఏలా యీ విపినంబు వీడి చనఁగా నీ తుచ్ఛ నాగమ్ముకై?
యాలానంబున దానిఁ గట్టెదను; కాలాఘాతముం జేర్చెదన్
నాలావుం గనవేల? నే శపథము న్జల్పంగ నింకేల యో
షేలా! భీతిఁ దొలంగి యుండు" మన నా భీతాంగియుం దీనతన్.

"చాలును, నీ ప్రియాంగనకు స్వాస్థ్యముఁ గూర్పఁగ నాడె దిట్టుల
క్కోలుమసంగు దంతిహతకుం బొలియించెదవొక్కొ? కానలోఁ
జాలిన జంతుజాల మొకచక్కిని గూడినఁ జాలువారొకో?
తాలిమి కల్గఁ బో దకట, దైవ మదెట్టుల వ్రాసియుంచెనో!"

అనిన, హీనకంఠస్వరమ్మునఁ బలుకుచుఁ - గంపమున 'నిట్లు మైదీపఁ గలఁచె దేల?ఁ
కలికిరో! నీదు పలుకు నిక్కమ్మె యనుము - నాబలము వినుతు' నటంచు నాథుఁ డనును.

"బలియుఁడైనవాఁడు వడ్లంగిపిట్టన్న - వాని మించు భేకభూపుకుండు
వింధ్య మేరులట్లు వీరలుండిరిగాదె - రెండుభుజము లగుచు నిండు నాకు.

"ముగురము యోజించియ మా - మగటిమిఁ జూపింప నేమి మాచేఁగా దో
ముగుదా! చూడు మిదే యిఁక మ-దగజము మాచేతఁ జచ్చె, తథ్యముసుమ్మీ."

అని తనవనితకు నిబ్బర-మును గొంత యతండు వల్కి పోవుచు వడి న
వ్వనమున కావలనున్న కొ-లను చెంత వసించు వారలను జేరికొనెన్.

అమిత నమ్రత వారి పాదముల కెఱఁగి - తనదు దురవస్థ వినిపింపఁ గనికరించి
సాయముం జేయఁగా వార లియకొనిరి - దుఃఖజలధిఁ దరింప మిత్రుండె తరణి!

అంతట వారు ముయ్వురు రహస్యముగా నొకచోటఁ జేరి యే
కాంతము మంతనమ్ము నధికశ్రమతోడుత సంతరించి యా

దంతిని వేగఁ గూలుచువిధానముఁ జక్కఁగఁ జర్చసల్పి, సి
ద్ధాంతముఁజేసి కేరుచు గృహమ్ముల కేఁగిన వచ్చె గ్రీష్మమున్.

మెండుగా నెండ మండుచునుండువేళ - వనమునం దెల్లెడలఁ గ్రుమ్మి బడలి యేనుఁ
గొక మహాతరుచ్ఛాయయందొడ లెఱుఁగక - గుఱకవెట్టుచు నిద్రించెఁ గొంతతడవు

అట్టితరుణంబు వేచి కన్పట్టు చిఱుత - యిదిగదా దాని సాధింప నద నటంచు
నింటి కేఁగి రివ్వున దన పెంటితోడ - వచ్చె నచ్చటి కొక తెప్పపాటులోన.

అమ్మకచెల్ల ! నేఁడుగదరా లభియించితి విట్లు నిద్రమై
దమ్మఁడ! చూడు మింక యని తానును భార్యయు రేఁగి యొక్కటన్
ద్రిమ్మరి దాని కందకయ నేత్రయుగంబును వాడిముక్కులన్
జిమ్ముచుఁ జీల్చి డొల్చియును జీకునిజేసి చనంగ నంతటన్.

తొల్లి మదజలధారలు వెల్లివిరియు - గండముల నిండ మెండు రక్తము స్రవింప
గిరగిరం జుట్టి బుసకొట్టి ఘీంకరించి - యెట్టకేలకుఁ గదలి యనేకపంబు.

దారి మెల్లనఁ గరమునఁ దడవికొంచుఁ - దిరుగుచుండెను వనమున దిక్కులేక
కోలనూఁది తిరిపెమెత్తు గ్రుడ్డిపగిదిఁ - గాలమొకరీతిఁ జన దెంత ఘనునికైన !

బోనముఁ దానముఁ బ్రవిమల - పానీయములు మునుఁబోలెఁ బ్రాప్తింపక యా
యేనుఁగు శీఘ్రముగా నడ-పీనుఁగుగా మారె నకట ! విధి తప్పదుగా !

కొండంత యాసతో నెండమావుల కేఁగి వడఁజెందు మృగముల వగపుఁ బెంచి
తమ నీడముల వీడఁ దడఁబడి తపియించు ఖగకులంబులను బెందగఁ గలంచి
నినుపారు సొంపారు నీరజాకరములఁ బులినప్రదేశము ల్వెలువరించి
బెండులై మాడిన కొండబీడులపోడులను మెండు కారుచిచ్చునను ముంచి
సెగలఁ బొగయించి నిప్పులఁ జెరగి గుప్పి - నేలఁగాళులఁ గాలిచి, నెత్తిమాడ్చి
ప్రాణికోటిఁ గడుంగడు బాధఁబెట్టి - వేసవిని వెలింగెను వినువీథిని రవి.

వ. ఒకనాఁటి మిట్టమధ్యాహ్నసమయంబున,

అట్టిటు లూఁగులాడి నడయాడఁగఁ గాళులు రాక, నిల్చి, నీ
ర్వట్టు సహింపలేక, తనప్రాప్తికి నూర్చుచుఁ గన్నులేక యె
ప్పట్టున నీటిపట్టునకుఁ బ్రాకఁగ నౌనని చింతఁజేసి యె
ట్టెట్టులొ తొండ మూఁచి చను నెమ్ములప్రోగగు నేనుఁ గత్తఱిన్.

బిరబిర భేక మొక్కెడ గభీరవిశాలబిలంబుచెంతఁ దా
నిరవుగఁ గూరుచుండి గళమెత్తి ప్రఘోషితసుస్వరావలు



1. రాజమంౘ్రి వైశ్యసేవాసదనము - సంస్కృతవిద్యార్థినులు; 2.—బాలికల వ్యాయామకక్ష్య;
3.—కుట్టుతరగతి; 4.—సింహాగారిపద్ధతిని బాలికల వ్యాయామము.



1. స్త్రీ సనాతనవిద్యాలయము, రాజమండ్రి; 2. స్త్రీ హితైషిణీమండలి, బాపట్ల.

ల్సొరిది నుపక్రమించి యనులోమవిలోమముల న్బెకాబెక
ల్పరగ జపించె నద్ది మదవారణమారణమంత్రమో యనన్.

"ఉరరవర"ట్టని కప్పలు - వరరవముం బొనరిచెడిని, వహావా! యిందే
యురుజలము లుండితీఱును - మఱిమఱి మున్గెదను, దగను మానిచికొందున్.

అని తలంచుచు నాసమై నల్లనలన - భేకరావానుసారియై ప్రాఁకికొనుఁచు
బోయి, పోయి, తుదకు మోసపోయి గోతఁ-గూలె నడగొండఁబోలిన కుంజరంబు.

అంత నాభీలమగు నా బిలాంతరమున - లేనిసత్తువఁ దీవ్రకోపానఁ దెచ్చి
కొనుచు గట్టుల దంతాలఁ గొట్టి కొట్టి - విసివి, తుదకయ్యె ద్విరదము విరద మకట!

చేయునది లేక దిశలు మార్మ్రోయ నార్చి - క్షుత్పిపాసల శుష్కించి సొమ్మసిల్లి
కొలఁదిదినములకే మేను దొలఁగె నద్ది - కలరవంబుల కష్టము ల్గడచె నంత.

లలనభాగ్యంబున నభిజిల్లగ్నమందు - సుతుల మువ్వురఁ గనె నొకశుభదినమున
నీతిబాధలు లే కక్క-పోతకులము - చిరముఁ దామరతంపరై చెలఁగెఁ గాన.

మన కథ కంచికిఁ బోయెను - మన మింటికి వచ్చితి మిఁక మన మొకనీతిన్
గని కలసి మెలసి మనవలె - వినుఁ డీ పై పద్దెములను విశ్వాసముతోన్.

కడిది యలఁతులైన కప్ప పిట్టలచేతఁ - జిక్కి మదగజంబు స్రుక్కి చచ్చె
నెంత బలియుఁడైన నెంత లావరియైన - గర్వపడఁగఁ జెల్ల దుర్వియందు.

"హుం" త్తటన్నమాత్ర నెగిరిపాఱెడి యల్ప-జంతువులును గలసి దంతిఁ గూల్చె
నలువు రొక్క-టైనఁ గల దెంత బలమైనఁ - జెలిమికలిమి నెన్న నలవియగునె?

మతమునఁ గ్రైస్తవు ల్మసలమానులు సిక్కు-లు మాలలంచు వే
ద్వైతముల మీరు మీరును విభేదమనస్కత నుండనేల? స
మ్మతమున నెల్లరు న్మెలఁగి భారతమాతకు మేలుగూర్చు సం
తతి యని నెమ్మదిం దలఁచినన్ శుభము ల్సమకూరవే వెసన్.

పోరునఁ గల్గు నష్టములు, పొందునఁ గల్గు శుభంబులంచు నే
వారును బల్కు-వాక్కులను బ్రామినుకు ల్బలె నమ్మి యేరికిం
బేరిమిఁ జూపుచుం దదభివృద్ధినె కోరుచు మీరు సౌఖ్యపుం
భారము దైవముం దునిచి మాన్యులరై పొగడొందుఁడీ యిఁకన్.

---

# గాలిదుమారం

వెంపటి నాగభూషణంగారు

౧

వేసంకాలంలో జరిగే విచిత్రాల్లో అదొకటి. ఛప్పున వున్నట్టే వుండి గాలిదుమారం లేచి, ఆకాశమంతా మబ్బులతో అల్లుకొచ్చి కుంభవర్షం కురుస్తుంది. కురిసినంత సేపేనా పట్టకుండా వెలిసిపోయి తెరిపి యిస్తుంది. దీనికి కారణ మేమిటంటే ఎవ్వరూ చెప్పలేరు. ప్రపంచంలో జరిగే కొన్నింటి విషయం అంతే.

*  *  *  *  *

యం. ఏ. పరీక్ష లైపోయినతర్వాత శెలవులకు మా నాయనగారి దగ్గరకు బయల్దేరాను, కాశీనుంచి. అంతకు నెలకుపూర్వమే మా నాయనగార్ని నెల్లూరునుండి గుంటూరు బదిలీచేశారు. తటస్థపడకపోవడంచేత నేనిదివర కెప్పుడూ ఆవూరు చూడలేదు. అసలు ఆవూరు అంటే నా కనేకం విపరీతాభిప్రాయా లుండేవి. కానీగూడా లేని కవులుంటారనీ, వద్దన్నా వెంటబడి తాము వ్రాసినవి చదివి వినిపించే వ్రాతగాళ్లుంటారనీ, పత్రికలు పుట్టీపుట్టకముందే గిట్టిపోతాయనీ, కాఫీహోటళ్లలో Milk Tea యేనా చెయ్యడం చేతగాదనీ, అత్తవారింటికి వచ్చిన అల్లుళ్లు కడుపునిండా అన్నము, కాలినిండా బట్టా లేకుండా అవస్థపడాలిసివుంటుదనీ, ఎక్కడెక్కడ దివాలాతీసిన వాళ్లూ ఆవూరును శరణుజొచ్చుతారనీ, వారితోపాటు అనేకవృద్ధ నారీపతివ్రతలు అక్కడే నివాస మేర్పరచుకొంటారనీ, మునిసిపలు కౌన్సిలు మెంబర్లంతటి వాళ్లుకూడా బడిపిల్లలల్లే కొట్టుకొంటారనీ, కోఆపరేటివు బ్యాంకుల్లో డబ్బు అమాంతం గల్లంతు అవుతూంటం రనీ, అవసరమొస్తే అన్నింటిలోనూ స్త్రీలు ముందంజ వేస్తారనీ—మొదలైన వెన్నో కబుర్లు విన్నా, ఇదివరలో. అందుచేత గుంటూరుఅంటే **ఆదుర్దా.**

రాత్రి కలకత్తా మెయిలు దిగి వెయిటింగురూములోకి జేరుకున్నా. తెల్లవారి ఏడుగంటలరైలులో గుంటూరు పోవచ్చునని అభిప్రాయం. ఇంతలో, ప్రస్తుతం బెజవాడలో కాపురంజేస్తూ, వచ్చేపోయే స్నేహితులకు ప్లాటుఫారంమీద ఉపారిచ్చే పాతమిత్రుడు, మేటూారు కనపడ్డాడు. మేటూరు ఇంటిపేరైనా దానికే అతను ప్రాముఖ్యము ఇవ్వబట్టి అందరూ అట్లనే పిల్చేవారు అతన్ని. ఆతను అంటేసాఅయి రాత్రి ఒంటిగంటదాకా ఆత్మకథతోనే గడిపాడు. తరువాత ఇద్దరం నిద్రపోదామని ప్రయత్నించాం. కాని, సన్నాయివాయింపుమోస్తరొకరు, బాకాఊదుడల్లే మరొకరు, మద్దెలవాద్యమల్లే ఇంకొకరు–ఈవిధంగా ఎవరిష్టమొచ్చినట్లు వారు, వెయిటింగురూములో గుర్రుకొట్టడం ప్రారంభించారు. పీపుల్సుపార్కులోకన్నా విచిత్రశబ్దాలు వినబడుతున్నా అట్లాగే కలతనిద్దరబోయి అయిదింటికి లేచాం. ఇంతట్లో మేటూరు "Brother, nowadays స్పెన్సరు ఎంత బాగుంటోంది అనుకున్నావు" అని బలవంతాన అందులోకి లాక్కుపోయి ఛోటాహాజ్రీ ఆర్డరిచ్చి, 'Boy బెస్టు సిగరెట్సుగూడ' అని కేక వేశాడు. బట్లరింకా రావడం లేదేమని చూస్తూండగా ఒకాయ నెవరో స్లిప్పర్సు చప్పుడుచేసుకుంటూ ప్రవేశించి మే మున్న బల్లదగ్గరకే



"...మా ఇద్దరికీ పరిచయం జేశాడు."

వచ్చింది. ఆవిడ్ని చూస్తూనే మేటూరు లేచి దణ్ణంపెట్టి "Hallo, ఎక్కణ్ణుంచి రాక? కూర్చోండి. my friend శివరావు—మిస్ కావేరి బావు—"అని మా ఇద్దరికీ పరిచయం జేశాడు. నేనూ మర్యాదలక్షణంగా సహం లేచి 'కూర్చోండి' అన్నా. ఆవిడెకుకూడా ఛోటాహాజ్రీ ఆర్డరివ్వడానికి లోపలి కెళ్లాడు, మేటూరు.

నేను సహజంగా దుర్బలహృదయుణ్ణి. అంటే అంతగా చొరవగల మనిషిని గానని తాత్పర్యం. అందులో ఆడవాళ్లని చూస్తే అపరిమితభయం. వాళ్లు చాలా సున్నితమైనవాళ్లనీ, ఏమని ఏంచేస్తే ఏం తంటా వస్తుందో అని నాకు మొదటనుంచీ అదొక దురభిప్రాయం. అందుచేత ఈసందర్భంలో ఏమి చెయ్యాలో తోచక అటూ యిటూ చూస్తున్నాను. ఇంతలో ఆవిడే "అదేమి పుస్తకమండీ?" అంటూ చెయ్యి చాచింది. "Safety pins అనే ఇంగ్లీషువ్యాసాల పుస్తకం. క్రొత్తగా వచ్చింది. నిన్న కలకత్తాస్టేషను Book stall లో కొన్నాను." అని బల్లమీద పెట్టాను. ఆవిడె దాన్ని తీసి పేజీలు తిరగవేస్తూ — "మీరేనా అండి, బి. శివరావుగారు అంటే" అన్నది. ఆవిడెయొక్క అఘనిక ప్రపంచజ్ఞానానికి ఆశ్చర్యబోతూ, "కాదండీ, నేను అంతవాణ్ణి కాదు. ఆయన నాకన్న అందగాడు; అదృష్టవంతుడు. బెసంటమ్మకనుసన్నల్లో మెలిగి ఆయన తారాచువ్వల్లే పైకి వచ్చాడు." అన్నాను కులాసాగా. "అదేమండీ. చాలా ఉపోద్ఘాతం చెప్పారు. ఎవరి అదృష్టం వారిది. ఒకవేళ మీరే ఆయనేమో అనుకున్నాను. అయితే మీరు ఎక్కడికి వెళ్తున్నారు?" అన్నది.

"గుంటూరికి. మానాన్నగారు అక్కడికి సబ్ జడ్జీగా ట్రాన్సుఫరు అయినారు" అన్నాను.

"అట్లనా. నాకూ గుంటూరులో పని వున్నది. బహుశః అయిదారురోజుల్లో వచ్చినప్పుడు కలుసుకుంటాను" అని పుస్తకం తిరగవెయ్యడం పూర్తిజేసి బల్లమీద పెట్టింది. ఇంతలో మేటూరు— చోపుదారుఅనే, మిత్రులిచ్చిన బిరుదాన్ని సార్థకంజేస్తూ—జట్కాతోగూడా వచ్చాడు. ముగ్గురం కర్తవ్యానికి పూనుకొన్నాం.

"శివరావు కవి అండీ. ఇంగ్లీషులో చాలా Books అచ్చువేశాడు. మొన్ననే Benaresలో M. A. కు Appear అయి వస్తున్నాడు "అన్నాడు మేటూరు మెహర్బానీగా.

"అట్లనా, I see.—దగ్గర మీ Books ఏమన్నా వున్నాయండీ?" అని అడిగింది, ఆవిడె.

"లేవండీ" అన్నాను ముభావంగా.

"అయితే మీరు Insure చేశారాండీ?" అన్నది.

"అవును మరచిపోయినా, శివరావు, మిస్ కావేరి ప్రస్తుతం Insurance Agent గా పనిజేస్తున్నారు. నీ Policy ఆమెద్వారానే చెయ్యి" అన్నాడు.

"క్షమించాలి. నే నింకా ఆవిషయం అనుకోడం లేదు. ఇప్పుడప్పుడే అవసరం లేదనుకొంటాను." అన్నాను.

"దానికేమిటి లెండి? అవసరమనుకొంటే అవసరం, లేకపోతే లేదు. ఇటువంటి మహత్తరకార్యానికి పూనుకోడానికి నేనే ప్రథమ-ఆంధ్రస్త్రీని. మనవాళ్లు తెగించి ఇటువంటివాటిల్లోకి దిగితేనేగాని మోక్షంలేదు. పైగా, ఆడవాళ్లు ఇటువంటి వాటికి ఉపక్రమించారంటే పనులుత్వరగా జరిగి లాభ ముంటుంది. Woman వచ్చిందంటే,-అందులో educated ది-తప్పకుండా ఎటువంటి మగవాడైనా మాట వినితీరుతాడు, చూడండి. For instance, నేను గట్టిగా ఆరునెలలు కాలేదు Businessచెయ్యడం మొదలెట్టి, అప్పుడే యాభైవేలు వేయించాను." అన్నది గుక్కలో.

"చాలాబాగుంది" అన్నా, ఇకేమీ అనలేక.

ఇంతట్లో కాఫీముగించి ముగ్గురం లేచాం. మేటూరు ఆవిడ్ని అంటిపెట్టుకొని సన్నగా బయటకు జారడంచేత, నెత్తిమీద పడ్డ బిల్లుని నివృత్తిజేసి నేనూ వెలపలికి వెళ్లాను. నన్నుచూసి ఆవిడె "మా రైలు టైముఅయింది. బందరు వెళ్తున్నాను. అయిదారురోజుల్లో గుంటూరు వచ్చి meet అవుతాను." అని శెలవుపుచ్చుకొని హడావడిగా నడిచి వెళ్లిపోయింది. వెనక్కి తిరిగేతిరగడంతోనే పిరుదులదాకా వ్రేలాడుతున్న అయిగుపాయల జడ, అందులో రాత్రి మంచులో చెడిపోకుండా పెట్టిన మల్లెచెండ్ల దొంతర, గాలికి ఎగురుతున్న రెండు అంగుళాల వెడల్పు జరీచొకలేటు చీరకొంగు—చిత్రంగా స్ఫురించినై కంటికి. "మిస్ కావేరి, Brother, Inter తప్పింది. ఏంచెయ్యడానికి తోచక Insurance agency take up చేసింది. సరదా girl. ఈవిడె sister గౌతమి గుంటూరులో Ladies' school కి Headmistress" అన్నాడు మేటూరు.

"పోనిస్తూ, యీగొడవంతా నా కెందుకు రా" అని అతన్ని వెనక్కు త్రిప్పి, Waiting room లో సామాను పట్టించుకొనిపోయి గుంటూరురైలులో పెట్టించాను. ఇంతట్లో మేటూరు నన్ను రెండడుగులు అవతలగా తీసికెళ్లి "Brother, five rupees వుంటే ఇయ్యి. అవసరంగా కావాలి. మళ్లీ నాకు Cheque రాగానే (ఎప్పుడొస్తుందో దేవుడికెఱుక!) ఇచ్చేస్తాను." అంటూ దీనంగా అడిగి, బలవంతాన పుచ్చుకొని "Brother, మాలోకల్లా కాస్త నువ్వే solvent కవివి" అంటూ Compliment ఇచ్చాడు. తరువాత నన్ను, రైలుని సాగనంపి మేటూరు నిష్క్రమించాడు.

## ౨

గుంటూరుకు జేరుకుని వారం అయింది. మానాన్నగారు అగ్రహారంలో పెద్దమేడ అద్దెకు పుచ్చుకొని వుంటున్నారు. సాయంకాలంపూట బయల్దేరి వూరు కొంచెంకొంచెంగా చూసివస్తున్నాను.

ఒకప్పుడు బంట్రోతు నెవర్నైనా వెంట తీసికెళ్ళేవాణ్ణి. లేకపోతే ఎరుగున్నవాళ్ళెవరన్నా కనబడితే వాళ్ళతో వెళ్ళేవాణ్ణి.

ఒకనాడు బందరునుంచి మిత్రుడు-శాస్త్రి వుత్తరం వ్రాశాడు, గుంటూరు వాళ్ళవాళ్ళని చూడడానికి వస్తున్నాననీ, బహుశః ఒక వారం మకాంచేస్తాననీ. సరే కొంత కాలక్షేపం అవుతుందిగదా అని సంతోషించాను.

బుధవారం మధ్యాహ్నంరైలులో శాస్త్రి వచ్చాడు. వాళ్ళ వాళ్ళని చూసుకొని సాయంకాలం నాకోసం వచ్చాడు. ఆపూట ఎక్కడకూ బయటకు పోకుండా, మేడమీద వరాండాలో గాలికి కూర్చుని బాతాఖానీ వేశాం. అనేకవిషయాలు తర్కించాం. చివరకు వెళ్ళేటప్పుడు శాస్త్రి ప్రాణం తీశాడు, 'ఈమధ్య వ్రాసినవి ఏమన్నా వుంటే చదివి వినిపించు' అని. కొంత బలవంతంమీద సరేనన్నా. మర్నాడు సాయంకాలం రింగురోడ్డుదగ్గర అయిదింటికి సుమారు కలుసుకుందాం అనుకొన్నాం.

*        *        *        *        *

గురువారం ప్రొద్దునరైలులో మానాన్నగారు పనుండి ఏదో వూరు వెళ్ళారు. అందుచేత ఆయనకారులో వూరంతా చాంద్రాయణం చేసి పదకొండింటికి ఇంటికి వచ్చాను. అప్పటికే ఎండ పొగలెత్తి పోతోంది. ఆపాటున భోంచేసి పడుకుంటే, మూడున్నరకు వంటవాడు కాఫీకోసం లేపేవరకూ మెలుకువ రాలేదు. ఆసమయానికే బంట్రోతు పైకొచ్చి "అయ్యా, ఎవరో ఆయన నల్లగా జుట్టు ఇరబోసుకొని వచ్చాడు. మిమ్మల్ని సూస్తాడంట" అన్నాడు. "ఎవ్రా, పేరు కనుక్కోలా?" అనేసరికి "ఎవరో ఏటూరు అంట అయ్యా, ఏటూరు" అన్నాడు. "ఆయనట్రా, రమ్మను" అన్నాను. మరోనిమిషంలో మేటూరు పైకి వచ్చాడు. అతను, నేను ఫలహారం చేశాం సావకాశంగా. సందర్భానుసారంగా తను ఆవూళ్లో అద్దె వసూలుచెయ్యడానికి వచ్చాననీ, సాయంకాలమో రేపో వెళ్ళిపోతాననీ చెలిబుచ్చాడు. "సరే, దానికేంలే. కానీ వుండి అట్లా రింగురోడ్డు మీదికి షికారు వెడదాం. శాస్త్రి వస్తానన్నాడు." అన్నాను. "అట్లాగా, అయితే నే నిప్పుడే వెళ్ళి, పనిచూసుకొని శాస్త్రిని కలుసుకొని అట్లా వస్తాను, అతనితోగూడా" అని నిజంగా పనివున్నవాడికి మళ్లేనే తొందరగా వెళ్ళిపోయినాడు.

అయిదుగంటలు దాటినతర్వాత వ్రాసిన కాగితాలు కొన్ని పుచ్చుకొని ఇంట్లోంచి బయలుదేరాను. రెండుమైళ్లదూరం నడిచి రింగురోడ్డుప్రాంతాలకు వచ్చాను. శాస్త్రి, మేటూరు ఎవ్వరూ కనబడలేదు. దూరాన ప్రశాంతంగా వున్న మఱ్ఱిచెట్టుక్రిందకు జేరి తిష్ఠ వేశాను. ఎంతసేపున్నా ఎవ్వరూ రాలేదు. అప్పుడనుకున్నా, శాస్త్రి పూర్వపుగుణాలు ఇంకా మార్చుకోలేదుగదా అని. వస్తానని రాకపోవడం, చేస్తానని చెయ్యకపోవడం, ఇస్తానని ఇవ్వకపోవడం, చెప్తానని చెప్పకపోవడం—మొదలైన అవలక్షణాలు ఎన్నుండాలో అన్నీ వున్నాయి అతనిదగ్గర. కాబట్టి అతనంటే మిత్రుల్లో ఎవరికీ అంత నమ్మకం లేదు. బ్రహ్మ దిగివచ్చాడన్నా అతను గుణాలు మార్చుకోడు. ఏమన్నా అంటే "మొత్తానికి నాదగ్గిర కవికి కావలసిన లక్షణాలన్నీ వున్నాయి" అంటాడు ఘనతగా.

ఎంతసేపున్నా రాలేదు శాస్త్రి. అతన్ని కలుసుకొని తీసుకొస్తానన్న మేటూరు కన్పళ్లేదు. 'ఏమిటి nuisance' అనుకుంటూండగా పెద్ద గాలిదుమారం బయల్దేరింది. అది చిత్రంగా వుంటుంది. పుట్టడం, పెరగడం అంటూ వుండదు దానికి; అంతా ఒక్కుమ్మడిన చెలరేగుతుంది. తేలికవన్నీ ఎక్కడివక్కడ ఎగిరిపోతున్నాయి. దుమ్ము మహావేగంతో కళ్ళంతా, ఒళ్ళంతా కొడ్తోంది. ఉన్నట్టుండి తటపటా వాన ప్రారంభించింది. నాకు కాలాడలేదు. చిక్కులోపడిపోయినాను. ఎంత దట్టమైన చెట్టుమాటున వున్నా తడవడం ప్రారంభించాను. చీకటిగూడా ఆవరించుకొస్తోంది. దిక్కుమిటి అనుకుంటూ పదిబారలు నడిచాను. గాలి, దుమారం, వాన అంతకంతకు ఎక్కువై నడవడంగూడా అసంభవం చేస్తున్నాయి. గుడ్డలన్నీ తడిసిపోయినై. ఒళ్ళంతా బురద అయింది. త్రోవ కనపడ్డంలేదు. ఇల్లుయింకా రెండు మైళ్లుదూరముంది. కేవలం భగవంతుడుతప్ప ఇంకెవ్వరూ జ్ఞాపకం రాలేదు, ఆమహాఅవస్థలో. ఇంతలో ఎడంప్రక్కనున్న మేడ ఇంట్లోంచి ఎలెక్ట్రిక్కులైట్ల వెల్తురు మినుకుమంది. సరే, ఏమైతే అయింది అని తెగించి ఆవైపుకు వెళ్ళి గేటుత్రోసుకొని వెళ్ళి, వరాండాలో నిల్చున్నాను. వరండాలో లైటులేకపోయినా లోపల హాల్లో లైటు వరాండాలోకి కన్పిస్తోంది. అక్కడున్న బల్లలు, కుర్చీలు ఖాళీగానే వున్నాయి. "ఇదెవరిల్లు అయివుంటుంది? ఏమీ అనుకోరుగదా" అని తర్కించుకొంటుండగా, వరాండాలైటు వేసి, బల్లలు, కుర్చీలు వానజల్లుకు తడిసిపోకుండా లోపల జారవెయ్యడానికి ఒక బంట్రోతు వచ్చాడు. వాడు నన్ను చూస్తూనే "అయ్యో, బాబయ్యగారు, వానలో ఇక్కడ చిక్కొడ్డారా? దయసెయ్యండి" అంటూ కుర్చీ దగ్గరికి లాగాడు. అప్రయత్నంగా జరిగిన మర్యాదకు ఆనందిస్తూ, పట్టిన అవస్థకు విచారపడ్తూ, శాస్త్రిని మనసారా తిడ్తూ వుండగా "తమెరు, సబుజడ్జీగారి అబ్బాయిగారుగాదొండీ. తమెద్ద నౌకరు మాపెద్దోడేనండి" అన్నాడు వాడు. "ఓహో" అన్నాను తలవూపి. ఇంతట్లో "రాముడూ" అని లోపలినుంచి ఆడగొంతుక వినపడ్డంతోనే "అమ్మొగారు పిలుస్తున్నారు. వెళ్లొస్తాను. మీరొచ్చారనిగూడ చెప్తాను" అని, నే నింకా ఏమిటో ప్రశ్నిద్దామనుకొంటుండగానే వాడు లోపలికి పోయినాడు. వాడివెంటనే దృక్కులుకూడ బరపి చూశాను. సింహద్వారానికి కుడివైపున గదిపైన "మిస్ గౌతమి రావు. బి. ఏ., యల్. టి." అని బల్ల కట్టివున్నది. వెంటనే నాకు

బెజవాడప్లాటుఫారంమీద కలుసుకున్న మిస్ కావేరిరావు, ఆవిడే చెప్పిన కబుర్లూ జ్ఞప్తికివచ్చి “ఈవిడే ఆవిడే Sister అయే వుంటుంది. ఇటువంటి దురవస్థపట్టి ఇక్కడికే రావలిసివచ్చింది. ఆవిడిప్పుడు కవబడుతుంది గూడా కాబోలు. Dirtyగా వున్నాను.” అని చాలా ఖిన్నుడ్నై, ‘పోనీ సన్నగా దాటిపోదామా’ అనుకున్నా. కాని గాలివాన ఇదివరకుకంటె పదింతలు ఎక్కువై అల్లకల్లోలం చేస్తోంది. ఈభయంలో వుండగా “Hallo, Come in, రండి లోపలకు” అంటూ ఇంగ్లీషు... కటి ఆడగొంతే వినబడ్డది. ‘లాభం లేదు, రహస్యం బయటపడ్డది’ అనుకొంటూండగా—తెల్లని సిల్కుచీరె కట్టుకుని నైలెటురంగు నిచోలిక



“...ఒకావిడ వరాండాలోకి వచ్చి...”

వేసుకొని తలంటిపోసుకుని ఆరబెట్టుకొన్న వెండ్రుకలు వీపంతా వ్రాగిసలాడుతూ, చేతులో చంద్రహారం అవీ పుచ్చుకొని ఒకావిడే వరాండాలోకి వచ్చి “ మీరా. మావూరి సబ్‌జడ్జీగారి Sonట గామా. రాముడు చెప్పాడు. మిమ్మల్నే కాబోలు, బెజవాడ స్టేషనులో Casualగా కలుసుకొన్నానని మా Sister కావేరి ఈమధ్య వుత్తరం వ్రాసింది. నాలుగైదురోజుల్లో రావాలి, బహుశః” అన్నది. నేను లేచినిల్చుని, చిన్ననమస్కారం పారేసి,“అవును, నేను శివరావుని. సబ్‌జడ్జీగారి Son ని. మీ Sister ని కలుసుకొన్నాను.” అన్నాను.

అంటూండగా ఆవిడే నాకు కొంచెందగ్గరగా వచ్చి, కన్ను నిగుడించి చూస్తూ “అయ్యో Clothes అన్నీ తడిసిపోయినై. లోపలకు రండి, change చేదురుగాని. ఇక్కడ గాలిగూడా ఎక్కువ.” అని లోపలికి దారితీసింది. వద్దనడానికిగూడా వీల్లేని పరిస్థితిలో ఆవిడెను అనుసరించివెళ్లాను. “రాముడూ, ఇక్కడే వుండు. ఎవరన్నా వస్తారు” అని నౌకర్ని వాకిలిదగ్గరే నిలవేసి, హాల్లోంచి ప్రక్కగా వున్న మేడమెట్లెక్కింది. నేను కొంచెం అనుమానిస్తూన్నట్టు గమనించి “ఫరవాలేదు, రండి.” అన్నది. సరేనని సమన్వయంచేసికొని ఆ మెట్లెక్కి పైకి వెళ్లాను. అక్కడ హాలంతా రంగురంగుల బల్బులతో వెలిగిపోతోంది. హాలు అరేంజిమెంటు, అలంకారంగూడా చాలా చిత్రంగా వున్నాయి. ‘కూర్చోండి’ అనేమాటవిని అక్కడ సోఫాలో ఆసీనుణ్ణి అయినాను. అప్పుడావిడే హాలుకు ఎడంవైపునున్న గదిలోకి, తెరతొలింగి వెళ్లి అయిదునిమిషాల్లో తిరిగివచ్చి, “అక్కడ clothes పెట్టాను, dress మార్చండి” అన్నది. “ఫరవాలేదు. పావుగంటలో వాన తగ్గిపోతుంది. వెడ్తాను” అన్నాను. ఆవిడె వూరుకోలేదు. “ఏమిటండీ, అంత మొహమాటం. ఫరవాలేదు. మా brother బట్టలు కొన్ని ఇక్కడ వున్నాయి. పట్టుగూడా మీకు సరిగ్గా సరిపోతుంది అనుకుంటాను. వేసుకోండి, ఫరవాలేదు. లేవండి” అని తొందరపెట్టేసింది. తప్పదనుకొని, తప్పటడుగులు వేసుకొంటూ గదిలోకి వెళ్లాను. కళ్లు గిర్రున తిరిగి పోయినై, మొదట్లో. ఆనిలువుటద్దాలు, ఆదోమతెరమంచాలు, ఆచిత్తరువులు, ఆఅలంకారాలు- ఒకటా! అంతా నవలల్లో వర్ణింపబడేతాలూకువాటి మోస్తరుంది. చెప్పద్దూ, నాకుమాత్రం గుండె గాబరావేసింది. అయినప్పటికీ ఆలస్యం చేస్తే బాగుండదనుకొని, త్వరగా దుస్తులు మార్చి బయటి కొచ్చాను. అప్పటి కావిడె సోఫాలో కూర్చుని సంచీజడ అల్లడం పూర్తిచేసి, పువ్వులు జారుగా పెట్టుకుంటోంది, చెయ్యి ఎత్తి. నన్ను చూసి “సరిగా fit అయినయ్యే! It is alright. రండి” అని నేనుగూడా ఆసోఫాలోనే కూర్చోవలెననే వుద్దేశంతోనో, ఏమిటో మరి, కొంచెంగా జరిగింది. ఆసూచన్ని గమనించనట్టుగానే నటించి కొంచెందూరంగా వున్న కుర్చీలో దిగబడ్డాను, కొట్టుకుంటున్న గుండెను తమాయించుకొంటూ.

“ Hopeless వాన. Health affect చెయ్యదుగదా ”అన్నది, పువ్వులు తురుముకోడం పూర్తిజేసి.

“ Thanks, ఫరవాలేదు ” అని గోడపై నున్న ఫోటోవంక చూచాను. “ అది నేను, కావేరి కలిసి వెనుక తీయించుకొన్న ఫోటో.” అని చెంగున లేచి వేలాడుతున్న ఫోటోని తీసి నామొహంలో పెడ్తూ “ అదిగో, దాని చేతులో వీణగూడా వున్నది. ఆరోజుల్లో చాలా బాగా వాయించేది. ఆరునెల్లనుంచీ Insurance workతో తంటాలు బడుతూ అన్నీ మఱచిపోయింది.” అన్నది. అంత మొహంమీద దాకా వచ్చినదాన్ని గౌరవించకపోవడం భావ్యంకాదని ఫోటోని చేత్తో అందుకొని చూసీచూడనట్టు నటించి ఇచ్చేశాను. అందులో దృశ్యాన్నిమాత్రం జ్ఞప్తిపెట్టుకున్నా. కావేరి కుర్చీలో కూర్చుని వీణ

వాయించడానికి సిద్ధంగా వున్నది. గౌతమి కుర్చీచేతిమీద ఓరగా నిలబడి వున్నది.

ఆఫోటోను మేకుకు తగిలించి ప్రక్కనున్న Water-Colour painting బొమ్మ తీసుకొచ్చి "ఇది చూడండి" అన్నది.

"విశ్వామిత్రతపోభంగం" అని దాన్ని చేత్తో అందుకుని "ఎంత బాగుంది!" అన్నాను, అప్రయత్నంగా. అభ్రంకషములైన పర్వతశ్రేణి వెనుక. వివిధప్లావితమైన ఆకాశం పైన. రసభరితమైన దృశ్యం మధ్య. కళ్లు మరల్పకుండా చూస్తున్నాను.

"అది చాలాశ్రమపడి చిత్రించింది నేను. నా యావత్తు శక్తిసామర్థ్యాలు దాంట్లో పెట్టానంటే అతిశయోక్తికాదు. చిత్రకళకు మూలాధారమైన రూపభేదప్రమాణ...మొదలైన షడంగాలు ఇందులో observe చేశాను."—అని ఆర్టుమీద ఉపన్యాసం ప్రారంభించింది.

"అయితే మీరు draw చేసిందేనా ఇది? Very good." అన్నాను.

"అవును నేను చేసిందే. మొన్న Madras exhibition లో గవర్నరు medal వచ్చింది దీనికి"—అని చిత్తరువుని తానొక్కమారు ఎగాదిగా చూసి గోడకు తగిలించి, తిరిగి సోఫాలోకి చేరుకుంది.

బాగుండదు, manners కి లోప మొస్తుందని "మీరు draw చేసినవి ఇంకా బొమ్మలున్నాయా?" అన్నాను. "ఉన్నయండీ, నాలుగైదు; మిత్రులదగ్గర తిరుగుతున్నాయి. కొన్ని studio లో వున్నాయి, క్రింద; అన్నీ డజనుకన్న వుండవు. మీ రీమాటు సావకాశంగా వచ్చినప్పుడు చూడొచ్చులెండి. ఇప్పుడు చీకట్లో అంత బాగా కన్పడవు." అన్నది.

"చిత్రకళలో మన ఆడవారు ప్రసక్తి కలుగజేసికొని పనిజేయడం ప్రశంసాపాత్రమే. అందులో ఇటువంటి బొమ్మలు గీయడం అద్భుతమే. మొన్న క్రిస్టమసులో లక్నో వెళ్లినపుడు అశిత్ హల్దారుఇంటికి వెళ్లి అతని Art-gallery చూశాను. నిజంగా కళ్లు తిరిగిపోయినై" అని సంభాషణకు సవ్యంగా అందుకున్నా.

"అవును, హల్దారు చాలా గట్టివాడు. అతని బొమ్మలు చాలా చూశాను." అని ఇంకేమేమో అనబోతూండగా గడియారం గాంభీర్యంగా తొమ్మిదిగంటలు మ్రోగించింది. అది విని "ప్రొద్దుబోయిందే ...పోనీ అభ్యంతరం లేకపోతే ఇక్కడ ఆతిథ్యం స్వీకరించండి. మీకు తెలుసో లేదో మేము non-brahmins ము" అన్నాది.

"దానికేం ఫరవా లేదు. Thanks, వానగూడ వెలిసినట్టుంది. ఇంటిదగ్గర కనిపెట్టుకుంటారు. వెడ్తాను" అని లేచాను.

"ఉండండి, ఐతే. కారుని రమ్మంటాను." అని రాముడ్ని పిలిచి డ్రైవరుతో కారు సిద్ధంచేయమని చెప్పి, ప్రక్కగదిలోకి వెళ్లి అనవసరంగా వెలుగుతున్న లైటును ఆర్పేసింది.

ఇంతలో కారుహారను వినబడ్డది. ముందు అడుగువేశాను. గౌతమికూడా నడిచింది మెట్లవైపుకి. ఆక్షణంలోనే current తెగిపోయి లైట్లు ఆరిపోయినై; చిమ్మచీకటి. ఆగాభరాలో అడుగు సరిగా పడక నిలబడిపోయినాను. "ఉండండి. నేను దారి చూపిస్తాను. ఈఊరు దరిద్రం current ఇంతే" నంటూ మెట్లుఖడ్డీ అనుకొని నా బుజంమీద చెయ్యివేశింది. త్రుళ్లిపడి వెనక్కు వొరిగేసరికి "అయ్యో. మీరా" అంటూ చెయ్యి లాగేసింది. ఆలాగెయ్యడంలో నా స్థిమితం తగ్గి ఆవిడెమీద వ్రాలి, క్రింద పడిపోతానేమోనని గట్టిగా పట్టుకున్నాను. ఈ pose లో వుండగా లైట్లు పునర్జీవులైనై. వెంటనే ఆమెను వొదిలేసి, క్షమాపణ సూచకంగా దణ్ణం పెట్టాను. "అదేమి పని అండీ! పొరబాటు. చీకట్లో కన్పడలేదు. ఎవరికైనా వస్తుంది ప్రమాదం" అని మెట్లు దిగింది. పిల్లిఅల్లే నేనూ దిగాను. వాకిట్లో వరాండాదాకా వచ్చి "తప్పకుండా తరుచు వస్తూండండి. కావేరి రాగానే కబురుజేస్తాను." అని షేక్ హాండు ఇచ్చి డ్రైవరుతో మా యింటిదగ్గర నన్ను దిగబెట్టమని చెప్పింది. ఇంకోసారి చిరునవ్వుతో Goodnight అని కారులో ఎక్కాను. అక్కడినుంచి చూస్తే లైటు వెల్తుర్లో ఆవిడె తళుక్కుమన్నది. మనస్సు కుదుటబగచుకొని సాగిపోయినాను.

## 3

తెల్లవారి ఏడుగంటల రైలులో మా నాయనగారు వస్తారేమో అని కారు స్టేషనుకు వెళ్లి, రాలేదని తిరిగి వచ్చింది. అప్పుడే నేను నిద్రలేచి, మేడపైన వరాండాలో కుర్చీలో బద్ధకం తీర్చుకోడానికి కూర్చున్నాను. రాత్రి గాలిదుమారం, వాన— అన్నీ పోయి, ఆకాశం నిర్మలంగా ఉన్నది. 'స్వల్పకాలంలో ఎంత హడావిడి జరిగి, ఎంత చరిత్ర పెరిగిందే' అని లోలోపల గతరాత్రి కథంతా మననం చేసుకొంటున్నా. రింగురోడ్డు, రంగుమేడ, గౌతమి, అలంకారాల గది—అన్నీ స్మృతిపథాన పరుగెత్తుతున్నాయి. జరిగినది శుభమా, అశుభమా యని అంచనా వేస్తున్నాను.

ఇంతలో క్రిందనుంచి నన్నెవరో పిలుస్తున్నట్టు వినబడ్డది. తొంగిచూచేసరికి శాస్త్రి, మేటూరు మెట్లెక్కి పైకి వస్తున్నారు. నాకు వొళ్లు మండిపోయింది. పిశాచాలల్లే తయారైనారు, తన్ని తగిలేద్దామా అనుకున్నా. అప్పటికే వాళ్లు 'Hallo' అని ఆపేక్షంతా వొలకపోసుకుంటూ, దర్జాగా రెండు కుర్చీలు లాక్కొని కూర్చున్నారు. కోపం మీదుమిక్కిలి అయిపోయిందేమో, నేను, మాట్లాడ

లేకపోయి అల్లాగే కూర్చున్నా. అంతలో వాళ్లు, ప్రక్కబల్లమీదున్న పత్రికల బొత్తి తీసి శల్యపరీక్ష ప్రారంభించారు. మేటూరు చేతులో బడ్డది—Hindu Illustrated Weekly. ఆపత్రికంటే అతనికి ప్రత్యేకంఅసూయ. అందుచేత చూస్తూనే తిట్లు మొదలుపెట్టాడు. శాస్త్రి గోచర్మధారి. అంటే, పైకి సాధువు, లోపల ఊబి. చస్తే అసలుమాట పెగలదు పైకి. అతను "భారతి" పుటలు తిరగవేస్తూ పంపించి అయిదునెలలైనా తన కథ అచ్చుపడలేదేమా యనికాబోలు యోచనచేస్తున్నాడు. అట్లా ఇద్దరూ వాళ్లవాళ్ల పనుల్లో మునిగి, నేను అక్కడ ఉన్నాననే మాటకూడా మరిచిపోయినారు. వాళ్లకెప్పుడూ అదే జాడ్యం. నాకు వెర్రికోప మొచ్చి లోపలి కెళ్లి గప్చుప్పుడు కాకుండా కాఫీ త్రాగేసి వచ్చాను. వాళ్లకు ఆపూట కాఫీ త్రాగుడు ప్రాప్యకుండా ఏడిపించాను గదా అనే సంతోషంలో నా కోపాన్ని విస్మరించాను.

నేను తిరిగి వచ్చేసరికి వాళ్లు నిరాశాహతులై "Brother, కాఫీ, గీఫీ, అంతా అయిందేమిటి?" అన్నారు గద్గదికతో. "అయింది" అన్నాను కీచిగా.

"సరే, అట్లా వెళ్లి మేముకూడా కాస్త గొంతులో పోసుకొస్తాం" అన్నారు, నే నేమన్నా ఆహ్వానిస్తానేమో అని. ఆవిషయంలో ఇదివరకే నిశ్చయించుకున్న నేను "సరే, అయితే, తిరిగియిట్లా వస్తారా, అట్లా వెడ్తారా?" అన్నా. వాళ్లనిస్పృహకు అంతు లేకపోయింది. నీళ్లు కారిపోయినారు. నేను వాళ్లవంకేనా చూడకుండా పేపరుచదవడం ప్రారంభించాను. అది చూచి వాళ్లు సహం లేచీలేవకుండా, "excuse చెయ్యాలోయ్. నిన్న సాయంకాలం కలుసుకుందామని బయలుదేరాం. కాని మధ్యత్రోవలో గాలీ వానా అడ్డం కొట్టినై. నానాఅవస్థా పడ్డాం" అన్నాడు శాస్త్రి. "నాకు పట్టిన అవస్థ పట్టలేదుగదా" అన్నా, పేపరుచదువుతూనే. "ఏమిటి జరిగిందేమిటి! పాపం! అనుకున్నాం. నువ్వు వెళ్లేవుంటావు, ఏదో అవస్థ పడివుంటావు, అని" అన్నాడు మేటూరు. "అదంతా ఓ పెద్ద గాథలే. ఎందుకు? తల్చుకుంటే నాకే గుండె ఝల్లుమంటుంది." అన్నా, సందేహాస్పదంగా.

అక్కడనుంచి వాళ్లు ప్రాణంతియ్యడం ప్రారంభించారు. తప్పించుకోడానికి మార్గం లేక, జరిగినదంతా చిత్రంగా వర్ణించాను.

"Lucky fellow వోయ్" అన్నారు, ఇద్దరూ అంతా విని. "మీ luck తగలేసినట్టుంది. Awkward గా వుందని నే ననుకొంటూంటే" అన్నాను.

"గౌతమి, కావేరి sisters ఓయ్. జనార్దనరావునాయడు అని డిప్యూటీకలెక్టరు వుండేవాడు చూశావ్, ఆయన daugters. వీళ్ల brother జయసూర్యనాయడు పట్నంలో Universal ఫిలింకంపెనీలో మేనేజరు. వీళ్లిద్దర్ని screen మీదఎక్కించాలని అతని ఉద్దేశ్యం. గౌతమికి ఇటువంటి Publicity అంటే గిట్టదు. కావేరి Forward girl, చలాకిది. బహుశః వచ్చేనెల మద్రాసు వెళ్లి Screen విషయం చూస్తుంది అనుకుంటాను. ప్రస్తుతం InsuranceAgentగా వుంటోంది. నువ్వు మొన్న స్టేషనులో కలుసుకొన్నావుగా," అని మేటూరు గ్రుక్కతిప్పకన్నాడు.

"అవును. బిల్లుకూడా భరించాగా" అన్నాను నవ్వుతూ.

"ఊc. ఆవిడే. మొన్నేదో బందరులో అల్లరిపడ్డది అన్నారు, ఎవరో. నిజం తెలియదు." అన్నాడు, మేటూరు.

"అదికూడానా" అని పేపరు మడచిపెట్టేశాను. ఇంట్లో పిలుస్తున్నారని బంట్రోతు కబురుతెచ్చాడు. అది గ్రహించి శాస్త్రి, మేటూరు "మళ్లీ కలుసుకుంటాంలే" అని నిష్క్రమించారు.

## ౪

మధ్యాహ్నం భోజనంచేసి పడుకోడానికి ప్రయత్నాలు చేస్తూండగా ఉత్తరాలు వచ్చినాయి, అయిదారు. కాశీస్నేహితు లెవరైనా వ్రాశారేమో అని గబగబ విప్పాను. మొదటిది ఒకానొక పత్రికా సంపాదకుని దగ్గరనుంచి, వ్యాసానికి. రెండోది, వి. పి. Intimation కార్డు. మూడోది మా బావదగ్గరనుంచి. నాలుగోది మా నాన్నగారిది, పొరబాటున నావాటిల్లోకి వచ్చింది. అయిదోది రంగుకవరు, విప్పాను. వెంటనే రెండుమూడు కనకాంబరంపూలగుత్తులు రాలినై. ఆశ్చర్యబోతూ లోపలి కాగితం లాగిచూచాను. పైన గౌతమిపేరు, పదవి, అడ్రెసు అచ్చుకొట్టి ఉన్నాయి. క్రింద ఆవిడే దస్కతుతో ఉత్తరం.—

"మొన్నరాత్రి వదలిపెట్టిపోయిన మీ చొక్కాజేబులో మీ పద్యాల కాగితాలు వున్నాయి. పంపించడంగాని, వచ్చి ఇవ్వడంగాని చేదామనుకొన్నా. కాని అవి చదివేసరికి నాకు ఇవ్వబుద్ధి కాలేదు. మీరే స్వయంగావస్తే వాటిని చదివి వినిపించి ఇంకోమారు, పట్టుకు వెళ్లవచ్చును. రేపు సాయంకాలం ఆరుగంటలకు టీకి రావలసింది. బహుశః మధ్యాహ్నంరైలులో కావేరికూడా రావచ్చు.

ఉత్తరం వ్రాసి ముగిస్తూండగా తోటలో ఎదురుగా కనకాంబరంపువ్వులు కనబడ్డై, నవ్వుతూ. కవులుగదా ఆనందిస్తారేమోనని మీకు పంపుతున్నాను. ఉంటాను. మీరు రేపుసాయంత్రం తప్పక వస్తారని నమ్ముతాను,—గౌతమిరావు."

ఉత్తరం చదివి, పడిపోయిన పువ్వులని బొత్తిగా పెట్టి, తిరిగి ఇంకోమారు ఉత్తరం చదివాను. ఒకవిధమైన అల్లకల్లోలం బయల్దేరింది మనస్సులో, ఇదంతా ఎందుకు చుట్టుకుంటోందా మొదటు అని. నేను

వెళ్లకుండా బంట్రోతును పంపి కాగితాలు తెప్పించేసుకుందామా అనుకున్నా. కాని అది అమర్యాదక్రిందకు తేల్తుందేమోనని సందేహించాను. ఇట్లు తర్జనభర్జనపడి పోనీ పోదామని నిశ్చయించుకొన్నాను.

సాయంకాలంగూడ మానాన్నగారు రాలేదు. అందుచేత సరిగా అయిదున్నరకు కారులో బయల్దేరి రింగురోడ్డుమీద మేడ ముందు ఆగాను. రాము డొచ్చి దణ్ణంపెట్టి కారుతలుపు తీశాడు. కారు తీసుకుపొమ్మని డ్రైవరుతో చెప్పి, తోటలోంచి లోపలికి వెళ్లాను. వరాండాలోకి చేరుకోగానే "Hallo, Come in, రండి" అంటూ గౌతమి వచ్చి షేక్‌హాండు ఇచ్చి, మేడపైన హాల్లోకి తీసుకు వెళ్లింది. సోఫాలో కూర్చోబోతూండగా ప్రక్కగదిలోంచి కావేరి వచ్చి "Hallo వచ్చారే" అంటూ తనొచ్చి సోఫాదగ్గరగా నిలబడ్డది. "మీ రెప్పు డొచ్చారు" అన్నాను.

"మధ్యాహ్నం 2'O clock train లో" అని "ఇప్పుడే వస్తా" నని తిరిగి గదిలోకి వెళ్లింది.

గౌతమి వెనకవైపుగా తిరిగి వంటవాడితో 'టీ' మాట చెప్తోంది.

ఏమీ తోచక నేను పైన గిర్రున తిరుగుతున్న fan వంక చూస్తున్నా.

ఇంతలో కావేరి తిరిగివచ్చింది. Toilet చేసుకొని, లేతనీలం రంగు జరీచీర కట్టుకుంది. చెవుల లోలాకులు గాలికి అల్లలాడుతున్నాయి.

అప్పుడే వంటవాడు tea tray పట్టుకొచ్చి మధ్య teapoy మీద పెట్టాడు. బల్ల నాకు అందుబాటులోనే వున్నది. అప్పచెల్లెళ్లిద్దరు దానిదగ్గరగా కుర్చీలు లాక్కొని కూర్చున్నారు.

గౌతమి కప్పుల్లో 'టీ' పోస్తోంది. కావేరి ప్లేట్లలో buns సరిగా సర్ది, "fall in" అన్నది.

నేను జరిగి ఒక ప్లేటు, ఒకకప్పు నావంతుగా ముట్టుకున్నాను. వాళ్లవి వాళ్లు తీసుకొన్నారు.

"అయితే ఆపద్యాలు మీవేకామూ" అన్నది గౌతమి.

"అవునండీ, నావే. ఆదినం జేబులో వుండిపోయినై." అన్నాను.

"అవును గౌతమీ, ఆయన రెండుమూడు పుస్తకాలుగూడా publish చేశారట." అన్నది. కావేరి అడ్డంవచ్చి.

నేను టీని స్వీకరిస్తున్నా, ఏమీ అనలేక.

అప్పుడే రాము డొచ్చి స్కూలుతాలూకువా రెవరో వచ్చి కాచుకున్నారని గౌతమికి కబురు చెప్పాడు.

"సరే" అని వాణ్ణి పంపించి "కావేరీ, శివరావుగార్ని engage చేస్తూండు. Half-hourలో వస్తాను" అని ఛప్పున టీ ముగించి "ఇప్పుడే వస్తానండీ" అని నాతో నని మెట్లుదిగి వెళ్లింది. కావేరి గూడా 'టీ' పూర్తిచేసి "ఏమండీ news" అన్నది. ఓచెంపనుంచి నాకు గాబరా పుట్టుకొస్తోంది. "ఏమీ లేదు, particularగా" అని వూరొకున్నాను.

"కాసేపు గ్రామఫోను పెడదాం, రండి" అని గదిలోనికి దారితీసింది. హృదయం తటపటాయిస్తున్నా తప్పనిసరిగా నేనూ లోపలి కెళ్లాను.

ఒకదోమతెరమంచానికి పక్కగా నగిషీబల్లమీద గ్రామఫోనుంది. కావేరి మంచంమీదకూర్చుని ఫోనుకు కీయిచ్చి "I laughed until I could not laugh" అనే హరీలాయుడు ఇంగ్లీషు ప్లేటు పెట్టింది. ఆప్లేటంతా నవ్వే. దానితోపాటు తనుగూడా విరగపడి నవ్వడం ప్రారంభించింది. "చిన్నతనం" అనుకొన్నా మనస్సులో. అదేపనిగా నవ్వినవ్వి ఆయాసంతో పక్కమీద వాలిపోయింది. అంతలో ప్లేటు పూర్తియై రాచుకొపోతోంది. అది పాడైపోతుందేమో ననే భయంతో నేను ఛప్పున దాన్ని ఆపాను. అప్పటికి కావేరి కోలుకొని కూర్చుని "ఇంకేప్లేటు పెట్టను" అని అడిగింది. "మీయిష్టం" అని బల్లకు దగ్గరున్న కుర్చీని అలంకరించాను.

అప్పుడావిడె లేచి నిల్చుని రికార్డుల Albumలో నుంచి Foxtor రికార్డు తీసి పెట్టి, కీయిచ్చి, ముల్లు మార్చింది. అద్వాన్స రమ్యంగా వినబడ్డం మొదలుపెట్టింది. నాకే తన్మయత్వం వచ్చేటట్టుంది.

"అయితే మీకు డ్యాన్సు వచ్చా?" అన్నది.

సిగ్గుపడుతూ "లేదు" అన్నాను.

"నాకు వచ్చు, చిన్నప్పుడు Convent లో నేర్చుకున్నాను" అని ప్లేటును అనుకరిస్తూ నృత్తం ప్రారంభించింది. సలాకల్లే గిర్రున దానికి తగినట్టుగా నృత్తంచేస్తోంది. ఆగాలికి పైట ఎగురుతూ నాకుర్చీని తాకుతోంది. నాకు తాకకుండా జరిగి కూర్చున్నా. ఉన్నట్టే వుండి కావేరి శ్రమకు డస్సిపోయి నాకుర్చీపైకి వ్రాలింది. క్రింద పడిపోతుందేమోనని రెండు చేతుల్తో పట్టుకొని, నేను మెల్లగా లేచి ఆవిణ్ణి మంచంమీదకు జేర్చాను. ఆయాసంతో గుండె ఎగరవేస్తోంది. నుదురు, చెక్కిళ్లు, అంతా చమట. రుమాలుతో తుడిచి, గాలికోసం పైన Fan తిప్పాను. అప్పటికే చీకటి పడ్డది. వీధిలో లైట్లు వెలిగించారు. గదిలో లైటు వేద్దామా అనుకున్నా గాని వెల్తురు ఆవిడెకు బాధ కల్గిస్తుందేమోనని అనుమానించి వూరొకున్నా. గాలి తగలినా ఆవిడె ఆయాసపడ్తూనే వుంది. మూల బల్లమీద కూజాలో వున్న నీళ్లు కాసిని గ్లాసులో తెచ్చి త్రాగించ ప్రయత్నించా. ఒకగుటకమాత్రమే వేసి "ఇక వొద్దు" అని సంజ్ఞగా చెయ్యిత్రిప్పింది. ఇంకోమారు





1. బొంబాయిరాష్ట్రాంధ్ర తృతీయ సాంఘికమహాసభ, దాదరు ; 2. ఆంధ్రబ్యాడ్మింటన్‌క్లబ్బు, కల్యాణి.

ఘర్మబిందువులు తుడిచి అల్లాగే వొంగి నిలబడ్డాను. ఆవిడే సన్నగా కళ్లు తెరిచి "కూర్చోండి" అన్నది. అప్రయత్నంగా అనుసరించాను. అయిదునిమిషాలైంది. కాస్త యిటూ, అటూ కదిలి కావేరి తన చెయ్యి నాచేతిలో వేసింది. "శ్రమపడ్డారా, నాకోసం" అన్నది.

"శ్రమేమిటి? ఏం లేదు. కాసేపు Rest తీసుకోండి" అన్నా. చెయ్యి తీసేసి కళ్లు మూసుకొన్నది. తల్లో పెట్టుకున్న పువ్వుల చెండ్లు చెదిరి ప్రక్కగా పడ్డాయి. వాటిని ప్రోగుచేసి ఒకచోట పెట్టాను.

"లైటు వెయ్యనా" అన్నా.

"వద్దు. ఇట్లాగే బాగుంది" అన్నది.

ఊరుకున్నా. అప్పుడామె మెల్లగా లేచి కూర్చుంది. చెయ్యి సహాయం చెయ్యడానికి ధైర్యం చాలకపోయింది. ఆవిడె కూర్చోడం చూసి నేను లేవ ప్రయత్నించాను. నాచేతులు పట్టుకుని బలవంతాన కూర్చోపెట్టి హఠాత్తుగా రెండు చెంపలూ గట్టిగా ముద్దుపెట్టుకుంది. గడ్డిపోచల్లే ఎగిరి లేచిపోయి లైటువేశాను. తొలిగిన చీరెను గభాలున సరిజేసుకొని మంచంక్రీనీడను నిలబడ్డది, కావేరి. ఇంకోమారు ఆవిడె వంకైనా చూడకుండా మెట్లుదిగబోయినాను. ఆవిడె చెంగున పరుగెత్తుకొచ్చి, మెట్ల railing మీదనుంచి నాచెవులో "మాఅక్కయ్యతో చెప్పద్దు" అని ఊది పరుగెత్తింది, పదిహేడేళ్ల యౌవనం తొణికించుకుంటూ. అప్రయత్నంగా పైకి చూసి "చిన్నతనం" అనుకొని దిగిపోయాను.

హాల్లో గౌతమి తన స్కూలుతాలూకువాళ్లతో వ్యవహారాలు మాట్లాడుతోంది. తరువాత కన్పడతానని చెప్పాను, ఆవిడతో. తను రాకపోవడానికి క్షమించమని, తన డ్రైవరుకు నన్ను దింపిరమ్మని చెప్పింది. గుడ్ బై చెప్పి, కారులో గృహోన్ముఖుణ్ణి అయినాను.

*     *     *     *

నేనూ యింటికి వెళ్లేసరికి మానాన్నగారు రైలునుంచి వచ్చారు. ఇద్దరం స్నానంజేసి భోజనానికి ఉపక్రమించాం. అప్పుడడిగారు ఆయన "అట్లావున్నావేం?" అని. "ఏమీ లేదు, కొంచెం బద్ధకంగా వుం"దన్నాను.

౫

రెండుమూడు రోజులు జరిగినై. ఒకనాడు ప్రొద్దున ఎనిమిది గంటలకు నేను మేడమీదనుంచి దిగివచ్చి మానాన్నగారి ఆఫీసుగదిలోకి వెళ్లాను, పేపరు వచ్చిందేమో తెచ్చుకుందామని. ఇద్దరుముగ్గురు కోర్టుతాలూకువా రెవరో దూరాన కూర్చున్నారు. మామూలుస్థలంలో మానాన్నగారున్నారు. ప్రక్కకుర్చీలో గౌతమీరావు ఉన్నది. ఆమెను చూడ్డంతోనే నామనస్సు పరిపరివిధాల పోయి ఉబికిపోయింది. కాని అంత అవస్థకు కారణం లేదన్నట్టుగా ఆవిడే నన్ను చూడ్డంతోనే — "Hallo" అని పలుకరించింది. నేను కూడా 'Hallo' అని అక్కడ బల్లమీదున్న పేపరు తీసుకొన్నాను.

"మీయిద్దరికి యిదివరకు పరిచయమా యేం?" అన్నారు మానాయనగారు.

"అవును, మా sister ద్వారా" అని ఆవిడె అందుకొంది. వాళ్లేదో మాట్లాడుకుంటున్నారుకాబోలనుకొని నేను వెళ్లిపోయినాను.

తరువాత పదింటికి భోజనంముందు అన్నారు మానాన్నగారు "వాళ్ల girls' school anniversary ట రేపు. నన్ను preside చెయ్యమని ప్రాణం తీసింది. ఒప్పుకొన్నాను." నే నేమీ అనక "అట్లాగా" అని వూరుకున్నా......

*     *     *     *

మర్నాడు సాయంత్రం నాలుగింటికి మానాయనగారు డ్రెస్ చేసుకుంటూ "నువ్వుగూడా రా నాతో. ఆవిడెగూడా తప్పకుండా తీసుకురమ్మని చెప్పింది" అన్నారు, నాతో. ఏమీ అనకుండా పైకి వెళ్లి ట్వీడ్‌సూటు వేసుకొని దర్జాగా దిగివచ్చాను. ఇద్దరం కారులో వాళ్ల స్కూలు జేరుకున్నాం. గేటువద్దనే మమ్మల్ని గౌతమి గౌరవించి లోపలికి తోడ్కొనిపోయింది. భవనమంతా అటువంటి సందర్భోచితంగా అలంకరింపబడ్డది. మీటింగు ఆరుబయట ఏర్పాటుచేశారు. అప్పటికే ఎందరో వచ్చారు. కోలాహలం, ఉత్సాహం చెలరేగి పోతున్నాయి. ఆసందడిలోనే గౌతమి మమ్మల్నిద్దరినీ స్కూలుచుట్టు, లోపల తిప్పి అంతాచూపించింది. ఆవిడె ఆధిపత్యంక్రింద స్కూలు సర్వతోముఖాభివృద్ధి పొందుతూన్నదని సూచనగా అందిచ్చింది.

సరిగా ఆరుగంటలకు ప్రార్థనతో కార్యక్రమం ప్రారంభమైంది. మానాన్నగారు కూర్చున్న ప్లాటుఫారానికి వెనగ్గా నాకు కుర్చీవేశారు. ప్రార్థన అయినతర్వాత గౌతమి స్కూలురిపోర్టు చదువుతోంది. అప్పుడు వెనకనుంచి వచ్చి ప్రక్కగా నిలబడ్డది, కావేరి. నేను పలుకరించలేదు. రెండు నిమిషాలైన తర్వాత ఆవిడే దగ్గరగా వచ్చి "లోపల పిల్లలకి వేషాలు వెయ్యడం హడావిడిలో వున్నా." అన్నది. చిరునవ్వు నవ్వి వూరుకొన్నాను. ఆవిడె వెళ్లిపోయింది.

గౌతమి చదవడం అయిపోయిన తర్వాత మానాన్నగారు పిల్లలకు ప్రైజులిచ్చి ఉపన్యాసం ప్రారంభించారు. అరగంట మాట్లాడి అన్ని విషయాలను ముచ్చటించడమే గాకుండా గౌతమి యొక్క శక్తిసామర్థ్యాలను, విద్యావినయాలను, ఉత్సాహాతిశయాలను గూర్చి నొక్కిచెప్పారు. ఆయన వుపన్యాసం ముగించారు.

ఇంకా రెండు నాటకరంగప్రదర్శనా లున్నాయి కార్యక్రమంలో. కాని ఆయన అర్జెంటుగా స్టేషనుకు కలెక్టరుగారిని సాగనంపడానికి వెళ్లాలిసివుండడంచేత గౌతమిదగ్గర, సభికులదగ్గర శెలవుతీసుకొని వెళ్లారు. వెళ్లిపోతూ "నువ్వు చివరదాకా వుండిరా" అని నాతో చెప్పారు.

ప్రదర్శనాల ప్రయత్నము, ప్రతిభ,హడావిడి–అంతా కావేరిదని స్పష్టంగా కనబడుతోంది ఆవిడెవ్వైఖరివల్ల. తెరలు లాగించడం, దింపించడం, సీనులు సర్దించడం, వేషాలు తయారుచెయ్యడం, పోర్షన్లు అందివ్వడం–- మొదలుగాగల వెట్టిచాకిరీ అంతా ఆవిడదే. ఊపిరితిప్పుకోకుండా పనిజేసింది. ప్రదర్శనం బాగుందని అందరూ హర్షధ్వనులు చేశారు. మీటింగు ముగిసినతర్వాత ఎవరిత్రోవను వారు వెళ్లారు. నే నొక మూలగా నిలబడ్డాను. అక్కడికి గౌతమి చెల్లెల్ని వెంటబెట్టుకొచ్చి "నువ్వు వాళ్ళి కారులో తీసికెళ్లి వారింటిదగ్గర దిగ బెట్టి ను వ్వుండిపోయి కారు తిరిగిసంపు. నే నొస్తాను. ఇప్పు డింకా పని వుంది" అన్నది. కావేరి నాముఖం చూచింది. నేను గౌతమివంక చూచాను. సరే నన్నేభావంతో ఆవిడ వెళ్లింది. కావేరీ, నేనూ కారు ఎక్కాము, నూర్కాలుగేటు బయట కొచ్చి. "నెమ్మదిగా పోనీ" అన్నది ఆవిడ డ్రైవరుతో.

కలెక్టరుఆఫీసు పైనుంచి నడుస్తోంది కారు. మే మిద్దరం వెనుక సీట్లలోనే కూర్చున్నాము. అంతవరకు ఎవరమూ మాట్లాడ లేదు. మధ్యస్థంలో "నాటకాలు ఎట్లా వున్నాయి?" అన్నది.

"బాగానే వున్నాయి" అన్నాను.

"అవస్థంతా నాదే" నన్నది.

"అది కనపడుతూనే వున్నది" అన్నా.

"పోనీలెండి, ఆవిషయ మెందుకు. Insure చెయరా?" అన్నది, కొంచెం నాదగ్గరగా జరుగుతూ.



"అమాంతం నా మెడ తనచేతుల్లో పెనవేసి చుంబనం జేసింది."

"లేదు, అవసరంలేదు. ఎవరిపేర చెయ్యను చెప్పండి?" అన్నాను కొంచెం దీనంగా.

"నన్ను పెళ్లిచేసికొని నాపేర చేయండి" అని అమాంతం నా మెడ తన చేతుల్లో పెనవేసి చుంబనంజేసింది. బలవంతంమీద వోదుల్చుకొని మూలగా జరిగాను.

"సబ్‌జడ్జీగారింటికి పోనీనా?" అన్నాడు అంతిలో డ్రైవరు.

"ఊఁ." అన్నా నేను. ఆవిడ కళ్లల్లో నీటిబిందువులు ముత్యాలల్లే ఎలిక్ట్రిక్కు దీపకాంతిలో మెరిసినై. కారు ఆంధ్రరత్నరోడ్డు మీంచి పోతోంది. లైట్లవెలుతురిని చెట్లు మాటుచేస్తున్నాయి.

"నన్ను చేసుకోరా" అని మళ్లీ మెడను పెనవేసికొంది. ఆవిడచేతుల్ని త్రోసివేస్తూ "అంతవరకే వస్తే మీ sister ని చేసు కొంటానుగాని, మిమ్మల్ని గాదు" అన్నాను.

ఆవిడ మూతిముడుచుకొన్నది. డ్రైవరు కారుని తొందరగా నడపడంచేత మాబంగళాదగ్గరకు వచ్చాము. నేను కారుదిగి "good night" అని ఆవిడజబాబుకి ఎదురుచూడకుండా తొందరగా లోపలికి వెళ్లిపోయినాను. కారు తిరిగివెళ్లుతున్నట్టు హారనుశబ్ద మైంది.

* * * * * *

రాత్రి గదిలో పడుకుంటే నిద్రపట్టింది కాదు. కిటికీలోంచి చంద్రుడు సరిగ్గా మొహంమీద పడ్తున్నాడు. దానికి తోడు గాలి లేదు. దానా దీనా వొళ్లు తాపమెత్తిపోయింది. తలగూడా అనేక ఆలోచనలతో తిరిగిపోతోంది. ఎంత ప్రయత్నించినా నిద్ర వొచ్చింది కాదు. ఆక్షణంలో ఛప్పున ఒక ఆలోచన తోచి, షర్టువేసుకొని, మెల్లగా దిగొచ్చి, వరండాలో సైకిలుతీసుకొని గేటు లోంచి మెల్లగారోడ్డుమీది కొచ్చాను. ఇంట్లో వాళ్ల కంటబడకుండా, సైకిలెక్కి సరాసరి రింగురోడ్డునుంచి పోయి రంగు మేడదగ్గర ఆగి, గేటుతోసుకొని లోపలప్రవేశించాను. తలుపు లన్నీ వేసివున్నాయి. ఎడంవైపు కెళ్లి మేడపైకి చూశాను. గౌతమి లైటు ముందు ఏదోకాగితాలు చూసుకుంటోంది. "Hallo" అన్నాను, పైకి చూస్తూ. ఆవిడ హడిలిపోయి, నాగొంతుకు గుర్తుపట్టి, క్రిందకు చూస్తూ 'Hallo' అని గబగబ క్రిందకు దిగివచ్చి తలుపు తెరచింది. సైకిలు మెట్లకు పోటీపెట్టి పైకి ఎక్కాను. "ఇప్పుడు అర్ధరాత్రి వచ్చారు" అన్నది. "అవును, మాట్లాడవలసివచ్చాను" అన్నాను. నామాటల్లో నిశ్చయత్వం, ముఖంలో సంచలత కనిపెట్టి ఆవిడ నావెనుక తలుపు బిగించి పైకి నడిచింది. నేనూ అనుసరించాను. వరాండాలో బల్లదగ్గర చూస్తున్న కాగితాలుమడిచి పెట్టి, లైటు ఆర్పేసి, రెండుకుర్చీలు అవతలగా లాగింది. ఓదాంట్లో కూర్చున్నా. రెండోదాన్ని ఇంకాకొంచెం అవతలగా

లాక్కొని ఆవిడే కూర్చున్నది. తెల్లని జరీచీరె కట్టుకున్నది. వెన్నెట్లోనే వుండడంచేత పమిటె నిండా సర్దుకుంది. లోలాకులు గాలికి కదుల్తూ వెన్నెల్లో మెరుస్తున్నాయి. జారుగా అల్లిన జడ ముందుకు వ్రేలాడవేసింది. సాయంత్రం మీటింగుతాలూకు పూలదండలు నాలుగైదు అక్కడ ఈజీఛెయిర్‌మీద ఉన్నాయి.

"ఎందుకు అర్ధరాత్రి ఒంటరిగా వచ్చారు?" అన్నది ఆ దుర్దాతో.

"సైకిలుమీద వచ్చాను, సరదాగా. పన్నెండే అయింది... మీ రెందుకు ఇంకా మేలుకొన్నారు?"

"మీటింగు తాలూకు కాగితాలు, బిల్లులు, అవీ చూసుకొంటున్నాను."

"కావేరి ఏం చేస్తోంది?"

"కావేరి లేదు. మిమ్మల్ని దింపి యింటికి వచ్చి, తొందరగా భోజనంచేసి, నాకోసం ఎదురుచూస్తూ నిలబడ్డది. నేను రాగానే "వూరు వెడ్తున్నాను అవసరంగా. రెండుమూడు దినాల్లో వస్తాను" అని వెళ్ళింది ముఖవైఖరి చూస్తే చిత్రంగా కనబడ్డది. కాని నే నేమీ ప్రశ్నించలేదు. "మీతో నిర్భయంగా ఒకవిషయం మాట్లాడాదని కొచ్చాను" అన్నాను. గౌతమి కొంచెం అలజడిపడి "ఏమిటి చెప్పండి" అన్నది. కుర్చీ ఆవిడకు దగ్గరగా లాక్కొని కావేరికి నాకు జరిగినదంతా తు, చ, తప్పకుండా చెప్పేశాను. "అంతదాకా వస్తే మీ sister ని చేసుకుంటానుగాని, మిమ్మల్ని గాను." అనేది గూడా చెప్పేశాను

అంతావిని పులకరించిపోయి గౌతమి కుర్చీలోనుంచి నామీదకు వ్రాలింది. నాచేతుల్లో అనుకున్న ఆవిడేముఖం చంద్రుడికి ప్రతిబింబమల్లే మెరుస్తోంది. అప్రయత్నంగా ముద్దుపెట్టుకున్నాను చెక్కిళ్ళను ఆమె చలించి నాముద్దుల్ని నాకు బాకీతీర్చి "అంతపనికి సాహసిస్తారా" అన్నది. "తప్పకుండా" అని ఆమె చెయ్యిపట్టుకున్నాను. "నిజంగానా" అన్నది. "అవును" అంటూ లేచి కుర్చీమీదున్న దండ ఒకటి తీసి ఆమెమెళ్లో ఉంచాను. సంతోషంతో ఉప్పొంగుతూ తన మెడలో వున్న పగడాల హారం నామెడలో వేసింది.

నేను లేచి "వెళ్ళివస్తాను. ఇంటిదగ్గర కనుక్కుంటారు" అని లేచాను. ఆవిడేగూడా కుర్చీలోంచి లేచి షేక్‌హాండు ఇచ్చి మరొక ముద్దుతో సాగనంపింది. సైకిలెక్కి వెడ్తూ అప్పుడప్పుడు వెనకకు తిరిగి మేడపైవరాండా వెన్నెట్లో మెరిసిపోతూన్న గౌతమిని చూస్తూ సాగిపోయినాను.

## ౬

'కథకు కాళ్లు లేవు, ముంతకు చెవు ల్లేవు' అన్నట్లు, కబురుకు కాయం లేకపోయినా ఊరంతా పాకిపోయింది. అంతా విరగబడి విచిత్రంగా చెప్పుకోడం ప్రారంభించారు. 'సబ్‌జడ్జీగారే ఒప్పుకొని చేస్తున్నారట'—అని వెర్రిగా వ్యాపించిపోయింది. ఆదివారం సాయంకాలం బ్రహ్మసమాజంలో నాకు, గౌతమికి వివాహమని ఆవారమంతా ఊళ్లో ఊసు.

* * * *

ఆదివారం సాయంత్రం బ్రహ్మసమాజమందిరం ఆవరణమంతా ఇసకవేస్తే రాలకుండా జనం. వెంకటరత్నంనాయుడుగారు పౌరోహిత్యం. ఎన్ని గుసగుసలో మాచెవుల్లోనే పడ్తున్నాయి. అన్ని దూషణభూషణవాక్యాలను సమానంగానే పాటించి పెళ్లిపీటలను అలంకరించాము—నేను—గౌతమి. పాతికేళ్ల వరుడు; ఇరవై ఏళ్లవధువు.

* * * *

పీటలమీదనుంచి లేచి వచ్చిన స్నేహితులతోను, పెద్దలతోను సంభాషిస్తూ నిల్చున్నాము ఇద్దరం. మేటూరు,శాస్త్రి పెద్దపని వున్నట్టుగా అందర్నీ తోసికొని వచ్చి "మాకు కిళ్లీలు అందలేదు, brother. అన్నారు. ఆమాట విన్న నాప్రక్కనగుమాస్తా కరువుతీరేటట్టుగా పది కిళీలు వాళ్ల చేతుల్లో పెట్టాడు.



"...కూర్చీమీదున్న దండ ఒకటి ఆమె మెళ్లో ఉంచాను."

అందరూ ఒక్కరొక్కరే నిష్క్రమిస్తున్నారు. గౌతమి, నేను మానాన్నగారికి నమస్కారం పెట్టడానికి వెడ్తున్నాము. అంతలో చెప్పిన జాలిపాటునైనా గ్రహింపకుండా జాణ కావేరి మాయిద్దరిమధ్యకే వచ్చి—"ఇప్పుడైనా నాద్వారా అక్కయ్యపేర Insure చేస్తావా, బావా" అన్నది, పకపకా నవ్వుతూ.

ఈవిపరీత బ్రాహ్మణ—బ్రాహ్మణేతరవివాహాన్ని గూర్చి ప్రజల మీటింగుల్లోనూ, పత్రికావ్యాసాల్లోనూ అద్భుతమైన గాలిదుమారం చెలరేగింది. గాలిదుమారంతో ప్రారంభమైన కథ గాలిదుమారంతోనే ముగియవద్దా—అనుకొన్నాం నేనూ, గౌతమీ ఒకనాడు రాత్రి. ఆసమయానికే వచ్చి "గాలిదుమారం ఎంతచేసింది, బావా!"—అని కిలకిలా నవ్వింది, కావేరి. స్వతంత్రంగా చెయ్యిపట్టుకు లాగి 'చాల్లే' అన్నా.

"అబ్బో! ధైర్యం!"—అని మాట విసిరివేసి పోయింది పట్టుకుందామని చాచినచేతికి అందలేదు.

"ప్రొద్దుపోయింది" అన్నది గౌతమి. నేను లేచి గదిలోకి వెళ్లాను. బయటనుంచే స్విచ్ త్రిప్పి లోపలి లైటు ఆర్పివేసి తనూ లోపలకు వచ్చి, తలుపు గడియవేసింది.

---

మనుజుల సహస్రమందున మాన్యు డొక్క - డిట్టిసిద్ధికి యత్నించునట్టి వ్యక్తు
లందులోన సహస్రంబునందు నొకడు - కాంచు నీతత్త్వమును సమగ్రంబుగాను.

కాంచువాడును వ్యవహారకాలమునను - మరచి తా భిన్నుడను భ్రమ మగ్నుడగును
జనుడు తద్భ్రమ వీడు విచారకాల-మునను భ్రమ యిట్లు గిట్టుచు బుట్టుచుండు.

ఎరుక మరపును నీరీతి నెడనెడ వి-కల్పమందుచునుండు నా జ్ఞానియందు
గాన బహుజన్మసాధన గానియతడు - నిర్వికల్పసమాధి దా నిల్పలేడు.

అట్లు నిల్ప "స్థితప్రజ్ఞు" డగునతండు - బొంది పడిపోయినంతట నందు నతడు
జననమరణాదిసంసారచక్రము విడి - నిత్యనిరపాయమోక్షు నిర్నిద్రసుఖము.

అట్టి ధన్యుడు జీవించునంతదాక - కర్మ మొనరించునట్టుల గానుపించు
గానివాడు స్వకామసంకల్పరహితు - డగుట గర్మఫలంబులు దగుల వతని.

పుట్టమీది కుబుసమట్టె పాముగ దోచు-నట్లె యతడు కర్మలందు దగిలి
నట్లు దోచుగాని యంతరంగమునను - దగులు లేదు సిక్కముగ నతనికి.

జ్ఞానాగ్ని యతని సంచిత - మా నిముసమె భస్మముగ సమస్తమొనర్చున్
వానికి లే దాగామియు - పై నుడివిన రీతి నటులె ప్రారబ్ధంబున్.

ఆతడు జీవన్ముక్తుడు - భూతలమున జీవయాత్ర పుచ్చెడునెడ వా
డాతతకర్మవ్యాపృతి - లాతులకును దోచు నిష్కలంకత నుండున్.

పురుషార్థములకు నియ్యది - చరమావధి దానిజేర సాధన మరయన్
ధరపైన కామధర్మా - చరణంబు సకామధర్మసాధ్యం బదియున్.

కామసంకల్పములు రజఃకార్యములగు - నరుడు రజసున దమసు నడంచికాని
ధర్మనిష్ఠకు జాల డీ మర్మ మెరిగి - కామ్యకర్మకు దొలుత నోర్తు గడగవలయు.

కామ్యకర్మాభిరతి మూలకారణమగు - స్వార్థ మభ్యాసయుక్తి బరార్థముగను
మార్పు క్రమముగ జెందించి మనుజు డంత - గర్మయోగపరాకాష్ఠ గ్రాలవలయు.

సాధనచతుష్టయం బది జనున కవని - గల్గు నిష్కామకర్మ యోగమున గాన
కర్మయోగంబు నరునకు ధర్మ మరయ - జ్ఞానసిద్ధికి మున్ను నెన్కను ధరిత్రి.

ఇట్టి సాధన మనుజున కీభవమున - జరుగవలె పూర్వభవమున జరుగకున్న
నేటికర్మ ఫలించెడు నేటినుండి - పూర్వకర్మఫలంబగు బుట్టినపుడె.

రేయుంబవళులు పనివడి - కాయక్లేశమున దినము గడపుచు ధరపై
నేయితరవ్యాపృతి లే - కాయము వ్యయమునకు గూర్చు నంత్యజు డుండున్.

తల్లియు తండ్రియు గుణవతి - యిల్లాలును సుతుడు దాను నేవురునుం దా
మెల్లరు దమతమ కొలదుల - నెల్లప్పుడు బాటువడగ నేగెడు దినముల్.

తమతమ పను లొనరించెడు - సమయంబుల భక్తివినయసౌహార్దంబుల్
క్షమతోడి కార్యదీక్షయు - నమర బ్రవర్తింత్రు వార లార్యచరితులై.

ఇరుగుపొరుగువారలకును - గరమును జేదోడు వలయు కార్యములందుం
బరమప్రీతిని దోడ్పడు-దురు సౌజన్యంబు మెరయ దొరపు బ్రేమన్.

అతిథు లేగుదేర నాత్మీయులుగ నెంచి - పంచియిత్తు రన్నపానములను
తమకు దైవ మిచ్చుదాన నడ్డంబాక-యును నొకింత లేక యున్నవట్టు.

పూర్వసుకృతలబ్ధ పుణ్యశీలం బది - యప్రయత్నసాధ్యమై యొసంగు
స్వకృతపూర్వపుణ్యసత్ఫలం బది యెల్ల - సహజసిద్ధమగుట సంభవంబె.

అఖిలసద్గుణములు నాజానసిద్ధమౌ - నా కుటుంబి పేద యగుట దలప
హరి యనుగ్రహార్హులౌ వారి విత్తముల్ - తా హరింతు ననుట తథ్యమగును.

కులపతు లిద్దరలోపల - హాలధరు డాద్యుడు ద్వితీయు డచ్యుతుడును వా
రల నెలవు కృష్ణవేణీ - సలిలపవిత్రితము పల్లె జలనిధిచెంతన్.

వారు కురుక్షేత్రము గయ - వారాణసి మధుర ద్వారవతియుం బదరీ
నారాయణంబును హరి-ద్వారము లోనుగల క్షేత్రతతి సేవింపన్.

హృదయంబున గౌతూహల - ముదయించిన యాత్రకు సుముహూర్త మరసి యి
ల్వదిలము సేయగ సుతులకు - దుదిసందేశం బొసంగ దొడగిరి వారల్.

హాలధరుడు సుతుల కనియెను - బాలములు బసులును ధనంబు బుష్కల మగుచుం
గల వందుల కే దొసగును - గలుగకయుండంగ రక్ష గావింపవలెన్.

ఆకలి దప్పియు నిద్దుర - మీ కడ్డముగాకయుండ మెలకువతోడన్
లోకము మెచ్చ సుఖస్పృహ - లేకయ కృషిసల్పవలె చలింపని దీక్షన్.

కడు నప్రమత్తు లగుచును - దొడుకుల సంరక్ష శ్రద్ధతో జేయవలెన్
బుడుతల సాకుడు ప్రేముడి - జెడువారల చెలిమిసేయ జెల్లదు మీకున్.

అని చెప్పినదే చెప్పుచు - తనివిసనమి పెంచిచెప్ప దా వెండియు నీ
యనువున జెప్పియు నెంతకు - దనియడు హాలధరుడు మోహతత్పరు డగుచున్.

సుతునిం దను జేరగ న-చ్యుతుడు పిలిచి యాత్రకైన సొమ్మొకనికి వ
త్సతరి నొసంగెదనని తె-చ్చితి దానిం దడయ కతని జేరుపు మనియెన్.

వార లప్పగింత లీరీతి గావించి - తీర్థయాత్ర బయలుదేరి దారి
కొన్ని గుడులు చూచి గోదావరిక ప్రాంత - భద్రగిరికి బోవు పథమునందు.

ఖరకరకిరణార్దితుడై - యరుగగ జరణములు సాగ కచ్యుతు డచటన్
పరిచేనుచెంత నొంటిగ - నిరవొందెడు జీర్ణ పర్ణగృహము గని సఖుల్.

మెల్లన సాగుచునుండుము - అల్లదె భవనంబు చేరి యందు బిపాసం
జల్లని జలముల దీరిచ్చి - యుల్లం బలరార వత్తు నొకనిముసములోన్.

అని చనియె హలధరుండును - దనదారిని సాగుచుండె దత్వరమతియై
వెనుకొని మరియొక యాత్రికు-డును జేరుకు నాత డందెడును సంతుష్టిన్.

అంత నాత డనుచరాన్వితుడై సాగె-నచ్యుతుండు దప్పి యార్ప మరలి
జీర్ణగృహము చేరి శిథిలమై పడియున్న-ద్వారమునకు బయల నారుబయట.

బోరగిలి ధర శవాకృతి - న్పారక పడియున్న పురుషు నొక్కని గని త
ద్ఘోరావస్థకు జింతిలి - ద్వారంబును గడచి లోన బాదం బిడియెన్.

అచట మరణబాధ నటు నిటు బొరలుచు - గొట్టికొనెడు నొక్క కోమలియును
బిడ్డ యన్నమిడను బీడింప వ్యాకుల-చిత్తయౌ జరావిశీర్ణ యొకతె.

కనుల బడిన నతని మనము చింతాభర-మున నడంగ నడుగబోయి నోరు
రాక తుదకు నాపె ద్రావ జలం బత - డడుగుటయును నాపె యతని కనియె.—

"అకట క్షుత్పిపాసలకు నన్నపానముల్ - లేక మూడునాళ్లు మాకు గడచె
కంఠగతము లయ్యె గడుకొని ప్రాణముల్ - శరణ మవని మాకు మరణ మికను."

అనుటయు నచ్యుతు డామెకు - నను "నీ యిల్లాలియార్తి కనువా రెవరుల్
గనరారొకొ మీపొరుగున - ననఘాత్ములు తల్లి!" యనిన నాపె యిటు లనున్:—

"చూపుమేరను మా కిల నాపద కగు-వార లెవ్వగు లే రార్యవర్య వినుము
బయట యజమాని మేము లోపలను జత్తు-మీవు నీదారి బొమ్ము చానిమ్ము మమ్ము.

అన పని యెద నీరగుటం - దన సంచిని దెరచి యతడు దానను గల రొ
ట్టె నొకటి దీసియు నసిచే - దునుకలుగావించుచుండ దోడనె యటకున్.

ఎత్తువడి బయట బడియును - సత్తువ దెచ్చికొని గోడసాయముతోడం
జొత్తునుగా కని చొరబడి - యత్తకు ముంగలనె యొరగె నాపురుషుండుల్.

తన రొట్టె నొక్కముక్కను - దిన నాతని కీయజూపె దీనత్రాణా
వనబుద్ధి నచ్యుతుండును - తన బిడ్డకు నీయగోరె దాని నతండుల్.







1. పెదపులివర్రు బాలగంగాధరతిలకు పుస్తకభాండాగారపు 11-వ వార్షికోత్సవము ;
2. వడ్డాది సుబ్బారాయకవి సన్మానము, రాజమండ్రి.





1. బెజవాడలో కడచిన అక్టోబరుమాసమున జరిగిన హిందీపరీక్షలకు హాజరయిన విద్యార్థులు, నిరీక్షకులు, వ్యవస్థాపకులు;

**2. సారస్వతమండలి, బందరు.**

అంత నచ్యుతుండు నాముక్క బిడ్డకు - నందజేయ బిడ్డ యాతురతను
నమలకుండ మ్రింగె నయమొప్ప నందర - కచ్యుతుండు ముక్క లన్ని యొసగె.

అంతట నందరు దేలి రొ-కింత యనంతరము జల మపేక్షించుటయున్
సంతసము వెల్లి విరిసెను - స్వాంతముతో నచ్యుతుండు జల మెక్క డనన్.

అత్త యతని కనియె నన్న మాపెరటిలో - నూతియొద్ద నుండు బ్రాతబిందె
త్రాడుతోన దాన దోడి జలంబుల - దెచ్చి యిచ్చి దప్పి దీర్పు మనుడు.

ఒక్కపరుగున గూపంబుచక్కి జేరి - జలము గొనితెచ్చి వారల యలఘుతృష్ణ
దీర నిచ్చిన వారలు దేరి రంత - వారి వృత్తాంతమును వినగోరె నతడు.

వినిపించె నత్త యిట్టుల - ననఘా మా జీవయాత్ర హాలికవృత్తిం
దిన గూడు గట్ట గుడ్డయు - దినవెచ్చముగూర జాల దినములు గడచెన్.

ఇలపై హాలికు డింతపాటు పడిన న్స్వేష్టాప్తికై గాలిగం
గలు బర్జన్యుడు సూర్యచంద్రులు గ్రహగ్రామంబును న్లోనుగా
గలవా రెందరొ దేవత ల్సుముఖులై కావన్వలె న్గాని వో
బలుపాట్లుం బడు వాని సంకటముల న్వర్ణింపగా శక్యమే.

అనఘా మాదగు స్వల్పభూవసతి మా కన్నంబు వస్త్రంబునుం
దినను గట్టను జాలినంత యిడ దృష్టిం బెద్దయుం గాల మే
గెను మా కొక్క కొరంతలేక కృషిసాగె న్సవ్యమై దానివెం
టనె దుర్భిక్షము డాసె దైవగతి దాటన్వచ్చునే యేరికిన్.

అతివృష్టి యనావృష్టి య-మితమగు పశువుల తెగుళ్లు మిడుతల దండ్లుం
గతవర్షంబుల మూడిట - జతపడి కష్టములు గూర్చె జాలగ మాకున్.

అదియ కారణముగ నాస్తియంతయు సాహు-కారునొద్ద కుదువగాగనుంచి
యప్పుదెచ్చి యంద రర్థాకలిగ దిని - యెంత దీర్ప దీర దెదుగుచుండు.

పలుమరు దీనత వేడుచు - నిల సాహుని కాళ్ల వ్రేళ్ల నెంతపడిన నా
ఖలుడు పొలమెల్ల గొనియెను - నిలువున సస్యంబుతోడ నిర్దయు డగుచున్.

అదిగాక బండి యెడ్లను-పొదుగు గుడుచు క్రేపుతోడి మొదవుం గొని తా
బదిలముగ మంచె నుంచిన-పదిసంచుల ధాన్య మతడు బండిని దోలెన్.

అంతం బోవక యాత డొ-కింతయు ననుకంపలేక యిలుదూరి వెసన్
ముంతలు మూకుళ్లను మరి - గంతలు బొంతలును గొల్లగా గొనిపోయెన్.

నెలలోపల నప్పును బై-సలతో జెల్లించి మీదు సర్వస్వము మీ
రలు గొనిపొండనె నాతడు - పులినోటను బడ్డ కండ బొసగునె గొనగన్.

అని యాపె చెప్ప నంతయు - విని యచ్యుతు డాక్షణంబ వెస జని సాహుం
గని ధన మొసగిన నాతం-డును సర్వస్వంబు నొసగుడును నూరెల్లన్.

తనవార్తయె చెప్పికొన - న్వని యచ్యుతు డాపొగడ్త విననొల్లక వెం
టనె యేరికి జెప్పకయే - పనివినె నాయిల్లు వీడి ప్రచ్ఛన్నగతిన్.

అర్థమంతయు నిట్లు పరార్థమునకు - వమ్మగుట యాత్ర కాతడు సొమ్ములేక
యొరుల నర్థించుటకు మనం బొల్లకునికి - మరలి తన యిల్లు సేరె నామానధనుడు.

హాలధరుండును గ్రొత్తనెచ్చెలియు గాశి - జేరి విశ్వేశ్వరుని గుడిచెంతనున్న
సత్రమందున విడిసి యాస్థలమునందె - రేయిగడపిరి మరునాడు రేపకడను.

చెలికాడు హాలధరుం గని - కలగని మేల్కాంచిన యట్లుగా నయ్యెడు దె
క్కలికా డెవండొ రాతిరి - దల క్రిందనె యున్నముల్లె దాహరియించెన్.

అనుడు హాలధరు డాతని కన్నపాన-ములకు వలసిన ధన మిచ్చి మూడునాళ్లు
కాశివిశ్వేశు బూజించి గయకు నొంటి - నరిగి మరలెను మరియింక నరుగలేక.

హాలధరుడు విశ్వనాథుం - గొలువంగను బోయినప్డు గుడిలోపల నె
చ్చెలి నచ్యుతునిం దనక-న్నుల గట్టినయట్లుగా గనుంగొనె నెలమిన్.

మొదటిదినమున నాతని గదియగోరి - ముందరికి నేగి చేతిలో ముల్లె నెవరొ
లాగినట్లయి వెనుకకు సాగి యరసి - మరలునంతనె నెచ్చెలి మాయమయ్యె.

మరియు రెండవదినమున దరియ జూచు-నంతలోపల గాల్జారి యవనిగూల
దారపుత్రులు వెనువెంట దలపునకును-వచ్చినంతనె నెచ్చెలి చొచ్చె మరుగు.

అంత మూడవదినమున నాతడు గుడి-ద్వారమును గాచి నెచ్చెలి బట్టునూహ
సావధానత ద్వారంబుచక్కి నెంత-కాల ముండిన నెచ్చెలి గానరాడు.

అంతట విస్మయ మెంతయు - స్వాంతంబును గలతవరుప స్వప్నమొ నిజమొ
భ్రాంతియొ తెలియక యాతడు - చింతింపదొడంగె నిట్లు చిత్తములోనన్.—

త్రోవపొడుగున నెందరో తోడుపడిన - నచ్యుతుని జాడ లడిగితి నం దొకడును
తెలుపనోపడ యీవింత గలదె యెందు - దైవమాయ యెరుంగగా దరమె యకట

అని తలపోయుచు నిలుసే-రను హాలధరు డంత సత్వరంబున జనుచున్
మును నెచ్చెలి తను నెడబా-సిన చోటను బర్ణగృహము జేరెం బ్రీతిన్.

ఆగృహమున గల నల్వురు - వేగంబున వెడలివచ్చి ప్రేమ దలిర్పన్
స్వాగత మొసగగ జట్టును - మూగుటయును హాలధరుండు మోమోటమితోన్.

ఏగెద సెలవిం డనినను - నా గృహపతి యాదరమున నాతిథ్యంబుఁ
వేగము గొనిపోదగు నే - డాగగవలె ననుచు నిల్పె హలధరు నచటన్.

ఆదినంబున నట నిల్చి హలధరుండు - వారి యాదరపూర్వక స్వాగతంబు
మరియు నాతిథ్యమును గొని యరసె వారి - క్షేమవార్తల దా సుఖాసీను డగుచు.

వారలు నంతట దమ సం-సారస్థితి దెల్పుచును బ్రసంగవశమునన్
ఘోరాపత్సాగరమున - దారు మునిగియుంటయును నుదారత మెరయన్.

ఒకవ్యక్తి తమ్ము బ్రోవగ - నకలంకాత్ముండు దమ గృహము చేరుటయున్
సకలంబు గీర్చి తను దెలు-పకయే తమగృహమువీడి వడి నేగుటయున్.

వినిపించి హలధరుం గని - యనఘా సౌజన్యమూర్తి నావ్యక్తిని బో
ల్పను శక్యము గాకున్నది - మనుజుడో త్ర్యూపధరు డమరశేఖరుడో.

అన విని వారల నట వీ-డ్కొని హలధరు డిల్లుసేరి కొడుకుల బసులం
గని కడుసంతసమున నుం-డెను నచ్యుతు డతని జూడ నిండినవేడ్కన్.

చనుదెంచి నెచ్చెలిం గని - యనఘా నిర్విఘ్నముగను యాత్ర నలిపితే
చనుదెంచితె క్షేమంబున - గనులం గను భాగ్య మబ్బెగా మరల నినున్.

అనుటయు హలధరు డాతని - కనియె స్మరలంగవలసె గయనుండియె యో
యనఘా నిను వీడిన యా-త్రను దినములు యుగములగుచు దాలిమిదూలన్.

మరియును నొక్కవిశేషం - బరయగ నా మదిని దోచు నక్కట నాకున్
స్థిరమగు శ్రద్ధయు భక్తి గు-దురదె స్వాడు నింటిబెడద దోచెడుకతనన్.

పరమేశ్వరునకు నాయెడ - బరమప్రీతిని ఘటించు భాగ్యము నాకుం
గరవమ్యో నంచు నెంచెద - వరమతి నే విన్నవించు వార్త వినగదే.

అని కాశీశునికడ దా-మును గనులంగన్న దృశ్యమును దెల్పి వెసన్
దనదయ కారణముగ నిల - మనుగడగన్నట్టివారి మాటలు దెలుపన్.

దొరకొనుటయు నచ్యుతుడుం - గరమును బెడమోము వెట్టి కడుతొందరతో
నరయగవలసిన పని గల - దరుగంగావలయు ననుచు నటువీడి చనెన్.

హలధరు డచ్యుతు నెదలో - గల వినయవివేకములును గరుణయును విని
ర్మలసౌజన్యము మెచ్చుచు - నిలిపె నతని హృదయసీమ నిజగురుగాగన్.

హలధరు డదిమొదలుగ ని-శ్చలవైరాగ్యంబు గల్గి నిస్పృహు డగుచుం
గలితాహంకారుండై - కల ధనము పరోపకారకముగా నొసగున్.

స్థావర జంగమాత్మక విశాల జగ ద్రచనాద్భుతక్రియా
భావిత సర్వశక్తునకు బాత్ర మగారము విశ్వ మెన్న నా
నావిధ చిత్రశిల్పరచనాసమలంకృత దేవగేహముల్
గావు ధరిత్రి దాని సరి కల్పితము ల్గదు నస్థిరంబులున్.

నీలనభం బుడుప్రకరనిర్మలదీపసహస్రశోభితం
బాలయ మర్హ్య మెన్న మఘవా శ్మవినిర్మిత మింద్రచాపశో
భాలలితామలాంబుధరపంక్తి తిరస్కరిణీచయంబు శం
పాలతికాళితోరణపు పాళి మహీస్థలి పాదపీరమున్.

అమలిన శుద్ధ బుద్ధ పరమాత్మ సమర్పణయోగ్యపూ మహా
సుమములు ధూప దీపములు శుద్ధ సువర్ణమయాక్షతాదుల్
శమ దమ సత్యశౌచములు క్షాంతి దయా కరుణాదు లారయన్
సమములె ధాత్రి నీ సహజసాధనసంపద కన్య మెచ్చియున్.

దయ పారిజాతమును మైత్రియు గరుణయు సరయ మాలతీజాతులు ప్రే
మయు ననురాగము ననుకంపయు జంపకబంధుజీవపంకేరుహముల్.

ఈ దృక్పూజాసుమచయ - మేదివ్యుని హృదయసీమ నిరవొందెడు వా
డాదృతి బరసేవారతి - మేదిని బరమేశ్వ రార్చ మించు నితరులన్.

అతనికి సేవానిరతియ - యతులంబగు దీర్ఘసేవ యఖిలతపంబుల్
వ్రతములు పూజలు యజ్ఞము - లితరంబగు శాస్త్రచయవిహితధర్మంబుల్.

సువిశాలవిశ్వమందున - నివసించెడు భూతకోటి నిర్మలకరుణా
ప్రవణత సేవించుటయే - శివపూజయు విష్ణుసేవ జీవులకెల్లన్.

ఈ పూజకు నెనవచ్చున - వేపూజలులేవు ధరణి నెందును బరసే
వాపరతంతతయే సేవాపరమావధి తలంప భక్తజనులకున్.

# నియమ నిర్వహణము

## కాళూరి వేంకటరామారావుగారు

౧

ట్రంకురోడ్డుమీదనుంచి ఏజన్సీప్రాంతములకు పోయే మోటారుబస్సుల ఘుర్ఘురధ్వనులుతప్ప తన నిశ్శబ్దవాతావరణమున కేయంతరాయమునూ ఎరగని సాంద్రారణ్యప్రదేశ మది. సృష్ట్యాది నుండీ తా మనుభవిస్తూవున్న ప్రశాంతజీవనమును విధ్వంసమొనర్చే మోటారుబస్సుల అరపుల నేమాత్రమూ సహింపక నాలుగుమూలల నించీ భయంకరప్రతిధ్వనులతో హుంకరిస్తూ వుంటాయి, అక్కడి పర్వతశ్రేణులు. అలసటఅన్నమాటే తెలియకుండా శరవేగంతో పరుగెత్తే యీపాశ్చాత్యయంత్రవాహనములవేపు ఆశ్చర్యంతో చూస్తూ వుంటా రక్కడి కోయదొరలు. నైజాముప్రభుత్వోద్యోగులు విహారార్థము బయలుదేరినప్పుడుతప్ప అక్కడ గోదావరిలో పడవలు నడిచిన సమయమే లేదు.

'దుమ్ముగూడెం' అటువంటి స్థలంలో నదీతీరాన్ని కట్టబడినది. హైదరాబాదుప్రభుత్వము అక్కడే గోదావరికి అడ్డుగా ఆనకట్టను నిర్మించినది. ఆనకట్టకి పూర్వం జనసంచారమే యెరగని దుర్గమారణ్యమును కొంతబయలుచేసి 'ఆనకట్ట ఆఫీసు'ను, ఉద్యోగస్థులకీ, సిబ్బందికీ కావలసిన గృహనిర్మాణమును జరిగింది. ఈయిళ్లే 'దుమ్ముగూడెం' అనేగ్రామానికి పునాదులైనవి.

గ్రామం పెరిగినతరవాత ఆనకట్టఉద్యోగస్థు లుండే యిళ్లకు మాత్రము 'లైను' (Line) అనే వాడుకనామం కలిగింది. ఆఫీసర్ల లైనుకీ అసలుగ్రామానికీ మధ్య ఒకపర్లాంగుదూరంకూడా ఉండదు. వ్యవహారసౌకర్యార్థం ఈగ్రామాన్ని 'గూడెం' అని పిలవడమే మామూలైపోయింది.

లైనులో చాలవరకు ప్రభుత్వనిర్మితములైన సుందరభవనములే ఉన్నాయి. కంట్రాక్టర్లవీ, ప్రత్యేకవ్యక్తులవీ ప్రైవేటుబంగాళాలు నాలుగైదుమాత్రం విడిగా అక్కడే ఉన్నాయి. లైనంతా పరిశుభ్రములైన రెండువీధులతో ముద్దొస్తూవుంటుంది. ఊరుదాటితే అంతా భయంకరకాననమే.

సాయంకాలం ఆరుగంటలు దాటిపోయింది. పట్టపగలే భయము గొల్పే అడవి అంతటా చిమ్మచీకట్లు కమ్ముకున్నవి. జారిపోయి నల్లనైపోయిన సంజ కభిముఖములై నిలిచి విశాలవృక్షములు మహాభూతములలాగు తలలువిరియబోసుకుని గాలికి తూగాడుతున్నాయి. పక్షులన్నీ గూళ్లకి చేరిపోయి చాలానేపయింది. క్రూరమృగములింకా తమ నిశాసంచారమును ప్రారంభించలేదు. నిబిడములైన చెట్ల సందులలోనుండి ఉద్యోగస్థుల లైనులోని దీపాలు దూరానికి మినుకు మినుకుమంటున్నాయి.

లైనులో మొట్టమొదటిదే యింజనీరు వైద్యనాథయ్యరుయిల్లు. ఇంటిముందు వలయాకారంగా పూలతోట వుంది. నూతనంగా వేయబడిన దవడంచేత చెట్లింకా దట్టంగా అల్లుకొని పెరగలేదు. ఆవరణకి చుట్టూ ఇనపముళ్ల తీగెలకంచె చుట్టబడి ఉంది.

వీధి వసారాలో పరిశుభ్రమైన హరికేన్‌లాంతరు వెలుగుతూంది. ఇంటిచూరుకి వేలాడుతూవున్న చూపుచాపలన్నీ పైకి చుట్టివేయబడిఉన్నవి. వసారాలో ఒక పెద్దడ్రాయరూ, నాలుగైదు కుర్చీలూ ఉన్నాయి. లాంతరువెలుగు ఇంటిముందున్న పూలతోటలో కొంతభాగముపైమాత్రము పడుతూంది. దీపంవెలుగు పడకుండా వున్నస్థలంలో ఇంటిగోడకి దగ్గరగా ఇద్దరు బంట్రోతులు కూర్చుని మెల్లగా లోకాభిరామాయణం చెప్పుకుంటున్నారు. వాళ్లకి సమీపంలోనే పెంపుడుకుక్క ముట్టె నేలమీద మోపి పడుకునిఉంది.

ఇంతలో ఇంట్లోనుంచి ఒకయువతి వసారాలోకి వచ్చి గోడకి చేరబడి ఆవరణ కావలనున్న అరణ్యంవేపు చూస్తూ నిలబడింది. ఆమె రాకను గ్రహించి బంట్రోతులు తమ కంఠముల నింకా తగ్గించుకుని మాట్లాడుకుంటున్నారు. పెంపుడుకుక్క పరుగెత్తుకుపోయి ఆమె చీరచెరగును తాకుతూ సస్నేహంగా నిలుచుంది.

ఇరవై సంవత్సరాలైనా నిండని ఆమెశరీరము చామనచాయ గలిగి బహుకోమలమై ఉంది. కాంతివంతమై, కళాభరితమైన ముఖం ఆకర్షణీయమై ఉంది. లాంతరువెలుగునం దామెనేత్రములు ఖిల

మిల మెరుస్తున్నాయి. విలువగల దక్షిణాదిచీర నామె ధరించింది. చుట్టూ లేసుపని చేసిన గులాబీరైక తొడుగుకుంది. వివిధరకముల పనితనము కల బంగారపు గొలుసులు రెండుమాత్ర మామెకంఠసీమ నలంకరించి ఉన్నాయి. నడుమున ఉన్న వడ్డాణము దీపపు కాంతిలో జిగజిగ మెరుస్తూంది. పరిపూర్ణమైన అంగసౌష్ఠవము కలిగి ఆమె సౌందర్యం దర్శనీయమై ఉండెను.



"ఇంతలో ఇంట్లోనుంచి ఒకయువతి......చూస్తూ నిలబడింది"

అయిదు నిముషాలసేపు అల్లా నిల్చుని ఆమె బంట్రోతులవేపు చూసి "ఖాసిం! అయ్యగారింకా రాలేదేం?" అని అడిగింది.

ఖాసిం తొందరతొందరగా లేచి సవినయంగా "వారూ, ఓవర్సీరుగారూ షికారు వెళ్లారండి. ఈపాటికి వొస్తూఉంటారు." అని చెప్పాడు.

ఆసమాధానము విని "ఎంతచెప్పినా యింతే. ఈఅడవుల్లోనూ, అర్ధరాత్రుల్లోనూ ఈపాటికి ఇంటికి చేరగూడదూ?" అని నింపాదిగా అనుకుంటూ యింట్లోకి పోయింది.

"అయ్యగారొచ్చేవరకూ యీవిడకి మాచెడ్డ ఖంగారురా! ఈపావుగంటలోనూ నాలుగుమార్లయినా ఆయన వచ్చారో లేదో అని మనలను కనుక్కుంది, చూశావా?" అని ఖాసిమ్ తనతోడి ఉద్యోగితో అన్నాడు.

"ఏవేళకింటి కెళ్లినా మనవాళ్లకి మన గొడవే అక్కర్లేదు. ఎప్పుడొచ్చామో, ఎక్కడ చచ్చామో అన్నవూసే మన ఆడవాళ్లకవసరంలేదు. అల్లాంటి భార్యకంటే అదృష్టం వేరే ఉందా?" అని జవాబిచ్చి ఖాదరు నిట్టూర్పువిడిచాడు.

మరి పదినిముషాలకామె మళ్లా వసారాలోకి వచ్చి "ఏమోయ్, ఖాదరు! కొంచెం అల్లా వెళ్లి చూసిరా. ఎందుచేత ఇంకా రాలేదో. ఎప్పుడూ ఇంత ఆలస్యం చెయ్యలేదు" అని ఆజ్ఞాపించింది.

ఖాదరు వెళ్లుతూఉన్నవేపు దీక్షగా చూస్తూ ఆయువతి అలాగే నిలబడిఉంది. బంట్రోతు పూర్తిగా ఆవరణగేటు దాటకముందే పైని చీకటిలోనుంచి మనుష్యుల అలికిడి వినబడింది. ఇంతలోనే గేటుదగ్గర "గుడ్ నైట్ సర్!" అనియును, తిరిగీ జవాబుగా "యస్, గుడ్ నైట్" అనియును మాటలు వినబడ్డాయి. ఆమాటల వెంబడినే వైద్యనాథయ్యరు లోపల ప్రవేశించాడు.

వైద్యనాథయ్యరువయస్సు ఇరవైయెనిమిది సంవత్సరాలకు మించి ఉండదు. రమారమి ఆరడుగులయెత్తు మనిషి. బలిష్ఠమై సుందరమైన అవయవనిర్మాణము. ఔదార్యమునూ, ప్రసన్నతనూ ప్రదర్శిస్తూన్న ముఖమూ, అసాధారణమగు తెలివితేటల నీను కళ్లూఉండి అయ్యరు నందు స్నేహపాత్రుడైన వ్యక్తిని స్పష్టీకరిస్తున్నాయి.

వైద్యనాథయ్యరు నైజాముప్రభుత్వమున ఇంజనీరుగా ప్రవేశించి మూడేళ్లుమాత్ర మయింది. ఈస్వల్పకాలంలోనే ఉద్యోగధర్మనిర్వహణమునం దతడు అసాధారణకౌశల్యమును కనబరిచాడు.

అతని భార్య గొప్పవారింటి బిడ్డ. ఆమెతండ్రి పశ్చిమతీరమున ఒకజమీందారీకి దివానుపని చేసి కీర్తివహించిన రాజకార్యనిపుణుడు. వైద్యనాథుని దేమంత ధనవంతమైన కుటుంబము కాకపోయినా, పాఠశాలయం దతని ప్రజ్ఞాతిశయాన్ని బట్టి దివానుగారి అల్లుడై పోయాడు. వారి వివాహము స్వయంవరంలాంటిది. చెన్నపట్నంలో ఇంజనీరింగుచదివేటప్పుడే వైద్యనాథుడు దివానుగారి అమ్మాయిని చూశాడు. అప్పటి అనురాగలతయే చిగిర్చి కొనలువారి పుష్పించింది.

ఉద్యోగంలో ప్రవేశించిన తత్క్షణం వైద్యనాథయ్యరు సుందరమ్మాళ్‌ని వివాహంచేసుకున్నాడు. వివాహమైనదిమొదలు వారిద్దరూ ఏకొద్దికాలమోతప్ప ఒకరినొకరు సాధారణంగా విడిచిపెట్టి ఉండలేదు.

ఆరోజుల్లో హిందూదేశపు విశ్వవిద్యాలయములలో ఇంగ్లీషు చదువుకొన్నవారికి నైజాంప్రభుత్వమునందు గొప్ప ఉద్యోగాలు సులభంగా లభించేవి. అందుచేతనే వైద్యనాథయ్యరు హైదరాబాదు ప్రభుత్వంలోనే ప్రవేశించాడు. అనుకున్నట్లుగానే అతనికి శీఘ్రకాలములోనే వేతనాభివృద్ధియు, ఉద్యోగాభివృద్ధియు కూడా కలిగాయి.

౨

చేతిలోనున్న బెత్తాన్ని తిప్పుతుంటూ వైద్యనాథయ్యరు గబగబ బంగాళాను సమీపించి మెల్లెక్కుతున్నాడు. వసారాలోని దీపపు వెలుతురునందు అతని కళ్ళజోడు ప్రకాశిస్తూంది. మెట్లెక్కుతూనే సహజమందహాసభరితములగు నేత్రములతో భార్యవేపు చూశాడు.

"ఇంకనించి యింటి కింత ఆలస్యంగా వొస్తే వొప్పుకునేది లేదు" అని ప్రేమార్ద్రములగు కోపవృష్టులతో సుందరమ్మాళ్ భర్తను బెదిరించింది.

"అబ్బో! ఇంక ఆలస్యంగా వస్తే అమ్మగారు శిక్షిస్తారు కాబోలు. బాబూ! ఏదిదారి?" అని అతడు భార్యహస్తమును తన చేత్తో పట్టుకున్నాడు.

భర్త చేతులోనుంచి తన చెయ్యిని కొంచెం విడిపించుకోబోయి పూర్తిగా విడిపించుకోకుండానే సుందరమ్మాళ్ "సరిగా నడుచుకోకపోతే మరేం చెయ్యాలి?" అంటూ పొంగుతూ వస్తూన్న నవ్వును అతికష్టంమీద ఆపుచేసుకుంది.

"అలాగా! అయితే లోపలికి రండి, ఏం శిక్ష వేస్తారో నేర్చుకు గాని." అని వైద్యనాథుడామెను ఇంట్లోకి తీసుకుపోయి "వెయ్యండి శిక్ష. నేరస్థుడు సిద్ధంగా ఉన్నాడు" అన్నాడు.

సుందరమ్మాళ్ తిరిగీ కొంచెం కోపం నటిస్తూ "మీ కెన్నిమార్లు చెప్పాను, చీకటిపడనిచ్చి ఈ అడవుల్లో బైట తిరగొద్దని, చెప్పండీ! సాయంకాలమైన తర్వాత మీ రింట్లో లేకపోతే యీ హృదయం యెల్లా కొట్లాడిపోతుందో మీ కేం తెలుసును? జంతువులూ, పురుగూ, పుట్రా తిరిగేసమయం కదా అని మీ రింటికొచ్చేదాకా నాకు సుఖమే ఉండదు. పోనియ్యండి మీ కెప్పుడూ ఇంతే" అన్నది.

"బయట ఏజంతువులు తిరిగినా నారివాల్వరు ఎప్పుడూ సిద్ధంగానే ఉంటుందనీ, ఏపరవా లేదనీ చెప్పలేదూ నీకు? పైగా యీ సమీపంలో మనుష్యులకి హానిచేసేటంత ప్రమాదకరములైన జంతువులు లేవు. ఈమాత్రం దానికి నీ కింత భయ మెందుకు సుందరం?"

"భయ మెందుకా? నే నప్పుడప్పుడు స్నానానికి గోదావరి కెళితే అన్ని జాగ్రత్తలు చెబుతా రెందుకూ మీరు? నేనేం చంటి పిల్లననా, ఆమాత్రం జాగ్రత్త తెలీదనా? ఆఫీసుపనిహడా మానుకుని నేను స్నానంచెయ్యడం అయేదాకా అల్లా నదివొడ్డున తిరగడం మీ కెందుకు చెప్పండీ?"

సుందరమ్మాళ్ ని దగ్గరగా తీసుకుని వేళ్ల కొనలతో ఆమె చెక్కులపై మృదువుగా నొక్కుతూ వైద్యనాథుడు "సరేలే. ఈసారి క్షమించు. ఇంకనుంచి సాయంకాలం ఆరుగంట లయేసరికి హాజరు" అన్నాడు.

*    *    *    *

ఒకనాటి రాత్రి తొమ్మిదిగంట లైపోయింది. లైనులోనివారందరూ ఇళ్ల తలుపులు బిగించుకుని నిద్రాధీనులై ఉన్నారు. అంతటా గభీరనిశ్శబ్ద మలముకొన్నది. అరణ్యప్రాంతమంతా గాఢాంధకారభరితమైపోయింది.

దక్షిణపువేపు గదిలో మంచంమీద వైద్యనాథయ్యరు పడుకొనిఉన్నాడు. పక్కనే సుందరమ్మాళ్ భర్తశరీరానికి చేరబడి విశ్రాంతిగా కూర్చుంది. స్వచ్ఛమైన లాంతరువెలుగులో గది శోభాయమానంగా ప్రకాశిస్తూంది. రెండుమూడు పేముకుర్చీలూ, సుగంధద్రవ్యము లమర్చబడిన చిన్నమేజాయునుతప్ప ఆనిశాలమైన గదిలో వేరేసామానులు లేవు. వైద్యనాథుడు కళాశాలలో చదువుకున్ననాటి ఫోటోగ్రాఫులు నాలుగూ, వివాహమప్పుడు అతనూ, భార్యా కలిసితీయించుకున్న ఫోటో ఒకటీ, రెండుమూడు Land scape చిత్రములూ తెల్లనిగోడలపైని అక్కడక్కడ తగిలించబడిఉన్నాయి.

భార్యాభర్త లిద్దరూ నింపాదిగా కబుర్లుచెప్పుకుంటూ తాంబూలమువేసుకుంటున్నారు. సుదీర్ఘమైన భార్యజడను ఎడమచేత్తో పట్టుకుని వైద్యనాథుడు విలాసంగా ఆడుకుంటున్నాడు. తమలపాకులను ఒకప్పుడు తననోట్లో వేయడంలోనూ, వేరొకప్పుడు భార్యనుని పండ్ల కందించడంలోనూ అతని కుడిచెయ్యి నిమగ్నమైఉన్నది. ఇంచుక చెదిరి ధవళకాంతుల నీను ముఖబింబముపై బడి వింత అందాన్ని సమకూర్చిన భార్యముంగురుల సోయగాన్ని తదేకదృష్టులతో చూస్తున్నాయి, అతని కళ్లు.

ప్రధానవిషయమేదీ నిర్ణయంగా లేకపోయినా వారి సంభాషణమాత్రం ఏఅభ్యంతరమూ లేక సుఖంగానే సాగిపోతూంది. ఇంజనీరింగుకళాశాలలో చదువుకున్నప్పుడు సుందరమ్మాళ్ ని మొదటిసారి చూసినరోజూ, క్రమంగా వారి స్నేహభావములు వృద్ధిపొందిన విషయమూ ప్రతిరోజూ చెప్పుకున్నా వారికి మళ్లీ నూతనంగానే కనిపించి విసుగుకలిగించేవి కాదు. ప్రతిదినమూ ఏదోఒక సమయంలో ఆప్రస్తావన రాకుండా ఉండేదికాదు.

ఉద్యోగంలో ప్రవేశించినకొత్తలో వారు సికందరాబాదులో ఉండేవారు. అక్కడవారికి వినోదమును సమకూర్చే విషయాలు అనేకములుగా ఉండేవి. నాటకాలూ, సినీమాలూ, టీపార్టీలూ, సభలూ మొదలైన వెన్నో వారి కానందమును ప్రసాదించేవి. కాని దుమ్ముగూడెంఆఫీసుకి వచ్చినప్పటినుంచీ అల్లాంటి వేవీ లేకుండాపోయాయి.

ఆ అడవిలో వారు సాధారణంగా ఒకరినొకరు విడిచి ఒకగడియైనా ఉండలేకపోయేవారు. ఉద్యోగపు పనిమీద వైద్యనాథుడు వీథిలోకి పోయేడంటే అతడు వచ్చేగడియకోసం నిరీక్షిస్తూ ఏమీ తోచకుండా కూర్చుంటుంది సుందరమ్మాళ్.

దాక్షిణాత్యులలో పూర్వాచారపరాయణత్వ మెక్కువగా ఉంటుంది తరుచు. సంస్కారముదెసకు వారివైఖరి త్వరితగతి సుముఖముకాదు. వైద్యనాథయ్యరుమాత్ర మట్టివారిలో చేరలేదు. కళాభినివేశము కల మనస్సతనిది. వ్యవహారధర్మములనుండి విడివడి తీరికగలప్పుడల్లా అతడు టాగోరు, షెల్లీ, కీట్సు మొదలైన కవీంద్రుల వ్రాతలను చదివి వాటి అంతరార్థమునుగూర్చి భార్యతో ముచ్చటిస్తూ కాలక్షేపం చేసేవాడు. సుందరమ్మాళ్ కూడా విద్యావతియే అగుటచేత కవిత్వతత్వాన్నిగూర్చి ఆమెతో చర్చించుకోవడ మతనికి ఉత్సాహమునే కలిగించేది.

ఏరోజు కారోజు అతనికి హైదరాబాదునుండి టపా వస్తూవుండేది. టపామనుష్యులచేత కావలసిన పుస్తకాలు తెప్పించుకుని భార్యకి చదువుకోడాని కిచ్చేవాడు. మనోహరములైన సాయంకాలములందు ఆమెతో కూడా నదీతీరాని కెళ్లి బండరాళ్లమీద కూర్చుని ప్రకృతిశోభను విలోకిస్తూఉండేవాడు. ఇల్లాగ దుమ్ముగూడెంఆఫీసుకి వచ్చినప్పటినుంచీ భార్యకి కావలసినంత కాలక్షేపం జరిగేటట్లు చూసేవాడు, వైద్యనాథుడు.

ఆనాటిరాత్రి వారి సంభాషణలో వివిధవిషయాలు దొర్లిపోయాయి. అదంతా దండకారణ్యమనీ, సీతారాముల పవిత్రపాదసంస్పర్శచే పూజనీయమైన స్థలమనీ, ఆ అడవిలో ఉండగానే విధిప్రేరితుడై రావణుడు ఆపురాణదంపతులకు ఎడబాటు కలిగించేడనీ చెప్పి సీతావియోగమును భరించలేక రాము డెంత దుఃఖించాడో కదా అని వైద్యనాథుడు రామాయణకథయందు తన్మయుడైపోయి నిట్టూర్పువిడిచాడు.

భర్త చెబుతూఉన్న ఘట్టము నూతనవివాహితులైన సీతారాముల వియోగమునుగూర్చిన దగుటచేతను, కరుణారసపూరిత మగుటచేతను సుందరమ్మాళ్ హృదయమును పూర్తిగా ఆకర్షించుకున్నది. భర్తనుండి వేరుచేయబడి సాధ్వీమణియగు సీతామహాదేవి ఎంత కుమిలిపోయినదోకదా అని ఆమె లోలోపలే విచారిస్తూంది. ఆసమయంలోనే భర్త శ్రీరామునియెడల సానుభూతిని కనబరుస్తూ పలికిన వాక్యమును, నిట్టూర్పును ఆమెకు వినబడినవి.

అప్పుడామె "ఎంత స్వార్థపరులండీ మీరు! మీమగవాడైన రాముడివిషయమైయే మీరు విచారించారుకాని ఆజానకీదేవిహృదయమెంత కొట్టుకుపోయిందో, భర్తను తలచుకుని ఆమె యెంతకన్నీ ముద్దు ఏడ్చివేసినదో కొంచెమైనా ఆలోచించారా? చీకటిపడ్డతరవాత మీరొక్కగడియ ఆలస్యంచేసి ఇంటికి రాకపోతే నామనస్సు ఎంత బాధపడుతుందో మీకేం తెలుసును? అల్లాంటప్పుడు మరి ఆజానకీదేవి ఎల్లా ప్రాణాలు నిలబెట్టుకుందో నేను ఊహించలేను" అన్నది.

"అయ్యో! వెర్రిఅమ్మాయి! నిన్ను ఒకగంట సేపైనా విడిచిపెట్టి ఉంటే ఎంతబాధ కలుగుతుందో నాకు బాగా అనుభవం కాబట్టే ప్రియభార్యావియోగమున దుఃఖితుడైపోయిన శ్రీరామునియందు సానుభూతి చూపించగలిగాను. అంతేకాని స్వార్థపరుడనై కాదు. సీతాదేవి బాధ నాకంటె నీ కెక్కువ బోధపడి ఉండడం సహజం. మళ్లీ ఎన్నటికేనా భర్తను కలుసుకోగలుగుతానుకదా అన్న ఆశతోనే ఆమె జీవించగలిగింది. నా కావిడయందు పరిపూర్ణమైన గౌరవం ఉందిసుమా!"

"సరే. సంతోషమే. కాని పట్టాభిషేకమైనతరవాత గర్భవతియగు సీతాదేవిని అడవిలో దిగబెట్టేసినప్పు డామెగతి ఎంతజాలికరమైనదో ఆలోచించండి. ఆవిడస్థితిలో ఉన్నట్టయితే ఒక నిముషమైనా జీవించేదాన్ని కాననుకుంటాను."

ఈమాటలకి వైద్యనాథయ్యరు చాలా బాధపడ్డాడు. "అబ్బా! సుందరం, ఆవిడ అవస్థ నీ కెందుకు రావాలి? ఆపరిస్థితులు ఊహించుకోవడమే నాకు కష్టంగాఉంది. ఊరుకుందూ" అన్నాడు.

"నేను మాత్రం ఆస్థితి నాకు రావాలని కోరుకుంటున్నానా యేమిటి? ఊరికే అన్నాను. (కొంచెం నవ్వుతూ) కాని ఒక్కటి మాత్రం వినండి. శ్రీరామునిలాగ మీరు నన్ను ఎన్నడూ విడిచిపెట్టకండేం? మిమ్మల్ని వదలిపెట్టిన తక్షణం నా ప్రాణాలు నిలువునా ఎగిరిపోతాయి సుమండీ" అంటూ చేతినుండి జారిపోతూ ఉన్న వస్తువును పట్టుకుంటున్నట్లు ఆఅమాయకురాలు ఆత్రముతో తన హస్తములను భర్తమెడచుట్టూ పెనవేసి హృదయానికి హత్తుకున్నది. ఆవాక్యమును ప్రారంభించినప్పు డున్న మందహాసము పోయి అంతలోనే ఒకవిధమైన దైన్యభావము ఆమెను ఆవహించింది. ఆమెమాటలలో కొంచెం వణుకు చూపట్టింది.

వైద్యనాథు డామెను తనకౌగిటియందు గట్టిగా బిగించుకొని "ఏమిటి సుందరం, ఈవెర్రి? నేనేమిటి? నిన్ను వదలిపెట్టడమేమిటి? ఏమీ లేనిదానికి యీఖంగారేమిటి నీకు? లేనిపోని పిచ్చిభ్రమలు కల్పించుకుని, ఊహించుకుని యిల్లా హడలిపోవడ మెందుకు? అయ్యో పిచ్చిపిల్ల!" అంటూ ఆమెముఖమును తనముఖానికి దగ్గరగా తీసుకుని అనునయవాక్యాలు పలికాడు. ఈనాడు తను సంభాషణను ఆపుంతను పోనివ్వడం తనదే తప్పనుకున్నాడు.

సుందరమ్మాళ్ కొంచెం నేదదేరి "అబ్బే! ఏమీ లేదు. కొంచెం ఖంగారు. మీరు న న్నెందుకు ఒదిలిపెడతారూ?—"

ఆమె యింకా ముగించకమునుపే గోదావరిలో ఏదో బరువైన వస్తువు పడిపోయినట్లు "దభాలు"న చప్పుడయింది. ఆనిశ్శబ్దనిశాసమయంలో, ఆమహారణ్యంలో, విషాదభావసంభరితమగు సంభాషణ ఫలితంగా ఉద్రిక్తమనస్కయై ఉన్నతరుణమున సుందరమ్మాళ్ ఆ శబ్దమును విని ఉలికిపడింది. ఆమె నిలువునా గడగడ వొణికిపోయింది.



"ఆమె తలను హఠాత్తుగా పైకెత్తి కిటికీలోనుండి గోదావరివేపు చూస్తూ..."

భర్తకౌగిటిలోనుండియే ఆమెతలను హఠాత్తుగా పైకెత్తి కిటికీలో నుండి గోదావరివేపు చూస్తూ "అల్లా వినండి. ఆచప్పు డేమిటోను! ఎవరేనా గోదావరిలో పడిపోలేదుకద?" అని ఖంగారుగా అంది.

నిజం చెప్పవలసివచ్చినపుడు ఆచప్పుడు వైద్యనాథాన్నికూడా హడలకొట్టింది. కాని త్వరలోనే తేరుకుని అతడు "ఇప్పు డందులో పడిపోయేవా రెవ రున్నారు? కొండమీదనుంచి ఏదో పెద్దబండ నీట్లో పడిపోయిఉంటుంది." అన్నాడు.

కాని ఇంతలోనే ఎవరో నీట్లో పడి కొట్టుకుంటూన్నట్లు శబ్దం వినబడింది. "అదుగో చూశారా చప్పుడు వెళ్లండి. ఎవరో పడి పోయారు, వెళ్లండి" అని సుందరం భయసూచకమైన కంఠంతో అన్నది.

అంతటా గాఢాంధకారము. నదిలోనుండిమాత్రము శబ్దము ఎడతెరిపి లేకుండా వస్తూంది. వైద్యనాథమునుండెలు కొట్టుకుంటున్నాయి. రివాల్వరు తీసుకుని అతడు "ఖాసిమ్! ఇల్లా రా. ఏటిమీద ఏదోశబ్దమవుతూంది. చూసివొద్దాం. ఓవర్సీరుగారిని లేపు" అన్నాడు.

ఖాదరు సుందరమ్మాళ్‌కి సహాయంగా ఇంట్లోనే ఉండి పోయాడు. వంటలక్కకూడా లేచి యజమానురాలి పక్కకి వచ్చి నిలబడ్డది. వారందరూ నదివేపు చీకట్లలోకి చూస్తున్నారు.

చేతులో పెద్ద హరికేన్‌లాంతరు పట్టుకుని ఖాసిమ్ ముందు నడుస్తున్నాడు. వైద్యనాథము ఓవర్సియరుతో కలిసి వెనుకనుండి వెళ్లుతున్నాడు.

తీరానికి ఇరవైగజాల దూరంలో ఏవోరెండు జంతువులు హోరాహోరిగా నీట్లో దెబ్బలాడుతున్నాయి. లాంతరువెలుగు సరిగా నాటిమీదికి ఆనకపోవడంచేత అవి యేవో నిర్ణయించలేక పోయారు, వారు. మనుష్యుల సడి చూసి ఆజంతువులు మరిపదిగజాలదూరం నీటిలోపలికి పోయాయి.

వైద్యనాథం రివాల్వరు పేల్చాడు. ఆధ్వని వినగానే ఆరెండుజంతువులూ పోరాటమును మానేసి విడిపోయాయి. చెరి ఒక దారినీ ఈదుకుంటూ అవి ఆవలి గట్టుకు చేరిపోయి చీకట్లలో లీనమైపోయాయి.

## 3

సంధ్యారుణకాంతులు పర్వత శిఖరాగ్రములను అలంకరిస్తున్నాయి. దినకృత్యములను ముగించుకుని పక్షిజాతులు గృహోన్ముఖములై బారులుకట్టి పోతున్నాయి. శరన్మేఘశకలములు ధవళములై వినిర్మలాంబరవీథిని మందగతిని విహరిస్తున్నాయి. వనలక్ష్మి నిండుయౌవనములో తొణుకులాడుతూంది.

వసారాలో డ్రాయరుముందు కూర్చుని కాగితాలు చూసుకుంటున్నాడు, వైద్యనాథయ్యరు. బంట్రోతు ఖాదరు కొంచెం చాటుగా మల్లెపొదపక్కని కుక్కను దువ్వుతూ కూర్చున్నాడు.

ఇంతలో సుందరమ్మాళ్ ద్వారము నానుకుని నిలబడి "ఇంక చాలించకూడదూ ఆఫీసుపని?" అంది. ఆమెశరీరము సగము ఇంటిలోపలివైపునకు ఉండిపోయి మిగిలిన సగంమాత్రం భర్తకి కనబడుతూంది. తొడుగుకున్న లేతగులాబీరైక ఆమె శరీరకాంతిలో కలిసిపోయింది. తాంబూలరక్తిమ పెదవుల సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేసింది. ఉదారంగు బనారసుచీరయొక్క జరీఅంచులు మృదుపాదములపై జీరాడుతున్నాయి. జడలో ఉంచిన గులాబీలు రెండూ మనోహరసౌరభాన్ని వెదజల్లుతున్నాయి. ఉజ్వలములైన నేత్రకాంతులు విద్యుల్లతలవలె వైద్యనాథుని ముగ్ధునొనర్చినవి.

అపూర్వదృశ్యాన్ని చూసినవాడిలాగు అతడు భార్య సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ సమస్తమూ మరిచిపోయి కూర్చున్నాడు. సుందరమ్మాళ్ అందములో తన్మయుడై పోవడాని కతని కది మొదటి సారికాదు.

"అల్లా చూస్తూ కూర్చుంటారేం? ఈవేళ షికారు రారేమిటి?"

"ఏం విశేషం? నీఅంతట నువ్వే షికారు రమ్మంటున్నావు?"

"ఉంది. తరవాత మీకే తెలుస్తుంది. వస్తే సరి."

"సరే. రాణీగారి ఆర్డరుకి అడ్డులేదు." అంటూ వైద్యనాథుడు లేచి భార్యతో కూడా గోదావరీతీరానికి షికారువెళ్లాడు.

ఘుంఘుమాయమానగతమువలన నానాశ్రమలూ పడి విశ్రాంతిపొందుతూఉన్న మహావృక్షములవలె ఇరుదరులను తాకి మహావేగమున పొర్లిపోయిన గౌతమీనది ప్రశాంతగతిని ప్రవహిస్తూంది. జలము వినీలమై, స్వచ్ఛమై అగాధమై ఉంది.

వరదలచేత పరిశుభ్రంగా కడిగివేయబడిన ఒక చాపరాతిమీద వారిద్దరూ చాలాసేపు మాట్లాడుతూ కూర్చున్నారు. చుట్టూ తెప్ప తేలుతూ ఉన్న ప్రకృతిశోభను తనివిదీరా అనుభవించారు. వాతావరణమంతా ఆయువతీయువకుల పవిత్రప్రేమసౌరభముతో నిండిపోయినది.

శరత్కాలనిర్మలాకాశవీథిని వినూత్నకాంతులతో నక్షత్రములు గోచరించాయి. కృత్రిమనాగరకతాకల్పితములైన అనవసరపు మర్యాదల కక్కడ అవసరము లేకపోయింది. రెండుశరీరాలూ ఏకమయేటట్లుగా ఒకరిచేతుల్లో ఒకరు ఇరికిపోయి కూర్చున్నారు, వారిద్దరూను. పవిత్రప్రణయబంధములను చూసి అసహ్యించుకునే ఈర్ష్యాదృష్టులు వెతికినాసరే కనబడని ప్రశాంతప్రదేశ మది. ఏకారణముచేతనైనా సరే ఒకనిముషమైనా ఎడబాటు సహించని వారి ఏకీభావమును గాంచి అక్కడి ప్రకృతిఅంతా సంతోషపులకితమైనది.

పరస్పరప్రేమను వెలిబుచ్చుకుంటూ కొంతసేపు సంభాషించుకున్నారు. తమపాదాల నంటి స్రవించే గభీరజలములవంక కొంతసేపూ, అందులో ప్రతిఫలించే ఆకాశవీథివంక కొంతసేపూ చూస్తూ తమ సంభాషణఫలితములగు మధురభావవీథులవెంబడి విహరించారు కొంతకాలము. చుట్టూ నిశ్శబ్దము. సుఖాలోచననిర్మగ్నములగు వారి ఆకృతులను కమ్ముకొస్తూఉన్న చీకట్లపొరలు ఆక్రమించేశాయి.

అంతవరకూ సౌందర్యాన్ని వెలిగ్రక్కుతూఉన్న పర్వతసీమలు చీకట్లలో భయంకరాకారములను ధరించినవి. భార్యాభర్త లిద్దరూ యింటికి చేరారు.

* * * *

తనకీ సుందరమ్మాళ్‌కే దూరపుబంధుత్వ మేదో ఉందని వంటలక్క చెబుతూఉంటుంది. కుమార్తె కాపురాని కొచ్చినప్పుడా మెతోకూడా దివానుగారు వంటలక్కను పంపారు. వంటచేస్తున్నప్పటికీ ఇంట్లో పెద్దదిక్కయి, భార్యాభర్త లిద్దరి గౌరవానికీ పాత్రురాలయి ఆవిడ కుటుంబంలోమనిషిలాగే తిరుగుతూఉంటుంది.

దుస్తులు మార్చుకుని భర్తవంటింట్లోకి రాకముందే పట్టుచీర కట్టుకుని సుందరమ్మాళ్ భోజనానికి సిద్ధంగా ఉంది. ఇద్దరూ ఒకవరసనే సుఖాసీను లైనారు. వారి సంభాషణలో చనువుగా పాల్గొంటూ వంటలక్క వడ్డిస్తూంది.

"సుందరం! ఇందాకా ఏదో విశేషం చెబుతానన్నావు. చెప్పు." అని వైద్యనాథుడు భార్యతో అన్నాడు.

"అప్పటిసంగతి యింకా జ్ఞాపకముందా యేమిటి చెప్పడానికి? అప్పటివిషయం అప్పటిదే"అని సుందరమ్మాళ్ తలవంచుకుని భర్తవేపు చూస్తూ నవ్వుకుంది.

"మరి చూశారుటండీ. సుందరం యెల్లా దగాచేసిందో?" అని వంటలక్కతో వైద్యనాథుడు ఫిర్యాదుచేశాడు.

ఇల్లాంటి కలహాలలో వంటలక్క తీర్పులు ఉభయపార్టీలకీ లాభకరంగానే ఉండేవి.

"నేనేం దగాచేశాను? చెప్పదలుచుకున్న సంగతి మరిచిపోయానుకాని. మనిషైన తరవాత మరిచిపోకుండా ఉంటారేమిటి?"

"అయితే మీతో యెప్పుడు చెబుతానంది బాబూ?" వంటలక్క అడిగింది.

"తరవాత చెబుతానంది ఇందాకాను. ఇప్పుడు మరిచిపోయానంటుంది, చూడండి."

"అయితే మరి జ్ఞాపకం తెచ్చుకుని చెబుతుందిలే తరవాత. అంత తొందర పెట్టకు బాబూ." అని, సుందరమ్మాళ్‌తో "ఏంచెప్పాలనుకున్నావో జ్ఞాపకం చేసుకుని చెప్పు అమ్మా?... ఈరాత్రి చెప్పకపోతే రేపు నాతో చెప్పు బాబూ" అంటూ వంటలక్క కూడా నవ్వుతూనే తీర్పుచెప్పింది.

"మీ రెప్పుడూ ఆవిడమాటే ఆడతారు" అన్నాడు వైద్యనాథుడు.

"నువ్వెప్పుడూ పక్షపాతపు మాటలే" అంది సుందరమ్మాళ్.

* * * * *

భోజనాలైనతరవాత పడకగదిలోకి చేరారు, దంపతు లిద్దరూను. "మరి ఇందాకటిసంగతి చెప్పు"—మళ్లా ప్రారంభించాడు వైద్యనాథుడు.

"ఇంకా జ్ఞాపకంరాలేదు. ఎంతో ప్రయత్నిస్తున్నాను, మరి ఉండండి. తొందరపెడితే అసలే జ్ఞాపకంరాదు." సుందరమ్మాళ్ వదనము మందహాసశోభితమైనది. కళ్లు భావపూరితములు.

"సరే, అయిదునిముషాల టైము. జ్ఞాపకం చేసుకో." వైద్యనాథుడు గడియారంవేపు చూస్తున్నాడు.

అయిదు నిముషాలూ అయిపోయాయి. సుందరమ్మాళ్ నవ్వుతూనే "ఆసంగతి చెబితేయేమిస్తారు, ముందు చెప్పండి," అంది.

"అసలు విషయం తేలకుండానే బేరంకాబోలు?"

"మీకు మంచి లాభకరమైనసంగతే చెబుతాను. చెప్పండి, ఏమిస్తారోను?"

"నువ్వేది కోరితే అదే."

"అయితే ఉండండి, కొంచెం. మరిచిపోయాను మళ్ళీని."

"ఆఁ పెంకిపిల్లా?" అంటూ వైద్యనాథుడు పక్కగనే నిలుచున్న భార్యని తను కూర్చున్న కుర్చీలోకి లాగుకుని తొడలమీద బలవంతంగా కూర్చోపెట్టుకున్నాడు.

"ఉండురూ, మోటుసరసం! జ్ఞాపకం తెచ్చుకోవాలా మరి? మీ రేమిస్తారో చెప్పరుకాని—"

"నువ్వేదికోరితే అదే."

"సరే జాగ్రత్తగా వినండి మరి."

వైద్యనాథుడు నిశ్శబ్దంగా వింటున్నాడు.

"ఇంకా జాగ్రత్తగా వినాలి. మరి చెప్పనా?"

"నేను ఒద్దంటున్నానేమిటి?"

"మరి మీరూ-నన్ను-కొంతకాలం వొదిలిపెట్టి ఉండవలసి వస్తుంది కొద్దిరోజులలో."

"ఏం?"

"ఎందుచేతో గ్రహించలేరూ?" తీక్ష్ణములై భావపూరితములగు దృష్టులను సుందరమ్మాళ్ భర్తమీద ప్రసరించింది.

"మీఅన్నయ్య పెళ్ళికి పుట్టింటికి వెడతావు."

"అయ్యో అమాయకత్వం! మాఅన్నయ్యపెళ్ళికి నాతో మీరుకూడా వస్తారుగా" సుందరమ్మాళ్ నవ్వుకుంది కొద్దిగా.

"నాకు తెలియదు మరి. చెబుదూ ఎందుచేతనోను."

"ఆమాత్రం తెలివితేట లుంటే మీరూ స్త్రీలే అయి జన్మించి ఉందురు. సాధారణంగా ఆడదాన్ని భర్త విడిచిపెట్టిఉండవలసిన సమయం ఎప్పు డొస్తుందో యోచించండి, కొంచెం."

"ఎప్పుడా? (కొంచెం ఆలోచించి) గర్భవతిగా ఉన్నప్పుడూ, ఇంట్లోకి రావడానికి వీలు లేనప్పుడూ—"

"ఆ, ఇంక చాలులెండి. ఇప్పటికి కాస్త దారిలోకి వొచ్చారు. మీరు చెప్పినవాట్లో మొట్టమొదటికారణంవల్లనే అనుకోవచ్చును." సుందరంచెక్కిళ్లు లజ్జారుణిమను ధరించాయి. ఆమె ముఖము కొంచెం పక్కకు తిప్పుకుంది. మందహాసశోభ లామెముఖపద్మమున వికసించాయి.

వైద్యనాథుడు నవ్వుకుంటూ "ఓహో! అదా సంగతీ! నువ్వూ, ఆపంట ఆవిడా కలిసి కుట్రచేసి దాచేశారన్నమాట యిన్నాళ్లూ నాతో చెప్పకుండాను?" అన్నాడు.

"మీ రేమియ్యదలుచుకున్నారో ఇవ్వండి మరీ."

"ఇదుగో తీసుకో" అని వైద్యనాథుడు చలిస్తూవున్న భార్య ఎర్రని పెదిమలను గాఢంగా ముద్దుపెట్టుకున్నాడు.

"బహుమానం లేకపోవడంసరికదా, మోటుసరసంకూడాను" ఆమెముఖము కొంచెం కోపంనటించింది.

"ఎవరు ఎవరికి బహుమాన మియ్యాలో ఆలోచించుకుంటే నీకే తెలుస్తుంది. (కొంచెంసే పూరుకుని) సరేగాని నిన్ను వొదిలిపెట్టవలసిన అవసర మేముంది చెప్పుబాబూ" అని ఆమెముఖాన్ని తనవేపు బాగా తిప్పుకున్నాడు.

"ఇక్కడ ఉద్యోగం మానుకుని నాతో వొచ్చేస్తారేమిటి మాపుట్టింటికి?"

"ఇలాంటి అవసరాలకోసమే సెలవులు ఫట్టాయి."

## ౪

మరి నాలుగునెలలు గడిచాయి. సౌరభగర్భితమగు మందమారుతమువలె సుందరమ్మాళ్ సౌందర్యము మనోహరమై ఉండెను. రోజు కొకరుచొప్పున ఊళ్లో పెద్దపెద్ద గృహస్థులంతా తినుబండారములను కానుకలుగా ఇంజనీరుగారింటికి పంపుతున్నారు. తమ ప్రణయఫలమునుగూర్చి దంపతు లిద్దరూ వెయ్యివిధాల భావికాలగతులను తలపోసుకుంటున్నారు. ఇంక వారంరోజులలో దివానుగారు స్వయంగా వచ్చి కుమార్తెకి సీమంతముజరిగించి ఇంటికి తీసుకెళ్లడానికి నిశ్చయించినట్లు జాబులువచ్చినవి. భార్యతోకూడా వెళ్లాలని వైద్యనాథుడు రెండునెలలు సెలవుపెట్టుకున్నాడు.

గర్భస్థమగు పవిత్రభారముతోకూడ స్త్రీజనసహజమును, సృష్టికారణమును నగు మాతృభావ మామెయందు వృద్ధిపొందినది. మానవసంఘమహాసౌధనిర్మాణమున కొక యమూల్యచంద్రకాంతశిలాఫలకమును కానుకగా సమర్పింపబోవు నెరదాతవలె గర్భవతియగు తన్ను తా చూచుకొని సుందరమ్మాళ్ గర్వము నందినది.

జీవనము సుమధురమై, ఆనందప్రదమై, అనుభవనీయమై కనబడిం దాయువతీమణికి. విశాలప్రపంచములో ఒకమారుమూలకూడా దుఃఖలేశమునకు తావున్నదని ఆమె కప్పుడు స్ఫురించనైనను లేదు.

భవిష్యత్కాలమంతా మధుమాసప్రభాతమువలె తేజోమయమై, కల్యాణప్రదమై తోచి ఆమె తలపులను వికసింపజేసింది.

శోభాయమానమగు వసంతసమయమున నిరవధికానందపారవశ్యమున మధురగీతములను ఆలాపించే కోకిల రాబోయే భయంకర గ్రీష్మముమాట తలుచుకోనైనా తలుచుకోదు. అల్లా తల్చుకునేటట్లే అయితే ప్రపంచకానికి దాని గానమాధుర్యసంపద శాశ్వతంగా కరువై పోవలసిందేకదా!

* * * *

ఆనాడు ఉదయంనుంచి పదిగంటలవరకూ వంచినతల యెత్తకుండా కచేరీపనిలో మునిగిపోయాడు, వైద్యనాథుడు మామగారు వొచ్చేసరికి తీరుబాటుగా ఉండాలని ఆతనికి భార్యసలహా అందినది. నాటిరాత్రికిగాని, మర్నాటి ఉదయానికిగాని దివానుగారు దిగుతారని ముందే కబురువచ్చింది.

గడియారంలో పదిగంటలు విని సుందరమ్మాళ్ కచేరి సావిట్లోకి వచ్చి "పనిలో బడి మమ్మలిని మరిచిపోతే మరిచిపోయారుగాని భోజనాన్ని కూడా మరిచిపోతారేమిటి? ఇంక అసలే ఇంట్లోకి రారుకాబోలు? బాగానే ఉంది" అని వైద్యనాథుణ్ణి అడిగింది.

ఎంత ఆఫీసుపనిలో ఉన్నా గంటకి రెండుసార్లో మూడుసార్లో ఇంట్లోకి వచ్చి సుందరమ్మాళ్‌తో సరసాలాపాలాడి ఒక మధురమందహాసమో, ఒక గాఢాలింగనమో బహుమానంగా పట్టుకుపోవడ మతనికి మామూలు.

వైద్యనాథుడు తలయెత్తి చూశాడు. ప్రకాశమానములగు కళ్లజోళ్లలో నుండిపోయి అతని దృష్టులు సహజపాండురతాశోభితమగు సుందరమ్మాళ్ ముఖముపై నిలిచాయి. "ఇదంతా ఏలినవారి ఆజ్ఞప్రకారం జరుగుతూ ఉన్న పనేనా? మీరు చెప్పినట్లు చేసినా కోపమే అయితే మే మెల్లా బతకడం?" అన్నాడు నవ్వుతూను.

"అల్లాఅయితే యింక ముగించెయ్యవలసిందనే మాఆజ్ఞ."

"సరే ఒక్క పావుగంటలో పూర్తి అయిపోతుంది లెండి.—దానికేంగాని సుందరం నువ్వు ఆజ్ఞాపిస్తూన్నప్పుడు మాత్రం నిజంగా మహారాణీలాగే ఉంటావుసుమా! నువ్వేదో మహారాణివై పుట్టవలసింది"

"మీమాటల కెక్కడికి లెద్దురూ. పొద్దు మించిపోయింది. పావుగంట మాత్రమే సుమండీ టైము. వేగిరం భోజనంచేస్తామనుకుని పొద్దుట కాఫీకూడా సరీగా పుచ్చుకున్నారు కారు బాబూ. చంటిపిల్లాడేనా వింటాడుకాని మీరుమాత్రం చెప్పినమాట వినరు." సుందరమ్మాళ్ ముద్దులుగునుస్తూ లోపలికి వెళ్లిపోయింది.

సరీగా పావుగంటే దాటనిచ్చి సుందరమ్మాళ్ మళ్లా వచ్చి "లేవాలిమరి. లెండి." అని తొందర పెట్టింది.

వైద్యనాథుడు ఫౌంటెన్‌పెన్ టేబిలుమీద పెట్టి కళ్లజోడు పెట్లోఉంచి చేతులు వేళ్లు విరుచుకుంటూ "అబ్బా! తల దిమ్మెక్కిపోయింది. మధ్యాహ్నం మరి పనిలేకుండా చేసేసుకున్నాను." అని ఒళ్లు విరుచుకున్నాడు బద్ధకంతో.

"స్నానంచేస్తే తలభారం తగ్గిపోతుంది రండి. నీళ్లు చల్లారిపోతున్నాయి."

"అబ్బా! ఈవేళ యింట్లో స్నానంచెయ్యను. తలదిమ్మవొదిలేటట్లు గోదావరిలో మునగాలిగాని."

"ఇంత పొద్దెక్కి గోదావరేమిటి? వేణ్ణీళ్లు పోసుకుందురూ. అక్కడ ఈదులాడుతూ ఎంతకీ ఇంటికి రారు."

"అబ్బే! నిముషంలో వొచ్చేస్తాను. నీస్నాన మైందా?"

"మీకు నీళ్లూ అవీ అందించి నేను స్నానంజేద్దామనుకుంటున్నాను."

"అల్లా అయితే నువ్వు స్నానంచేసేయ్. అంతలో నేనూ వచ్చేస్తాను."

"ఖాదరుని తీసుకెళ్లండి. తువ్వాలూ, సబ్బూ పట్టుకొస్తాడు."

సుందరంబుజంమీద తట్టుతూ ప్రేమ తొణుకులాడుతూ ఉన్న నేత్రములతో వైద్యనాథుడు "ఖాద రెందుకూ? సబ్బు తేవడానికా? నీట్లో మునిగిపోకుండా నన్ను కాపాడడానికా? వెర్రిపిల్ల! ఎప్పుడూ నే నేమైపోతానో అన్న బెంగే" అన్నాడు.

సబ్బుపెట్టెను పట్టుకుని, భార్య అందించిన తువ్వాలు పైనివేసుకుని వైద్యనాథుడు రమారమీ పదకొండుగంటలపుడు గోదావరికి వెళ్లిపోయాడు. వీథిమలుపు తిరిగేవరకూ అతనివేపే చూస్తూ, అతడు దృష్టిపథాన్ని దాటినవెంటనే ఒకనిట్టూర్పు విడిచి సుందరమ్మాళ్ "ఎప్పుడూ చెప్పినమాట వినకపోవడమే" అనుకుంటూ లోపలకు పోయింది.

* * * *

పన్నెండుగంటలు దాటి ఒంటిగంటను సమీపిస్తూంది వేళ. సూర్యుడు నడినెత్తిని సహస్రకిరణాలతో జాజ్వల్యమానుడై ఉన్నాడు. ఆకాశము నిర్మేఘమై ప్రశాంతమై ఉంది. జంతుకోట్లన్నీ వృక్షచ్ఛాయలలో విశ్రమిస్తున్నాయి. వాయుచలనము బహుతక్కువ. చెట్లు ఎండతీక్ష్ణత కోడి తలలు వాల్చేశాయి.

ఆఫీసర్ల లైనులో పుట్టిన హాహాకారములు గ్రామమంతటా నిండిపోయాయి. ఊళ్లో ఒకడిముఖాన్నీ రక్తపు చుక్క లేదు. ఆబాలగోపాలమూ అత్యాతురతతో గోదావరివేపుకి పరుగులెత్తుతున్నారు. పదకొండుగంటలపుడు స్నానాని కెళ్లిన వైద్యనాథయ్యరు ఇంకా ఇంటికి చేరలేదు.

భర్త స్నానానికి వెళ్లినతరవాత గంటసేపుదాకా సుందరమ్మాళ్ కనిపెట్టిచూసింది. అప్పటికీ అతడు రాకపోవడంచేత ఆమె గాభరాపడిపోయి ఖాదరుని పంపించింది.

గోదావరీతీరమంతా నిర్మానుష్యము. ఎక్కడా వైద్యనాథుని జాడలేదు. రేవులో ఉన్న మర్రిచెట్టుకింద అతని తువ్వాలూ, సబ్బుపెట్టేమాత్రము ఖాదరుకి కనిపించాయి. రేవుకి రెండువేపులా ఫర్లాంగు దూరంవరకూ పోయి వెతికాడు. యజమానుడు కనబడకపోవడంచేత వాడి మనస్సు పరిపరివిధాల పోతూంది.

ఇంతలో సమీపాన్నే ఏదో చిన్న అలికిడి వినబడింది. పరధ్యానంగా ఉన్న ఖాదరు ఉలికిపడి నలుదిక్కులా చూశాడు. ఒకయిరుకులో నిలబడి నీళ్లుతాగుతూఉన్న లేడిపిల్ల వాణ్ణిచూసి బెదిరి చర్రున పారిపోయింది.

రేవులో కనబడిన తువ్వాలూ, సబ్బుపెట్టే పట్టుకుని ఖాదరు ఇంటి కొచ్చేశాడు. గోదావరివేపు చూస్తూ గుమ్మంలోనే నిలబడి ఉన్న సుందరమ్మాళ్ బంట్రోతు ఒక్కడే రావడం చూసి "అమ్మో" అని అరిచి నేలమీద పడిపోయింది. తన భయమంతా నిజమైపోయిందని ఆమె గ్రహించేసింది. మహాబాధలో ఉన్న పసరములాగు ఆమె హృదయవిదారణంగా మూలుగుతూంది.

బంట్రోతులూ, వంటలక్కా మొదలైనవా రందరూ చుట్టూ చేరి భయార్తులై కేకవేశారు. ఖాదరు చెప్పినమాటలు విని అక్కడ చేరినవాళ్లంతా గాలాలూ,వలలూ తీసుకొచ్చి గోదావరిలో వెతకడం ప్రారంభించారు. పేరుపొందిన ఈతగాళ్లు నీట్లోమునిగి గాలించేశారు. సాయంకాలం అయిదుగంటలు దాటినతరవాత నీటిఅడుగున బురదలో కూరుకునిపోయిన వైద్యనాథయ్యరుమృతశరీరమును జాలరులు పైటికి తీసి ఒడ్డున పడేశారు.

*  *  *  *

సుందరమ్మాళ్ జీవితపథము భయంకరకంటకావృత మైపోయింది. పట్టపగలే ప్రపంచమంతా అంధకారబంధుర మైపోయినది. కారుమేఘాలు కమ్ముకుని ఆమెజీవితాకాశమున తీవ్రగర్జనలు చేశాయి. నిరాశ విజృంభించి ఆమెయెదుట వికటనృత్యము చేస్తూంది. ఆమెకీ ప్రపంచానికీ ఉన్న సంబంధాలను కాలపురుషుడు దారుణ కృపాణముతో ఒక్కత్రుటిలో ఛేదించేశాడు; గిలగిల గింజుకుంటూ ఉన్న ఆమెను చూసి నవ్వుకుంటున్నాడు; ఆమె యేడుస్తూఉన్న రక్తధారలతో నాలుకను తడుపుకుంటున్నాడు. ఇట్టివిషయాలు నిత్యకృత్యము లైపోయినవాని కాఅమాయకురాలి హృదయగోదనము చూస్తేమాత్రం జాలి ఎక్కడిది?

ఆశాసౌధము నేల కూలిపోయినది. మనోహరారణ్యసీమల అమృతోపమములగు లేతపచ్చికదళముల నారగిస్తూ ఉన్న హరిణికి కఠోరబాణఘాతము తగిలినది. గుక్క తిప్పుకోలేక గిలగిల కొట్టుకుని అలిసిపోయి అది నేలపడిపోయింది.

౫

తండ్రితో పుట్టినింటికి వెళ్లడానికి సుందరమ్మాళ్ నిరాకరించేసింది. సుఖప్రసవ మగునంతవరకును వలసిన సౌకర్యములు సమకూర్చి దివానుగారు వస్తూపోతూ ఉండేవారు. ఉద్యోగస్థుల భార్యలందరూ వెయ్యికళ్లతో ఆమెను కాపాడుకుంటూఉండేవారు.

భర్త చనిపోయిన రెండుమాసాలకు సుందరమ్మాళ్ మగశిశువును ప్రసవించింది. అప్పుడైనా తండ్రియింటికి పోవడాని కామె ఇష్టపడలేదు. కుమార్తె కేబాధా రాకుండా తల్లి బహుజాగరూకతతో చూస్తూ ఉండేది.

భర్తతో తాను గడిపిన సౌఖ్యప్రదనాలను తలుచుకొని సుందరమ్మాళ్ సంతతధారగా కన్నీరు కారుస్తూ ఉండేది. అట్టి సుఖజీవన మెన్నటికీ రాదుకదాఅనే నిరాశతో ఆమె వేడినిట్టూర్పులను విడిచేది. ఆమెముఖములో చిరునవ్వే పోయింది. చనిపోయిననాడు వైద్యనాథుడు గౌతమీతీరమునకు పోయినదిక్కు చూస్తూ వసారాస్తంభానికి చేరబడి నాటివలెనే నిలబడి గంటలకొద్దీ నిలబడేది. తిరిగీ భర్త ఆదారినే వస్తాడనికాబోలు ఆఅమాయకురాలి అభిప్రాయము!

పిల్లవాడు మూడుమాసములవా డైనాడు. దినదినప్రవర్థమానుడగు బాలుని చూసుకుని సుందరమ్మాళ్ పొంగిపోతూఉన్న దుఃఖంతో కుమిలిపోయేది. కుమారుని ముఖంలో భర్తప్రతిబింబము స్పష్టంగా కనబడి ఆమెవిషాదమును ద్విగుణీకృతం చేసేసేది. గతించిన ఆనందమయప్రపంచ మామెతలపున నిల్చి హృదయములు చీల్చేసేది. మధురమందహాసపరిశోభితమగు కొడుకుముఖంసహితము ఆమెవిషాదమున కుపశాంతిని కలిగించలేకపోయేది.

సుందరమ్మాళ్ క్రమంగా క్షీణించిపోయింది. నానాటి కామె శరీరము శల్యావశిష్ట మైపోయినది. ఆమెఆరోగ్యము జననీజనకుల కత్యాతురతను కలిగించింది.

ఈస్థితిలోకూడా ఆమె దుమ్ముగూడెమును విడుచుటకు నిరాకరించేసింది. ఆమెప్రవర్తనకు కారణ మెవ్వరికీ బోధపడలేదు.

శిశువున కైదోమాసము ప్రవేశించి పదిరోజు లయింది. నాటిరాత్రి శుక్లపక్షత్రయోదశీచంద్రుడు వినిర్మలాంబరమున ప్రశస్త కాంతులతో ప్రకాశిస్తున్నాడు. చలి విపరీతంగా వేస్తూంది. ఆఫీసర్ల లైనంతా గాఢసుషుప్తిలో మునిగిఉంది. ఒంటిగంట దాటిపోయింది. వాయుసంచలనము బొత్తిగా లేదు. ప్రకృతి అంతా జీవరహిత మైపోయినట్లు నిశ్శబ్దము సర్వత్రా తాండవిస్తూంది.

వైద్యనాథయ్యరు నివసించే బంగాళా దక్షిణవేపు గదితలుపులు మెల్లగా తెరుచుకున్నాయి. ఇంట్లోనించి ఒకవ్యక్తి నెమ్మదిగా నడుస్తూ పూలతోటలో ప్రవేశించింది. ఆపాదమస్తకమూ ధవళవస్త్రాచ్ఛాదితయై ఉంది. ముఖలక్షణాలు గ్రహించడానికేనా అవకాశం లేదు. వెన్నెలతోటలో నిశీథమున నిశ్శబ్ద సమయమున ఏకాకియై సంచరిస్తూఉన్న ఆవ్యక్తి అమానుషమై భయము గొల్పుతూంది.

ఆవరణగేటును సమీపించిం దావ్యక్తి. నడకనుబట్టి స్త్రీ అని అనుకోవచ్చును. వెనకకి తిరిగి గేటునకు బిగించిఉన్న ఇనపగజాలపై



"...బంగాళావేపు తదేకధ్యానంగా చూస్తూ...నిలబడింది."

శరీరమును ఆనుకుని బంగాళావేపు తదేకధ్యానంగా చూస్తూ అయిదు నిముషాలల్లే నిలబడింది. శల్యావశిష్టమైన హస్త మొకటి ఇనపగజాలపైని వెన్నెలలో సుద్దపేలికవలె వేలాడుతూంది.

అయిదు నిముషాలు దాటింది. అంతటా భయంకర నిశ్శబ్దము. భూమి ఫాలతలమును సోకేటట్లుగా వంగి శుష్కహస్తములతో నేలను మూడుసార్లు కళ్లకు అద్దుకున్నది. హృదయవిదారకమై దుర్భర బాధాసూచకమైన ఒక నిట్టూర్పు బయలువెడలి తన వేడిమితో ఆవరణమునంతను నింపేసింది.

మళ్లీ గోడ కానుకుని బంగాళావేపు చూస్తూ కొంతసేపు నిలుచుంది ఆవ్యక్తి. ఇంతలో సమీపమందున్న మహావృక్షములనుండి ఒక నక్తంచరపక్షి కర్ణకఠోరముగా కూసింది. ఆఅరపుతో అక్కడి వాతావరణమంతా మారుమ్రోగిపోయింది. ఒక్కసారిగా ఉలికిపడి వెనకకి చూసిం దామె. 'అమ్మా' అని భయంకరవేదనాసూచకమగు హీనస్వరము వినబడింది. తక్షణమే గేటుతెరుచుకుని మందగతిని నడుస్తూ ఆవరణ కవతలనున్న నిబిడవృక్షచ్ఛాయలలో బడి అదృశ్యమైపోయిం దావ్యక్తి.

*　　*　　*　　*

సుందరమ్మాళ్ రాత్రి కప్పుకున్న కాశ్మీరశాలువయును, దాని మడతలలో ఉన్న ఒకఉత్తరమూమాత్రము గోదావరీతీరాన్ని రేవులో కనిపించాయి. ఉదయం ఎంతప్రయత్నించినా ఆమెజాడ దొరకలేదు. సాయంకాల మైదుగంటలకిమాత్ర మామెశరీరము గోదావరీనదీ జలములపైని తేలిపోయినది.

నదిఒడ్డున దొరికిన జాబు సుందరమ్మాళ్ తల్లి పేర వ్రాయబడి ఉండెను. మరణోన్ముఖురాలై తన మనోనిశ్చయమునకు గల కారణము నామె ఆజాబులో తల్లికి స్పష్టపరిచినది. ఉత్తరము సుందరమ్మాళ్ స్వదస్తూరిలో ఈక్రిందివిధంగా ఉంది.—

"అమ్మా! నమస్కారములు.

"ఇంక నే నీలోకాన్ని విడిచిపెట్టడానికి ఎంతోవ్యవధి లేదు. ఆఖరుమాటగా కన్నతల్లివైన నీకు నాహృదయాన్ని నివేదించడం నా విధిగా భావించి ఈచిన్నజాబు నీకు రాస్తున్నాను.

"అమ్మా! నీరుణం నే నెల్లా తీర్చుకోగలను! చిన్నప్పటినుంచీ నీఅమృతహస్తాలలో విచారమన్న దేమిటో తెలియకుండా పెరిగాను. ప్రపంచమంతా అంధకారమయమై పోయిన ఈరోజుల్లోకూడా ఆ అమృతహస్తములే నాకు దిక్కైనవి. ఆనీపవిత్రహస్తములకు నమస్కారము లొనరించుటతప్ప ఈస్థితిలో నే చేయగల దేమున్నది? ఎటువంటి భయంకరకష్టములైనా నీప్రేమమయవదనమును చూడగానే కొంతవరకు మరిచిపోయేదాన్ని. ఆముఖాన్ని చూడ్డానికి నాకిదే ఆఖరుసారిఅని అనుకున్నప్పుడల్లా నాహృదయం నీరై పోతూంది.

"మీఅల్లుడు మనలను విడిచిపెట్టిననాడే నే నీనిశ్చయము చేసుకున్నాను. ఎన్నడూ ఒకరినొకరు ఒదిలిపెట్టిఉండకూడదని మాలో మా కొకనియమము ఉన్నది. నావిషయంలో ఆయన ఎన్నడూ ఆడినమాట తప్పలేదు. మానియమభంగము కాకుండా నే నారోజుననే ఆయనతోనే పోవలసిఉండెను. ఇంతకాలమూ నే నిక్కడఉండిపోయినందుకు ఆయనకి నామీద కోపంకూడా వస్తుందని నే నెరుగుదును.

"కాని నాయీకాలహరణానికి తగిన కారణము లేకపోలేదు. ఈసమాధానం చెబితే ఆయనేనా నన్ను క్షమిస్తారనే నా నమ్మకము. గర్భస్థమైన పవిత్రజీవమును ప్రపంచకములోకి తేవలసిన భారము ఒకటి నామీద ఉండెను. భగవంతుని దృష్టిలో ద్రోహినవకుండా

నే నావిధిని త్రోసిపుచ్చలేనని అప్పుడు నేను నిశ్చయించుకున్నాను. మాఇద్దరి నిర్మలప్రేమకు చిహ్నముగా మాప్రతిబింబమగు ఈచిన్న బాలుని ఈలోకంలో విడిచిపెట్టి నే నిప్పుడు నిర్విచారంగా నాకోసము ఆతురతతో నిరీక్షిస్తూఉండే మీఅల్లునిదగ్గరకి పోతున్నాను.

"అమ్మా! అమాయకుడై, నిష్కల్మషమందహాసపరిశోభితుడైన పిల్లవాణ్ణి తలుచుకుంటేమాత్రం నాకడుపు చెరువైపోతుంది. వాడు నవ్వినప్పుడల్లా "అదుగో మాశాస్త్రా? అంతా వైద్యనాథుడి మూడు మూర్తులూను" అని నువ్వు నాతో ఎన్నిసార్లో అనేదానివి. అమ్మా! అప్పుడు నాగుండె ఎల్లా కొట్టుకుపోయేదో నీకు తెలియదు. అల్లాంటప్పుడు నాతలచుట్టూ ప్రపంచం యావత్తూ గిర్రున తిరిగిపోతూన్నట్లయేది. హృదయంలో ఎవరో చెయ్యిపెట్టి కలచేస్తున్నట్లు తోచేది.

"గర్భవతినైన సంగతి తెలిసినవెంటనే "పిల్లవాడైతే నాపోలికా, పిల్లఅయితే నీపోలికాను" అనేవారు మీఅల్లుడు. తనపోలికగల పిల్లవాణ్ని ఎత్తుకుని ముద్దులాడుతూ ఉండగా మీఅల్లుణ్ని చూసుకోడానికి నాకళ్లు నోచుకోలేదు.

"నాకు మారుగా మాప్రతిబింబమగు ఈపిల్లవాణ్ని రక్షించమని నేను నిన్ను వేరే ప్రార్థించ నక్కరలేదు. కాని స్త్రీజన సహజమగు పుత్రప్రేమచేత నాఅంత్య ప్రార్థనగా ఈశిశువును పోషించమని నిన్ను మరీమరీ వేడుకుంటున్నాను. వాణ్ణి తలుచుకున్నకొద్దీ నాకు మతిపోతుంది. నానిశ్చయము పట్టుసడలిపోతుంది. మానియమభంగమైపోతుందనే భయం కలుగుతో ఉంటుంది. కనుక ఇంక నామనస్సును కట్టిపెట్టేసుకుని ఆవిషయం వదిలిపెట్టేస్తున్నాను. అమ్మా! అమ్మా! కడుపులో ఏదో మంట...

"అమ్మా! నాభర్తను చేరుకోవాలనే స్వార్థపరత్వబుద్ధిచేత నీకు దుఃఖం కలిగిస్తున్నాను. నిర్భాగ్యురాలను, నీకడుపున పుట్టి నిన్ను సుఖపెట్టలేకపోవడం సరికదా గర్భశోకముకూడా నీకు తెచ్చిపెడుతున్నాను. అశ్రుధారాపూరితమై, దుర్భర పుత్రికా శోకదంశ్యమానమైన నీమ్లానవదనము ఇప్పుడే నాదృష్టియెదుట తోచి నాబాధను ఇనుమడింప చేస్తూంది. అమ్మా! క్షమించు. పాపాత్మురాలను, క్షమించు – నన్ను మరిచిపో. అదుగో గౌతమీమహానది సహస్రహస్తాలతో నన్ను ఆహ్వానిస్తూంది.

"తల్లీ! గౌతమీ! యశోవిభ్రాజితములగు మహాసామ్రాజ్యములు లెక్కలేనన్ని నీపవిత్రగర్భమున లీనమైపోయాయి. దగంత విశ్రాంతకీర్తులగు చక్రవర్తులు, ప్రఖ్యాతరాజనీతివిశారదులగు మంత్రిసత్తములు, అసమానప్రజ్ఞానిధులగు కవీంద్రులు, అతిరథ మహారథులగు వీరోత్తంసులు నీతీరమందు జన్మించి నీయందే అంతరించారు. నీపుణ్యతరంగము లనుక్షణమును ముక్తకంఠములతో వారి నిర్మలకీర్తిని గానముచేస్తూఉంటాయి. అందుచేత నేనుకూడా నీపాదారవిందములనే శరణముకోరుకొన్నాను. నీయందు ప్రాణములను కోలుపోయిన ధన్యుల కందరాని స్వర్గసౌఖ్యములు లేవని శ్రుతిస్మృతులు ఘోషిస్తున్నాయి.

"జననీ! గౌతమీ! మందభాగ్యురాలను. నాకు నీచల్లని కడుపులో ఒక్కింత తావిచ్చి రక్షించు. నీదివ్యతరంగహస్తములతో నన్ను నాభర్తను చేర్చుమని హస్తములు మోడ్చి ప్రార్థిస్తున్నాను. అనుగ్రహించు.

"అమ్మా! ఇంక మీసంగతి ఆలోచించుకున్నకొద్దీ దుఃఖం పొర్లిపోతూవస్తుంది. నన్ను తలుచుకుని ఎంతఏడుస్తావోకదా అని నాహృదయము ఉడుకెత్తిపోతూంది. నాగురించి ఏడవకు. అంధకారభరితమైపోయిన యీలోకాన్ని విడిచి వేరొకలోకంలో నీకుమాత్రె సౌఖ్యముపొందుతుం దనుకుని ఊరడిల్లి ఉండమని నా అంత్యప్రార్థన. నన్ను మన్నాటికి క్షమిస్తావనే నమ్ముతున్నాను. సెలవు. ద్రోహిని. క్షమించు...

"విధేయురాలు

"సుందరమ్మాళ్."

*　　*　　*　　*

ఉద్యోగనిర్వహణార్థము తమ గ్రామానికి వచ్చి, అందరికినీ గౌరవనీయులై మెలగి, అతిపవిత్రప్రణయసూత్రనిబద్ధులై తాము చూస్తూండగానే, తమకళ్లయెదుటనే అంతరించిపోయిన ఆపుణ్యదంపతులను దుమ్మగూడెమునివాసులు నేటికీ సంస్మరించుకుని ధన్యులౌతూఉంటారు. గ్రామస్థులును, ఆఫీసర్లును కలిసి ఆయువతీయువకుల గౌరవార్థము గోదావరీతీరమున ఒకచలువరాతిమంటపమును నిర్మించి కృతార్థులైనారు.

సర్వకాలసర్వావస్థలయందును గౌతమీవినిర్మలతరంగమాలికలు ఆమంటపమును ప్రేమతో ముద్దులాడుతూఉంటాయి. స్ఫటికశిలావినిర్మితమై, చిన్నదైనను సుందరమై మార్గస్థుల భక్తిగౌరవములకు గురియై ఆమంటపము నేటికీ అక్కడ నిల్చిఉన్నది.

# కులమా? ప్రేమా?

యల్లాప్రగడ సీతాకుమారిగారు

౧

మిర్జాను చూస్తే నాకు మొదటినుంచీ చాలా ఆదరం. నిరాడంబరమైన అతని మాటలు, వేషము అంటే నాకు చాలా ఇష్టం. ఏవిషయాన్ని గురించి మాట్లాడుతున్నా అతను, భావపూరితంగా ఉండేదికాని ఉత్త చెత్తగా ఉండేదికాదు. మహమ్మదీన్సులో సాధారణంగా కనుపించే అహంత్వం, బడాయి మిర్జావద్ద కనుపించేవికావు. అన్నిటికంటె ముఖ్యవిషయమేమిటంటే మిర్జా శాకాహారి. మాఇద్దరికి ఎమ్. యస్. సి. లాస్ట్ ఇయరిప్పుడు. మిర్జాకు నాకంటె రెండే క్లైక్కువుంటా యనుకుంటాను. సాయంకాలమప్పుడు మే మిద్దరం కలిసే ఏగార్డెన్‌లోకన్నా వెళ్లి చదువుకుంటుండేవాళ్లం.

ఆదివారం ఇవ్వాళ. నాన్నగారికి కోర్టులేదు. గదిలో పడుకొని నిద్రపోతున్నారు. నేను హాల్లో ఈజీ చైరులో పడుకొని కెమిస్ట్రీబుక్కేదో చూచుకుంటున్నాను. కొద్దిగా తలనొప్పిగా ఉంది. పుస్తకం కుర్చీ చేతిమీద పెట్టి ఏదో ఆలోచిస్తూ పడుకున్నాను. 'శంపా' అని లోపలినుండి మాఅమ్మ పిలిచింది.

"ఓవల్‌టీను అక్కడికి తీసుకురానా? లోపలికి వస్తావా?"

"లోపలికి వస్తాలే. నాన్నగారు లేచారా?" అంటూ లేచి వెళ్లాను లోపలికి.

నాన్నగారు బారిష్టరుపరీక్షకు ఇంగ్లండు వెళ్లి వచ్చారు గనుక సివిలిజేషన్ కేమీ తక్కువ ఉండదు, ఇంట్లో. అయినప్పటికి రెలిజన్‌అంటే చాలా పట్టుదల వారికి. హిందూమతంలో కొన్నిలోపా లున్నాయని ఒప్పుకొనకమానరుకాని ఆ చిన్న లోపాలను సంస్కరించివేస్తే హిందూమతమంత గొప్పమత ముండదని తరచుగా అంటూఉంటారు. దానికి తగినట్లే అమ్మకూడ మరీ ప్రాచీనకాలపు మనిషికాదు. ఆమెకు ఇంగ్లీషు బాగా రాకపోయినా తెలుగు బాగా చదువుకుంది. తెలుగులైబ్రరీ అంతా రెండుసార్లు తిరగవేసింది. వివిధదేశమతాలనూ, రాజకీయాలనూ, ఆర్థికాలనూగురించి చాలాపుస్తకాలు చదివింది. సైన్సుకూడ చాలాభాగం తెలుసు. కనుకనే నాన్నగారికి, ఆమెకు భావాల్లో ఏమీ భేదంలేక సంసారం ప్రశాంతంగా జరిగిపోతూఉంటుంది. స్త్రీస్వాతంత్ర్యంవిషయంలో తరచుగా తర్కవితర్కాలు జరుగుతూఉంటయి. మగవాళ్లు ఎంత మంచివాళ్లయినా స్త్రీలకు ప్రత్యేకపు టాస్తి ఏమీ లేకపోతే పూర్తిగా స్వాతంత్ర్యం ఉండదని అమ్మ తరచుగా అంటూ ఉంటుంది. ఆడవాళ్లలో బ్రహ్మచారిణులుగా చాలామంది ఉండాలని అమ్మకు ఇష్టం. ఐతే నాన్నగారికి బ్రహ్మచర్యం అంటే ఇష్టంలేదు. ఆడవాళ్లకే నిగ్రహశక్తి, సహనం ఎక్కువఅని ఆమెవాదం. ఈలాటి తర్కాలతోటే మాఇంట్లో ఆనందంగా గడిచిపోతూఉంటుంది.

డైనింగు టేబిలువద్ద నాన్నగారు కనిపెట్టుకొని కూర్చున్నారు. నేనుకూడ ఒకకుర్చీ దగ్గిరకు లాక్కొని కూర్చున్నాను. "ఫాల్గుణమాసంలోనే ఇంత ఎండలు మండిపోతున్నాయి" అంటూ అమ్మ కొన్ని బిస్కట్సుఓట్సు



1. ఉప్పుటూరి పున్నయ్యగారు; 2. గుంటూరునగరపుపాలెములోని వైశ్యవిద్యార్థి వసతిగృహము;
3. గుంటూరు అరండల్ పేటలోని దేవాలయము.







1. కీ. శే. మహాత్మా, శ్రీ శేషాద్రిస్వామిగారు, తిరువణ్ణామలై; 2. తిరువణ్ణామలై ఆశ్రమ మూలస్థానమునగల మూర్తి;
3. పరబ్రహ్మానందాశ్రమము, బ్రహ్మవిద్యాసదానిలయము, తిరువణ్ణామలై.

ఉన్న ప్లేటు బల్లమీద పెట్టి ఇంకొక కుర్చీలో కూర్చున్నది. మే మిద్దరం చేరి ఒక బిస్కట్టూ తీసికొని తింటున్నాం. ఓవల్‌టీనులో ఐస్ వేసి ముగ్గురికి మూడుకప్పులు బల్ల మీద పెట్టింది, అమ్మ.

వాకిట్లో సైకిల్ బెల్ మ్రోగింది. "మిస్ శంపాలత ఉన్నదా, ఇంట్లో?"—ఆధ్వని నాకు చిరపరిచితమే. "హల్లో, మిస్టరు మీర్జా" అంటూ లేచాను, చీర కుచ్చిళ్లు కాళ్లకింద పడుతూ. "ఎవ రమ్మడూ అతను?" అన్నారు నాన్నగారు. "నాక్లాస్ మేటండీ, డాక్టరు ఉస్మాన్‌జాగారి కొడుకు". "ఉస్మాన్‌జాగారి అబ్బాయా, రమ్మను లోపలికి." ఉస్మాన్‌జాగారికి. నాన్నగారికి ఎక్కువ పరిచయం లేదుగాని ఇద్దరు కార్పొరేషన్ మెంబర్లే అవటంచేత ఎరుకమాత్ర మున్నది. నేనువెళ్లి మీర్జాను లోపలికి తీసుకువచ్చాను. అమ్మ ఇంకొకకప్పులో ఓవల్ టీను వేసి కలిపింది. మాయింట్లో ఇంతసోషల్‌గా ఉండడం చూచి మీర్జా చాలా సంతోషించాడు అందరము ఓట్సుతినడం మొదలుపెట్టాం.



"ఇవ్వాళ టాకీలో మంచి ఫిలుం ఉందిటే-అన్నాడు మీర్జా ఓవల్ టీని తీసుకుంటూ"

"ఇవ్వాళ టాకీలో చాలామంచి ఫిలుం ఉందిటే" అన్నాడు మీర్జా, ఓవల్‌టీను తీసుకుంటూ.

"వెళ్లుతావా ఏమిటి?"

"నీవుకూడా వస్తావా?"

"బాగా ఉంటే మా అమ్మనుకూడ తీసుకు వస్తాను."

అమ్మ తల ఎగురవేసింది. నాన్నగారు ఏమీ మాట్లాడలేదు. తరువాత కాలేజీలో సంగతులు చాలా మాట్లాడుకున్నాం, ఇంగ్లీషులో. నాన్నగారు సరదాగా వింటూ ఉన్నారు. అమ్మ మీర్జావైపు, నావైపు చూస్తూ ఓవల్‌టీను త్రాగడం ముగించింది. అందరం లేచాం. మీర్జాను పంపడానికి నేనుకూడ వాకిట్లోకి వెళ్లుతూ ఉన్నాను. "తురకవాళ్ల పిల్లవాడా ఏమిటి ఇతను?" వెనుక వినపడ్డది, అమ్మ అంటుంటే. "లేకపోతే శంపా, ఇతనూ ఈడూజోడూను." నాన్నగారేమీ అన్నట్టు లేదు.

౨

ఆరింటికల్లా వచ్చాడు మీర్జా, ఫుల్ ఖాదీడ్రెస్‌లోనే. అసలు వాళ్లకుటుంబమంతా మావలెనే ఎక్కువ ఖాదీనే వాడుతారు. నేను, అమ్మకూడ ఖద్దరు చీరలే కట్టుకున్నాం. ముగ్గురం బయలుదేరాం కారులో.

టాకీస్‌అంటే సినిమాలంత విసుగుపుట్టలేదు గనుక మనవాళ్లకి, చాలాభాగం హాలంతా నిండే ఉంది. మేము వెళ్లి రిజర్వ్‌డ్ బాక్సులో కూర్చున్నాము. కథ "లవ్ ఆఫ్ ఇంగ్లండు". అమ్మకు వాళ్ల ఆడవాళ్ల స్వాతంత్ర్యం చూస్తే చాలా సంతోషం. ఆమెకు తెలియనప్పుడల్లా కథ నేను చెప్పుతుండేదాన్ని. మిస్ జోసఫ్ సందర్భానుసారంగా చూపిన ధైర్యం, సాహసం, నటనాకౌశలం చూచి అమ్మ చాలా ముగ్ధురా లయిపోయింది. జానిస్ క్షణానికి ఒకణ్ణి ప్రేమిస్తూ కొద్దిరోజుల్లోనే వదలి వెయ్యడం, మళ్లీ ఇంకోణ్ణి ప్రేమించడం చూచి చాలా విసుక్కున్నది. మొత్తంమీద యాక్టర్సంతా బాగానే

ఉన్నారు. కథ చాలా పెద్దది. పదకొండు రీల్సు ఉన్నాయి. ఆట పూర్తి అయ్యేటప్పటికి తొమ్మిదిన్నర అయింది...

కారు చప్పుడు విని నాన్నగారు బయటకు వచ్చి, "ఇంతసేపున్నారేం? దోవలో ఎక్కడన్నా కారు చెడిపోయిందాఏమి?" అన్నారు. "లేదండీ చాలా పెద్దఫిలుం" అంటూ మీర్జా కిందికి దిగాడు. "అంతేకదా" అన్నారు చిరునవ్వుతో, నాన్నగారు. "చాలా ప్రొద్దుపోయింది. పోనీ, ఈపూట కిక్కడ భోంచేసి వెళ్లు."

మీర్జా తెలుగు బాగామాట్లాడగలడు. "ఎందుకులెండి, త్వరలోనేవెళ్లగలను, బైసికులుమీద" అన్నాడు. నేనుకూడ దగ్గిరకువెళ్లి "ఉండరాదూ? సరదాగా అందరం భోంచేద్దాం." అన్నాను. నాన్నగారుకూడ ప్రెస్ చేశారు. చివరకు మాట తీసివేయలేకపోయినాడు, మీర్జా. ఆపూట కందరం కలిసి భోంచేశాము. తరువాత నాన్నగారు డ్రైవరును పిలచి మీర్జాను కారులో ఇంటివద్ద విడచిరమ్మని చెప్పారు.

## 3

బెడ్ రూములోకి వెళ్లి పడుకున్నాను. కాని వేళ తప్పిపోవటంవల్ల వెంటనే నిద్రపట్టలేదు. చాలాసేపటి వరకు సినిమాలో సంగతులే ఆలోచిస్తూ పడుకున్నాను. ఎప్పుడో నాకు తెలియకుండానే నిద్రపట్టింది. కాని గాఢమైన నిద్రకాదు. కలతగా ఉంది. అందులో ఒక గమ్మత్తయిన కల.—

చాలావేగంగా పోతున్నది ఎయిరోప్లేన్. అందులో నేను, మీర్జా ఇద్దరమే ఉన్నాం. నడిపేవాడెవ్వడుకూడా లేడు. కాని మా ఇద్దరిలో నెవ్వరమూ నడపడం లేదు. కొంతసేపటికి దానంతట అదే ఒకచోట ఆగింది. ఇద్దరం కిందికి దిగిచూచాం. అది ఒక కొండల మీది వనప్రదేశం. చాలా ఎత్తుగా ఉన్న కొండ శిఖరాలు—సాయంకాలపు సూర్యకిరణాలు పడి మెరుస్తూ ఉన్నాయి. విశాలమైన పచ్చికబయళ్లలో గడ్డిపూలు మృదువైన వాసనకొట్టుతూ ఉన్నయి. దణదణమని శబ్దంచేస్తూ సన్నని పిల్లకాలువలు గులకరాళ్ల మీద తాచుపాముల్లాగ పరుగెత్తుతున్నాయి. ఎటువైపు చూచినా స్వాభావికమైన ప్రకృతిసౌందర్యం ముంచివేసింది మమ్మల్ని.

నేను ఒక్కసారి అదంతా చుట్టివచ్చాను. అంతటితో చాలా అలసిపోయినాను. వెంటనే అక్కడనున్న ఒక కొండరాతిమీద కూర్చున్నాను. ఇదంతా ఎప్పుడూ చూడని తమాషాకొత్తచోటే. బహుశా కైలాసపర్వతమేమో అన్న ఊహ తోచింది. వెనుకనుంచి మీర్జా వచ్చి తన రెండుచేతులతో నామెడ చుట్టివేసి "శంపా" అని తనవైపుకు తిప్పుకుని నానుదురుమీద ముద్దుపెట్టుకున్నాడు. నాకు కొంచెము సంకోచము వేసింది. మీర్జాను అవతలకు నెట్టివేయవలె ననుకొన్నాను. కాని చెప్పడానికి వీల్లేని ఒక శక్తిలాంటి దేదో నన్ను అతనిలోకి నెట్టుతున్నట్టనిపించింది. సంకోచిస్తూనే నేనుగూడా ఆగుండని మృదువైన చేతుల్ని గట్టిగా పట్టుకొని, ఆపలుచగానున్నగా నుండే చెంపమీద ఒక చిన్నముద్దు పెట్టుకొన్నాను. "చూడు, శంపా, ఇటు చూడు. అలా సంకోచిస్తావేం? ఎన్నాళ్లనించో నీవు నాదాని వైపోవాలని విపరీతమైన ఆశపెట్టుకొనిఉన్నాను. నీకు, నాకు మధ్య ఏడు సముద్రాలు వచ్చినా గడిచేసి నిన్ను నాదాన్నిగా చేసుకోగలను. అట్లాంటిది మతమా వచ్చేది అడ్డం?" అన్నాడు. ఆమెరిసేపెద్దకోలకండ్లల్లో నీళ్లు తిరుగుతున్నట్లనిపించింది. నాకు ఎలా మాట్లాడాలో తెలీలేదు. ఇంకా గట్టిగా మీర్జాను గుండెల్లో అదుముకున్నాను. నాకు చైతన్యం లేనట్టనిపించింది. మీర్జాలో విలీనమైపోయినాను.—

కిటికీలోనుంచి వానజల్లు వచ్చి పడుతున్నది. ఉలికిపడి లేచాను. బయట దణదణమని వాన కురుస్తున్నది. తటాలున కిటికీతలుపులు మూసివేసి కండ్లు నులుము కుంటూ పక్కమీద కూర్చున్నాను. ఇంతవరకూ జరిగిందంతా కలని తెలుసుకునేటప్పటికి నా కెట్లాగో అనిపిం

చింది. కొంచెం మంచినీళ్లు తాగి, దీపం కొద్దిగా ఎక్కించి మళ్లీ పరుపుమీద పడుకున్నాను కలంతా రికలెక్షన్ చేసుకుంటే మళ్లీ ఆకల పూర్తయితే బాగుండు ననిపించింది. కళ్లు మూసుకొని పడుకున్నాను. కల మళ్లీ రాలేదుగాని కొద్దిసేపట్లోనే మంచినిద్ర పట్టిపోయింది.

౬

మీర్జాసైకిలు మాఇంట్లోనే ఉందికాదూ! పదింటికల్లా వచ్చాడు. నేను అంతా తయారయి అతనికోసమే చూస్తూఉన్నాను. "మిస్‌శంపా" అని పిలిచాడు వాకిట్లోనుంచి. స్లాంట్‌వాయిస్‌లాగా సోకింది ఆధ్వని నాకు. చరచర వాకిట్లోకి వెళ్లి షేక్‌హాండు ఇచ్చి లోపలికి తీసుకువచ్చాను. మీర్జాను చూస్తే రోజూలాగా లేదు, ఇవ్వాళ. షేక్‌హాండ్ ఇచ్చేటప్పుడు రాత్రి కల్లో ఆచేతిని గుండెల్లో అదుముకున్న సంగతి జ్ఞాపకానికి వచ్చి చెయ్యంతా కంపించిపోయింది. హృదయంకూడ కలవరపడిపోయింది. ఆమనస్సంక్షోభం ముఖంమీదకూడ ప్రతిఫలించిందికాబోలు, మీర్జా నాముఖంవేపుకి తేరిపార చూచి "అదేమి, శంపా, ముఖమంతా అట్లా వాడిపోయిందేం?" అని అడిగాడు. అతని కీగొడవంతా ఏంతెలుసు, పాపం! నేను సరియైన సమాధాన మేమీ చెప్పలేదు. ఏదో మాటల్లో త్రోసివేశాను. ఇంతలో డ్రైవరు కారు తీసుకువచ్చాడు. "ఈపూటకి కారులో పోదాంలే, రా, ఇద్దరమూను. సాయంకాలం తీసుకుపోదువుగాని నీబైక్." మీర్జా సరేనన్నాడు.

మమ్మల్ని దింపివచ్చి నాన్నగారిని కోర్టుకు తీసికెళ్లాలిగనుక చాలా స్పీడుగా పోతున్నది మోటరు. అంత కంపు స్వైరగా [illegible] విచేస్తున్న నాహృదయం. కారులోని నవప్రదేశమంతా ఒకసారి చుట్టివచ్చింది. "శంపా" అని నాముఖందగ్గిర ముఖం చేర్చేటప్పుడు మీర్జాముఖం ప్రేమావేశంచేత గులాబీరం గెక్కి ఎంతమనోహరంగా కనుపించిందో తలుచుకునేటప్పటికి సంభ్రమంతో నిండిపోయినాను. ఇప్పుడుకూడ అట్లాగే ఉందా అతనిముఖం? తలఎత్తి చూచాను, అతనివైపు. ఆమెరిసేకండ్లు విశాలంగా తెరిచి గంభీరంగా ఏమిటో ఆలోచిస్తున్నాడు.

"మీర్జా" పిలిచాను. "ఏం" అన్నాడు, నావైపు తిరిగి. ఎందుకు పిలిచానో నాకే తేలేదు. కాని ఏదోచెప్పాలెగా. "ఏమిటి ఆలోచిస్తున్నావు?"

"నేనా? నీ వింతసేపు మాట్లాడకుండా ఏమి ఆలోచిస్తున్నావోనని అనుకుంటున్నా." అన్నాడు మీర్జా. నాకు నవ్వు వచ్చింది. "రాత్రి నీవు చేసిన గమ్మత్తును ఆలోచిస్తున్నాను" అన్నాను నవ్వుతూనే. మీర్జా తెల్లబోయినాడు—"గమ్మత్తుచేశానా రాత్రి నేను? ఏమిగమ్మత్తు?" అని అడిగాడు. "కాలేజీదగ్గిరకు వచ్చింది. ఇప్పుడు టైం లేదుగా. సాయంకాలం చెపుతాలే." అని సరిపుచ్చాను.

౭

కాలేజీ వదిలిపెట్టంగానే క్వీన్‌గార్డెన్‌లోకి వెళ్లాం. సీటిగొట్టంలోనుంచి పూలవాన గుగుస్తున్నది. ఆప్రక్కనే సున్నంతో కట్టిన సీట్సు ఉంటే దానిమీద కూర్చున్నాం. పైన ఆకాశం చాలా మనోహరంగా కనుపడుతూ ఉన్నది. ఆహా! ఆ మేఘాలు ఎంతచిత్రంగా ఉన్నాయి! నిగనిగలాడుతూ నీలంగా మెరిసే ఆకాశంకిందిగా ఎన్ని మనోహరమైన దృశ్యాలు చిత్రించబడ్డయి! తెల్లగా నురుగులుగక్కుతూ ఒకదానిమీద ఒకటి విరుచుకుపడే సముద్రతరంగాలలాగు కొన్ని మేఘాలు, విచిత్రమైన జీవజంతువులవలె కొన్ని, గబగబ పరుగెత్తుతూ ఒకదానిమీద నొకటి పడి నెట్టుకుంటూ ఇదివరకటి ఆకారాలు మారి కొత్తఆకారాలు తెచ్చుకుంటూ కొన్ని మేఘాలు, నల్లగా భయంకరంగా కొండశిఖరాలవలె కొన్ని, వాటి నెత్తిమీద బంగారుపూతవలె కొన్ని మేఘాలు, అబ్బబ్బ ఎంతని చెప్పగలం! ఒకరంగా! ఒకతీరా! అప్పటి ఆఆకాశాన్ని ఉన్నదున్నట్టుగా ఏవిఖ్యాతచిత్రకారుడైనా చిత్రింపగలడా? ఏసుప్రసిద్ధకవైనా వర్ణించగలడా?

ఆకస్మికంగా మీర్జా నావీపుమీద తట్టి "అన్నట్టు శంపా! ఇందాక నే నేదో మాజిక్ చేశానన్నావుకాదూ! ఇప్పుడు చెపుతావా?" అన్నాడు. మళ్ళీ రాత్రి సంగతి జ్ఞాపక మొచ్చేటప్పటికి వళ్ళంతా పులకరించిపోయింది. కాని మీర్జాతో ఏమిచెప్పాలె! ఏదో మాటల్లో తోసి వేద్దామనుకున్నాను. మాట వినిపించుకోనట్లు అపుడే ఝుర్రుమంటూ పైన పోతూ ఉన్న ఎయిరోప్లేన్ వైపు చూపుతూ "చూడు, మన కోసొంతవిమాన ముంటే ఇద్దరం కలిసి ఏకైలాసామౌన్టెన్స్‌కో వెళ్ళి చూచిరా వచ్చునుగదా!" మీర్జాకు నవ్వువచ్చింది. "ఏమిటి అట్లా మాట్లాడుతున్నావు ఇవ్వాళ? కైలాసాస్‌మీదికి, హిమాలయాస్‌మీదికి వెళ్లుతున్న దేం బుద్ధి?" నా క్కూడా నవ్వు వచ్చింది. నేను చెప్పింది పిచ్చిసమాధాన మనుకున్నాను. అంతటితో ఆసంగతిని వదిలిపెట్టి జనరల్‌గా ఏమైనా మాట్లాడాలనుకున్నాను. ఏమీ పాలుపోక మతాన్ని గురించి మొదలుపెట్టాను.

"ఐతే మీర్జా, ఐడల్‌వర్‌షిప్ అంటే మీకు పనికిరాదుగదా. అంతకాడికి మసీదులో కెళ్లి, నమాజు చేయడ మెందుకు? అదికూడ ఫిక్సెడ్‌టైమ్స్‌లో అంతా వకచోట చెయ్యాలని ఎందుకు? ఎవరి ఇష్టమొచ్చినప్పుడు వాళ్లు, ఎక్కడపడితే అక్కడ చేసుకోకూడదు?" "చూడు, శంపా, నీ కివ్వాళ మతంపిచ్చి పట్టిం దేం? ఏమీ పనిపాట లేక అనెంప్లాయ్‌మెంటు డిపార్టుమెంటులో తిరిగేరకమంతా తిని కూర్చోని వాళ్ల మతాన్ని, వీళ్ల మతాన్ని వెక్కిరిస్తూ కూచుంటారు. వాళ్లెలా ఏడిస్తే మన కేంకావాలి? మంచి ఆదర్శాలు ఎవరిమతంలో ఉన్నా మనం తీసుకుందాం. అస లిప్పుడు ఎవరైనాసరే ఏపనైనా ధైర్యంతో చేశారంటే దానికి మతం అడ్డమే రాదు. పోనీ మీఫాదరు ఇంతరిఫార్మరుగదా, మీ రెలిజను ఒప్పుకుంటుందా, నీ కిన్నాళ్లదాకా మారేజి చెయ్యకుండా చదువూ, గిదువూ చెప్పిస్తుంటే? మీ బ్రామిన్సుంతా ఊరుకున్నారా లేదా?"

"ఊరుకోక చేసే దేముందిలే. ఇక వాళ్ళచేతుల్లో వుంది సోషల్ బాయ్‌కాట్ ఒకటి. దానికైనా సిటీస్‌లో భయం లేదు. ఐనా ఇప్పుడు మాలో బాగా తెలిసినవాళ్లెవరూ చదువు కభ్యంతరం పెట్టరు. ఎందుకంటే వేదకాలంలో, పురాణకాలంలోకూడ ఆడవాళ్లు బాగా చదువుకున్న వాళ్లే. కనుక నేను చదువుకున్నంతమాత్రాన నామత మెక్కడికీ పోదు."

"మరి ఇన్నిరోజులు పెండ్లిచేసుకోకుండా ఉన్నందుకో?"

"అదీని విరుద్ధంకాదు. మరీచిన్నపిల్లలకు పెళ్లి చెయ్యడం ఈమధ్య వచ్చిందికాని పూర్వం మాలోకూడ పెద్దవాళ్లకే పెళ్లిళ్లు చేసేవారు."

"ఐతే నీ విప్పుడు టెన్నీసుకోర్టులో జాయిన్ అయినావు కదా. ఆడవాళ్లు టెన్నీ సాడడ మేమిటని మీవాళ్లు ఎగతాళి చెయ్యరూ?"

"చేస్తారు, సంగతి తెలీక. టెన్నీసుకూడ పురాణకాలంలో నుండేదని ఎగ్జాంపిల్స్ ఉన్నాయి. కేవలం టెన్నీ సేకాకపోయినా ఇట్లాంటిదే కందుకఖేలనమని ఒక ఆట గోల్డెన్‌బాల్స్‌తో ఆడవాళ్లు, మగవాళ్లు అంతా ఆడుతుండేవాళ్లు. కనుక కొంతమంది ఛాందసులు ఒప్పుకోకపోయినా నేను టెన్నిస్ ఆడుకోడం హిందూమతానికి విరుద్ధంకాదని చెప్పగలను."

మీర్జా నా ఉపన్యాసం వినేటప్పుడు కళ్లల్లో నవ్వు తొలుకాడుతూవున్నది. ఇం కేదోప్రశ్న వెయ్యాలని, వెయ్యనా వద్దా అని ఆలోచిస్తున్నట్టు కనబడ్డాడు. ఒక్కక్షణ ముండి "సరేకాని శంపా, మరి ఇప్పుడు మీలో పెద్దవాళ్లు పనికిరాదంటారే, అన్నికులాలవాళ్ల ఇంట్లో భోంచెయ్యడం, ఎవర్నిబడితే వాళ్లని పెండ్లి చేసుకోడంకూడ మీ పురాణాల్లో ఉన్నాయనే అంటావా ఏమిటి?" అన్నాడు నవ్వుతూ.

"ఉన్నాయనే చెప్పాలిసివస్తుంది. సామాన్యంగా పురోహితులంతా బ్రాహ్మణులే ఉండేవాళ్లుకాని వాళ్లంతా రాజుల ఇళ్లల్లో భోంచేసేవాళ్లే. కనుక భోజనాల్లో పట్టింపు లేదని తెలుస్తూంది. తరువాత కొంతమంది శైన్ట్స్ రాజుకూతుళ్లని పెళ్లిచేసుకున్నారుకాని వాళ్ల బ్రాహ్మణత్వం పోలేదు. దేవయానఅనే బ్రాహ్మణస్త్రీ రాజును పెండ్లిచేసుకుంది. తరువాత చంద్రగుప్తుడు గ్రీకుగరల్ను పెండ్లిచేసుకున్నాడు. కాని వాళ్లకుల మెక్కడికీ పోలేదు. కనుక వేరేవేరే కులాలవాళ్లలో పెండ్లిండ్లుకూడ పూర్వం ఉండేవని తోస్తుంది."

మీర్జా నాభుజంమీద చెయ్యివేసి నిమురుతూ "శంపా, ఎమ్. యస్. సీ. కి చదువుతూకూడ ఈపురాణాలన్నీ ఎప్పుడు చదువుకున్నావు? నిజం చెప్పుతున్నాను. మామతాన్నిగురించి ఇప్పటికి నాకు పూర్తిగా తెలేదు. నీవు ముందుముందు గొప్ప ఎగ్జాంపులరీ లేడీ వౌతావని తోస్తుంది. ఇక లే, చీకటిపడ్డది, పోదాం." అన్నాడు.

౬

మర్నాటినుండి మీర్జాముఖం ఆశాపూరితంగా కనుపించేది. ఇదివరకు ఎప్పుడు చూచినా ఏదో గంభీరంగా ఆలోచిస్తూ ఉండేవాడుకాని ఇప్పుడుమాత్రం చాలాసరదాగా, ఉత్సాహంగా మాట్లాడ్డం మొదలు పెట్టాడు. మాఇంటికికూడ మునుపటికంటే ఎక్కువగా వస్తూఉండేవాడు. ఒకరోజు నాన్నగారు మీర్జాను చూచి "రోజూ సైకిల్ మీదనే వెళ్లుతావా కాలేజీకి?" అని అడిగారు. "ఔనండీ! మానాన్నగారి కారు ఎప్పుడూ కాలేజీవేళకు ఖాళీగా ఉండదు. ఎవరో ఒక పేషెంటును చూడ్డానికి వెళ్లుతుంటారు" అన్నాడు మీర్జా. "అలాగైతే రోజూ కాలేజీకి వెళ్లేటప్పుడు ఇక్కడికి వచ్చి శంపా, నీవూ కలసి వెళ్లుతూఉండండి, కారులో."

మీర్జా అభ్యంతర మేమీ చెప్పలేదు. మరునాటినుండి అలాగే జరుగుతూండేది. నేను మీర్జాను ప్రేమించడం నాన్నగారి కయిష్టంగా లేకపోవటమేగాక వారి ఉద్దేశ్యంకూడా అదే అయియుంటుందని కనుక్కోగలిగాను. అప్పటినుండి మాప్రేమ అనర్గళంగా వృద్ధిపొందుతూవచ్చింది. మీర్జాకూడ నన్ను గాఢంగా ప్రేమించుతున్నాడని తరువాత తెలుసుకున్నాను.

పరీక్ష లయిపోయినవి. కాలేజీకి సెలవులు ఇచ్చినారు. ఇప్పుడుకూడ మీర్జా, నేనూ కలిసి ఏగార్డెన్లోకో పోతుంటాము, వాకింగుకు, సాయంకాలమప్పుడు.

ఒకనాడు మధ్యాహ్నం నాలుగు కావస్తూఉంది. ఇంకా చాలా వేడిగానే ఉంది. నేను నాగదిలోనే సోఫామీద పడుకొనిఉన్నాను. ఎలక్ట్రిక్ ఫాన్ తిరుగుతూంటే కాస్త ఊపిరి ఆడుతున్నది. ఒకప్లేట్ ఐస్క్రీము, ఒకకప్పు టీ తీసుకువచ్చి బాయ్ టేబిల్ మీద పెట్టివెళ్లాడు. నేను లేచి స్పూనుతో ఐస్క్రీం తీసుకుంటున్నాను. ఇంతలో మీర్జా గబాగబా తలుపు నెట్టుకొని లోపలికి వచ్చాడు. ముఖమంతా చాలా కందిపోయింది. మనిషి చాలా ఆత్రంగా కనుపడ్డాడు. నేను వెంటనే చెయ్యిపట్టుకొని సోఫామీద కూర్చోపెట్టి "ఇదేం, ఇంత ఆదుర్దాగా ఉన్నావేం? ముందీటీ త్రాగు. కొంత శాంతిపడుతావు" అన్నాను. నాకుకూడ ఆత్రం నిండివచ్చింది. "అక్కరలేదు. ఇంటిదగ్గిర టీ త్రాగేవచ్చాను" అంటూ జేబులోనుంచి కర్చీఫ్ తీసుకొని ముఖం తుడుచుకుంటూ "సరేకాని శంపా, చూడు, ఇవ్వాళ పెద్ద చిక్కు వచ్చింది. నీ వేమి ఒపీనియన్ ఇస్తావోనని అడగడానికి వచ్చాను." అన్నాడు. "ఏమిటది?" అన్నాను, ఆత్రంతో. "నిదానంగా విను. లతీఫ్ హుస్సేన్ అని మాకు కొంచెందూరంబంధువున్నాడు. ఆయన కోకూతు రుందిట. ఆపిల్లని నాకిచ్చి మారేజి చేస్తానని మాఫాదరుతో చెప్పుతున్నాడు. ఆయన ఒప్పుకునేటట్లే ఉన్నాడు. అందుకని నాకేమీ తోచక నీదగ్గిరకు వచ్చాను."

"ఎంతపిచ్చివాడివి, మీర్జా, నీవు? మీఫాదరుతో నా కీపెండ్లి వద్దని చెప్పితే తేలిపొయ్యేదికాదా! ఇంత ఆదుర్దాగా నాతో చెప్పడానికి వచ్చా వెందుకు?"

"అదీచెప్పతాను. 'మరి నీకెందు కిష్టంలేదు' అని అడిగితే నీసంగతి చెప్పాలిసివస్తుంది. ఇంతా మావాళ్లంతా వప్పుకున్నతరువాత మీఫాదరుకు మన మారేజీ ఇష్టం లేకపోతే అప్పుడు మళ్లీ కష్టంగా ఉంటుంది. అందుకని నీ ఐడియా, మీఫాదర్సుఐడియా తెలిసివుంటే ఇక మావాళ్లని ధైర్యంగా ఒప్పించవచ్చు."

నేను వెంటనే మీర్జాను నాన్నగారివద్దకు తీసుకువెళ్లి సంగతంతా చెప్పవలె ననుకున్నాను. కాని వా రప్పుడే క్లబ్బుకు వెళ్లిపోయినారు. సరి, నాన్నగారి ఉద్దేశం నాకు తెలిసేఉంది గనుక ధైర్యం తెచ్చుకొని "చూడు, మీర్జా, ఇన్నాళ్లనుండీ నీకు నాహృదయం తెలేనేలేదా? మానాన్నగారుకూడ ఇందుకు వ్యతిరేకంగా లేరు. అసలుసంగ తేమిటంటే ఈ సమ్మరుహాలిడేస్‌లోనే మన మారేజీ చెయ్యాలని, రెండుమూడురోజుల్లో మీఇంటికి రావాలనుకుంటున్నారు. కనుక నీవు నిశ్చింతగా ఇంటికి వెళ్లి మీఫాదరును వప్పించు" అన్నాను. మీర్జా నారెండుచేతులూ తన గుండెల్లో పెట్టుకొని "శంపా, మాతండ్రి వప్పుకుంటాడని నమ్మకంలేదు. కాని మనకి పెండ్లయినా, కాకపోయినా నాహృదయంమాత్రం నీదే..." అన్నాడు.

మీర్జాకంఠానికి దుఃఖం అడ్డుపడ్డది. కళ్లల్లో నీళ్లు నిండుకున్నాయి. వెంటనే నాకర్చీఫ్‌తో కళ్లుతుడిచి అతని తలకాయ నాఒళ్లో పెట్టుకొని "ఏమిటి మీర్జా, ఇంత అసమర్థుడిలాగా మాట్లాడుతావేం? పెండ్లిఅయితే అవుతుంది. లేకపోతే లేదు. ప్రపంచంలో పుట్టింది పెళ్లి చేసుకోడానికీ, పిల్లల్ని కనడానికి నేనా? ఇంతచదువు చదువుకున్నందుకు సంఘానికి, దేశానికి ఎంతసేవ చేస్తే నీరెస్పాన్సిబిలిటీ తీర్చుకున్న వాడి వవుతావు. ఇక చాలు, ఇంటికి వెళ్లి మీఫాదరుతో ఆలోచించు."

మీర్జా లేచి బయటికి వెళ్లాడు. బల్లమీది టీ చల్లారిపోయింది. ఐస్‌క్రీమంతా కరిగిపోయింది. మీర్జా విచారంచూస్తే నా హృదయంకూడ అలాగే కరిగిపోయింది. కాని పెండ్లివిషయంలో నాకుమాత్రం దిగులు ఏమీ లేదు. ఏమంటే మీర్జాకు నాహృదయా న్నర్పించాను. మీర్జాకూడ నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించాడనవచ్చును. అటువంటప్పుడు మా ఇద్దరికి పెండ్లయితేనేమి, కాకపోతేనేమి? తరువాత నాన్నగారి ఉద్దేశమేమంటే సంస్కర్తలందరికి ఆదర్శంగా ఉండేటట్లుగా ఏమతాంతరుడికో, కులాంతరుడికో, లేక శాఖాంతరుడికో నా కిష్టమైనవాడుగా చూచి పెండ్లిచెయ్యాలని. నేటి కాలానికి వారి ఊహలన్నీ ఫలించేట్లుగా మీర్జా దొరికాము. ఇక ఇప్పుడు నాకు,మీర్జాకు పెండ్లిచేసి హిందూ మహమ్మదీయసఖ్యానికి, సంస్కరణానికి మార్గదర్శకులు గావాలని నాన్న ఆశయం. ఇక అమ్మఉద్దేశం ఏమిటంటే, కేవలం నన్ను బ్రహ్మచారిణిగా ఉంచాలని. పెండ్లి చేసుకోంగానే మనుష్యులకు నిశ్శక్తి, నిర్జీవత కలుగుతుందని, హీనదశలో ఉన్న సంఘానికి, దేశానికి సేవ చెయ్యాలంటే విద్యావంతులు, బ్రహ్మచారిణులు ముఖ్యంగా కావాలని. ఇలాటిపరిస్థితులలో నాహృదయంలో



"మీర్జా నా రెండుచేతులూ తన గుండెల్లో పెట్టుకొని......"

చాలారోజులనుండీ బ్రహ్మచర్యానికి, గార్హస్థ్యానికి యుద్ధం జరుగుతూన్నది. ఇన్నాళ్లకు నే నొకనిశ్చయానికి రాగలిగాను. మిర్జాను ఇప్పుడు నేను ప్రేమించాను. పైగా మిర్జా శాకాహారి, దేశాభిమాని, విద్యావంతుడు. అటువంటప్పుడు సందర్భపడితే నాన్నగారి ఇష్టా న్ననుసరించి పెండ్లి చేసుకుంటాను. లేకపోతే ఏకారణంచేతనన్నా నాకూ మిర్జాకూ పెండ్లి సందర్భపడకపోతే అమ్మఇష్టా న్ననుసరించి బ్రహ్మచారిణిగా ఉంటాను.

## ౨

రాత్రి భోంచేస్తూ ఉండగా నాన్నగారు ఏదో మాటలమీద "ఇందాక ఎందుకమ్మడూ మిర్జా చల్లపడకముందే వచ్చాడు?" అని అడిగారు. నాకు చెప్పడానికి సమయం దొరికింది. ఏమీ లేదండీ, అతనికేమో పెళ్లిట. ఎవరో వచ్చారుట, పిల్లనిస్తామని. తన కది ఇష్టంలేదని చెప్పాడు." నాన్నగారు ఉలిక్కిపడి "అలాగా?" అన్నారు. అంతే. మళ్లీ ఏమీ మాట్లాడలేదు....భోజనం కాగానే డ్రెస్‌చేసుకొని మోటారులో ఉస్మాన్‌జాగారి ఇంటికి వెళ్లారు. తరువాత గంటసేపట్లోనే తిరిగివచ్చారు. అక్కడ జరిగిన సందర్భ మిది: నాన్నగారు ఉస్మాన్‌జా గారితో సంగతిసందర్భములన్నీ చెప్పి మీకేమీ అభ్యంతరం లేకపోతే కొద్దిరోజుల్లోనే పెండ్లిచేద్దామని చెప్పినారు కాని ఉస్మాన్‌జాగారు ఒప్పుకోలేదు. లతీఫ్ హుస్సేన్‌గారికి మాట ఇచ్చామనీ, ఇదివరకు వాళ్ల బంధువు లెవరూ హిందువుల పిల్లలను చేసుకొనలేదనీ, తా నొక్కడే ముందుగా చేసినట్లయితే నలుగురిలో ఎగతాళిగా ఉంటుందనీ అభ్యంతరం చెప్పారు. నాన్నగారు ఎంతవాదనచేసినా వప్పించలేకపోయినారు. మిర్జా తండ్రిమాట ఎదిరించలేకపోయినాడు.

సరి, నాకు కొత్తగా విచార మేమీ పుట్టలేదు. ఇదివరకటి నిశ్చయా న్ననుసరించి అమ్మ ఇష్టప్రకారం బ్రహ్మచారిణిగా నుండాలని నిశ్చయించుకున్నాను.

తరువాత కొద్దిరోజులకే మిర్జాకు పెండ్లయిపోయిందని విన్నాను. అప్పుడుమాత్రం నామిర్జా ఇంకొకరివా డయిపోయినా డనుకునేటప్పటికి ఏదో ఒకవిధమైన, చెప్పడానికివీల్లేని మనోవేదన కలిగింది. కాని దాన్నేమీ లెక్కచెయ్యలేదు. తరువాత మిర్జాకూడ ఎప్పుడూ నా కగపడలేదు.

రిజల్టు తెలిశాయి. అనుకున్నట్టుగా నానంబరు మొదటితరగతిలోనే ఉంది. అందులో, యూనివర్సిటీకల్లా ఫస్టున వచ్చింది నే నొక్కదాన్నే అయినాను. నాన్నగారు చాలా సంతోషించారు. కొంతమంది స్నేహితులు నన్ను ఇంగ్లండు పంపమని సలహా నిచ్చారు. మా కాలేజీ స్త్రీ విద్యార్థిను లంతా నాకొక టీపార్టీ ఇచ్చారు. మాకాలేజీ ప్రిన్సిపాలువద్దనుంచి ఇంగ్లండు పంపితే నెలకు ఎనిమిదిపౌనులు స్కాలరుషిప్ ఇస్తామని లెటరు వచ్చింది. సరి, అడ్డ మెవరు చెపుతారు? ప్రయాణానికి నాక్కావలసిన వన్నీ తయారయినాయి. స్నేహితులు, బంధువులు— అంతా బొంబే ఎక్సుప్రెస్‌కు వీడ్కోల్పడానికి స్టేషన్ వద్దకు వచ్చారు. చాలామంది ప్రెస్ ఫోటోగ్రాఫరులు నాఫోటో తీసుకున్నారు. తరువాత రైలు సాగిపోయింది.

నాన్నగారు, అమ్మ బొంబేదాకా వచ్చారు. వాళ్లిద్దరి ప్రేమాశ్రువుతోటీ రాజపుటానా స్టీమరులో ఇంగ్లండుకు వెళ్లాను.

## ౩

మూడేళ్లయింది. డి. యస్. సి. డిగ్రీ తీసుకుని ఇండియాకు తిరిగివచ్చాను. ఈమూడేళ్లలో నాలో ఏమీ ఎంచతగ్గ మార్పు కనుపించలేదు. ఇంగ్లండులోకూడ నేను శాకాహారినిగానే యుండేదాన్ని కాని మిర్జాచిత్రాన్నిమాత్రం నాహృదయంలోనుంచి తుడిచివెయ్యలేకపోయినాను. బ్రహ్మచారిణిగా ఉండాలనుకున్న నానిశ్చయాని కేమీ భంగం రాలేదు కాని ఇదివరకటివలె నాతో మాట్లాడానికి మిర్జా లేకపోవడంచేత చాలా కష్టంగా ఉండేది.

నేను ఇంగ్లండు వెళ్లివచ్చానని నాన్నగారు పెద్ద పెద్దవాళ్లందరికి ఒక పెద్ద ఎట్‌హోమ్ ఇచ్చారు. దానికి అన్నిడిపార్టుమెంట్లులోని పెద్దఆఫీసర్లూ, డాక్టర్లు, వకీళ్లు, కౌన్సిలుమెంబర్లు జాతిమతభేదాలు లేకుండా హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పార్శీలు, ఆంగ్లోఇండియనులు, యురోపియనులు చాలామంది వచ్చారు. మీర్జా రాలేదుకాని ఉస్మాన్‌జాగారుకూడ వచ్చారు.

అతిథుల్లో చాలామంది ముఖ్యులు నన్ను చాలా ప్రశంసించారు. ఉస్మాన్‌జాగారు లేచి నావల్ల సంఘానికి నూతనోత్తేజం కలగాలని వాంఛించారు. తరువాత నాన్నగారు సందర్భం పురస్కరించుకొని మీర్జాక్షేమం విచారించారు. సమాధానం వినేటప్పటికి నాగుండెలు బ్రద్దలయిపోయినయి. ఏమంటే, పెండ్లయినప్పటినుంచి మీర్జా చాలా జబ్బుగా నున్నాట్ట. ఇప్పుడు జబ్బ చాలా ఎక్కువగా ఉందట. ఆపెళ్లాం కాస్తా ఇతని నిరాదరణ భరించలేక ఆత్మహత్య చేసుకుందిట...ఉస్మాన్‌జాగారి ముఖంలో చాలాపశ్చాత్తాపం కనపడ్డది. విందంతా అయిపోయి అతిథులంతా వెళ్లిపోయినతరువాత నాన్నగారితో చాలా దీనంగా ఇదివరకటి తన మాటలు మరచి పోవలసిందనీ, ఇంకా ఈట్వొంటీయత్ శంచరీలోకూడ ఇతరు లేమనుకుంటారోనని అంతరాత్మ వప్పుకున్న సంస్కరణాన్ని చెయ్యలేకపోయినందుకు తరువాత చాలా చింతించాననీ, ఇప్పుడు మరేమీ ఇబ్బంది లేకపోతే పెండ్లికి నాకేమీ అభ్యంతరం లేదనీ చెప్పారు. ఇంకా నాతో పెండ్లి కాకపోతే మీర్జా బతకడేమో నన్న భయాన్నికూడ కనుపర్చాడు.

నాన్నగారు మందహాసంతో అన్నిటికీ తలఊపారు. తరువాత నాతో అతని కారులోనే వెళ్లి మీర్జాను చూచిరమ్మని చెప్పారు. నేనుకూడ సరేనని ఉస్మాన్‌జాగారి కారులోనే బయలుదేరాను.

మేడమీద వరాండాలో ఈజీచైరులో పడుకొని ఉన్నాడు మీర్జా. సదా ఆలోచనాపూరితంగాఉండే ఆకోలకళ్లల్లో తేజస్సంతా ఇంకిపోయింది. ముఖమంతా జీవకళలు ఎండిపోయి తెల్లగా పాలిపోయింది. నున్నని చెంపలు శుష్కించి లోపలికి పీక్కుపోయినయి. మెట్లు మెట్లుగా కళ్లమీదికి పడుతూఉండే క్రాపంతా విపరీతంగా పెరిగి నాలుగువైపులా ఆవరించుకుంది. ఈస్థితిలో ఉన్న మీర్జా ఆకస్మికంగా నన్ను చూచేటప్పటికి స్తంభించిపోయినాడు. కళ్లనిండా నీళ్లు నిండిపోయినయి. తటాలున నేను వెళ్లి మీర్జాచేతుల్లో వాలిపోయినాను.

అస్థిచర్మావశిష్టంగా నున్న చేతుల్తో మీర్జా నన్ను గట్టిగా గుండెల్లో అదుముకుని శుష్కించిపోయిన కంఠంతో 'శంపా' అని తరువాత మాట్లాడలేకపోయి నాడు. కళ్లల్లోనుండి నీళ్లు అనర్గళంగా ప్రవహించినయి...



"నేను లేచి కర్చీఫ్‌తో కళ్లు తుడిచి........."

నేను లేచి కర్చీఫ్‌తో కళ్లుతుడిచి "ఇలాచూడు" అని చెప్ప బోతూఉన్నాను. ఇంతలో మీర్జాకళ్లు మూతలుపడిపోయినయి. అతితీవ్రంగా ఉన్న హృదయచలన మాగిపోయింది. ఇంకా చెప్పేదేముంది? నాప్రణయమూర్తి ప్రాణవాయువులు ఈమహావాయుసముద్రంలో విలీనమైపోయినయి.

* * * *

అంతటితో నాఆశ లడుగంటినయి. నాశక్తిలో సగం మీర్జాతో అస్తమించిపోయింది. నానాటికే నిర్జీవత

ఎక్కువౌతున్నది. నేనూ మీర్జా కలిసి ఎన్నెన్నో ఘన కార్యాలు చెయ్యాలనుకున్నాం. అన్ని ఆశయాలూ మట్టిలో కలిసిపోయినయి. మీర్జాలాటి విద్యావంతుడు, ఉద్రేకపూరితుడు నైన యువకుణ్ణి కోలుపోయినందుకు దేశమాతకూడ దురదృష్టవంతురాలు.

ఇప్పుడు నేను మాఅమ్మఇష్టా న్ననుసరించి బ్రహ్మచారిణిగానే ఉండదలుచుకున్నాను. మాఊళ్ళో ఒక హిందూముస్లింలీగు స్థాపించి నా శక్తంతా ధారపోసి హిందూమహమ్మదీయుల ఐకమత్యానికి పాటుపడుతున్నాను.

---

# భ్రమ-ప్రమాదము

## కొత్తపల్లి సూర్యారావుగారు

చేసిన నేర మిట్టిదని చెప్పి యొనర్చిన యాజ్ఞ కొప్పి దీ
ర్ఘాసికిఁ గంఠమిచ్చెద ననాదృతి కేమినిమిత్త మెన్నఁడున్
గోసిలియొగ్గి యుండి మనుదు న్భవదంఘ్రులయొద్ద నన్ను నే
బాస యొనర్పుమన్నను నవశ్యము సిద్ధము సోదెచూడుమా.

నీకారుణ్యము నమ్మి యెల్లపుడు నిన్నే దైవము న్బుద్ధితో
లోకాతీతవిధంబునం గొలిచి నీలో నున్న న న్నిన్ని నా
శ్లోకాగ్రంబుగఁ గాంచుచుం దెలియలేదే నాగుణం బక్కజం
బై కాన్పించుఁ దలంచువారలకు నీవ్యత్యాస మాత్మేశ్వరా.

సాంగత్యం బుపకారకంబు సకలాశామూలమౌ ప్రేమపుస
ర్వాంగాసేచనకంబు నీపొడవు భార్యారూపభాగ్యంబవం
చుం గొండాడెద వింతదాఁక నె అమెచ్చులొప్పెలెఁ గన్పట్టు నీ
యంగారాత్మను ముగ్ధబుద్ధిని నవశ్యాయంబుగా నెంచితిన్.

పౌరుగూరన్ బహుగౌరవాదృతులతోఁ బొత్తై సుఖంబున్నవా
రిరువు ర్మా కొకబెంగ లే దనుచు సర్వేభ్యంబుగా మున్న యి
ద్దఱు నీనాతలిదండ్రు లేమగుదురో దబ్బాటుగా విన్న నీ
త్వరితాకృత్యము గుండెబ్రద్దలయి వృద్ధత్వంబునం గుందరే.

ఏమని చెప్పువాఁడవొకొ హేతువు నీకెవరైనఁ గన్యనీ
రా మొదలింటి కాంత యపరాధ మదేమన నచ్చుఁజెప్పు నే
నే మణిపూసవంటి తరుణీమణిఁ బెండిలిచేసి హాయిగా
నీమెయి వీడి చేసిన యకృత్యము దోషము నీఁగఁబోయెదన్.

అని క్రుద్ధుండయి యున్ననాథు నొక యార్యారత్న మగ్రస్థలి
వినయాంజల్యభిరామయై పలికి వేవేరీతుల న్వేఁడ న
నలింపం దగ దేగు మిచ్చబడి నీనాయింటిలోనుండి నా
నికిం బోవఁగ వేళ యయ్యె నిఁక నిల్వం, బల్క నొక్కింతయున్.

సమది యెంత గావలయు వృశ్చికజం బఖిలాంగకంబులన్
స్పృమరమౌ క్షణంబునను వేగమ పొమ్మిటనుండి పుట్టిని
మ్మసలక చొచ్చి యుండు మట, మాటకు మాట తెవుల్నిజంబుగా
సలను మాట నిగ్గుటిచి నోటను మాటలఁ లేవు పల్కఁగన్.

జడిగిన మానసం బతుకువేసిన వేషిన యట్టులుండు న
స్పార యట నంటఁగాఁగ దినముంబలె నెన్నఁడు మచ్చ మాయఁనే
సరుపు శమించిన న్వదలుకొంటని నీయనుబంధ మేగు మొ
క్కరు వినకుండ మీఁద నెటుగాఁగలదో తలవ్రాలు తప్పునే.

భేదము లేనినాఁ డొకటి వీనిది వానిద యొండటంచు నా
లేదద్ది కల్గినప్పు డొక లేశముగానియు నన్యపస్తుసం
పాదనమందు నాసగొనఁ బాడియె నీదని తీసికొమ్మ నేఁ
గాదన నెద్దికావలయుఁ గంచము ముంతయుఁ బెట్టె బేడయున్.

వదలినఁ జాలు నే నరిగి వచ్చెదులోపలఁ గొమ్మ నీవి, నేఁ
బదిలముచేసికొందును స్వభాగము పిమ్మట నివ్వతాళము
ల్పదియగుచుండె నంచు జలపానముఁ జేయక నేగ శాలకున్
మదికిఁ దిరంబు లేనపుడ మాత్రము సర్వ మసహ్యమే యగున్.

బ్రదుకే సమస్తముం బుడమిపా లగుచుండిన నామెమాత్ర మే
యదిగొను నోరుమూసికొని యాతఁడు వచ్చుట వేచియుండి, నే
నెదియును గొంచుఁబోను గలయెల్లవి నీయవి, నాలి నేన, నే
వదలెద సౌఖ్యమొందు సెలవాయని తర్లెను సంజచీఁకటిన్.

జల్లున గుండె నీరయిన జాడ నతం డొకబల్లమీఁద మూ
ర్ఛిల్లిపడెం గనుల్వడియెఁ జీఁకటియింటను జిమ్మచీఁకటుల్
పెల్లుగ నాక్రమించె దివెవెట్టఁగ నెవ్వరు దిక్కులేరు చిం
తిల్లినఁ గార్యమేమి పొలఁతిం జెయిచేతుల గెంటివైచినన్.

రాతిరి తిండిమానె నిదురం గొను నెట్టులు బిక్కుబిక్కుమం
చాతఁడు నాల్గుజాలు నొకహాయనమట్టులు పుచ్చె వేకువ
న్మాఁతలువడ్డ కన్నులను ముజ్జగముల్ సకలార్థశూన్యమై
వే తనకుం గనంబడిన విహ్వలుఁడై యొకకొంతసేపటన్.

లేచి దిటంబు దెచ్చుకొని క్లేశము ఖేదము దోఁపకుండఁ గా
లోచితకృత్యముల్ నడపుచుండెను నాఁటికినాఁటికి న్సమా
లోచనచేయుచుం గమలలోచన పుట్టినయిల్లు నేరి ల
జ్జాచలితాత్మయై తెలిపె సర్వముఁ దల్లికిఁ దండ్రికల్లనన్.

పొక్కఁ గ్రమక్రమంబుగను బున్నెము నన్నెము బంధుకోటిలోఁ
జిక్కరి సిగ్గుచేత నలచేడియవారలు సిగ్గుమీఁదఁ జెం
పెక్కిన మానహానికిని బెల్లుగఁ జింతిలి రామెయత్తవా
రొక్కరిమోముఁ జూచుటకు నొక్కరుఁ జాలర వారువారలన్.

తండ్రి కుమారునొద్ద కొకతామసి వచ్చి యిదేర నీవునన్
వాండ్రును వీండ్రునుం బలుకు వార్తలు వింటివొ చాడిచెప్పువా
రుండ్రు స్వభావతుచ్ఛులది యుక్తమ వారిది తప్పుగాదు తాఁ
దీండ్రను విన్నవాని చెవిద్రెంపఁగ న్యాయము నీతివేత్తకున్.

ఎన్నఁడులేని సంశయ మదేటికిఁ గల్గెను ముందువెన్క మే
మున్నది లేదె మీరు పొరుగూరను నొంటిగ నున్నయంత నే
చిన్నతనంబుగాక యిటుచేయఁగ నీ కధికార మేది య
న్నన్న యొనర్చినాఁడవె యనర్థము మించిన దేమి చేయుదున్.

చూడంజాలము వారి మోము లెపుడుం జుట్టంబుఁ బక్కంబు లే
నాఁడుం గూడదెమొ నేఁటితో మన ఘరానాపోయె రాదారి నే
జాడ న్నేనయ పూరుషుండవని సంచారంబు మున్బోలె నే
వ్రీడాశూన్యతఁ జేయువాఁడ వది నీహృద్వీథి యోజించితే.

అనుచును జెప్ప మించె నెవరన్నను నాయన యేమికార్య మే
నొనరిచినాఁడ నోరువక యొక్కమిషంబున నిట్టికార్యమే
జనుఁ డెటులాడనిమ్ము గడుశాంతిగ నన్నియు నే భరింతు ఆ
మ్మనఁ బ్రొయిచుట్లు దుశ్చరితముం గని యోర్వఁగఁజాల నాసతిన్.

ననుఁ గరుణించి వీడుమని నాయనగారిని గ్రమ్మజించి యుం
డెను దనయుం డొకండ జననీజనకుల్ మది నొచ్చి యేమిచే
యునో యని కూఁతు నేరుఱక యోరిమిచెప్పుచుఁ బెండ్లిచేయలే
దనుకొనువార మించుకయు నంగదఁబొందకు మమ్మ కూఁతురా.

వాడియునోడఁబోసియును భావ మెఱుంగఁగలేనివాని నే
మాడిన లాభమేమి తగునాయని మేము సమక్షమందు నాఁ
జూడము దైవ మాఁడువలుసుం దయచేసిన నిట్టిపట్టులం
జూడకపోదుమో యతని సూనృత మెవ్వరిభాగ్య మెట్టిదో.

తనయలఁ గాంచువారలకుఁ దప్పవు దుఃఖము లెన్నిభంగులన్
మన మొగమందె ప్రొద్దుపొడమంగను లేదని శాంతచిత్తులై
మనుచుచునుండి రాత్మజఁ; గుమారికమాత్రము నాథు నెప్పుడే
సునిశితమా పరాభవము చూపి వశుండుగఁ జేయ నెంచెదున్.

రాఁడనునిశ్చయంబునఁ బురంధ్రి రుజాభరఖిన్న నేఁడొ మ
ర్నాఁడొ శరీరమోక్షణము నాఁడులలెక్కయకాని లేద, యీ
పోఁడిమిఁ జూడ రావలయుఁ బూర్ణసుధాకరమూర్తి మోము నే
జాడనొ చూపవే కదుఁ బ్రసాదమునం బొడసూపి పోఁగదే.

అని యొకజాబు నాథునకు నందఁగఁజేసె సుపాంశురీతి దా
నిని గని తారకాప్లుతిగ నించెను నీరము అన్నదోయిఁ బో
వను దలపోయుఁ గ్రోధము నవారిగరా నుడుగున్, ధనాశ మే
నునఁగల భూషణంబులకునుం బఱతెంచె నటంద్రొ యెవ్వరేన్.

వనిత ననన్యజీవిత నెవంబిడి త్రోలి యుపేక్షచేసి దుః
ఖనిబిడయై నిరాశఁ దనకాయము వీడుచు నంత్యదర్శనా
ర్థిని నను వేఁడె, నే మనుచు దీఱుఁడనై చనువాఁడఁ దిట్టరే
జనులు తొలంగె నేఁటికిని జాయకు నాకును గర్మబంధముల్.

ఈగతి మిన్నకుండె, మృతియే మదహంకృతిశాంతిమూల మం
చేగఁడ, దైవయోగమున నింకొకయూరికి మాఱిపోయె ను
ద్యోగము, దాన సర్వమును నోరువరానిది యయ్యెఁ, గాంతయున్
రోగముచే మృతించె నని రూఢిగ నూరికి నేగ నంతటన్.

నూతనపట్టణంబునను నూతనరీతిగ నుండె నేరికే
నాతనిపూర్వవృత్త మట ఖ్యాతముగాదు సుదూరమాటచే
నాతి గ్రహించి మాఱుపు, మనంబునఁ గ్రోధము రాలుకోఁగ న
జ్ఞాతగతిం బ్రయాణమయి సత్రముక్రేవను మూలయింటిలో.

వేసము మార్చి మా టుడిగి వెంగలివోలె వసించియుండె ను
ల్లాసముగాఁ దదాకృతివిలాసములుం బఱిమంది చూచి యి
ట్లీసతి యుండ నేమనుచు నెంతయు నెంచిరి యెంచుచుండి, రే
దోసమయంబునం గనిరొఁ దోయజనేత్రను దానిభర్తయున్,

ఎవ్వతె యీమె, లే కెవరు నిష్టులు బంధులు, మూఁగ దేటికో
యివ్విధి నుండునంచు నొకవృద్ధను దద్గృహదాసిఁ గోరఁగా
నవ్వుచుఁ బల్కె నాజరఠ నాయన! యెక్కడనుండి వచ్చెనో
జవ్వని, కార్య మే నెఱుఁగఁజాలను గాని యతిప్రగల్భయౌ.

మాటలు రావు దా నొకటిమాత్రమె లోపము విత్తవంతురా
లౌటను నన్ను దాసిగ నయంబునఁ బాలన చేయుచుండె, నాఁ
బూఁటకుఁ బూఁటకామెఁ దలపోయుచు, నేనొకరుండ నామెయుం
బోటియొకర్తె కాఁపురము పొందగునేమొ యటంచు నెంనుదున్.

సతి మరణించె నిందనుక సాఁగెను నావటువృత్తి యింతలో
మఱియును మాఱఁజొచ్చినది మానిని యుండిన వేయియేండ్లు నీ
గతిన చరింతుఁగాని- యని కామినికై ముసలామెఁ బంపె, న
య్యతివయు జాలమార్గమునఁ బ్రాణపతిం గనసాగె నిచ్చలున్.

జరఠయు నప్పటప్పటికి సన్నక సన్నగ వచ్చి యోయి, యా
తరుణికి నేను నిస్గఱిచి దార్ఢ్యము గాఁగను నీమనోగతం
బరయఁగ సన్నలం దెలియునట్లుగఁ జూపను జాల నీవు నే
ర్పరివగు దొక్కమాపు చనరాదో బయల్పడు నెల్లయర్థముల్.

ఏనొకదాన నుందు మరియెవ్వరు రారు భుజించి యింటికిం
బో నదనైనయప్పు డొకప్రొద్దున రమ్మ మిషాంతరంబున
న్మానిని యింటివాకిలి ప్రమాదమునంబలె విప్పి యుంతు వీ
లైనను జూచికొ మ్మతిరహస్యము దీని సురక్షచేయుమా.

ఈవొకరుండ వామె యిట నొంటిగ నున్నది, యేమొ యెప్పు డే
ఠీవ జనించునో పడిన యేనియు ద్వ్యాయము పాఱవచ్చు నీ
భావ మెఱుంగఁ జెప్పు శుకవాణి గ్రహించినమేలు మూఁగకుం
బావనబుద్ధి కేకొఱత వాటిల దాంతర శేముషీక్రియన్.

ఒల్లనినాఁడు పోఁబనుచు నొక్కటిచేయదు బుద్ధిచెప్పుచుం
జల్లఁగ నూరకుండుఁ దనసంగతిమాత్రము సంశయాస్పదం
బెల్లర కౌనటంచు-వరియించిన మంచిదకాదె వెన్కముం
దల్లలితాంగి కొక్కరుసు నడ్డము పెట్టెడువారు లేమిచేన్.

పండో కాయయొ చూచుదాఁక నొకఁ డెవ్వాఁడున్ గ్రహింపంగ రా
కుండం జూడము, వెఱ్ఱిముండ నని నన్నారెల్ల నిందింత్రు, నా
తండ్రీ! భద్రము, తొర్పకత్తె ననుకోఁ దప్పోఁ జుమీ, నీకు నే,
దొంగౌ దుర్యశ మబ్బెనేని చెడ దాయుర్హానియౌ పిమ్మటన్.

ఈవచనంబు లాతనికి నింపయి తోఁచెను గాలచోదనన్
భావసుబోధసంజ్ఞలను బాగుగ నేరుచుచుండె, సృష్టిలో
భావ మదొక్కటే యగును భాషలు వేరయియున్న నేనియుం
గావున సంజ్ఞలంద గజగామినిఁ దేర్చెదనంచు నెమ్మదిన్.

కనుఁగొని యోరవాకిలి యొకానొకనాఁటను జిమ్మచీఁకటిం
జనియెను లోనికి న్విధివశంబున నాసతి చిన్నమంచమం
దున నట నారుబైట ముదితొయ్యలి యంగడినుండిరాక వే
చినది యదెత్తుగాఁ బురుషచిహ్నములం గని గుండె నీరుగన్.

తనకై తీసెను దల్పు వృద్ధ యనుమోదం బాతనిం జేరె, నా
తని జూడ స్ఫయ మామెఁ జేరె, సుభియుల్ తంద్రాత్ములై రైన న
వ్వనితారత్నము వాని యానగరిమం బాటించి పూర్వాశ్రమం
బున నాత్మేశ్వరుగా నెఱింగియును మోముం ద్రిప్పి యిల్వొచ్చినన్.

వెంబడి మెల్లమెల్లఁ జని వ్రేల్మిడిఁ జప్పటుల న్రచించుచోఁ
దొంబదియేండ్లతొక్కు త్వరతోఁ జనుదెంచి బహిఃకవాటబం
ధం బొనరించినంతఁ జెలి ధైర్యముతో మెమెమెమ్మెమెమ్మెమే
బెంబేయటంచు రోదనము పేర్మి నొనర్చెను ద్వ్యర్థిగాఁ ద్వరన్.

ఇస్సిసు! భీతిలన్వలవ దేమియుఁ జేయను గోలచేయకుం
డిస్సిసు! నోరుమూయుఁ డని యిద్దఱఁ దేఱుచుఁ గాని మేనునన్
బుస్సన భీతిచేఁ బొడమెఁ బుల్కలుఁ గంపము, మాటలాడ లే
కిస్సిరొయంచుఁ గూలఁబడియె న్వివశుండయి యొక్కతిన్నెపైన్.

ఎఱుఁగనిభీతి యాతనిది, యింతి యెఱింగినభీతి యట్టు లి
ద్దఱు నొకచోటఁ జేరుటను దైవవశంబగు పారవశ్య మా
నెఱతనకానిఁ జెందెఁ దరుణీమణి, నాథుఁడు మే నెఱుంగఁ డం
చెఱఁగి బిరాన వేసము నివృత్తము చేసి యథాపురాకృతిన్.

వీవనమీఁద నీర్చిలికి వీచుచునుండఁగఁ గన్నువిచ్చి యా
భావజరూపుఁ డంగనశుభాకృతిఁ గన్నులు విప్పిచూచి యో
హో వివశత్వమే పొసఁగు, వ్రేఁగగుఁ గంటి కనిష్టదర్శనం
బో వెడమాయలాఁడి మృతినొందియు నన్విడ వెంతకర్మమో!

అనుచు న్నేత్రము లొయ్య మూసికొనియన్నా యెంతకష్టంబొ యీ
మునిమాపే గ్రహబాధ దయ్యపుగృహంబుం జొచ్చితిన్ వృద్ధయుం
బెనుభూతం బగునేమొ యంచు నిలువ న్వే యింతి యాలింగనం
బును గావించిన లేచిపోయె నుసులు ల్మల్లోకము ల్దాఁటుచున్.

ఏల మనోధినాథ, వెఱపేల నను న్వెఱవంగవల్దటం
చేల వెఱంగొన న్నిను మ ఱేమియుఁ జేయను నన్నుఁ జూడు ము
న్మీలదనూనతామరసనీరసకృన్నయనాంచలంబులన్
గాలియు ధూళి భూతములుగా విటనున్నది నేను నమ్మవే.

ఒకపఱి నన్నుఁ గన్నుఁగవ నొప్పుగఁ జూడుము నాపిశాచరూ
పకకళ దూలిపోవును, భవద్వచనామృతవృష్టి, దచ్చిన
ట్టికళినసీధుమోలను బటిష్ఠశరీరను జూపుఁ గష్టురా
లికిని సువాసినీత్వమృతి లేఖనభాగ్యము ధాత గూర్చునే.

అనిన నొకింత కన్నెఱచి యంగనఁ గాంచియు నమ్మలేక మె
ల్లన ముకుళించి వెండియు సలజ్జగ విచ్చి కనుంగొనంగ న
ట్లనె పొడసూప నేర నిది టక్కరియో మటుమాయయో? యికై
నను మరణంబు తప్పదని నాతిని ధీరతఁ జూచినంతటన్.

పదములమీఁద వ్రాలి నిజభామిని పల్కను నమ్మవేల నీ
పదములయాన, నేన, నను భార్యగఁ జేకొనినాఁడ వీవు, నీ
కు దయ దొలంగినంత జనకుండును దల్లియుఁ గుంద నందుఁ బో
యి దిగులుచే నకాలమృతి నేగెద నంచు లిఖించి పంపితిన్.

నీ విటువచ్చినట్లు విని నీకొఱకై యిటు లేగుదెంచి యీ
క్రేవను నిన్గన న్నిలిచి కృత్యముగా దొరతోడఁ బల్క నం
చీవగ మూఁగనోమున నభీష్టఫలంబును గన్నదాన ల
జ్జావతి కేమిగావలయు సర్వము నాథుఁడకాఁడె యీభువిన్.

చేసిననేర మేమనుచుఁ జింత యొనర్చితి నల్లనాఁడు నే
నాసరసీజలంబులను నాడఁగ బోయి పథంబునందు స
న్న్యాసి యొకండురాఁ దొలఁగ నాతఁడు నన్గని తప్పుకోఁగ వ్య
త్యాసత నన్నతండు మఱి యాతని నేనును దారసింపమే.

అదియేమో నిను బాధపెట్టె నను నట్లానాఁడు పోఁద్రోలియుం
డును వంచుం దలపోసి యారయఁగ నిన్నుం జేరి సందేహముం
బ్రిదులంజేసి యనంతరంబున ననుం బ్రేమించెదో మానదో
విదితంబైనను జావవచ్చునని యుర్వి న్నిల్చితి న్నాయకా!

అనవిని, యూర్చిఁ మీఁదుగని యాఁ! యిఁక నుండుము నీవుగాదు న
న్నొనరుపనిమ్ము నీపదపయోరుహవందన మిట్టి నిన్ను మూ
ఢనయి వెలార్చినాఁడను మరందపముం గమలంబునుండి చ
ట్టున బెదరించినట్టి టకటొంకుబలెన్ స్వగృహంబుఁ బ్రేయసీ!

అదియును నాదె తప్పు, మఱి యంతటికంటెను నాది గొప్పత
ప్పిదమిది, నీవు గావునను బెద్దఱికం బిటు నిల్చెఁగానిచోఁ
బదుగురు బ్రువ్వఁ దట్టరొకొ వాల్చినమో మెటు లెత్తుకొందు ని
న్నిదినములుండి యేటికిటు నింద్యము కార్య మొనర్పఁబోయితిన్.

ఈగడెదాఁక దైవము సహించెను నాయవకృత్యము ల్బతే
వేగమ లెమ్ము రమ్ము మనవీటికిఁ బోదము, పెద్దదాన! నీ
కీగతియంతయుం దెలిసె నేకద, దాఁపుము దీని, నీవు ర
మ్మా గమనించి మాకడకు మానక నిన్నను నేను బెంచెదన్.

ఇపుడే చల్లఁగ నీగృహంబు విడి నే నీకాంతతోఁ బోయెద
న్నిపుణంబౌగతి నాగృహంబునకు, రా నీవు న్రహస్యంబుగాఁ
జెపుదుం దక్కినవెల్ల రేపనుచు లేచె న్ముఖ్యసామగ్రితో
నపరాత్రిం బురి మాటుమణ్గుతఱి నత్యానందమార్గంబునన్.

పోవుచుఁ బోవుచుం గడుసుపోకల యాకలు బాదుగీయఁగా
నేవగ యందుఁ, బ్రొయ్యికడ నెప్పుడు నుండెడు నీళ్లకుండలోఁ
గా విడిపించి మూఁత యిడి, గాఢముగా మసిబొగ్గుతోడ వే
వేవెలగోడపై గొలికి వేసిరి కొక్కిరియుక్కరాలతోన్.

రాతిరివచ్చెనా తరుణి, రా నిఁక నింతటినుండి యంచు బం
ట్రౌతును వంటపుట్టికిని టంకము లిచ్చి పదింపఁబంపెఁ; న
య్యో, తెలవాఱకుండ నెటులో చని మూఁగది బాదు గీయ లే
దే తెఱఁగంచు నేడ్చు నలయిల్లలు యాతఁడు గాంచె నాలిపిన్.

ఏ నిదిరించుచుండ నెటులేగనో మూఁగది చూడలేదు కా
నీ, నిపుణంగ లేనె కడకేగిన యీముదిపొట్ట యంచుఁ జే
రొక్కనయితి న్మహోత్సుకిలు కొంచెమునా ళ్లని వృద్ధురాలు త
న్మానిని సేవ చేయుటకు నాఁటికినాఁటికిఁ బోయె నల్లనన్.

కూఁతుఁ ద్యజించె నల్లుఁ డమకుందునఁ గూఁడుచు నంతలోన న
క్కూఁతురు గానరామికిని గ్రుళ్లుచు గుమ్మడికాయలుంబలెన్
లోఁతగు నూతఁబడ్డటులు లోఁగినవారల కల్లజాబు దా
నేతమురీతి మీఁది కెగనెత్తెను దద్గతి నేమి చెప్పదున్.

కోడలివీడెఁ బుత్రుఁడని కోడలు నూడనిఁబాడెనంచు వె
న్కాడెడు నత్తమామలును నాత్మజు లేఖను గాంచి పొంగి ర
క్కోడలి మంచిచేతఁ దమకుం బరువచ్చె నటంచు మెచ్చుచూ;
బ్రోడలుఁ గ్రొత్తడు ల్పతులపోకల వంకలు దిద్దితీర్పరే!

---

# సీతా సందేశము

విద్వాన్, వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు

ఆంజనేయా!

నమ్మితిఁ దండ్రి నీదు వచనంబుల నిప్పుడు కోఁతియంచుఁ జి
త్తమ్మున నెంచియున్ దితిజతంత్రముగాఁ దలపోసియున్ విచా
రమ్మున నిన్ను ముంచితి నిరంతరదానవపీడ నొంది భ
గ్నమ్మయియుంట డెంద మిఁక నాపొరపాటు క్షమింపు మారుతీ!

చెంగట నున్నయప్పు డల చిత్రకురంగముఁ దెమ్మటంచు వే
భంగులఁ బీడవెట్టి, యెడఁబాసి మహావిరహాబ్ధి ముంచి భ
ర్తం గృశియింపఁజేసిన దురంతమతిన్ ననుఁ గాంచవచ్చి తే
భంగిఁ దొలంచుకొందువొ యపారపుఁ బాపము దీనిఁ బావనీ!

పాణింబట్టినదాదిఁ బ్రాణములకున్ బ్రాణంబుగా నుండు నా
ప్రాణేశుం డెటు లిన్నినాళ్లు సయిచెన్ వారాశి బంధింప, క
క్షీణాహంయువు రావణున్ దునుమ, కాకేలన్ ననున్ దాఁక, కీ
ప్రాణం బీతను వింకనున్ విడువ దీపై నేమి పాట్లున్నవో?

'జననివి నీవు నామది వచఃక్రకచంబులఁ జీల్చకమ్మ, రా
మున కొక నీచుఁ డెన్నఁటికి ముప్పొనరింపఁగఁజాలఁడమ్మ, నా
మనవి వినంగదమ్మ, నను మన్ననసేయఁగదమ్మ'యంచు మ్రొ
క్కిన మఱఁదిన్ దలంప మదిఁ గీలొక్కొను శోకము, లజ్జ యెంతయున్.

అట్టి మహాత్ముఁ బావను నిరాగసు భ్రాతృపదాబ్జభక్తు, న
ప్పట్టున నన్న యప్పరుషభాష లెదం దలపోయ సిగ్గుతే
కెట్టుల లక్ష్మణుండు సుఖియేయని నే నడుగంగఁజాలెదన్
గట్టిఁడిదైన మహాఘము నొనర్చితిఁ బాచిత మున్నె దీనికిన్?

పట్టాభిషేకంబు పడఁగొట్టి కైకేయి వనముల కంపిన వంతకంటె
భరతుండు వచ్చి దుర్భరమైన పితృమృతి వినిపించినపు డొందు వనటకంటె
నామనోనాథు శ్రీరాముని బెడఁబాసి పరుచేఁ బడిన పరిభవముకంటె
నీలంక రాక్షసస్త్రీల బాధలచేత సతతంబు నిటువొందు జాలికంటె
నిరపరాధు విశుద్ధు వినిశ్చలాత్ము-మఱఁది సౌమిత్రి నే నన్నమాట లెంచి
కొనఁ గలుగు దుఃఖ మెదనుండి కుమ్ములాడి కుమ్మువోలెఁ-గాల్చుచున్నది చల్లాఱఁ గందునొక్కొ.

రాముఁడు వానరోత్తమపరంపర వెంబడిరా, దశాస్యు సం
గ్రామమునన్ వధించి యనురాగమునన్ ననుఁ గొంచుఁబోవునాఁ

డామహితుండు నామఱంది యచ్చపు భక్తి నమస్కరింప నే
నేమని పల్కుదాననని యెంతయుఁ గుందెద నేఁటినుండియున్.

‘ వెతలు నీకేల వేగ నావీఁపు నెక్కి-రమ్ము! గొనిపోదు నారాము సమ్ముఖమున
కందకుండ రిపులకు, నింత కందకుండ’-ననెదవా? యంతవాఁడ వౌ దనిలతనయ!

మెచ్చితి నీదు భక్తికి నమేయపరాక్రమశక్తికిన్, రిపున్
గ్రొచ్చి నన్ భుజంబుపయి, కూరుచుకొంచుఁ జనంగఁజాలు దీ
వచ్చటులోగ్రవేగమున నంబుధిపైఁ జనుచుండునంతటన్
గ్రచ్చఱ నేను వార్ధిఁ బడఁగా గ్రసియింపవె వారిజంతువుల్?
పరపురుషుఁ దాఁకఁదగునే-వరసాధ్వుల, కపుడు నే వివశనై యుండన్
దురితాత్ముఁడు దెచ్చెనుగా-కరయఁగ నేఁ డట్లొనర్ప నగునే నాకున్.

ఎవ్వ రెఱుంగకుండ నను నీదురితాత్ముఁడు దెచ్చెఁ దొల్లి నేఁ
డవ్వరుసన్ రఘూద్వహుఁడు నక్కట దొంగటు మ్రుచ్చిలింపఁగా
నవ్వరె యెల్లవారుఁ దగునా రఘువంశ్యుల కీర్తి మాప, నా
కవ్వల నెవ్వి ఘోరమగు నాపద లైనను మారుతాత్మజా!

అంత యశక్తుఁడేని మనుజాధిపుఁ డూరక చూచిరం డటం
చింతటివారి మి మ్మనుపునే గణియింపుము తెండటంచు నొ
క్కింత వచించిన ల్లెఱుఁగుదే జగదేకధనుర్ధరుండు నా
కాంతుఁడు బేలమై యెపుడుగాని యటుల్ పలుకండు నమ్ముమా!

వగపునఁ ‘దెండ’టంచు నొకవైఖరి నాపతి పల్కఁగాక, నే
నగణితశౌర్యుఁడౌ రఘుకులాగ్రణికిన్ సతినై, దురాత్ముఁడౌ
పగతుఁ గళత్రపుత్రహితబాంధవయుక్తముగా వధింపకుం
డఁగ నెటు మ్రుచ్చుమచ్చున జనన్ మదిఁగోరుదు నయ్య పావనీ!

తనయుంగరంబు గాంచుచుఁ - దను వొక నెలదాఁకఁ దాల్చుదాన నటుపయిన్
ననుఁ గావఁడేని నామా-అని పతికి శిరోమణిని సమర్పింపు దయన్.

దశకంఠకంఠవిదళనంబు సేయక నాకంఠదాహం బణంగ దనుము
రాక్షసీదుఃఖాశ్రురాజిఁ గాంచకయున్న నావేడికన్నీ రణంగ దనుము
లంకను భస్మావిలంబు చేసినఁగాక నాచిత్తతాపం బణంగ దనుము
తనవచ్చి రాములు గనకుండ నూరక నాప్రాణవాయు వణంగ దనుము
బ్రదుకఁగదయంచు నాలసింపంగ సీత-తను వసురభోజనం బౌట తథ్యమనుము
రామునకు భక్తి నాచేయు ప్రణతు లనుము-మఱఁదిఁ గోరితి ననుము క్షమాపణంబు.

అడిగితి నేమమం చగచరాధిపుతో, యువరాజుతోడఁ బే
ర్పడిన ప్లవంగయూథపరిపాలకముఖ్యులతోడఁ బల్కు మె
ల్లెడ జయలక్ష్మిఁ జేకొనుచు నేఁగి రఘూత్తముఁ దెచ్చి వేగ నా
యెడ లడఁగంగఁజేయు మనిలాత్మజ! నీకు శుభంబు లయ్యెడున్.

# గుప్తు లేనాటివారు?

జయంతి వెంకటకృష్ణరావుగారు

మన దేశచరిత్ర పాశ్చాత్యచరిత్రకారుల కల్పనాసామర్థ్యమునుబట్టి నడచుచుండునుగాని సత్యమునకును దానికిని నేమాత్రము సంబంధ మున్నట్లు తోచదు. ఆదిని ఫెర్గుసన్, ఆపై ఫ్లీట్ పూర్వనాణెముల గాంచి యూహించిన యూహలును, మాక్సుముల్లర్ మాక్డొనల్ మొదలు గాగల పండితుల వాఙ్మయపరిశోధనలును దాస్యభారతజాతికొక జాతీయతగాని, చరిత్రగాని, ఖ్యాతిగాని పాశ్చాత్యపాలకలోకము కనుదెరువకము న్నున్న యట్లు అంగీకరింపనీయక వారిచే మనచరిత్రాంశముల నెన్నిటినేని క్రీస్తుశకములోనివిగ జిత్రింపజేసెను. అంతేకాదు, చాణక్యుని దండనీతియు, అశోకునిమతపిచ్చియు, హర్షుని ఛాందసమును, ఔరంగజేబు రాజ్యతృష్ణయు, శివాజీ దోపుడుబుద్ధియు మాత్రమే స్ఫుటముగచిత్రించు చరిత్రకారుల విశ్వామిత్రము ఈ పూర్వచారిత్రపరిగణన పొరపాటున జరిగిన ట్లూహింప నవకాశ మీయదు.

Year Books అనుపేరున వార్షికపాలనచరిత్రలు ప్రకటింపబడునపుడెల్ల మనపత్రికలు చేయు విమర్శనలే పాలకాదర్శములను, సత్యప్రియత్వమును వేనోళ్ల చాటుచుండ అట్టి కూడనిపనికై మాకెందు కాశ్రమ? కాని పుక్కిటిపురాణములుగాని విశ్వసింపదగుచరిత్ర లెట్టివియు మనకు లేవనియు, శాసనాదులగల వ్రాతలెల్ల కవికల్పితాలంకారములుగాని నిజముగావనియు, విదేశీయయాత్రికులవ్రాతలు, దేశభాష నెరుగని యజ్ఞానులు విన్న పిట్టకథలనియు మెకాలేకాలము నుండి వినుచున్న పాఠములవలన దేశీయచరిత్రపరిశోధకులును వారు పెట్టినదారినే పడి దరిగానక కొట్టాడుచున్నారు. ఇట్టిభ్రమనుండియె యెంతటిచారిత్రకోద్గ్రంథమునసైన 'కాబోలు', 'కానోపును', 'అనితోచును', 'ఊహింపపచ్చును' అని పెక్కుసార్లు విషయవర్ణనచేయుట వాడుక యైనది.

కావున నవీనులును, ఉద్యోగవాంఛనో, లేక గౌరవాభిలాషనో పాశ్చాత్యవిద్యాలయములలో మనపౌరాణికభాషల కొలదిగ నేర్చియచట తమదేశీయులు కూడవేసిన మనపౌరాణికసామగ్రుల యుబుసుపోకకై తిరుగవేసి పరిశోధనఫలితములని కల్పితగాథల నేర్పగ వ్రాయువారును మనకు గురుపీఠస్థులుగ భావింపక, కొంతకుకొంత వారు సమన్వయింపనేరక యవిశ్వసనీయములని వీడిన పరికరములను, స్వతంత్రముగ మనవారు పరిశోధించినయెడ మనదేశచరిత్ర యిట్టిదని, నేటికైన మన మెరుగ నవకాశ మబ్బును.

ఇందు కుదాహరణముగ ప్రఖ్యాతగుప్తవంశీయపాలనకాల మొకటి యీవ్యాసమున చర్చించి యావిషయమున పాశ్చాత్యులు వ్రాసిన వ్రాత లెంతగ సత్యదూరములయ్యె దేశీయపరిశోధకులగూడ భ్రమపా లొనరించెనో చూప నెంచితిని. భ్రమప్రమాదముల తమ వ్రాత లెన్నియో తప్పులగునని యెంచి, నవీనపరిశోధకులు నన్ను దూషింపక, నేపొరబడియున్న దాని నెరిగించి నాసాహసమును మన్నింప వేడుచున్నాను. ఈపరిశీలనమే తగినదని నచ్చిన, దీనినిబట్టి తమశోధనల సవరించి, మనదేశీయచరిత్ర కెంతయు నుపకరింప ప్రార్థన.

భారతేతిహాసమున సువర్ణయుగ మనందగు గుప్తసామ్రాజ్యకాలమున దేశీయసాహిత్యశిల్పసౌభాగ్యములెల్ల నుచ్ఛస్థితి గాంచెనని మనచరిత్రలన్నియు నొప్పుకొనుచున్నవి. ఆనాటి సాహిత్యము, ఆనాటిశిల్పమేగాక, ఆనాటి శాసనావళియు, నాటి నాణకసంచయము గూడ మనపరిశీలన కనువుగ లభించుచున్నవి. ఈశాసనసంచయమున కొన్నింటి చేర్కొనిన వార్షికసంఖ్యగూడ మనకు గోచరమగుచున్నది. కాని గుప్తాబ్దములగణన మాత్రమే మనము పొరబడి, శాసనావళినున్న వ్రాతలన్నియు కవికల్పితగాథలనియు, యవిశ్వసనీయములనియు భ్రమచెందుచున్నాము. దిగ్విజేతయై, శకయవనకుశానమురుండుల నదిమి, దక్షిణాధీశుల నెందరినో జయించి, కప్పములు గొని, నిజవిక్రమమున విక్రమశక మొకటి సృష్టి జేసిన గుప్తసార్వభౌముల సుమారు నాలుగు శతాబ్దములు ముందుకీడ్చి, వారి జయస్తంభములపై ప్రశస్తులగాథలనియు, వారిశాసనము లన్వయింపమిని కృత్రిమములనియు చెప్పుట ద్రోహము

కాదా! "దైవపుత్రషాహి షాహానుషాహి" బిరుదాంకితులగు కుశాను పాలకుల జయించె నను సముద్రగుప్తుని కీర్తికి, పాశ్చాత్యుల యూహా సృష్టిని తప్ప మరెచ్చటను గానరాని కుశానుల కొందరిని ముడిపెట్టి యీ యనామకులనా గుప్తవిజయమునకు గురిచేయుట? ఆంధ్రక్షాత్రప వాకాటకాదిగుప్తసమ్రాట్టుల సమకాలికులకు దమ నవీనసృష్టిని దావు గానక వీడ నవసర మేమి? శకకర్తయగు విక్రముడు జైనమతస్థుల సృష్టిసంజాతుడనియు, మాళవహర్ష శకములు వర్ధనవంశీయుడగు శ్రీహర్షుని నిర్మాణములనియు చెప్పుదురు. అంతేకాదు, శాక్యముని నిర్యాణముచెందిననాటినుండిగణించుగణనను శాలివాహనశకముగ గణించి కూడ యెన్నియోచరిత్రాంశముల పెడత్రోవ బెట్టినారు. ఇవన్నియు చర్చింప నిట చోటు చాలదు. కాన శీర్షికను బేర్కొనినట్లు గుప్తులేనాటివారో పరిశోధించి యీవ్యాసమును ముగింతును.

గంటమునగాని, కలమునగాని వ్రాసిన వ్రాతలకన్న శిలాక్షరములును, లోహముద్రణములును మన నవీనుల కెక్కుడు ప్రమాణములగుట యట్టివానినె మొదట పరిశోధించి, యవి చెప్పక చెప్పు విషయములు లిఖితగ్రంథావళినుండి నిజమని ఋజువుచేసి ఆపై కవికల్పితగాథలును, భాషాజ్ఞానశూన్యుల వ్రాతలుగూడ మననిర్ణయముల నెంతగ బలపరచుచు వాటి సత్యసంధత్వమును ప్రకటించుచున్నవో తెల్పెదను.

విక్రమశక మనబరగు గణన, క్రీస్తుపూర్వము ౫౭ ఏండ్లనుండి ప్రారంభమైనదని యెల్ల రంగీకరించుచున్నారు. విక్రమాదిత్యబిరుదాంకితులగు గుప్తసార్వభౌములెల్లర శాసనములును ఈగణన ననుసరించుచున్నట్లు స్పష్టమగుచున్నది. కాని వారి శాసనావళినున్న యంకెల కొక (౩౧౯ + ౫౭, ౫౭ ఏండ్లుమాత్ర మెక్కువచేసి వారి కాలమును ముందున కీడ్చుట, ఫ్లీటుదొరకాలమునుండి యానువాయితమైనది కాని దీని నా పాశ్చాత్యులే కుశానుప్రభువుల శాసనావళిని గాంచి, కనిష్కునికాలమున నిది ప్రారంభమైన ట్లంగీకరించుచున్నారు. క్రీ. శ. ౭౮ సంవత్సరములకు పాలకత్వము వహించెనని చెప్పబడు కనిష్కుడైన తనకాలమునకు ౧౩౫ యేండ్లు ముందునుండి యీవిక్రమశక మారంభమైన ట్లేల గణించవలయునో తెలియకున్నది. అంతేకాదు; కుశానుసామ్రాజ్య మనబరగు సీమకు దక్షిణపుకొననున్న క్షాత్రపులును, వారిబంధువులును ఈవిక్రమశకసంవత్సరములనే తమశాసనములందు వాడుట చూడ కనిష్కుని పాలనారంభమునకు ముందుగనె యీగణన యీకుశానుల సామ్రాజ్య మందంతటను వాడుకలో నున్నదని యెంచవలయును. ఈ రీతిగ విక్రమశకమనబడు గణన కుశానులసామ్రాజ్యమనబడు సీమలందెల్ల వాడుకలో నున్నదని తేలినది.

కాని యీ కుశానుల యేలుబడికి చెందిన ట్లెచ్చోటను బేర్కొనబడని నేపాళమునందును సరిగ నాకాలముననె యీగణనము ప్రచారమున కనబడుచున్నది. తూర్పుకొననున్న కామరూపముననూడ ఈగణనము కాన్పించుచున్నది. వాకాటకశాసనావళియు దీనినే యుపయోగించుచున్నది. నేపాళకామరూపచేదిరాజ్యములం దీకుశానుల గణన మేల యనుసరింపబడినదో, చరిత్రకారులు తెలియజేయకున్నారు. నేపాళ(రాజ)వంశావళిని మాత్రము స్పష్టముగ, అంశువర్మ నేపాళమునకు పట్టాభిషిక్తుడు గాకము న్నే రాజ్యమును విక్రమాదిత్యుడు జయించి తమశకగణన మచ్చోట నెలకొల్పెననియు, అంశువర్మాదినేపాళపాలకులు సామంతులును, మహాసామంతులుమాత్రమే కాని స్వతంత్రులు గారనియు వారి శాసనములే తెలుపుచున్నవి. (నేపాళశాసనావళియందలి అంశువర్మ ౩౪, ౩౯, ౪౫ వత్సరములశాసనములు చూడనగు.) అంతేకాదు. క్షాత్రపరుద్రదమనుని వైరియు, విశేషించి బంధువునైన గౌతమీపుత్రశాతవాహనుని రాజ్యమునకూడ ఈవిక్రమాబ్దగణనమే ప్రచారమున నున్నటుల నాసికలోని శాసనములనుండి స్పష్టమగుచున్నది. చేదియందలి వాకాటకులకుగూడ ఈగణనమే పరిపాటియయినది. అట్లింతగ నన్నిరాజ్యముల ప్రచారముననున్న విక్రమశకము ఆకాలమున విక్రమాదిత్యబిరుదాంకితులగు గుప్తసార్వభౌములనుండికాక వేరెవ్వరివలన నెలకొల్పబడియుండును?

మౌర్యులపాలనాంత్యకాలమున యవను లాక్రమించి పాలించుచుండిన మన దేశపు పాశ్చాత్యసీమలందు కుశానువంశీయులు దమరాజ్యమల్లిరి. వారికాలమున నాయవనభూములందు సెల్యూకశకము (Seleucid Era) ప్రచారమున నుండెను. బౌద్ధనిర్యాణానంతరము నాలుగువందలయేండ్లకు జన్మించెనని బౌద్ధగాథలనుండి తెలియవచ్చు కనిష్కుడు, యవనచీనాభూపతుల నోడించి తనప్రతాపమును శిలాక్షరముల వెల్లడించిన శాసనమున ౪౧-సంవత్సరమొకటి గానవచ్చుచున్నది. ఆశాసనముననే యతనిసమకాలికులందెల్ల విఖ్యాతులైన రోమకసామ్రాట్టు లుపయోగించు 'కైసరస' బిరుదమును గనుపట్టుచున్నది. ఆనాటి కనిష్కుల నాణెములందు యవనదేవతామూర్తుల ప్రతిమలు చిత్రింపబడియున్నవి. ఇవన్నియు నొక్కడ చేర్చి చూచిన, శాసనముఖమున ౪౧కి ముందు కానరాకుండ అరిగిన ౨ స్ఫురించి అది సెల్యూకశకగణనమని విశదమగుచున్నది. క్రీ. పూర్వము ౩౧౨న ప్రారంభమైన యీ సెల్యూకశకమున ౨౪౧ మనకు క్రీ.పూ. ౭౧ గా విశదమై అప్పటికి ముప్పదేండ్లవయసుగల కనిష్కుని ప్రతాపమును వెల్లడించుచున్నది. చీనా, టిబెట్టు దేశస్థుల వ్రాతలనుబట్టి పాటలీపుత్ర సాకేతభూపతులతోడ కనిష్కుడు పోరాడినట్లు తెలియుచున్నది. అలహాబాదునందలి జయస్తంభమున గల సముద్రగుప్తుని విజయప్రశస్తిలో 'దైవపుత్ర షాహి షాహాను షాహీ' బిరుదాంచితుల నతడు యువరాజుగ నున్నకాలమున నోడించి మరల వారిని వారి రాజ్యములందే ప్రతిష్ఠించెనని కలదు. ఇంతేకాదు; మొదటి విక్రమాదిత్యుడని పేరొందిన సముద్రగుప్తజనకుడు (చంద్రగుప్తుడు), వానివంశజులును ప్రచారమునకు దెచ్చిన వత్సరగణనమె కనిష్కుని తక్కినశాసనములందును, నాణెములందును



1. మదరాసు నేషనల్ బ్యాంకు డైరెక్టరు, శీరం బలరామమూర్తిగారు; 2. ఈరంకి వేంకటశాస్త్రిగారు; 3. వట్టూరి సుబ్బారావుగారు — తొమ్మిదవ ఆంధ్రవిద్యార్థి మహాసభ (బందరు) ఆహ్వానసంఘాధ్యక్షులు; 4. జి. శ్రీరాంబాబునాయుడుగారు; 5. గోగులపాటి గంగాధరంగారు.




1. గేదెల సుందరనారాయణ నాయుడుగారు; 2. మహమద్ జాఫరల్లీ సాహెబుగారు; ౩. ఆలపాటి కుటుంబరావు శ్రేష్ఠిగారు;
4. బొండాడ సింహాచలమూర్తిగారు; ౫. అల్లూరు నరసింహరాజుగారు.

గానవచ్చుచున్నది. కాబట్టి యీ కుశానభూపతి గుప్తుల సమకాలికుడే కాక, వారి సామంతుడుగూడ నైయుండెనని స్పష్టమగుచున్నది.

గౌతమీపుత్రశాతకర్ణిచే నోడింపబడిన క్షాత్రపనహపాణుని వెనుక, గౌతమీపుత్రు నోడించి బంధుత్వకారణమున వాని మన్నించి విడిచితినని శిలాక్షరముల చెక్కించుకొనిన మహాక్షాత్రపరుద్రదమనుడు ౧౮, ౨౪ సంవత్సరముల తన శాసములందు పేర్కొనుచున్నాడు. రుద్రదమనుని పుత్రుడు సముద్రగుప్తసమ్రాట్టుకడకు రాయబార మంపెను. కాన గౌతమీపుత్రాద్యాంధ్రచక్రవర్తులు గుప్తుల సమకాలికులనియు, వారు తమశాసనములలో 'శకనృపాంతకాలము' దనుక వాడిన వత్సరగణనము గుప్తరాజుల విక్రమశకమో, తత్పూర్వపు (బుద్ధనిర్వాణ) శకకాలగణనమో యైయుండుననియు స్పష్టమగుచున్నది.

గుప్తులతోడి సంబంధబాంధవ్యములు గలిగిన ప్రఖ్యాతవాకాటక (చేది) భూపాలురు తమశాసనములలో పేర్కొను వ్యాఘ్రదేవజయనాథుల శాసనములందు గుప్తగణనమునే (౧౭౪ సం)వాడుట జూడ దక్షిణమునగూడ యీవిక్రమశక మెంతగ వాడుకలో నుండెనో విశదమగుచు, వారి సమకాలికులగు మన భూపాలురెవ్వరో తెలియుచున్నది.

ఇంతగ శాసనావళినుండి గుప్తుల కాలనిర్ణయము చేసి చూపితిమి, దేశీయపాలకులనాణెములనుండియు పైన పేర్కొనిన కాలనిర్ణయము ధ్రువపడుచున్నది. కనిష్కుని నాణెములపయిని పాలనప్రారంభదశను, కుశానులకు యవనులతోగల సంపర్కమును దెలియజేయు సూర్యచంద్రప్రతిమలు, వాటి గ్రీకుపేరులు నున్నవి. ఆవెనుక, పారసీక జరాష్ట్రియనుప్రభ వాటిపై ప్రతిబింబించుచున్నది. ఆఖరుదశను, బౌద్ధమూర్తిని గలిగి భారతీయసాంగత్యమున విదేశ కుశాను లెంతగ మారిరో విశదమగుచున్నది.

హువిష్కుని నాణెములందు గజారోహణబింబములు, కాలీపై కాలు వైచుకొని వీణాగానలోలుడగు చక్రవర్తి సముద్రగుప్తునిబోలె సింహాసనమున గూర్చుండు మూర్తులును కుశాను లెంతగ సమ్రాట్టుల ననుకరించుచుండిరో విశదము చేయుచు, వారి సమకాలానువాదమునే ధ్రువపరచుచున్నవి.

కుశానువాసుదేవుని నాణెములందుగల శివనంది మూర్తులు, వారు కుమారసంభవకావ్యకర్తృపోషకుల సామంతులని విశదీకరించుచున్నవి. కడగొట్టుకుశానుపాలకుల కాలమునకు గుప్తసామ్రాజ్యమున పొడజూపిన దుర్బలత్వము వారు స్వతంత్రించి, తమనాణెముల నాకాలమున దమతోడ చాలగ వ్యాపారము చేయుచున్న రోమకసార్వభౌముల నాణెములరీతి ముద్రింప ప్రోత్సహించినవి.

ప్రఖ్యాత కుశానుపాలకుల నాణెములనుబట్టియే వారికిని గుప్తులకును గల సంబంధము ఎప్పట్ల నేరీతిగా నుండెనో తెలియవచ్చుచున్నది. ఆ కుశానుల సామంతులగుమధుర ఉజ్జయిని పాలకులగు క్షాత్రపుల నాణెముల పరిశోధనయు మన నిర్ణయమునే మరింతగ బలపరచుచున్నది. హగమ హగమషాది మధుర క్షాత్రప నాణెములును, నహపాణుని ఉజ్జయినినాణెములును నొకేమాదిరి వగుటను, గుప్తసామ్రాజ్య ప్రారంభకాలమున నీరీతినాణెములు గుప్తులు ముద్రింపకుండుటను బట్టియు మన కాకాలమున గుప్తసామ్రాజ్య మింకను విదేశజుల నేమాత్రము ననుకరింప నవసరము లేకుండెనని విశదమగు చున్నది. కాని నానాటికి గుప్తులు ముద్రించిన వెండినాణెములు క్షాత్రపనాణెములను బోలి యుండుటను చూచినను శాతవాహనులు క్షాత్రపనాణెములనే పునర్ముద్రణ మొనర్చియు, దాము ముద్రించిన నాణెములు గూడ క్షాత్రపనాణెములనే పోలిన ట్లుండుటయు జూడ, పాశ్చాత్యవాణిజ్య లాభమును గుర్తించి, రానురాను గుప్తచక్రవర్తులును సాటి శాతవాహనుల బోలె వెండినాణెముల ముద్రించి వ్యాపకమునకు దెచ్చిరని స్పష్టమగుచున్నది. పెరిప్లస్ వ్రాసినపాశ్చాత్యులే ఆది సాడగానస్ (శాతకర్ణి) వశమైయుండిన కల్యాన్, సోపరా (రేవుస్థలములు) స్కాందరస్ (స్కందగుప్తుడు)చే జిక్కిన వెనుక నమితమగునిర్బంధములకు లోనై, యారేవుల జేరు పాశ్చాత్యనౌకలు భరుకచ్ఛమునకు గొంపోబడుచుండెనని వ్రాయుటచూడ, గుప్తసామ్రాజ్యాంతిమదశను పాలకు లెంతదీక్షగ నీవాణిజ్యమునుండి వచ్చుసుంకములకై యాశించియుండిరో తెలియనగును. అంతేగాక నాటి రోమకరాజధానిలోని రాజకీయవేత్తలు, ఈ భారతీయ వ్యాపారమున తమభాండారములు గుల్లపారుచున్నవని యుద్ఘోషించుటచూడ, గుప్తులనాడు మన వాణిజ్య మెంతటియుత్కృష్టదశనుండి లాభదాయకమైనదియు తెలియగలము.

శాసనావళినుండియు, నాణెములనుండియు నింతవరకు గుప్తకాలనిర్ణయము చేసితిమి. ఇక మనకు మిగిలిన దేశీయగ్రంథావళినుండియు, ఇరుగుపొరుగు దేశములనుండి యానాడు మనదేశమున కరుదెంచిన యాత్రికుల వ్రాతలనుండియు, మన గుప్తకాలనిర్ణయ మెంతవరకు నిజమైనదియు పరిశీలింతము.

గుప్తుల సమకాలికులనియు, వారి యాశ్రితకోటికి చెందినవారనియు చెప్పబడు విక్రమాదిత్యుని నవరత్నములు వ్రాసిన వ్రాతలు కొన్ని యానాటివే యని పాశ్చాత్యులు నొప్పుకొందురు. గుప్తులతోడనే యాగ్రంథకర్తలకును నవీనతమాత్ర మారోపింపబడినది. కాని వారి వ్రాతలలోని శైలినిబట్టియు, విషయములబట్టియు మనకాలము గూడ పోల్చుకొన కొంతగ నవకాశ మబ్బుచున్నది. నాటి విదేశయాత్రికు లెంతటి దేశభాషాజ్ఞానశూన్యులైనను మన గుప్తకాలనిర్ణయమున వారు పొరబడలేదో తెలియజేయ యత్నింతుము. దేశీయగ్రంథసంచయమున లభ్యమగు నాటి వరాహమిహిరాచార్యుని బృహత్సంహిత, అమరదేవుని అమరుశతకము, శంఖలిఖిత ధర్మశాస్త్రము, భేతా

కుని భట్టికావ్యము, ఘటకర్పరక్షపణకాదుల గ్రంథములును కొన్ని లభ్యములగుచున్నవి. కాళిదాసు రచన లెన్నియో కానవచ్చుచున్నవి. ఈ నవరత్నములకాలమును మనము తొలుత నిర్ణయింతము.

బ్రహ్మగుప్తుని ఖండఖాద్యమను జ్యోతిష గ్రంథమునకు వ్యాఖ్యాతయగు అమరజుడు, వరాహమిహిరాచార్యుడు శకకాలము ౫౦౯లోన దివంగతుండయ్యెనని వ్రాసినాడు. శకకాలమనునది శాక్యముని బుద్ధదేవుడు నిర్వాణమార్గము కనిపెట్టినకాలమని నేటికిని ఆగణనమునే యనుసరించు కాంభోజాది (Cambodia and the Extreme Orient) దేశములలో వాడబడుచున్నది. వరాహమిహిరుని బృహత్సంహితలోనే శకకాలారంభము యుధిష్ఠిరపాలనకాలమునకు ౨౫౨౬ వత్సరముల వెనుక నని చెప్పబడియున్నది. క్రీస్తుశకారంభమునకు ౩౧౦౨ ఏండ్లు నిండినదని చెప్పబడు యుధిష్ఠిరకాలమున, ౨౫౨౬ వత్సరముల కనగా క్రీ. పూ. ౫౭౬ అని విశదమగుచున్నది. కాబట్టి వరాహమిహిరాచార్యుడు దివంగతుడయ్యెనని జెప్పబడు ౫౦౯ శకకాలము క్రీ. పూ. ౫౭౬-౫౦౯ లేక క్రీ.పూ. ౬౭-వ వత్సరము కావలెను కాబట్టి గుప్తులకాలమని మనము నిర్ధారణచేసిన విక్రమవత్సరములలో నిది ౨౧-వ వత్సరమై సముద్రగుప్త చక్రవర్తిపాలనమున జరిగియుండును. అందుచేత నాచక్రవర్తికిముందుగ పాలించియుండిన శకకర్త విక్రమాదిత్యుని రాజసభనీవరాహమిహిరు డుండెననుటకు సందేహ మేమి?

బుద్ధగయలో విహార మొకటి నిర్మింప, సింహళమునుండి బౌద్ధులు వేడరాగ, సముద్రగుప్తుడు వారి కనుమతి నిచ్చియుండెనని మన మెరుగుదుము. హ్యూనిత్సాంగు అను చీనాయాత్రికుని వ్రాతలనుండి సింహళమున గల శ్రీమేఘవనమునుండి యిద్దరుభిక్షులు(బౌద్ధసన్యాసులు) బుద్ధగయయందలి బోధివృక్షమునకు తూర్పుగ అశోకచక్రవర్తికట్టించిన విహారమునగల రత్నసింహాసనమును దర్శింపవచ్చి యచట సత్కారము వడయనేరక మాతృసీమ కరిగిరనియు, వారి ప్రోద్బలమున సింహళభూపాలుడు తనదేశస్థులవసతికై యాపుణ్యక్షేత్రమున సంఘారామమును సముద్రగుప్తుని యనుమతివేడి కట్టించెననియు దెలియవచ్చుచున్నది. సముద్రగుప్తప్రశస్తియు ఈసింహళరాయబారమును బేర్కొనుచున్నది. ఈ మహాబోధిసంఘారామమునె హ్యూనిత్సాంగు దర్శించినట్టుల వర్ణించినాడు. 'నవరత్నము'ల నొక్కడని బేర్కొనంబడు అమరదేవుడు (అమరసింహుడు) బౌద్ధుడని మన మెరుగుదుము. బుద్ధగయలోని ఆలయశాసన మొకటి ౧౦౧౫ విక్రమవత్సరమునందలిది—ఈ యాలయము "విక్రమాదిత్యుని నవరత్నములలో నొకడగు అమరదేవ నిర్మాణ"మని తెలుపుచున్నది. ఆలయ ప్రాచీనత అందుగల సం.౨౬౯ము నాటి వేరొండుశాసనమువలన ధ్రువపడుచున్నది. ప్రఖ్యాత బౌద్ధక్షేత్రమున విదేశజులు ధర్మశాలలు గట్టుచుండ, సార్వభౌమాశ్రితుడగు అమరు డట నాలయనిర్మాణ మొనరించుటలో నాశ్చర్యమేమున్నది? గయలోని బుద్ధాలయము గుప్తులనాటిదని శిల్పశాస్త్రవిశారదు లెల్లరు నంగీకరించుచున్నారు. కాబట్టి అమరసింహుడు గుప్తులకాలమువా డని నిశ్చయ మొనర్పవచ్చును.

ధన్వంతరియు, అశ్వఘోషుడును కనిష్కుని రాజసభ నుండిరనియు, అందు ధన్వంతరి యా కుశానపాలకుని విఖ్యాతవైద్యుడనియు చీనాగ్రంథకర్తలే తెలుపుచున్నారు సామంతతుల్యుడు, విక్రమాదిత్యునౌదార్యమున పునఃప్రతిష్ఠగాంచినవాడు నగు కనిష్కునుండి యా గుప్తసార్వభౌముడు ధన్వంతరిని తనసభకు దెచ్చుకొనుటలో వింత లేదు. శంఖ లిఖితులు ప్రఖ్యాతధర్మశాస్త్రకారులని వింటిమి. గుప్తులనాడు శకకుశానముకుండబర్బరులదాడుల నలిగి విలుప్తమగుచుండు ఆర్షధర్మము పునరుద్ధారిత మయ్యెను. ప్రఖ్యాతధర్మశాస్త్రకారుడగు శంఖుని విక్రమాదిత్యుడు చేరదీసిన నాశ్చర్యమేమి? భట్టికావ్య మనంబడు అలంకారశాస్త్రము(?)ను బేతాళభట్టు రాముని గాథ నూతగాగొని రచించెను. ఇక ఘటకర్పర వరరుచి కాళిదాసాదులనుగూర్చియె పరిశీలించవలయును.

ఇందు కాళిదాసుని కాలనిర్ణయమును గూర్చి కొలదిగ శోధించి దానిమూలమున గుప్తుల కాలనిర్ణయము చేయుదము. జ్యోతిర్విదాభరణము ౩౦౬౮ కలియుగాబ్దిని (అనగా ౩౧౦౨-౩౦౬౮ లేక ౩౪ క్రీ.పూ.) రచించిన ట్లాగ్రంథమునందే కలదు. దీనినిబట్టి విక్రమశకము ౨౪ సం వత్సరమున నది రచింపబడినదని విశదమగుచున్నది. కాని జ్యోతిర్విదాభరణము కాళిదాసురచన కాదని పాశ్చాత్యులును, వారిశిష్యకోటియు వాదింతురు. కాని కాళిదాసు వ్రాసిన యితరగ్రంథములు నెన్నియో కలవు. వాటిలోగల విషయసామగ్రిని, శైలిని పరిశీలింతము. అశ్వఘోషుడు కనిష్కపోషణమున బుద్ధచరితమను మహాకావ్యమును వ్రాసెను. దానికి ప్రతియో యనదగు రఘువంశమునందలి వర్ణనలు అశ్వఘోషుని శైలికున్న కర్కశత్వము లేక సరళములై రఘువంశకర్త అశ్వఘోషుని సమకాలీనుడో, తరువాతితరమువాడో యని తోపించక మానవు. కుమారసంభవకర్త స్కందకుమార నామకగుప్త వంశజుల పోషణను పెరిగియుండునని స్ఫురించును. సాకేతరాజవంశజులగు గుప్తుల పోషణముననున్న కాళిదాసు గుప్తవంశకీర్తిస్తవము మనమున జాతము కాగా రఘువంశస్తుతికి నెట్టుకొనుట సహజమే! వందిమాగధులు విక్రమాదిత్యు ననుక్షణము స్తుతింప వినకతీరని రాజసన్నిధిని పురూరవనాటకమునకు విక్రమోర్వశీయమని నామకరణము చేయ మనము బోవుటయం దచ్చెరువేమి? అశ్వమేధయాగోద్ధారకులగు గుప్తసార్వభౌముల రాజ్యప్రాంగణమున విహరించుకవితల్లజునకు, సంగవంశజులగు సార్వభౌములుగాక, బాణాదికవికోటికి నచ్చిన వత్సరాజాదు లేల నచ్చుదురు? భారతీయప్రతాపకీర్తులు పునరుద్ధరింప కంకణము గట్టి, బర్బరవిదేశవాహినుల బారద్రోలి ఆర్ష నాగరికతకు మెరుగుపెట్టు గుప్తులయింటి కవి, భరతజననగాథను గాక వేరెద్ది తననాటకరాజమునకు మైదీగ జేయ నిచ్చగించును? వేయేల? ఆకవికోకిలము మేఘసందేశమునకు తగు

నని యక్షుని, అదియు రాజదండనానుసారము దేశమూరుడై ప్రవాస మునున్నవానిని, కథానాయకుని జేయుటయందే అతనికి యక్షు (Yeuchi) జాతు లెంతగ పరిచితులో, వారి కాలక యెంతటి ప్రేమాస్పదనీయమో తెలియవచ్చుచున్నది. మేఘునకు త్రోవజెప్పుచు, కవి, విదిశయు ఉజ్జయిని యవంతిభూములను, కురుక్షేత్రమును బేర్కొని అలకానగరి కేగుమనినాడు. ప్రఖ్యాతములగు వారణాసి, ప్రయాగ, గయ, పాటలి మొదలగు తావు లెన్నియో వీడినాడు. కారణ మొకింతగ నరయుదము. విదిశాధీశులగు సంగకణ్వసార్వభౌముల యేలుబడిని ంప మొనరించిన బర్బరులగు విదేశజుల నందరి నదిమి గుప్తులు నిజసామ్రాజ్యమల్లిరి. పుష్యమిత్ర వంశజుల మూలబట్టించి వారిస్థానమున సామ్రాజ్యభోగము లనుభవించు కాణ్వుల నాంధ్రు లదిమివైచిరి. విదిశానగరియు, దానియందింకను మిగిలి ముస్కుందు గుప్తుల నెదిరింప సమర్థత చేకూర్చుకొనుచున్న సంగవంశజులును రాజమందిరవాసియగు కాళిదాసునకు మర పెట్టువచ్చెదరు ? మాళవికాగ్నిమిత్రమున చిత్రించిన సంగసార్వభౌమ రాజధాని విషయాలోలావాసమని గుప్తులకవి వర్ణింపక పోవునా ? ఇక ఉజ్జయినియు, నవంతియు తన ప్రభుబలంబుల నను నిత్యము బలపరీక్షకు డీకొనుచుండు రాష్ట్రలు. రాజుతోపాటు తాము నరిగి సైనికశిబిరముల కడగండ్లపడు భూము లాకవిగీతి కెక్కకుండునా ? ఇక కురుక్షేత్రరంగము భారతీయ హృదయక్షేత్రమునుండి యెడమైన దెప్పుడు ? మధురమందు శకక్షాత్రపులను, వారికుశానురాజులను గుప్తు లెన్నోచోట నోడించియుండిరో యా రావులు గుప్తకవివాణి బేర్కొన మరచునా ? ఏటులాలోచించినను కాళిదాసుని వ్రాతల నతని పోషకుల కార్యకలాపములు కనులువిప్పిచూచినవారికి గనుపింపకపోవు.

ఇంకొక్క విషయము. మేఘదూతమున ౧౪-వ శ్లోకమున సూచింపబడిన దిఙ్నాగుడు వ్యాఖ్యాత మల్లినాథునిచే కాళిదాసుని సమకాలికుడగు దిఙ్నాగాచార్యుడుగ భావింపబడుచున్నాడు. తార్కికచక్రవర్తియనందగు బౌద్ధదిఙ్నాగుడు కాళిదాసునికిగూడ తప్పులెన్నుచుండినట్లును, వానిపోరున నాకవియనము కలతనొందుచుండునట్లును, ఇతర సహవాసబలమున నట్టికించ చాలగ దొలగుచుండునట్లును ఇందు ధ్వనించుచున్నది. ఈదిఙ్నాగు డెవడు ? ఏకాలమువాడు ? త్రివిష్టప గ్రంథకర్తయగు రత్నధర్మరాజు బుద్ధభాగవతమను గ్రంథమున, దిఙ్నాగుడును ధర్మకీర్తియు ఆర్యఅసంగునను బౌద్ధగురుని శిష్యులనియు వారు ప్రమాణశాస్త్రము (తర్కము)న ఘటకులనియు వ్రాయబడియున్నది. వాచస్పతిమిశ్రుడు "దిఙ్నాగాదులవ్రాతలను ఖండింప పక్షిలస్వామి గ్రంథమునకు ఉద్యోతకరాచార్యుడు వ్యాఖ్య వ్రాసె"నని చెప్పుచున్నాడు. పక్షిలస్వామియని చాణక్యునకు బేరున్నదనియు, ధర్మార్థకామ శాస్త్రముల నతడు వ్రాసినట్లును వినుదుము. బౌద్ధమతవిజృంభణ నరికట్ట నతడు వ్రాసినవ్రాత నొకటి గైకొని దిఙ్నాగాదుల వాదముల ఖండింప ఉద్యోతకరుడు తనవ్యాఖ్య వ్రాసియుండును. క్రీ. పూ. రెండవశతాబ్దమున పక్షిలస్వామిచే వ్రాయబడిన గ్రంథమునకు వ్యాఖ్య వ్రాసి స్వమతఖండనమండన మొనరించుటచూడ యాఖండనకర్త లాపక్షిలస్వామితరువాతివారై యుందురని తోచును. కాబట్టి దిఙ్నాగుడు క్రీ. మొదటిశతాబ్దినుండుట కవకాశమున్నది. ఇంకొక్కవిశేషము. పరమార్థుడను గ్రంథకర్త వసుబంధుని జీవితకథ వ్రాసియున్నాడు. ఈవసుబంధునికడకు విక్రమాదిత్యుడు తనపుత్రుని బాలాదిత్యుని చదువ బంపెననియు, బాలాదిత్యుడు పట్టభద్రుడైనవెనుక వసుబంధుని నిజరాజధాని కాహ్వానించి వాని నెంతగనో పూజించి సత్కరించెననియు వ్రాసియున్నాడు. మెక్డొనల్ పండితుడు వసుబంధుశిష్యుడు దిఙ్నాగుడను బౌద్ధగాథల నంగీకరించుచున్నాడు. ఆర్యఅసంగునిసోదరుడును, శిష్యుడును నగు వసుబంధునికి, అసంగశిష్యుడగు దిఙ్నాగుడు శిష్యుడును, సహవాసియు నగుటలో నాశ్చర్యము లేదు. ఇంక వసుబంధునామధేయులు ముగ్గు రున్నారందురు. ఇందొక్కడు కనిష్కుడాహ్వానించిన బౌద్ధమతసభ కధ్యక్షుడని యెరుగుదుము. అతనికొమరుని (వసిష్కుని) కాలమునసే వేరొక వసుబంధనామధేయుడు విఖ్యాతు డుండినట్లు విందుము. కనిష్కవసిష్కలకాలము విక్రమాదిత్యసముద్రగుప్తుల పాలనకాలమునకు సరిపోవుచున్నదని ఋజువు చేసితిమి. కాబట్టి దిఙ్నాగగురు డీవసుబంధువే యని నిర్ణయింప నవకాశ మబ్బుచున్నది. ఇంక మూడవవసుబంధుడు గుణమతిశిష్యుడట; క్రీ. శ. ౫ లేక ౬ శతాబ్దములవాడట. కాబట్టి వానిని గూర్చి శోధింప మన కవసరము లేదు. రాజగురుడగు వసుబంధుని సహవాసియు, శిష్యతుల్యుడో, శిష్యుడో యగు దిఙ్నాగుడు స్వతస్సిద్ధముగ గొప్పపండితుడు. ఆశ్రయబలమును నిజవిద్యాబుద్ధిబలంబులు నాబౌద్ధతార్కికచక్రవర్తిని కాళిదాసునకు మరువరాని ప్రతిస్పర్థిగా జేయుటలో నాశ్చర్యము లేదు.

ఇట్లేవిధముగ నాలోచించినను గుప్తులును, వారి యాశ్రితులును క్రీస్తుశకారంభమునకు ముందరివారేకాని క్రీస్తుశకమువారు కారని స్పష్టమగుచున్నది. ఇంతేకాదు. మెక్డొనల్ పండితుడు సంస్కృతవాఙ్మయవిమర్శనలో (౩౬౯-వ పుట) నాటకములలోని భాషలనుగూర్చి వ్రాయుచు నడిచినదెల్ల మన గుప్తకాలనిర్ణయమె సరియైనదని ఋజువుచేయును. అందు నాయకపాత్రలును, భూపాలబ్రాహ్మణపాత్రలును సంస్కృతము వాడునట్లును, స్త్రీలును, తక్కంగల పురుషపాత్రలును ప్రాకృతము వాడునట్లును రచయితలు వ్రాసినారు. అందును పద్యగీతాదిభాగములలో నుత్తమస్త్రీపాత్రలకు మహారాష్ట్రియు, తక్కిన భాగములందు వారికిని, బాలురకును, నుత్తమసేవకశ్రేణికిని శౌరసేనియు, రాజప్రాసాదపరిజనమునకు మాగధియు, దొంగలకు, జూదగాండ్రకు అవంతియు, పశుపాలుర కాభీరియు, ఆటవికులకు పైశాచియు, తక్కంగల క్షుద్రపాత్రలకు, బర్బరులకు నపభ్రంశమును ప్రయోగించినారు అని వ్రాసినారు. కవిసార్వభౌముడగు కాళిదా సిట్టిభాషాసాగ

రమున నీడులాడుటకు కారణ మరయుదము. దృశ్యకావ్యకర్త యెన్నడేని నిజసాంఘికప్రతికృతినే తనగ్రంథమున బింబింపజేయునని మన మెరుగుదుము. కావున కాళిదాసుని నాటకములందును వానికాలపు ప్రతిబింబమె కనబడవలయును. పాత్రల భాషాపరీక్ష నాటి సాంఘికస్థితి నరయుచు మన కాలనిర్ణయము నది బలపరచునో లేదో చూతము.

సంస్కృతము: ఉత్తమపురుషపాత్రల భాష. సంస్కృత భాషాపోషకులగు గుప్తసార్వభౌములకాలమున నది ప్రకృత్యనుగుణముగనే యున్నది. మౌర్యసంగకణ్వాదిసార్వభౌములనాటి ప్రాకృతము సంస్కృతమై, రాజభాషయై గౌరవస్థానము నందినది.

ఇక ప్రాకృతమున మహారాష్ట్రి ఉత్తమస్త్రీపాత్రలు గీతపద్యాదులందు మాత్రము వాడుచున్నారు. నాటి శాతవాహనాదిసాటిస్వతంత్రసీమలలో నీమహారాష్ట్రి వాడుక గనంబడుచున్నది. కాబట్టి దీని కిట్టి గౌరవము నాటి దృశ్యకావ్యములందొసంగబడినది.

శౌరసేని: ఔత్తరాహుల సంస్కృతవ్యామోహ మినుమడింపకమున్న ప్రాజ్ఞులు వాడుభాష. గుప్తులకాలమున జనసామాన్య మది వాడుట మానలేదు. కాబట్టి యీ ప్రాకృతమునె దృశ్యకావ్యములందు బాలురకును, నుత్తమసేవకశ్రేణికిని, స్త్రీపాత్రములకును వాడుకభాషగ జేసినారు. నాటి సామాన్యదేశభాష యిది యని విశదమగుచున్నది.

మాగధి: రాజపరిచారకులభాష. మగధ సామ్రాజ్యపాలకసీమయై శతాబ్దములుగ వన్నెకెక్కినరాష్ట్రము. సమ్రాట్టులకొలువున కనుకూలమును, గౌరవనీయమగు పరిభాష మగధయందే జనించి క్రమాభివృద్ధి గాంచినది. గుప్తసార్వభౌముల నూతనసృష్టినకస్మాత్తుగ గౌరవాస్పదమగు సేవకపరిభాష లభ్యమగుట దుర్లభము. కావున మాగధి రాజప్రాసాదపరిచారకగణమునకవసరభాషయై యుండును. దీనినే యానాటి దృశ్యప్రబంధరచయితలును తమగ్రంథముల వాడియుందురు.

అవంతి: గుప్తసామ్రాజ్యప్రారంభకాలమున అవంతి శకశాత్రవుల హస్తగతమై యుండెను. శకకుశానజాతులు నూతనముగ నార్యావర్తమున కరుదెంచిన బర్బరులు. వారివిదేశీయాచారములును, వ్యవహారములును గుప్తసామ్రాజ్యవాసులకు సహింపరానివిగ నుండెను. కాబట్టి వారిని జూదగాండ్రనియు, దొంగలనియు ప్రజలు భావించుచుండిరి. కాబట్టి నాటకములందలి దొంగలకును, జూదగాండ్రకును నవంతి సహజమగుభాషగ వాడిరి.

ఆభీరి: మందల మేపి తిరుగు దేశద్రిమ్మరు లగు ఆభీరులభాష, గోపాలురకు సహజభాషగనే యుపయోగింపబడినది.

పైశాచి: ప్రాకృతభాషోపయోగమున కలవడని యాదిమవాసు లడవుల బట్టి యట తమ మాతృభాషనే ఉపయోగించుకొనుచు, యే కట్టెలనో, యాటవికసామగ్రులనో నాటి నాగరకజనులమధ్యకమ్మ దెచ్చునాడు వాడుభాష.

అపభ్రంశము: బర్బరులును, సాంఘికశ్రేణిలోని యధమాధములును సంస్కారమెరుగక పశుప్రాయులై అర్థమెరుగక వాడు నీచభాష.

పై భాషాప్రయోగమును బట్టియు కొంతగ మనకాలనిర్ణయమే సరియైనదని తేలును. సంఘమునందుగల వాడుకభాషల నెవ్వరెవ్వి వాడుచుండిరో, వారాయాభాషల మాత్ర మేలవాడుచుండిరో గమనించ నాటి గుప్తసామ్రాజ్యమునందేయే సీమలవారెట్టిస్థానము నాక్రమించి యుండిరో పోల్చుకొన నవకాశ మబ్బును.

విక్రమశక ప్రచురణకర్త లని మన మింతగ ఋజువుచేసిన యీ గుప్తు లెవరు? వీరి పుట్టుపూర్వోత్తరము లెట్టివి? వీరికే యిట్టి సామ్రాజ్యనిర్మాణావశ్యత గలుగనేల? అను ప్రశ్నలకెల్ల వారి కాలనిర్ణయమాత్రమునకే నెట్టుకొనిన వ్యాసమున మాకు దావులేదు. కాని విక్రమశకకర్త యెవ్వరైనదియు కొలదిగ సూచనయైన జేయకున్న మా కాలనిర్ణయ మెల్ల గాలిమేడయగును. కాబట్టి మనపరిశోధనల కనువగు వాఙ్మయమున నెచ్చటనైన విక్రమసంవత్సరగణనమును గూర్చియు, మన మెరిగిన మరొకగణనమును గూర్చియు ముచ్చటించుకథ నరయుదము. అట్టివర్ణనము మాకు సులభముగ జైనుల వ్రాతలందొక్కెడ లభించుచున్నది. మేరుతుంగాచార్యుడు 'పారావళిలో' దాని నిట్లు వర్ణించినాడు:—

"నాభవాహనుని తరువాత గార్ధభిల్లు డుజ్జయినిని పదమూడేండ్లు పాలించెను. కలికాచార్యుడను జినసన్యాసిచెలియలు సరస్వతిని గార్ధభిల్లుడు చెరబట్టుట కలిగి, సింధునదీ తీరస్థులగు శాక్యులను తోడ్తెచ్చి గర్ధభిల్లుని రాజ్యభ్రష్టు నొనర్చి యుజ్జయినిని శకాధీనమొనర్చెను. కాని మరినాలుగేండ్లకు గార్ధభిల్లనందనుడగు విక్రమార్కుడు శకుల నోడించి పారద్రోలి దేశఋణమును భూరిసువర్ణదానముల దీర్చినవాడై విక్రమసంవత్సరగణన మారంభించి రాజ్యపాలనము చేయజొచ్చెను. ఈ పని వీరనిర్వాణమునకు ౪౭౦ యేండ్లవెనుక జరిగెను. విక్రము డరువదేండ్లు పాలించెను విక్రమచరిత్రుడు లేక ధర్మాదిత్యుడను విక్రమసుతుడు ౪౦ ఏండ్లు పాలించెను. తరువాతి పాలకులగు భైల నైళనాహాదులు ౧౧, ౧౪, ౧౦ యేండ్లొకరి తరువాత నొకరుగ రాజ్యమేలిరి. శాలివాహనశక మప్పుడు వీరనిర్వాణమునకు ౬౦౫ సంవత్సరముల వెనుక ప్రారంభమైనది." 'పారావళి' జైనుడగు మేరుతుంగాచార్యుని రచన. బౌద్ధమతస్థులు కాలగణనమును గౌతమనిర్వాణకాలమగు ౫౪౪ క్రీ.పూ. నుండి ప్రారంభించునట్లే జైనులు కాలగణనమును మహావీరనిర్వాణకాలమగు ౫౨౭ క్రీ.పూ. నుండి ప్రారంభించుచుండిరి. కాబట్టి మహావీరనిర్వాణకాలమునకు ౪౭౦యేండ్లతరువాత ననగా ౫౨౭-౪౭౦

లేక క్రీ. పూ. ౫౭-వయేట విక్రమసంవత్సరగణనమును, ౧౩౫ యేండ్ల తరువాత ననగా ౧౩౫-౫౭= లేక క్రీ.శ. ౭౮-వయేట శకయుగము ఆరంభమైనదనియు పైవానిలుండి విశదమగుచున్నది. (ధనంజయసూరి రచియించిన శత్రుంజయమాహాత్మ్యమునగూడ విక్రమశకారంభము మహావీరనిర్యాణమునకు ౪౭౦ యేండ్లతరువాత జరిగెనని తెలుపుచున్నాడు.) అంతేకాదు. ప్రఖ్యాత విక్రమవత్సరప్రచారకులగు నీరాజు లేవురు ౧౩౫ యేండ్లు పాలించినవెనుక శకనృపాంతకాలము లేక శకయుగమారంభమైనదని మేరుతుంగుడు చెప్పుకాలము మనకు నవీనచరిత్రకారులు నిర్ధారణచేసిన గుప్తయుగమందలి ప్రథమప్రఖ్యాత నృపులేవురి కాలమునకును సమముగ సరిపోవుచున్నది. గుప్తవంశమునకు మూలపురుషుడని ఘటోత్కచనామ నొకని బేర్కొందురు. కచనామమున గొన్ని నాణెములుగూడ గుప్తులనాణెముల గానవచ్చుచున్నవి. మేరుతుంగుని గర్ధభిల్లుడును మనమెరుగు ఘటోత్కచుడు నొక్కరే కాబోలును.*



"దానము!"

చిత్రకారుడు : క్రొత్తపల్లి సుబ్రహ్మణ్యము, కాకినాడ.

* జక్కనవిరచిత విక్రమార్కచరిత్రమున చంద్రగుప్తుడను బ్రాహ్మణయువకు డొకడు మధురరాజనందని వివాహమయి విక్రమార్కుడను ప్రఖ్యాతరాజయ్యె డయ్యెనని యున్నదట జక్కనరచనకు మాతృకయగు సంస్కృతగ్రంథము దొరికిన నీ విక్రమార్కచరిత్రను గల చారిత్రకవిషయ మింకేమాత్రమున్నదో శోధింపవలెను.

# బ రో డా

తిరుమల రంగాచార్యులుగారు

బరోడానగరము గాయక్వార్ బరోడారాష్ట్రమునకు రాజధాని. ఇది ఘూర్జరదేశములోనిది. గ్రంథాలయసంఘసంస్కరణోద్యమముల నిది యితరరాష్ట్రములకంటె నెప్పుడు సహామహామికను జూపుచుండుటచే నీనగరముపేరు మనము తఱచుగా వినుచున్నాము. దీని పాలకుని 'గాయక్వార్' అని యనుచున్నారు. దీనికి బరోడానగర మని పేరువచ్చుటకుఁ గారణ మేమని విచారింపగాఁ దత్ప్రాంతవాసు లీకథను జెప్పెదరు:

కలియుగాదిని విశ్వామిత్రమహర్షి దేశసంచారము చేయుచు నిపుడు బరోడానగర ముండినచోటికి వచ్చెను. అచట నపుడు దట్టమగు నడవి యుండెడిది. అం దొకనదికూడ బాఱుచుండెడిది. అప్పటికి దాదాపు మధ్యాహ్నము కావచ్చినందునను, త్రోవ నడచుటచే బడలియున్నందునను ఆ జడదారి యానదిలోఁ దానమాడి సంధ్యావందనాద్యనుష్ఠానమును దీర్చి యందలి తేటనీటిని గడుపారఁ ద్రావి, నదిగట్టుననే విశాలశాఖల విరాజిల్లుచు చల్లనినీడను వెదచల్లు నొక మఱ్ఱిచెట్టుఁ గాంచి దానిక్రింద విశ్రమించెను. అపు డర్యముఁ డంబరమధ్యమున నుండి యతితీక్ష్ణకాంతులఁ బ్రాణితతి నలయించుచుండుటచేతఁ జల్లనినీడఁ జేరుటయే తడవుగ నుల్లము హాయిచెంద మునివరేణ్యుఁడు గాఢనిద్రాపరవశుఁ డయ్యెను.

అట్లు కొంతకాలము నిద్రించి యపరాహ్ణము ముగియునపు డా ముని నిదురనుండి లేచెను. నాఁ డిట్లింత కాలము మైమఱచి దివాస్వాపము చేయుటకుఁ గారణ మేమియని మునీంద్రుఁడు తనలో వితర్కించెను. అమృతోపమానమైన యానదీజలమును, జల్లనినీడనిచ్చిన యా వటవృక్షమును దన యకాలసుఖనిద్రకుఁ గారణములని వెంటనే యతనికిఁ దోఁచెను. తనయట్టిసంయమినిగూడఁ జొక్కించినట్టి వానిపై ముని కత్యంతానుగ్రహము కలిగెను. సృష్టికిఁ బ్రతిసృష్టి చేయఁజాలిన యామహర్షి నిగ్రహముగాని, యనుగ్రహముగాని రిత్తవోవునే!

ముని వెంటనే తాను నీరానిన నది యధిష్ఠానదేవతను బిలిచి "నీనీరమువలన నే నెంతయుఁ దనివినొందితి. కాన నేఁటినుండి నీవు నాపేర 'విశ్వామిత్రి' అనఁబరఁగుదువు." అనియు, వటవృక్షమును జూచి "మధ్యాహ్నకాలమునఁగూడ నాకు సుఖనిద్రనిచ్చిన నీచల్లదనము నేమనఁ గలను? నేఁటినుండి నీ వామూలాగ్రముగ సువర్ణమయము వగుదువుగాక!" యనియు వరము లొసంగెను.

వరప్రదానమున నదిమాత్రము మిగుల సంతసించి మునికి ధన్యవాదము లర్పించెను. కాని వటవృక్షమునకు సంతోషమునకుబదులు శోక ముప్పతిల్లెను. అది కొంత తడ వల్లేయుండి వినయవచనములతో నిట్లు విన్నవించెను:

"సంయమీంద్రా! తావకంబగు నపాంగావలోకనభాగ్యముననే తృప్తిపడుచున్న నేను, సువర్ణవరప్రసాదమునఁ బరితుష్టత నొందితినని వేఱ విన్నవింపనేల? కాని యింతవఱకు నాయందున్న వేనవేలు ఫలములఁ దినుచు, నాకుజొంపములు గల శాఖలలోఁ గులాయ

ముల నిర్మించుకొని శీతవాతాతపములనుండి తొలఁగుచు నిరంతరసౌఖ్య మనుభవించుచున్న పక్షులకును, ఉల్లము పల్లవింపఁ జల్లనినీడల మెల్ల మెల్లనఁ జేరవచ్చు మృగతతి కిని నే నిఁకముందు యథాపూర్వముగ నుపయోగపడక పోవుదుననిమాత్రము మిక్కుటముగ దురపిల్లుచున్నాను. ఇంతియకాక దురాశగల యేనరుఁడైన నెపుడైన నీయెడ నడుగిడిన, నాసువర్ణత్వమును గని ముగ్ధుఁడై బుడముతోఁ బాటు నను ఖండించిన నపుడు మొదటికే మోసము కాఁగా నుభయభ్రష్టత్వము గల్గుఁగదా? కాన మీరలు కరుణించి యీయంశములఁ జిత్తగింపఁగోరెదను.”

అనవుడు నాజడదారి మహర్షినుడుల నెడఁదఁ గడు తడవు పరికించి “వటవృక్షమా! నీవాక్యములు నిక్కువ ములు. కాని నావరము తప్పదు. కాన నే నివ్వరము నీరీతిగ మార్చివైచెద. ఇఁకముందు ఈచోటు జనావాస యోగ్యమగుటయేకాక యిచట నొకపురము వెలసి నీ పేరనే ‘వటపత్రపురము’ అని పిలువఁబడఁగలదు” అని యాశాసించెను. వటవృక్ష మమ్మాటలకు నెమ్మది చెం దెను. పిదప మహర్షి యథేచ్ఛఁ జనెను.

వరమహాత్త్వమున నాఁటినుండి క్రమక్రమముగా నచట జనులు చేరఁ బ్రారంభించిరి. అంతియకాక కొన్నాళ్ల కచట నొకపుర మేర్పడెను. దాని కప్పటి నుండియు ‘వటపత్రపుర’ మని పేరువచ్చెను. కాలక్రమ మున జనులు వటపత్రపురమని యుచ్చరింపఁజాలక ‘వట త్రపుర’ మని కొన్నాళ్లును, పురమను పదమును దొలఁ గించి ‘వటత్ర’ యని కొన్నాళ్లును పిలుచుచుండిరి. ‘ట’ కు బదులుగ ‘డొ’ యును, ‘త్ర’కు బదులుగ ‘ద్రా’ యును జేర్చి ‘వడొద్రా’ యని యిపుడు జానపదులును, నగరవాసులుమాత్రము ‘వ’ కు బదులు ‘బ’ చేర్చియు, ‘ద్రా’ లోని రేఫము దొలఁగించియు ‘బడోదా’ యనియు, నాంగ్లేయు లుచ్చారణసౌకర్యమునకై బరోడా యనియుఁ బిలుచుచున్నారని యనెదరు. కథ మాట యటున్న ‘వటపత్రపురము’ అనునదియే బరోడాయని మారుటమాత్రము నిశ్చయమని విజ్ఞులగువారు తలంచు చున్నారు.



భద్రాచల దేవాలయము, చెంత గోదావరి

ఛాయాచిత్రకారుడు: జి. ఏ. రంగమన్నారుగారు.

# చిక్కప్ప యొడయరు[౧]

సిరిపి ఆంజనేయులు గారు

౧

శ్రీయనంతాత్మ సుశ్రీశోభితాంగు
సృష్టికారకుని విశిష్టపాలకుని
నఖిలలోకారాధ్యు నాగమవేద్యు
మహితశుభోన్నతు మనమార నెంతు.

దక్షిణాపథమున దండకారణ్య
మందు, గార్గేయఋష్యాశ్రమభూమిఁ
దనరు దేవరకొండ[౨] దాఁపున నొక్క
గ్రామ మోరూ[౩] రనఁగా.

అందు సాధు

వృత్తి నందవరీకవిప్రోత్తముండు
ధాకరా జనుపేర రవణిల్లె నొకఁడు,
ఆతనిసాధ్వి మేళాంబ, వారలకు
చాడేశ్వరీకృపాసంయోగకలన
నుద్భవంబందెఁ దా నొక్క పుత్త్రుండు.
చిక్కప్ప నానొప్పి చెల్వారె నిసుఁగు.
ఆసుతుఁ డొదవిన యల్పకాలమున
నతులదయాన్వితుం డగుధాకరాజు
మృత్యువు తనుఁగొన మేకొను టెఱిఁగి
భార్యాతనూజులఁ బాయంగ లేక
దైవయోగంబునఁ దనువు చాలించె.

అడియాదిగాఁగ మేళాంబ యాపల్లె
నష్టకష్టంబుల నంది, జీవనము
సాగింప ననువైనజాడ లేకునిక్క
నాచోటు వాసి దేశాంతర మరుగ
నాత్మలోఁ దలపోసి, యైదేండ్లవానిఁ
బిన్నవానిని గొని భిక్షాటనమున
నూరూరుఁ గడచి, కొండొకకాలమునకు
తుంగభద్రానదీతోయంబుచేత
నతిపవిత్రంబయి యలరెడుదానిఁ
బంపాప్రసాదసద్భాగ్యంబువలన
ననుపమవైభవం బందెడుదాని
శ్రీమహాశివుని దృక్కీర్తికల్మికలన (?)
నున్నతశోభన లొందెడుదాని
విద్యాయతీంద్రుని విజ్ఞాననియతి
నతులసంపదల సొంపలరెడుదాని
ఋశ్యమూకాది భూభృద్రాజపఙ్క్తి
నరివీరతతి కభేద్యంబైన దాని
శ్రీబుక్కరాయు నుద్ధృతభుజాపటిమ
ననపాయగరిమఁ బెంపారెడుదాని
నఖిలవేళల మహోద్యతాక్కర్యరతికి
నిలయము విజయమందిరమగుదాని
ఘనశిల్ప విజ్ఞానగాన యోగాది
విద్యల కిరవయి వెలుఁగొందు దాని

నామోపఖనిగాఁగ ననుపమసరణి
నార్తుల కభయదాయకమైనదాని
విద్యాపురంబని విఖ్యాతిఁ గనిన
స్థానమొక్కటి జొచ్చి చక్రతీర్థంబు
నందఁ, గోదండరామాలయాంకమున
నిలిచి, మూఁపున సుఖనిద్రమైనున్న
కందు నచ్చోటఁ జక్కనిచిక్కఁ జేర్చి
యరిగె భిక్షుకు నగరాంతరవీథి.

౨

అచటఁ గోదండరామాలయపార్శ్వ
తలమునఁ బెరిఁగి, యెంతయుఁ బెంపుఁగనిన
పామలూరునఁ బ్రీతి వసియించుచున్న,
కడుదొడ్డమయిఁ గ్రాలు 'ఘటసర్ప' మొందు
వెలువడియల్లన వివరమార్గమున
నిండుచందురుఁబోలు నెమ్మోముమవాని
లలి సువిశాల లలాటంబువాని
కన్నెతమ్మిసాటి కనుమోడ్పువాని
మంచిపుత్తడి మించు మైచాయవాని
చక్కని మెఱుఁగుబొజ్జంగలవాని
బలితంబుగా కరపదములవాని
హాయినిద్దురఁ జెందు నాచిన్నవాని
వదనంబునకు నెండవడ సోఁకకుండఁ,

---

౧. ఈవ్యాసమున కనంతపురబుక్కరాయసముద్రముల 'కైఫియత్తు' మూలము. ఈచరిత్ర క్రీ. శ. ౧౩౬౦ - ౧౩౭౭ ప్రాంతమున నడచినది ౨. అనంతపురమునకుఁ దూర్పున రెండుమైళ్ల దూరమున నుండు నొకకొండ. ౩. 'ఓరూ' రను నీగ్రామ మిపు డగపడదు. దేవరకొండకుఁ బడమర నరగడియదూరములో నీగ్రామ ముండెనని కైఫియత్తు నుడువుచున్నది. దేవరకొండకుఁ బశ్చిమమున దాని శాఖయగు నల్లగుట్టకుఁ దూర్పుటోరను సమతలమున ఆపేర నొకపుర ముండెననుట చిరకాలముగ నాప్రాంతమునఁ గల జనశ్రుతి అందుల కిపు డచట నెట్టి ప్రాచీన నిర్మాణశిథిలములు గోచరింపవు. అది యచట నేలసమమై యొక శతాబ్దముదాఁటియుండును. రైతులు వ్యవసాయమునకయి 'కొండ క్రిందిచేల' ను దున్నుచుండ, నందుఁ బురాతననిర్మాణముల నల్లమట్టియుఁ, బనఁటలు (చట్లు)ను, విస్తారముగ బూడిదయు భూగర్భమునుండి వెడలుచుండుట కలదట. ఈగుర్తులవలనను, జనశ్రుతివలనను, కైఫియత్తు నిర్ణయమువలనను దేవరకొండకుఁ బశ్చిమమునఁ గొలఁదిమేరలో సమతలమున నీయోరూ రుండెననుట యథార్థ మని తెలుచున్నది.



(14) 1. కొల్లి పర్వత వెంకటరమణయ్య నాయుడుగారు; 2. గంటి లక్ష్మీనారాయణగారు; 3. చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు; 4. పెదసింగు వెంకటనారాయణ వర్మగారు; 5. పిసుపాటి వెంకటరాయ శర్మగారు.



1. వెలగలేటి వరదరామయ్య పంతులుగారు; 2. సర్రాజు రామకృష్ణరావు పంతులుగారు; 3. తమ్మన నారాయణమూర్తిశ్రేష్ఠిగారు;
4. డి. వి. వరహాలు శెట్టిగారు; 5. సుబ్బారావుగారు.

దనదు పడగ విచ్చి తద్దయుఁ గూర్మి
ఫాలభాగమ్మునఁ బట్టి యిట్టటుగ
నొలసి యాడుచునుండె నుత్సాహవృత్తి.

ఆసమయమున 'నాగాభోగి' యనెడు
పాములవాఁడు, తత్ప్రాంతమం దుండి
యాత్రోవఁ బోవుచు, నావింతనటన
నట నిల్చి చూచి యత్యాశ్చర్యమందె.

ఆపయిఁ గొంతసే పాడి యానాగ
మవలఁ బుట్టనుజేరె నచ్చోటు వాసి.

అబ్బురం బంది నాగాభోగి యిట్లు
తనలోన నెంచె 'నీతఁడు దశావంతుఁ
డగునేని, నాగస్వరాత్మకంబుగను
నేసల్పు గాన మాలించి యాయురగ
మేతెంచి, మగుడి నాడెడు నీస్థలమున.'

అనితలపోసి యాయాహితుండిపుడు
వెస నాగసరము మోవినిఁ జేర్చిపట్టి
రమ్యమోహనమధురస్వర మూఁదె
గిరిగుహావళి నదిగిఱికొని యెసఁగ.

ఆమనోజ్ఞరవళి నాలించి, తనదు
వల్మీకమును వీడి వచ్చి యంతంత
బాలునిపయిఁ దన పడగను విప్పి,
రెండుగడియ లొక్కరీతి నర్తించి,
యరిగె మన్కినిఁ జేర నాశీవిషమ్ము.

అంత మేల్కాంచి చిక్కన్న కన్గొనియె
లీలఁగదలు నెమిలికుగాయివాని
దళమైన యెఱ్ఱని తలపాగవాని
కాటుకతిద్దిన కన్నులవాని
సాఁగిన ముదురుమీసమ్ములవాని
బూరటిల్లిన తమ్మబుగ్గలవాని
పేరిన నునుగెంపుఁ బెదవులవాని
చిక్కని నెఱకల చిబుకంబువాని
గాజుపూసలు దండగా నొప్పువాని
మట్టు నదుకుల బొంతచొక్కాయివాని.
కరముల బలుజోడుకడియాలవాని
బటువైన బొటవ్రేళ్ల బటువులవాని
నేలరాయు 'షరాయి' నెఱవొందువాని
బిరుసైన చిఱులాఁగు బిగిఁగలవాని
ఘలుగల్లుమను కాళ్ల గజ్జెలవాని
నెత్తైనవానిఁ దన్నే చూచువాని
వాశ్చర్యచకితు నాగాభోగి నెలమి.
ఆపురుషుండు చిక్కన్న నింపెసఁగ
'అన్న దశాయోగ మబ్బిన నీకు



నేమి యిచ్చెదవో నా కెఱిఁగింపు" మంచు
గ్రుచ్చి, కౌఁగిటఁ జేర్చికొన, బాలకుండు
"నే దశావంతుండనే యాదునేని
పుణ్యాత్మ! చెలువులఁ బురములఁ గొన్ని
నీపేరఁ దప్పక నిర్మింతు"ననిన
మురియుచు బాలుని ముద్దాడి, దిగిచి
యానందమంది నాగాభోగి చనియె.

## 3

పదపడి మేళమ్మ భైక్షంబుఁ గొంచు
నరుదెంచి, తనయుని నరసి, యచ్చోట
నడచిన విషయ మంతయుఁ బుత్త్రివలన
విని, యబ్బురం బంది వేడ్కతో నుండె.

అనుదినం బిట్టు లాయతివ బాలకుని
నొంటిమై విడిచి, తా నొకవంకఁ బురిని
యాచనకొఱకు నందందుఁ గ్రుమ్మరుచు
శ్రమనొందలేక యోజన సల్పి, చివర
బాలునిఁ దనకు వెంబడిఁ గొని చనుచు,
"నాయనా! వినుమన్న నాచిన్నికుఱ్ఱ!

కాలంబుదప్పిన కారణంబునను
మనకుఁ గష్టంబులే మనుగుడుపయ్యె
నీతండ్రి మరణించె నీశైశవమున
నదిమొదలుగ లేమి యలమెను మనల
మడిమాన్యములు పోయె మర్యాద సడలె.

గొడ్డుగోదయు నిల్లు గుల్లును చరలె,
నున్న సంపద పోవ నూరె వేటాయె,
నేవేళ మనతోడ నెలమిమై నున్న
చుట్టపక్కంబులు చూడ రిత్తటని
కలనాఁడు తినిపోవఁగలవారెకాని,
చెడఁజూచి సాయంబు సేయ రెవ్వారు;
నెల్లరకును భుక్తి యిడుచున్న మనకు
నింటింట బిచ్చమెత్తెడు వృత్తి యబ్బె,
కలకాల మిట్టు లాఁకటికిఁగా నొరుల
వేఁడ మనసురాదు వినుము నాతండ్రి!
పరివారియింటఁ గష్టము చేసియైన
జీవించు టొప్పు యాచించుటకంటెఁ
గావున నట్టిచో ఘనబుద్ధి వెలయఁ
బరులాడుమాటలు పంతానఁ[illegible]గొనక,
సహనభావంబునఁ జనవలెఁ బుత్త్రి!"
అన విని కొమరుండు సనెఁ దల్లి కిటుల
"మనుజునకేకాని మ్రానికి వచ్చు
నమ్మ బాధలు? తీఱునా కుడ్వఁబోక?
వానిఁ బ్రతిఘటించి వర్తింపఁబూన,



హరి యెంత? హరుఁ డెంత? యాబ్రహ్మరె
కష్టంబు పైకొన్న కాలంబునందు
శివుఁ డంతవాఁడు దోసిలియొగ్గకలసెఁ,
గావున నాతల్లి కాంతు సంతుష్టి
యెంతేసి వంతలే నెనయంగనిమ్ము.
బ్రతుకుట తనమేలు పాటించికాదు
పరహితార్థమె జీవి బ్రతుకంగవలయు;
నీపరమార్థమే నెపు డెద నెంచి,
జీవిక సాగింతు సిద్ధంబు గాన,
నేవిచారంబు నీ కేల నో జనని!
యెడ కెట్టిదేని నీ యాత్మకుఁ దేను.
తన యోగుబాగులఁ దన్నంటి నిల్చి,
తనకు మేలొనరించు ధన్యయా తల్లి.
తల్లిని వెతగొల్పు తనయుండు మూఁడు
భువనంబులను హాయిఁ బొందఁడు నిజము
ఎల్లరు నిరసించు నెడ్డయౌఁ గాక
కూర్మి నొడినిఁ దన్పుఁ గొమరుని మాత.
మాతృదేవికి సాటి మఱిదైవ మున్నె?
యామెహితవు మీఱునగునె సంతతికి
కన్నమ్మయాజ్ఞలోఁ గననియాపట్టి
పట్టియే కొఱఁగాని బట్టయౌఁ గాని
నాపట్టుగొమ్మయు నాపూజ్యరాలు
నాగృహదేవత నాయమ్మ నీవ;
కనుక నా కెట్టి యంగద గల్గునేని
నీయాన జవదాఁట నే నెంతవాఁడ!"

అన జనయిత్రి తా నత్యంత మలరి
నందను ముద్దాడి నగరమధ్యమునఁ
గరుణాయుతుండు చక్కనిశాంతమూర్తి
వితరణగుణశాలి విజ్ఞానకుశలి
శ్రీబుక్కరాయ మంత్రి శ్రేష్ఠుఁ డనఁగ
నొప్పునారాయణాఖ్యునిగూర్చి తెలిసి,
యడుగులు తడఁబడ నలజడి నిగుడ
నల్లనల్లన నామె యాతనిఁ దఱిసి,
సాకల్యముగఁ దన చరితంబుఁ దెల్పి
సాయంబు వేఁడ నాసాధుచిత్తుండు
నిలువునఁ గరఁగి మన్నించి యా యింతి
నామె కుమారు మహాసుకుమారు
జితమన్మథాకారు శ్రీగుణోదారుఁ
దనయింట నిడికొని తనయునిభంగి
నన్నవస్త్రంబుల నరసి పోషించి
యుచితముహూర్తాన నుపనయనంబు
సాగించి యుత్తమాచార్యులయొద్ద
నర్హవిద్యలఁ దెల్వి నలవడఁజేసి,
బాలుని బుద్ధిసంపద నెస నెఱిఁగి,

యిచ్చ మెచ్చుచుఁ జన వెచ్చుగా నిచ్చి
ధరణీశు సభకు నాతనిఁ దనతోడఁ
గొనిపోవుచుండె మక్కువ బెంచుచుండె.

౪

అత్తఱి నొకనాఁటి యర్ధరాత్రమున
నరుదెంచి ఢిల్లీశు నాస్థానభటులు
పాదుషాయాజ్ఞగా 'ఫర్మనా' యొకటి
బుక్కరాయని కీఁగ, భూనాథుఁ డపుడు
వ్రాయసకాండ్రకై పనుప సేవకుల
నద్దమనిసియాట నత్తఱుణమున
వ్రాయసకాండ్రు నెవ్వరుఁ జిక్కకున్క,
జంటు లమాత్యుని భవనాంగణమున
నరుగుచునుండి, తత్ప్రాంతమం దెసఁగు
చావడిఁ, దిన్నె సెజ్జఁగఁ బవ్వళించి
నిద్రించుచున్నవానిని జిక్కనాఖ్యు
మేల్కొల్పి, కొనిపోయి మేదినీశ్వరుని
కడఁజేర్పఁ, బ్రభుఁడు లేఖను వాని కొసఁగి,
పఠియింపు మనుడు, నా ప్రతిభాయుతుండు
నందలి యంశంబు లాద్యంత మరసి,
ధరణిపాలకుఁడు నెంతయు మోదమంద
సవిశదముగఁ దెల్పి చనె గేహమునకు.
తదనంతరంబు వార్తాహరుల్ వచ్చి
ప్రత్యుత్తరముఁ గోరఁ బ్రభువరేణ్యుండు
తా విన్న యంశమంతయు సంగ్రహముగ
వినిచి, లేఖకుల కావిధమొప్ప బదులు
వ్రాయ నాజ్ఞాపింప, వ్రాయసకాండ్రు
పాదుషా పంపిన ఫర్మనాలోని
వివరంబులను వాక్యవిన్యాసఫణితి
భాషావిధానంబు భావవైఖరియుఁ
బరికింపక యొకింత, ప్రతిలేఖ వ్రాయ
నసమర్థతను దెల్ప, నా ప్రభువరుఁడు
వెదకి తా నందందు వెదకించి కమ్మ
కనఁబడకున్క, వక్కణమెల్లఁ దనకు
వినిచిన యువకుని వేగమ యటకు
రప్పించి, లేఖకుఁ బ్రతివ్రాయఁగోర,
జ్ఞాపకమును బట్టి 'నకలు'ను బదులు
వ్రాసి తాని కొసంగి, పదపడి నతఁడు
నృపుని యానతిఁ బొంది సెలవున కరిగె.
ఆనాఁటిరేయి గాయఁడు శయ్యఁ జేర
నంతఃపురికిఁ బోవ నచటి దూలంపు
నెఱియలో నుండఁ గాన్పించె నుత్తరము.
అద్దాని రాజేంద్రుఁ డమ్మఱునాఁడు
చిక్కప్ప వ్రాసియిచ్చిన ప్రతితోడ
లేఖకులకుఁ జూపి, లేఖకు నకలు
తులఁదూఁచి నటు లుంట దొర గుర్తెఱింగి,
చిక్కనబుద్ధికిఁ జిత్తమం దలరి
యేకసంథాగ్రాహి యితఁ డని యెంచి,
యాస్థానమునఁ బ్రధానామాత్యవరులు
దండనాథులు నుద్దండపండితులుఁ
బౌరబృందంబు సభాసదు లోలి
నాసీను లయి యుండ, నపుడు చిక్కప్ప
నచటికి రాఁబంచి. యతనిఁ గొండాడి
మమత రెట్టింప నమాత్యపదంబు
నొడయరు బిరుదంబు నొసఁగి మన్నించె.

౫

అంతట నొక్కనాఁ డాబుక్కవిభుఁడు
సకలప్రధానుల సర్వసైన్యములఁ
గొలువుకుఁ గాండ్రను గొని, యుత్తరాశ
నొగి కార్యభారవహుండయి వెడలు
నవసరంబునఁ, జిక్కనామాత్యుఁ బిలిచి,
యఖిలరాజ్యవ్యవహార మాతనికి
నొప్పించి, ముద్రిక యొసఁగి, బొక్కసము
నాతని కైవసమంద యర్పించి,
రాజకీయక్రియారతుఁడయి తరలె.
పుడమీశు నాదేశమును దలఁదాల్చి
వ్యవహారనిరతుఁడై యాచిక్కనార్యుఁ
డనుదినంబునను సభాగారమునకుఁ
బోయివచ్చుచునుండ, భూమీశు కాంత ౪
యాతని ముఖపద్మ మతని కన్దోయి
నతని కపోలంబు లతని యురువక్ష
మతని వేసపుఁదీరు నతని మైచాయ
నతనివిలాసంబు నాతని తీరుఁ
దనసౌధతలమునఁ దగ నిల్చిచూచి,
యతిమోహితాత్మ యై యా యందకానిఁ
దనయొంటిమేడ కుత్తరనిమేషమునఁ
గొనిరావలయు నంచుఁ గోమలినొర్తుఁ
దనసఖి ననిచె నాతని సన్నిధికిని.
ఆమెయు విసవిస నరిగి, చిక్కన్న
కభివందనముసల్పి, "యయ్యా! మాదేవి
పంపె మీకయి నన్నుఁ బనివడి; వేగ
రావలయునుమీరు రా మనరాదు."
అన నాతఁ డిదియేమొ యాశ్చర్యమంచు
నెట్టి విపత్తు ఘటించునో యంచు
నెద ననుమానించి, యెవ్విధి సేయ
నగునో? పోవచ్చునో? యరుగంగరాదొ?
ప్రభుఁ డూర లేఁ డిట్టి పట్టున నెట్టి
యనివార్యకార్యాంతరాసక్త యగుచుఁ
బొలఁతి పిల్చెడినో నేఁ బోకున్న నేమొ!
యెటులైన నగుఁగాక యేఁగెద నంచు
భావించి, దూతివెంబడి మేడఁజొచ్చి,
నవనీలచికురవిన్యాసంబుదాని
రవణించు కబరీభరం బొప్పుదాని
బలుతావివిరులసంపదఁగులుకుదానిఁ
బసమీఱఁ దిద్దిన పాపటదాని
గొనఁబునఁ గదలు ముంగురు లొప్పుదాని
సౌమ్యలలాటనక్షత్రంబుదాని
కలువ ఱేకులఁ గేరు కన్దోయిదానిఁ
దళుక్కొత్తు చెక్కుటద్దంబులదాని
నెలవంకసాటి వెన్నెలనవ్వుదాని
పల్లవారుణకరపదములదాని
జిల్గుదువ్వలువలఁ జెలువారుదాని
వివిధభూషలఁ గడు విలసిల్లుదాని
మవ్వంపులీలల మలయించుదాని
మృదువచోయుక్తి నెమ్మొలుమించుదానిఁ
దన యాగమంబునఁ దనివంగుదానిఁ
గాంచి మానసమునఁ గళవళం బంద,
పిల్చినహేతువు ప్రియదృష్టులందె
తెలియవచ్చుటను సందేహంబు బలియఁ
జిక్కనామాత్యుండు చేష్టలు దక్కి
వదనంబు వాల్చి నెవ్వగఁ జెంది నిల్చె.

౬

అత్యుజ్జ్వలంబగు నంగశోభయును
రమణీయమైనయౌవనతనూపటిమ
ముంగురుల్ జీరాడు ముఖవిలాసంబు
సుమనోజ్ఞమధురభాసురవచోరచన
యలరఁ, దా నెంతయు వ్యాజాత్మయగుచుఁ

---

౪. బుక్కరాయనికి గౌరాంబిక, దేవాంబిక మొదలగు పత్నులు పలువురు గలరనుట చరిత్రప్రసిద్ధమగు నంశము. ప్రకృతసందర్భమువలన నాప్రభునకుఁ బట్టమహిషి యొక్కతెయే యని కైఫీయత్తునుండి గ్రహింప నగుచున్నది. ఆయమ్మయు నెవ్వరో! ఉన్నతకులసంజాత యనుటకుఁ దగులక్షణము లాయువిదయందు నుందునకైనఁ గానము. కావున నీమె రాయనికి ధర్మాంగిగాక యుంపుడుగత్తెయయి యుండునని తోఁచెడిని.

కపటంపుఁ బ్రేముడిన్ గాంతునిఁ గనుమ,
ననిశంబు రుచిరహాసాన్వితయగుచు,
నర్థానురక్త, గుణానురక్తయును
గాక, తమకమ్మున గన్నుల వలచి,
గోష్ఠులయెడఁ దద్దఁ గూర్మిఁ గుప్పించు
సంతతసమధిక సంయోగశీలి;
యిది ధర్మపథమగు నిది యనర్మంబు
అని తలపోయని యవినయహృదయ;
సాంద్రాభ్రతతి నటచ్చంచలాలతకు
ననయంబు నెనయగు నతిచంచలాత్మ,
యనుఁగుబంధువులకే నన్యులకేని
నలుకువహింపని యపగీత చరిత;
లోకంబుఁ దనదు నాలోకశృంఖలల
బంధింపనేర్చిన బలువిలోలాక్షి,
తమియొక్కటియ జీవధనముగాఁ గనిన
కాంత, సిగ్గేఁడి, వారకాంతచందమునఁ
జిక్కనమాడ్కి సుస్థిరదృష్టి నిల్పి,
కిలకిల నవ్వుచుఁ, గేరుచు మివుల,
నతనికిఁ దన వాంఛితార్థంబుఁ దెలుప
"నకట! విద్రోహకార్యము మూఁడె" ననుచుఁ
దద్దయు బెగడి, సంతాపంబుఁ బొంది,
యవల ధైర్యముఁబూని యతివ కిట్లనియె.—
"వలదమ్మ, నీకిట్టి వలవనికోర్కి,
రాష్ట్రింబులకు నెల్ల రాజ్ఞివిగాన
మేలివర్తనమున మెలఁగుట యొప్పుఁ,
గాకున్న లోకంబు కామాంధకార
గహనమధ్యంబునఁ గాలి నశించు.
అమ్మవు నీవు, నే ననుఁగుఁ బుత్త్రుండఁ,
దన కులపతిభార్య తన గురుభార్య
తన రక్షకుని భార్య తన యన్నభార్య
తన మాతులుని భార్య తన ఱేని భార్య
తనకు మాతృకలని ధర్మజ్ఞులంద్రు.
రమణి నా ప్రభుని భార్యవు నీవుగానఁ
దల్లివి నాకు నీతనయుండ నేను.
గరిత! మాతృక సుతుఁ గాంక్షింపఁదగునె?
యెవ్వరు బోధించి రిప్పాడి నీకు?
మాతరో! వినుము నెమ్మది నెల్లవారిఁ
జెడుతలం పుడిగి చూచెదు చూపు మాపు.
స్తవనీయులైన సజ్జనులతో నెపుడుఁ
గికురింతమాని పల్కెడు పల్కు పల్కు.
ప్రవిమలభావ మేర్పడ దీనకతికి
నెలమినెయ్యమున సల్పెదు మేలు మేలు
తగ బుధవరులకు ధర్మానుగతిని
నెంతయు భక్తిఁ జేసెదు సేవ సేవ
నీచూడ్కి నీపల్కు నీమేల్మి సేవ
హేయభాజనముగా నిటు లుంటతగునె?
నేబ్రహ్మచారిని, నెలఁతలఁ జూడఁ
బాతకంబగు నాకు, భామలు నన్నుఁ
గనుఁగొనఁ దగదమ్మ కాలుష్యబుద్ధి,
నే నిఁక నువిదల నేనాఁడుఁ దలఁపఁ
గా నొల్ల మదిని, నెక్కటిఁ గాంచనొల్లఁ,
దఱియఁగా నొల్ల, నంతయు వారితోడ
భాషింపనొల్ల, నాభావమ్ముఁ దెలియు
మమ్మ! నే మరణపర్యంతంబుఁ బ్రీతి
సాగింతు నీబ్రహ్మచర్య వ్రతమ్ముఁ,
గాన సెలవు - నిల్వఁగాఁదగ" దనుచు,
సాగిలపడి నమస్కారం బొనర్చి,
నడక సాగించె వెన్కకుఁ జూడకుండ.

## ౭

అదిమొదల్ చిక్కార్యుఁ డాస్థానమునకు
నరుగుట మాని, తా నవనీశ్వరునకు
వ్రాయస మొక్కండు వ్రాసె నిప్పగిది—
"స్వస్తి
విద్యాపురీ జనవరేణ్యుండు,
వీరాధివీరుండు, విజయోన్నతుండు,
పరరాజభయదుండు, ప్రణుతవర్తనుఁడు
నగు వీరబుక్కరాయల చిత్తమునకుఁ
దమమంత్రి చిక్కప్ప ధన్యవాదములు
సల్పి నివేదించు సవినయ లేఖ—
ప్రభువతంసమ!
మీరు పరమవిశ్వాస
పూర్వకంబుగ నాఁడు బుధకోటిలోన
రాష్ట్రింబు—కోశంబు—రాజముద్రికయు
వరకృప నాహస్తవశమొనరించి,
నను బెద్దగావించి, నాకృతజ్ఞతను
మన్నించినారు సమ్మతి నాఁటఁగోలె
నంటి రాజ్యవ్యవహారసంగతుల
లవమేని వెత్తిఁ గల్గఁగనీక యెపుడు
వేయికన్నులతోడ వీక్షించుచుండ,
వాటిల్లె నొక్కయవాంత్రంబు; దాన
నగ్గలంబుగ మదీయస్వాస్థ్య మెడలె;
పూరింపజాలఁడే పురుషుండు దీని;
ధర్మజ్ఞులీర లీతత్త్వమూహించి,
నాయసమర్థత నయదృష్టి నెఱిఁగి
వేగము నగరికి వేంచేయఁగలరు;
వినతి మీ రాకకై వేచియున్నాఁడ.

చిత్తగింపుఁడు
తమ
చిక్కప్పమంత్రి

అని వ్రాసి, నాకమ్మ యపుడె జాంఘికుల
చేనిడి 'నృపునకుఁ జేర్పుఁడు దీని'
ననుచు, సత్వరముగ ననిచి కాలరుల,
నిలువెడలకయుండ, నేలిక మగుడి
విద్యాపురమునకు విజయ మొనర్చి
జరిగిన విషయమ్ము సకలమ్ముఁ దనదు
నంతఃపురస్త్రీ జనావళివలన
నాలించి, తెలిసి యథార్థతత్త్వంబు
చిక్కనామాత్యుని చిత్తశుద్ధికిని
నకలుషవృత్తికి నబ్బురంబంది,
తనమందిరమున కాతని బిల్వఁ బంచి
"నీదు సౌశీల్యంబు నిరుపమానంబు,
పొందితి నామోదమును దానఁగరము;
నీకు నుద్వాహంబు నే సల్పనుండ
శాశ్వతం బగు బ్రహ్మచర్యవ్రతంబు
నేల పూనితివి? నీ కిది యుక్తమగునె?
అయినను నీ కిష్టమగు వరం బొందు
వేఁడు మిచ్చెద" నన విశ్వాసగరిమఁ
జిక్కనామాత్యుఁ డంచితభక్తి "దేవ!
యర్థించువాఁడ ధనాగారమందు
వఱలు విత్తంబు సర్వంబు నెయ్యమున"
నన, బుక్కరాయండు నమ్మెయిదానిఁ
దగు బలఁగమ్ము నెంతయు రక్తి నొసఁగి,
యతుల సత్కారసంహతి వీడుకొల్పె
ననుపమగుణధుర్యు నాచిక్కనార్యు.
అంతఁ దనివిఁ జెంది యాచిక్కమంత్రి
పూర్వరాజ్యము చేరి, పురతటాకముల
నెఱవైన గుడులను నెలకొల్పఁబూని,
పెన్నమాగాణిలోఁ బెనుగొండ వైపు
నుండి యుత్తరముగా నొకయేఱు వెడలు
చుండుటఁ గని, యట నొకతటాకంబు
నల్లగుట్టలచెంత నయమొప్పఁ గట్టి,
దాని దాఁపుననె యుత్తరభాగమందు
గ్రామమ్ము నిల్పి, నాగాభోగిపేర

నీయూరి చెఱువుల కిడె నేకభంగి
నాగసముద్రంబు[౫] నామధేయంబు.

## ౮

అంతమాత్రనఁ దన్వి నందంగఁబోక,
చిక్కప్పయొడయరు చెఱువుల నూళ్ల
నీకఁగొన్ని నిర్మింప నెంచి, యంగంగఁ
దగినతావులఁ జూడఁదలఁచి, యుత్తరపు
దెస, నగస్త్యాశ్రమ దివ్యభాగమునఁ
గల, పెన్నగట్టులగమిఁ జీల్చుకొనుచు
వచ్చు పెన్నేటి త్రోవను నడ్డకట్ట
వైచి, యచ్చటఁ బెనువఱద నిల్కడఁగ
నాఁపఁగా నోపెడునట్టి తటంబు
కొండలనడుమ నెక్కొనఁజేయుకొఱకుఁ,
జెల్మి నొడ్డెల ననుజీవివర్గంబు
నచటఁ జేరిచి, యుదయాస్తమయంబు
పనివడి నియమతత్పరత మెలంగి,
కార్యసమారంభకలన నెసంగ,
వడగాడ్పు లలసెఁ జల్వనివలిరొయిలసె
బలువేఁడిససిరోసెఁ బసిబీళ్లఁ బాసె
ఛాయలుజాఱెఁ గెంజాయలు మీఱెఁ
గూండ్లఁ బిట్టలుసేరె గూబలు వాఱె
నరుణుండు నక్కె సుధాంశుండు నిక్కెఁ
బద్మముల్ ముడిగె నుత్పలములు విడిగె.
కరటముల్ బెగడె రిక్కలగుమి నెగడె
తమమెల్లఁ దలఁగె చంద్రజ్యోత్స్న చెలఁగె.
ఆవల నూఱటకయి తలిమమునఁ
గూర్కెడునెడ, ముద్దుగుమ్మ యొక్కరిత
యగపడి సుప్తిఁ, జిక్కన కిట్టు లనియె:
"ఓకార్యకర్త! యీయొకపల్కు వినుము.
నీపూన్కి యెంతయు నిరుపమానంబు,
కాని గంగకు వడి కడిఁదియా నిచట
నామెయుద్వేగంబు నాఁప నశక్య
మదిగాన నీ విందు వ్యర్థప్రయాస
మాని, దక్షిణమున మలసెడుదానిఁ
జిత్రావతీనదిఁ జేరి, యచ్చోట
రచియింపనెడల నేర్పడుఁ దటాకంబు,
వఱలించు నది కీర్తిపల్లికాచయము
తద్దయు" నంచు నంతర్ధానమందె.

కలనిట్లు తోఁచిన కాంతామతల్లి
గంగాభవాని నిక్కమయంచు నెంచి,
యాతఁ డద్దేవికి నాత్మలో నెఱఁగి,
మగుడి నిద్రాసక్తి మఱచె దేహంబు.

అఖిలజీవు లిటు మాయాసుప్తి నడఁగ
'దిననాథుఁ డరుదెంచుఁ దెలివొందుఁ' డంచు
ఖగవందినికర మొక్కటను ఘోషించె.
ధవళవిశుద్ధవేత్రపు మొన నూఁది
పెను వేగుఁజుక్క దఫేదారు పొలిచె.
మచ్చువిబూది నింపాదిగాఁ జల్లి
ముంచి విశ్వంబు తమోభ్రాంతి నెల్ల
జగముల సత్త్వరజశ్శ్రీలఁ గొంచుఁ,
బ్రమదంబుఁ గను నన్నుఁబట్టిశిక్షింప,
నినుఁ డుద్ధతిని వచ్చు నెది తెఱఁగంచు,
విధుచోరనాథుండు వెలవెలపోయె.
పతి కిట్టు లొదవిన భంగిసంగతికి
దిగులొంది చుక్కలు దివి జాఱఁదొడఁగె
పదపడిఁ బూర్వాద్రిభద్రాసనంబు
నవ్యపల్లవ తోరణములఁ జెన్నారెఁ,
బూషుండు నయ్యెడఁ బొడసూపె రుచిర
మాణిక్యకోటీర మండనుం డగుచు.

## ౯

అంతట చిక్కప్ప యాచోటు విడిచి,
సమవిశంకట ధరాస్థల మధ్యతటిని
నుభయపార్శ్వముల మహోన్నతరీతి
నాకసం బంటు గిర్యగ్రద్వయంబు
పెట్టనికోటకుఁ బెనుగవనట్లు
తనరార, దాని యంతరభాగమందుఁ
దిరుగు మహాస్రవంతికి ధామమగుచుఁ,
గణ్వాశ్ర[౬] మోపాంతగహనభాగమునఁ
బార్లపల్లియ[౭] గండిపట్టు వీక్షించి,
యటఁగూడ వాహిని యాఁగదటంచుఁ
జిత్తమం దెంచి, పశ్చిమ దిగధ్వమున
నరిగి, గార్గేయ ఋష్యాశ్రమభూమిఁ
బరఁగు, దేవరకొండపాదభూస్థలిని
సమతల మందు స్వేచ్ఛగఁ బెంపుఁగనిన
తుమ్మల నొరయుచుఁ, దోరంపు టూర్మి
కరనికరముల భీకరకందరముల
నప్పళించుచు, మించునల్క ఱొప్పుచును,
గడుఘూర్ణనము నొంది, కాలాహివోలె
నురుఁగులఁ గ్రక్కుచు, నులిమిబొందలను,
గూఁకటివేళ్లతోఁ గూల్చుచుఁ దరుల,
దరులఁ జీల్చుచును, నుద్దవిడిసస్యముల
ధరనంట నడఁచుచుఁ, దలవీటికడల
నొలయుఁ బశ్వాదుల నువ్వెత్తుగొనుచు,
గుట్టల రాయుచు, గుడుల డుల్చుచును,
బలువైన శిలలఁ బ్రవాహవేగమువ
దొరలఁ జేయుచు దూఁకి దొడదొడఁ బాఱు
పాండునదిని[౮] గాంచి పరితోషమందె.
అది పదికోసులయవలఁ జెన్నొందు
కంబుగిరీశుని కనుమలలోనఁ
బుట్టివచ్చెడుమహా పుణ్యస్రవంతి
యని యెంచి చిక్కప్ప యందొక చెఱువు
నిర్మించి, యంత దానికి రెండుమొనలఁ
బ్రాగ్దిశనొకటియుఁ బడమర నొకటి
యలుఁగుల రెండింటి నమరించి, యచట
నొక్కొక్కవైపున నొక్కొక్కయూరు
గట్టించి, పూర్వదిగ్భాగమం దెసఁగు
స్థానీయమునకు భూధవు కీర్తి వెలయ
బుక్కరాయసముద్ర[౯] పురమను పేరుఁ
బశ్చిమమునఁ గల పట్టణమ్మునకు
రాజ్ఞియనంతాంబ[౧౦] రక్తిచిహ్నముగఁ

---

౫. ఈపేరుగల గ్రామతటాకములు, అనంతపురమండలమునందలి ధర్మవరప్రాంతమున, ధర్మవరమునకు దక్షిణమునఁ బదిమైళ్లదూరమున నున్నవి. ౬. కణ్వాశ్రమము—ఇది యనంతపురమండలమున, ధర్మవర ప్రాంతమునందలి పెద్దకోట్ల గ్రామమునకు సమీపమున నున్న యొకపవిత్ర క్షేత్రరాజము; కోనయని ప్రసిద్ధినొందినది కణ్వమహర్షి యిందుఁ దపమాచరించి, ధన్యతను జెందెననుట చిరకాలమునుండి యీప్రాంతమువారి నమ్మకము. ప్రతివత్సరముఁ గార్తికమాసపుఁ గడపటిసోమవారదినమున నిం దుత్సవము జరుగును. ౭. పార్లపల్లె—అనంతపురము కడప మండలముల మేరలోనున్న (పులివెందల తాలూకాలోని) యొక గ్రామము. ౮ దీని వ్యవహారనామము 'పండమేఱు.' ౯. "One he named Bukkarayasamudram after his master and the other Anantsagaram after the queen."—The Annals of Handeh Anantapuram. ౧౦. ఈ యనంతాంబ చిక్కప్ప యొడయరు భార్యయని కొందఱి మతము. "చిక్కప్పఉడయరు........ రెండవదానికిఁ దనభార్యయైన యనంతమ్మపేరిట అనంతసాగర మను పేరుపెట్టెను." అని యాంధ్రవిజ్ఞానసర్వస్వము. చూడు—సంపు ౨. పుట ౯౭౭.

గ్రాల ననంతసాగర౧౧ మనునామ
మిడె, రాజభక్తి భాసిల్ల లోకమున.

అంతఁ జిక్కప్పయనంతసాగరపు
దరిఁ గృష్ణగిరి౧౨ నొండు దైవాలయంబుఁ౧౩
గట్టించి, బాణలింగంబు దెప్పించి,
తిరపడ శ్రీశివదేవప్రతిష్ఠ
చేయించి తత్కార్య చిరతరస్మృతికి
శంకరదేవుని సాన్నిధ్యమందు
శాలివాహనశక సంవత్సరములు
పంద్రెండునూర్లు నెన్బదియాఱుసంఖ్య
గల, క్రోధివత్సర కార్తికకృష్ణ
పంచమీ గురువార పావన తిథిని
నలువొంద నొకశాసనంబు వేయించె.
ఈశాసనము వచియించునిమ్మాడ్కి—
"బుక్కరాయసముద్ర పుటభేదనమునఁ
గోటకుఁ బడమరఁ గొలఁదిదూరమున
వఱల నారాయణస్వామి యాలయము౧౪
తగ లోనికోటకు దక్షిణ దిశను
నాంజనేయస్వామి యాయతనంబు౧౫
వెనుక నిర్మించిన విశ్వేశు ధామ
మునకుఁ, బశ్చిమతటమున నొప్పమీఱు
చౌడేశ్వరీ దివ్య సదనం౧౬ బొక్కండు
దీనికి నుత్తర దిగ్భాగస్థలిని
విఘ్ననాయకునికోవెలయు౧౭ నొక్కండు
నివ్విధిఁ జిక్కప్ప యింపుదలిర్ప
సమతఁ బంచప్రతిష్ఠల నొనరించి,
బుక్కరాయసముద్రపుర నాయకత్వ
మునకు నిర్వారను నిమ్మగ బసిరెడ్డి
వేళ్లబోయని౧౮ యింటి వెంగళరెడ్డి
యనువారి నునిచి, యనంతపురంబుఁ
బాలింపఁ జతురునిఁ బరికించియొరుని,
శ్రీమించు గుగ్గిళ్ల౧౯ చిన్నపరెడ్డి
నెలమి నియోగించె నింపుపెంపొంద."

## ౧౦

సంకల్పకార్య సంచయ మీ విధమున
బుక్కరాయసముద్రమునఁ బూర్తి చేసి,
తరువాతఁ జిక్కప్ప దక్షిణసరణిఁ
బట్టి, యొంటిఁ బదాఱుపరువులు నడచి,
రేఁగుసాలములు నేరేడుభూజములు
మామిడి విటపులు మారేడుతరులు
చంద్రపాదపములు సారనింబములు
కానుఁగు బందరు కడపద్రుమములు
తుమ్మ చిసరు౨౦ బిల్లు తుమికిమానులును
గిరిశిప రేకు పొలికిరి ముష్టిచెట్లు
నినుపద్ది పచ్చారు లెనయు వెదుళ్లు
మద్ది నీరుద్దిజాములు మోదుగులును
వెలఁగ పల్వర సారవేపమ్రానులును
దేవదారు బిలుసు తింత్రిణీద్రుమలు
మఱ్ఱి జువ్వి తాండ్ర మంగాగములు
కొండమమ్మిడి కలిగొట్టు వృక్షములు
వెలికి లొద్దుగు కలివెలు రావికుజము
లిప్ప శాఖులును నహినాటపులును
గల పర్వతావళిఁ గాంచి యందందుఁ
బచ్చికనోట్లు నింపాదిగా వెలయు
సారవంతంబగు సమభూమిఁ జొచ్చి,
యందలి ప్రకృతిఁ గన్నార నీక్షించి,
వరగిరి వేంకటేశ్వరగిరి దరినిఁ
బ్రవహించి దానికిఁ బశ్చిమదిశను
నల్లగుట్టల కవనడుమ వడిమీఱు
చిత్రావతినిఁ గని చింతించె నిట్లు—

"ఈరెండుగుట్టల యెడమున నొక్క
గట్టు పోయించి గంగను నిల్పు నెడల
నది జీవనాధారమయి లోకమునకు
నానందదాయిని యగు నిక్కువంబు
గాన, నికార్య మేఁ గావింతుఁగాక!"

అని పూని యుత్సాహ మత్యంత మడరఁ
గోట్లకొలందిగఁ గూలివారలను
నొడ్డెజనంబు నియోగించి, వేగ
నెలకొల్పెఁ దటము దానికి నిరుగడల
మరవలఁ౨౧ గొల్పె సమాననిరూఢి
రాజుపేరను దన రాజ్ఞి౨౨ పేరునను
బూర్వదిక్కున నొండు బుక్కపట్టణము
నావలిదెసను ననంతసాగరము౨౩
నిల్పి, చౌడేశ్వరీనిలయ మొక్కండు
గణనాథసౌధ మొక్కండు నిర్మించె.

అవలఁ గొండొకకాల మచట వసించి,
యంతె యంతర్ధానమందె చిక్కప్ప.

స్వార్థపరత్వంబు స్వాభిమానంబు
నెట్టిపోయెడుఁగని యుద్ధమానసుఁడు
నౌదార్యధుర్యుండు నయి చిక్కనార్యుఁ
డీరీతిఁ దనమునిక్క యెపుడు సాగించె.

కడలేని యితని చొక్కపు జీవనంబు
నిఖిలజనుల్మల కయ్యె నిత్యజీవనము.

---

౧౧. నాఁటి యనంతసాగరమే నేఁటి యనంతపురము. హండే యనంతపుర మను పేరును దీనికిఁ బ్రసిద్ధమె. ఇది హండేదొరల యేలుబడి వలన వచ్చినది. ౧౨. నల్లగుట్ట—ఇది యొక పొడవైన గుట్టలవరుస. ఈ శ్రేణి దేవరకొండకుఁ బడమటిశాఖయై, బుక్కరాయసముద్రము, ననంతసాగరమును రెండుపాయలుగావించుచు, నుత్తరముఖముగా రమారమి రెండుమైళ్లదూరమువఱకుఁ బోవుచున్నది. ౧౩. శ్రీ కాశీవిశ్వేశ్వరాలయము—ఇది పైనల్లగుట్టలవరుసను దూర్పుటోరఁ, బూర్వాభిముఖముగ బుక్కరాయసముద్రమునకు వెడలు కాలిజాడకు నెడమచేతివైపున, (నొక పెద్దపుష్కరిణితో) నేఁటికిని గోచరించుచున్నది. ౧౪. ఇది బుక్కరాయసముద్రగ్రామమున నూరికిఁ బశ్చిమోత్తరదిశను, బూర్వాభిముఖముగా జీవదశలో నున్నది ౧౫. బుక్కరాయ సముద్రపురమునందలి రాజవీథియందు దక్షిణాభిముఖముగ నొప్పుచున్నది. ౧౬. చెఱువుకట్టకు దగ్గఱగా ముసలమ్మకట్టకుఁ బశ్చిమోత్తరదిశను గొన్నిగజములదూరములో, నల్లగుట్టవరుసకుఁ బడమటియోర, ననంతపురమునకు వెడలు బండిబాటకుఁ గుడివైపున, విశ్వేశ్వరాలయమునకు వెనుకఁ గొలదిమేరలో శిలరూపముననుండి యిపుడు 'గవిమఠ' మనఁబడు చున్నది. ౧౭. ఇపుడీ విఘ్నేశ్వరాలయము నామమాత్రావశిష్టమైనది. నల్లగుట్టలశ్రేణియం దెందో భూసమమయి యుండనోపు. ౧౮. బుక్కరాయసముద్ర ప్రాంతమునఁ గల రమారమి యెనిమిది గ్రామములకు, నేఁటికి నీ వంశజులే పాలకు లయియున్నారు. నేఁటిపాలకుఁడు వేళ్లబోయని శివరామిరెడ్డి. ౧౯. అనంతపురపాలకత్వ మిప్పటికి నీగుగ్గిళ్లవారి వంశజులకే చెందియున్నది. నేఁటి గ్రామాధికారి గుగ్గిళ్ల కృష్ణారెడ్డి. ౨౦. దీని వాడుక పేరు 'సిగరచెట్టు.' ౨౧. అలుఁగులు. ౨౨. రాజ్ఞీప్రభువులపేర, సమానరీతిని నెలకొల్పిన పురతటాకములు పై రెండుప్రదేశముల మాత్రమే పేర్కొన్నను, అనంతసాగరమనియు, బుక్కసాగరమనియు, నాగసముద్రమనియు వెవ్వేఱుగ భిన్నభిన్నస్థలములలో నీ చిక్కప్ప నిర్మించిన జనపదములు, జలాశయములు నిఁకను బెక్కుతావులఁ గన్పట్టెడిని. ౨౩. ఆప్రాంతవాసులు, దీనిని 'క్రొత్తచెఱు' వందురు.

కౌణపాజీవసంగతి మాన్పి నరుల
కార్యవృత్తినిఁ గూర్చు నమలజీవనము.
ఆపోశఁ గాంచని యఖిలజీవులను
నమృతాంధసులఁ జేయు నమృతజీవనము.
మృత్యుసాధ్వస మలమిన మర్త్యకోటి
కమరభావముఁ గూర్చు నభయజీవనము.

గానఁ జిక్కుప్ప యఖండజీవనమె
యగు మానవాళి కనంతజీవనము.
అని యిట్లు చికాకుర్య్య నతిపూతచరిత
బాలురు వృద్ధులుఁ బ్రాజ్ఞులు నజ్ఞు
లందఱుఁ జదివి, మోదాబ్ధి నోలాడి
చిత్తశుద్ధియును సౌశీల్యసంపదయు

వితరణగుణమును విజ్ఞానధనముఁ
బడసి, యిహపరములఁ బడయ సౌఖ్యంబు
తేటతెనుంగునఁ దేలికనుడుల
నామోదమున సీర్పియాంజనేయుండు
మంజరీస్వపద సంపదయొప్ప వ్రాసె.

---




ఉ. కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల, యో మదంబ, యో
హాటకగర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాట కిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్మ భారతీ!

(భాగవతమునుండి)

---



# కార్వేటినగర చరిత్ర

యస్. యమ్. వేణు గారు

ఆంధ్రరాష్ట్రము లోని చాల పురాతనమైన సంస్థానములలో కార్వేటినగర మొక్కటి. సంస్థానపాలకులలో నిప్పటివరకు రమారమి రెండువందల పురుషాంతరములు గడచినవి. క్రీ. పూ. ౬౭-వ సంవత్సరమున కార్వేటినగర సంస్థానము నెలకొనిన దని తద్రాజన్యుల వంశవృక్షమువలన తెలియు చున్నది. అదిమొదలు ఇటీవల కొన్ని సంవత్సరములవరకు సకల సంపదలకు ఆకరమై, లక్ష్మికి పుట్టినిల్లయి, సర్వవైభవములతో విరాజిల్లుచుండిన యీకార్వేటినగరచరిత్రను దెలిసికొనుట ప్రతియాంధ్రునకు కర్తవ్యము. బాహుబలసంపన్నులును, ఉదారులును, స్వచ్ఛందసూర్యవంశక్షత్రియజనితులును, అగు అనేకరాజపుంగవు లీకార్వేటినగరమును బరిపాలించి అసదృశ యశస్సును బడసినారు; సంస్కృతాంధ్రకవులు పెక్కండ్రను సత్కరించినారు; సంగీత విద్వాంసుల జేరదీసి యుచితరీతిని బహూకరించినారు; దైవబ్రాహ్మణ కార్యము లెన్నియైనను పరమభక్తితో, ప్రీతితో, మహాత్యాగశీలముతో, యెంత డబ్బైనను సరకుసేయక అధికోత్సాహముతో జేసినారు; ప్రజల యుపయోగార్థము బావులు త్రవ్వించినారు; చెరువులు వేయించినారు; అన్నసత్రముల స్థాపించినారు; దేవాలయములు గట్టించినారు. ఇంతయేల, రాత్రులయందు నక్కలు చలిబాధ కోర్వలేక రోదనచేయుచున్నవన్న మాటలు నమ్మి వాటికి దుప్పట్లు దీసికొనిపోయి కప్పునట్లు పరిజనుల కాజ్ఞాపించిన ప్రభువులుగూడ ఈకార్వేటినగరమును బరిపాలించినవారిలో గలరు. లిఖితరూపమైన యాధారము లెవ్వియు లేనందున చాల పురాతనమైన యీసంస్థానపాలకుల చరిత్ర వ్రాయుట అంతసులభమైన పని గాదు. ఏవో కొందరి చరిత్రమాత్రము రూఢిగ దెలిసియున్నంతవరకు ఇందు క్లుప్తముగ వ్రాయుచున్నాను.

## ౧

క్రీ. పూ. ౬౭-వ సంవత్సరమునుండి క్రీ. శ. ౧౭-వ సంవత్సరమువరకు యీరాజధానిని కలికాలచోళుడను రాజు పాలించుచుండెను. అప్పటి కీకార్వేటినగరము నిర్మింపబడలేదు. ఈప్రాంతపు ప్రజలను పాలించుచు నారాజులు ప్రస్తుతనారాయణవనమును కేంద్రస్థానముగా నుంచుకొని యుండిరి. ఈకలికాలచోళు డెవ్వరైనదియు నిర్ణయింప వీలుగాలేదు. కొంచె మించుమించుగా నిదేకాలమున దక్షిణదేశమును బాలించుచుండిన కరికాలచోళుడే యీతడో, లేక యీతని వంశమునకు జేరిన మరియొకరో యూహింప నశక్యము. ఈతని కులగోత్రములు దురూహ్యములు. ఈత డొకనాడు తిరుమల ప్రాంతారణ్యమునకు మృగయావినోదార్థ మేగి యచ్చట ధనంజయుని కూతురగు విలాసవతియను ఒక నాగకన్యకను గాంధర్వమున వివాహమాడి యామె వలన తొండమాన్ అనునొక పుత్రుని బడసెను. కలికాలచోళుని యనంతర మీతొండమాన్ చక్రవర్తి రాజయ్యెను.

తొండమాన్ చక్రవర్తి క్రీ. శ. ౧౭-వ సంవత్సరమునుండి ౮౭-వ సం. రమువరకు రాజ్యమును బాలించెను. ఇతడు దైవభక్తుడు; భాగవతోత్తముడు. శ్రీనివాసమూర్తి ఈతనికి ప్రత్యక్షమగుచుండెనని ప్రతీతి. ప్రస్తుతపు తిరుమలయందు శ్రీనివాసమూర్తిని ప్రతిష్ఠించిన దీమహామహుడే. ఇతడు కృష్ణశర్మయను బ్రాహ్మణోత్తముని జీవంగతులైన భార్యాపుత్రుల బ్రదికించిన ట్లొకవాడుక గలదు.

తొండమాన్‌చక్రవర్తియనంతరము రాజ్యమునకు వచ్చినవారిలో నారాయణ దేవరాజు ముఖ్యుడు. (క్రీ. శ. ౧౨౧-వ సం. రం మొదలు ౧౬౩ వరకు) ఈతని కాలముననే నారాయణవనమునకు చంద్రవంశపు రాజులు వచ్చిరి. మిథిలాపురము (?) ను బరిపాలించు

చుండిన చంద్రవంశపు రాజగు వసుదానుడు రాజ్యభ్రష్టుడై దార పుత్రాదులతో తిరుమల జేరి శ్రీనివాసుని ధ్యానించుచుండ నొకానొక నాడు శ్రీనివాసమూర్తి ప్రత్యక్షమై, వసుదానుని, నారాయణవనమును బాలించుచుండిన నారాయణ దేవమహారాజునొద్ద కేగిన రాజ్యమబ్బునని చెప్పి యచ్చటికి బొమ్మని యాజ్ఞాపించెనట. ఈవరకే నారాయణ దేవమహారాజునకు శ్రీనివాసమూర్తి స్వప్నమున గనబడి వసుదానున కర్ధరాజ్య మిమ్మని చెప్పియున్నందున, భగవంతుని యాజ్ఞానుసారము, వచ్చిన వసుదానునకు నారాయణ దేవమహారాజు తన రాజ్యమున నర్ధభాగము సమర్పించి నారాయణవనమున నాతని నుండ నియమించి తాను క్షుణికాచలము (తిరుత్తణి) ను నివాసముగా గొని తక్కిన యర్ధరాజ్యమును బాలించుచుండెను.

క్రీ. శ. ౧౫౫-౨౦౦ సం. రముల ప్రాంతమున నారాయణవనమును పాలించుచుండిన వసుదాను (I) ని వంశజుడైన ఆకాశరాజునకు చాలకాలమువరకు బుత్రులు లేకుండిరి. ఆతడు పుత్రకామియై యాగము నొకదానిని జేయ సంకల్పించి యాగభూమిని స్వయముగ నాగలితో దున్నుటకై పోవుచుండ చేరువనున్న యొకకొలనిలో నప్పుడే వికసించిన తామరపువ్వులో నేడ్చుచు పరుండియుండిన ఒక శిశువును గని దానిని దీసికొనిపోయి తనభార్య కప్పగించెనట. తలవని తలంపుగా లభించిన యీశిశువునకు పద్మమునందు లభించిన దగుటచే పద్మావతియని పేరుబెట్టి యతిగారాబముతో బెంచుచుండిరి. ఆవల కొన్ని దినములకు ఆకాశరాజునకు వసుదాను (II) డను ఒకపుత్రుడు గలిగెను. తిరుమలయందు గ్రుమ్మరుచుండిన శ్రీనివాసమూర్తి, యొకనా డుద్యానవనమున యౌవనవతియు, సౌందర్య తేజోరాశియు నగు పద్మావతిని జూచి, యాయమను వలచి యాకాశరాజు ననుమతిపై యథావిధిని బరిణయమాడెను.

వసుదానుడు (II) తన తండ్రి యనంతరము రాజ్యమునకు వచ్చెను. ఇతనికి చాలకాలమువరకు బుత్రులు లేకుండినందున, తనకు వార్ధక్యము ప్రాపకమౌటచే నప్పుడు క్షుణికాచలమును బరిపాలించుచుండిన నారాయణ దేవమహారాజు వంశస్థుడగు వేంకట్రాజున కిచ్చి (క్రీ. శ. ౨౦౨ నుండి ౨౪౫ వరకు) తాను తిరుమలజేరి తపస్సు జేసికొనుచు నిర్యాణమందెను. వసుదానుడు (II) వేంకట్రాజునకు రాజ్యము నప్పగించుచు, తన సహోదరియగు పద్మావతీదేవిని అది మొదలు వారియింటి బిడ్డగా భావించుకొని శ్రీస్వామివారిని అల్లుడుగ గణింపవలసినదని వేంకట్రాజును వేడికొనెను. ఈకారణమునుబట్టి యిప్పటికిని శ్రీవేంకటేశ్వరుడు కార్వేటినగరము సంస్థానాధీశుల యల్లుడని, వీరు తిరుమల కేగినచో స్వామివారి సన్నిధిని మామగారికి జరుగవలసిన కొన్ని మర్యాదలు సహితము వీరికి జరుగుచునేయున్నవి.

నారాయణదేవమహారాజు కాలమున రెండు భాగములైన రాజ్యము మరల ఒక్కటైన తర్వాత వేంకట్రాజు (I) క్షుణికాచలమును వీడి నారాయణవనమును జేరి పూర్తిరాజ్యమును ఎప్పటివలె పాలించుచుండెను. క్రీ. శ. ౨౪౫ సం. ౪౦ మొదలు ౩౦౨ వరకు వేంకట్రాజు ననంతరము ఆతని సంతతివారే అయిదుగురురాజులు రాజ్యమును బాలించిరి. క్రీ. శ. ౩౦౨-వ సంవత్సరమున వేంకట్రాజు (II) రాజ్యమునకు వచ్చెను. ఈతని కాలమున శూద్రపాళెగాండ్రు నారాయణవనముపై దాడివెడలి రాజ్యము నాక్రమించుకొనిరి. పాళెగాండ్ర సమరములో వేంకట్రాజు (II) మృతినొందెను. అప్పుడు గర్భవతిగా నుండిన యాతని భార్యను వెంటబెట్టుకొని భూపుడను మంత్రి రహస్యముగా వేంకటాచలమునకు పారిపోయెను. అచ్చటనే కొన్ని యేండ్లవరకు వారు రహస్యనివాస మేర్పరచుకొని జీవించుచుండిరి. గర్భవతిగా నుండిన వేంకట్రాజు (II) భార్య కొన్నినాళ్లకొక పుత్రుని గనెను. ఈబాలుడు యుక్తవయస్సు వచ్చిన వెంటనే పాళెగాండ్రపై దాడివెడలి యన్యాక్రాంతమైయుండిన తన పూర్వుల రాజ్యమును తిరిగి సంపాదించెను. శత్రురాజుల జయించినవాడగుటచే నతడు రిపుంజయమహారాజని పిలువబడెను. ఈతడు క్రీ. శ. ౩౧౦ మొదలు ౩౨౬-వ సంవత్సరము వరకుబరిపాలించెను.

రిపుంజయ మహారాజు ననంతరము క్రీ. శ. ౮౮౦-వ సంవత్సరము వరకు ఈతనివంశజులే క్రమముగా నలువదియేడ్గురు ప్రభువులు సంస్థానమును పాలించిరి క్రీ. శ ౮౮౦-వ సంవత్సరమున రామరాజు (VII) రాజ్యమునకు వచ్చెను. ఈతని కాలమున ఉత్తరమున శేషాద్రి వరకును, తూర్పున బంగాళాఖాతమువరకును, దక్షిణమున పినాకిని వరకును, పశ్చిమమున నందిదుర్గమువరకును రాజ్యము వ్యాపించియుండినదని తెలియుచున్నది. ఈతనియొద్ద ౨౦౦ ఏనుగులు, ౩౦,౦౦౦ గుఱ్ఱములు, ౬౫,౦౦౦ కాల్బల ముండినదని యేర్పడుచున్నది.

ఈతనికి తరువాత క్రీ. శ. ౯౫౫-వ సంవత్సరమువరకు రాజ్యపాలన గావించిన వారిలో కెల్ల ప్రబోధకరాజు ప్రఖ్యాతిగన్నవాడు. ఈతడు శ్రీకంచివరదరాజస్వామికి పుణ్యకోటి విమానము జేయించి గోపురప్రాకారాదుల నిర్మించినాడు. ఈతనికి నల్వురు పుత్రులు గలిగిరి. రెండవకుమారుడైన ఆనందరాజు దారసమేతుడై జగన్నాథమునకు యాత్రబోవుచు దారి మధ్యమున సింహాచల ప్రాంతమున బందిపోటు దొంగలచే నెదుర్కొనబడి, వారితో బోరి వారిని జయించి, యాప్రాంతభూముల నాక్రమించి, యచ్చట రాజ్యపాలన జేయుచు వాసము జేయుచుండెను. కొన్నాళ్లకు తన పుత్రుడైన భౌతికపతికి రాజ్య మప్పగించి తాను జగన్నాథమునకు జని అచ్చట మండప ప్రాకారాదుల నిర్మించి తపస్సుజేసికొనుచు ఆనందరాజచ్చటనే యసువుల బాసెను. వీరి సంతతివా రిప్పుడు సింహాచలము (?) న కలరో, లేరో విచారింపవలసియున్నది. ప్రబోధక మహారాజుకు ప్రథమ పుత్రుడైన శంభురాజు క్రీ. శ. ౯౫౫-వ సం. రమునుండి ౯౯౮ వరకు





1. కేసరపల్లి ఆంజనేయులుగారు ; 2. ఏలూరు ఆంజనేయ ధర్మశాల.



1. ఏలూరి పరంధామయ్యగారు ; 2. బూదరాజు లక్ష్మీనారాయణగారు — చెన్నపురియందు జరిగిన ఆంధ్రవిద్యార్థి సమావేశపు సంయుక్తకార్యదర్శులు. 3. ఎ. సి. సుబ్బారాయులు, వి. టి. నారాయణన్ గార్లు ; 4. కొడిమెల కొండయ్యగారు

పాలించెను. కాళహస్తీశ్వరునికి గోపుర ప్రాకారాదుల నిర్మించిన దీమ హామహుడే.

ఈతనికి తరువాత అనేకరాజులు రాజ్యమునకు వచ్చిరి. క్రీ. శ. ౧౫౧౪-వ సంవత్సరమున రాజ్యమును బాలించుచుండిన సాళ్వసింహ రాజు సుప్రసిద్ధుడు. వీరి సమకాలికులును, ఆనెగొంది పాలకులును అయిన బుక్కరాయలవారి కితడు స్వసైన్యముతో సహాయముబోయి ఉదయగిరిముట్టడిలో జయముచేకూర్చినాడు. బుక్కరాయలచే మన్ననలబడసి కీర్తివంతుడై నారాయణవనమునకు దిరిగివచ్చెను. ఇప్పటి కార్వేటినగర సంస్థానాధీశుల బిరుదులలోని "సాళ్వ" యను పదము, బుక్కరాయలచే మొట్టమొదట ఒసంగబడిన "రిపుకపోత సాళ్వ"డను బిరుదములోనిదని ప్రతీతి

## ౨

ఇంతదనుక వ్రాసిన యంశము లన్నియు శ్రీరాజాగారి వంశ వృక్షమునుండి లభ్యములైనవి. శాసనములుగాని, మరే విధములైన లిఖితరూపములగు ఆధారములుగాని లేవు. నారాయణవన ప్రాంత దేవాలయములలోనుండి ప్రభుత్వమువారు తీసియుంచిన శిలా శాసనములలో కొన్ని యంశములు తేలుచున్నవి. వాని నీక్రింద వివ రించుచున్నాము.

క్రీ. శ. ౧౦౨౦-వ సంవత్సరమున నారాయణవనము చుట్టు ప్రక్కల బరిపాలించుచుండిన పాళెగాండ్రలో సాళ్వనరసారెడ్డి సుప్ర సిద్ధుడు. ఈతనికి తరువాత సాళ్వవేంకటపతినాయుడు రాజ్యాధిప తియై చోళులచే పదచ్యుతి ననుభవించినవాడు. ఈతని పుత్రుడగు సాళ్వభీమానాయుడు చోళులను జయించి తమపాళెమును మరల స్వాధీనపరచుకొనెను. ఈవంశములో పాళెమును పాలించినవారిలో సాళ్వభుజంగనాయుడు కడపటివాడు.

క్రీ. శ. ౧౧౦౫-వ సం. రమున ఉత్తమచోళుని యేలుబడికి లోబడి కరికాలచోళుని యనంతరము అద్దొండ చక్రవర్తి యనునాతడు నారాయణవనమును బాలించుచుండిన ట్లొకశాసనమువలన దెలియు చున్నది. కాని రాజాగారి వంశవృక్షమున నీవిషయము ఏర్పడుట లేదు. అద్దొండ చక్రవర్తికితరువాత వరుసగా సుదామరాజు, సురా జు, నారాయణరాజు రాజ్యమునకు వచ్చినట్లు తెలియుచున్నది. ఈనారాయణరాజు మిథిలాధీశుడైన వసుదానున కర్ధరాజ్య మిచ్చి నట్లుగూడ దెలియుచున్నది. శ్రీరాజాగారి వంశవృక్షమున క్రీ. శ. ౧౨౯-వ సంవత్సరమున నారాయణవనమును బాలించుచుండిన నారా యణదేవమహారాజు వసుదానున కర్ధరాజ్య మిచ్చినట్లు చెప్పబడియు న్నది. ఇందేది యథార్థమైనదియు నిర్ణయింపవలసియున్నది. శాసన ములమాట స్థిరపరచుచున్న చాలపురాతనమైన పద్మావతీచరిత్ర, శ్రీవేంకటేశ్వర కల్యాణము మొదలైనవి అబద్ధములగుచున్నవి. అప్పు డప్పుడు ఎత్తివ్రాయించిన శ్రీరాజాగారి వంశవృక్షములోని మాటలు యథార్థములని నిరూపించుటకును పాలుపోకున్నది.

ఈ శిలాశాసనములవలన దేలిన యంశము లేవనగా:—

౧. శ్రీరాజాగారి ఆదిపురుషుడు కరికాలచోళుడని,

౨. క్రీ. శ. ౧౧౦౫-వ సంవత్సరమునకు తర్వాతనో, లేక క్రీ. శ. ౧౨౯-వ సంవత్సరమునో అన్యదేశీయులగు చంద్రవంశపు రాజులకు నారాయణవనరాజులు అర్ధరాజ్య మిచ్చినది నిజమని,

౩. ఒకే కుటుంబమున రెడ్డి, నాయుడు అను రెండు నామ ములు వాడబడియుండుటచే అప్పుడు వర్ణబేధము లట్టే లేకుండినవని,

౪. పైకారణమును బట్టి కార్వేటినగర ప్రభువులు మొదటి నుండి 'రాజు' పదము వాడుకొనుచున్నను, ప్రథమమునుండి వీరు క్షత్రియులగుట సందేహమని.

ఇందలి నాల్గవయంశమున కనుకూలముగ కార్వేటినగర పాల కులు ఆర్యమతావలంబకు లనియు, సుమారు ౩౦౦ సం. రములకు ముందు వీరు క్షత్రియకులము స్వీకరించిరనియు శిద్దిరాజు గోపన్నగారు తమ గ్రంథమున వ్రాసియున్నారు.

క్రీ. శ. ౧౨౩౦-వ సంవత్సరమున చాళుక్యుని వంశజుడైన రెండవరాజరాజు నారాయణవనరాజ్యముపై దాడివెడలి చాలభాగ మాక్రమించు కొన్నట్లు కొంతవరకు దెలియుచున్నది. అప్పుడు నారాయణవనమును బాలించుచుండినవారు అజరాజు. చాళుక్యులు జయించిన రాజ్యమును క్రీ. శ. ౧౩౧౪-వ స. రము వరకు కొండవీడు రెడ్లవంశస్థుడైన పోలిరెడ్డియు, యాతనియనంతరము శేషాచలరెడ్డియు బాలించిరి. కొండవీడువారైన సాళ్వరెడ్లలో రాజ్యమును బాలించిన వారిలో నీశేషాచలరెడ్డి కడపటివాడు. ఈరెడ్లవంశమునుండి "సాళ్వ" బిరుదము రాజాగారి బిరుదావళిలోనికి వచ్చినట్లు మరియొకి వాడుక గలదు. దాని నీక్రింద వివరించుచున్నాను.

నారాయణవన సమీపగ్రామమైన కెంపులపాళెము పండి గుంటవారను సాళ్వరెడ్లు ఒక చిన్నపాళెమును బాలించుచుండిరి. (వీరు పైజెప్పిన కొండవీడు రెడ్లవంశములోనివారై యుండవచ్చును.) ఆకాలమున ములికనాడునుండి పెద్దబ్బ, చిన్నబ్బ యనునిరువు రన్న దమ్ములు పదచ్యుతులై దేశదేశముల గ్రుమ్మరుచు రెడ్లపాళెములోనికి వచ్చిరి. ఒకనాటిరాత్రి పాళెములోని యొకానొక గ్రామమున వారు బసచేసియుండ నాగ్రామమును బందిపోటుదొంగల గుంపొకటి ముట్ట డించెను. వీరిరువురును సాయుధులై దొంగల గుంపుతో బోరి వారిని హతము గావించిరి. ఈవిషయము, పాళెగార్లగు రెడ్లు విని వారిని ఆహ్వానించి తమయొద్దనే యుండ నేర్పాటు గావించిరి. అప్పుడు రెడ్ల యొద్ద రుద్రిరాజనునతడు మంత్రిగా నుండెను. ఆవల కొన్ని నాళ్లకు

రెడ్లు జనానాసహితముగ నగరి సమీపమునసున్న బుగ్గయొద్దకు వేటకు జనిరి. అప్పుడు తమతోపాటు రుద్రిరాజు, పెద్దబ్బ, చిన్నబ్బగూడ వెడలియుండిరి. ఆసందర్భమున నొక్కనాడు రెడ్డిరాణులచే నపరి శుభ్రము గావింపబడిన జలము సంధ్యావందనము జేయుచుండిన పెద్దబ్బ చిన్నబ్బ చేతులలోనికి వచ్చినందున వారిని మందలింపవలసినదని రెడ్లను ప్రాధేయపడియు, వారీ విషయమున శ్రద్ధజూపకుండినందున వారిలో వారికి మనస్పర్థలు పెరిగి రుద్రిరాజు ప్రోత్సాహముచే రెడ్డి సోదరుల నేద్దురిని విషప్రయోగముచే పెద్దబ్బ, చిన్నబ్బగార్లు చంపించిరని యొకవాడుక గలదు. రెడ్డిరాణులు సహగమనము చేయుకాలమున రాజ్యము పెద్దబ్బచిన్నబ్బగార్లకు చాలకాలము నిలువదని శాప మిచ్చినట్లును, శాపోపసంహారమునకు రాజసోదరు లిరువురు వేడికోగా వారింటిపేరగు 'సాళ్వ' యనుపేరును వాడుకొన్నంత కాలము వారికి కొంతమేలు గలుగ గలదని చెప్పినట్లును, ఆకారణముచే నిప్పటి రాజుల బిరుదావళిలోనికి "సాళ్వ"యనునది వచ్చినట్లును కొందరి యభిప్రాయము. ఇది కేవల మసమంజసము; నమ్మదగినది గాదు. విషప్రయోగము మొదలైన కథలలోని యథార్థము దురూహ్యము. పెద్దబ్బ చిన్నబ్బ గార్ల యాగమనము ఫలానప్పుడని చెప్పుట యశక్యము. ఆకాశరాజు నారాయణవనమును బాలించుచుండిన కాలమున వచ్చినట్లు గోపన్న గారు తమ గ్రంథమున వ్రాసియున్నారు. ఇందలి నిజము సందేహింపవలసియున్నది.

సాళ్వరెడ్ల యనంతరము రెడ్లరాజ్యము రెండు చీలికలై చిన్న రాజొక భాగమును, పెద్దరాజొకభాగమును బాలించుచుండిరి. వీరికి తరువాత వంశానుక్రమము బరిశోధించవలసి యున్నది.

## 3

బొప్పరాజువారి చరిత్ర దెలిసికొననిదే కార్వేటినగరచరిత్ర పూర్తికాజాలదు. సాళ్వరెడ్లను గొట్టి రాజ్యమును సంపాదించినవారు ఈబొప్పరాజు వంశస్థుల పూర్వులనియే కొందరి యభిప్రాయము. ఇది గొప్పపొరపాటు. సాళ్వబిరుద మిదివరకు బొప్పరాజవంశస్థు లెవరును వాడిన ట్లగుపడదు. వీరికి బొప్పరాజను నాతడు మూలపురుషుడైనందున బొప్పరాజను ఇంటిపేరు వచ్చినట్లు గోపన్నగారు వ్రాసియున్నారు. వీరు దాసరాజు వేంకటపతిరాజుగారి సంతతివారనియు, దాసరాజువారే బొప్పరాజువారనియుగూడ గోపన్నగారి యభిప్రాయము. ఈవంశమునకు జేరిన మాకరాజుగారికి (?) క్రీ. శ. ౧౫౧౮ ౧౫౩౦ లో నారాయణవనమును పాలించుచుండిన సాళ్వసింహరాజు సంతతివారైన మాకరాజు (II) గారికి ముసలితనమున సంతానము గలుగుటచే తనరాజ్యమును, బుత్రుని పైజెప్పిన బొప్పరాజు మాకరాజున కప్పగించి తాను తిరుమలకు వెడలిపోయినట్లు తెలియుచున్నది. అదిమొదలు నారాయణవనము బొప్పరాజువారి యేలుబడికి లోబడినది. మాకరాజు (II) కొమారులైన రామభద్రరాజు పిన్నవాడగుటచేత బొప్పరాజుమాకరాజునంతరము ఆతని కొమారుడు తిరుమలరాజు రాజ్యమును బాలించుచుండెను. ఈతడు క్రీ. శ. ౧౫౪౦ మొదలు క్రీ. శ ౧౫౯౧ వరకు రాజ్యమును బాలించెను. చెంజియుద్ధమున దేశింగునకు ప్రతికూలుడైన బాబునకు సాయమొనర్చిన దీతిరుములరాజే. ఈతనియనంతరము ఈతనిపుత్రుడు బమ్మరాజు రాజ్యమునకు వచ్చెను ఈతనికాలమున చేజెర్ల కావేటిరాజు సేనానాయకుడుగ నుండెను. వీరికి పురుషసంతానము లేనందున తమ యేకపుత్రియైన రాగమ్మను రామభద్రరాజు కొమారులైన కసవరాజు (II) కిచ్చి వివాహముజేసి, వారి రాజ్యమును వారి స్వాధీనముచేసిరి. అదిమొదలు రాజ్యము మరల సాళ్వసింహరాజువారి సంతతికి చేరి అవశ్యమైనప్పుడు బొప్పరాజువారి సంరక్షణక్రింద రాజ్యపాలన జరుగుచు వచ్చెను.

## ౪

క్రీ. శ. ౧౫౧౮-వ సం.రమునుండి క్రీ. శ. ౧౫౩౦ వరకు నారాయణవనమును బరిపాలించుచుండిన సాళ్వసింహునిగూర్చి యీ వ్యాసము ప్రథమభాగముచివరను వివరించితిమి. ఆతనికితరువాత మాకరాజు (II) (క్రీ. శ. ౧౫౫౨ నుండి ౧౫౪౫ వరకు) ముఖ్యమైనవాడు. ఈతనికి వృద్ధాప్యమందు సంతానము గలుగుటచేత తన భాగినేయుడైన బొప్పరాజు మాకరాజునకు తన రాజ్యమును, పుత్రుని స్వాధీనముచేసి తాను తిరుమలకు బోయినట్లు పైన జెప్పియున్నాము. క్రీ. శ. ౧౫౯౦ వరకు నారాయణవనము బొప్పరాజువారి పాలనకు లోబడియుండినది. మాకరాజు (II) కుమారులైన రామభద్రరాజు యువరాజుగా నుండినప్పుడు మహమ్మదీయసైనికులు నరపతియను రాయలపై దాడివెడలివచ్చిరి. రాయలకు సాయమొనర్చుటకై సైన్యముతోడి గిడ్డ మాకరాజను నాతడు (?) నారాయణవనమునుండి వెడలి యుద్ధములో నిహతుడయ్యెను. రామభద్రరాజునంతర మాతని కొమారుడు కసవరాజు (II) రాజ్యమునకు వచ్చెను. బొప్పరాజుబమ్మరాజుకుమార్తె యగు రాగమ్మ నిచ్చిన కసవరాజునకే ఈతడు క్రీ. శ. ౧౫౯౦ నుండి క్రీ. శ ౧౫౯౮ వరకు రాజ్యపాలన గావించెను. ఈతనికాలమున తురుష్కుల బాధ మిక్కుటముగ నుండెను వారితో బోరాడుటకు చిత్తూరు సంస్థానమున నుండిన శిద్దిరాజువంశస్థుడగు గోపన్నను బొప్పరాజువారు రప్పించిరి. గోపన్న తురుష్కుల యుద్ధములో నొకదానిలో ధైర్యసాహసములతో బోరాడి మృతినొందెను. స్వామికార్యమునకై యసువులబాసిన గోపన్నకుమారులను కసవరాజు (II) చేరదీసి ఆదరించెను.

ఈతనియనంతరము క్రీ. శ. ౧౬౯౦-వ సం.రమువరకు నారాయణవనమును తొమ్మిదిమంది రాజులు పాలించిరి. క్రీ. శ. ౧౬౯౦-వ

సం.రమున కావేరిరాజు (II) అనునాతడు రాజ్యమునకు వచ్చెను. ఈతని భార్యపేరు కోనేటమ్మ. ఈమె పేరుతో నొక గ్రామమునుగూడ వీరు కట్టించినారు. ఈయన కేడ్గురు పుత్రు లుండిరి. ఈతని జ్యేష్ఠ కుమారుడగు కసవరాజు (III) తండ్రియనంతరము రాజ్యమునకు వచ్చెను. ఈతనికి పురుషసంతానము లేనందున తన కనిష్ఠసోదరుడగు వెంకటపెరుమాళ్రాజు (I) నకు రాజ్యమును సమర్పించి తాను మునిపల్లె జేరి తపముజేసికొనుచుండి నిర్యాణసమయ మెరింగి నారాయణవనము జేరి కళ్యాణవేంకటేశ్వరస్వామివారి ధ్వజస్తంభమునొద్ద భార్యాసహితముగ నిర్యాణముజెందిరి. వేంకటపెరుమాళ్రాజు (I) క్రీ. శ. ౧౬౧౯-వ సం రమునుండి క్రీ శ. ౧౬౩౨ వరకు రాజ్యమును బాలించెను. వీరికి వేంకటమ్మ, పెరుమాళ్లక్క యను నిర్వురు భార్య లుండిరి. వీరిరువురిలో వేంకటమ్మ చాల రూపవతి అకారణముగ నీమెపై నేదో సందేహము గొని నగరులోని యొక అరలో చెరనుంచి అన్నాహారములయందు నిర్బంధించుటచే, ఆమె మనసువిసిగి తల వెంట్రుకలచే నురిబోసికొని చనిపోయెనని గోపన్నగారు వ్రాసి యున్నారు. పెరుమాళ్లక్కకు కోనమ్మయను బిడ్డ గలిగి గతించెను. సంతానహీనుడగు వేంకటపెరుమాళ్రాజు (I) తన రెండవపెద్దన్నయగు సింగరరాజుకొమారుడైన కావేటిరాజు రాజ్యమును స్వీకరించిరి. వీరు క్రీ. శ. ౧౬౩౨-వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చుసరికి కార్వేటినగరనిర్మాణము పూర్తియైనది. వీరికిముందు బరిపాలించిన వేంకటపెరుమాళ్రాజు (I) కార్వేటినగరనిర్మాణకర్తలు. ఈనగరము నిర్మాణమునుగూర్చి యెన్నియో కథలు గలవు. అవి చాలవరకు సత్యదూరములనియే నానమ్మకము. కార్వేటినగరము చుట్టుప్రక్కల కొండలచే జుట్టుకొనబడియుండుటచే సులభముగ శత్రురాజులచేత జిక్కకుండుటకై యిచ్చట నగరము నిర్మింపబడియుండవచ్చును. ఇప్పు డీయూరి పశ్చిమమున ప్రాతశివాలయమునొద్ద నగరమను ఊరొకటి యుండినదనియు, ఈయూ రుండుచోట అప్పుడు కార్వేడను ఒక పల్లె యుండినదనియు, ఇచ్చట పట్టణము గట్టినతర్వాత శివాలయమునొద్ద నుండినవారు సహితము ఇచ్చటనే వచ్చిచేరుటచే నీరెండుపల్లెల పేర్లను గలిపి కార్వేడునగరమని పిలువబడుచుండి, క్రమేణ కార్వేటినగర మైనదన్న గోపన్నగారి వాదన సత్యమే యైయుండవచ్చును.

క్రీ. శ ౧౬౩౨-వ సం.రమున కార్వేటినగరమునకు రాజుగా వచ్చిన కావేరిరాజు (వీరిని కావేటిరాజనిగూడ పిలుచువాడుక గలదు) మహాబాహుబలసంపన్నులు. వీ రొకానొకనాడు నిజపరివారముతో వేటకు బోవుచు దారిలో నడ్డముగ నుండిన యొక పెద్దగుండును అవలీలగ కాలితో నావలికి ద్రోసి దారిజేసికొని పోయినట్లు చెప్పుదురు.

ఈత డొకనాడు నారాయణవనసమీపముననుండు సదాశివకోనప్రాంతపు టరణ్యములకు వేటకు బోయియుండెను. వేటాడి డప్పిగొనుటచే దాహశాంతికై నీటికి వెదకులాడుచు నొకానొకచోట తపోనిష్ఠాపరవశుడై యుండిన యొకమునినిజూచి నీటియునికిని అడిగెను. తపసుజేసికొనుచుండిన ఋషికి రాజుపలుకులు చెవినిబడలేదు. రాజాగ్రహమొంది ముని నవమానింపగా నాతడు మేల్కాంచి తపోభంగ మొనర్చిన రాజుపై గినుకవహించి "నీవును, నీసంతతివారును ఇది మొదలు ఉన్మత్తు లగుదురు. ఉన్మాదములేకున్న క్రమేణ నీరాజ్య మన్యాక్రాంత మగు"నని శపించి యచ్చోటు బాసి యెచ్చటికో వెడలి పోయెనని కొందరును, ఏమియు బదులుచెప్పని మునిపై రాజు తన వేటకుక్కల నుసిగొలుప నవి యాతని జుట్టి యాయువుపట్లయందు గరచుటచే నాతడు మేల్కాంచి రాజును శపించి యచ్చోటనే యసువులు బాసెనని మరికొందరును వాకొనుచున్నారు. ఇం దేది యబద్ధమైనను శాపముమాత్రము వాస్తవమని తెలిసికొనవలసియున్నది. శాపగ్రస్తుడై విచారముతో కార్వేటినగిరము జేరిన కావేటిరాజునకు కొద్దిరోజులకంతయు నున్మాదము పొడసూపెను. రాజునకు గలిగిన విపత్తునకు చింతించి ఈతని మామగారగు బొప్పరాజు వేంకటనరసింహరాజు అతనికి సంరక్షణకర్తగా నేర్పడి యన్నికార్యములను నిర్వహించుచుండెను. ఇతడు పెక్కుదండయాత్రలు వెడలిచుట్టుప్రక్కలజమీందార్లను చాలమందిని జయించెను. ఈవేంకటనరసింహరాజు కావేరిరాజుప్రతినిధిగ ఆర్కాడునబాబునొద్దకు సైన్యముతోగూడ బోయియుండి రాజకార్యనిమగ్నుడై తనపుత్రుని మరణమునకుగూడ నింటికి రాకుండెను. ఈతనియనంతరము వీరి కొమారుడైన కసవరాజుగూడ రాజుగారికి సంరక్షణకర్తగా నుండి సర్వకార్యములు నెరవేర్చుచుండెను. ఋగ్వేదము వేంకటాచలకవి వ్రాసిన చంపూరామాయణమను గ్రంథమును కృతినందిన దీకసవరాజే.

కావేరిరాజునకు తర్వాత వీరి కుమారులైన బొమ్మరాజు (III) క్రీ. శ. ౧౬౫౨-వ సం.రమున రాజ్యమునకు వచ్చి ౧౭౦౬ వరకు బాలించెను. వీరి జననముగూర్చి యొక వాడుక గలదు. కసవరాజున కొకనాడు స్వప్నమున, నొక తపోవనమున వరుసదీరి కూర్చొనియున్న కొందరు ఋషులు గనబడిరి. వారిమధ్య నొక యాసనమం దెవరును లేకుండుట జూచి కారణమడిగిన, వారిలో నొకమహర్షి, ఆతావున నుండినయాతడు కార్వేటినగరరాజుగా జనింప జనినాడని చెప్పెనట. అందుకు నిదర్శనముగ బొమ్మరాజు (III) పుట్టినప్పుడు బాగుగా పెరిగిన గోళ్లును, తలనిండుగ జడలును గలిగియుండిరి. వీరు రాజ్యమునకు వచ్చినప్పుడు యుద్ధములు మొదలుగాగల కొన్నికష్టములు సంప్రాప్తించెను. దీనికిదోడు ఈతడు వ్యవహారజ్ఞానశూన్యుడు; లౌకికజ్ఞానదూరుడు; పారమార్థికజ్ఞానసంపూర్ణుడు; అనవరతము జపతపోనిష్ఠాగరిష్ఠుడు; ప్రతిదినము సహస్రగాయత్రీజపము చేయనిదే అన్నపానాదుల ముట్టుకొననివాడు. ఈతనికి వేంకటేశ్వరుడు ప్రత్యక్షమగుచుండెడివాడట. ఈతనికాలమున పిఠాపురరాజు (కొందరు బొబ్బిలిరాజాగారని యూహించెదరు) తిరుమలయాత్రకు వచ్చియుండి బంగారు

కోనేటిలో స్నానముచేసి లేవగనే తన రెండుకండ్లును బోయెనట. ఉన్నటులుండి జరిగిన యీఘోరవిపత్తునకు గారణ మారయజాలక తా నేదో మహాపచారము జేయనిదే ఇట్టి దృష్టిలోపము వాటిల్లదని తలచి, మూడుదినము లన్నాహారములు మాని శ్రీస్వామివారినిగూర్చి తీవ్రతపము జేసెను. తుట్టతుదకు వేంకటేశ్వరుడు సాక్షాత్కరించి "నీవు తిరుమలకు వచ్చుచు కాళహస్తీశ్వరుని దర్శింపక, తుద కా గోపుర మైనను చూడక మేనాతలుపులు మూయించి ఇటకు వచ్చితివి. అంతటి శివద్వేష మెన్నటికిని తగనిది. కావుననే నీకండ్లు పోయినవి. ఇప్పుడు నీకు పూర్తిదృష్టి నిచ్చుటకు నావలన గాదు. ఇదమొదలు నీ కొకకన్నుమాత్ర మగపడును. మరియొక్క కన్ను నా పరమభక్తుడును, శివపూజాధురంధరుడును నగు కార్వేటినగరరాజగు బొమ్మరాజు నాశ్రయించినచో బడయగల"వని చెప్పి యంతర్ధానమయ్యెను. పిఠాపుర రాజు తన యపచారమును దెలిసికొని పశ్చాత్తప్తుడై తనకుటుంబము వారిని స్వస్థానమున కనిపి, తా నొక్కడు కాలినడకను కార్వేటినగరము జేరి బొమ్మరాజువలన దక్కిన యర్ధదృష్టినిగూడ బడసెనట. పిఠాపురరాజు సంతోషించి బొమ్మరాజును తనయూరికి నాహ్వానించెను. వా రాహ్వానమున కియ్యకొనక దనమంత్రిని పిఠాపురమునకు బంపిరి. మంత్రిని వెంటబెట్టుకొని పిఠాపురరాజు స్వస్థానము జేరి, యాతనిని యథావిధిని సత్కరించి బొమ్మరాజుగారి కొక దాలివారు, శిరీపేష్, పేష్కజీయను యాయుధమును మంత్రిద్వారా యిచ్చిపంపి తమ జ్ఞాపకార్థము రాజుగారు వానిని ధరించుచుండవలసినదని ప్రార్థించిరి. వీని నిప్పటికిని మహానవమీపూజాసందర్భమున రాజుగారు పదిదినములు ధరింతురు.

బొమ్మరా జెల్లప్పుడును దైవచింతానిమగ్నుడై రాచకార్యముల యందంతగా జోక్యము కలుగజేసికొనకుండెను. వీరి యమాయకత్వమును విన్నచో నిప్పటివారికి నవ్వుపుట్టును. రాత్రులయందు నక్కలు జేయురోదనమునకు 'చలిబాధ సహింపలేక' యని తనపరిజనుల పలుకులు నమ్మి వాని కన్నిటికి దుప్పట్లు కప్పవలసినట్లు వీరు ఆజ్ఞాపించిరట.

కార్వేటినగరసంస్థానాధీశులు ఆర్కాడునవాబునకును, కర్ణాటకనవాబైన హైదరాలీకిని సామంతులైయుండి యేటేట గొంత కప్పము గట్టుచుండిరి. క్రీ. శ. ౧౭౫౦-౧౭౮౩ సంవత్సరములలో ఫ్రెంచివారికిని, ఇంగ్లీషువారికిని దక్షిణహిందూదేశమున గలిగిన యుద్ధములలో ఆర్కాడు, కర్ణాటకనవాబులు జోక్యముగలుగజేసికొనుటచే సంస్థానప్రభుత్వమున గొన్నిమార్పులు గలిగెను. కర్ణాటకమునకు టిప్పుసుల్తాన్ రాజైనతర్వాత కార్వేటినగరరాజులకును, నవాబునకును కొంత మనస్పర్థ లుదయించినట్లు కొన్నిసూచనలు గానవచ్చెడిని. ఒకానొకప్పుడు బొమ్మరాజును గుటుంబసహితముగ జెరగొనిరమ్మని టిప్పు తన సైన్యమును బంపినట్లును, ఈసంగతి ముందుగానే దెలిసికొని బొమ్మరాజు సమస్తపరిజనులతో నూరువిడిచి యుత్తరముగ నొక యరణ్యములో దాగుకొనియుండినట్లును, టిప్పుసైనికులు నగరుప్రవేశించి యెవ్వరును లేనిద జూచి కోపముతో నగరునకు నిప్పట్టించి వెడలిపోయినట్లును తెలియుచున్నది. క్రీ. శ. ౧౭౭౮-వ సంవత్సరమున ఐరోపాఖండమున నింగ్లీషువారికిని, ఫ్రెంచివారికిని యుద్ధము ప్రారంభమయ్యెను. హిందూదేశమున నప్పుడు గవర్నరుగా నుండిన వారన్‌హేస్టింగ్సు ఫ్రెంచివర్తకపుకొట్లలో నొకటియు, హైదరాలీ (కర్ణాటకనబాబు) కి లాభకరమైనట్టిదియు నగు 'మాహి' పట్టణమును బట్టుకొనుటచే హైదరాలీ ఇంగ్లీషువారిపై యుద్ధమునకు సన్నద్ధుడయ్యెను. ఈసందర్భమున హైదరాలీకి సహాయముచేయ సమకట్టిన ఫ్రెంచిపక్షీయులగు బుస్సీసైనికులను, ఇంగ్లీషువారి ప్రోద్బలముపై బొమ్మరాజు (III) శోళింగరమునొద్ద నెదుర్కొని యోడించినట్లు, అప్పు డింగ్లీషువారికిని వీరికిని జరిగిన యుత్తరప్రత్యుత్తరములనుబట్టి తెలియుచున్నది. క్రీ. శ. ౧౭౮౩-వ సంవత్సరములో ప్యారిస్‌నగరమున ఫ్రెంచివారికిని ఇంగ్లీషువారికిని జరిగిన సంధి ననుసరించి కర్ణాటకమును హైదరాలీకి స్వాధీనముచేసినతర్వాతగూడ, ఇంగ్లీషువారిపై పగసాధించుటకు టిప్పుసుల్తాన్ ఫ్రెంచివారితో జేయుచుండిన కుట్రలు జూచి క్రీ. శ. ౧౭౯౯-వ సం.రమున వెల్లిస్లీప్రభువు శ్రీరంగపట్టణమును ముట్టడించెను. టిప్పు పౌరుషముతో యుద్ధముజేసి మృతినొందెను. కర్ణాటరాజ్యము నింగ్లీషువారు ౧౮౦౦ లో మరల హిందూరాజుల స్వాధీనముజేసిరి. ఈసందర్భమున కర్ణాటకనవాబునకు లోబడియుండిన కార్వేటినగరము, కాళహస్తి, వెంకటగిరి మొదలైన రాజ్యములను ఇంగ్లీషువారు తమస్వాధీనముచేసికొని, క్రీ. శ. ౧౮౦౧ వ సం.రమున సెయింటుజార్జికోటగవర్నరుగా నుండిన ఎడ్వర్డు క్లైవు "ఇస్తిమిరారు" సన్నదుల నారాజుల కందరకును జారీచేసిరి. అదిమొదలు ఈసంస్థానాధీశులు ఇంగ్లీషువారి పాలనకు లోబడిరి. క్రీ శ ౧౮౦౨-వ సం.రంలో జరిగిన 'స్ట్రాటన్‌సంధి' (Strotten treaty) ననుసరించి కార్వేటినగరరాజులు వేరుగ సిపాయిల నుంచుకొనుట మానివేసిరి.

బొమ్మరాజు (III) నకు ముగ్గురు కుమారు లుండిరి. వీరిలో కావేరిరాజు (III) అగ్రజుడు. చేజెర్ల రామచంద్రరాజు తోబుట్టువైన యొకయామె చాల రూపవతియైనందున, యామె తనకు వరుసలే పోయినను, ఆమెను బొప్పరాజువారికి దత్తుఇప్పించి వారిద్వార కావేరిరాజామెను భార్యగా గైకొనెనని గోపన్న వ్రాసియున్నాడు. వీరు యువరాజుగా నుండినప్పుడు 'ఖాసాతోట' యను ఒకగొప్ప మామిడితోటయును, 'హజారము', 'నవబత్‌ఖానా' యను రాజసౌధముల యావరణలోనికి బోవు సింహద్వారమును గట్టించిరి. వెలగోలు (?) రాయదుర్గమును జయించినవారు వీరే. వీరికాలమున నొక కోడిపందెముమూలమున పాతగుంటపాళెగాండ్లకును, కార్వేటినగర

...లకును జరిగిన లడాయిలో పాతగుంటపాళెము సంస్థానాధీశుల ...ను. కావేరిరాజు (III) యువరాజుగానే మరణించెను. కావ...జు (III) ననంతరము వీరి రెండవకుమారులైన వేంకటపెరు...(II) క్రీ. శ. ౧౭౦౪ లో రాజయ్యెను. వీరిరువదిసంవత్సర...జ్యముకు పాలించిరి. వీరును వీరి తండ్రివలె చాల భక్తి...వీరు గొప్పవిద్వాంసులను రప్పించి సర్వకాలసర్వావస్థల యందు వేదాంతగోష్ఠితో గాలముబుచ్చుచుండిరి. విస్తారముగ ఋణము జేయ ప్రారంభించినవారిలో వీరు ప్రథములు. వీరిపాలన (క్రీ. శ. ౧౭౨౪ లో) పూర్తియగుసరికి ౫,౭౮,౨౯౫ రూపాయల ఋణముం డెను. వీరికితరువాత వీరి పుత్రులు బొమ్మరాజు(IV)రాజ్యమునకు వచ్చి సంస్థానమును ఋణవిమోచనగావించుటకుమారు తండ్రికంటె నెక్కుడుగ ఋణములుజేసిరి. వీరు చనిపోయిన సంవత్సరమున నీసంస్థానము పై ౪,౪౩,౯౯౪ రూపాయల ఋణముండెను క్రీ. శ. ౧౭౫౧-వ సంవత్సరమున బొమ్మరాజు (IV) కుమారులగు కుమార వేంకటపెరుమాళ్రాజు (III) రాజ్యమునకు వచ్చి, తమ తండ్రితాతలు జేసిన అప్పులను చాలవరకు తీర్పసమకట్టిరి. కాని యేకారణముచేతనో యున్నటులుండి తమ తండ్రితాతలకంటె ఎక్కువఋణము జేయమొదలుపెట్టి, క్రీ. శ. ౧౭౪౯-వ సంవత్సరములోపల ౩౯,౪౪,౩౪౯ రూపాయల ఋణముజేసిరి. ఇందులో ౩,౦౧,౨౭౬ రూపాయలు ధాతుసంవత్సరపు క్షామమున బీదల కన్నవస్త్రాదు లొసంగుటకు తీయబడినది. ఈ గ్రామమందు 'స్కందపుష్కరిణి' యని యొకచదరపు ఫర్లాంగు వైశాల్యముగల కోనేరును త్రవ్వించిన దీమహనీయుడే. వీరు జేసిన ధర్మకార్యములు చెప్పనలవిగాదు ఇందువలననే వీరిని 'దానకర్ణు'డని ప్రజలు పిలువజొచ్చిరి.

కుమార వేంకటపెరుమాళ్రాజు (III) క్రీ. శ. ౧౭౪౯-వ సంవత్సరమున గతించినతర్వాత వీరి కొమారులు బొమ్మరాజు (V) రాజ్యమునకు వచ్చిరి. వీరికాలములోసహితము కార్వేటినగరరాజ్యము ౯౪౪ చదరపుమైళ్ల విస్తీర్ణము గలిగియుండెను. అపారముగ జేసిన వీరి తండ్రియప్పులను వీరుగాని, వీరితరువాత క్రీ. శ. ౧౯౧౫-వ సం.రములో రాజ్యమునకువచ్చి రెండుసంవత్సరములుమాత్రమే రాజ్యముజేసిన తిరుమలరాజుగారుగాని తీర్చుకొనజాలకపోయిరి. క్రమక్రమముగా సంస్థానము సంపూర్ణముగ అప్పులవాండ్రబారి బడెను

*          *          *          *          *

ప్రస్తుతపుకార్వేటినగరము నిర్మింపబడి సుమారు మూడువందల సంవత్సరములైనను గాలేదు. ఈపట్టణ మొకానొకప్పుడు ౨౦,౦౦౦ జనసంఖ్య గలిగి ప్రభువుల యాదరణకు లోబడిన సమస్తప్రజలతో గూడి కలకలలాడుచుండినది. ప్రతియింటను లక్ష్మి తాండవమాడుచుండినది. ఇప్పుడన్నో పట్టణము క్షీణదశకు వచ్చినది. అప్పటి యౌన్నత్యము దలచుకొన్నమాత్రమున నెట్టివారికైనను గుండె నీరగును.

రమారమి రెండువేల సంవత్సరముల చరిత్రను చాల సంక్షిప్తముగ వ్రాసినందున నెన్నియోసంగతులు వదలివేయబడినవి. కొండంతచరిత్రను ఆవగింజంతచేసి చెప్పితిని. ఇంకను పరిశోధింపవలసిన యంశములు చాల నున్నవి; శిలాశాసనములు తీయవలసియున్నది; తాళపత్రగ్రంథములు తిరుగవేయవలసియున్నది సమగ్రపరిశోధనము జరిగి, కార్వేటినగర చరిత్ర గ్రంథరూపమున నాంధ్రులకు లభింపవలసి యున్నది.



# వేంకటగిరి ప్రభుని రసికత


హారి రాధాకృష్ణమూర్తిగారు


కవిసార్వభౌము డుత్కంఠత నేవిభు సర్వజ్ఞుడని చాల సన్నుతించె
సహజకవిత్వవిశారదుం డేరాజు టక్కులాడికిని దండకము వ్రాసె
వాణి రాణిగ నేలి వంతుకెక్కిన కవి యేభూపు సామర్థ్య మెత్తిపొగడె
కవిభూషణము చమత్కారచంద్రిక యేన్నృపాలుని కర్తివైభవ నిజేసె
నతఁడు వెల్గోటివంశసుధాంశు వగుచు - నలరు సర్వజ్ఞనాయ డాయంశమందు
దనరి వేంకటగిరిని విద్వత్కుమార - యాచమవిభుండు పాలన మాచరించె.

ఆతని ధార్మికప్రకృతి యాచకపాళికి కల్పవృక్షమై
భూతలమందు పేర్వడసె పూర్ణమనోరథులయ్యు కాని యా
నేతను బొంది యాశ్రితులు నిత్యము నేగరు వాని దెట్టి వి
ఖ్యాతియొకాని భూజనుల నందర నర్థులుగాగ జేసెడిన్.

గుణులకు నవగుణులకు నొక - గుణమున మాన్యముల నిడెడి కోవిదుడట తా
గుణులకు భూముల నిడి యవ - గుణులకు రంభాకుచాగ్రకుతలము నిడుటన్.

పండితజయంబు లెపు డనపాయములుగ - నై చరించు నాతనిమ్రోల; నతని పజ్జ
గ్రాలిన మనీషి లక్ష్మీవరంబె కాక - వాగ్వరంబును బొందియు వాసికెక్కు.

అనుదిన మాతనిం బొగడునట్టి జనశ్రుతి వీనులం బడన్
మనమున సంతసించి యొక మాన్యుడు విప్రకులావతంసు డా
ఘను నెడ పాండితిం దెలుపగా దలపూది తదీయసిద్ధిచే
ఘనమగు లేమికిన్ దొసగు గల్పనసేయగ నేగె నామెడన్.

జననాథుండును సముచిత - వినయంబును జూపి యతని వేడుకపైనన్
ఘనమగు విద్వత్సభ సే - యను బనిచెన్ దాన నతని నభ్యర్చింపన్.

విద్యానిధానమై వెలుగొందు నభ్యామిసురు డెల్ల జనము లచ్చెరువు నొంద
షట్శాస్త్రములను ప్రసంగంబుగావించి కళలను చాతుర్యకలన నెఱపి
ఆత్మోపలబ్ధవిద్యను హృద్యమగు రీతి హృదయమ్ము విప్పి నేర్పొదవ మెదపి
రసగుప్తమైన శాస్త్రమును భాషింపుచో రసవత్తరముగ కేరడములాడి

భోజు నాస్థానమున బుణ్యమూర్తియైన - కాళిదాసుని మించి వాక్కులన జూప
వాగ్వధూటీస్వరూపుని వాంఛ నెఱిగి - విభుడు వానికి దా బనివినిచె నిట్లు.—

'జనవంద్య నీమనోరథ - మును నెరవెద నీవ చూచి భూములలో నీ
మనమునకు నచ్చినది నా - కును దెల్పుము నీకు నిడుదు కోవిదుడ' యనన్.

స్వయముగ దేశముం దిరిగి పండితు డొక్కెడ సస్యసజ్జలా
శయ తృణకాష్ఠ సంతతుల సన్నుతికెక్కిన తీర్థపాడు నా
హ్వయ మొకపల్లె జేరి యట వాసముజేయుట కర్హ మంచు సం
శయ మది పోవ లో దిరుగసాగె నభీష్టము తత్తరింపగన్.

అచటి నాల్గువైపు లరయగా నొకచోట - యూరచెఱువు సవ్యతీరమంద
నున్నచేలు చెఱువు యోగించు దనకంచు - దలచి రాజుకడకు దద్దనేగి.

తన యనుకూలతన్ దెలుప దాన విభుండును సంతసించి యా
తని నిజవాంఛితంబు లెడపం దలలెత్తగ గొల్వులో లిఖిం
చెను తన 'చెర్వుదక్షిణపుచేను నొసంగితి'నంచు పత్రమున్
మన మలరంగ విప్రుడును మాన్యులు దీవన లీగ మచ్చికన్.

తన హృదయవీధిలో జీ-వనసౌధము గట్టుకొనుచు బ్రాహ్మణుడు తగన్
వినయమున బత్రముం గొని-పనివినియెను రాజు తన్ను బహుమానింపన్

బంధుమిత్రాదులను గొని పండితుండు - హర్షమున తీర్థపాడున కరుగుదెంచి
అపరమనుజేశ్వరుండుగా నలరు గ్రామ-కరణమునకు నాపత్రంబు గానబరచె.

అరయుచు నాతడుం 'బ్రమదమయ్యె'నటంచును బల్కి 'చెర్వును
త్తరమున చేను పూర్ణఫలదం బది యేలను గోరబోక యే
సరణిని చొట్టిపట్టు గని సంతస మందితివయ్య! మమ్ములం
బారసిన దీని దెల్పుమొకొ పూజ్యుడ'యంచు వచించె పూజ్యుడై.

తన యవివేకముం దలచి తన్మయుడయ్యును గొంతసేపు ఏ
మని మది నెంచెనో తలను నట్టిటు లూపి 'పొసంగున'ంచు స
ద్వినయము మోమునన్ గదుర దేవసమానుడు బ్రాహ్మణుండు 'నీ
వనినదె రాజు నా కిడియె'నంచు వచించెను నిర్వికారతన్.

ము ప్పొనగూడెనేని తనపూనిక లేకయె కాచుకోగ దా
నప్పుడు దెల్పి పండితునియందలి భక్తిని రైతులెల్ల రా
జెప్పగ బంచి 'యుత్తరపుచేనును బాపని కియ్యుడ'న్న వా
రప్పనిజేయకే చనిన యప్పట నాగణకుండు క్రుద్ధుడై.

బ్రాహ్మణునకు దాను వలయు రహస్యస-హాయ మిచ్చి వారి నవల ద్రోసి
చెర్వునుత్తరంపు చేను బ్రాహ్మణునకు-నొసగె యంత డెట్టియుద్ధతుండొ.

రైతులు దీనగల్గిన పరాభవ మంతకు మించు నష్టముల్
జేతముల్ల మథింప విభు జేరగనేగి నమస్కరించి యా
చేతల నన్నిటిం దెలిపె 'జీవనముల్ తొలఁగింప మీరె మా
కైతిర ! దిక్కికేరి'యని యాతని పాదములంటి నిల్చినన్.

యాచమనాయ డావిధము నంతయు జూచి యెఱింగి వెంటనే
యోచనజేసి 'బ్రాహ్మణున కొప్పునె యీవిధి'యంచు రైతులం
జూచి 'విచారణల్ సలుపఁజూతు న'టంచును బల్కె తోడ న
య్యాచకు బిల్వబంచె మరియాదకు భంగమురానియట్టులన్.

మనుజాధీశుని యాజ్ఞ పండితుడు సన్మానించి తా నేగగా
జనె మోమింతయు విన్నవోవకయె పశ్చాత్తాపముం బొందకే
మనమం దింతయు గొంకులేకయె మహామాన్యుండువోలెన్ జనుల్
కని యీబాపని కేమి పచ్చియని శంకన్ వెంటరా సాగగన్.

చని యుచితాసనంబున విశంకటవృత్తి నుపస్థితుండుగాన్
మనుజవిభుండు నాతని సమస్తసపర్యల దృప్తుజేసి 'యో
యనఘ, యి దెందునైన గలదా మిముబోలినవార లొప్పిచే
సినపని చెర్వుదక్షిణపుచేనని యుత్తరమున్ గ్రహించుటల్ ?'

బ్రాహ్మణుడు దొట్రుపడక తా బలికె నిట్లు - 'నరవరా, నీవు వ్రాసినసరణి దాన
పత్రమున నున్నయట్టు లా ప్రక్కచెఱువు - దక్షిణపుచేనె కొంటి నాతప్పె' యనుడు.

అవనివిభుండు రైతుజను లందఱ జూచిన వార 'లీతడీ
యవగడమాచరించినది యంతయు నిక్కువ'మన్న రాజు తా
నవనిసురుం గనుంగొనియె నాతడు వెన్కనుబోలె పల్కగా
నవగతమాట కావిషయమంతర మేర్పడె రాచవానికిన్.

కొంత యోచించి రాజు తానంత దెలిసి-'దానమును బహువ్రీహిగా దలతురొక్కొ'
యనిన బ్రాహ్మణు డామాట నంది 'కాక-తమదు దాన మల్పవ్రీహి దగునె పొంద ?'

అన ధరణీధవుండు వినయంబున చాగిలి మ్రొక్కి పల్కె 'నో
యనఘ, భవద్వచోవిభవ మంతకు జాలినదయ్య నీకు నే
వెనుక నొసంగకున్న బ్రభవించిన సమ్మదమార నేడు నీ
మునుపు గ్రహించినట్టి పొలముం గొను మిచ్చితినయ్య పుణ్యుడా.'

అనుచు నాతని కామాన్య మమరనిచ్చి-రైతులును దృప్తిపడగ తా ద్రవ్యమిచ్చి
వారి నెల్లర బనిచె విద్వత్కుమార-యాచకువిభుండు రసికసమాహ్వయుండు.

## ౬. జీవితము

# దేశభక్త శ్రీ కొండ వెంకటప్పయ్యా పంతులుగారు

రాయసం వెంకటశివుడుగారు

౧౮౯౨-వ సంవత్సరముకడపట పట్టపరీక్షకు నేను చెన్నపురి కేఁగినప్పుడు అచట న్యాయవాదిపరీక్షకుఁ జదువు శ్రీ కొండ వెంకటప్పయ్యగారి పరిచయభాగ్యము నాకుఁ గలిగెను. ఆమఱుసటి సంవత్సరము సైదాపేటకళాశాలలో నేను బోధనాభ్యసనము చేయుచు పట్టణమునకు వచ్చినపుడెల్ల, రామలింగయ్యభోజనశాలలో భుజించు వెంకటప్పయ్యగారిని జూచుచుండువాఁడను. ఆయనను తోడి విద్యార్థులు, నితరులును మిక్కిలి గౌరవించుచుండువారు.



కొండ వెంకటప్పయ్య పంతులుగారు

వెంకటప్పయ్యగారు క్రోధనసంవత్సర మాఘ బ. ౭ రోజున యాజ్ఞవల్క్యబ్రాహ్మణకుటుంబమున పాతగుంటూరునందు జన్మించిరి. పదియవయేఁట వీరికి మాతృవియోగము గలిగెను. అప్పటికి వీరి రెండవ తమ్ముఁడు హరినారాయణగారు తొమ్మిదినెలల పసిపిల్లవాఁడు. తండ్రి కోటయ్యపంతులుగారికి ౪౨ సంవత్సరముల నడివయస్సు. కొంత భూవసతి గలిగి, సాహుకారునొద్ద నుద్యోగముచేయు కోటయ్యగారిని రెండవమాఱు వివాహముచేసికొమ్మని బంధుమిత్రులు బోధించిరి. మంచిసంబంధములును వచ్చెను. ఐనను, మరల వివాహమాడినచో చిన్నికొమరులను తగినంత శ్రద్ధతోఁ గనిపెట్టనేర ననుకారణమున కోటయ్యగారు ద్వితీయపరిణయమున కొడంబడరైరి. తల్లి పోయిన పిదప నేడుసంవత్సరములవఱకును వెంకటప్పయ్యగారికిని, సోదరులు సూర్యనారాయణగారికిని వారి జనకుఁడే తల్లియుఁ, దండ్రియును! తెల్లవాఱుజాముననే యాగృహస్థుఁడు పడకవిడిచి, యింటిపనులు చక్కఁబెట్టుకొని, పిల్లలకు వంటచేసిపెట్టి, ఉద్యోగపుఁబనులు నెఱవేర్చుకొనుచుండువాఁడు.

౧౮౭౮-వ సంవత్సరమునుండి ౧౮౮3-వ సంవత్సరమువఱకును వెంకటప్పయ్యగారు గుంటూరులో క్రైస్తవపాఠశాలలో విద్యనేర్చిరి. ఆకాలమున డాక్టరు ఉగ్లరుదొరసాని క్రైస్తవవైద్యురాలు. ఊలుదొరగారు పాఠశాలాధికారి. క్రైస్తవమతస్వీకారము చేసిన కీ. శే. ప్రభలరామచంద్రయ్యగారు పాఠశాలలో నొక యుపాధ్యాయుఁడు. ఈముగ్వురు సజ్జనుల ఋషిజీవనము, స్వార్థత్యాగబుద్ధియు వెంకటప్పయగారి యాత్మజీవనమున కెంతో సహకారియయ్యెను. ఉద్రేకపూరితచిత్తులై ౧౮౮3-వ డిసెంబరుతుద నొకనాఁడు వెంకటప్పయ్యగారు ఊలుదొరయొద్ద కేఁగి, తమకు క్రైస్తవమతదీక్ష నిప్పింపుడని వారిని గోరిరి. సత్యసంధుఁడు, సాధుపుంగవుఁడు నగు ఊలుదొరమాత్రము వేగిరపడక, బాగుగ విచారించియే కార్యరంగము చొరుమని బోధించి, ఆనాఁ డాయువకుని వానియింటికిఁ బంపివేసిరి,

ఇంతలో వెంకటప్పయ్యగారి మతపరిణామసమాచారము నలుదెసలను వ్యాపించి, పురమును గలంచివైచెను. జనకుఁడు, మిత్రులును ఆయనకు హితబోధనము చేసిరి. అంత తన మనస్సు నొకింత మార్చుకొంటిననియు, కొంతకాలము స్వధర్మవిమర్శనము చేసిచూతుననియు వెంకటప్పయ్యగారు ఊలుదొరతోఁ జెప్పివేసిరి. దీని కించుకయు దొర కోపింపక, "మంచిది. నీవు క్రైస్తవమత మవలంబింపలేకున్నను యోగ్యుఁడగు హిందువుఁడవు కమ్ము!" అని బోధించి, యాయువకునికి వీడ్కోలొసంగిరి. ఈపలుకులు వినినపిమ్మట, ఊలుదొరయెడలఁ దనకు భక్తిగౌరవములు మఱింత హెచ్చెనని వెంకటప్పయ్యగారు చెప్పుచువచ్చిరి.

వెంకటప్పయ్యగారంతట ప్రవేశపరీక్ష నిచ్చిరి. చెన్నపురి కేఁగి, అచటి క్రైస్తవకళాశాలలో విద్యాపరిపోషణముఁ గాంచుకొనుటకై వెంకటప్పయ్యగారికిఁ దాను విద్యార్థివేతన మిచ్చెదనని ఊలుదొర పలికెను. తండ్రి దీనికి సమ్మతింపకుండుటవలన వెంకటప్పయ్యగారు ౧౮౮౪-వ సంవత్సరముమొదట రాజమహేంద్రవరము వెళ్లి ప్రభుత్వకళాశాలలోఁ జేరిరి. అధ్యక్షులగు కే. శే. మెట్కాఫుదొరగారి యుదారశీలతము వెంకటప్పయ్యగారి కెంతయు ప్రబోధముగలిగించెను. ఐనను రాజమండ్రిలో నుండుట కిష్టములేనందున, ఆయన మఱుసటిసంవత్సరమున చెన్నపురి కేఁగి క్రైస్తవకళాశాలావిద్యార్థియయ్యెను. అధ్యక్షుఁడు డాక్టరుమిల్లరు, అధ్యాపకుఁడు కూపరుదొరయును తమ సౌజన్యప్రభావమున వెంకటప్పయ్యగారి హృదయము నెంతయు నాకర్షించిరి.

శ్రీయుత నేడింబి హనుమంతరావుగారు, వెంకటప్పయ్యగారును నేకకాలమందే గుంటూరులో ప్రవేశపరీక్ష నిచ్చినను, వేఱు పాఠశాలలలోఁ జదివియుండిరి. అప్పటినుండి కళాశాలావిద్య నేర్చిన కాలమంతయును వీరిరువురును మొత్తముమీఁద నేకప్రదేశముననే సహాధ్యాయులుగ నుండిరి. ఒకసంవత్సరమందే ప్రవేశప్రథమశాస్త్రపట్టపరీక్షలందును, న్యాయశాస్త్రపరీక్షయందును ఉభయులును విజయముఁ గాంచిరి.

ఇంతియ కాదు. ౧౮౯౪-వ సంవత్సరముమొదట న్యాయవాదివృత్తిలోఁ బ్రవేశించినపిదపకూడ, స్నేహితు లిద్దఱు నేకన్యాయవాదికూటముగ నేర్పడి, బందరులో వృత్తిపనులు నెరవేర్పసాగిరి. ౧౯౦౦-వ సంవత్సరమున వెంకటప్పయ్యగారు కీ. శే. దాసు నారాయణరావుగారితోఁగూడి, 'కృష్ణాపత్రిక'ను స్థాపించి, ఐదుసంవత్సరములు కడుసమర్థతతో దానిని సాగించిరి. ౧౯౦౭-వ సంవత్సరము మేనెలలో గుంటూరులో జరిగిన కృష్ణామండలసభలలో వెంకటప్పయ్యగారు ప్రముఖులు. ఆకాలమున బెజవాడలో నుపాధ్యాయుఁడుగ నుండిన నేను, వెంకటప్పయ్యగారితోఁ గలసి సాంఘికసభలోఁ [illegible]

మొదటినుండియు వెంకటప్పయ్యగారు ప్రజాహితకార్యములు సాధించుట కభ్యాసపడినవారు. ౧౮౯౬-వ సంవత్సరమున కృష్ణవఱదలలో దివిసీమ మునిఁగిపోయినప్పుడు, మండలసంఘపక్షమున వీరు విపత్తులో నుండు జనులకు బియ్యము మున్నగు తినుకొండువస్తువులు కొనిపోయి పంచిపెట్టి సాంఘికసేవ చేసిరి. ౧౯౦౨-వ సంవత్సరమున వీరు ఢిల్లీదర్బారునకుఁ జని, అచటి విశేషములు తమ పత్రికలోఁ జక్కఁగ వర్ణించివ్రాసిరి. బందరుప్రాంతముల లంచములు పుచ్చుకొను నొకరిద్దఱు దండనాధిపుల చర్యలను బయలుపెట్టి, అంకుమూలమున వీరును, వీరి మిత్రులగు శ్రీయుత వల్లూరి సూర్యనారాయణరావుగారును కొన్నిచిక్కులఁ బడినను తుదకు విజయముఁగాంచిరి. మండలజాతీయసంఘమునకు వెంకటప్పయ్యగారు చిరకాలము కార్యదర్శిగ నుండిరి. వీరును, వీరిస్నేహితులగు వేమూరి సుబ్బారావుగారును కొందఱు ప్రముఖులతోఁ గలసి, ౧౯౦౩-వ సంవత్సరమున బందరుపురమున నొక బ్రాహ్మణవితంతుపునర్వివాహము జరిపించిరి. సంఘబహిష్కారమనిన నేమియు భీతినొందక తాముపట్టిన దీక్షను బాగుగ నెఱవేర్చిరి.

౧౯౦౫-వ సంవత్సరమున వెంకటప్పయ్యగారు గుంటూరు తరలివచ్చిరి. అదివఱకుఁ గొన్నిసంవత్సరముల క్రిందటనే కృష్ణాజిల్లానుండి గుంటూరు ప్రత్యేకింపఁబడెను. స్వస్థానమగు గుంటూరులోనే నివసించి, బంధుమిత్రాదులకుఁ జేరువనుండి, వయోవృద్ధులగు జనకునిగుఱించి తగుశ్రద్ధ వహింపవలయుననియే వీరి సంకల్పము. వెంకటప్పయ్యగారు నందిగామలో జరిగిన కృష్ణాగుంటూరుమండలసంఘసంస్కరణసభ కగ్రాసనాధిపత్యము వహించిరి. ఈసభలోనికి పంచములువచ్చుటకుఁ గంటగించి, వంటబ్రాహ్మణులు తమపనులుమాని వెడలిపోయిరి. పట్టణమున గొప్పకలవరము గలిగెను. దీనికిఁ దోడుగ సభాదినములలో నొకనాఁడు యువకులు వర్ణభేదములుపాటింపని పెద్దవిందొకటి జరిపిరి. తెనాలిలో జరిగిన మండలరాజకీయసభకును వెంకటప్పయ్యగారధ్యక్షులుగ నుండిరి.

విజయనగరము వదలి ౧౯౦౭-వ సంవత్సరమునారంభమున నేను గుంటూరువచ్చి క్రైస్తవకళాశాలలో నుపన్యాసకుఁడ నయితిని. అప్పటినుండియు వెంకటప్పయ్యగారితో నా కెక్కువ చెలిమి చేకూరెను. ఆయన పాల్గొనని గొప్పసమావేశము లాకాలమున గుంటూరున జరిగెడివి కావని చెప్పవచ్చును. ౧౯౦౭-వ సంవత్సరము కడపట నచట జరిగిన 'ఆంధ్రవిద్యార్థుల మహాసభ' లోను, ౧౯౧౧లో జరిగిన 'విద్యావిషయక ప్రదర్శన'సమయమందును వెంకటప్పయ్యగారి సహాయసమాలోచనము లమూల్యములని యేతత్సభాకార్యక్రమము జరిపించిన నాకు బాగుగఁ దెలిసియున్నది.

౧౯౧౧-వ సంవత్సరమున వెంకటప్పయ్యగారు వ్యాధిగ్రస్తులైరి. ఆయేప్రిలు నెలలో నర్సాపురమున జరుగు కృష్ణాగుంటూరు మండలసంఘసంస్కరణసభ కధ్యక్షుఁడుగ నుండుమని నాకుఁ బిలుపు రాఁగా, వెంకటప్పయ్యగారి సెలవుగైకొనుటకు నేఁ బోయినపుడు, కడునీగసస్థితిలో నుండు నామిత్రుఁడు, నాతోఁ బయనము చేయ నెంత కాంక్షించినను, శరీరస్వాస్థ్యము తప్పియుండుటచేఁ దానట్లు చేయలేకుంటినని వగచెను. ఆతరుణమున నాకనులు నశ్రుపూరితములయ్యెను. దేహారోగ్యమునకై యావేసవికాలమును వెంకటప్పయ్యగారు వేటపాలెమునఁ గడపిరి. ఆప్రాంతములందలి రోమనుకతోలికమత సంఘమువారు, వేటపాలెము విడిచిపోవ నిశ్చయించి, తమతోఁటను, భవనములను అమ్మఁజూపఁగా, పంతులుగారు నాలుగువేలరూపాయిలకవి కొనిరి. అచట నొక 'యువతీగురుకులము' ను, బాలికాపాఠశాలను నెలకొల్ప వారి యుద్దేశము. కొందఱుమిత్రుల మీవిషయమున వీరితో నేకీభవించి, ఈసంస్థకై కొన్ని చందాలుకూడ వేయించితిమి.

ఇంతలో అతిబాల్యవివాహనిరోధమునుగుఱించి ప్రబోధము గలుగుటకై ఎల్లెడలను సంఘములు స్థాపించి, దేశసంచారము చేయుచుండెడి టెన్నేటిసుబ్బారావుగారు వేటపాలెమున స్త్రీగురుకులాశ్రమస్థాపన విషయమును పర్యాలోచించుటకై ౧౯౧౨-వ సంవత్సరము ఫిబ్రవరి ౧౪-వ తేదీని వేటపాలెములో నొక సభను సమకూర్చెను. వెంకటప్పయ్యగారి జనకుఁ డదివఱకుఁ గొన్ని దినముల క్రిందటనే పరమపదించుటవలన, కర్మాంతరములు చేయుచుండు పంతులుగారు తా మాసభకు రాఁజాలక, తమకుబదులుగ వ్యవహరించుటకు నన్ను వేటపాలెమునకంపిరి. అంతట వేటపాలెములో జరిగిన సభలో టెన్నేటి దొరసానియు, నా మెయిల్ అవస్నేహితులును జేసికొనిన నిర్ధారణ మేమనఁగా—తోఁటయు, భవనములును వెనువెంటనే వెంకటప్పయ్యగారు చెన్నపురికార్యస్థానముగాఁగల యాసమాజమువారి వశమొనర్పవలయుననియే. ఈయాస్తిని, త్రాడును బొంగరమును లేని యొకవిదేశసంస్థపాలుజేయుట యుక్తముకాదనియు, నామిత్రుని యుద్దేశముకూడ నదిగాదనియును నేమ జెప్పివేసితిని. వేటపాలెములో నెటులైన శారదానికేతనమను పేరిట జాతీయబాలికాగురుకులము నేర్పఱుప వెంకటప్పయ్యగారియు, వారిమిత్రులయొక్కయు మహాశయము. ౧౯౧౨-వ సంవత్సరము వేసవికాలమున నిడదవోలులో మహాసభలు, సమావేశములు నెన్నియో జరిగెను. మండలసభకు శ్రీ వేమవరపు రామదాసుగారును, సాంఘికసభకు కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారును అధ్యక్షులు. వెంకటప్పయ్యగారు, నేనును వెళ్లియుంటిమి. అచటఁగూడిన మిత్రులతో వెంకటప్పయ్యగారు తమ గురుకులస్థాపనమునుగుఱించి ముచ్చటించిరి. సకుటుంబముగ వేటపాలెములో నివసించి యాసంస్థను జరుపుఁడని వెంకటప్పయ్యగారును, తక్కిన స్నేహితులును నన్నాసమయమునఁ గోరిరి. స్త్రీవిద్యనుగుఱించి పత్రిక నొకటి పెక్కుసంవత్సరములు ప్రచురించిన నా కీస్త్రీగురుకులస్థాపనమునం దమితాపేక్షకలదు. ఐనను ముందుగ నే నొకసంవత్సరముమాత్రమే కళాశాలనుండి సెలవు పుచ్చుకొని, వేతనము గైకొనక శారదానికేతనమును నడుపఁగలననియు, ప్రథమసంవత్సరఫలితమును బరిశీలించి నాభావిప్రణాళిక నేర్పఱచుకొందుననియు నేను జెప్పితిని. ఇది యుక్తముగాదనియు, వెనువెంటనే నాయుద్యోగమును విరమించి, కొంతగౌరవవేతనము స్వీకరించి గురుకులమును నడపుఁడనియు పంతులుగారును, మిత్రులును నొక్కిచెప్పిరి. నే నట్లు చేయలేనని చెప్పివేసితిని.

ఈనిడదవోలులో జరిగిన రాజకీయసభలో యువకులు ప్రాముఖ్యముగాంచిరి. ఆంధ్రవ్యక్తిత్వమును చాటునట్టి ఆంధ్రరాష్ట్రతీర్మానమును వా రిపుడు ప్రతిపాదింపఁగోరిరి. ఇది హైందవజాతీయతకు భంగకరమని పెద్దవారు ప్రతిఘటించుటచేత తీర్మాన మంతట నిలిచిపోయెను. ఐనను యువకు లింతటితో నూరకుండలేదు. వారిలో గుంటూరువారు ముఖ్యులు. వీరి నాయకుఁడగు కీ. శే. జొన్నవిత్తుల గురునాథముగారు వెంకటప్పయ్యగారితో పలుమాఱు సంభాషణలు జరిపిరి. వెంకటప్పయ్యగా రంతట ఆంధ్రోద్యమమునుగుఱించి చిన్న పుస్తకము నొకటి యాంగ్లమున వ్రాసి, ఆంధ్రదేశమునం దంతటను ప్రచారముసల్పిరి. దీని పర్యవసానము, ౧౯౧౩-వ సంవత్సరమున వేసవిని బాపట్లలో ప్రథమ-ఆంధ్రమహాసభ జరిగెను. వెంకటప్పయ్యగారు ఆహ్వానసంఘాధ్యక్షులు. ఈమధ్యనే కీర్తిశేషులయిన బయ్యా నరసింహేశ్వరశర్మగారు సభాధ్యక్షులు. ప్రత్యేకాంధ్రరాష్ట్రవిషయమున సభలో పెద్దలు, పిన్నలు వేర్వేరుకక్షులుగ నేర్పడిరి. ఇట్టి తీవ్రభేదాభిప్రాయములు చెలరేఁగినపుడు, యువకుల కిష్టమగు నాంధ్రరాష్ట్రతీర్మానము చేయుట యనర్థదాయకమనియు, ప్రజలలో ప్రచారము సల్పి, యేకీభావము కుదిరినపిమ్మటనే దీని నాలోచింపవలయుననియును అంత నిశ్చయింపఁబడెను. మరుసటిసంవత్సరమున బెజవాడలో శ్రీ న్యాపతిసుబ్బారావుపంతులుగారి యాధిపత్యమున జరిగిన ద్వితీయాంధ్రమహాసభలో, 'ఆంధ్రరాష్ట్ర' తీర్మానము సర్వజనాంగీకృత మయ్యెను.

అప్పటినుండి యేఁటేఁట నాంధ్రమహాసభలు జరుగుచువచ్చెను. వానికి వెంకటప్పయ్యగారు స్థాయిసంఘ కార్యదర్శిగ నుండి పనులు జరుపుచువచ్చిరి. దేశసేవకై తమ కాలమంతయు వినియోగింప కర్తవ్యమని విశ్వసించిన వెంకటప్పయ్యగా రంతట ౧౯౧౫-వ సంవత్సరము కడపట న్యాయవాదివృత్తి విరమించుకొనిరి. అప్పటికి వీరి కీవృత్తివలన నెల కేడెనిమిదివందల రూపాయల యాదాయము వచ్చుచుండెను. దేశోద్ధరణమునకై యిట్టి స్వార్థత్యాగము చేయుట ప్రశంసనీయము. అప్పటికి వెంకటప్పయ్యగారు గుంటూరులో స్వగృహనిర్మాణము చేయలేదు. వారి రెండవకొమరిత పెండ్లికాలేదు. ఈరెండు కార్యములు జరిగినపిమ్మటనే వీ రుద్యోగవిరామము గావించుట

మేలని శ్రీన్యాపతి హనుమంతరావుగారు మున్నగు వీరి యాంతరంగిక మిత్రుల యాలోచన. అక్కఱ లన్నియుఁ దీఱినపిమ్మటఁగాక, అంతరాత్మయాదేశము వినవచ్చినని మేమమునసే ధర్మనిర్వహణమునకుఁ గడంగుట కర్తవ్యమని నమ్మిన వెంకటప్పయ్యగారు నూతనాశ్రమ విధులు నెఱవేర్పసాగిరి.

అప్పటికి వెంకటప్పయ్యగారు విశేషధనార్జనము చేయకున్నను, కుటుంబ పోషణమునకుఁ జాలిన సొమ్ము నిలువచేసికొనిరి. దీనిలోఁ గొంతభాగము దేశసేవనిమిత్తమై నిరతము వీరు చేయుచు వచ్చిన ప్రయాణములకు వ్యయమయ్యెను. కొందఱు విద్యార్థులకును, తదితరులకును వీ రిచ్చిన కొన్ని యప్పులు క్రమముగ వసూలు కాలేదు. రాఁబడి తగ్గినను వ్యయముమాత్రము వెనుకటివలెనే వెంకటప్పయ్యగారు జరుపవలసివచ్చి కష్టములుపడిన దినములు నాజ్ఞప్తియందుఁ గలవు.

వెంకటప్పయ్యగారి యిటీవలి కార్యక్రమము చరిత్రాంశములతోఁ గూడుకొనినదియే. ౧౯౧౭-వ సంవత్సరమున వీరు నెల్లూరులో జరిగిన యైదవఆంధ్రమహాసభ కధ్యక్షులు. రాజప్రతినిధి చెల్మ్సుఫోర్డుప్రభువును, ఇండియాకార్యదర్శి మాంటేగుగారును ౧౯౧౭-వ సంవత్సరమున హిందూదేశమున పర్యటనము సలుపునప్పుడు, ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణావశ్యకతను గుఱించి విజ్ఞప్తి యొకటి సిద్ధపఱచి ఆంధ్రప్రముఖులద్వారా దానిని వారికి సమర్పించుటకై వెంకటప్పయ్యగారు ప్రచారము సల్పిరి. అంతట ఆసంవత్సరము డిసెంబరులో పైని జెప్పిన యుద్యోగస్థులను సందర్శించుటకు నియమింపఁబడిన యుపసంఘములో వెంకటప్పయ్యగా రొకసభ్యులు; శ్రీన్యాపతి సుబ్బారావు పంతులుగారు ముఖ్య ప్రాసంగికులు.

౧౯౧౭-౧౯ సంవత్సరములమధ్య వెంకటప్పయ్యగారుగుంటూరు పురపాలకసంఘసభ్యులుగ నుండి, తమ విధులను శ్లాఘాపాత్రముగ నిర్వర్తించిరి. ౧౯౧౯-౨౧ సంవత్సరములమధ్య చెన్నపురి శాసనసభాసభ్యులై ముఖ్యముగఁ గొన్ని విద్యావిషయములగు తీర్మానములు వీరు కొనివచ్చిరి. అంత గాంధిమహాత్ముని యాదేశము ననుసరించి వెంకటప్పయ్యగారు శాసనసభ్యత్వమును విరమించుకొనిరి.

అసహాయోద్యమము ప్రారంభమైనదిమొదలు,అనఁగా౧౯౨౦-వ సంవత్సరమునుండి వెంకటప్పయ్యగారు అఖిలభారతసంఘకార్యనిర్వాహకవర్గమున సభ్యులయిరి. ౧౯౨౫-వ సం. మొదలు ౨౮ వఱకును అఖిలభారతచరఖాసంఘమునకు ఆంధ్రదేశప్రతినిధిగా వ్యవహరించి, పిమ్మట నేతత్సంఘమునకు శాశ్వతసభ్యు లయిరి. శాసనోల్లంఘనము నవలంబించి వీరు ౧౯౨౧-వ సంవత్సరమున కారాగారబద్ధు లయిరి, ౧౯౨౩-వ సం॥ న చెఱసాలనుండి వచ్చినను, రెండవకొమార్తెశరీరారోగ్యమునకై కష్టపడవలసినవా రైరి.

౧౯౨౩-వ సంవత్సరమునందు పంతులుగారు అఖిలభారత జాతీయస్థాయిసంఘాధ్యక్షు లైరి. ఆడిసెంబరులో కాకినాడలో జరిగిన జాతీయమహాసభకు వీరు ఆహ్వానసంఘాధ్యక్షులు. ౧౯౨౫-వ సంవత్సరమున సంభవించిన రెండవయల్లుని యకాలమరణమువలన వెంకటప్పయ్యగారికిని వారి బంధుమిత్రులకును అపారదుఃఖము కలిగెను. దీనికితోడు ౧౯౨౮-వ సంవత్సరమున సైమనుసంఘబహిష్కార సందర్భమున వెంకటప్పయ్యగారిని చెన్నపురిలో బంధించిరని తెలిసినప్పుడు కలిగిన యలజడిచే వెంకటప్పయ్యగారి సతీమణికి పక్షవాతవ్యాధి యేర్పడెను.

కాని వెంకటప్పయ్యగారు కుటుంబకష్టములను పాటించి విధ్యుక్తములను త్యజించువారు కారు. ౧౯౩౦-వ సంవత్సరమున 'లవణ సత్యాగ్రహ'సందర్భమున వీరు మఱల కారాగారబద్ధులై ౩౧-వ సంవత్సరముమొదట విడువఁబడిరి. వార్ధకదశలో శరీరపాటవము తప్పియుండినను వెంకటప్పయ్యగారు రాజకీయరంగమును విడువనొల్లరైరి. ౩౧-వ సంవత్సరమున మే నెలలో దేశీయమహాసభాసందర్భమున వీరు ఢిల్లీకిపయనముచేసి, అచట మఱల బద్ధులైనను, త్వరలో విడువఁబడుటచేత హరిద్వారక్షేత్రదర్శనము చేసికొనివచ్చిరి. కడుణీరసముగ నుండు వృద్ధులగు తాము, బంధుమిత్రుల నలజడిపాలుచేయక యిపుడైన నింటిపట్టున నుండుట కర్తవ్యమని నేను భీమవరమునుండి వ్రాసిన జాబునకు, వీ రీప్రత్యుత్తరము వ్రాసిరి:—

"గుంటూరు.
25–7–32

మిత్రవర్యా!

* * * * * తాము వ్రాసినప్రకారము, వానప్రస్థమున జరుపవలసిన విధులనే యిపుడు జరుపుచున్నాను. కాని, వానిని సంపూర్ణవైరాగ్యముతోడ జరుపజాలకుంటిననియే నాయభిప్రాయము. ఢిల్లీకిపోవుటమాత్రము పూర్ణవైరాగ్యము పూనిరే వెళ్లుట కలిగెను. కాని, త్యాగమునకు పూర్ణమైన అవకాశముకలుగలేదు. * *"

కావుననే తిరిగి ౧౯౩౨-వ సంవత్సరము జూను ౩-వ తేదీని వీరు బంధింపఁబడి, వేలూరుచెఱసాలలో నాలుగునెలలు గడపి, డిసెంబరు ౩-వ తేదీని విముక్తినొందిరి. అపుడు శరీరమున నీరుచూపి బలహీనులుగ నున్నను, గురువాయూరుప్రాంతములందు 'అస్పృశ్యతానివార'ణార్థమై ప్రచారముసల్పుటకు వెనువెంటనే వెంకటప్పయ్యగారు వెడలిపోయిరి. కేరళదేశమునఁ బలుచోట్ల నుపన్యాసము లిచ్చి, కన్యాకుమారీపుణ్యక్షేత్రసందర్శనముచేసి, వెంకటప్పయ్యగారు డిసెంబరు ౨౮-వ తేదీని గుంటూరు ప్రవేశించిరి.

వెంకటప్పయ్యగారు ఆంగ్లాంధ్రములందు సమగ్రమగు సాహిత్యమలవఱచుకొనినవారు. రుచిరమగు మృదుమధురశైలిని వ్రాయుటకు

వీరికల వడ్భ్యాసపడినది. మొదటిసారి వీరు కారాగృహమందు 'డచ్చిప్రజాస్వామికప్రభుత్వము', 'ప్రాచీనఇటాలీయాచరిత్రము' అనుపుస్తకములు నిర్దుష్టమగు భాషలో నాంధ్రమున ననువదించిరి. టెన్నిసను మొదలగు కవుల భావములు గైకొని తెలుఁగున సులభపద్యములు కొన్ని వీరు కల్పించిరి. తమ యభిమానవిషయముల గుఱించి ప్రసంగించునపుడు వెంకటప్పయ్యగారి యుపన్యాసము మైమఱచిన తీవ్రవాగ్ధోరణిని జెన్నొందుచుండును.

వెంకటప్పయ్యగారి శీలమున సత్యసంధత, ఋజువర్తనము, అన్యాయనిరసనమును ముఖ్యలక్షణములు. నూతనమతసంస్థలగు ఆర్య బ్రహ్మాదివ్యజ్ఞానసమాజసిద్ధాంతముల సాయముకోరని శుద్ధార్ష ధర్మనిష్ఠాసమున వీరి నిర్మలభక్తి యొప్పుచున్నది. ఇటులయ్యును వీరు పరమత సహిష్ణుతయు, పరధర్మగుణగ్రహణపారీణతయు మిక్కుటముగఁ గలవారు.

వెంకటప్పయ్యగారి త్యాగవైరాగ్యములు కడుఁ బ్రశంసనీయములు. లాభనష్టములు లెక్కింపని సత్కార్యశూరుఁ డీయన. ధర్మాచరణమునందు వీరికి స్వలాభసౌఖ్యములేకాక, తనవారల కష్ట నిష్ఠురములైన నడ్డువచ్చునవికావు. శత్రువులైన నెత్తిపొడువలేని నిష్కలుషశీలము, నిష్కపటవర్తనములచేఁ జెన్నొందుచుండువారు. ఆంధ్రనాయకులలో సౌజన్యసౌశీల్యములకు మేలుబంతియనఁదగువారు.

దైవము వీరి కాయురారోగ్యము లొసంగుఁగాక!



తిరువణ్ణామలై కొండ, గుడి

M. K. R.

# అఖండ గౌతమి

జి. జాషువగారు

శబ్దశాసనుని ద్రాక్షాపాకకవిత్వమును కామించి యెన్నాళ్లు లాలించినావో
విష్ణువర్ధనమహీవిభుని శాసనమును తలదాల్చి యేరీతి మెలఁగినావో
రడ్డిరాట్సుతుల పారాణివన్నెలు దేలు నలలతో నెబ్బంగిఁ గులికినావో
చాళుక్యనృపతుల సంగరశ్రమపోవఁ గలువపుప్పొడి యెంతఁ జిలికినావో
భద్రగిరిరామపాదుకాస్పర్శనంబు-గణన కెక్కిన కోటిలింగాల పూజ
గలిగి పయనించు హంసికాగమన వీవు-గౌతమీగంగ, రమ్మ, స్వాగతము గొమ్మ.

త్ర్యంబకగ్రామాన ప్రభవంబుఁ గన్నావు అడవులలోన దోఁగాడినావు
ఉపనదీజలముల నొడలు బెనిచినావు కొండలఁ బింపిళ్లు గూసినావు
కలువకన్నుల సోయగంబు దాలిచినావు తేఁటికాటుక రేఖ దిద్దినావు
ముత్యాలసరులు రొమ్మున నిల్పుకొన్నావు గంభీరహృదయంబు గాంచినావు
వేఁగిరాజ్యాన పంచమవేదమైన-భారతగ్రంథమందు పర్వత్రయంబు
చదువుకొన్నావు శబ్దశాసనుని యింట-పతికి వినిపించి మన్ననవడయు మమ్మ.

నలినీగంధము దోఁగు వీచికల స్నానంబాడు సంధ్యామహ
త్తులు క్రీడించెడు నీవిశాలపులినస్తోమంబునం బత్రముల్
గలముం బూని చరించు నాంధ్రకవిలోకగ్రామణుల్ దమ్మిపూ
వుల నెన్నాళులు పూజజేసికొనినావో, పుణ్యగోదావరీ !

పదిరెండేడుల చిన్నదానవయి, యంభశ్శీఘ్రయానంబుతో
నుదధిం గూడఁగఁబోవు నీహొయలు నీయొయ్యారముల్ ఠీవియుల్
గుదురుం జూపి సమస్తతైర్థికుల కోగోదావరీదేవి ! స
మ్మదముం గూర్చెడు పుష్కరంబులను బ్రహ్మాండంబు గొండాడెడిన్.

పుట్టి గతించిపోయెడు నృపుల్ ధరణీవిభవంబు గోరి, నీ
గట్టున నుగ్రసంగరముఖంబున నెందరు క్రుంకినారొ, నీ
పొట్టకు వారి యస్థికలు భోజనమయ్యెఁగదమ్మ ! చావులే
నట్టి సుధాశరీరమహిమాన్విత ! వందన మమ్మ ! గౌతమీ !

## ౭. వేదాంతము

# గీత — కృష్ణుడు

ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు

మహాభారతములో గీత యొకచిన్నభాగమయినను ఆమహాగ్రంథమునకు గీత శిరోమణియై వెలయుచున్నది. ఆలోచించినయెడల మహాభారతము భౌతిక యుద్ధవర్ణనము కాకనియు, ప్రతిమానవుని హృదయమందు కామక్రోధాదిదుష్టభావములకును, భక్తిప్రేమాది సద్భావములకును నిరంతరము జరుగు యుద్ధముయొక్క వర్ణనమనియు గోచరించును. ఈవిషయమును హృదయరంజకముగ జేయుటకు ఈవిరుద్ధభావముల సంఘర్షణమును రెండు శత్రుపక్షములకు జెందిన వీరుల పోరాటముగ వర్ణింపబడినది. ధర్మరాజు, భీముడు, అర్జునుడు, కృష్ణుడు మొదలగు పురుషులు పూర్వము జీవించియుండవచ్చును. గీతలోని కర్ణుడు, భీముడు, అర్జునుడు మొదలగువారు జన్మమున, జీవితమున మానవాతీతులు. వీరు కల్పితపురుషులు. ఈపాత్రలను వ్యాసుడు ధర్మోపదేశమును జేయుటకుమాత్రమే యుపయోగించెను. వారి భౌతికచరిత్ర ప్రధానమైనది గాదు.

శ్రీకృష్ణభగవానుడు గీతను యుద్ధరంగమున నర్జునునకు బోధించెను. అది నిజమగు భౌతికయుద్ధమగునో నట్టిసమయమున యుద్ధకౌశలమును నేర్పుటకు బదులు స్థితప్రజ్ఞుని లక్షణము లేల బోధించును? స్థితప్రజ్ఞునికి యుద్ధమునకు సంబంధ మేమి?

పురాణములందుగూడ గోపికావస్త్రాపహరణము, కాళీయమర్దనము మొదలగు కథలు కృష్ణునిగూర్చి కలవు. కృష్ణుడు మురళీధరుడని చెప్పబడినది. శరీరమందు గల అహంకారమమకారములను వదలినగాని ఈశ్వరుని పొందలేమనియు, మనస్సునం దుండు విషసర్పము లనదగు కామక్రోధభయాదులను జయించినగాని శాంతి చేకూరదనియు, మురళివలె మనము అహంకారశూన్యులమై భగవంతుని సాధనమైనగాని ఈశ్వరునిమహిమ మనయందు వికసింపజాలదనియు నీపురాణగాథలయొక్క భావమై యుండును. శ్రీకృష్ణుడన పరమాత్మ. గోపికలన జీవులు. ఈభావములను మనోరంజకములుగ జేసి బోధించుటకే యీకథ లన్నియు కల్పింపబడినవి.

గీతాకృష్ణుడు నిరాకారుడు, నిరంజనుడు, నిర్వికారుడు, పరిపూర్ణుడైన సచ్చిదానందమూర్తి. మానవుడు శరీరధారియై యున్నంతకాలము ఈశ్వరుని సత్స్వరూపమును గ్రహింపజాలడు. మానవుని కల్పనాశక్తి చాలదూరము పోజాలదు. కాన పరమేశ్వరుడు మనుష్యరూపమున నవతరించుచుండునని తలచును. ప్రతిజీవియు నీశ్వరుని యవతారమనియు చెప్పవచ్చును. కాని యెవనియందు భగవానుని మహిమ అధికముగ వ్యక్తమగునో వానిని భగవదవతారమని పూజించెదరు. అంతియేకాని భగవంతుడు దేశకాలజన్మజరామృత్యువుల కతీతుడు. ఈశ్వరునకు సాకారత నారోపించినగాని మానవునకు తృప్తికలుగదు. ఈశ్వరుని సగుణమూర్తిగ గల్పించుకొని భజించుటయం దెట్టిదోషము లేదు. కాని ఈశ్వరు

డొకకాలమునగాని, యొకదేశమునగాని జన్మించినాడని చెప్పుట సమంజసముగాదు.

గీతాకృష్ణుడు సర్వభూతములయం దుండువాడు; సకలాంతర్యామి; సర్వజీవుల హృదయములం దుండి సర్వ వ్యాపారములను నడపుచుండును; సర్వము తానై యున్నాడు. ఏవిధముగ సముద్రజలము అలలకు, బుడగలకు, నురుగుకు ఆధారమై యున్నదో అట్లే ఈశ్వరు డీసృష్టికంతకు నాధారమై యున్నాడు. సర్వభూతము లతనియందే పుట్టిపెరిగి లయమగుచుండును. ఇట్టిమహాశక్తియుతుడును, సర్వేశ్వరుడును నగు గీతాకృష్ణుడు శరీరధారియై జన్మించినవాడు కాజాలడు

ఏకృష్ణుని స్మరించి మనము సంసారమును తరించగలమో, ఎవని నామమును స్మరించి శాంతిని బడయుదుమో అట్టికృష్ణుడు కల్పితపురుషుడు. ప్రతివ్యక్తియు తన చిత్తసంస్కారము ననుసరించి భగవంతుని కల్పించుకొనును. గీతాకృష్ణుడు సర్వదేశీయులకు, సర్వమతస్థులకు సర్వకాలములయందు సమానమగు ప్రేమతో ముక్తి నిచ్చును; శాంతి సౌఖ్యముల నొసగును. అతడు సర్వజనులకు పూజనీయుడు. ఏనామముతోనైనను అతనిని భజింపవచ్చును. సర్వనామములు అతనివే యైయున్నవి. సర్వారాధన లతనికే చెందును.

ఆత్మానుభవమే మానవుని పరమావధి. పరమసాధ్యము ఈశ్వరసాక్షాత్కారమనిచెప్పినంతమాత్రమున దాని నిజస్వరూపమును మనము తెలిసికొనజాలము. పరమసాధ్యము అచింత్యమును, ఇంద్రియాతీతమును నగుటచేత భౌతికవిషయజ్ఞానమువలె కేవలము తర్కమువలన, బుద్ధికుశలతవలన దానిని గ్రహింపజాలము. ఆత్మానుభవముగల మహాత్ముల ఉపదేశములను స్మరణము జేయుచు తదనుసారముగ నడచుటకు ప్రయత్నించిన యెడల క్రమక్రమముగ సాధనసాధ్యముల జ్ఞాన మభివృద్ధియగుచుండును. బ్రహ్మానుభవము గలిగిన, ఆత్మ సాక్షాత్కారము నొందిన, శ్రీకృష్ణుని దర్శించిన, సిద్ధుల ఉపదేశమే గీత. దేశకాలమతభేదములేక సర్వజనులకు గీత పఠింపదగినది. జిజ్ఞాసువులు దానిని భక్తిశ్రద్ధలతో పఠించి సతతము మననము జేయుచు, తదనుసారముగ నాచరించుచున్నయెడల వారికి శ్రీకృష్ణుని పరిపూర్ణ జ్ఞానము, వానియందు నిరంతరభక్తియు కలుగును. తద్ద్వారా పరమశాంతియు, ముక్తియు కలుగును.

సర్వజీవులు తమతమ గుణముల ననుసరించి యిష్టమున్నను లేకున్నను కర్మ చేసియేతీరవలెను. మనోవాక్కాయములచే జరుగు సర్వవ్యాపారములు కర్మ యనబడును. చూచుట, నడచుట, వ్రాయుట, ఊపిరిపీల్చుట, ద్వేషించుట. ప్రేమించుట, ఆలోచించుట, ధ్యానించుట, పూజించుట మొదలగు సర్వవ్యాపారములు కర్మలే యగును. ప్రతికర్మయు దోషయుక్తమైనది. ప్రతిజీవికి కర్మ చేయకతప్పదు. ముక్తి నిర్దోషికేగాని లభింపదు. ఈ విషమసమస్యను గీత విస్పష్టమగునట్లు పరిష్కరించినది. జననమరణములు, సుఖదుఃఖములు, రాగద్వేషములు మొదలగు ప్రకృతిబంధములనుండి విముక్తి బడయు సాధనమును గీత తెల్పుచున్నది

## జ్ఞానయోగము

బ్రహ్మ శాశ్వతము, ఇంద్రియగోచరమగు సృష్టియంతయు అశాశ్వతము అను స్థిరమగు జ్ఞానము కలిగియుండవలయును అశాశ్వతములగు బాహ్యవిషయముల యొక్కయు, ఇంద్రియముల యొక్కయు సంయోగము వలన గలుగు రాగద్వేషములు, సుఖదుఃఖములు, జననమరణాది ద్వంద్వములు అన్నియు అసత్యములని గ్రహించి వీని నాత్మయం దారోపించుకొన గూడదు. ఆత్మ సత్యమనియు, అకర్తయనియు, నిర్లిప్తుడనియు తెలిసికొని ద్వంద్వములను సమభావముతో సహింపవలయును. ఆనందముకొఱకై బాహ్యపదార్థముల నన్వేషింపగూడదు. ఆత్మయందే ఆత్మవలన నానందమును పొందవలయును. ఇంద్రియజన్యములగు భోగములు దుఃఖకరము



1. చెన్నపురి గౌరవన్యాయాధికారిణి, శ్రీమతి కె. సి. ఆచార్యసతిగారు; 2. శ్రీమతి పి. గౌరీఅమ్మాళ్ గారు;
3. శ్రీమతి చిలుకూరి లక్ష్మీనరసమ్మగారు; 4. శ్రీమతి కె. నాజరుద్దీన్ సతిగారు.



1. శ్రీమతి, హేమ్ ప్రమ్మనాథన్ సతీగారు ; 2. శ్రీమతి పాలు అప్పాస్వామి సతీగారు (మదరాసు కార్పొరేషను మెంబరు)
3. శ్రీమతి మాయాదేవి గంగూలిగారు ; 4. శ్రీమతి లీలా వెంకటేశ్వరభట్టు కన్యగారు ; 5. శ్రీమతి బికాజీలింజీభాయి పాలంకోటుకన్యగారు

లని గ్రహింప వలయును. ఇట్టిజ్ఞానము కలిగి సర్వవ్యాపారములందు నిర్లిప్తుడై సర్వభూతహితమగు కార్యములను చేయుచుండవలెను.

భక్తియోగము

పరమేశ్వరునియందు నిరంతరము అచంచలమగు భక్తికలిగి సర్వమును—శరీరేంద్రియమనోబుద్ధులను, గృహధనదారపుత్రాదులను, సర్వకర్మలను, కర్మఫలములను సర్వేశ్వరుడగు శ్రీకృష్ణున కర్పింపవలయును. ఈశ్వరుడే సర్వజగత్తునకు ప్రభువు, సృష్టికర్తయు నై సర్వభూతముల హృదయమునందు విరాజిల్లుచు తన మాయాశక్తిచే సర్వమును ప్రవర్తింపజేయుచున్నాడు. జగత్తునందలి సర్వకర్మలు పరమేశ్వరునివే యనియు, నిజమగు కర్తయు, కారయితయు నతడే యనియు, మన మాకర్మలను నిమిత్తమాత్రము జేయుచున్నామనియు, వాడు చేయించుచున్నాడనియు తెలిసికొని, అహంకార మమకారములను వదలి స్వధర్మానుసారముగ నియత కర్మలను చేయవలయును. ఈశరీర మాతనిది. దీని నీశ్వరుడు తన యిష్టానుసారముగ పోషించును, నాశనము చేయును. ఈశ్వరాజ్ఞానుసారము ప్రాప్తములగు సుఖ దుఃఖములను, జయాపజయములను సమభావముతో సహించి శాంతముగా నుండవలయును. సర్వభూతముల యందు—శత్రులందు, మిత్రులందు, సన్మార్గులందు, దుర్మార్గులందు—ఈశ్వరుని చూచుచు, భక్తిపూర్వకముగ సర్వభూతములకు సేవజేయుచుండవలెను. భక్తిపూర్వకమగు సేవయందే యానందమును బొందవలయును. తన యోగక్షేమముల భారమంతయు సర్వేశ్వరునియందే యుంచి సర్వస్వార్థచింతయు వదలి శాంతచిత్తుడై యుండవలయును.

కర్మయోగము

సర్వభూతములు వాని స్వభావమునం దుండు గుణములకు వశములై నిరంతరము కర్మచేయుచునే యుండును. సర్వజీవులు కర్మవలననే సృష్టింపబడుచున్నవి; కర్మవలననే పోషింపబడుచున్నవి; కర్మవలననే జీవించుచున్నవి. ఈసృష్టినియమము లెవరును దాటలేరు. మనుజుని శరీరేంద్రియమనోబుద్ధులు వాని గుణానుసారముగనే పనిచేయుచుండును. శ్వాసోచ్ఛ్వాసములు, రక్త ప్రసారము, అన్నము జీర్ణమగుట మొదలగు కార్యములు స్వభావముగనే జరుగుచున్నవి. ఈకర్మలయందే ట్లహంకారమమకారము లుండవో ఆవిధముగనే సర్వకర్మలను ఈశ్వరార్పణబుద్ధితో, నిష్కామబుద్ధితో యజ్ఞార్థము, సర్వభూతహితార్థము చేయవలయును. రాగద్వేషములు, జయాపజయములు మొదలగున వన్నియు నప్రధానమగు ఫలితములుగాన వీనియం దుదాసీనుడై యుండవలెను. కార్యసిద్ధి కర్మచేయుటయందే యున్నది; కర్మఫలమందు లేదు. సేవయందు లీనమగుటయందే యానంద మున్నది. కర్మఫలమును త్యజించుటయే నిజమగు త్యాగము. సన్యాస మన నియతకర్మలను, కుటుంబమును వదలి యడవిలో యేకాకియై సంచరించుటగాదు. సంగరహితుడై, స్వధర్మానుసారముగ కర్మలను చేయుటవలననే నిజమగు సన్యాసి యగును. సర్వకర్మలు యజ్ఞరూపమును దాల్చవలెను. యజ్ఞమన నిస్స్వార్థసేవ. యజ్ఞముచేయువానికి దేవతలు, అనగా సర్వభూతములు తోడ్పడుచుండును; వాడు కోరకయే వాని యవసరములను నెరవేర్చుచుండును. వాడు నిరంతరము సేవయందే నిమగ్నుడై బ్రహ్మానందమును పొందును.

ధ్యానయోగము

శరీరముకంటె యింద్రియములు, యింద్రియములకంటె మనస్సు, మనస్సుకంటె బుద్ధి శ్రేష్ఠములైనవి. కాని యివన్నియు ఆత్మకు సాధనములు. వీనిని వశమందుంచుకొనినగాని ఆత్మానుభవము కలుగ నేరదు. సూర్యుని ప్రకాశమువలన పృథ్వియందు వాయువు వీచుచున్నది, వర్షము కురియుచున్నది, నదులు ప్రవహించుచున్నవి, సర్వప్రాణులు తమతమ వ్యాపారములు చేయగల్గుచున్నవి. ఈవిధముగనే ఆత్మసాన్నిధ్యమువలన శరీరేం

ద్రియమనోబుద్ధులు వానివాని వ్యాపారములను చేయ గల్గుచున్నవి. జడములుగాన వానికి స్వీయమగు శక్తి గాని, జ్ఞానముగాని, ఆనందముగాని లేవు. కనుక సుఖ దుఃఖములు, లాభనష్టములు, జననమరణములు మున్నగున వన్నియు సాధనములగు శరీరాదుల వ్యాపారములని గుర్తించి వీనియం దుదాసీనుడై ఈవిధముగ శరీరస్మృతిని త్యజించి సదా ఆత్మస్మృతిని, ఈశ్వరస్మృతిని కలిగి యుండవలయును. శరీరేంద్రియమనోబుద్ధులను వశపరచు కొనుటకు ప్రతిదినము కొంతకాలము అభ్యాసము చేయుచు, స్వధర్మమును ఈశ్వరార్పణబుద్ధితో, భక్తిశ్రద్ధలతో నాచరింపవలయును. జ్ఞాన, భక్తి, కర్మ, ధ్యాన యోగములు పరమావధిని జెందుటకు సాధనములు. ఈ సాధనములన్నియు పరస్పరసంబంధము గలవియును, సమానప్రాముఖ్యము గలవియును నైయున్నవి. భక్తిలేని జ్ఞానము కుంటిది. జ్ఞానములేని భక్తి గ్రుడ్డిది. భక్తిజ్ఞానములులేని క్రియాశక్తి తుపానువలె వినాశకారి. ఇంద్రియ నిగ్రహములేనిది భక్తిజ్ఞానములు గలుగుట యసంభవము. క్రియారూపమును దాల్చని భక్తిజ్ఞానములు నిరర్థకములు. కాని దేశకాలపాత్రల ననుసరించి దేనికో యొకదానికి ప్రాముఖ్యము నిచ్చుట సంభవించుచున్నది. భక్తిజ్ఞానములతో గూడిన సేవాకార్యమందు నిరంతరము తత్పరుడై యుండుటే ముక్తికి మార్గమని గీత బోధించుచున్నది. ఎవరియందు జ్ఞాన, భక్తి, కర్మ, ధ్యానయోగములకు ఐక్యము కలుగునో వారికే పరమశాంతి కలుగును. వారే గమ్యస్థానమును చేరుదురు. వారికి గీతాకృష్ణుడు సాక్షాత్కరించును. వారివారి పూర్వసంస్కారముల ననుసరించి ఈమార్గములయందు న్యూనతాధికతలు కనుపించుచుండును. కాని వాస్తవమున కీభేదము భ్రమయే. జ్ఞాన, భక్తి, కర్మ, ధ్యానయోగములు బ్రహ్మానుభవమునకు సమానఫలితముగల సాధనములు. ఇవన్నియు పడుగు పేకలవలె పరస్పరసంబంధము కలిగియుండును. ఇవన్నియు నొకేవస్తువుయొక్క నాలుగువైపులని చెప్పవచ్చును.

ఆధ్యాత్మికసంపదకును, ఐహికసంపదకును, మోక్షమునకును, జీవనోపాధికిని, వేరువేరు మార్గము లున్నవని సాధారణముగా తలచెదరు. కాని జీవితమును ఆర్థికమనియు, సాంఘికమనియు, రాజకీయమనియు, ఆధ్యాత్మికమనియు విభజించుటకు వీలులేదు. జీవితమంతయు నొకటేయైనను వ్యావహారికనిత్యజీవితమందు వీలుకొఱకు వీనిని గురించి వేరువేరుగా ప్రసంగించెదము. సర్వకర్మలు బ్రహ్మప్రాప్తికొఱకే యైయుండవలయును. మోక్షమునకు ప్రతికూలమగు కర్మలు త్యాజ్యములు.

ఏధర్మము నిత్యజీవితమందు కార్యరూపమును దాల్చదో యది నిష్ప్రయోజనము. సర్వకళలు, సర్వసంపదలు మోక్షమునకు సాధనమగునపుడే అవి పరిపూర్ణతను జెందును, సార్థకములగును. నీతినియమములు, సత్ప్రవర్తనయు భక్తిపై, ఆత్మవిశ్వాసముపై ఆధారపడియున్నవి. ఆత్మవిశ్వాసములేనపుడే జీవితము అసత్యముతో, కామక్రోధభయాదులతో, హింసాకార్యములతో కలుషితమై యుండును. ఈశ్వరసాన్నిధ్యానుభవముపై నాధారపడియుండు మానవజీవితము సారవంతమైన భూమిని నాటుకొనిన వృక్షమువలె సర్వతోముఖముగ వృద్ధిజెంది సార్థకమగును.

గీత బోధించున దేమన "ఎచట యోగేశ్వరుడగు కృష్ణు డుండునో, ఎచట ధనుర్ధారియగు అర్జును డుండునో అచట శ్రీయును, విజయమును, వైభవమును, నీతియు నుండును. అనగా నెవరు భక్తిజ్ఞానములతోగూడిన సేవాకర్మయందు తత్పరులైయుందురో వారియందు సర్వసంపదలు, సర్వకళలు, సర్వధర్మములు పరిపూర్ణవికాసము నొందును." అని.

సచ్చిదానందమూర్తియగు శ్రీకృష్ణుడు సర్వజనులకు స్థిరమగు భక్తియు, అచంచలమగు నాత్మవిశ్వాసమును ప్రసాదించి శాంతిని కలుగజేయుగాత.

---

# స్త్రీ మూర్తి

ఓలేటి సీతారామమూర్తి గారు

ప్రేమపూతమహస్సులో విరిసిపోయి
యాదిశక్తి లీలాజ్యోతి మేదురముగ
నెడఁదయొావరి సురభీకరించుకొనుచు
నాసు నించు స్త్రీమూర్తి నీ కంజలింతు.

జీఱువాఱెడు యౌవనశ్రీల సొగయు
ముగ్ధనయనాల దృక్కుతోఁ బురుషలోక
మొక్కముడిలోన బంధించి యో త్రపాక్షి!
వలపువెల్లువలో ముంచివైతు వీవు.

సుదతి! నీదు చక్షుష్కోణశోణఘృణియె
ప్రామి దళగించు దావానలమ్ముపోలె
తీవ్రవేదనా భయదవిస్తృతము కాఁగ
విశ్వమే కుమారిల్లి కంపించిపోవు.

నయనములు విచ్చి వలపుడెందంబు విచ్చి
తావకప్రభా ప్రేమకృత్యప్రవృత్తి
విసుగు లేక విరతి లేక చెదరుగొన్న
ప్రేక్షణంబుల నీజీవితేశ్వరుండు
అరసి వెఱఁగందు మూఁగపోయగపు గృహిణి!

ప్రణయతేజస్తుషారవాసనలు చిమ్మి
పూతనందనభాగ్య సంఫుల్లమయిన
ప్రకృతిదేవివి సుము గేస్తురాల! నీవు
కెరలి నినుఁ బాడు సత్కవీశ్వరుఁడు గేహి.

ఈయనంతప్రకృతిలో హసించుచున్న
లలితసౌందర్య సత్కళాలక్ష్మి యెల్లఁ
బ్రతిఫలించు నీహృదయదర్పణమునందె
సంజమబ్బుల మవ్వంబు సరసిఁ బోలె.

నీపురాణించు వేఁడి కన్నీటిచుక్క
యనుఁగుభర్తకు నవహాలహాలము; నీదు
పులుకుపులుకు చూపులలోనఁదొలఁకు స్వాదు
హాసమే వాని జన్మభాగ్యంబు సాధ్వి!

ఒక్కవాలుక్రొంజూపుతో నొక్క స్మేర
రాగరేఖతోఁ బురుషవిలాసహృదిని
కరమునం జేర్చికొనుచు సగర్వమూర్తి
నోవిలాసినీ! నవ్వుచున్నావు నీవు.

ఓసతీ! వాని కఠినపాదోపలముల
క్రిందఁ బడి నలిగియును నొక్కించుకైన
యుస్సురనవు కోపింప వీయోర్పుకలిమి
ఏమి నోములఫలమొ తల్లి, వచింపు.

*    *    *    *

మానిసి! విసపునవ్వుల మాయలాడ!!
సొరు లొల్కు కోమలశిరీషమ్ముఁ బోలు
స్త్రీవిలాసంబు నేల నశింపఁజేతు?
ఆసుధామూర్తి బామముడియందె ఓయి!
ప్రళయము సృజించు నొకశక్తి కలదు—కలదు!

*    *    *    *

హైందవకుమార! స్వాతంత్ర్యయావహృదయ!
ప్రాజ్యకల్యాణమే నీకు వలయునేని
ఇనుపపాదాలతో స్త్రైణహృదయ మింక
మట్టఁబోక పురాణాభ మహిని నిల్పు.

తలిరుటాకుల మేనుల కలికిచాలు
నినుపలోగిళ్ళలోన బంధించివైచు
మూర్ఖజాతులు భారతభూమి నెపుడు
మందునో నాఁడె స్వాతంత్ర్య మందు నామె.

—'స్త్రీమూర్తి' నుండి.

# ౮. జ్యోతిషము

## అయనబలానయనము

సూరి రామసుబ్బరాయ శాస్త్రిగారు

### ౧

గ్రహముల చేష్టాబలమున కంగీభూతమగు నయనబలసాధనమునందు గణితలాఘవార్థము పూర్వాచార్యులచేఁ జెప్పఁబడిన వివిధవిధానముల సోపపత్తికముగ వివరించుచున్నాను. అయనబలస్వరూపము కల్యాణవర్మచే సారావళియందు :—

శ్లో. ఉత్తరమయనం ప్రాప్తా శ్శుక్రకుజార్క సురమంత్రిణో బలినః,
యామ్యం శశిరవిపుత్రౌ ద్వేఅపి శశిజః స్వవర్గస్థః.

ఉత్తరాయణముఁ బొందిన శుక్ర కుజ రవి గురులు బలవంతులగుదురు. దక్షిణాయనముఁ బొందిన చంద్రశనులు బలవంతులగుదురు. అయన ద్వయమునందును బుధుఁడు బలవంతుఁ డగును. ప్రతిగ్రహము సాయనమేషారంభమున విషువద్వృత్తమున (Celestial equater) నుండి క్రమక్రమముగ నుత్తరమునకుఁ జనుచు మేషవృషభమిథున రాశిత్రయగమనాంతమున నుత్తరమున ౨౪ భాగల క్రాంతిఁ బొందును. ఉత్తరగమన మంతతో నంతమొంది సాయనకటకప్రవేశమున (వెనుకకు) దక్షిణమునకు గమన మారంభ మగును. ఇట్లు కటకసింహకన్యా రాశిత్రయగమనము సమాప్తముకాఁగా సాయనతులారంభమునఁ గ్రాంతిశూన్య మయి మరల విషువద్వృత్తమున నుండును. పిమ్మట విషువద్వృత్తమునుండి క్రమక్రమముగ దక్షిణమునకుఁ జనుచు తులా వృశ్చికధనూరాశిత్రయగమనము సమాప్తమయి సాయనమకరారంభమునఁ బరమదక్షిణ గమనమున ౨౪ భాగల క్రాంతిఁ బొందును. దక్షిణగమన మంతతో నంతమొంది యుత్తరగమన మారంభమగును. మకర కుంభ మీనరాశిత్రయగమనము సమాప్తమయి సాయనమేషారంభమునఁ గ్రాంతి శూన్యమగు విషువద్వృత్తమున మరలఁ బ్రవేశించును. ఇట్లు ప్రతిగ్రహము విషువద్వృత్తమునుండి యామ్యోత్తరములం దిరువదినాల్గు భాగలవరకుఁ జనుచు ద్వాదశరాశిసంచారముఁ బూర్తి చేయును. ఈ యామ్యోత్తరగతియందుఁ జంద్రశనులకు దక్షిణాయనమున బలాధిక్యము. అనఁగా సాయనధనురంతమునఁ బరమదక్షిణక్రాంతియందు బలము సంపూర్ణము. అచ్చటనుండి క్రమక్రమముగ నుత్తరగమనమున బలము హ్రాస మగుచు పరమోత్తరగమనమగు సాయనమిథునాంతమున బలము శూన్య మగును. మరల దక్షిణగమనమునఁ గ్రమక్రమముగ బలము వృద్ధియగును. ఇట్లు సాయనమేషతులారంభములం దర్ధబలమును, సాయనమకరారంభమునఁ బూర్ణబలమును, సాయనకటకారంభమున శూన్యబలమును నగును. తద్విపరీతముగ రవికుజ గురు శుక్రులకు నుత్తరాయణమున బలాధిక్యము. అనఁగా సాయనమిథునాంతమునఁ బరమోత్తరక్రాంతియందు బలము పూర్ణము. పరమదక్షిణక్రాంతి యగు సాయనధనురంతమున బలము శూన్యము. సాయనమేషతులారంభములందు బల మర్ధము. బుధున కయనద్వితయమునందును బలాధిక్యమగుటచే సాయనధనుర్మిథునాంతములందుఁ బూర్ణబలమును, సాయనమేషతులారంభములం దర్ధబలమును నగును. తదంతరరాశ్యాదులందున నీబలము క్రాంతివశమున ననుపాతముచే సాధింపఁదగియున్నది. అయనబల నిరూపణము శ్రీకాళిదాస మహాకవిచే నుత్తరకాలామృతమునందు, "యామ్యే చంద్రశనీ బుధస్తు సతతం శేషాస్తు సౌమ్యాయనే" అని చెప్పఁబడినది.

### ౨

అయనబలసాధనవిధానము శ్రీకేశవాచార్యవిరచిత జాతకపద్ధతియందు :—

శ్లో. సదాక్రాంతిభాగై ర్యుతాజ్ఞస్య సిద్ధాః (౨౪)
శనీంద్వోర్యుతోనాః క్రమాద్యామ్యసౌమ్యైః,
విలోమం పరేషాం గజాంబోధి (౪౮) భక్తా
భవే దాయనం వీర్య మర్కస్య ద్విఘ్నం.

బుధున కయనద్వయమునందును గ్రాంత్యంశల ౨౪ లోఁ గలపి ౪౮ చే భాగింపవలయును. శనిచంద్రుల యామ్యక్రాంత్యంశల ౨౪లోఁ గలపియు, సౌమ్యక్రాంత్యంశలఁ దీసివేసియు ౪౮ చే భాగింపవలయును. తదితరులకు ననఁగా రవికుజ గురు శుక్రులకుఁ దద్విపరీతముగ సౌమ్యక్రాంత్యంశల ౨౪ లోఁ గలపియు, సౌమ్యక్రాంత్యంశలఁ దీసివేసియు ౪౮ చే భాగింపవలయును. ఇట్లయనబల ముపపన్న మగును. రవియొక్క ఆయనబలమును ద్విగుణింపవలయును.

ఉపపత్తి—పరమ దక్షిణగమనమునఁ బూర్ణబలులగు శనిచంద్రులకుఁ జతుర్వింశత్యంశలు క్రాంతి యగు సాయనధనురంతమున సంపూర్ణబలము. సాయనమేషతులారంభములం దర్ధబలము. సాయన మిథునాంతమునఁ జతుర్వింశత్యంశప్రమితపరమోత్తరక్రాంతియందు

బలము శూన్యము. ఇట్లు బలాభావస్థానమునుండి బలపరమస్థానమునకు ద్విగుణపరమక్రాంత్యంశప్రమిత మగు గజాంభోధి (౨౪) మితాంశలగును. కావున బలాభావస్థానమునుండి యహోరాత్రవృత్తమున నిష్టగ్రహస్థానమువరకు నంతరమున నున్న క్రాంత్యంశలచే బలము సాధింపఁదగియున్నది. సిద్ధాంశ (౨౪) మితమగు పరక్రాంతియందు శనిచంద్రుల యామ్యక్రాంత్యంశలఁ గలుపుటయు, సౌమ్యక్రాంత్యంశలఁ దీసివేయుటయుఁ జేయఁగా బలాభావస్థానమునుండి తత్కాలస్థానమువరకు నపమాంశలగును. కవి రవి గురు భౌముల సౌమ్యక్రాంతినిఁ బరక్రాంతియగు ౨౪ లోఁ గలుపుటయు, యామ్యక్రాంతినిఁ దీసివేయుటయుఁ జేయఁగా బలాభావస్థానమునుండి తత్కాలస్థానమువరకు నపమాంశలగును బుధున కయనద్వితయమునందును బలోపచయమే యగుటచే సౌమ్యయామ్యాంశల రెంటిని ౨౪ లోఁ గలుపఁగా భుజ్యమాన మగు నయనాద్యగ్రిమక్రాంతి యగును. ఇట్లు బలాభావస్థానమునుండి బలపరమస్థానమునకు ౪౮ భాగలచే రూపబలమగును గావున నొక్కొక్క భాగచే ౧/౪౮ వంతు బలము వృద్ధియగును. సర్వగ్రహములకు నిట్లు క్రాంత్యభావస్థానము లగు సాయన మేష తులారంభములం దర్ధబలము లేక ౨౪/౪౮ వంతు బల మగుచున్నది. ఇందులో బలోపచయమున నపమాంశలలోని ౪౮-వ వంతును గలుపుటయు, నపచయమునఁ దీసివేయుటయుఁ జేయవలయును. బుధున కయనద్వయమునందును బలోపచయమే యగుటచే నెల్లపుడును క్రాంత్యంశల ౨౪లోఁ గలుపవలయును. ఇట్లు చేయఁగా బలము నలువదెనిమిదవ వంతులోఁ దెలియుటచే దానిని ౪౮ చే భాగింపఁగా రూపాదిబల మగును. సూర్యుఁ డుత్తరాయణమునఁ జేష్టాబలయుతుఁ డును నగుటచేఁ దచ్చేష్టాబలమును నయనబలతుల్యమే యగుచున్నది. చేష్టాబలానయనావసరమునఁ బ్రత్యేకముగ సూర్యునిబలమును సాధింపనగత్యము లేకుండుటకై ఈ అయనబలమును ద్విగుణింపవలయు నని చెప్పఁబడినది.

## 3

అయనబలము షష్ట్యంశలలోఁ దెలియునటుల శ్రీదివాకర దైవజ్ఞులచేఁ బద్ధతిప్రకాశయందు :—

శ్లో. యామ్యోత్తరైః స్వాంఘ్రియుతాపమాంశైః
యుతాయుతాః పూర్ణగుణాః (౩౦) శనీంద్వోః,
వ్యస్తం పరేషా మనిశం బుధస్య
యుతా భవే దాయన వీర్యమేతత్.

గణేశదామోదరసూర్యముఖ్యైః
స్పష్టాపమాత్సాధిత మాత్మతంత్రే
ఉపేక్షితత్వా ద్గురుకేశవాద్యైః
అయుక్త మేవేతి సుధీభి రూహ్యం.

శనిచంద్రులకు యామ్యాయనమున స్వాంఘ్రియుతాపమాంశల (ననఁగా క్రాంత్యంశల కొకటిం బాతికరెట్ల)ను పూర్ణగుణము (౩౦) నందుఁ గలుపవలయును. సౌమ్యాయనమునఁ దీసివేయవలయును. ఇతరులకు ననఁగా రవి కుజ గురు శుక్రులకుఁ దద్విపరీతముగా యామ్యాయనమున స్వాంఘ్రియుతాపమాంశలఁ బూర్ణగుణమునందుఁ దీసివేయవలయును. బుధున కయనద్వయమునందును గలుపవలయును. ఇట్లు చేయఁగా నయనబలము షష్ట్యంశలలోఁ దెలియును. సర్వగ్రహములకు సాయన మేష తులారంభములం దర్ధబలము, లేక పూర్ణగుణ (౩౦) షష్ట్యంశల బలము. అచ్చటనుండి యామ్యోత్తరములం దిరువదినాల్గు క్రాంత్యంశలచే ౩౦ షష్ట్యంశల బల ముపచయముగాని, యపచయముగాని యగుటచే నొక్కొక్క క్రాంత్యంశచే ౩౦/౨౪ = ౫/౪ = ౧ ౧/౪ బలమగుచున్నది. కావున నిష్టక్రాంత్యంశలచే నెంత బలమని తెలియుటకై అపమాంశల కొకటిం బాతికరెట్లు చేయవలయునని చెప్పఁబడినది. శనిచంద్రులకు బలోపచయమగు యామ్యాయనమున స్వాంఘ్రియుతాపమాంశల పూర్ణగుణములందుఁ గలుపుటయు, బలాపచయమగు సౌమ్యాయనమునఁ దీసివేయుటయుఁ జేయఁగా షష్ట్యంశాత్మకబలమగుచున్నది. ఇతరులకుఁ దద్విపర్యయము. అయనద్వయమునందును బలోపచయమగు బుధునకు సర్వదా స్వాంఘ్రియుతాపమాంశలఁ బూర్ణగుణములందుఁ గలుపఁగా బల ముపపన్నమగుచున్నది.

గణేశ దామోదర సూర్యాదిదైవజ్ఞులు తమతంత్రములందు శరసంస్కృత క్రాంత్యంశలచే నయనబలము సాధించిరి. గురుకేశవాదులచే నది యుపేక్షింపఁబడుటచే నయుక్తమని యెంచఁ దగియున్నది. ఈవిషయమై శ్రీకేశవాచార్యులచే స్వకృతపద్ధతి టీకయందు:—"శరసంస్కృత క్రాంతిచే నీయాయనబలము సాధింపఁదగినదని కొందరనుచున్నారు. అది యసమ్మతము. గ్రహమునకు యామ్యోత్తరాశ్రితముఖముచేఁ గలుగుచున్న యాయనగమనము గ్రహముయొక్క స్వముఖవలన క్రాంతివశమై యున్నది వలనానయనమునందు క్షేపమును సంస్కరించువారు కుజబుధులని మహాప్రబంధమగు సిద్ధాంత శిరోమణియందు శ్రీభాస్కరాచార్యులచేతను చెప్పఁబడియుండుటచే నశ్లే యయనబలానయనమునందును క్రాంతియందు శరసంస్కారము కూడదనుట యుక్తియుక్తము. ఇంతియకాక అయనమును బురస్కరించి ప్రవృత్తమగు బలముకావున నయనబల మనఁబడుటచే నిది మధ్యక్రాంతిచేతనే సాధించుట యుక్తము. స్పష్టక్రాంతిచే సాధించిన యెడల అయనబలసార్థకత్వమును వ్యభిచరించును"అని చెప్పఁబడినది. అట్లు స్పష్టక్రాంతిచే సాధించినయెడల అయనబలము వర్షసహస్రముల కొక్కసారియైనఁ బూర్ణముగ సిద్ధింపనేరదు. కావున మధ్య క్రాంతి వలననే యయనబలము సాధింపఁదగియున్నది.

## ౪

అయనబలసాధనము ప్రకారాంతరమునఁ బద్ధతిప్రకాశయందు:-

శ్లో. యద్వాఽపక్రమసిద్ధాంశ (౨౪) సంస్కృతం రూప మర్ధితం,
రూపాద్య మాయనం వీర్యం స్యా ద్రవే ర్ద్విగుణం కురు

క్రాంత్యంశలలోని ౨౪-వ వంతును రూపము (౧) లో సంస్కరించి దానిని సగముచేసిన యెడల రూపాద్యయనబల మగును ఇట్లు సాధించిన రవిబలమును ద్విగుణింపవలయును. సంస్కరించుట యనఁ బూర్వోక్తవిధమునఁ గలుపుటయుఁ, దీసివేయుటయుఁ జేయవలయును. క్రాంత్యంశల ౨౪ లో సంస్కరించినపిమ్మట ౪౮ చే భాగింప వలయునని శ్రీకేశవాచార్యులచేఁ జెప్పఁబడినది. అదియే $\frac{౨౪}{౪౮}=\frac{౧}{౨}$ లోఁ గ్రాంత్యంశలలోని ౪౮ వంతును సంస్కరించుట యగును. అట్లు క్రాంత్యభావస్థానబలము $\frac{౧}{౨}$ లో నొక్కొక్క క్రాంత్యంశకు $\frac{౧}{౪౮}$ వంతు చొప్పున బలమును సంస్కరించుటకుఁగాను రూపము (౧) లోఁ గ్రాంత్యంశలలోని ౨౪-వ వంతును సంస్కరించి పిమ్మట ౨ చే భాగించినను దుల్యఫలమే సిద్ధించుచున్నది.

## ౫

ఇదియే ప్రకారాంతరమున శ్రీపత్యాచార్యులచే:—

శ్లో. క్రాంతి స్సౌమ్యా స్వమిహ పరమాపక్రమే దక్షిణార్ణా
శుక్రాదిత్యక్షితిసుతమరు త్పూజితానాం విధేయా,
వ్యస్తా శీతద్యుతిరవిజయోః జ్ఞస్య నిత్యం విధేయా
రామాభ్య స్తాం తదను పరమాపక్రమే ణోద్ధరే త్తామ్.
గ్రాహ్యం రాశిప్రభృతిచ ఫలం లిప్తికీభూత మేతత్,
వ్యోమాకాశద్విరదకకుభిః (౧౦౮౦౦) భాజయే దాయనం
స్యాత్.

పరమక్రాంతి (౨౪) యందు శుక్రరవికుజగురుల సౌమ్య క్రాంతిం గలుపవలయును; యామ్య క్రాంతిఁ దీసివేయవలయును. చంద్రశనులకుఁ దద్వ్యస్తము. బుధున కుభయక్రాంతులఁ గలుపవల యును. ఇట్లు సంస్కరించినపిమ్మట ౪౮ చే భాగింపవలయునని శ్రీకేశవాచార్యోక్తవిధమై యున్నది. కాని 3 చే హెచ్చించి ౨౪ చేతను, పిమ్మట ౬ చేతను భాగింపవలయునని యిచటఁ జెప్పఁబడినది. అందులకుఁగాను సంస్కారానంతరము 3 చే హెచ్చించి పరమ క్రాంతి (౨౪) చే భాగించి ఫలమును లిప్తలఁజేసి చక్రార్ధ (రాశి షట్క) లిప్తలగు ౧౦౮౦౦ చే భాగింపవలయునని చెప్పఁబడినది. బలాభావస్థానమునుండి బలపరమస్థానమునకు రాశిషట్క క్రాంత్యం తరముచే రూపబలము కలుగ నిష్టరాశ్యాదిక్రాంత్యంతరముచే నెంత బలమగునను త్రైరాశికమున నిష్టరాశ్యాదిని లిప్తలంజేసి రాశిషట్క లిప్తలచే భాగించిన బలమగుచున్నది.

క్రాంతిసాధనము లఘుప్రకారమున సిద్ధాంతశిరోమణియందు:-

శ్లో. రూపాశ్వినో వింశతి రంకచంద్రా
అత్యష్టి తిథ్యర్క సవేషు దస్రాః,
జ్యాఖండకాన్యంశమితే ర్దశాప్తం
స్యుర్యాతఖండా స్యన భోగ్యనిఘ్నాః.
శేషాంశకాః ఖేందుహృతా యదాప్తం
తద్యాతఖండైక్యయుతం లఘుజ్యా,
జినాంశజీవాంకకృతా విపాదాః (౪౮/౪౫)
స్యా దుత్క్రమజ్యాఽత్ర విలోమఖండైః.

రాశిత్రయభుజజ్య నవఖండములు చేయఁబడినది. అది క్రమ ముగా ౨౧, ౨౦, ౧౯, ౧౭, ౧౫, ౧౨, ౯, ౫, ౨. ఈఖండైక్య ములు క్రమముగా ౨౧, ౪౧, ౬౦, ౭౭, ౯౨, ౧౦౪, ౧౧౩, ౧౧౮, ౧౨౦ అగును. క్రాంతి సాధింపవలసిన గ్రహముయొక్క రాశ్యాదియం దయనాంశలఁ గలిపి భుజమును నిర్ణయింపవలయును. ఆభుజరాశ్యాదిని భాగలఁ జేసి ౧౦ చే భాగింపఁగా లబ్ధమువలన గతజ్యాఖండములు తెలియును రాశిత్రయము లేక ౯౦ భాగల ప్రమా ణము ౯ ఖండములు చేయఁబడుటచే నొక్కొక్క ఖండము ౧౦ భాగ లగుచున్నది. కావున గ్రహముయొక్క భుజరాశ్యాదిని భాగలఁజేయ నం దెన్నిపదులున్న నన్ని గతఖండము లగును. పిమ్మట శేషభాగ లచే జ్యాను సాధించు టెట్లనిన, ౧౦ భాగలచే భోగ్య (వర్తమాన) ఖండము జ్యాప్రమాణమైన యెడల నిష్టభాగలచే నెంతజ్యాప్రమాణ మగునను ననుపాతమున శేషభాగల భోగ్యఖండ ప్రమాణముచే హెచ్చించి ౧౦ చే భాగింపవలయును. ఇట్లు చేయఁగా నగు లబ్ధమును గతఖండైక్యమునఁ గలుప నాగ్రహముయొక్క భుజజ్యయగుచున్నది. ఇట్లు గ్రహముయొక్క భుజజ్యను సాధింపవలయును. విలోమఖండై క్యము 'ఉత్క్రమజ్య' యనఁబడుచున్నది. అనఁగాఁ ద్రిజ్యాప్రమాణ మగు ౧౨౦ నుండి క్రమభుజజ్యను దీసివేయఁగా నుత్క్రమజ్య యగును. ఇట్లు త్రిజ్యాప్రమాణము ౧౨౦ అని గ్రహించినపుడు పరమ క్రాంతిజ్య ౪౮/౪౫ అగుచున్నది. దీనిఁబట్టి క్రాంతిని సాధించు టెట్లనిన, ౧౨౦ ప్రమాణమగు త్రిరాశిజ్య భుజజ్యయైనపుడు (అనఁగా భుజము 3 రాసులై సంపూర్ణక్రాంతియం దున్నపుడు) పరమక్రాం త్యంశలు ౨౪ అగుచున్నవి. కావున భుజజ్యలో $\frac{౨౪}{౧౨౦}=\frac{౧}{౫}$ వంతు క్రాంత్యంశలగును. కావున నిష్టగ్రహభుజజ్యను ౫ చే భాగింపఁగాఁ గ్రాంత్యంశలగునని లఘూపాయమై యున్నది.

౧. ఉదాహరణము:—స్ఫుటబుధరాశ్యాది ౯-3౯-3౧. అయనాంశాది ౨౧-3. సాయన బుధరాశ్యాది ౧౦-౦-3౪. నవరా

క్త్యధిక మగుటచే ౧౨ రాసులనుండి తీసివేయఁగా ౧-౨౯-౨౬ భుజ రాశ్యాది యగును. దీనిని భాగలఁజేయఁగా ౫౯-౨౬ అయినది. ౧౦ చే భాగింపఁగా లబ్ధము ౫ కావున గతఖండము ఐదగును. తత్ఖండైక్యము ౯౨ భోగ్యమగు నారవఖండ ప్రమాణము ౧౨ దీనిని శేష భాగాదియగు ౯-౨౬ చే హెచ్చించి ౧౦ చే భాగింపఁగా $౯\text{-}౨౬ \times \frac{౧౨}{౧౦} = ౯\text{-}౨౬ \times \frac{౬}{౫} = \frac{౫౬\text{-}౩౬}{౫} = ౧౧\text{-}౧౯\text{-}౧౨$ అగును. దీనిని గత ఖండైక్యమగు ౯౨ లోఁ గలుపఁగా ౧౦౩-౧౯-౧౨ భుజజ్యయగుచున్నది. దీనిని ౧౨౦ నుండి తీసివేయఁగా ౧౬-౪౦-౪౮ కోట్యుత్క్రమజ్య యగును. క్రమజ్యను ౫ చే భాగింపఁగా ౨౦-౪౦ క్రాంతిభాగాది యగుచున్నది.

అయనబలానయనోదాహరణము:—

౨. శ్రీకేశవాచార్యోక్త విధము:—బుధక్రాంతిభాగాది ౨౦-౪౦ దీనిని ౨౪ లోఁ గలుపఁగా ౪౪-౪౦ అగును. దీనిని ౪౮ చే భాగింపఁగా $\frac{౪౪\text{-}౪౦}{౪౮} = \frac{౧౩౪}{౩} \times \frac{౧}{౪౮} = \frac{౬౭}{౭౨}$ రూపాదిబల మగును. దీనిని షష్ట్యంశలోనికి మార్చఁగా $\frac{౬౭}{౭౨} \times ౬౦ = \frac{౩౩౫}{౬} =$ ౫౫-౫౦ షష్ట్యంశాదిబుధుని యయనబల మగుచున్నది.

౩. దివాకరాచార్యవిధము:— క్రాంత్యంశాది ౨౦-౪౦. స్వాంఘ్రియుతము కాఁగా ౨౫-౫౦ అగును. దీనిని పూర్ణగుణము (౩౦) లోఁ గలుపఁగా ౫౫-౫౦ షష్ట్యంశాది అయనబలమగును.

౪. క్రాంత్యంశాది ౨౦-౪౦. ఇందలి ౨౪-వ వంతు $\frac{౨౦\text{-}౪౦}{౨౪} = \frac{౬౨}{౩ \times ౨౪}$, దీనిని రూపమునందుఁ గలుపఁగా $\frac{౧౩౪}{౭౨}$ దీనిని అర్ధింపఁగా $\frac{౧౩౪}{౭౨ \times ౨} = \frac{౬౭}{౭౨}$ రూపాదిబల మగును. దీనిని ౬౦ చే హెచ్చింపఁగా $\frac{౬౭}{౭౨} \times ౬౦ = \frac{౩౩౫}{౬} =$ ౫౫-౫౦ షష్ట్యంశాది బల మగును.

౫. శ్రీపత్యాచార్యోక్తమున:— క్రాంత్యంశాది ౨౦-౪౦. పరమక్రాంతియగు ౨౪ లోఁ గలుపఁగా $౪౪\text{-}౪౦ = \frac{౧౩౪}{౩}$ అగును. దీనిని ౩ చే హెచ్చించి ౨౪ చే భాగింపఁగా $\frac{౧౩౪}{౩} \times \frac{౩}{౨౪} = \frac{౬౭}{౧౨}$. దీనిని లిప్తలఁజేసి చక్రార్ధలిప్తలగు ౧౦౮౦౦ చే భాగింపఁగా $\frac{౬౭}{౧౨} \times \frac{౬౦ \times ౬౦}{౧౦౮౦౦} = \frac{౬౭}{౧౨} \times \frac{౧}{౬} = \frac{౬౭}{౭౨}$ రూపాది లేక ౫౫-౫౦షష్ట్యంశాది బల మగును.

౬

క్రాంతిసాధనమును, పూర్వోక్త సంస్కారమును నగత్యము లేకయే అయనబలమును సాధించు విధానము దివాకరులచే:—

శ్లో. శశ్యబ్జయోః స్సాయనభాదికస్య
కోట్యుత్క్రమజ్యాంఘ్రి తదూనషష్టిః,
గోళక్రమాత్ వ్యస్తమథాపరేషాం
యామ్యేతుచాంద్రేః ఖరస (౬౦) చ్యుతంవా.

సౌమ్యగోళమున శనిచంద్రులకు సాయనభుజరాశ్యాదియొక్క కోట్యుత్క్రమజ్యలో నాల్గవంతయనబలమగును ఈ కోట్యుత్క్రమజ్యలోని నాల్గవవంతును ౬౦ నుండి తీసివేయ యామ్యగోళమున బలమగును. ఇతరగ్రహములకుఁ దద్విపరీతముగ యామ్యగోళమునఁ గోట్యుత్క్రమజ్యాంఘ్రియును, సౌమ్యగోళమునఁ గోట్యుత్క్రమజ్యాంఘ్ర్యూనషష్టియు బలమగును. బుధునకుమాత్రము యామ్యగోళమునందును సౌమ్యగోళమునందువలె కోట్యుత్క్రమజ్యాంఘ్ర్యూనషష్టియే బలమగును. ఇచ్చటఁ గోట్యుత్క్రమజ్య ౧౨౦ అని గ్రహింపఁదగియున్నది

ఉపపత్తి —త్రిజ్యాతుల్య మగు సాయనగ్రహభుజజ్య ౧౨౦ అయినపుడు పరమక్రాంత్యంశలు ౨౪ అగును గావున నిష్టభుజజ్యచే నెంతక్రాంతి యగునను నగుపాతమున నిష్టభుజజ్యను ౨౪ చే హెచ్చించి ౧౨౦ చే భాగింపవలయును గుణహారములను ౨౪ చే నపవర్తనము చేయ $\frac{౧}{౫}$ అగుచున్నది కావున భుజజ్యను ౫ చే భాగించినఁ గ్రాంత్యంశలగుచున్నవి. ఈక్రాంత్యంశల నొకటింబాతికరెట్లు చేసి, అనఁగా ౫ చే హెచ్చించి ౪ చే భాగించి పిమ్మట ౩౦ లో సంస్కరింపవలయునని పూర్వోక్తవిధమునఁ గలదు. అనఁగా ౫ చే భాగించిన భుజజ్యను ౫ చే హెచ్చించి ౪ చే భాగించుటయైనది. అనఁగా భుజజ్యను ౪ చే భాగించుట యగును కావున భుజజ్యలో నాల్గవ వంతును ౩౦ లో సంస్కరింపవలయునని యుపపన్నమైనది. సమచ్ఛేదవిధానమున భుజజ్యను ౧౨౦ లో సంస్కరించిన పిమ్మట ౪ చే భాగించినను తుల్యఫలమే యగుచున్నది. త్రిజ్యాప్రమాణము ౧౨౦ అని గ్రహించితిమి కావున నిచ్చట ౧౨౦ స్థానమున త్రిజ్యను గ్రహించి దానియందు భుజజ్యను సంస్కరించి పిమ్మట ౪ చే భాగింపవచ్చునని యుపపన్నమైనది. శనిచంద్రులకు సౌమ్యగోళమున బలాపచయ మగుటచే భుజజ్యలో నాల్గవవంతును ౩౦ నుండి తీసివేయవలయును. లేదా భుజజ్యను త్రిజ్య (౧౨౦) నుండి తీసివేసి ౪ చే భాగింపవచ్చును. భుజజ్యను త్రిజ్యనుండి తీసివేయఁ గోట్యుత్క్రమజ్య యగునని 'స్యాదుత్క్రమజ్యాఽత్ర విలోమఖండైః' అను వాక్యమువలన స్ఫుటమగుచున్నది. కావునఁ గోట్యుత్క్రమజ్యను ౪ చే భాగింపఁగా సౌమ్యగోళమున బలమగుచున్నది. యామ్యగోళమునందు శనిచంద్రులకు బలోపచయమగుటచే భుజజ్యాంఘ్రిని త్రిజ్యాంఘ్రియందుఁ గలుపవలయును. అచట దోర్జ్యకు రెండు ఖండములు. ఋణగతమగు కోట్యుత్క్రమజ్యాంఘ్రిరూప మొకటియు, త్రిజ్యారూప మొకటియును ఇవి త్రిజ్యాద్వయప్రమాణము ౨౪౦ అగును. దీనిని ౪ చే భాగింపఁగా ౬౦ అగుచున్నది. కావునఁ గోట్యుత్క్రమజ్యాంఘ్ర్యూనషష్టిబలమని యుపపన్నమైనది. క్రాంత్యభావస్థానమునఁ గోట్యుత్క్రమజ్య త్రిజ్యాతుల్యమగు ౧౨౦ అగుటచేఁ దదంఘ్రియగు ౩౦ షష్ట్యంశలు బలమగుచున్నది. రవికుజగురు శుక్రులకుఁ దద్విప

రీతముగ యామ్యగోళమున గోట్యుత్క్రమజ్యాంఘ్రియును, సౌమ్య గోళమునఁ దదూనషష్టియు బలమగుచున్నది. బుధున కుభయగోళము లందును బలోపచయమే యగుటచేఁ గోట్యుత్క్రమజ్యాంఘ్ర్యూన షష్టియే సర్వదా బలమగుచున్నది.

పూర్వోదాహరణమునందు బుధునికిఁ గోట్యుత్క్రమజ్య ౧౬-౪౦. ఇందు నాల్గవవంతు ౪-౧౦. దీనిని ౬౦ నుండి తీసి వేయఁగా ౫౫-౫౦ షష్ట్యంశాదిబల మగుచున్నది.

## ౭

ప్రత్యేకముగాఁ గ్రాంతిని సాధింపకయే యాయనబలము సాధించు విధానము పరాశరహోరయందు:—

శ్లో. సాయనాంశగ్రహభుజ రాశి నిష్వబ్ధిభి (౪౫) స్స్వరైః(౩౩),
సూర్యై(౧౨)ర్హత్వా క్రమా ద్రాశిభాగ స్స్యా దనుపాతతః.
ఏవం రాశ్యాదికేయుజ్యా దర్కారార్యోశనస్సద,
రాశిత్రయ మధోయుజ్యా న్మేషాదిస్థేషు ఖేష్వథ.
తులాదిస్థేషురాశ్యాదిం త్రిరాశిభ్యో వివర్జయేత్,
చంద్రార్క్యో ర్విపరీతంస్యా త్సదాయుజ్యా ద్బుధస్యతు.
భాగీకృత్య త్రిభిర్భక్తం గ్రహాణా మాయనం బలం,
రవే ర్ద్విగుణ మేవంస్యాత్ ....................

సాయనగ్రహముయొక్క భుజరాసులను గ్రమముగ ౪౫, ౩౩, ౧౨ చే హెచ్చించి భాగల ననుపాతముచేయవలయును. గ్రహ భుజము ౧ రాశి యైనయెడల ౪౫, రెండురాసు లైనయెడల ౪౫ + ౩౩ = ౭౮, మూడు రాసు లైనయెడల, ౪౫ + ౩౩ + ౧౨ = ౯౦ భాగలు లేక మూఁడయనరాసులు క్రాంతి యగును. శిష్యానుకంపితు లగు పరాశరులు పరమక్రాంత్యంశ లగు ౨౪ ను ౯౦ భాగములుగఁ జేసి యందు మూఁడు రాసులకుఁ బ్రత్యేకముగ మూఁడయనఖండ ములఁ బ్రసాధించి యొసంగిరి. గ్రహభుజమునందు రాసులేకాక భాగలుకూడ నున్నపుడు, ౩౦ భాగల ప్రమాణ మగు రాశికిఁ దదోభోగ్య ఖండోక్త మగు నయనభాగాదు లైన యెడల నిష్టభాగాది కెంత యయనభాగాది యగు నను ననుపాతమున నాభాగలను భోగ్య ఖండ ప్రమాణసంఖ్యచే హెచ్చించి ౩౦చే భాగింపవలయును. ఇట్లు చేయు టలో రాశిస్థానమున శూన్య మున్నయెడల భాగలను ౪౫ చేతను, ౧ ఉన్నయెడల భాగలను ౩౩ చేతను, ౨ ఉన్నయెడల భాగల ౧౨ చేతను హెచ్చించి ౩౦ చే భాగించవలయును. లబ్ధమును గతరాశిఖం డైక్యమునఁ గలుపవలయును. ఇట్లు కలపి ౩౦ చే భాగింపఁగా లబ్ధము రాసులును, శేషము భాగలును నగును. ఇట్లు గ్రహభుజ రాశ్యాది వలన నయనరాశ్యాదిని సాధింపవలయును. ఈ సాధించిన రవికుజ గురుశుక్రుల యయనరాశ్యాదిని సౌమ్యగోళమున, ననఁగా మేషాది రాశి షట్కమున నున్నపుడు ౩ రాసులందుఁ గలుపవలయును. యామ్య గోళమున, ననఁగా తులాదిషట్కమున నున్నపుడు ౩ రాసులనుండి తీసివేయవలయును. చంద్రశనులకుఁ దద్విపరీతముగ యామ్యగోళమున ౩ రాసులందుఁ గలుపవలయును. సౌమ్యగోళమున ౩ రాసులనుండి తీసివేయవలయును. బుధున కుభయగోళములందును ౩ రాసులలోఁ గలుపవలయును. ఇట్లు సంస్కరించినపిమ్మట నారాశ్యాదిని భాగలఁ జేసి ౩ చే భాగింపఁగా షష్ట్యంశాత్మకబలమగును.

ఉపపత్తి.— క్రాంత్యభావస్థానమున సర్వగ్రహములకును రూపార్ధము బలము. అచ్చటనుండి బలాభావస్థానమున కంతరమగు ౩ రాసులచే ౨౪ క్రాంత్యంశ లగుచున్నవి. ౨౪ అంశలచే ౩ రాసు లయిన నిష్టక్రాంత్యంశలచే నెన్ని రాసు లగునను త్రైరాశికముచే క్రాంత్యభావ స్థానములగు సాయనమేషతులారంభములనుండి యయన రాసులు సిద్ధించుచున్నవి. కాని బలసాధనార్థము బలాభావస్థానము నుండి రాశ్యాది తెలిసికొనఁదగియున్నది. సౌమ్యగోళమున రవికుజ గురుశుక్రులకు బలాభావస్థానము క్రాంత్యభావస్థానమునుండి త్రిరా శ్యంతర మధిక మగుటచే రాశిత్రయముఁ గలుపవలయును. యామ్య గోళమున రాశిత్రయమునుండి తీసివేయవలయును. శనిచంద్రులకుఁ దద్విపరీతముగ యామ్య గోళమునఁ గలుపవలయును. సౌమ్యగోళమునఁ దీసివేయవలయును. పిమ్మట ననుపాతవిధి యెట్లన, బలాభావస్థాన మునుండి బలపరమస్థానమున కంతరమగు ౬ రాసులచే రూపబల ముత్ప న్నమగుచుండ నిష్టరాశ్యాద్యంతరముచే నెంత బల మగునని తెలిసికొను టకై యిష్టరాశ్యాదిని ౬ చే భాగింపవలయును. అందులకై యా రాశ్యాదిని లిప్తలఁ జేసి రాశిషట్క లిప్తలచే భాగింపవలయు నని శ్రీపత్యాచార్యోక్త విధమైయున్నది ౬ రాసులు లేక ౧౮౦ భాగల యంతరముచే ౬౦ కలల బలము కావున ౩ భాగల కొకొక్క షష్ట్యంశచొప్పున బల మధికమగుటచే నిష్టరాశ్యాదిని భాగలఁ జేసి ౩ చే భాగింపఁగా నయనబలము షష్ట్యంశలలోఁ దెలియుననుట సుగమోపాయమై యున్నది.

పూర్వోదాహరణమునందు సాయనబుధరాశ్యాది ౧౦-౦-౩౪. భుజరాశ్యాది ౧-౨౯-౨౬. ఇందు రాశిస్థానమునందు ౧ ఉండుటచేఁ బ్రథమఖండమగు ౪౫ అయనభాగ లగుచున్నవి. శేషభాగాదిచే నయనభాగాదిని సాధించుటకై ద్వితీయరాశిప్రమాణమగు ౩౦ భాగ లచేఁ దత్ఖండోక్తమగు ౩౩ అయనభాగ లైనయెడల నిష్టభుజ భాగా దియగు ౨౯-౨౬ చే నెన్ని యయనభాగ లగునను ననుపాతమున ౨౯-౨౬ ను ౩౩ చే హెచ్చించి ౩౦ చే భాగింపఁగా ౩౨-౨౩ అయనభాగాది యగును. దీనిని గతఖండప్రమాణమగు ౪౫ భాగ లలోఁ గలుపఁగా ౭౭-౨౩ అయనభాగాది యగును. దీనిని ౩౦ చే భాగింపఁగా ౨-౧౭-౨౩ అయనరాశ్యాది యగును. ఇట్లు భుజరా శ్యాదిచే నయనరాశ్యాదిని సాధించిన పిమ్మట బుధున కుభయగోళము



1. కీ. శే. జనమంచి వేంకటరామయ్యగారు; 2. కీ. శే. పండిత శ్యామసుందర చక్రవర్తిగారు;
3. కీ. శే. డా. కట్టమంచి కృష్ణారెడ్డిగారు; 4. కీ. శే. శ్రీమతి కల్యాణి వాసుదేవరాజుగారు.

లందును ౩ రాసులఁ గలుపవలయును. కావున నట్లు చేయఁగా ౫-౧౭-౨౩ రాశ్యాది యగుచున్నది. దీనిని భాగలఁజేయఁగా ౧౬౭-౨౩ అగును. దీనిని ౩ చే భాగింపఁగా ౫౫-౪౮ షష్ట్యంశాది అయనబల మగుచున్నది.

"భోగ్యాత్ స్ఫుటాత్ జ్యాఽతిపరిస్ఫుటాఽత్ర" అనఁగా త్రిజ్యాప్రమాణము నెన్నిఖండము లధికముగాఁ జేసిన నంత స్ఫుటముగా ఫలము లబ్ధమగునని సిద్ధాంతశిరోమణియందుఁ జెప్పఁబడిన వాక్యము ననుసరించి యిందు రాశిత్రయమును ఖండత్రయముగ మాత్రమే చేయుటచే త్రిజ్యను నవఖండములుగాఁ జేసిన ఫలముకంటె స్థూలముగా ఫలము లబ్ధమగుచున్నది. కాని "స్వల్పాంతరత్వాచ్చ బహూపయోగాత్ యత్ త్యజ్యతే తన్నతు దూషణాయ" అని చెప్పఁబడిన ప్రమాణము ననుసరించి స్వల్పాంతరమైనను బహూపయోగమగుటచే నిది గ్రహింపఁ దగియున్నది.

## ౪

ఏతత్పరాశరోక్త మార్గముననే సూక్ష్మఫలము లబ్ధమగునటులఁ బద్ధతి ప్రకాశయందు:—

శ్లో. క్రాంతిభాగ గజ (౮) భాగలబ్ధభాద్యైన సంస్కృత గుణాః (౩) ష డుద్ధృతాః, ఆయనం బల మిదం భవే న్మని స్త్వేవ మేవహి పరాశరో జగౌ.

పరక్రాంతియగు ౨౪ భాగలచే ౩ అయనరాసులు గావున నొక్కొక్క భాగచే ౩/౨౪ = ౧/౮ అయనరాశి యగును. కావునఁ గ్రాంతిభాగల ౮ చే భాగించి పూర్వోక్తవిధమున ౩ రాసులందు సంస్కరించి ౬ రాసులచే భాగింపఁగా నయనబల మగుచున్నది. ఇందుఁ గ్రాంత్యంశలఁ బ్రత్యేకముగ సాధించుటవలన ఫలము సూక్ష్మముగనే లబ్ధమగుచున్నది. పైయుదాహరణమునందు బుధుని క్రాంత్యంశాది ౨౦-౪౦ లేక ౬౨/౩. ఇం దష్టమభాగము ౬౨/(౩×౮) = ౬౨/౨౪ = ౩౧/౧౨. దీనిని ౩ రాసులందుఁ గలుపఁగా ౩ ౩౧/౧౨ = (౩౬+౩౧)/౧౨ = ౬౭/౧౨ అగును. దీనిని ౬ చే భాగింపఁగా ౬౭/(౧౨×౬) = ౬౭/౭౨ రూపాదిబల మగుచున్నది. దీనిని ౬౦ చే హెచ్చించిన ౬౭/౭౨ × ౬౦/౧ = ౩౩౫/౬ = ౫౫-౫౦ షష్ట్యంశాదిబల మగును.



పాలకొల్లు పెద్దగోపురము

ఛాయాచిత్రకారుడు: యస్. యస్. రావుగార

# చామెకాంబ

(Monologue)

శ్రీ శివశంకరశాస్త్రి

[మాహేశ్వరాశ్రమము]

వందనం బాచార్యదేవా!
వచ్చినా రెన్నాళ్ళకో మీ
పాదసేవకురాలి నిలయ
ప్రాంగణంబునకున్.

చరణదివ్యపరాగకణముల
శ్రావకీసదనంబు నిన్నాడ
పూత యొనరింపంగ దగదే
భూరికృపతోడన్?

తమకు నెయ్యది యభిమతంబో
దానినే కానిందు దేవా.
కాని ఆతపతాప మిన్నాడ
కలుగు నిలువంగన్.

సాంద్రసహకారావనీజ
చ్ఛాయలో శశికాంతవేదిక
నధివసించి సుభాషితమ్ముల
నాన తీయదగున్.

తాలవృంతము దెత్తు—వలదా?
తరుచ్ఛాయయె చాలునందుర?
వాయుకంపితశాఖికాతతి
వ్యజన మగు గాతన్!

.. .. ..

చేతనైనది చేయ నే సం
సిద్ధురాలను: మీద్గురూత్తము
లింత చెప్పగనేల? ఆనతి
ఈయగా రాదో?

సత్వరంబుగ సంతరించెద
జైనకార్యం బైనచో నది;
శ్రావకీహృది కంతకన్నను
సంతసము కలదే?

తెలుపవలసిన దోక్కొ— విజయా
దిత్యభూపతి కీయుదంతము?
అట్లె చేసెద వచ్చు సప్తా
హమ్ములోపలనే.

బ్రాహ్మణుండును శైవుడయ్యును
పక్షపాతము లేదు ప్రభునకు
సకలభువనాశ్రయోపాధియె
సార్థకం బయ్యెన్.

పరమభట్టారకుడు నరపతి
భక్తితో కాలాముఖాభిధ
శైవగణగురువర్యు విద్యే
శ్వరుని గొనియాడున్.

గౌరవోత్కర్షముగ వలహారి
గణమహాచార్యార్హనందిని
రాజపరమేశ్వరుడు సంద
ర్భముల నుతియించున్.

మోద మొందగ శ్రావకావళి
మున్ను జైనాలయముకోసము
విజయవాటికలోని దానికి
విభుని యానతిపై—

మంత్రి అత్తిలినాటి గ్రామము
మల్లిపూడి లిఖించి యొసగెను.

ధరణివిభున కభిన్నభావమె
ధర్మకార్యములన్.

సకలలోకాశ్రయాభిధమగు
జైనభోజనశాలభృతికై
విజయవాటికవారు రాజును
వేడు మన్నారు.

విన్నవించితి నిన్న రేనికి—
విని సమగ్రముగా నృపాలుడు
శాంతచిత్తముతోడ, చివరకు
సమ్మతం బొసగెన్.

ఆజ్ఞయిచ్చును మహామంత్రికి
నచిరముగ జేయింప శాసన
కార్య—మత్తిలినాటి గ్రామము
కంచుమ ర్రొసగగన్.

ఏగుదెంచితిరొక్కొ— మీరలు
నేతదర్థమె? పరమహర్షము!
శిష్యురాలికి వార్త చాలదె
సేవ చేయింపన్?

ఇందు నన్ను ప్రశంసచేయగ
నేమి కల దాచార్యదేవా!
జనవిభుం డతిసాధుహృదయుడ
స్వతస్సిద్ధముగన్.

అదియు మీ రనినట్లు సత్యం,
బవనివిభు డొకకొంత జైన
ప్రీతి సేయుచునుండు నాపై
ప్రేమమూలమునన్.

స్వీకరించి రసాలఫలములు
శిష్యురాలి ననుగ్రహింపర ?
ధన్యురాలను నేడు యుష్మ
ద్దర్శనమువలనన్ !

అర్హనంద్యాచార్యదేవ ప
దాబ్జయుగళికి మత్ప్రణామము,
దివ్యవలహారిగణమునకు నతి
తెలుప వేడెదను !

. . . . . .

సెలవు గైకొనుదాన—నిలుతున ?
చిత్త మట్లే చెప్పవచ్చును.
కోప మేటికి కలుగు నస్మ
ద్గురు నెదుర్కొలకున్ ?

అవును, సకలశ్రావకీగణ
మ్మప్రతిష్ఠకు తావలం బగు
ఉన్న యెడల న్నన్ను బోలిన
దొరకతె యైనన రే.

నన్ను గాంతురయేని లోకులు
నవ్వుచుందురు, విశేషమ్ముగ
బ్రాహ్మణుల్ గణియింత్రు ధర్మ
భ్రష్టురాలినిగా.

ఒరులనిందలు నన్ను నాచా
ర్యోత్తమా, బాధింపనేరవు
చిత్తవృత్తులు నిరోధించితి
సిగ్గు విడనాడి.

ప్రకృతవర్తనముం ద్యజించిన
పడయుదును సద్యోయశస్సును
కాని, అయ్యది నాకు సాధ్యము
కాదు గురుదేవా !

శుభదినమ్మున నేను త్రికరణ
శుద్ధిగానే యైతి శ్రావకి
నదియె హేతువు జైనధర్మము
ననుసరించుటకున్.

మీరు విజితేంద్రియులు ధర్మము
మీరరాదని బోధచేసెడి
పథమునందు జరింతునేనియు
భ్రష్ట నెట్లగుదున్?

సాధ్యమా మీ రన్నయది యా
చార్యదేవా, నాకు నిప్పుడు ?
చిత్తదౌర్బల్యంబు లక్ష్యము
నేయ బ్రార్థింతున్ !

మార్పుగాంచుట యెట్లు ప్రస్తుత
మార్గమును విడనాడి ? వైరా
గ్యమ్ము లేనేలేదు భోగప
రాయణత్వమునన్.

పొంద దెన్నడు నూనముగ నుప
భోగమున కామమ్ము శాంతిని
మనువు చెప్పినయటు హవిస్సున
మండు వహ్నివలెన్.

కాని రూపారోగ్యసంపద
గలిసి నాకు కఠోరయౌవన
మఖిలభోగ్య పదార్థజాతం
బమరియుండంగన్.

ప్రథితచాళుక్యాన్వవాయుడు
పరమభట్టారకుడు శ్రీమ
ద్రాజపరమేశ్వరు డఖండిత
రాగభరితుండై—

అఖిలసుఖముల దేల్చి నను ప్రా
ణాధికమ్ముగ జూచుచుండగ
అన్యకరణీయంబు తోచునె
అబల కాచార్యా !

చిత్త, మేటికి నాకు కోపము ?
సిగ్గుతో పనియేమి ? విజయా
దిత్యుకె ట్లుపపత్ని నైతినో
తెలుపగలదానన్.

నిర్ణయింతురుగాక మద్దయ
నీయవృత్తాంతంబు గురువర,
అవధరించి సవిస్తరమ్ముగ
నందు దోషంబున్.

. . . . . . . . .

పట్టవర్ధనివంశమున నా
ప్రభవ, మస్మద్వంశజాతులు
ప్రథితవర్తనులౌ నియోగ
బ్రాహ్మణోత్తములు.

అందు కొందరు వేదవేదాం
గాదు లధ్యయనమ్ము చేసిరి
మరియు కొందరు కలరు దర్శన
మర్మపారగులున్.

యజ్ఞదీక్షితు లొక్క కొందరు
నధికనైష్ఠికు లొక్క కొందరు
మరియు కొందరు రాజపురుషులు
మంత్రిసత్తములున్.

కలదు కొంతధనమ్ము, భూములు
కలవు, మజ్జనకుండు విబుధుడు
గౌరవంబుగ జేయుచుండెను
కాలయాపనమున్.

చెప్పుచుండును రెండువేళల
శిష్యసంఘంబునకు పారము,
కావ్యచంపూనాటకాలం
కారశాస్త్రంబుల్.

పురుషసంతానమ్ము కలుగక
పోవుటన్ జనకుండు నన్నే
పూర్ణవాత్సల్యమున బెనిచెను
పుత్రభావమునన్.

భాగములు రామాయణమ్మున
పంచతంత్రము చెప్పి జనకుడు
క్రమక్రమముగ జొప్పదొడగెను
కావ్యపాఠంబున్.

నాకు పదుమూడేండ్లు నిండగ
నాల్గు కావ్యములం బఠించితి
అర్థ మేలాగయిన, శబ్దం
బవగతం బయ్యెన్.

నాకు పుత్రీకృతకు వ్యాకర
ణమ్ము చెప్పినవాడు మత్పిత

ప్రాకృతమ్ములగూడ నించుక
పాటవం బొదవన్.

సంతసమ్మున కాల మీాగతి
జరుగుచుండగ నొక్కయామిని
జనని పంచత్వంబు నొందెను
సర్పదంశమునన్.

రేయుబవలును జనకు డంత
శ్లీనదుఃఖహుతాశనమ్మున
కుమిలి యారోగ్యమ్ము క్రమముగ
కోలుపో జొచ్చెన్.

విగతభ ర్తృక నాపితృష్వస
విజయవాటికనుండి వచ్చెను
మాతృమరణానంతరమ్మున
మాగృహమ్మునకున్.

ఆమె పూనిశదాది మాగృహ
యాజమాన్యము తండ్రిగారికి
క్రమక్రమముగ స్వాస్థ్య మెట్లో
క్రమ్మరిల సాగెన్.

జైనధర్మమునందు నామెకు
చాల యభిమానంబు కల్గుట
'అర్థకథలం' జెప్ప నాయమ
ఆలకించితిమి.

తండ్రిగారికి చిత్తపరివ
ర్తనము కల్గెను విన్నకొలదిని
జైనధర్మం బెరుగు నభిరతి
సంజనిత మయ్యెన్.

శ్రీమహాచార్యార్హనందివి
శేషధార్మికు డని తదంతిక
గతుడు మజ్జనకుండు సూత్ర
గ్రంథముల్ దెచ్చెన్.

భార్య పోయినదాది శిష్యుల
బంపి పాఠనముం ద్యజించెను.
మాగృహంబున కొక్క ఛాత్రుడు
మాత్ర మరుదెంచున్.

కలిసి యుభయులు జైనసూత్ర
గ్రంథముల్ పఠియించుచుండగ
క్షణముపోలిక నొక్కవర్షము
గడచి పోయినది.

అర్హనంద్యాచార్య్య సన్నిధి
కప్పుడప్పుడు వారు పోదురు
సంప్రదాయరహస్యవివరణ
సంగ్రహణబుద్ధిన్.

కొంత శ్రుతపాండిత్య మల్లన
కుదురుకొనగా నేను జైన
ప్రాకృతంబును నేర్చికొంటిని
బహుతరశ్రద్ధన్.

జాగరూకతతో లిఖించితి
జైనసూత్రమ్ములకు ప్రతులను
ఉభయు లుత్సాహ మ్మొసంగుచు
నుండ ననుదినమున్.

అధికవాత్సల్యమ్ము శిష్యుని
యందు జనకున కుద్భవించెను
సేవచేయుచు నుండు నొజ్జకు
శిష్యు డాదృతితో.

చాల యోగ్యుం డావయస్థుడు
సహజసుందరమూర్తి. ఆతని
యందు లగ్నంబయ్యె నామన
మప్రయత్నముగన్.

యౌవనోదయకాలమున నా
కతని సాన్నిధ్యము లభించుట
వలన, గూఢముగా జనించిన
వలపు దృఢ మయ్యెన్.

దాటె నాకు చతుర్దశాబ్దము:
తండ్రి, శిష్యుడు, నేను జైన
గ్రంథముల్ పఠియించుచుంటిమి
గాఢతత్పరతన్.

నడుమనడుమను మత్పితృష్వస
నావివాహముమాట యెత్తిన,
చేయవచ్చునులే యటంచును
చెప్పు జనకుండున్.

శిష్యునకు నన్నిచ్చి పెండిలి
చేయు పిత యను తలపు నాకును
అత్తకును స్ఫురియింప, పరమా
హ్లాద మొందితిమి.

కడచుచుండగ నిముషసమముగ
కాల మీాగతి, వయసు వచ్చెను
నాకు, లజ్జయు నుద్భవించెను
నాటనుండియును.

అతడు నేనును కలిసి చదువుట
యాగిపోయె; మదీయయౌవన
వశమునం జనియించె నతనికి
వలపు నాపైదన్.

అంత నత డొక ప్రదోషంబున
నరుగుదెంచి రహస్యసరణిని
తెలిపె నాయెడ దనకు గల యు
ద్వేలరాగంబున్.

తెలిపితిని మేనత్త కానిశి,
తెల్లవారినవెనుక విని పిత
సమ్మతించె వివాహయత్నము
సలుప శీఘ్రముగన్.

ప్రాకిపోయెను పట్టణంబున
పరిణయోదంతంబు వేగమె:
అతని జననీజనకు లొందిరి
అధికసంభ్రమమున్.

వారు తలచిరి మేము వైదిక
వైరి జైనమతమ్ము చాటుగ
స్వీకరించితి మనియు, పుత్రుని
చెరపెనా మనియున్.

తనయు డెన్నివిధాల చెప్పిన
తల్లిదండ్రులు వినక, యతనిని
మాగృహమ్మున నడుగుపెట్టుట
మానుకొ మ్మనిరి.

తల్లిదండ్రుల ధిక్కరించెడి
ధైర్య మతనికి చాలకుండుట
మంత్రరుద్ధంబైన భుజగము
మాడ్కి నత డుండెన్.

సహజకోమల మైన యస్మ
జ్జనకు మనసు చివుక్క మనియెను,
వదనబింబము నాడునాటికి
వాడిపో దొడగెన్.

పట్టణంబున నన్ గురించిన
పరీవాదము బహువిధమ్ముల
దుష్టముఖముల వ్యాప్తిచెందెను
దుర్నివార్యముగన్.

క్రమక్రమముగ లోకనిందలు
కర్ణగోచర మైనకతమున
దుస్సహాంతర్వేదనా దో
దూయమానసుడై —

చివరపర్యాయమ్ము యత్నము
చేసి చూచి ఫలమ్ము లేదని
అతడు తన జామాత యగు నన
నాశ విడనాడెన్.

అన్యు బెండిలియాడనని మే
నత్తతో నే జెప్పదానను
అతనిమీదనె గాఢరక్తియు
నాశ యుండుటచే.

ఆతలంపులు విడువు మని నా
కఖిలవిధముల బోధచేసెను
తండ్రి; నాలో నేమి పరివ
ర్తనము లేదాయెన్.

ఇట్టు లుండగ బహిష్కారం
బింతలోనే ధాపురించిన
కారణంబున తండ్రి చింతా
క్రాంతు డైపోయెన్.

కడకు మంచముపట్టి యాయన
క్రమముగా శుష్కించి హృద్రో
గమ్ముచే నొకనాడు పొందెను
కాలధర్మంబున్.

వర్ణనాతీతంబు నాదుర
వస్థ! జ్ఞాతిజనంబుచేతను
ఒదవె నలజడి, తుదకు మెల్లన
నొడ్డనం బడితిన్.

అవల దెలిసెను నేను వలచిన
యతడు నిరతము తల్లిదండ్రులు
పెట్టు పోరు భరింపజాలక
పెండ్లియాడె నని.

దానితోడన శిథిలమయ్యెను
ధైర్యకంచుక, మనిర్వాచ్య
వ్యథాభరమున క్రుంగిపోయితి
వాడుటాకువలెన్.

బహుదినమ్ములవరకు మంచము
పట్టియుంటిని; నాపితృష్వస
సలుపు నుపచారముల నూతన
జన్మ మెత్తితిని.

కలిగె నారోగ్యంబు, తోడనె
గాఢవైరాగ్యంబు పొడమెను
ఆంతరంగిక దుఃఖతత్త్వం
బవగతం బగుటన్.

చిత్తశాంతి యొసంగుచుండుట
స్వీకరించితి జైనధర్మము,
అవల శ్రావకినైతి పెండిలి
యం దనిష్టముచే.

కామశబ్దమె తలప కెన్నడు
గడపినా నేడేండ్లు కేవల
ధర్మమార్గమునుండి లవమును
దాటిపోకుండన్.

కాని విజయాదిత్యభూపతి
కాంచె నశ్వారూఢుడై యా

వృశ్చికమ్ముగ నొక్కరోజున
దివ్యనయనములన్.

అంతవరకును గాఢరుద్ధం
బైన హృదయకవాట మాసా
యాహ్న వేళను తెరవబడినది
అప్రయత్నముగన్.

పంపె మరునా డొక్కదూతిక
ప్రభువు నాకడ, కతని కోర్కికి
సమ్మతింపగ నైతి దలచుచు
శ్రావకీవృత్తిన్.

కాని మానస మవశమయ్యెను
కామమోహితనయ్యు, క్రమ్మర
నేగుదెంచిన రాజశంభళి
కిట్లు చెప్పితిని:—

"నిశ్చయమ్ముగ రాజమౌళికి
నిండుప్రేమమె యున్న నాపై,
ధర్మపత్నిగ నన్ను జేకొన
దలపగా రాదో?"

పరిణయోద్యమునందు గల ప్రతి
బంధకమ్ముల దెల్పి యాయమ
"ప్రభువు నిను భావించు మదిలో
భార్యగా" ననియెన్.

నాటనుండియు నాదరించుచు
నన్ను భూపతి పత్నివోలెను
ప్రేమమున లాలించు నెంతయు
పెండ్లి కాకుంటన్.

ప్రభుని త్రికరణశుద్ధిగా నే
భర్తగా భావించుచున్నా,
నైన లోకము సత్య మెరుగక
యన్యథా తలచున్.

పూనియుండును లోకసంగ్రహ
బుద్ధి సాంఘికనియమనిగళము
సడలజేతురు దాని నెడనెడ
సాహసోన్మత్తుల్.

ధర్మతత్త్వము గుర్తెరింగిన
తమము విదితమె, వ్యావహారిక
దృష్టి సూక్ష్మవిశిష్టధర్మము
దెలిసికోగలదా?

తమ యనుగ్రహ మున్న జాలును
దర్శనమ్మ నొసంగుచుండుడు
శిష్యురాలికి దేశికోత్తమ,
సెలవుగైకొందున్.

అర్హనంద్యాచార్య దేవప
దాబ్జయుగళికి మత్ప్రణామము,
దివ్యవలహారిగణమునకు నతి
దెలుపవేడెదను!

.. .. ..

[ఒకమాట

ఈఖండకావ్యము చెప్పినప్పుడు నావద్ద చరిత్రగ్రంథాలు లేవు. భావరాజు కృష్ణారావు, చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసినవ్యాసాల సారాంశమే స్మరణలో ఉన్నది. ఇటీవల మల్లంపల్లి సోమశేఖరశర్మగారితో మాట్లాడితే చరిత్రాంశాలలో కొన్ని భేదాలు తెలిసినవి. కవి ప్రతిచరిత్రాంశమూ తూచాతప్పకుండా అనుసరించవలసిన అవసరము లేదు. ఇప్పుడు కావ్యము మార్చలేను. మిత్రరత్నము సోమశేఖరశర్మగారు శాసనములో ఉండేపంక్తులు చదివి వినిపించారు; అవిమాత్రము ఉదాహరించిఊరుకొంటాను.

శాసనము

( ఆర్యాగీతి )

అడ్డకలిగచ్ఛనామావలహారిగణప్రతీతవిఖ్యాతయశాః ।
చాతుర్వర్ణ్యశ్రమణవిశేషాన్నశ్రాణనాభిలషితమనస్కాః
శ్రీరాజచలుక్యాన్వయపరివారితపట్టవర్ధికాన్వయతిలకా ।
గణికాజనముఖకమలద్యుమణిద్యుతిరిహహిచామెకాంబాభూత్ సా ॥

జినధర్మజలవివర్ధనశశిరుచిరసమానకీర్తిలాభవిలోలా ।
దానదయాశీలయుతాచారుశ్రీఃశ్రావకీ బుధశ్రుతనిరతా ॥

యస్యా గురుపంక్తి రుచ్యతే-
సిద్ధాంతపారదృశ్వా
ప్రకటితగుణసకలచంద్రసిద్ధాంతమునిః ।

తచ్ఛిష్యోగుణవాన్ప్రభు
రమితయశాస్సుమతిరయ్యపోటిమునీంద్రః ॥

( స్రగ్ధర )

తచ్ఛిష్యాయార్హనంద్యంకితవరమునయే చామెకాంబా సుభక్త్యా
శ్రీమచ్ఛ్రీసర్వలోకాశ్రయజినభవనఖ్యాతసత్రార్థముచ్చై
ర్వేంగీనాథామ్మరాజే క్షితిభృతి కలుచుంబఱ్ఱుసుగ్రామమిష్టం
సంతుష్టా దాపయిత్వా బుధజనవినుతాం యత్ర జగ్రాహకీర్తిమ్ ॥ ]

---

# ౯. వైద్యము

## ప్రాచీన శస్త్రశాస్త్రము

డా. జటావల్లభుల వెంకటేశ్వర్లుగారు

కాలవశమున భారతీయులు తమలోనుండు మహైశ్వర్యమును గుర్తించలేకపోవుట పరిపాటి యగుటయేకాక మనలోనున్న మహాశాస్త్రవిషయములు సర్వదేశమార్గదర్శకములనియు, సర్వోత్కృష్టములనియు నితరదేశీయపండితులు మనకు చెప్పి మనలను మేల్కొలుపవలసి వచ్చుచున్నది.

భారతీయవైద్యశాస్త్రమునందు శస్త్ర చికిత్సనుగూర్చి వ్రాయబడి యుండలేదనియు, అది యాంగ్లేయుల రహస్యధనమనియు నిప్పటి పలువురి యభిప్రాయము. పాశ్చాత్యవాసనా సంప్రాప్తమగు వ్యామోహమే ఈయభిప్రాయమునకు కారణము. కాని ఆంగ్లేయ వైద్యశాస్త్రమునకు భారతీయవైద్యమే మూలమనియు, ఆయుర్వేదము నుండియే పాశ్చాత్యులు శస్త్రవైద్యమును నేర్చుకొని యుండిరనియు మరికొందరి యుద్దేశము. అది సరియైనట్లు తోచదు. అట్లనుటచే భారతీయ వైద్యమున కెక్కుడు గౌరవమును లభింపదు. ఆంగ్ల, ఆయుర్వేద వైద్యశాస్త్రములయొక్క ప్రాచీనోత్పత్తిలోనే భేదము గన్పట్టుచున్నది. ఆంగ్లేయవైద్యశాస్త్రము క్రమపరిశోధనలచే నిర్మింపబడినదని యూహింపవచ్చును. కావుననే దానికి సంపూర్ణత్వమలవడక ఇంకను నూతన విషయముల నందు చేర్చుట తటస్థించుచున్నది. కావున పాశ్చాత్యవైద్యమునందలి కొన్ని సిద్ధాంతములు నవీనశోధనలచే మార్పుచెందుటయు, మరికొన్ని నవీనము లుత్పత్తి యగుటయు గల్గుచున్నది. ఆవిధముగ నిప్పటివరకును ఆంగ్లేయ వైద్యమునందలి సిద్ధాంతములు మార్పునొందుచునే యున్నవి.

కాని యాయుర్వేద మట్లుత్పన్నము కాలేదు. మహాత్ములును, యోగనిష్ఠులును నగు ఋషీశ్వరులు యోగదృష్టిచే సకలవిషయములను గనుగొని వ్రాసియుండిరి. అందుచే నాసిద్ధాంతముల కిక మార్పులేదు. ఆయుర్వేదమునందలి యేవిషయముగాని ప్రస్తుతపరిశోధకులకు వ్యతిరేకముగ నున్నట్లగపడదు. ఆంగ్లేయులు తాము స్వపరిశోధనలచే నిపుడు గనిపెట్టితిమను విషయములు కొన్నివేల సంవత్సరములకు పూర్వమే భారతీయులచే గనుగొనబడియే యున్నవని యప్పటి గ్రంథములను బట్టి నిర్ణయింపవచ్చును.

అట్లు మహర్షులచే నిర్మింపబడిన భారతీయ వైద్యమునుకూడ రెండుభాగములుగ విభజింపవచ్చును.-(౧) ఔషధ చికిత్సాభాగము, (౨) శస్త్రచికిత్సా భాగము. ఇందు ఔషధ చికిత్సా భాగమును విశదముగ అగ్నివేశుడు మొదలగువారు వ్రాసియుండిరి. అం దిప్పుడు ప్రధానగ్రంథము చరకము. శస్త్రచికిత్సను గూర్చి విశదముగ వ్రాయబడి ప్రస్తుతము లభించుచున్న గ్రంథములలో సుశ్రుతము మొదటిది. ఇది సుశ్రుతునిచే వ్రాయబడినది. ఇదికాక శస్త్రచికిత్సను విశదీకరించు గ్రంథము లనేకములు పూర్వము వ్రాయబడి యుండవచ్చును. కాని ప్రస్తుత మింతకన్న శ్రేష్ఠమైనది మరొకటి లభించుటలేదు. ఇందు శస్త్రచికిత్స యంతయు సంపూర్ణముగ వ్రాయబడినది. ఈమహాగ్రంథము నిప్పటి భారతీయుడు కాంచినచో తన యసామర్థ్యమునకు కనుల నీరు గార్చక మానడు. అనేకవిధములగు యంత్రములును, శస్త్రములును, వాటి యాకారమును, పరిమాణమును, వాటి నుపయోగించు విధానములును, వ్రణాదిచ్ఛేదన విషయములును, తత్తద్భేదములును ఈగ్రంథమునందు విశదముగ వ్రాయబడియున్నవి. ఇందు వ్రణములను గూర్చి వ్రాసిన భాగములో ననేకములగు విధానములును, వ్రణములకు ఆలేపము, పరిషేకము మొదలగు ౬౦ విధములగు చికిత్సాభేదములును, వాటివాటికి తగిన కాలమును వివరముగ వ్రాయబడియున్నవి. శరీరమునందున్న దుష్టరక్తమును వెలిపరచు విధానము లతివిపులముగ వ్రాయబడియున్నవి. వాటి నిపు డాచరణయందుంచు భాగ్యము భారతీయులకు గలుగలేదు. శరీరములో నుండు ఎముకలు విరిగినప్పుడును, కపాలము మొదలగునవి బ్రద్దలయినప్పుడును చేయవలసిన విధానములు, కట్టవలసినకట్లు, మూలవ్యాధి మొదలగు వాటిని క్షారాదులచే కాల్చి నివారించు విధానములు గూడ స్పష్టముగ వ్రాయబడి యున్నవి. శరీరమున గ్రుచ్చుకొనియున్న బాణాదులను

లాగు విధానములును, వాటికై యుపయోగించు యంత్రముల స్వరూపములును, లోన విరిగియున్న శల్యముల లక్షణములును, వాటిని తీయు సాధనములును, ౭౮ విధములగు యంత్రలక్షణములును, ౨౦ విధములగు శస్త్రములును, ఉపయంత్రములును, తత్తద్యోగములును నీగ్రంథమున విశదముగ వ్రాయబడియున్నవి.

అందు వర్ణింపబడిన శస్త్రాదిసాధనముల నిపుడు నిర్మించువారెవరును లేరు. అట్టి యూహగలవారుకూడ నుండుట తక్కువ. ఆగ్రంథమునందు వర్ణింపబడిన వ్రణాదిబంధనపట్టములును, గ్రంథ్యాదిజ్ఞానోపాయములును నిప్పుడు మృగ్యములు. ఆవిషయముల నన్నింటిని గ్రహించి వాటి నాచరణయందుంచి పూర్వౌన్నత్యమును వెల్లడిచేయుటయే ప్రస్తుతవైద్యుల కర్తవ్యము. భారతీయవైద్యమునందు శస్త్రచికిత్సను గూర్చి వ్రాయబడియే యుండలేదని తలంచువారేగాని యాయుర్వేదవైద్యు లావిషయముల నాచరణయందుంచుటలేదని తలంచువారు తక్కువమంది కలరు. దీనిచే వైద్యులకు గలుగవలసిన యప్రతిష్ఠ వైద్యశాస్త్రమునకే గలుగుట సంభవించుచున్నది. ఇప్పటి యాంగ్లేయ వైద్యశాస్త్రమునందు గల విషయములకన్న ఆయుర్వేద శల్యతంత్రమునందు అనేకమహావిషయములు నేర్వదగినవి కలవని పాశ్చాత్య వైద్యశాస్త్రజ్ఞులే యంగీకరించుచున్నారు.

పూర్వగ్రంథములలో నట్లు వ్రాయబడియున్నదే కాని యాచరణయందప్పుడును లేదని వచించుట కెంతమాత్రమును వీలులేదు. పూర్వము ఆయుర్వేదమునందలి శస్త్రచికిత్స ననుసరించి భారతీయులు ఇప్పటి యాంగ్లేయవైద్యులకన్న శ్రేష్ఠముగ శస్త్రచికిత్స గావించుచుండిరని కొన్ని ప్రబలములగు కారణములను చూపవచ్చును. అందు భాగవతమునుండియు, రామాయణమునుండియుగూడ రెండుదాహరణముల నిచ్చుట నిచ్చుచున్నాను.

భాగవతమునందు హిరణ్యకశిపుడు ప్రహ్లాదునిగూర్చి వచించు మాటలలో,

శా. అంగవ్రాతములో చికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్షసేయుక్రియ నీ యజ్ఞున్ కులద్రోహి ని
న్సంగున్ కేశవపక్షపాతి నధముంజంపించి.........

భావము—శరీరమున నేదేనొక యవయవము చెడిపోయినప్పుడు వైద్యుడాభాగమును ఖండించి మిగిలిన శరీరమును రక్షించువిధముననే కులమునకు చెడుగా బుట్టిన ప్రహ్లాదుని వధించి నావంశమును నిర్దుష్టముగ జేతును.

హిరణ్యకశిపుని కాలములో నున్నట్లును, ఈమాటలు హిరణ్యుడు ప్రహ్లాదునితో చెప్పినట్లును నమ్మకపోయినను ఈపురాణమబద్ధమని వాదించువారును ఈపద్యమును వ్రాసిన కవికాలములోనైన నీశస్త్రచికిత్స జరుగుచుండెనని రూఢిగా నమ్మితీరవలెను.

ఇంతకన్న మరియొక నిదర్శనముచే నీవిషయమును ధ్రువపరుపవచ్చును. హిందువు లందరికిని ముఖ్యమైన రామాయణమునే పరీక్షింపుడు—సీత హనుమంతునితో నిట్లు చెప్పుచున్నది—

శ్లో. నూనం మమాంగా న్యచిరా దనార్య
శ్శస్త్రైశ్శితై శ్ఛేత్స్యతి రాక్షసేంద్రః,
తస్మిన్న నాగచ్ఛతి లోకనాథే
గర్భస్థజంతోరివ శల్యకృంతః.

భావము—రాముడు సకాలమునకు రానిచో, శస్త్రచికిత్సను చేయువాడు గర్భములోనున్న మృతశిశువు నేవిధముగ ముక్కలు ముక్కలుగ చేయునో యట్లే రావణుడు శస్త్రములచేత నాయవయవములను ఖండించును.

ఈశ్లోకభావమును గాంచినవారు ఆంగ్లేయులే శస్త్రచికిత్సను మన దేశములోనికి గొనివచ్చిరను భావమును విసర్జించుటయేకాక భారతీయవైద్యశాస్త్రము ననుసరించియే పూర్వము గర్భచ్ఛేదనాది మహాశస్త్రచికిత్సలుకూడ జరుగుచుండెనని తెలిసికొనగలరు.

ఇదికాక ఆంగ్లశాస్త్రజ్ఞుల వ్రాతలనుబట్టికూడ మన పూర్వశక్తిని మనము స్మరింపవచ్చును—

"శస్త్రచికిత్సలోకూడ భారతీయులు విశేషపాండిత్యమార్జించిరి నేడుకూడ యూరోపియనులు వారియొద్దనుండి కొంత నేర్చుకొనదగును."

అని వేబరు వ్రాసెను.

"ఆధునికకాలములో యూరోపియనులు భారతీయులనుండి కృత్రిమపునాసికల నేర్పరచు విషయమును నేర్చుకొనిరి."

అని మాగ్డొనెల్ వ్రాసెను.

ఈరీతిగ పాశ్చాత్యులే మన శాస్త్రమునుగూర్చి వ్రాయుచుండగ మనమే విగతపాండిత్యశక్తిగలవారమై, విస్మృతప్రాచీనవైభవముగలవారమై యాంగ్లేయవైద్యమును బట్టి దానినే శరణని సేవించుటకన్న చిత్రమేముండును? గుప్తమైయున్న మన శాస్త్రవిషయముల నిపుడు పునరుద్ధరించి యాచరణయోగ్యములుగ జేయుటకై పాలకులు పూనుకొనరు. ఏమాత్రమైన నాంగ్లేయవాసనాసమాయుక్తుడగు హైందవుడీపనికి పూనుట యరుదుగ నున్నది. విలాసాదిభోగపరాయణులగు ధనికు లీవిషయములను స్మరించుటయే లేదు. ఇకనిట్టి విషయముల నుద్ధరించుపని సంఘముదైయున్నది. వైద్యసంఘమే దీనినిగూర్చి యత్నింపవలెను. సర్వజనులును మన ప్రాచీనశస్త్రశాస్త్రమును గూర్చి కృషిచేయవలెను. క్రమముగ ప్రతిభారతీయునకును తమలోగల శక్తిని గ్రహించునంతటి యదృష్టమైనను పట్టవలెను. అందులకై భగవంతుడు తోడ్పడుగాక.








1. నరాలసెట్టి దేవేంద్రుడుగారు - సప్తమ ఆది ఆంధ్రమహాసభ ఆహ్వానసంఘాధ్యక్షులు; 2. కమతం షణ్ముఖంగారు - ఆదిమాంధ్ర మహాసభాధ్యక్షులు; 3. కృష్ణాజిల్లా ఆది ఆంధ్రసంఘము, బందరు.

# శ్రీరామకృష్ణతారమాలిక*

వెదురుమూడి వెంకటకృష్ణారావు గారు

శ్రీయని వాణియంచు మఱి శీతనగాత్మజయంచు రేబవ
ళ్లేయమృతాత్మశక్తి భజియించి త్రిమూర్తు లవార్యశౌర్యధౌ
రేయులరై జగాల నలరించుదు రట్టి పరాత్పర ప్రభా
వాయతమూర్తి! తావకసుహాససుధోర్ముల నూగగోరెదన్.

ఎన్నోదీర్ఘయుగంబు లైనటులు నాహృత్పద్మకోశంబు నే
డెన్నన్ రాని ప్రమోదనీరనిధియై యేపార నుప్పొంగెడున్
కన్నుందోయియు బాష్పవారివృతమున్ గాజొచ్చె నేమందునో
అన్నా, కల్గెను నీదుసన్నిధి నిధానైశ్వర్య మిన్నాళ్లకున్.

బాలానందవశీకృతాంచితమతిన్ భవ్యార్థదంబైన నీ
లీలామానవసచ్చరిత్ర గని, యేలీలం బ్రవర్తించియున్
నీలాగౌటయె జీవితావధిగ నే నిక్కంబుగన్ నమ్మి నీ
వేలన్ జెల్లునటంచు నిచ్చితిని నాడే యీశరీరాత్మలన్.

బాలుండనియే నను నీ-కేలుందోయిని నిడికొని కృపమీఱగ నె
వ్వేళన్ గాచుచునుంటివి-గాలిదుమారములలోన గాసిలకుండన్.

నాకనులదేమొ యేమఱి-లౌకికభోగమృగతృష్ణలపయిన్ జన "న
ల్లేకాని, యాండుకో!" యని-యీకరణి మఱుగున నవ్వ చీవు నిలిచితే!

గాజుపూసల జూచి కౌస్తుభమణులంచు నెదఁ దలంచి పరుగులెత్తియెత్తి
కింశుకతతుల వీక్షించి దివ్యసుమంబులే యవియని యెంచి యెగిరియెగిరి
రంగురంగుల బొమ్మరాలెల్ల మధురఫలములటం చూహించి నమలినమలి
రమణీయవిషనదు లమృతవాహినులంచు భ్రమసి తజ్జలములన్ ద్రావిత్రావి

---

* ఒక నెలలోపున చెన్నపురియందలి శ్రీరామకృష్ణమఠమువారి ప్రచురణగ వెలువడనున్న 'శ్రీరామకృష్ణ లీలామృతము' అను శ్రీరామకృష్ణపరమహంసదేవుని జీవితచరిత్రానువాదపు పీఠికలోనుండి ఈపద్యములు సంగ్రహింపబడి యిచట పొందుపఱుపబడినవి.

కాళ్లునొప్పులెత్త, మెడకూకటులు విరుగ-నాల్క రక్తాలు కార, ప్రాణంబు లదర
కనుల నీరునించి, సకలకర్మసాక్షి!-ఎంత నిను స్మరించితినో, నీవే యెఱుగవె?

వ్యర్థవిషయానురక్తిమై ప్రాయ మకట!-కడచె బహువత్సరము లిట్లు, పుడమి బ్రతుకె
యిస్సిరో యనిపించె నికేమి చెప్ప!-తండ్రి! దీనజనావనధర్మమూర్తి!

నిన్నుబోలు శ్రీమంతుల చిన్నిపాప - నకట! న న్నిట్టి అసురమాయలకు విడచి
నవ్వులాటగ శోధింప న్యాయమగునె? - నవవికచమల్లికాప్రసూనమృదుహృదయ

తల్లిదండ్రులు, ప్రాణమిత్రంబు, గురుడు, - ధనము, జ్ఞానము, నాసమస్తంబు నీవె
కన్నకడు పీవెయని నమ్మ చిన్నవాడ; - నే తపింప నీకేమి పెన్నిధి దొరకుర!

మంచిచెడ్డ లారయలేని మందబుద్ధి - నిలిచి తపసుచేయగలేని నీరసంబు
వాగతీత! నిన్ బిల్వంగ వాయిరాదు - కూనల నిటుల్ పరీక్షింప గొప్పయౌనె?

కడకు నేటికైనను దయకల్గె జాలు! - పనిముగిసె గదా వీడేల యనుచు నన్ను
విడతువేమొ! నీచేదోడు విడచి యొంటి - నడుగిడి నిలువజాలని బుడుతనుజుమి!

కోటిపిల్ల లున్న మేటివనెడి ఖ్యాతి - మొక్కవోవకుండ భువిని నేడు
విశ్వమాతృభావవిభవంబు జూపింప - వచ్చిన హరివనుచు మెచ్చుకొందు.

పదియేండ్లయిన లేని బాల్యాన బుధుల మెప్పించు ప్రతిభ ప్రకటించినావు
చూపుమాత్రాన మహాపాపులనుగూడ ఋషివర్యులుగజేసి యొసగినావు
తలపుచే బండమొద్దులనైన విజ్ఞానదివ్యతరులుగాగ దిద్దినావు
కాలదన్నెడు గర్వలోలుర శీర్షముల్ వంచి భారతికి మ్రొక్కించినావు
సందియం బేల? ఓ సర్వశక్తిమూర్తి! - ఘోరసంక్షోభమగ్నమై కుంగి క్రుంగు
ధాత్రికిన్ శాంతిజేకూర్ప తనువుగొనిన - విశ్వనాథుని దయవీవ! ప్రేమరూప!

హరివో, హరుడవో నీమహత్త్వంబు తెలుప-బ్రహ్మకును, వాని వేదవర్గమునకైన
నలవికాదన్న ప్రాజ్ఞ తావంతలేని-నన్నుబోలు పాపల నింక నెన్ననేల?

అయిన నీమహాకృతికి నవ్యాజకరుణ-నన్నె నియమించినావుర, కన్నతండ్రి
కార్యమా నీది, భారమా కడకు నీదె-సర్వజీవేంద్రియాధారశక్తిరూప!

దుస్తరాగాధసింధువుల మూలల నెల్ల కలచివైచి వెదుకగలనె నేను?
దేవతానీకమున్ గావగా మూపున బెనుకొండ మోయంగ వీలె నాకు?
స్తంభాలలో డాగి శరణార్థులను బ్రోవ సింహమగుటలు నాచేతనౌనె?
కపటయాచకుడనై ఘనచక్రవర్తుల నడుగంట నే నెట్లు లణపగలను?

గొడ్డటను దుష్టరాజులన్ గూల్పగలనె? పదితలల రక్కసుల గెల్చు బలము కలదె?
ఫణిఫణాగ్రములం దాడు ప్రతిభ యున్నె?-బుద్ధులను నేర్పునన్ ద్రిప్ప బుద్ధుడనొకొ?

పతితపావనచణ పాదపద్మములను - తలల మోపి నరులనైన దైవసముల
జేయు శ్రీరామకృష్ణ! నీ స్నేహకళలన - భవదురమున ప్రాకి బ్రతుకు బాలుడసుమ

నీపనులను జేసికొనంగ నీవె కలవు - నిన్ను మెచ్చ నీభువనశ్రేణి తనరారు;
గొడవ లివి యింక నాకేల? కూర్మి నన్ను - సతము నీనవ్వువెన్నపై బ్రతుకనిమ్ము!

మేనిసువర్ణకంకణపు మెర్పులమీఱు శరీరకాంతితో
మానిని కోసలాత్మజగ మన్మథసుందరు బాలరామునిన్
మానితమాతృభావభరమానసవృత్తిని సాకితంట నా
కానళినాక్షియాకృతి దయామతి జూపర, ముద్దుతీర్పరా!

కనులకఱవుతీర నిను నాజననిగానె - యొకపరి గని తచ్చరణాబ్జయుగ్మమందు
దొరలిదొరలి యాధూళిలో గరగిపోదు! - తామసింపక రావోయి ప్రేమమూర్తి!

ఇది యిపుడు వీలులేదందువేని వినుము-భువనమోహిని రాధవై మోహనాంగు
బాలగోపాలు సుఖలీల నేలితివట-చూపు మారూపమైన, నాతాప మార్ప.

కొంటెపాపడేమొ యను వ్యాకులము వలదు-కనులు మిఱుమిట్లుకొల్పెడు కాంతు లీను
దివ్యసౌందర్యనిధివంచు భవ్యభక్తి-తలను వ్రాల్తు నీశ్రీపాదజలజమందు.

దేవపారిజాతమురఆ పావనాంఘ్రి-సలలితానందబాష్పధారలను గడిగి
జీవరక్తాన పారాణిచెలువు గూర్చి-తల్లిబొట్టుగ నట నాహృదయ మమర్తు.

నవ్వు కాదని నీమోమున దనరునది-సకలజీవుల ప్రాపైన స్వర్గమదిర
ఇదియదననేల నాప్రాణ మదియెసుమ! - మఱుగువిడచి గంట బడుమ, మాసుధామ!

త్యాగమహిమప్రభామయతనువు దాల్చి - సర్వమతసామరస్యమున్ జగతి నిల్పు
సంభ్రమంబులో ప్రాతవేషాల మాట - యిపుడు మఱచితో, యోగీంద్రహృదయగమ్య!

వేషమేదైన నోకోటివేషధారి - గొడవుసేయ, నీనగుమోమె కోరి వలతు
తురకపీరో, ఫకీరో, మఱి క్రీస్తుమత ఋషియొ - వేగ నీశ్రీవదనము జూపింపుమోయి!

కన్ను లీవిశ్వమందెల్ల నిన్నె చూడ - తను వదేక్రియనున్న నామనసుమాత్ర
మెపుడు నిను స్మరింప ననుగ్రహింపుమన్న! - తావకదరహాసమరందజీవినైన
బాలకృష్ణభృంగ మొసంగు మాలిక యిదె - వందనం బందుకో చిదానందచంద్ర!

---

# మతముల స్వరూపము

వల్లూరి సూర్యనారాయణరావుగారు

ప్రపంచములో అనేకవిధములగు మతము లున్నవి. ఇవియన్నియు పూర్వకాలమునుండియు అనేకమార్పులతో పరిణామమును పొందుచుండెను; ఇప్పుడు పొందుచున్నవి; ముందు పొందగలవు. ప్రతిమతము వివిధవిషయములతో కలగాపులగముగ నుండును. వీనిలో ముఖ్యమైనవి మూడుభాగములు:—(౧) ఆధ్యాత్మికము (Theology or Philosophy), (౨) పురాణగాథలు (Mythology), (3) కర్మకాండ (Dogmatic rituals and ceremonies). ఈమూటిని గురించి క్లుప్తముగ వ్రాసెదను. వీని యుత్పత్తి పరిణామములను గురించి యిప్పుడు వ్రాయదలచలేదు.

## ౧. ఆధ్యాత్మికము

ఇది వేదాంతమని మన ఆర్యులు వాడుచుందురు. దేవు డొకడున్నాడా? ఉన్నయెడల, అత డెట్టివాడు? ఎచ్చో నుండును? ప్రకృతికి భిన్నుడా, లేక ప్రకృతియంతయు వ్యాపించియుండునా? లేక తానే ప్రకృతియా? స్థావరజంగమము లన్నిటిలో ఆత్మయనునది యున్నదా? దేవునికిని ఆత్మకును సంబంధ మేమి? ప్రకృతి కూడ అనాదియైన యెడల దేవు డెందుండి వచ్చెను? శూన్యమునుండి యీప్రకృతి యెట్లు బయల్వెడలెను? ఆదిని ఉన్న దేమి? అది యుత్పన్నమైనది కాదన్న యెడల కారణములేక కార్య మెట్లు కలుగును? స్వయంభువు అని చెప్పినంత మాత్రమున, మనకు తృప్తికరముగ సమస్య పరిష్కారమైనట్లు భావించగలమా? ఆద్యంతములుగల మానవుడు, ఆద్యంతములు లేని వస్తువును గ్రహింపగలడా? మానవుడు చనిపోయిన తరువాత, అతనికి ఆత్మయొకటి వేరుగా నున్నయెడల, అది యెక్కడకు పోవును? స్వర్గనరకములను ప్రపంచములు వేరుగ నున్నవా? పునర్జన్మ లున్నవా? ఇప్పుడు మన యింద్రియములకు గోచరించు నానాత్వము నిజమా, మిథ్యయా? ప్రకృతిపురుషులు విడివిడిగా మొదటినుండియు ఉన్నయెడల వీనికిగల సంబంధ మేమి? మన మేల ప్రస్తుత భిన్నావస్థలతో పుట్టితిమి? మనకర్మకూడ అనాదియేయని యెంచవలెనా? కర్మక్షయము గలిగి యీశ్వరునితో మన యాత్మలు కలియునా? లేక వేరుగ నుండునా? ఇట్టి తర్కవితర్కములే వేదాంతమని వాడవచ్చును. వీనిని ఆయామతస్థులు, పరిపరివిధముల పరిష్కరించుకొని, యెవరికి తోచినట్లు వారు వానిని గ్రంథస్థముచేసిరి. ఏమతములోను చేరని అనేకదేశములలోని వేదాంతులు, వారివారికి తోచినట్లు ఈవిషయములను గురించి వ్రాయుచునేయున్నారు. ఈసమస్య యెన్నటికిని తెగనిది. ఇది, యిదమిత్థమని వీనిలో నెవరును నొక్కి వక్కాణించి భౌతికశాస్త్రజ్ఞులవలె ప్రజల నందరను ఒప్పించజాలరు. ఎవరిమనస్సునకు ఏవిధానము తృప్తికరమో, వారు దానిని ఆమోదించెదరు. పైప్రశ్నలకు సమాధానములు ఊహాజన్యములేగాని యింద్రియాతీతము లగుటచే పరిశోధనలుచేసి, ప్రత్యక్ష ప్రమాణములమీద నాధారపడ నేరవు. మన ఆర్యమతములో ఈవిషయములో అనేకమత గ్రంథములు వెలువడినవి. వానిలో ఉపనిషత్తులు, భగవద్గీతలు ముఖ్యములు. వీనిలో ప్రతిపాదింపబడిన జ్ఞాన, భక్తి, కర్మ, ధ్యాన యోగము లన్నియు మోక్షసాధనము లనియు, జన్మరాహిత్యము కలుగజేయునవనియు, నైతికధర్మములకు పునాదులనియు, అధికారానధికారములను బట్టి పైవిధానములలో దేనినైనను మానవులు అనుసరించవచ్చుననియు మన మెంచవచ్చును. ఇట్టి వేదాంతము ఏసంఘమును బాధించదు. ఈవిషయములలో ఏయిద్దరుమనుష్యులకైనను అభిప్రాయభేదము లుండితీరినను, సర్వమానవ సౌభ్రాత్రమునకు, అవి యూహాజన్యములని యెంచినంతకాలము ఆటంక మెన్నటికి ఉండదు.

## ౨. పురాణకథలు

ప్రతిజాతిలోను, వారి పూర్వులలో గొప్పరాజులు, గురువులు, బలశాలురు, ధీమంతులు మొదలగువారిని కొంతకాల మైనతరువాత దైవస్వరూపులుగ నెంచి వారిని పూజించుటకు మొదలిడి, తన దైవ మనియు, అన్యదైవ మనియు తమలో తామే తారతమ్య మెంచి వాద తర్కములు చేసి యీజాతులు ఒండొరులమీద ద్వేషభావ మూనెదరు. పూర్వులకు ప్రతిమలను నిర్మించి, వారికి గుళ్లుగోపురములు కట్టి వారి నారాధింతురు. వారికి దుస్తులు, నగలు ఆయాజాతులవారివే ధరింపజేయుదురు. వీరికి భార్యలు, బిడ్డలు మొదలగువారిని అంటగట్టుదురు. వారినిగురించి అనేక కల్లబొల్లికథల నల్లెదరు. వారికి అమానుషక్రియల నారోపింతురు. వీరు చేసిన కార్యములు అతిశయోక్తులతో వర్ణింపబడుచుండును. ఇట్టివే మన పురాణేతిహాసములు. ఇట్టివానితోనే ప్రతిజాతిలోని మతగ్రంథములు నిండియున్నవి. మూఢులకొరకు సదుద్దేశ్యముతోనే యివి మొదట వ్రాయబడియుండునుగాని, యివి క్రమక్రమముగా మానవకోటికి హానికలిగించినవి. వీనిలో నిజముగా జరిగిన చరిత్రవిషయములను, నీతిధర్మములను క్రోడీ

కరించి సామాన్యమానవులు విడదీసి నమ్ముట మిగుల కష్టము. గ్రంథమంతయు పవిత్రమైన మతగ్రంథమని బోధించుచున్నంతవరకు దానిలో ఏమివ్రాసినను, తప్పక విశ్వసించవలసియుండును. ఎది సరి కాదన్నను గ్రంథమున కంతకు లోపము రాకతప్పదు. మన రామకృష్ణాద్యవతారములు మహమ్మదు, క్రైస్తు, బుద్ధుడు మొదలగువారు కొన్ని విషయములలో మనకు ఆదర్శప్రాయులగు మానవులనియు, వారికి కూడ చావుపుట్టుక లుండెననియు మనము నమ్మవలసియుండును. ట్లుగాక దురహంకారదురభిమానములతో ఆయాజాతుల క్షేమము కొరకుమాత్రమే ఆదిదేవుడు ఈరూపముల నెత్తెనని యెంచుటచేతనే అన్యోన్య విమర్శనలకు ఇట్టివారి చరిత్రలు లోనుగావలసి వచ్చినది.

## 3. కర్మకాండ

ప్రతిమతములోను హేతుపూర్వకముగాని కొన్నితంతులు, పూజలు, ఆచారములు, నమ్మకములు మొదలైనవి చేరియుండును. మతగురువులు, పురోహితులు, ఆచార్య పురుషులు వీనిని తమజీవనోపాధికిని, తమతోపాటు మరికొందరి జీవనోపాధికిని అమితముగ పెంచినారు. మన హిందువులలో మంత్రతంత్రములు, బ్రాహ్మణములు, సంహితలు, స్మృతులు మొదలగునవి యీకర్మకలాపమును అతి క్లిష్టముగ చేసి, మనలను బానిసలుగ జేసివైచినవి. మన వర్ణాశ్రమ ధర్మము లనునవి వీనిలో నొకభాగమే. నిరలంకృతమైన ఆర్యమతము మొదట వేదములలో ప్రతిపాదింపబడినది. తరువాత క్రమక్రమముగా బ్రాహ్మణ మత మనునది దానినుండి యుద్భవించి, పటాటోపము కర్మకాండలతో నిండిపోయినది పైగ్రంథములలో వ్రాసిన విషయము లన్నియు వేదములనుండియే గైకొనబడెననియు, మనకు వేదార్థరహస్యములు తెలియక యిట్టి విపరీతవాదములు చేయుచున్నామనియు, ఈ గ్రంథములలోని విషయముల నన్నిటిని మనము శిరసావహించి, తూచాతప్పక అనుసరించవలెననియు సనాతనధర్మపరాయణులమని చెప్పుకొనేవారు వాదించుచుందురు. తెల్లవార లేచినది మొదలు రాత్రి పరుండువరకు మానవుడు చేయు పనులన్నిటికిని నిబంధన లేర్పరచి, వాని యుల్లంఘనలకు నానావిధ ప్రాయశ్చిత్తముల నేర్పరచిరి. వీనిలో కొన్ని అంతశ్శుచి, బాహ్యశుచుల కుపయోగించినను మొత్తము మీద అనవసరముగ కాళ్లుచేతులు కట్టివేసి, మన స్వాతంత్ర్యముల నరికట్టి వాని నుల్లంఘించినవారికి నరకబాధలు, ప్రాయశ్చిత్తముల నేర్పాటుచేసినవి. క్రైస్తవమతములో, యేసుక్రీస్తును నమ్మనివారు శాశ్వతనరకబాధల ననుభవించకతప్పదని వ్రాయబడినది. ఇట్టి క్రూరమైన దండనను ప్రతిపాదించిన మతమును పరమదయాళుడు, సర్వశక్తుడు అగు ఈశ్వరుడు సృజించియుండడని యితరమతస్థులేకాక, క్రైస్తవులలోనే యింగితజ్ఞానముగలవా రందరు త్రోసివేయుచున్నారు. ప్రపంచములో ఇతరమతములలోకంటె అనేకరెట్లు పిచ్చికర్మకాండ మనమతములో ప్రవేశపెట్టబడి, మనభరతవర్షము కర్మభూమియని వాడబడ జొచ్చెను. ఈబిరుదును మనలో ననేకులు గౌరవముగ్గానే చూచుకొను చుందురు.

ఈకర్మకాండ క్రమముగా శిథిలమై, గుంజులేని డొల్లవలె పటుత్వము లేకపోయినను ఇంకను ప్రజలలో నామమాత్రముగ వ్యాపించియున్నది. నేతిబీరకాయలవంటి మన సనాతనధర్మవాదులు, పూర్వాచార పరాయణులు వీనిని ఎప్పటికిని నిలబెట్టవలెనని విశ్వప్రయత్నములు చేయుచుండుట చూడగా, వీరిమీద కోపముకంటె జాలియే మనకు కలుగుచుండును. వీరి దుర్బలమైన కోపము, దురహంకార దురభిమానములు మనకు నవ్వుపుట్టించును. ఇప్పుడు నిలిచియున్న యీస్వల్పబ్రాహ్మణ కర్మకాండకూడ కొనయూపిరితో నున్నది. దీనికి తలయు, తోకయు లేక సహేతుకులమీద నాధారపడక, యిది యెంతకాలము జీవింపగలదు? పూర్వమునుండియు మన హిందువులలోని వివిధసాంప్రదాయికులు, ఈక్లిష్టమైన కర్మకాండ నిబంధనల నుల్లంఘించుచుండినట్లు స్పష్టమే. మన యాచారములలో వేదకాలము నుండి యెట్టిమార్పులు జరుగుచుండెనో, కన్నులుపెట్టి గ్రంథములను చూడక యీసనాతన ధర్మవాదులు చేయు చర్చలు, వాదనలు ఎవరు లక్ష్యము చేయుదురు?

కాబట్టి మన హైందవమతములోవలెనే ప్రపంచములోని యితరమతములు కూడ పూర్ణముగ విమర్శించబడుచు మూఢవిశ్వాసములు, నిరర్థకము కర్మకలాపములు త్యజింపబడు చున్నవి. అన్ని మతములు నీతికి ప్రధానస్థానము నిచ్చుచున్నవి. నీతిగరపని మతము నశించి తీరును గనుక నీతియే మతము లన్నిటికిని పునాది. ఇది మానవుల అనుభవములను బట్టి వికాసము నొందుచున్నది. ఇదితప్ప మతములలో తక్కిన దంతయు, అసత్యములతో కూడుకొని యుండుట చేతనే వీనిలో దేనినికూడ, పక్షపాతబుద్ధితో దేవుడు ఒకసంఘమునకు మాత్రము సృజించినాడనిగాని, ఆయాసంఘములు ఒండొంటితో జగడమాడుటకు వివిధమతములు ఆయన వారిలో నెలకొల్పెననిగాని యెన్నటికిని మనము నమ్మజాలము. స్వధర్మావలంబనమే శ్రేయము, పరధర్మావలంబనము భయావహము అనుసూత్రము ఆయామత గురువుల కల్పితము. ఎవరును ప్రత్యేకమతమును అవలంబించ నక్కరలేదు. తన కిట్టి విషయములలో సంపూర్ణ వ్యక్తి స్వాతంత్ర్యముల నిచ్చు సంఘములో చేరుట కిచ్చగించుట తప్పుకాదు. వేదాంతమార్గము ననుసరించువారి మోక్షమున కది అడ్డుతగులదు. కావున పైనవ్రాసిన మూడు విషయములలో రెండవదియు, మూడవదియు మానవసౌభ్రాత్రమునకు అడ్డుతగులకుండ మనము చేయుచుండవలెను. విమర్శనచేసి నానావిధములైన మూఢవిశ్వాసములను, ఆచారములను సామాన్యజనుల చేత త్యజింపజేయుట విద్యాధికుల విధియని మనవిచేయు చున్నాను.

# వివాహములు

ఎవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

సర్వదేశములందును గుణములవలనను, పనులవలనను జూచినచో నాలుగుకులములును సంకరవర్ణములతోఁ గూడ కన్పట్టుచునేయున్నవి. ఇట్టి నాలుగుతెగలును సలక్షణముగ లేనినాఁ డాదేశము యోగక్షేమములులేనిదగుచుండును. ప్రస్తుత మొకదృష్టితోఁ జూచిన భరతఖండమున బ్రహ్మక్షత్రవర్ణములు నశించినవేమో అనిపించుచున్నది. తగిన భక్తిజ్ఞానవైరాగ్యముల కాటపట్టులై బ్రహ్మవర్చససంపన్నులు, శాపానుగ్రహసంపన్నులు నగుచు లోకనియంతలనఁదగు సాధువు లరుదగుచున్నారు. శౌర్యనిధులై, మానధనులై, అప్రతిమప్రతాపవశులై "హతోవా ప్రాప్స్యసి స్వర్గం, జిత్వావా భోక్ష్యసే మహీమ్" అనెడి యుపదేశమున కర్హులగు వీరులుగూడ చాలతక్కువయనుట సత్యదూరముకాదు. ఇట్లుకాక యీనాలుగుతెగలను తమతమ పనులను యథావిధిగ నెఱవేర్చుకొనుచున్న దేశములే ప్రపంచమునెల్ల తమ సామ్రాజ్యముఁవశమున నిల్పుకోఁగలవగుచున్నవి. కావున చాతుర్వర్ణ్యము లోకరక్షణార్థము భగవంతునిచే సృజింపఁబడినదను మనువచనము ఆలోచనలేనిదికాదని యీపద్ధతియం దనుకోవచ్చును.

పూర్వాచారపరాయణులకును, నవీనసంస్కారప్రియులకును బైవిషయమున వివాద ముండదుగాని యీచాతుర్వర్ణ్యము పుట్టుకతో వచ్చునదియని ప్రాచీనాచారపరాయణులును, వారివారి పనులనుబట్టియు, గుణములనుబట్టియు నేర్పడునని నవీనసంస్కర్తలును తలంచుచున్నారు. ఇం దేపద్ధతి మంచిదో కొంత విచారణ చేయఁదగియున్నది. ప్రస్తుతకాలస్థితినిబట్టి చూచిన నవీనసంస్కర్త లనుకొనినట్లు గుణక్రియలనుబట్టి చాతుర్వర్ణ్యనిర్ధారణ యుండుటే యుక్తమని తోఁచెడిని. ఈపద్ధతిలో సజ్జనులకు గౌరవము లేకుండుటయు, దుర్జనులకు గౌరవ మేర్పడుటయు తగ్గును రాజశాసనముతో నావశ్యకత లేకుండ పదుగురుచేరిన సభలలో నైకమత్యము చెడకుండ హిందూమతముకూడ సర్వమతములతోపాటు ఆమోదింపఁబడునదియగుటయు, నానాఁటికి సంఖ్య తగ్గిపోవుటయేకాని హెచ్చుట లేకపోవుటనెడి యిప్పటివారనుకొనెడి హిందూమతములోని లోపముకూడ చాలవఱకు నశించును. అన్నిమతములతోపాటు హిందూమతధర్మములనుసైత మితరులకు బోధించి యితరమతములవారిని హిందూమతములోనికి క్రైస్తవులు మొదలగువారివలె కలుపుకొనుచున్నచో హిందూమతప్రజలసంఖ్యకూడ నానాఁటికి హెచ్చి జనసంఖ్యనుబట్టి మతమునకు గౌరవమునిచ్చెడి సభలలో హిందూమతముకూడ నొకప్పు డగ్రస్థానము నందవచ్చును. మతధర్మాచరణమనునది సర్వమతములలోవలెనే కలికల్మషములోమునిఁగి నామమాత్రావశిష్ట మగుచున్నను క్రైస్తవమత మిప్పుడు పలుదేశములలో నధికసంఖ్యాకులచే నవలంబింపఁబడుచున్నకతమున ధనవినియోగముచేత నది యగుచున్న

దను దృష్టిని మఱచి కొందఱు క్రైస్తవమతము ప్రస్తుత కాలమున పెద్దవ్యాప్తిలో నున్నదనుకొనుట లేదా ?

పుట్టుకతో వర్ణమును నిర్ణయించుపద్ధతి నిరంకుశ ప్రభుత్వముచే నిల్పఁబడవలసినదేకాని యేకాంగ్రెసులో నిమ్నజాతివా రందఱును మేము కొద్దికులములలోఁ బుట్టినారముకాన మే మున్నతస్థానములను మనస్ఫూర్తిగ వదలి సంతతము నీచాతినీచజీవనములతోఁ బుత్రపౌత్ర పారంపర్యముగాఁ గాలము గడపుదుమని యంగీకరింతురు? కావున సంఘము కలసి నైకమత్యముతోఁ దీర్మానించుకొనెడి సమరసరీతికిఁ బూర్వాచారపరాయణులు శ్లోకములను నమ్మి యొప్పుకొనెడి పుట్టుకతోవచ్చెడి చాతుర్వర్ణ్యము అనుకూల మెప్పటికిని కానేరదు.

కాని ఒకటికిలదు. బ్రహ్మత్వము, క్షాత్రము మున్నగునవి యాయాకులముల వారికేకాక లాతికులముల వారి కసాధ్యములైనపు డొకరు చెప్పకయే యెల్లరును పుట్టుకతోఁ గులముల నొప్పుకొందురు. అట్లనుకొనుటకు బ్రహ్మత్వముమాటయేమోకాని క్షాత్రము శూద్రులగు ప్రభువుల నెందఱ నాశ్రయించియుండలేదు? ప్రతాప రుద్రుఁ డవక్రవిక్రమమున భూమండల మేలలేదా? ఎందఱు వెలమలు, ఎందఱు కమ్మలు, ఎందఱు రెడ్లు, పల్లవులు, చాళుక్యులుమొదలగువా రెందఱు సార్వభౌము లనిపించుకోలేదు? ఇప్పటి మనచక్రవర్తులు- సూర్యుఁడస్తమింపని భూమి నేలువారు- ఏసూర్యవంశము రాజులు? సూర్యవంశము, చంద్రవంశము అని తమ వంశవృక్షముల నచ్చొత్తించుకొనువా రెందఱు పల్లెలలో నామరూపములులేక కృషీవలు లగుచుండలేదు? కాన యేవిధమునఁ జూచినను బూర్వాచారపరాయణుల కులనియతి యుక్తి కాఁగుటలేదు.

ఇది యిట్లుండ నవీనసంస్కర్త లనుకొను కులని యతిలోఁగూడ దీర్ఘదృష్టితోఁ జూచిన గొప్పలోపము కన్పట్టి మనలను పూర్వాచారపరాయణులవలనికి నెట్టుచున్నది. శూద్రుఁడై పుట్టినవాఁడెల్ల క్షత్రియుఁడనియు, సాధువయినవాఁడైన బ్రాహ్మణుఁడనియు వ్యవహరించుకొనుచుంటి మనుఁడు. ఇట్లుండ నొకకాలమున దైవికమైన యీ యుత్పత్తిక్రమమున నొక్కొక్క కులము పూర్తిగ నంతరింపవచ్చును. ప్రకృతిపరిణామమున వచ్చెడి గుణములు గిరిగీచినట్లు సరిగ వచ్చునని యెవఁడు చెప్పఁగలఁడు? ఒకప్పుడు జలమయమయినది మఱొకపుడు స్థలమగుచున్నది. ఒకప్పుడు మిట్టయిన దొకప్పుడు సముద్రమైపోవుచున్నది. వర్ణముల యుత్పత్తి మనవశమున నున్ననాఁడు వాని దోహదములను సరిగఁ జేసికొని యేతెగకును లోపము వాటిల్లకుండఁ జేసికొనఁగలము. అట్లుకానినాఁడు గ్రుడ్డివానిచేతిఱాయి. పరుల మెప్పుడు సుతిమించునో! అందఱు దాస్యమున కర్హులైనను, అందఱుం గేవలశూద్రులైనను దేశమున కధోగతియే. కాలప్రవాహమునఁ జెడిపోయిన దేశములకును, నిరంతర దాస్యసముద్రమున నోలలాడుచుండు దేశములకును ఇట్టి పరిస్థితియే చూచుకోవలెను. ఏదోవర్ణము పూర్తిగ నశించినపుడు దేశమునకు కుంటితన మేర్పడును. అట్టి దేశమును మంచివర్ణధర్మములు గల దేశము లాక్రమించుకొనును; అథవా నశింపఁజేయును.

ఈవిమర్శముమీఁద మన కేమి తేలినది? వర్ణముల యుత్పత్తి మనవశమునుండెడి విధ మేదైన నుండిన నావిధి మన యోగక్షేమములకు ముఖ్యసాధనము. నాలుగుకులములును సమానముగఁ బుట్టుచుండునట్లు మనము మన దేశములను నడిపించుకొనుచుంటిమేని లాతివారు చెనకలేని శౌర్యము గలిగి పరుల భేదోపాయములకు లొంగిపోని విజ్ఞాననిధుల కాశ్రయమై యితరులు కనుపింపఁజేయు భోగము మెఱపులకు లొంగిపోయి యిల్లుగుల్ల ఒడలుగుల్లగఁ జేసికొననీయని శిల్పసంపద కాటపట్టులగు పనివాండ్ర కాస్పదమై కృషివాణిజ్యశిల్పాది నానావిధకళాసంపాదనచతురలోకమై మన దేశము మనల నోమఁగలదు.

ఇట్టివిధికిఁ బూర్వాచారపరు లాదరించు జన్మ చాతుర్వర్ణ్యపద్ధతిని జెప్పు స్మృతులలోనే కొంత సూచన గన్పట్టెడి. శ్రుతిస్మృతులు బ్రాహ్మణునకు బ్రాహ్మణుఁడే పుట్టుననియు, శూద్రునకు శూద్రుఁడే పుట్టుననియు నిట్టి సిద్ధాంతమును బునాదిగఁజేసికొని ధర్మోపన్యాసములను గావించుచున్నవి. అది యిప్పటి మన యనుభవమునకు విరుద్ధముగ నుండుటంబట్టి యీమాటను ద్రోసిపుచ్చి మనయనుభవమును బురస్కరించికొని మనము మాటాడుచున్నాము. బ్రాహ్మణునకుఁ బుట్టినవాఁడు శూద్రస్వభావముతోఁ బుట్టుటయు, శూద్రునకుఁ బుట్టినవాఁడు బ్రాహ్మణస్వభావముతోఁ బుట్టుటయు మనకుఁ బైనచెప్పిన స్మృతిధర్మముల బునాదిని గాననీచ్చుటలేదు. ఏవర్ణస్థునకుఁ బుట్టినవాని కావర్ణస్వభావము సాజముగ నుండుననియు, నది సంస్కారములు కొన్ని చేయుటచేతఁ బైకివచ్చుననియు మనుస్మృతి మొదలగు ధర్మశాస్త్రములు చెప్పెడిని.

"జన్మనా అనువృత్తమప బ్రాహ్మణ్యం సంస్కారై స్సంస్క్రియతే-మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః"

ఏ స్వభావముగలవానికి ఆస్వభావముగలవాఁడే పుట్టుట ప్రకృతిసిద్ధమై యున్నచో నాపద్ధతిమీఁద మనమెల్లకులములను సమానముగ దేశమున నిల్పుకొనుటకు స్వతంత్రుల మగుదుము. అట్టి స్వాతంత్ర్యమునకు మూలకారణములు వివాహములుగఁ గన్పట్టుచున్నవి.

వివాహము లిప్పుడు కట్నముల నాసించియు, ఉద్యోగముల నపేక్షించియు, ఐశ్వర్యములను కాంక్షించియు స్వేచ్ఛగా గృహస్థులచే జరుపుకోఁబడుచున్నవి. జ్యోతిశ్శాస్త్రమున వధూవరులనుగూర్చి నిర్ణయించుపట్టున కూటములు, పొంతనములు మొదలగు వధూవరుల పరీక్షకుఁ బనికివచ్చు విధులు కన్పట్టుచున్నవి. అవి వధూవరులు పుట్టినకాలములనుబట్టి నిర్ధారణచేయఁబడునవియై యున్నవి. ఒక్కొకనక్షత్రమునఁ బుట్టిన వధువొక్కొకనక్షత్రమునఁ బుట్టిన వరునకు సమకూరెనేని వారి మనసులు కలిసిపోయి యట్టి మంచిదాంపత్యము సత్సంతానమునకు హేతువగునని యాశాస్త్రముయొక్క యాశయము.

ఇంకను వాత్స్యాయనసూత్రములు మున్నగు కామశాస్త్రగ్రంథములు స్త్రీపురుషులకుఁ గొన్ని జాతులఁ జెప్పి యాజాతులకు గుర్తులను జూపెంచి యనుకూలతాప్రతికూలతలను ఆజాతులలోఁ బరస్పరము నిరూపించి అనుకూల జాతిస్త్రీపురుషులు దంపతులైరేని మనసులు గలిసిపోయినట్టి యాదంపతులకు సత్సంతానము గల్గునని చెప్పుచున్నవి. సత్సంతానగుణములలో తలిదండ్రులయొక్కయు, వారి వంశములయొక్కయు స్వభావములు చెక్కినట్లుండుట యొకటి.

ఇట్లే వైద్యశాస్త్రాదులందును గొన్ని వధూవరుల పరిశీలనవిధులు గలవు. వివాహహోమములలో హృదయసంసర్గవిధు లుండుటయే దంపతుల మనసులు కలియుట సత్సంతానకారణమని తెల్పెడిని.

కాన వివాహముల నాలోచించుకొనువారు వధూవరుల యోగ్యతల నిట్లు శాస్త్రీయముగా నిర్ధారణచేసి పెండ్లిండ్లు చేసికొందురేని ఏకులమువారి కాకులము స్వభావములుగల సత్సంతానమే కల్గి శాశ్వతముగ విజ్ఞానులును, శూరులును, కృషివాణిజ్యధురంధరులును, ఈమూఁడుశాఖలలోఁజక్కఁగ సర్వీసుచేయఁగలవారును, నానావిధశిల్పకళాప్రవీణులును గల్గియుండ దేశము సంపన్నమై సుభిక్షముగ నొప్పారు.

---



(19) 1. తాంబ్రములో నూతన క్షయరోగచికిత్సావిధానము ; 2. వార్తాపత్రికలు చదువు యంత్రము ; 3. క్రొత్తరకము పట్టురాట్నము





1. 12-వ బ్రాహ్మణేతర సమ్మేళనము, తంజావూరు; 2. భారతదేశ వాణిజ్యసంఘసమావేశము,

# ఖురాన్

ఉమర్ అలీషాగారు

ఖురాను * ఇస్లాముమతమును శాసించు నీశ్వరదత్తమహాగ్రంథము. ఇది క్రీస్తుశకము ౬౧౦ ఫిబ్రవరి ౨౨-వ తేదీ ప్రాంతమున జబ్రీల్ (Gabril) వలన శ్రీమహమ్మదువారికి సూక్తములుగ నరబ్బీభాషలో వినఁబడనారంభించినది. కాని బహుకాలమువఱకది వ్రాఁత కుపక్రమింపఁబడలేదు.

సూరతుల్ బకర్-అలీఫ్, లాం, మీం, జాలకల్ కితాబలారైబ ఫీహా, హుదన్, లిల్ ముత్తఖీనల్లజీన.

అనఁగా అకార, లకార, మకారాత్మకమైన యీగ్రంథము నిస్సందేహముగ ముముక్షువులకు ధర్మమార్గ మగపర్చుచున్నది అని ప్రారంభింపఁబడినది.
మఱియు కడపట

సూ. అల్ యౌమ, అక్ మల్ తొ, లకుందీనకుం

వ, అమంతొ అలైకుం న్యామతి

వ, కజియతొలకుముల్ ఇస్లామదీనన్

అనఁగా ఇస్లాము మతధర్మము అమృతోపముగ ముగించితిమి అని ముగింపఁబడినది.

## మహమ్మదువారు

ఈబుక్కు వ్రాసిన యనంతరము మహమ్మదువారు ౧౮ దినములకన్న నెక్కుడు జీవించలేదు. దీనినిబట్టి యూహింప నీపురాణపురుషుని యవతరణము, ఖురాను పవిత్ర గీతాగానము లోకకల్యాణార్థము ముక్తకంఠముతోఁ బాడిపాడి ఆమధురసుధారససంతతధారాస్రవంతి మానవదగ్ధస్వాంత శూన్యక్షేత్రములకుఁ బాఱించి ప్రశాంతదివ్యకేదారము లుప్పతిల్లసేయుటకేయని తెలియుచున్నది. వీరి నిర్యాణము క్రీస్తుశకము ౬౩౨ సం. జూన్ ౧౭-వ తేదీని అనఁగా క్రీస్తుశకము ౫౩౧ సం. ౨౨ తేదీ ఏప్రియల్ మాసము “కాలము మేషలగ్నము ౩౧ ఘడియ ౨౦ నిమిషములకు “ము ౬౧౦ సం. ఫిబ్రవరి ౨౨-వ తేదీని ప్రవక్త (మతాచార్యపీఠము) పద మలంకరించి మొత్తము ౬ గంటలు జీవించెనని యర్థము.

ఈఖురాను పూర్తియగుటకు దాదాపు పదేండ్లు పట్టినది. ఇది యవతరించునప్పుడు మహమ్మదువారికి ప్రపంచసామాన్యమానవవ్యక్తి బాఱుగా మాఱి భావాతీతమైన నిర్వికల్పసమాధియందు మనస్సు లయమై తేజస్సుతోఁ గూడినప్పు డయాచితముగ గంగోత్తుంగ తరంగ మాలికా పరంపరలవలె వాయువేగముగ వెలువడుచుండెను. అవి సమీపమునందున్న శిష్యులు వ్రాసికొనుచుండిరి. మహమ్మదువారికి చదువురాదు. అనఁగా అక్షరసాంకేతికమైన చదువు చదవలేదని యర్థము. కాని “తలబుల్ ఇల్మఫరీజతున్ ఒముస్లమిన్ ఒ ముస్లమతిన్ వతౌకానబిచ్చీన్” అనఁగా విద్య, స్వదేశమున లేకున్నను చీనాది పరదేశములకైనఁ బోయి ప్రతివ్యక్తియు విధిగ నభ్యసింప నేను శాసించుచున్నానని ప్రబోధించెను.

## భాష

ఈ ఖురానునకు అరబ్బీభాషా కవిత్వ సంప్రదాయము లంతగా లేకున్నను కొన్ని నియమము లాపక్కని అగుపడుచున్నవి కాని విశేషముగ ఋగ్యజు స్సామాధర్వణ వేదముల ఛందస్సులు, ఆపోకడలు తూచినట్లు సరిపోవుచున్నవి. కావుననే నాటి కోవిదకోటిమేటి కిరీటాధిపతుల సమక్షమున నగ్నిపరీక్షఁ జేసి యిది యథార్థముగ నీశ్వరవాణియేయని యేకగ్రీవముగ నంగీకరించి యిస్లాము మతదీక్షా దక్షులై ప్రచారము సాగించినారు. ఈవిషయమగు చర్చ ‘ఖురా’ నను శీర్షికక్రింద భారతి మొదటి సంచికలో నేను విపులముగ వ్రాసియున్నాఁడను.

మఱియు ఈఖురానునందలి యరబ్బీభాష మిక్కిలి స్వచ్ఛముగను, వ్యాకరణబద్ధముగను (ఫసాహత్ బలాగత్) ధ్వని వ్యంగ్యాది లక్షణ లక్షితముగను నైయున్నది. ఇందు ముప్పది మండలములు, ౧౧౪ సూక్తములు, ౬౬౬౬ బుక్కులును, ౩,౨౧,౨౬౭౦ అక్కరములును గలవు.

* [illegible]తుష్కులు మహమ్మదీయమని పేరిడిరి. ఇది యిస్లామునకు నింద్యమైన పేరు. ఇస్లామనఁగా నీశ్వరభక్తి కర్థము.

## హిజరత్ (వలస)

ఈఖురాను గీతాగానము మిగుల మనోహరమై, శ్రావ్యమై దిగంతములు మార్మ్రోయ నారంభించినది. విన్న మానవహృదయములే కాక పాషాణములుసైత మార్ద్రీభూతములై కరఁగి కంపింప మొదలుపెట్టినవి. ఎక్కడఁ జూచినను, నేదేశమున విన్నను, ఏమూల కేగినను ఈ ప్రసంగములే,యీప్రచారములే దృగ్గోచరములై మిన్నులు ముట్టుచుండెను.

అందుచే నువ్వెత్తుగ నుప్పెన వచ్చిపడినవారింబోలె ప్రకాశాంతర సిద్ధాంతములచే బాధపడు మతమతాంతర ప్రత్యర్థుల గుండెలలో రాయిపడిన ట్లయినది. అదివఱకు నిట్టి పరమపవిత్రశౌచశీలాత్మకమైన ఏకేశ్వరారాధన మతప్రవిష్టత లోకమునం దెచ్చటను గావింపఁబడియుండలేదు. దానివలన మహమ్మదుప్రవక్త కెన్నో యిక్కట్టులు వచ్చినవి. ప్రతిపక్షులు మహమ్మదువారిని వాదమున నోడింపనోపక చంపివేయవలయునని యత్నించిరి.

ఇట్లే యేసుక్రీస్తును యూదులు చంపివేసిరి. అట్టి యగచాట్లే మహమ్మదువారి కాసన్నమైనది. కాని మహమ్మదువారు దేహాభిమానమునకుఁ బోయి శాత్రవులచేఁ జంపఁబడుటకంటె యెటులో తప్పించుకొనిపోయి యీశ్వరనియుక్తధర్మ సందేశము (ఖురాన్) లోకమాశాంతముగఁ జాటి శత్రుగర్వనిర్భేదము గావించుట సమంజసమని తన జన్మభూమియగు మక్కా విడిచి మదీనాకు వెడలిపోయెను. ఈవలసపోవుటకే హిజిరీయని పేరు చరిత్రలయందు పేర్కొనఁబడినది. ఇది క్రీస్తుశకము ౬౨౨-వ సంవత్సరమున జరిగినది.

## ఈశ్వరవాణి

ఈఖురాను ఈశ్వరదత్తగ్రంథ మనుటలో దీనికన్నమున్న మతగ్రంథముల కిట్టి గుణవిశేషములు ప్రతిపాదించుట ప్రాయికమై యున్నట్లు లీప్రపంచమతప్రచారకుల జీవితచరిత లెన్నో యెలుంగెత్తి చాటుచు నుద్ఘోషించుచున్నవి. చూడుఁడు—

నేఁటి కాఱువేలేండ్లకుఁ బూర్వమున్న ఋగ్వేదము మున్నగు వేదచతుష్టయము రచించిన మధుశ్ఛందసుఁడు * విశ్వామిత్రభృగ్వాంగిరసాది ఋషుల పేర్లు స్పష్టముగ సూక్తాదిని వ్రాయఁబడియున్నను బ్రహ్మముఖగహ్వరమునుండి యూడిపడినట్లు వాకొనుచున్నారు.

సాంఖ్యమతస్థాపకుఁడైన కపిలుఁడు గీతలు వాకొన్న శ్రీకృష్ణుఁడు అహింసను బోధించిన బుద్ధుఁడు ఈశ్వరావతారములని నుడువుచున్నారు.

ఇట్లే పాశ్చాత్యులలో తౌరేత్ † మోసేవ్రాసిన యూధగ్రంథము (Old testament) ఈశ్వరదత్తమన్నారు. అంతకుఁ బూర్వము జబ్బూర్ ‡ సామవేదమువంటి గానగ్రంథము అబ్రహాము వలనఁ బూరింపఁబడినది. అట్లే ఏసుక్రీస్తు మరణానంతరము యూహా, లూకా మున్నగు పన్నిద్దరు శిష్యులవలన వ్రాయఁబడిన ఇంజీల్ ♦ బైబిలు (Bible) దేవుఁడు పంపిన పొత్తములని కంఠోక్తిగఁ జెప్పుచున్నారు. ఈవాదమున కేమర్థమున్నదో తెలియదు గాని మోసేయనంతర మొక మోసఁగాడు

## సామరీన్

సామరీనని ప్రసిద్ధికి వచ్చెను. ఈతనిపేరు విశేషముగ ఆరబ్బీపారసీభాషా వాఙ్మయమున మహామాయావియని వంచకుల సందర్భమున నుదాహరింపఁబడుచుండును.

ఈతఁడు గొప్ప తార్కికుఁడు; విద్వత్ప్రపంచము నోడించి తనపేర నొక మతము స్థాపించెను. అది ప్రజల కుద్బోధించుతరి నెవ్వరును విశ్వసింపరైరి. అదియేమాఅని యాలోచించి యొక గొప్ప దర్శనగ్రంథము వ్రాసి చొరరాని కారణము జొచ్చి యొక బాడిద చెట్టు దొలిచి యందుంచి మూసివేసెను. అది కొన్నాళ్లకుఁ గండతొడిగినది. ఆచెట్టుక్రింద తనయింటఁ బుట్టిన లేగదూడకు మేఁతవేయు నలవాటుచేసెను. అది కన్నెవిప్పగనే పరుగునఁ బోయి ఆబాడిద చెట్టుక్రింద నిలిచెడిది. ఇట్లుండ

సామరి ప్రజలను పిలిచి,

"ఓ ప్రజలారా? ఏల నామత మవలంబించరు?" అని ప్రశ్నించెను.

వారు "ఈశ్వరుఁడు నీకేమైనఁ బుస్తక మిచ్చినాఁడా?" అని యడిగినారు.

"నానోరే పుస్తకము."

"అది మేము ఒప్పుకోము."

"సరే, మీ కేలాంటి పుస్తకము కావలెను?"

"దేవదత్తగ్రంథము కావలెను."

"అలాగైతే దేవుఁడు సర్వాంతర్యామి; మానవ హృదయములలోనే గాదు, సచరాచరభూతకోటిలోను నిమిడియున్నాఁడు. చూడుఁడు—మీ రడిగిన ప్రశ్నకు నే నిప్పుడే

---

* మధుశ్ఛందసుఁడు ఋగ్వేదమున మొదటిసూక్తము వ్రాసిన విశ్వామిత్రుని పుత్రుఁడు.

† తౌరేత్. ‡ జబ్బూర్. ♦ ఇంజీల్-ఇవి ప్రస్తుతమగుపడుచున్న గ్రంథములేనా? ఖురానులో ఈశ్వరుఁడు రచించి చెప్పినవి. లేక వేరములా? ఈవిషయమను చర్చ పూర్వము ఔరంగజేబు అన్నదారాషికో తన ఖురానువ్యాఖ్యానము యున్నాఁడు. చూడు. భారతి మొదటిసంచిక.

ప్రత్యక్ష నిదర్శనము (దాఖలా) చూపెదను." అని తన లేగదూడ కన్నెవిప్పినాఁడు. అది చెంగుచెంగున నడవిదారి తీసి నడవ నారంభించినది. దానివెంట ప్రజలను నడవమన్నాఁడు. సామరీను గూడ వచ్చినాఁడు. వారందరు దూడవెంట, రథమువెంటఁ బోవు తైర్థికులవలెఁ బ్రయాణముచేసిరి. దూడ బాడిదచెట్టునొద్ద నిలిచినది. సామరిక్ ప్రార్థనసేయువానివలె నిలిచి మోము పైకెత్తి శ్రుతి నభినయించి "ఓజనులారా! ఈనోరెఱుంగని లేగదూడ యెంతదూరము మిమ్ము దోడ్కొనివచ్చినదో యిది యంతయు నీశ్వర ప్రేరణము. ఇది యిఁక నిచ్చటనుండి కదలనని నాతో చెప్పుచున్నది. అయినా కొట్టిచూడుఁడు." అని చెప్పెను. ప్రజలు దూడను కొట్టిరి. కానిదూడ కదలలేదు. ప్రజలిందుకు కారణమేమని యడిగినారు. సామరిక్ వారిని జూచి, "ఓహో! ఈశ్వర కృపావిశేష మనంతమని పొగడి, మీ రడిగిన దివ్యగ్రంథము ఈబాడిదచెట్టులో నున్నది తీసుకొండని దేవుఁడు నాతోఁ జెప్పుచున్నాఁడు." అని చెప్పినాఁడు. ప్రజ లామాట విని పరమాశ్చర్య నిమగ్నమానసులై చెట్టు పెగలఁదీసిరి. అం దొక మహాగ్రంథము బయలుదేరినది. అది సామరీక్ పెట్టినాఁడని వా రెఱుంగరు. ఇది గొప్ప మహామహిమ విశేషమని, కేవల మీశ్వర నిర్మాణమగు పరమాదర్శమని పూజించి గౌరవించి అందున్న ధర్మసంగ్రహమును ఆమోదించి సామరీక్ మహామహుఁడైన ఈశ్వరావతారమని నమ్మి, పెక్కేండ్లు వాని మార్గమున దేశదేశములవారు నడచి ప్రచారముసేయ నారంభించిరి. కాని కొన్నేండ్ల తరువాత వృక్షశాస్త్రజ్ఞుల పరిశోధనలచే నిజము బయలుపడినది.

ఇట్లే తొమ్మిదవశతాబ్దిని ఉమర్ ఖయ్యామను తాత్త్వికకవికి సమకాలికుఁడును, అతని సహాధ్యాయుఁడును నైన 'హాసన్ బిన్ సబా' అను విద్వాంసుఁడు నాఁటి బాగ్దాదు మహారాజ్య పాలకులగు 'సల్జూకీ' చక్రవర్తులపై ద్వేషించి లేచిపోయి యడవుల నాశ్రయించి యం దొక చోట 'త్రివిష్టపము' కట్టి అం దెన్నో సొగసు లలంకరించి భంగను* మత్తుపదార్థ మొకటి కనిపెట్టి 'జీవన్ముక్తిమత' మనఁగా బొందెతో కైలాస మిప్పించెదనని పెక్కుమహాయోధుల వంచించి తనవశము గావించుకొని పెద్దదండు విడిసి సల్జూకీరాజుల నోడించిన ట్లగపడుచున్నది. ఈరహస్యము ౧౨-వ శతాబ్దిని యూరపురాజులపై క్రూసేడ్సులో దండెత్తిన సుల్తాను సలావుద్దీన్ కూఁతురు 'అయేషా' తెలిసికొని హాసన్ బిన్ సబా త్రివిష్టపము ముక్కలు ముక్కలు చేసి కాల్చి భస్మము చేసి వేసినది.

ఇట్లే పెక్కుమోసములు ప్రాచీనమతమతాంతర స్థాపనా చేతలయం దగపడుచున్నవి.

## ఎజీదు

ఖురానుగూడ నిట్టిదేయని మహమ్మదుగారి యనంతరము ఎజీదనురాజు ప్రతిఘటించెను. ఈతఁడు మిగుల క్రూరుఁడు. ఇస్లాము మతనౌక కాతఁ డాదినములలో చుక్కానివలె నుండెను. కాని మహమ్మదువారి సంతతివారు మాత్రము 'ఖురాను' ను విడువకైరి. వారిచే విడిపించినఁగాని యిస్లాము కూఁకటివేళ్లతోఁ బోవదని తలపోసి వారికెన్నో మేళ్లు గూర్చెదనని యాశలపైయాశలు బెట్టి ప్రయత్నించెను. కాని వా రేమియు చలింపలేదు. అప్పు డిదిపనిగాదని వారిని తన యాస్థానమునకు శిష్యుఁడ నయ్యెదనని బొంకి రాఁగోరెను. 'హుసన్' అనువా రప్పటి మతపీఠమున నున్నారు. ఈయన అలీకిఫాతిమాకుఁ బుత్రుఁడు, మహమ్మదువారి దౌహిత్రుడు. ఎజీదు లేఖ నామోదించి బంధుసహితముగ ప్రయాణమై వెళ్లుచుండ మార్గమధ్యమున కూఫాయనుచోట నడ్డుకొని వారందఱ నెజీదు నరికించివేసెను. అప్పు డచ్చట మడిసినవారు ౭౨. అదే పీర్లపండుగపేర చేయు మొహర్రం.

ఎజీదు అంతటితో ఇస్లా మంతరించినదని తలంచినాఁడుగాని మొదలు నరకిన జామచెట్టువలె ద్విగుణీకృతోత్సాహముతో మతమింక బలపడ నారంభించినది. ఎందరో వీరులు, ధీరులు ఆత్మార్పణము సేయుటకు సంసిద్ధులై ముందుకు రాఁజొచ్చిరి. ఆవిషమసమయమున ఎజీదు దండనాధికారియగు హుజ్జాజ్ బిన్ యూసఫ్ అనువాఁడు వేలులక్షల మహమ్మదీయ మతవీరుల నరికించినాఁడు. కాని మతము చావలేదు. ఎజీదు చచ్చినాఁడు. అంత హుజ్జాజ్ బిన్ యూసఫ్ హతాశుఁడై ఇస్లాము ప్రళయకాల పర్యంతము ప్రభాతభానునివలె దేదీప్యమానమై లోకము సంతరింపసేయునని తెలిసికొన్నాఁడు. ఇంతలో నతని మేనల్లుఁడు మొహమ్మద్ బిన్ ఖాశిం ౭౧౨-వ సంవత్సరము భారతదేశముపై దాడివెడలి తిరిగి స్వస్థానము చేరెను. హుజ్జా సభ తీర్చి యిస్లాము మతమును దునుమాడి తిరిగియే మతమును నెలకొల్పుట కర్తవ్యమని యోజించెను. అన్నిమతాలలో నేవో గొప్పగొప్ప లోపములగుపడినవి. ఆలోపములు సమగ్రముగ సంస్కరించు నెడల పర్యవసానము 'ఇస్లాము' మత ప్రధానధర్మములే తుదకు నిలుచుచున్నవి. ఇంక చేయునదిలేక ఇస్లామే అమృతస్వరూపమైనదని ఖురానులోని కడపటి సూక్తము చదివి తన యవజ్ఞతకుఁ జింతించి నిశ్చయించి అప్పటికి మిగిలియున్న ఇస్లాము మత 'హాఫీజ్' ఖురాను పాఠకుల రావించి గౌరవించి ఖురాను పఠింపుఁ డనియెను. వారి ప్రతులు పదునొకండు పాఠభేదములు గలిగియుండ నవి యన్నియు బిత్వ పీత్వ కియ్యావడు లిచ్చి పరిశుద్ధప్రతి యొకటి నిర్ణయించి అందరచే నామోదింపఁజేసి తక్కినప్రతులన్నియు పాతిపెట్టించెను. అదిమొదలు ఖురా నెచ్చటనున్నను స్థిర ప్రామాణము (Standard) గ నున్నది.

*...గన గంజాయి పాలలో కలిపి చేయు తియ్యని పానీయము.

## వ్యాఖ్యానములు

ఈఖురానునకు వేనవేలు వ్యాఖ్యానములు వ్రాయఁబడినవి. ఇంకను వ్రాయుచునే యున్నారుగాని యేదియును సమగ్రమైనదిగ లేదు. వేదమునకు విద్యారణ్యవ్యాఖ్యానము గలదు. అట్టి ఫక్కిని సాధీ గజ్జాలీ మున్నగు అరబ్బీభాషాపండితులు సంస్కృతముగూడ నేర్చి వ్యాఖ్యానములు వ్రాసినారు గాని ఆధ్యాత్మికములైన కొన్ని యర్థము లన్వయింపఁబడమి వారా సముద్రమును తరింపలేక పోయినారు.

ఇట్లని భారతదేశపరిపాలకుఁడైన అగ్బరు చక్రవర్తి ౧౫౮౫-వ సంవత్సర ప్రాంతమునఁ దన యాస్థాన కవియగు పైజీ చేత తొలుత సంస్కృతములోని భారత రామాయణములను పారసీపద్యకావ్యములుగ వ్రాయించి తరువాత ఖురానునకు వ్యాఖ్యానము వ్రాయించినాఁడు.

పైజీ పండితవరేణ్యుఁడు. ఈతఁడీ ఖురానువ్యాఖ్యానమందరవలె చేయక పారసీలిపిలోఁ గల ౩౦ అక్కరములలో చుక్కలులేని పదునొకండక్కరములలోని మూఁడు వాక్యామ్నాయముల నేకరించి బ్రహ్మాండమైన ఖురానువ్యాఖ్యానము సమగ్రముగ వ్రాసి ముగించి అది అగ్బరున కంకితముచేసినాఁడు. అది మానవ సామాన్యమైన పనిగాదని, దివ్యులైనను దీని నిటుల ముగింపఁజాలరని నాఁటి విద్వాంసులు పొగడినారు.

అప్పుడు భారతీయ వేదపండితులు వచ్చి, "వైశంపాయనుఁడను ఋషి, కొందరో శిష్యులుండిరి. వారిలో యాజ్ఞవల్క్యుఁడను వానిపై వైశంపాయనునకుఁ గోపమువచ్చి 'నాయొద్ద నేర్చికొన్న యజుర్వేదము నాకిచ్చివేయు'మని యడిగినాఁడు. యాజ్ఞవల్క్యుఁ డదివిని చింతించి తన తపశ్శక్తిచే దానిని పాయసముగఁ గ్రక్కివేసినాఁడు. అమహాపదార్థమును వైశంపాయనుఁడు మిగిలిన తన శిష్యులను తిత్తిరిపక్షులై భుజింపవలసినదని చెప్పినాఁడు. వారట్లు భుజించినారు. అట్లు భుజించినవా రందఱకు యజుర్వేదము వచ్చినది. తిరిగి యాజ్ఞవల్క్యుఁడు సూర్యు నుపాసింపఁగా నతఁడు గుఱ్ఱమై వచ్చి యాజ్ఞవల్క్యునకు వాజపేయమను యజుర్వేదము నేర్పినాఁడని, అదియే శుక్లయజుస్సని, వైశంపాయన శిష్యులు తిత్తిరిపక్షులచుం దజ్ఞాన రూపమున గ్రహించినందున కృష్ణయజుస్సైనదని వ్రాసినారు. ఇట్టి పరమాద్భుతభావాతీతాధ్యాత్మిక శక్తులు ఖురానున నున్నవా?"అని యడిగిరి.

అప్పు డాతని యాస్థానముననున్న విద్వాంసుఁడు మౌల్వి మదీనా కబీర్* అను ఋషి ఖురాను చేతఁబట్టి పెద్ద అగ్నిగుండమునఁ బ్రవేశించి మూఁడుదినము లహోరాత్రము లందుండి మండిపోక సజీవుఁడై లేచివచ్చి యిది ఖురాను మహామహిమ విశేషమని, యిట్టివెన్నియో యీఖురాను నాశ్రయించినవారికి సాధ్యమగునని చెప్పి యొప్పించెను.

అప్పుడు వేదపండితులు ఖురానును సంస్కృతముగావించి వేదస్వరము ఛందము (అనుష్టుప్పు) లో వచ్చునట్లుజేసి దానికి అల్లోపనిషత్తని పేరిడినారు. ఆదిమొదలు అగ్బరు బ్రహ్మానందపడినాఁడు. ఆఅల్లోపనిషత్తిప్పటికిని గలదు.

> సూరయెఫాతిహా—ఇది ఖురాను మొదటి సూక్తము.
> అల్‌హందొలిల్లాహైరబ్బిల్ ఆలమీన్
> అఱ్ఱహమా నిఱ్ఱహీమ్. మాలికెయామిద్దీన్
> ఇయ్యాకనా ఆబుదొవయియ్యాక నస్తయీన్
> యెహదనస్సిరాతల్ ముస్తకీమ
> సిరాతల్లజీన అన అంత అలేహింగైరిల్
> మగజూబె అలేహింవలజ్జాల్లీన్.

దీని సంస్కృతము—

> "నమోస్తు తే జగన్నాథ త్వా మహం శరణం గతః,
> లోకనాథాయ దేవాయ దయాదాక్షిణ్యమూర్తయే.
> ధర్మనిర్ణయకాలేన తుభ్యం ధర్మాధికారిణే,
> సేవే త్వామేవ యాచేచ త్వామేవ శరణం ప్రభో.
> గత్వా యేన సుమార్గేణ లభంతే సజ్జనా వరాః,
> న గత్వా యేన మార్గేణ దుర్జనా యాంతి దుర్గతిమ్,
> తేనైవాపి సుమార్గేణ నేతు మర్హసి మాం ప్రభో."

ఇట్లే తక్కినవి యెఱుంగవలయును.

ఈఖురాను మానవజీవితమునకుఁ గావలసిన సమస్తాధ్యాత్మికశాంతిక ప్రతిపత్తిని సమగ్రముగా నొక్కచోట నేకరించి గొప్పపరివర్తనము దెచ్చిపెట్టినది. నేఁటి కగత్యమని లోక మనుకొనుచున్న మతరాజకీయ సంస్కారము లన్నియు నాఁడే యందు చేయఁబడి యాచరణమునఁ బెట్టఁబడినవి. ఆస్తిలో కూఁతునకు భాగము, స్త్రీస్వాతంత్ర్యము, విడియాకు లిచ్చుపద్ధతి, సర్వమానవ సౌభ్రాత్రము మున్నగునెల్ల మహత్తరవిషయములు కూలంకషముగ నెలకొల్పఁబడినవి. నేఁడితరులవలె వానిని మహమ్మదీయులు సంస్కరించుకొనవక్కఱలేదు. మఱియు మహమ్మదువా రెప్పుడును మాయయనునది యెఱుంగరు. భారతీయులలోను, తదితరులలోను పెద్దపెద్ద మత

---

*. ఈమదీనా కబీరే మాపూర్వప్రపితామహుఁడు. ఈసంతతివారు ఔరంగజేబు సర్మస్తహునేనీని నరికించినప్పు డాం, వచ్చి విడిసినారు.

కర్తలు అనఁగా రామానుజాచారివంటి వైష్ణమతస్థాపకుఁడు సైతము శైవపూజారులకు లంచమునిచ్చి శ్రీరంగము మున్నగు దేవాలయముల కడ విష్ణువు మహామహిమ స్వరూప సంపన్నుఁడని పంచెములువేసి శివలింగములకు విభూతి తుడిపించి యూర్ధ్వపుండ్రములు పెట్టించి శైవసిద్ధాంతుల భంగపుచ్చి మతప్రచారము చేసిన ట్లగపడుచున్నది. అందుచే నాతఁ డాదినాలలోఁ గొన్నేండ్లు మైసూరులోఁ దాఁగొన వలసినస్థితి వచ్చినది. ఇట్లే పెక్కు లున్నవి. కాని ఖురా నిట్టి ప్రచారములను కంఠోక్తిగా ఖండించుచునే ప్రారంభింపఁ బడినది.

ఈఖురానున కిప్పటి కెవరును నిజమైన టీకాతాత్పర్యములు వ్రాయలేదు. కావున దీనియథార్థము ప్రపంచకమునకు గోచరమగుట లేదు. ఇది పరివర్తకులు పురాణమువలె వ్రాయుచున్నారు. ఇది గొప్ప ప్రమాదము. దీనిసరియైన యర్థమే లోకమునకు నివేదించిన మహమ్మదీయ మతముపైఁ గల ప్రవాదము లంతరించుననుట నిస్సంశయము. నేను దీనికి ౩,వేల పేజీలలో ప్రతిపదార్థ వ్యాఖ్యానము వ్రాసి నాఁడనుకాని నేఁటివఱ కది ముద్రింపఁబడలేదు.

---

మాయూరి స్వాములవారు



# పట్టుపురుగు పాట

కర్లపాలెం కుటుంబశాస్త్రి గారు బి. ఏ.

పట్టుతీసే విధము తెలియండీ
ప్రజలార మీ రా
పథముపట్టిన లాభమగునండీ. (పల్లవి)

మల్బరీ యాకులను మేపిరి
పట్టుపురుగుల కింతవఱకును
మనకు సామాన్యముగ నయ్యవి
యెట్టిచోటులనేని దొరకవు
ఇపుడు క్రొత్తది సులభపద్ధతి
యేర్పడినదట–పట్టుపురుగులు
ఆముదపుటాకులను దినునట
అమలులో పెట్టండి దీనిని. పట్టు.

జీవహింసను జేసి పురుగుల
చిత్రవధగావించి పట్టును
తీసి నేసిన బట్టలనెగా
వేసికొనినా మిన్నినాళ్లును
పురువుగతికిని జాలిజెందము
పురుగ నహ్యామటంచు దలచము
మురియుచుందుము పట్టుబట్టల
మెఱపుమెత్తందనములను గని. పట్టు.

నేటినుండియు ప్రాతపద్ధతి
నీటిలోపల కలిపివేయుడి
మేటియగు నీక్రొత్తపక్కిని
నాటజేయుడి దేశమంతయు
ఆముదపుటాకులను దినుచును
హాయిగా నీపురుగు పెరుగును
గూడుకట్టినపిదప నీతా
కోక చిలుకై యెగిరిపోవును. పట్టు.

గూటిచుట్టును గలుగు పట్టును
రాటమున దారముగ దీయుడు
కూటికే లేనట్టివారికి
కూలితెచ్చెడి బ్రతుకుతెఱవిది
కోటిగల ధనవంతులకు సి
ల్కులను గూర్చెడి సాధనం బిది

నాటుపద్ధతి యీపరిశ్రమ
నాటవలెను స్వదేశమందున. పట్టు.

ఆముదపు విత్తులను వాడుచు
ఆకులను వినియోగపఱచము
లేతయాకుల గొడ్ల కుంగిడి
భీతిచేతను మేత వేయము
పారవైచెడుదాని వాడిన
పట్టుపురుగుల పెంచవచ్చును
పల్లెలందున నీప్రచారము
బాగుగా సాగించవలయును. పట్టు.

ఒక్కయెకరపుటాకు మేపిన
నొక్కమణుగును పట్టుపెట్టును
ఎక్కసంబుగ నూరురూపా
యిలకు నెక్కువధరను దెచ్చును
పట్టుకై మన మితరదేశాల్
పట్టుకొన నవసరము పోవును
మన స్వదేశపు దీపరిశ్రమ
యనుచు నెఱుగుట ముఖ్యధర్మము. పట్టు.

మనప్రభుత్వమువారుకూడను
మాతృభావము జూపుచుండిరి
ఈ పరిశ్రమయందు, కనుక నే
యీపనిని వ్యాపనముజేయగ
నుంచి రుద్యోగులను కొందఱ
నూళ్లలోపల తిరుగుటకునై
పాలకుల దీవనల నియ్యది
బడసెగావున భయములే దిట. పట్టు.

వృద్ధిలోనికి దేవలయు నీ
వృత్తి దేశమునందు నంతట
ఉచితశిక్షణ నొందు యువకుల
కూత యొసగుచు సేవగొనుచును
ధనముగల సహకారసంస్థలు
స్థానపాలక సంఘములును
డబ్బుముందుగ కర్చుపెట్టిన
దారిజూపినవార లగుదురు. పట్టు.

# ౧౧. సంగీతము

## భారతీయ రాగపద్ధతి

వింజమూరి వరాహనరసింహాచార్యులుగారు

ఇదివరలో భారతీయరాగపద్ధతిగూర్చి కొంత చెప్పుచు షడ్జమధ్యమగాంధార గ్రామములను గూర్చియు, మూర్ఛనలను గూర్చియు, తానములు, స్వరసాధారణ శుద్ధమిశ్రజాతులు ఇత్యాద్యంశముల గూర్చియు వ్రచ్చించియుంటిమి * భరతశార్ఙ్గదేవసోమనాథాద్యాది వాగ్గేయులు పైయంశములగూర్చి చెప్పిన సంగతులు వారి భావములు గూర్చి ఎంచునప్పుడు మనము గ్రహింపవలసిన విధము, అందులకు కారణములును కొంత వివరించియుంటిమి మిగుల ప్రాచీన కాలమునాటి గ్రామరాగపద్ధతి, తదనుసరణీయములగు మూర్ఛనలు, జాతులు మున్నగున వెరుగుటకు,పాడుటకు కొన్ని శతాబ్దములు గతించిన యీకాలమున దుస్తర మగుచుండినను వాని స్వభావము గూర్చి తెలిసికొనుటకు వీలు లేకపోలేదు అట్లయ్యు నాధునికగ్రంథములలో కొన్నిట పైయంశములు తప్పుగ చెప్పబడి యుండినందునను, ప్రతి సంగీతజ్ఞుడు ముఖ్యముగా నీసంగతులు తెలిసియుంట యావశ్యకమగుటచేతను, అప్పుడే నేను గానము సేయబడు రాగములు సుభోధకములగుటవలనను ఇప్పుడు క్లుప్తముగ గ్రామరాగపద్ధతి, మేళపద్ధతి, మేళప్రస్తారపద్ధతి మున్నగువాని చరిత్ర తెలిపెదను.

భరతాది వాగ్గేయుల యభిమతము ననుసరించిన రాగపద్ధతి నెరుగుటకు ప్రయత్నించునప్పుడు ఇదివరలో చెప్పిన గ్రామరాగ కాలము, మేళరాగకాలము, మేళప్రస్తార కాలము ఇట్లు మూడుకాలములను గుర్తింపవలసిన యావశ్యకత కలదు. ఈపద్ధతులు క్లుప్తముగ గడచిన ఉగాది సంచికయందు వివరించియుంటిని. ఇప్పుడు కర్ణాటక గానమున వాడబడు మేళప్రస్తారపద్ధతి క్రీ. వె. ౧౫౫౦-వ సంవత్సరము ప్రాంతము అనగా పదునారవ శతాబ్దము మధ్యనుండియు నమలునందుండిన మేళపద్ధతి ననుసరించినదేయని తెలియును. మేళపద్ధతి యందు అన్ని స్వరములును క్రమముగ ప్రస్తారముచేయబడియుండలేమి అనంతరము రఘునాథరాయలు, వెంకటమఖి మున్నగు వాగ్గేయులు ప్రకృతి, వికృతి ప్రస్తార క్రమము (Permutation) ననుసరించి డెబ్బది రెండు మేళములు ఏర్పరచి వినుతికెక్కిరి. ఈ మేళ ప్రస్తారపద్ధతి మేళపద్ధతికన్న నవ్యమగునది యగుటచే నిటీవలి సంగీతజ్ఞులు సదరు ప్రస్తారపద్ధతి ననుసరించుచుండిరి. ఉత్తరదేశమున రాగరాగిణీ పద్ధతికూడ నంత సుకరముకాని హేతువుచే కాబోలు, కొందరు ఔత్తరాహసంగీతవేత్తలు ఎస్. వి. భాత్కండే, మహమ్మదు ఖరీము మున్నగువారు తమ రాగములకు మేళముల చొప్పున ఏర్పరచి 'థట్' నామమున వ్యవహరించుకొనుచున్నారు. ప్రథమమునుండియు నీదేశమునరాగపద్ధతి యమలునందుండినట్లు విదితము. పాశ్చాత్యదేశములందు పూర్వ మెట్లున్నను ఇప్పుడు నేర్పు సొంపులతో గూర్పబడిన స్వర మూర్ఛనలచే నలరారు గానముమాత్రము ప్రాముఖ్యము బొంది యున్నది. భారతీయగానమున నిట్టి యింపుసొంపు స్వరమూర్ఛనలతో గూడిన రాగములు కానరుండము. కాని ప్రథమమునుండియు మనవారు రాగములు అనురాగవంతములుగ నుండుటకు ప్రయత్నించిరే కాని చెవికి, అందుచే మెదడునకు బనికల్పించునట్టివిగ నుండునట్లు చేయుట కుద్యుక్తులు కాలేదనునది తథ్యము. స్వరముల నన్నిటి క్రమముగ జేర్చి జాతులు, వీనినుండి గ్రహింపదగు రాగములు—ఇట్లు మనవారు నిర్మించుతరి పాశ్చాత్యులు వాదిసంవాదిపద్ధతి ననుసరించు స్వరములను మూర్ఛనలందు చేర్చి సొంపుగ వెలయించుటలో ప్రాముఖ్యమును వడసిరనునది తెలియుదుము. భారతీయరాగపద్ధతియం దట్టి సొంపుపెంపులతో గల మూర్ఛనలును లేకపోలేదనునదియు రాగముల నెంచునప్పుడు తెలియగలము.

### గ్రహస్వరముమార్పు

ఇదివరలో షడ్జమధ్యమ గ్రామములనుండి కలిగిన మూర్ఛనలు, జాతులు, ఆయామూర్ఛన లేక జాతియొక్క నామస్వరము ననుసరించి యుండినట్లును, అందుచే ప్రతిజాతియొక్క నామస్వరము గ్రహస్వరమై జాతిరాగము ననుసరించి మారుచుండెననియును జెప్పియుంటిని. ప్రతిజాతిరాగమును గ్రహస్వరముమార్పువలన పాడబడుటచే నిది సుకరము కాదనునది పూర్వకాలమునను గ్రహింపబడియుంట విదితము. ఈసంగతి భరతశార్ఙ్గదేవాదిశాస్త్రవేత్తలును గ్రహించి యుండినట్లు తెల్లము. గ్రహస్వరమును మార్చుటకుమారుగ స్వరములకు

* చూడు-ఆంధ్రపత్రిక ఆంగీరస సం. రపు ఉగాది సంచిక, పుటలు ౨౭౫-౨౫౫.

ఉత్కర్షాపకర్షములను గూర్చి పాడుట సుకరమని యెంచియే భరతుడు 'స్వరసాధారణ'ను జేర్కొనుటయు, శార్‌ఙ్గదేవుడు వికృత స్వరముల జెప్పుటయు దిటపరించెను. ఈవిధమగు నాలోచనలకు లోనై వారు జాతిరాగముల ననుసరించి మారుచుండిన నామస్వరమును ఒక్క శ్రుతి (Drone) కనువగునట్లు జేయుటకు వలయు సాధనముల నారయుటకు బ్రయత్నించి రందురు. వీరు చెప్పిన షడ్జగ్రామాశ్రిత ములగు దయావతి, నిషాది, షడ్జి, అర్షభిజాతులు మారుచుండిన నామ స్వరము (గ్రహస్వరము) వలన కలిగినవయ్యు శుద్ధదైవత (త్రిశ్రుతి దైవత)మునకు శ్రుతి జేయబడిన తంత్రియందును, మధ్యమగ్రామాశ్రిత ములగు గాంధారి, మధ్యమ, పంచమజాతులును, వానివాని నామ స్వరము ననుసరించుననయ్యు శుద్ధఋషభ (త్రిశ్రుతి ఋషభము) మునకు శ్రుతి జేయబడిన తంత్రియందును పాడుటకు వలనుపడునట్లు పూర్వపు వాగ్గేయు లెంచిరి. గ్రామరాగకాలమున శుద్ధదైవతమును, దీనికి మధ్యమవ్యత్యాసమున గల శుద్ధఋషభమును పలుకు తంత్రీశ్రుతి వలన నాయాజాతులు పాడబడినట్లు గ్రహింతుము. ఇట్లు శుద్ధజాతుల నామస్వరము 'ద' శ్రుతికైనను లేక 'రి' శ్రుతికైనను అనువగునట్లు ఎంచ బడుటచే ప్రతిశుద్ధజాతియు పాడునప్పుడు తంత్రులను మార్చనవసరము లేకుండెను. ఇట్లు శ్రుతిజేయబడిన దైవతతంత్రియందు షడ్జము ఆరు శ్రుతుల వ్యత్యాసము కలిగినదగుటచే నిది షడ్జ మనబరగె ననియు గొందరు చెప్పుదురు.

శ్రుతి (Drone):—గ్రామరాగ కాలమున మారుచుండిన గ్రహ స్వరము లేక నామస్వరము ననుసరించి యుండిన జాతిరాగములను గ్రహస్వరముమార్పుతో పాడుట సుకరము కాకపోవుటను గ్రహించి అద్దాని ఒకశ్రుతి కనువగునట్లు ఒనర్చుటకు బ్రయత్నములుచేసి 'స్వర సాధారణ' చేర్చియు, వికృతముల గూర్చియు జాతులను ద్వైవిధమగు శ్రుతితంత్రులందు పాడుటకు దారిని కల్పించిన శార్‌ఙ్గదేవాది వాగ్గే యులు అనంతరమువారికి మార్గదర్శకులైరి. రాగములందు వికృత స్వరములను జేర్చుటచే గ్రహస్వరము మార్పువలన కలుగు జాతులు సుకర ముగ విస్పష్టము నేయవచ్చునని తెలిసికొనిన శార్‌ఙ్గదేవుడు కృతకృత్యు డాయెను. ఈపద్ధతి యనంతరము ప్రబలిన ఉత్తరమందలి రాగరాగిణీ పద్ధతియందును, దక్షిణమందలి మేళములు, మరి మేళప్రస్తారపద్ధతి యందును కందుము. శుద్ధస్వరములు, వికృతస్వరములు రెంటిని చేర్చి యేర్పరుపబడిన యీ విధములగు రాగముల గ్రహస్వరము మార్పబడ కయే అవి పాడబడుట కందుము. ఈరాగముల కన్నిటికి షడ్జమే గ్రహస్వరముగ నిప్పు డెంచబడుచున్నదని తెలిపియుంటిని. పూర్వము శుద్ధదైవతము, దీనికి మధ్యమవ్యత్యాసమునగల శుద్ధఋషభము చొప్పున మేళవింపబడిన తంత్రుల శ్రుతిపై రాగములు పాడబడినట్లు ఇంత దనుక ఎంచితిమి. ఇప్పు డట్లుకాక షడ్జ పంచమములు లేక మధ్యమ ములు చొప్పున మేళవింపబడిన శ్రుతులపై రాగములు పాడబడు చుండుట విదితము. ఇప్పటి షడ్జమధ్యమములు పూర్వపు దైవత ఋషభముల స్థానముల నాక్రమించియుండనోపు. ఎట్లయినను ఇప్పటి రాగములు ప్రకృతి వికృతిస్వర మూలకములు కావున నవియన్నియు షడ్జగ్రహస్వరమునే కలిగియున్నవని మనవారు చెప్పునది సత్యము గనే యున్నది ఆయారాగములందలి ప్రకృతి వికృతి స్వరములు తెలి సినంతనే మనవా రిప్పుడు గ్రహస్వరము నారయకయే పాడగలుగు చున్నారనునదియు మరువకూడదు.

## రాగముల త్రయోదశలక్షణము

పూర్వోక్త జాతిరాగములు గ్రహస్వరము లేక నామస్వరముచే నెట్లు సువ్యక్త మగుచున్నదియు దెలిపియుంటిమి. ఇప్పుడును అయ్యవి విస్పష్టములుగ నుండలేదు. షడ్జమధ్యమ గ్రామములు రెంటియందును ఆయా నామ స్వరమూలకములగు మూర్ఛనలు, జాతిరాగములు వీని యందలి స్వరముల పరస్పర సంబంధము శ్రుతుల సంఖ్యచొప్పున ఎంచి క్రిందటి ఉగాది సంచికయందు చెప్పియుంటిని. అందలి పఠకము * ను తిలకించిన ఆయాజాతి ఏయేశ్రుతుల సంజాతమగు స్వరములవలన నేర్పడుచున్నదో తెలియగలము. అనగా ఆయాజాతియందు శుద్ధస్వర ములకు భిన్నములైన ఏయేయంతరములగల వికృతస్వరములవలన నేర్పడుచున్నదియు గనుగొనగలము. కాని ఆయాజాతిరాగ మిప్పుడెల్ల సుకరముగ పాడుటకు ఇంకను పెక్కు అంశములు తెలియవచ్చినగాని వలనుపడుట లేదనునది పూర్వమేమి, ఇప్పుడేమి గ్రహింపబడుచు న్నది. జాతిరాగముయొక్క గ్రహస్వరము లేక ప్రకృత్యాది స్వరభేదము తెలిసినంత మాత్రమున నవి పాడుట కెట్లు వలను కాకుండునో యట్లే ఇప్పటి రాగములును, వీనియందలి స్వరభేదములును తెలిసినంతనే పాడు టకు వీలులేకుంట గమనింపబడెను. అందుచే భరతాదిపూర్వవాగ్గే యులుసహితము తమ జాతిరాగములు విస్పష్టము లగుటకు అవి కొన్ని లక్షణములచే గూడియుంటను తెలుపుచునే యుండిరి. ఈయం శమును అనంతరము రామామాత్యుగు, సోమనార్యుడు, వెంకటమఖి మున్నగు శాస్త్రజ్ఞులును గ్రహించి రాగములు విస్పష్ట మగుటకు కొన్ని లక్షణములు వారివారికి తోచినచొప్పున చెప్పుచుండిరి. ఇందును సంగీ తమునందలి తదితరాంశములందువలె వీనియందును భిన్నాభి ప్రాయములను చూతుము. శార్‌ఙ్గదేవుడు తనకాలమునాటి రాగములు పదుమూడు లక్షణములు కలిగియున్నవని యెంచినాడు. కాని భరత ముని పదిలక్షణములనే పేర్కొనియుండెను. అనంతరము పుండరీకవిఠ లుడు నాల్గులక్షణములే ముఖ్యములని గ్రహించియుండెను. కాని సోమనార్యుడు, వెంకటమఖి, తులజేంద్రుడు మున్నగు దక్షిణదేశపు

* చూడుము, పఠకము ౪, అంగీరస ఉగాదిసంచిక, పుట. ౨౫౪.



1. అఖిలభారతాయుర్వేదమహాసభాధ్యక్షులు, ఎ. లక్ష్మీపతిగారు ; 2. అఖిలభారతాయుర్వేదమహాసభ (లక్నో) అధ్యక్షులు, శ్రీ. నాయుడుగారు ; 3. మైసూరుభిషఙ్మణులు, వేంకటకృష్ణయ్యగారు ; 4. కొచ్చిను కొత్తమహారాజు ; 5. దొరాబ్, జె. తాతాగారు.





1. అలహాబాదు అఖిలపక్షైకమత్య మహాసభ - ఆళ్వారుమహారాజు, మాలవ్యాగారు, ఇతరులును ;
2. ఇండియా లీగుసభ్యులకు మదరాసులో సన్మానము.

శాస్త్రజ్ఞులును, దామోదరుడు, అహోబలుడు మున్నగు ఔత్తరాహ శాస్త్ర వేత్తలును పదిలక్షణములు గ్రహింప వీలగునని యెంచి వారి వారి మతముల జెప్పియుండిరి. శార్ఙ్గదేవుడు చెప్పిన ౧౩ లక్షణము లిట్లున్నవి—౧ గ్రహ, ౨. అంశ, ౩. తార, ౪, మంద్ర, ౫. న్యాస, ౬. అపన్యాస, ౭. సన్యాస, ౮. విన్యాస, ౯. బహుత్వ, ౧౦. అల్పత్వ, ౧౧ అంతర్మార్గ, ౧౨. షాడవ, ౧౩. ఔడవములు.

> "గ్రహాంశతార మంద్రాశ్చ న్యాసాపన్యాసకౌ తథా,
> అపి సన్యాసవిన్యాసౌ బహుత్వం చాల్పతా తతః.
>
> ఏతాన్యన్తరమార్గేణ సహ లక్ష్మాణి జాతిషు,
> షాడవౌడవితే క్యాపేత్యేవ మాహు స్త్రయోదశ."
>
> —సంగీతరత్నాకరము.

కాని భరతుని కాలమున సన్యాసవిన్యాసాంతర మార్గలక్షణము లు గ్రహింపబడలేదని ఇతడు చెప్పిన పదిలక్షణములవలన తెలియు దుము. భరతుని దశవిధలక్షణము లిట్లున్నవి.—

> "గ్రహాంశౌ తారమంద్రౌచ న్యాసోఽపన్యాసఏవచ,
> అల్పత్వంచ బహుత్వంచ షాడవౌడవితే తథా."
>
> —భరతనాట్యశాస్త్రము.

రాగవిన్యాసమున రాగవర్ధని ముగిసినవెనుక గల్గు విదారియందలి స్వరసముదాయమున వివాదివ్యతిరిక్త మగు సన్యాస విన్యాసములును, అందందు రక్తికొరకు చేర్చబడునట్టి అంతర్మార్గస్వరమును భరతుని కాలము (క్రీ. పూ. ౪-వ శతాబ్దము) న కానమనియు, ననంతరము కొంతకాలమునకు వాని యావశ్యకత గ్రహింపబడుటచే గాబోలు, అవి రాగములందు చేర్చబడి శార్ఙ్గదేవాది శాస్త్రవేత్తలచే రాగలక్షణమున చేర్కొనబడెననియు దెలియుదుము. కాని శార్ఙ్గదేవుడు పైన చెప్పిన ౧౩ లక్షణములందును కొన్ని రాగవిభాగములను సూచించు చుంటచే నవి యనంతరము శాస్త్రవేత్తలు వెంకటమఖి మున్నగువారు రాగలక్షణములుగ నంగీకరింపలేదని విదితమగుచున్నది. ఇట్లు షాడ వౌడవలక్షణము రాగవిభాగమును సూచించుచున్నది. భాషాంగరాగ ములందు అంతరమార్గ స్వరము ధ్రువమగుచున్నది. ఇందుచే నీమూ డును రాగవిభాగములకు కారణమగుచున్నవి. వెంకటమఖి యీమూడు లక్షణములను పైకారణముచే కాబోలు, తన దశవిధలక్షణములందు చేర్చి చెప్పలేదు. భరతునకు స్ఫురించని సన్యాసవిన్యాసలక్షణములు వెంకటమఖి గ్రహించి చెప్పినాడు. వీరిరువురు దశలక్షణములు మాత్రము పేర్కొనినవారయ్యు భిన్నమతములనే వెలయించిరి వెంక టమఖి తాను భరతముని ప్రోక్తమునే యనుసరించినట్లు ఘనము జెప్పు కొనినాడు. కాని ఇతడు అనుసరించినది భరతుని మతము ననుసరించిన 'దశ' అను సంఖ్యయే. వెంకటమఖి చెప్పిన దశలక్షణము లిట్లున్నవి.—

> "లక్షణాని దశోక్తాని లక్ష్యన్తే తావ దాదితః,
> గ్రహాంశౌ మంద్రతారౌచ న్యాసాపన్యాసకౌ తథా.
>
> అథ సన్యాసవిన్యాసౌ బహుత్వం చాల్పతా తథా,
> లక్షణాని దశైతాని రాగాణాం మునయోఽబ్రువన్."
>
> —చతుర్దండిప్రకాశిక.

వెంకటమఖిమతమును అనుకరించిన తులజేంద్రుడు నిట్లే తన 'సంగీత సారామృత' మందు దశలక్షణములను వర్ణించి యున్నాడు.

> "గృహాంశతారమంద్రాశ్చ న్యాసాపన్యాసకౌ తథా,
> అపి సన్యాసవిన్యాసౌ బహుత్వం చాల్పతా తథా."
>
> —సారామృతము.

కాని వెంకటమఖికి పూర్వముండిన పుండరీక విఠలుడు మంద్ర, తార, అల్పత్వ, బహుత్వ, సన్యాస, విన్యాస లక్షణము లారింటిని పాటించి చెప్పకపోవుటకు ఇయ్యవి అంతముఖ్యములు కావని యెంచి యుండనోపు. రాగములందు గ్రహాంశన్యాసాపన్యాసములే అతి ముఖ్యములుగ నిప్పుడిట్లు ఎంచబడుటయు, గక్కినవి రాగవిన్యాస క్రమము ననుసరించున వగుటచే నవి ప్రతిరాగమున కొక్కవిధమగు టచే ప్రతిరాగమునకును వేరు లక్షణములుగ బరిగణింప నవసరము లేమియు కొందరెంచుచున్నారు.

వెంకటమఖికాలమునకు కొలది వత్సరములకు క్రితము రచింప బడిన 'సంగీతసుధ' యను లక్షణగ్రంథమున తిరిగి శార్ఙ్గదేవుడు చెప్పిన త్రయోదశ లక్షణములు వర్ణింపబడియుంట కందుము. ఈ గ్రంథమును రచించిన రఘునాథరాయలు పూర్వోక్తపద్ధతి వర్ణించుతరి యట్లు చెప్పియుండినట్లు గ్రహింపవలసియున్నది. ఏలనన యాకాల మునను వెంకటమఖి చెప్పిన దశలక్షణములే యమలునం దుండినట్లు తెలియుదుము

భరతుడు, శార్ఙ్గదేవుడు మున్నగు శాస్త్రజ్ఞులు తాము చెప్పిన పైలక్షణములను సాకల్యముగ వర్ణించి రాగములందు నిరూపించి వ్యక్త పరచినారు. భరతముని విపులముగ ప్రతిజాతిరాగమునందు పైయంశ ములు పేర్కొని యుండెను. ఆయాసంగతు లిట పొందుపరచుటకు తావులేని కారణమున వేరుగ వ్రాయబూనితిని. కాని ముఖ్యములగు సంగతులమాత్ర మిట చెప్పబడును.

### ౧. గ్రహములు

పూర్వపు జాతిరాగములుకాని, అనంతరము మేళరాగములు కాని, ఇటీవలి మేళప్రస్తార రాగములుకాని ప్రారంభించు స్వరము గ్రహస్వరముగ నెంచబడెను. కల్లినాథుడు "గృహీత ఇతి, యేన గీతం గృహ్యేత ఇతివా గ్రహః" అని వ్యాఖ్యానము చేసినాడు

గ్రామరాగము లెట్లు గ్రహస్వరము నాధారముచేసికొనినదియు నిది వరలో చెప్పియుంటిని. గ్రహస్వరము రాగముల కాధారమగుటచే కాబోలు, కొందరు దానిని అంశస్వరముగగూడ నెంచిరి. భరతముని యి ట్లెంచి చెప్పినాడు.—

"గ్రహాస్తు సర్వజాతీనా మంశవ త్పరికీర్తితాః,
యః ప్రవృత్తో భవే దంశః సోఽంశో గ్రహవికల్పితః."

శార్ఙ్గదేవుడు ఇ ట్లెంచినాడు.—

"గీతాదినిహిత స్తత్ర స్వరో గ్రహ ఇతీరితః,
తత్రాంశగ్రహయో రన్యతరోక్తా వుభయగ్రహః."

## ౨. అంశము

రాగమును సువ్యక్తముచేయజాలు బహుళస్వరము అంశ స్వరముగ నెంచబడెను. శార్ఙ్గదేవుడు—

"బహులత్వం ప్రయో గేషు వ్యాపకం త్వంశలక్షణమ్."

అనిచెప్పినాడు. 'సంగీతసుధ' యందును—

"యశ్చప్రయోగో బహులశ్చ వాదీతి మంశనామాన ముదీరయన్తి."

అని చెప్పబడెను. వెంకటమఖి అంశస్వరమును జీవస్వరముగ బేర్కొనుటయు జెల్లు.

"బహుంశో గీయతే యేన స్వరణాంశః స కథ్యతే,
అంశస్వరస్త్వసావేవ జీవస్వర ఇతి స్మృతః."

## ౩, ౪, తారమంద్రములు

ఉచ్చస్వనముగల స్వరములు తారస్వరము లనియు, నిట్లు తక్కువస్వనముగల స్వరములు మంద్రస్వరములనియు ఎంచబడెను. వెంకటమఖి ఇట్లు వచించెను.—

"నీచైఃస్వరేణ యద్గానం స మంద్రస్వర ఉచ్యతే,
ఉచ్చైః స్వరేణ యద్గానం స తారస్వర ఉచ్యతే."

పూర్వపు వాగ్గేయులు షడ్జమధ్యమగ్రామరాగములందలి యంశస్వరములనుండి యారోహణముగా వెడలునప్పటి నాలుగవ స్వరము ననంతరమునుండి కలుగున విన్నియు తారములని యెంచిరి. శార్ఙ్గదేవు డిట్లు చెప్పినాడు —

"స్వరాంశ్చ తార ఆరోహే దేవ తారావధిః పరః."

ఇయ్యవి రెట్టింపు స్వనముగలవని కల్లినాథుడు వ్యాఖ్యానమున దెల్పినాడు ("తారస్థితో ద్విగుణాత్") ఈసంగతు లింకను శార్ఙ్గదేవుడు విపులముగ జెప్పియుండెను. భరతమునియు నిట్లే యంశ స్వరమునకు నాలుగవ స్వరముపైన ఆరోహణక్రమముగ నున్న స్వరములు తారములని యెంచియుండెను. ఇయ్యవి పంచమమువరకు గలవనియు నిత డభిప్రాయపడెను.

"పంచస్వరపరా తారగతిః. యథా,
అంశాన్తరగతిం విద్యా దాచతుర్థస్వరా దిహ,
ఆపంచమా త్పంచమాద్వా నాతఃపర మిహేష్యతే."

—భరతనాట్యశాస్త్రము.

ఇక షడ్జమధ్యమ గ్రామరాగముల న్యాసస్వరమునకు క్రింది స్వరములు మంద్రములుగ నీపూర్వపు వాగ్గేయు లెంచిరి. ఈన్యాస స్వరములగూర్చి చెప్పును కల్లినాథుడు షడ్జగ్రామమందు మంద్రగాం ధారమును, మధ్యమగ్రామమందు మంద్రనిషాదమును న్యాసస్వరము లగునని యెంచినాడు. ఈస్వరములకు క్రిందివి అనగా ఋషభధైవతము లనుండి మంద్రస్వరములు ఏర్పడునని తేలును. భరతుడు అంశన్యా సాపన్యాసపరములగు మూడువిధములగు మంద్రస్వరములు ఎంచబడు చున్నవనియు, కాని అంస్వరము క్రిందవి మంద్రములు కాకపోవుటచే షడ్జమధ్యమగ్రామములు రెంటియందును ఋషభధైవతములతో మొద లిడునని మంద్రస్వరము లగుననియు నిట్లు గ్రహించినాడు.

"మంద్ర స్త్వంశపరో నాస్తి న్యాసేతు ద్వౌవ్యవస్థితౌ,
గాన్ధారే న్యాసలింగేతు దృష్టః మృషభధైవతమ్."

ఈసంగతులు 'సంగీతసుధ' యందును చూతుము.

## ౫. న్యాసము

పూర్వము వ్యాప్తిజెందిన గ్రామాది జాతిరాగములు కాని అనం తర ముండిన మేళరాగములు, ఇటీవలి మేళప్రస్తార రాగములు ఏస్వ రమున నంతమగునో యది న్యాసస్వరముగ నెంచబడెను.

"గీతే సమాప్తికృ న్న్యాస ఏకవింశతిధాచ సః."

భరతమునియు నిట్లే ఎంచెను—

"న్యాసోఽంగసమాప్తౌ స చైకవింశతివిధో విధాతవ్యః."

## ౬. అపన్యాసము

గీతఖండమందు విదారి సమాప్తిజెందుతరి అపన్యాస మనబడు నని తెలియుదుము. శార్ఙ్గదేవు డిట్లు చెప్పినాడు—

"అపన్యాసః స్వరః సస్యా ద్యో విదారీసమాపకః,
కర్మారవ్యాంచ నైషాద్యా మాన్ధ్రీమధ్యమయో స్తథా,
అర్ష భ్యాంచ స్వరా యేఽంశా స్తేఽపన్యాసాః ప్రకీర్తితాః."

జాతిరాగములం దియ్యది ఎట్లు ధ్రువమగుచున్నదియు విపుల ముగ జెప్పబడెను. 'సంగీతసుధ' యందు నీసంగతులు క్రమముగ వర్ణింపబడెను. వెంకటమఖికూడ ఇట్లు చెప్పినాడు—

లందు క్రమముగ బేర్కొనినాడు. 'సంగీతసుధ' యందును జాతి రాగములగూర్చి చెప్పినప్పుడు శార్ఙ్గదేవుని మతము వర్ణింపబడి యుంట చూతుము. కాని వెంకటమఖి మున్నగు ఇటీవలి శాస్త్రజ్ఞులు అంతర్మార్గ షాడవౌడవ లక్షణములు రాగములందు లక్షణముగ జెప్పబడుటకన్న నవి రాగవిభేదమును కలిగించునట్టివిగ జెప్పుట సుకరమని యెంచి కాబోలు, ౧౦ లక్షణములు చెప్పెనని తెలిపియుంటిని. తన మతము సుస్థిరము గావించుకొనుటకు తన మహిమము నుగ్గడించుకొనుచు నితడు లక్షణమందును, లక్ష్యమందును పదిలక్షణములే రాగములందు ధ్రువముగునని ఇట్లు వక్కాణించినాడు.

"లక్షణాని దశాప్యేవం లక్షితాని మయా స్ఫుటమ్."

వెంకటమఖి చెప్పిన లక్షణములెల్ల ఇప్పటి రాగములందును తెలియుదుము. కాని రాగముల లక్షణము పేర్కొనునప్పుడు వీని నెల్ల వర్ణించిచెప్పుట యావశ్యక మగుచుండినను ఇటీవలి కొందరు విద్వాంసులు వీనిని పేర్కొనకయు, కొన్నిటిమాత్రము చెప్పియు వ్యర్థపు పుత్తముల నెలయించియుంట చూతుము. రాగములు తెలియుటకు ఆరోహణావరోహణాది లక్షణముమాత్రముకాక వెంకటమఖి చెప్పిన దశవిధ లక్షణములతో వానిని వర్ణించి చెప్పుట యావశ్యకమగుచున్నది. ఈపనికి బూనుకొనిన మద్రాసు సంగీత పరిషత్సభవారు రాగనిరూపణమందీయంశములుగూడ పాటించుటకు కోరబడుచున్నారు. ఇట్టి యావశ్యకత ఆంధ్రగాయకసోదరులును గ్రహించి యీకొరత దీర్చుటకు హెచ్చరింపబడుచున్నారు.

## రాగవిభాగము

ఇంతదనుక రాగనిర్మాణపద్ధతిగూర్చియు, రాగములు పరిస్ఫుటము లగుటకు నలయు త్రయోదశలక్షణములగూర్చియు జెప్పియుంటిని. రాగవిభాగముగూర్చియు నిప్పుడు తెలియవలసిన సంగతులు గలవు. వానిని క్లుప్తముగ నెంచి పూర్వపు గ్రామరాగములగూర్చియు, మేళరాగములగూర్చియు, మేళప్రస్తారపద్ధతి ననుసరించు ఇప్పటి రాగములగూర్చియు గొంత చెప్పవలసిన యావశ్యకత కలదు. 'సంగీత రత్నాకర' గ్రంథమున 'రాగవివేకాధ్యాయము' నందు గ్రామ రాగములగూర్చి ఇంకను విపులముగ జెప్పబడినది. ఆయాసంగతు లిట సాకల్యముగ జెప్పుటకు తావులేకపోవుటచే వేరుగ వ్రాయ యత్నింతును. కాని శార్ఙ్గదేవుడు దేశిరాగములందు చెప్పిన యంశములు, మరి యితని రాగవిభాగము నేటికి ననుసరింపబడుచున్నదనునది రాగ చరిత్రను ఆరయునప్పుడు తెలియును. ఇతడు చెప్పిన గ్రామరాగములందలి పెక్కురాగము లిప్పటి మన సంగీతమున వాడబడుచుంటయు విదితముకాగలదు.

## శార్ఙ్గదేవుని రాగవిభాగము

### ౧. గ్రామరాగములు

౧. శుద్ధ, ౨. భిన్న, ౩. గౌడ్య, ౪. వేసర, ౫. సాధారణములను పంచవిధములను శార్ఙ్గదేవుడు పేర్కొనినాడు. వీనియందు జన్యములు ముప్పదిరాగములు కలవు. వీని నిట్లు చూతుము.

I. శుద్ధగ్రామరాగమున ౧ షడ్జగ్రామ, ౨. మధ్యమగ్రామ, ౩. శుద్ధకైశిక, ౪. శుద్ధపంచమ, ౫. శుద్ధకైశికమధ్యమ, ౬. శుద్ధసాధారిత, ౭. శుద్ధషాడవములును,

II. భిన్నగ్రామరాగమున ౧. భిన్నషడ్జ, ౨. భిన్నపంచమ, ౩. భిన్నకైశిక, ౪. భిన్నతాన, ౫. భిన్నకైశికమధ్యమములును,

III. గౌడ్యగ్రామరాగమున ౧. గౌడకైశిక, ౨. గౌడపంచమ, ౩. గౌడకైశికమధ్యమములును,

IV. వేసరిగ్రామరాగమున ౧ సౌవీర, ౨. టక్క, ౩. బోట్ట, ౪. మాళవకౌశిక, ౫. టక్కకైశిక, ౬. హిందోళ, ౭. మాళవపంచమ, ౮. వేసరి, ౯. షాడవములును,

V. సాధారణగ్రామరాగమున ౧ రూపసాధారణ, ౨. శాక, ౩. బంమాణపంచమ, ౪. నర్త, ౫. గాంధారపంచమ, ౬. షడ్జకైశిక, ౭. కుకుభరాగములును జన్యములు.

### ౨. భాషావిభాషాంతరభాషా రాగములు

గ్రామరాగపద్ధతియందలి రెండవ విభాగమగు భాషావిభాషాంతరభాషావర్గమున నూటయిరువది రాగములను శార్ఙ్గదేవుడు వర్ణించి చెప్పినాడు. ఈవిభాగమున పురుషరాగములు స్త్రీరాగములనునదికూడ స్పష్టమగుటచే అహోబలుడు, దామోదరుడు మున్నగు కొందరు అనంతరపు వాగ్గేయులు తమ రాగములను రాగరాగిణీపద్ధతిచొప్పున నెలయించుటకు కారణమాయెనని ఎంచబడుచున్నది. భాషారాగములు జనకరాగములు లేక పురుషరాగములుగ చెప్పబడెను. ఇయ్యవి ౧౫ విధములుగ నిట్లున్నవి—

౧. సౌవీర, ౨. కుకుభ, ౩. టక్క, ౪. పంచమ, ౫. భిన్నపంచమ, ౬. టక్కకైశిక, ౭. హిందోళ, ౮. భోట్ట, ౯. మాళవకైశిక, ౧౦. గాంధారపంచమ, ౧౧. భిన్నషడ్జ, ౧౨. వేసరీషాడవ, ౧౩. మాళవపంచమ, ౧౪. తాన, ౧౫. పంచమషాడవ.

ఈభాషారాగములందలి జన్యము లిట్లున్నవి—

౧. సౌవీరభాషారాగమున ౧. సౌవీర, ౨. వేళమధ్యమ, ౩. సాధారిత, ౪. గాంధారీ రాగములును,

౨. కుకుభభాషారాగమున ౧. భిన్నపంచమ, ౨. కాంభోజి, ౩. మధ్యమగ్రామ, ౪. రగంతీ, ౫. మధురీ, ౬. శకమిశ్రారాగములును, ఇందలి విభాషారాగమందు ౧. భోగవర్ధనీ, ౨. ఆభీరికా, ౩. మధుకరీ రాగములును, అంతర భాషయందు ౧. శాలవాహనికా రాగమును,

౩. టక్కభాషారాగమున ౧. త్రవణా, ౨. త్రవణోద్భవా, ౩. కారంజీ, ౪. మధ్యమగ్రామదేహా, ౫. మాళవవేసరీ ౬. ఛేవాటీ, ౭. సైంధవీ, ౮. కోలాహలా, ౯. పంచమలక్షితా, ౧౦. సౌరాష్ట్రీ ౧౧. పంచమీ, ౧౨. వేగరంజీ, ౧౩. గాంధారపంచమీ, ౧౪. మాలవీ, ౧౫. తానవలితా, ౧౬. లలితా, ౧౭. రవిచంద్రికా, ౧౮. తానా, ౧౯. బాహేరికా, ౨౦. దోహ్యా, ౨౧. వేసరీరాగములును, ఇందలి విభాషయందు ౧. దేవారవర్ధనీ, ౨. ఆంధ్రీ, ౩. గుర్జరీ ౪. భావనీ రాగములను,

౪. పంచమభాషారాగమున ౧. కైశికీ, ౨ త్రావణీ, ౩. తానోద్భవా, ౪. ఆభీరీ, ౫ గుర్జరీ, ౬. సైంధవీ, ౭. దక్షిణాత్యా, ౮. ఆంధ్రీ, ౯. మంగలీ, ౧౦. భావనీరాగములును, ఇందలి విభాషయందు ౧. భమ్మాణీ, ౨. ఆందోలికారాగములును,

౫ భిన్నపంచమ భాషారాగమున ౧. ధైవతభూషితా, ౨. శుద్ధభిన్నా, ౩. వరాటీ, ౪. విశాలారాగములును, ఇందలి విభాషయందు కౌశలీరాగమును,

౬. టక్కకైశికి భాషారాగమున ౧ మాళవా, ౨. భిన్నవలితారాగములును, ఇందలి విభాషయందు ౧. ద్రావిడీరాగమును,

౭. హిందోలభాషా రాగమున ౧. వేసరీ, ౨ చూతమంజరీ, ౩. షడ్జమధ్యమా, ౪. మధురీ, ౫. భిన్నపౌరాలీ, ౬. గౌడీ, ౭. మాలవవేసరీ, ౮. దేవాటీ, ౯. పింజరీ రాగములును,

౮. బోట్టభాషా రాగమున మాంగలీ రాగమును,

౯. మాలవకైశికి భాషారాగమున ౧. బంగాళీ, ౨. స్వంజినీ, ౩. మాంగలీ, ౪. హర్షపురీ, ౫. మాలవవేసరీ, ౬. గుర్జరీ, ౭. గౌడీ, ౮. పౌరాలీ, ౯. అర్ధవేసరీ, ౧౦ శుద్ధా, ౧౧ మాలవరూప, ౧౨. సైంధవీ, ౧౩ ఆభీరీరాగములును, ఇందలి విభాషయందు ౧. కాంభోజీ, ౨ దేవారవర్ధనీ రాగములును.

౧౦. గాంధారపంచమీ భాషారాగమున గాంధారీ రాగమును,

౧౧. భిన్నషడ్జభాషా రాగమున ౧. గాంధారవల్లీ, ౨. కచ్ఛేలీ, ౩. స్వరవల్లీ, ౪. నిషాదినీ, ౫. త్రవణా, ౬. మధ్యమా, ౭. శుద్ధా, ౮. దక్షిణాత్యా, ౯. పులిందికా, ౧౦. తుంబురా, ౧౧. షడ్జభాషా, ౧౨. కాలిందీ, ౧౩. లలితా, ౧౪. శ్రీకంఠా, ౧౫. బంగాలీ, ౧౬. గాంధారీ, ౧౭. సైంధవీ రాగములును, ఇందలి విభాషయందు, ౧. పౌరాలీ, ౨. మాలనా, ౩. కాలిందీ, ౪. దేవారవర్ధనీ రాగములును,

౧౨. వేసరషాడవ భాషారాగమున ౧. బాహ్యా, ౨. బాహ్యాషాడవములును, ఇందలి విభాషయందు ౧. పార్వతీ, ౨. శ్రీకంఠరాగములును,

౧౩. మాళవపంచమభాషా రాగమున ౧. వేదవతీ, ౨. భావినీ, ౩. విభావినీలును,

౧౪. తానభాషారాగమున ౧. తానోద్భవరాగమును,

౧౫. పంచమషాడవభాషా రాగమున ౧. పోతారాగమును మతాంతర రేవగుప్తభాషారాగమున శాకరాగమును, ఇందలి విభాషయందు పల్లవీ రాగమును, అంతరభాషయందు ౧. భాసవలితా, ౨. కిరణావలీ, ౩. శాకవలితా రాగములు నిట్లు కలిగినవని శార్ఙ్గదేవుడు ఎంచినాడు.

## ౩. ఉపరాగములు

శార్ఙ్గదేవు డింకను ఉపరాగములు శుద్ధరాగములునని మరి రెండువిభాగములను చెప్పినాడు. ఇట్లు ౮ ఉపరాగములును, ౨౦ శుద్ధరాగములును ఇతడు పేర్కొనుట గమనింపదగును. ౧. శకతిలక, ౨. టక్కసైంధవ, ౩. కోకిలపంచమ, ౪. రేవగుప్త, ౫. పంచమషాడవము, ౬. భావనాపంచమము, ౭. నాగగాంధార, ౮. నాగపంచమములు ఉపరాగములుగను,

## ౪. శుద్ధరాగములు

౧ శ్రీరాగము, ౨. నట్ట, ౩. బంగాళ, ౪. ద్వితీయబంగాళ, ౫. భాస, ౬. మధ్యమషాడవ, ౭. రక్తహంస, ౮. కోల్హాహస, ౯. ప్రసవ, ౧౦. ధ్వని, ౧౧ భైరవ, ౧౨. మేఘరాగము, ౧౩. సోమ, ౧౪. కామోద, ౧౫. ద్వితీయకామోద, ౧౬. ఆమ్రపంచమ, ౧౭. కందర్ప, ౧౮. దేశాఖ్య, ౧౯. కైశికకుభ, ౨౦. నట్టనారాయణ రాగములు శుద్ధరాగములుగను పేర్కొనబడినవి.

## ౫. రాగాంగాది విభాగము

ఇక రాగాంగభాషాంగోపాంగ రాగవిభాగము గూర్చి చెప్పుచు శార్ఙ్గదేవుడు పూర్వప్రసిద్ధము లనియు, నాధునికములనియు నిట్లు రెండుతెరగుల రాగములు జెప్పుట గమనింపదగినది.

## పూర్వప్రసిద్ధరాగములు—౧. రాగాంగములు

౧. శంకరాభరణ, ౨. ఘంటారవ, ౩. ఆహంసీ, ౪. దీపక, ౫. రీతి, ౬. పూర్ణాటిక, ౭. పూటా, ౮. పల్లవిరాగములు,

—ii. భాషాంగములు

౧. గంభీరి, ౨. వైహాటీ, ౩. స్వశికా, ౪. ఉత్పలీ, ౫. గోల్లీ, ౬. నాదాంతరీ, ౭. నీలోత్పలీ, ౮. ఛాయా, ౯. తరంగిణీ, ౧౦. గాంధారగీతి, ౧౧. గోరంజి రాగములు.

—iii. క్రియాంగములు

౧. భావక్రీ, ౨. స్వభావక్రీ, ౩. శివక్రీ, ౪. మరువక్రీ, ౫. త్రినేత్రక్రీ, ౬. కుముదక్రీ, ౭. దనుక్రీ, ౮. ఓజక్రీ, ౯. ఇంద్రక్రీ, ౧౦. నాగకృతి, ౧౧. ధన్యకృతి, ౧౨. విపాయక్రీ.

—iv. ఉపాంగములు

౧. పూర్ణాట, ౨. దేవల, ౩. గురంజికా.

శార్ఙ్గదేవుని కాలమందలి ప్రసిద్ధరాగములు

i. రాగాంగములు

౧. మధ్యమాది, ౨. మాళవశ్రీ, ౩. తోడీ, ౪. బంగాళ, ౫. భైరవ, ౬. వరాటీ, ౭. గుర్జరీ, ౮. గౌడ, ౯. కోలాహల, ౧౦. వసంత, ౧౧. ధనశ్రీ, ౧౨. దేశీ, ౧౩. దేశాఖ్యా.

ii. భాషాంగములు

౧. డోంబిక్రీ, ౨. ప్రథమమంజరీ, ౩. శుద్ధవరాటికా, ౪. ఆసావరీ, ౫. ఆదికామోదీ, ౬. నాగధ్వని, ౭. వేలావలీ, ౮. నట్టా, ౯. కర్ణాటబంగాళా.

iii. ఉపాంగములు

౧. కుంతలవరాటీ, ౨. ద్రావిడవరాటీ, ౩. సైంధవీవరాటీ, ౪. స్తావవరాటీ, ౫. హతస్వరవరాటీ, ౬. ప్రతాపవరాటీ, ౭. ఛాయతోడి, ౮. తురుష్కతోడి, ౯. మహారాష్ట్రగుర్జరీ, ౧౦. సౌరాష్ట్రగుర్జరీ, ౧౧. దక్షిణగుర్జరీ, ౧౨. ద్రావిడగుర్జరీ, ౧౩. భుంఛ్ఛికా, ౧౪. స్తంభతీర్థికా, ౧౫. ఛాయావేలావలీ, ౧౬. ప్రతాపవేలావలీ, ౧౭. భైరవీ, ౧౮. సింఘలీకామోదా, ౧౯. ఛాయానాట్టా, ౨౦. రామకృతి, ౨౧. పల్లాతికా, ౨౨. మహులారీ, ౨౩. మహులారీ, ౨౪. కర్ణాటగౌడ, ౨౫. దేశవాలగౌడ, ౨౬. తురుష్కగౌడ, ౨౭. ద్రావిడగౌడ.

ఇట్లు గ్రామరాగకాలమున (౧౫-వ శతాబ్దమువరకు) ౧. గ్రామరాగములు, ౨. ఉపరాగములు, ౩. శుద్ధరాగములు, ౪. భాషారాగములు, ౫. విభాషారాగములు, ౬. అంతరభాషారాగములు, ౭. రాగాంగములు, ౮. ఉపాంగములు, ౯. భాషాంగములు, ౧౦. క్రియాంగములు అను ౧౬ విధములగు రాగములు వాడబడుచుండినట్లు తెలియుచున్నది. భరతుడు, నంది, దత్తిలుడు, కోహలుడు, మతంగుడు మున్నగు ప్రాచీనవాగ్గేయుల కాలమున ౧. గ్రామరాగములు, ౨. ఉపరాగములు, ౩. శుద్ధరాగములు, ౪. (మరి) భాష, ౫. విభాష, ౬. అంతరభాషారాగములు ఆరువిధములుగనవి మాత్రము ప్రబలినట్లు తెలియుచున్నది. రాగాంగోపాంగాదిరాగవిభాగము శార్ఙ్గదేవుని కాలమునకు కొంతపూర్వమునుండి ప్రబలినను ఇతని యనంతరమునుండిమాత్రము ముఖ్యముగ దక్షిణమున కరము ఆదరింపబడుట విదితము. రాగాంగాదివిభాగము భరతమునివలె సంగీతమున స్వతంత్ర గ్రంథములను వెలయించిన శాస్త్రవేత్తల కాలమునుండి కలిగియుండవచ్చును. సంగీతమున ఘనులై స్వతంత్రముగ సంగీతశాస్త్రములను రచించిన ప్రాచీనులలో కోహల, దత్తిల, నంద, మతంగ, కాశ్యప, విశాఖిల, బ్రహ్మ, వ్యాల, సదాశివ (లేక రుద్ర), తుంబురు, ఆంజనేయ, నారద, శతతప, ఉమాపతి మున్నగువారు ప్రసిద్ధులు. వీరి యనంతరము ౧౫-వ శతాబ్దమువరకు వెలసిన ఉద్భట, లొల్లట, శంకుక, భట్టనాయక, రాహుల, భట్టయంత్ర, అభినవగుప్త, కీర్తిధర, మాతృగుప్తాచార్యాది శాస్త్రవేత్తలెల్లరు తమ పూర్వుల గ్రంథములకు వ్యాఖ్యానములు రచించుచుండిరి. వీరును తమతమ మతముల నందందు చేర్చుచుం గమనింతుము. వీరి యనంతరముండిన శార్ఙ్గదేవుడు తనకాలమునాటి సంగీతముగూర్చి చెప్పుటకు స్వతంత్ర గ్రంథమును రచించి యందు పూర్వాపరమతములు రెండును చేర్చి చెప్పెను. అందుచే నితడు తనగ్రంథమున చెప్పిన పూర్వపు గ్రామరాగములందలి భాషావిభాషాది రాగ విభాగముక్రమముగ రాగాంగాది విభాగపద్ధతికి చోటిచ్చినట్లు గ్రహింతుము. అందుచే గ్రామరాగములు భాషావిభాషాదులు మార్గరాగములనియు, నవి గంధర్వలోకమున విదితమనియు, శార్ఙ్గదేవుని కాలమున రాగాంగాదులే వాడబడుచుండెననియు నిట్లు అనంతర గ్రంథకర్తలు ఎంచినట్లు చెప్పవలసియున్నది. వెంకటమఖియు నిట్లు అభిప్రాయపడినాడు. మరియు నితడు,

> "గ్రామరాగ శ్చోపరాగో రాగా భాషావిభాషికాః,
> తథై వాంతరభాషాఖ్యా రాగాంగాఖ్యా స్తతః పరమ్.
> భాషాంగాని క్రియాంగాని ఉపాంగానీతి చ క్రమాత్,
> దశ స్వేతేషు రాగేషు గ్రామరాగాదయః పునః.
> రాగా స్త్వంతరభాషాన్తా మార్గరాగా భవన్తి వట్,
> తతో గంధర్వలోకేన ప్రయోజ్యా స్తే వ్యవస్థితాః."

కాని కొందరు అహోబలుడు, దామోదరుడు మున్నగు వాగ్గేయులు శార్ఙ్గదేవుని పూర్వోక్తములయిన భాషావిభాషాది రాగములను, యీరాగపద్ధతిని విడువలేక కాబోలు, భాషారాగములను పురుషరాగములుగ నెంచియు, విభాషాదుల స్త్రీరాగములుగ గ్రహించియు నీ చొప్పున తమ రాగరాగిణీ పద్ధతిని వెలయించియుండిరి. ఉత్తరదేశమున నిప్పుడును ఈపద్ధతి వెలసియుంట విదితము. దక్షిణమున శార్ఙ్గదేవుడు తనకాలమున ప్రసిద్ధములుగ జెప్పిన రాగాంగాదులే ప్రబలియుంటయు, రామామాత్యుడు, సోమనార్యుడు మున్నగు

వారి కియ్యవి మార్గదర్శకము లగుటయు గ్రహింతుము ఈరాగాంగ రాగములనే వీరు మేళములు లేక మేళకర్తలుగ నెంచిచెప్పిరి. ఈ పద్ధతి కర మనుసరణీయ మగుచున్నది.

## దామోదరుని రాగరాగిణీలు

ఔత్తరాహ సంగీతశాస్త్ర వేత్తలందు ఘనతగాంచిన దామోదరుడు 'సంగీతదర్పణ' మను గ్రంథమును రచించి వినుతికెక్కెను. ఇతడు ఉత్తరహిందూస్థానసంగీతజ్ఞులచే మార్గదర్శకుడుగ నెంచబడుచున్నాడు. శార్ఙ్గదేవుని భాషావిభాషాది పద్ధతి రాగరాగిణీ పద్ధతికి తుల్యమని ఎంచి యట్లు వెలయించినాడు. ఇతడు చెప్పిన రాగము లిట్లున్నవి —

పురుషరాగములు:—౧. శ్రీరాగము, ౨. వసంత, ౩. పంచమము, ౪. మేఘరాగము, ౫. భైరవరాగము, ౬. బృహన్నాటరాగము లారును పురుషరాగములు.

స్త్రీరాగములు:—శ్రీరాగముయొక్క భార్యలు:—౧ మాలవీ, ౨. త్రివణీ, ౩. గౌరీ, ౪. కేదారీ, ౫. మధుమాధవీ, ౬. పాహాడికా రాగములు.

—వసంతరాగము భార్యలు:—౧ దేశీ, ౨. దేవగిరీ, ౩. వరాటీ, ౪. తోడీ, ౫. లలితా, ౬. హిందోలీరాగములు.

—భైరవరాగ భార్యలు:—౧. భైరవీ, ౨. గుర్జరీ, ౩. రామక్రీ, ౪. గుణక్రీ, ౫. బంగాలీ, ౬. సైంధవీరాగములు.

—పంచమరాగభార్యలు:—౧. విభాషా, ౨. భూపాలీ, ౩. కర్ణాటీ, ౪. బడహంసకా, ౫. మాలవీ, ౬. పటమంజరీరాగములు.

—మేఘరాగభార్యలు:—౧ మల్లారీ, ౨. సొరటీ, ౩. సావేరీ, ౪. కౌశికీ, ౫. గాంధారీ, ౬. హరశృంగారరాగములు.

—నట్టనారాయణరాగభార్యలు:—౧. కామోదీ, ౨. ఆభీరీ, ౩. నాటికా, ౪. కల్యాణీ, ౫. సారంగీ, ౬. నట్టహంజీరారాగములు.

దామోదరుని మతము ననుసరించి పురుషరాగములు ఆరును, స్త్రీరాగములు ముప్పదియారును నగుచున్నవి.

## హనుమన్మతము

పురుషరాగములు:—౧. భైరవరాగము, ౨. కౌశికరాగము, ౩. హిందోలరాగము, ౪. దీపకరాగము, ౫. శ్రీరాగము, ౬. మేఘరాగము.

స్త్రీరాగములు :— భైరవ రాగముయొక్క భార్యలు :— ౧. మధ్యమాది, ౨. భైరవీ, ౩. బంగాళీ, ౪. వరాటీ, ౫. సైంధవీ,

—దైశికరాగభార్యలు:—౧. తోడి, ౨. సంబావతీ, ౩. గౌరీ, ౪. గుణక్రీ, ౫. కకుభ.

—హిందోళరాగభార్యలు:—౧ వేలావలి, ౨. రామక్రీ, ౩. దేశాఖ్య, ౪. పటమంజరీ, ౫. లలిత.

—దీపకరాగభార్యలు:—౧. కేదారీ, ౨. కానడా, ౩. దేశీ, ౪. కామోదీ, ౫. నాటికా.

—శ్రీరాగభార్యలు:—౧. వసంతీ, ౨. మాలవీ, ౩. మాలశ్రీ, ౪. ధంనాసికా, ౫. అసావేరీ.

—మేఘరాగభార్యలు:—౧. మల్లారీ, ౨. దేశకారీ, ౩. భూపాలీ, ౪. గుర్జరీ, ౫. టంకీ.

ఇక దక్షిణమందలి మేళపద్ధతి ననుసరించు రాగములగూర్చి కొంత ఎరుగుదము. ఈ మేళములు శార్ఙ్గదేవుడు చెప్పిన రాగాంగోపాంగ భాషాంగ రాగపద్ధతి ననుసరించినవేయని గ్రహింతుము. రాగాంగపద్ధతి దక్షిణదేశమం దనుసరింపబడినను ఆయాకాలములందలి మేళములు భిన్నములుగనే యున్నవని చూతుము. శ్రుతులు, ప్రకృతి వికృతస్వరములు మున్నగు అంశములందు రామామాత్యుడు, సోమనార్యుడు, వెంకటమఖి, పుండరీకవిఠలుడు మున్నగు వాగ్గేయులెట్లు భిన్నమతములను చెప్పినదియు నిదివరలో చెప్పియుంటిమి. రాగవిభాగము దక్షిణమున ఒక్కపద్ధతిగ మాత్రము మనము చూచుచున్నను మేళములు, వీని ఉపాంగ భాషాంగాది జన్యములు వారివారి మతములందు భిన్నములుగనే యున్నవి. ఈయంశములు ముందు చర్చింతును.

## మేళపద్ధతి

## రామామాత్యుని మేళములు

రామామాత్యుడు తన మతము ననుసరించిన ప్రకృతి వికృతి స్వరములను చేర్చి యిరువది మేళములను చెప్పియుండెను. ఇతని మతము ననుసరించి జన్యజనకరాగము లిట్లున్నవి.—

### జనకరాగములు

౧. ముఖారీ, ౨. మాళవగౌడ, ౩. శ్రీరాగము, ౪. సారంగనాట, ౫. హిందోళ, ౬. శుద్ధరామక్రియ, ౭. దేశాక్షీ, ౮. కన్నడగౌడ, ౯. శుద్ధనాట, ౧౦. అహీరీ, ౧౧. నాదరామక్రీ, ౧౨. శుద్ధవరాటీ, ౧౩. రీతిగౌడ, ౧౪. వసంతభైరవీ, ౧౫. కేదారగౌడ, ౧౬. హెజ్జజ్జి, ౧౭. సామవరాళీ, ౧౮. రేవగుప్తి, ౧౯. సామంత, ౨౦. కాంభోజి.

వీని జన్యరాగము లిట్లు చెప్పబడెను—

### మేళరాగములు—జన్యములు

౧. ముఖారీ ౧. ముఖారీ.

౨. మాళవగౌడ:—౧. మాళవగౌడ, ౨. లలితా, ౩. బహుళీ, ౪. సౌరాష్ట్రి, ౫. గుర్జరీ, ౬. మేచబౌళీ, ౭. ఫలమంజరీ, ౮. గుండక్రి, ౯. సింధురామక్రీ, ౧౦. ఛాయాగౌళ, ౧౧ కురంజి, ౧౨. కన్నడ బంగాళ, ౧౩. మంగళకైశిక, ౧౪. మలహరి.

౩. శ్రీరాగము:—౧. శ్రీరాగము, ౨. భైరవీ, ౩. గౌళీ, ౪. ధన్యాసీ, ౫. శుద్ధభైరవి, ౬. వేళావళీ, ౭. మాళవశ్రీ, ౮. శంకరాభరణం, ౯. ఆంధాళీ, ౧౦ దేవగాంధార, ౧౧. మధ్యమాది.

౪. సారంగనాట:—౧. సారంగనాట, ౨. సావేరీ, ౩. సాలగభైరవీ, ౪. నటనారాయణి, ౫. శుద్ధవసంత, ౬. పూర్వగౌడ, ౭. కుంతళవరాడి, ౮. భిన్నషడ్జ, ౯. నారాయణీ.

౫. హిందోళ:—౧ హిందోళ, ౨. మార్గహిందోళ, ౩. భూపాల.

౬. శుద్ధరామక్రియ:—౧. శుద్ధరామక్రియ, ౨. బౌళీ, ౩. ఆంధ్రదేశీ, ౪. దీపకం.

౭. దేశాక్షీ:—౧. దేశాక్షీ.

౮. కన్నడగౌళ:—౧. కన్నడగౌళ, ౨. ఘంటారవ, ౩. శుద్ధబంగాళ, ౪. ఛాయానాట, ౫. తురుష్కతోడి, ౬. నాగధ్వని, ౭. దేవక్రియ.

౯. శుద్ధనాట:—౧. శుద్ధనాట.

౧౦. అహిరీ:—౧. అహిరీ.

౧౧. నాదరామక్రియ:—౧. నాదరామక్రియ

౧౨. శుద్ధవరాళి:—౧. శుద్ధవరాళి.

౧౩. గౌళ:—౧. రీతిగౌళ.

౧౪. వసంతభైరవీ:—౧ వసంతభైరవీ, ౨. సోమరాగం.

౧౫. కేదారగౌడ:—౧. కేదారగౌడ, ౨. నారాయణగౌడ.

౧౬. హెజ్జజ్జి:—౧. హెజ్జజ్జి.

౧౭. సామవరాళి:—౧. సామవరాళి.

౧౮. రేవగుప్తి:—౧. రేవగుప్తి.

౧౯. సామంత:—౧. సామంత.

౨౦. కాంభోజీ:—౧. కాంభోజీ.

## సోమనార్యుని (జనక) మేళరాగములు

రామామాత్యుని కాలమున కర్ధశతాబ్దము వెనుక నుండిన (క్రీ. శ. ౧౬౦౯) సోమనార్యుని మేళరాగములు రామామాత్యుడు చెప్పిన పై మేళములకన్న భిన్నములుగ నున్నవి. రామామాత్యుడు జన్యరాగములుగ జెప్పినవి సోమనార్యునకు జనకరాగములు (మేళరాగములు)గ నున్నవి. ఈభిన్నాభిప్రాయముల గూర్చి ముందు నేర్తుము. సోమనార్యుడు మొత్తము మేళరాగములు ఇరువదిమూడు పేర్కొనినాడు. వీనియందు జన్యరాగములు డెబ్బదియారు కలవు. వీని నిట్లు గ్రహింతము—

## మేళరాగములు—జన్యరాగములు

౧. ముఖారీ.—౧. ముఖారీ, ౨. తురుష్కతోడీ (హుసేనీ).

౨. రేవగుప్తి:—౧. రేవగుప్తి.

౩. సామవరాళి:—౧. సామవరాళి, ౨. వసంతవరాళి.

౪. తోడీ.—౧. తోడీ.

౫. నాదరామక్రి—౧. నాదరామక్రి.

౬. భైరవ.—౧. భైరవ, ౨. పౌరవికా.

౭. వసంత—౧. వసంత, ౨. టక్క, ౩. హెజ్జోజ, ౪. హిందోళ.

౮. వసంతభైరవీ.—౧. వసంతభైరవీ, ౨. మారవికా.

౯. మాళవగౌడ:—౧. మాళవగౌడ, ౨. చౌతీగౌడ, ౩. పూర్వ, ౪. పాడీ, ౫. దేవగాంధార, ౬. గౌడక్రియా, ౭. కురంజీ, ౮. బహులీ, ౯. రామక్రి, ౧౦. పాడక, ౧౧. ఆసావరీ, ౧౨. పంచమ, ౧౩. బంగాళ, ౧౪. శుద్ధలలిత, ౧౫. గుర్జరీ, ౧౬. పరజ, ౧౭. శుద్ధగౌడ.

౧౦. రీతిగౌడ:—౧. రీతిగౌడ.

౧౧. ఆభీర:—౧. ఆభీరి.

౧౨. హమీరి:—౧ హమీర, ౨. విహంగడ, ౩. కేదార.

౧౩. శుద్ధవరాటీ:—౧ శుద్ధవరాటీ.

౧౪. శుద్ధరామక్రి:—౧. దేశకార, ౨. లలిత, ౩. జైతశ్రీ, ౪. త్రావణీ, ౫. దేశీ.

౧౫. శ్రీరాగము:—౧. శ్రీరాగం, ౨. మాలాశ్రీ, ౩. ధన్యాసికా, ౪. భైరవీ, ౫. ధవలం, ౬. సైంధవీ.

౧౬. కల్యాణరాగము:—కల్యాణి.

౧౭. కాంభోగి.—౧. కాంభోది, ౨. దేవక్రి.

౧౮. మల్లారి:—౧ మల్లారి, ౨ నటమల్లారి, ౩. పూర్వగౌడ, ౪. భూపాలీ, ౫. గౌడ, ౬. శంకరాభరణం, ౭. నటనారాయణ, ౮. నారాయణ గౌడ, ౯. ద్వితీయకేదార, ౧౦. సాలంకనాట, ౧౧ వేలావలీ, ౧౨. మధ్యమాదీ, ౧౩. సావేరీ ౧౪. సౌరాష్ట్రి.

౧౯. సామంత:—౧ సామంత.

౨౦. కర్ణాట:—౧. కర్ణాట, ౨ అడ్డాణ, ౩. నాగధ్వని, ౪. శుద్ధబంగాళ, ౫. వర్ణనాట, ౬. తురుష్కతోడి.





(21) 1. షేక్స్పియరు నాటకరంగముయొక్క తాళపుచెవిని భవననిర్మాత్రి ఎలిజబెత్తు స్కాటుకన్య యువరాజున కందిచ్చుట.
2. స్త్రీలకు క్రొత్తరకపు చెరసాల—ఆస్పత్రి, న్యూయార్కు.





1. అట్టావా సమావేశ భవనము.
2. అట్టావా సమావేశమునకు భారతీయ ప్రతినిధులు.

౨౧. దేశాక్షీ:—౧. దేశాక్షీ.

౨౨. శుద్ధనాట:—౧ శుద్ధనాట.

౨౩. సారంగ:—౧. సారంగ.

## వెంకటమఖి కాలమునాటి మేళరాగములు

సోమనార్యుని కాలమునకు మరియొక యర్ధశతాబ్దమువెనుక వెంకటమఖి యను సంగీతశాస్త్రజ్ఞుడు వెలసి సంగీతమున నూతన యుగము ప్రారంభింపజేసెను. ఇతడు తంజావూరు రాజ్యము నేలిన నాయకరాజులనొద్ద అమాత్యుడై సకలశాస్త్ర పారంగతుడై సంగీత లోకమునకు మార్గదర్శకుడై వెలసియుండెను. వెంకటమఖిమతమునే యనంతరముండిన దీక్షితులు, శ్యామశాస్త్రి, త్యాగరాజు మున్నగు వాగ్గేయకారులేమి, మహావైద్యనాథయ్యరు, శ్రీనివాసయ్యంగారు, శరభశాస్త్రి, తిరుక్కోడికావల్ కృష్ణయ్యరు మున్నగు కొంతకాలము వరకు వెలసియుండిన సంగీతశాస్త్రజ్ఞులేమి, ఇప్పటివారేమి యవలంబించు చుండిరని చెప్పబడుచున్నది. ఇతనిచే నేర్పరుపబడిన మేళ ప్రస్తారపద్ధతి నేటికిని వేయినోళ్ల శ్లాఘింపబడు చున్నది వెంకటమఖి మేళప్రస్తారపద్ధతిచే డెబ్బదిరెండు మేళరాగముల నేర్పరచినను తనకాలమున ప్రసిద్ధములగు రాగములు పందొమ్మిది మాత్రము కలవని చెప్పినాడు. ఇతని మేళరాగములు జన్యములతో నిట్లున్నవి.

### మేళరాగములు — జన్యరాగములు

౧. ముఖారీ:—౧ ముఖారీ.

౨. సామవరాళీ:—౧. సామవరాళీ.

౩. భూపాల:—౧. భూపాల, ౨. భిన్నషడ్జ.

౪. వసంతభైరవీ:—౧ వసంతభైరవీ.

౫. గౌళ:—౧. గౌళ, ౨ గుండక్రియా, ౩. సాలంగనాట, ౪. నాదరామక్రియ, ౫. లలిత, ౬. పాడీ, ౭. గుర్జరీ, ౮. బహులీ, ౯. మల్లహరీ, ౧౦. సావేరీ, ౧౧. ఛాయాగౌళ, ౧౨ పూర్వగౌళ, ౧౩. కర్ణాటబంగాళ, ౧౪. సౌరాష్ట్రి.

౬. ఆహరీ:—౧. ఆహేరీ, ౨. హిందోళవసంత.

౭. భైరవీ:—౧. భైరవీ, ౨. హిందోళ, ౩. ఆహీరీ, ౪. ఘంటారవ, ౫. రీతిగౌళ.

౮. శ్రీరాగము:—౧. శ్రీ, ౨. సాలగభైరవీ, ౩. ధన్యాసీ, ౪. మాళవశ్రీ, ౫. దేవగాంధార, ౬. ఆంధాళీ, ౭. వేళావళీ, ౮. కన్నడగౌళ.

౯. హేజ్జుజ్జీ:—౧. హేజ్జుజ్జీ, ౨. రేవగుప్తి.

౧౦. కాంభోజీ:—౧. కాంభోజీ, ౨. కేదారగౌళ, ౩. నారాయణగౌళ.

౧౧. శంకరాభరణము:—౧. శంకరాభరణం, ౨. ఆరభి, ౭. నాగధ్వని, ౪. సామ, ౫. శుద్ధవసంత, ౬. నారాయణ దేశాక్షీ, ౭. నారాయణీ.

౧౨. సామంత:—౧. సామంత.

౧౩. దేశాక్షీ:—౧. దేశాక్షీ.

౧౪. నాట—౧. నాట.

౧౫ శుద్ధవరాళీ:—౧. వరాళీ.

౧౬. పంతువరాళీ.—౧. పంతువరాళీ.

౧౭. శుద్ధరామక్రియా:—౧ శుద్ధరామక్రియా.

౧౮. సింహారవ:—౧. సింహారవ.

౧౯. కల్యాణీ:—౧. కల్యాణీ.

## రాజాతులజేంద్రుని మేళములు

రాజా తులజేంద్రుడు తన 'సంగీతసారామృత' గ్రంథమున పై విధమగు వెంకటమఖి మేళములకు గొంత భిన్నములుగ జనకరాగములను పేర్కొనియుంట గమనింపదగినది. తులజేంద్రుని మేళములందలి ప్రకృతి వికృతి స్వరములును భిన్నములుగనే యున్నవి. ఇతని మేళములు జన్యరాగములతో నిట్లున్నవి వీని వ్యత్యాసములు మున్నగునంశములు ముందు చర్చింతము.

### మేళరాగములు — జన్యరాగములు

౧. శ్రీరాగము:—౧. శ్రీరాగము, ౨. కన్నడగౌళ, ౩. దేవగాంధార, ౪. సాళగభైరవీ, ౫. శుద్ధదేశీ, ౬ మాధవమనోహరీ, ౭. మధ్యమగ్రామ, ౮. సైంధవీ, ౯. హుసేనీ, ౧౦. కాపీ. షాడవములు—౧. శ్రీరంజనీ, ౨ మాళవశ్రీ, ౩. దేవమనోహరీ, ౪. జయంతసేన, ౫. మణిరంగ. ఔడవములు,—౧. మధ్యమాది, ౨. శుద్ధధన్యాసి.

౨ శుద్ధనాట:—౧. శుద్ధనాట, ౨ ఉదయారవిచంద్రిక.

౩. మాళవగౌడ:—౧. మాళవగౌడ, ౨. సాలంగనాట, ౩. ఆర్ధదేశీ, ౪. ? ౫. టక్క, ౬. గుర్జరీ, ౭. గుండక్రియ, ౮. ? ౯. నాదరామక్రీ, ౧౦. సౌరాష్ట్రి, ౧౧. మంగళకైశికీ, ౧౨. మేచబౌళీ, ౧౩. మాగధీ, ౧౪. గౌరీ, మనోహరీ, ౧౫. మారువ, ౧౬ గౌళిపంతు, ౧౭. సావేరీ, ౧౮. పూర్వీ, ౧౯. విభాస. షాడవములు—౧ గౌళ, ౨. పాడీ, ౩. లలిత, ౪. కన్నడబంగాళ, ౫. మల్లహరీ, ౬. పూర్ణపంచమ, ౭. బహులీ. ఔడవములు —౧. శుద్ధసావేరీ, ౨. మేఘరంజనీ, ౩. రేవగుప్తి, ౪. మాలవీ.

౪. వేలావళీ:—౧. వేలావళీ.

౫. వరాళీ:—౧. వరాళీ.

౬. శుద్ధరామక్రియ:—౧. శుద్ధరామక్రియ, ౨. దీపిక.

౭. శంకరాభరణము:—౧. శంకరాభరణం, ౨. ఆరభి, ౩. శుద్ధవసంత, ౪. సరస్వతీమనోహరి, ౫. పూర్వగౌళ, ౬. నారాయణి, ౭. నారాయణదేశాక్షీ, ౮. సామంత, ౯. కురంజీ, ౧౦. పూర్ణచంద్రిక, ౧౧. సురసింధు, ౧౨. గౌడమల్లారీ, ౧౩. కేదార, ౧౪. బిలహరీ.

౮. కాంభోజీ:—౧. కాంభోజి, ౨. నారాయణగౌళ, ౩. కేదారగౌడ, ౪. బహుహంస, ౫. నాగధ్వని, ౬. ఛాయాతరంగిణి, ౭. ఈశనోహరీ, ౮. యదుకులకాంభోజి, ౯. నాటకకురంజి, ౧౦. కన్నడ.

షాడవములు—౧. నటనారాయణీ, ౨. ఆంధాలీ, ౩. సామ, ౪. మోహన.

ఔడవములు—౧. దేవక్రీ, ౨. మోహనకళ్యాణ.

౯. భైరవీ:—౧. భైరవీ, ౨. ఆహిరీ, ౩. ఘంటారవ, ౪. ఇందుఘంటారవ, ౫. రీతిగౌడ, ౬. ఆనందభైరవీ, ౭. హిందోళవసంత, ౮. ఆభేరీ, ౯. ధన్యాసీ, ౧౦. నాగగాంధారీ.

౧౦. ముఖారీ:—౧. ముఖారీ.

౧౧. వేగవాహినీ:—౧. వేగవాహినీ.

౧౨. సింధురామక్రీ:—౧. సింధురామక్రియ, ౨. పంతువరాళి.

౧౩. హెజ్జుజ్జి:—౧. హిజ్జుజ్జి.

౧౪. సామవరాళీ:—౧. సామవరాళీ, ౨. గాంధారపంచమం, ౩. భిన్నపంచమం.

౧౫. వసంతభైరవీ:—౧. వసంతభైరవీ, ౨. లలితపంచమం.

౧౬. భిన్నషడ్జం:—౧. భిన్నషడ్జం, ౨. భూపాలం.

౧౭. దేశాక్షీ:—౧. దేశాక్షీ.

౧౮. ఛాయనాట:—౧. ఛాయనాట.

౧౯. సారంగ:—౧. సారంగ.



ఆకాశము

ఛాయాచిత్రకారుడు: కె. కృష్ణమూర్తిగారు.

# గానము

కుడితిపూడి అచ్చమాంబగారు

> చైతన్యం సర్వభూతానాం నిర్వృతిం జగదాత్మనామ్,
> నాదబ్రహ్మ సదానంద మద్వితీయ ముపాస్మహే.

"గానమువంటి విద్య నిక గాన" మన్న కవివాక్య మెంత రసార్ద్రమైనది. చీమ మొదలుకొని చిన్మయునివఱకు, పామరుడు మొదలుకొని పండితునివఱకు నీరసాయన మెంత నిట్టలమై యమ్ముడుపోవుచున్నది? కవికుమారుని కావ్యగీతములో, కాపుకన్నెల కలగర స్వనములలో, పసిపాపని పాలకంఠములో దీనికి స్థాయి గలదు. జోలపాటల జోగాడనేర్చి, ఏలపాటల నోలాడినది.—"రంగా, రంగా భిక్షాం దేహి" యను బిచ్చగాని యిరుగుపొరుగున బెరిగినది. "ఔర నాయన్నా" యను హాస్యములో, "అమ్మనాయనో" యను అలవటింతలో నందగించినది. నిశీథసమయమున మైలు దూరమున గుఱ్ఱపు బండి నడపుచు నిర్జనమై శాంతి సంస్థాపితమైన మధురవేళలో కిన్నరస్వరమున కంఠమెత్తి గిల్లుమన నాయుడుబావపదము పాడు ప్రకృత్యుపాసకుని నుతింపజేసి పాంథుని యలమట బాపిన దీ గానలహరియే.—"శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ" యన్న మహానుభావుని జన్మ సార్థకమైనది. గాన సానందుడై లయించి సాతత్యము జెందియుండవచ్చును. గొంతుక తిన్ననిదై యేడ్చినా, ఇంకొకింత సేపైన నేడ్వదేల యని చెవులు కోసికొనివా రుందురా?

కమ్మనికంఠమునకలువరించిన నిద్రనల్ల జెడగొట్టుకొని విన నుత్సహింపమా? కోకిల గొంతుకలో పట్టెడు పంచదార పడదీసి క్రుక్కిన పాపిష్ఠిబ్రహ్మ కాకికంఠములో కాలవిషము పోసినాడేమి? ఆలయంబారవముల కులరిన యంతరాత్మ బత్తెల బాబాకరములకు పడిచచ్చునే! ఎందున్న దీ కిటుకు? ఉక్కుతీగలపైన రవణించిన నాదబ్రహ్మము కంచుఢక్కాపైన గంతువేయగా, ఏమి చెవులు చిల్లులుపోయె నని చీకొట్టుచుందురు. జంత్రగాత్రముల రాల్గరగించి మోళ్లు చిగురించునట్లు పాడిన త్యాగరాయని జన్మస్థానము దివ్యభూమి యైనది. ఎందరో మహానుభావుల సగర్వ పరిహారముతో "రార మా యింటిదాక" యన్న రాగరసము గడలుకొన్నది. నేటికి భారతప్రాంగణములయందు త్యాగన్న చిరంజీవియై ప్రత్యూషప్రసన్న మైన మంగళగీతముల నాలపించుచున్నాడు. సుబ్రహ్మణ్య సుకవి విఱుపుమెఱుపులు ప్రకృత్యుపాసకుల హృదయాకాశముల లీనములైనవి. సహజమై సాపుసంతరింపు లున్న కంఠము గల పల్లెపిల్ల పదము మూ కానందదాయిగాని, కృత్రిమముతో పదునారేండ్లు చన్నీళ్లకుండసాధనజేసిన రాగి గాలికూడ మా కడకు సోకగూడదు. కవిత్వము, గానము, చిత్రము నను నీ మూటినే లలితకళలని తద్జ్ఞులు భావించిరి. గాన మిసుకలో నీరమువలె తాత్కాలికానందజనకమేయని యుపేక్షించువారి కిది గొడ్డటిపెట్టనియే భావింతుము. కవిత్వము, చిత్రకళ విజ్ఞానమయకోశము గలవానికే

యానందజనకములు గాని, గానమన్న చైతన్యాపరపర్యాయమైన ప్రాణమన్న సర్వమున కని యూహింతుము. గాన మాధురిని వలచి వ్యాసునంతటివాడుగూడ (కృష్ణ పాత్రద్వారా) "నాహం వసామి వైకుంఠే నయోగి హృదయాంతరే, మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద" యని యనిపించినాడు. రవీంద్రసార్వభౌము డెచ్చోట గానము, చిత్రకళ, కవిత్వము అనునవి యుండవో, లేక ప్రత్యేకముగాగాని యుండవో, యా వీడు కాడని, యామానవహృదయము మంటిదద్దళమని వాకొన్నాడు. నిజమున కింతియే. మన కావ్యసంసార మందుగూడ ప్రతికవియు నాయికను సంగీతములో మఱి యేడిపించివాడు. ఇటీవలి విమర్శకుల కిది హేయభాజన మైనది. ఏడ్చినా శుద్ధముగానే యుండవలయునన్న నా నుడియేని వినియుండన ట్లున్నారు. వరూధిని వేదన నెపమున కొండలాటిది గాటంక మున్నను దానినుండి కలస్వనము త్రవ్వితీసినది,—సత్య, బాలపల్లవగ్రాస కషాయకంఠ కలకంఠ వధూకుల కాకలీధ్వనితో నభిమాన మానంద ముగా మార్చినది. గిరిక, రాజత్కరాంభోజ కాంభోజీ మేళవిపంచి కారవసుధాపూరంబు తోరంబుగాగ రాగరస మగ్నమైనది. మఱి కొందరు తడబడిగూడ పంచమధ్వనుల దానములీను పికాంగనాగతిని విలపించినారు. దీనికన్నిటికి మూలకారణము జాతీయతత్త్వము. వారి కత్తిపోటే తుదకు కావ్యకళ దిద్దుటకును మూలమైనది. దీనిని బురస్కరించుకొని యార్ష జ్యోతి సామవేదరూపమున భారతరంగమున నవతరించినది. భరతముని ప్రభృతులు దివ్యజ్యోతుల కొన్నిటి నావిష్కరింపజేసిరి. మనవారిచే బరికల్ప్యమానులగు దేవతలలో సంగీతమునకు బ్రత్యేక జాతి (గంధర్వులు) కల్పింపబడినది. దేవతలలో బ్రత్యేకముగా తుంబురు దత్తిల నారదాంజనేయాదులు కృతహస్తులుగా జేయబడిరి. ప్రత్యేకముగా నారదునకు 'గానలోల' యను బిరుదము తగిల్చిరి. పాములు సంగీత ప్రియములట! కాననే యీశ్వరు నారాధించి సంధ్యా కాలమున స్మశానమున నాట్యమునల్పుతరి గేయముల వివరముల నడిగి యతనికి భూషణప్రాయము లైనవట! మొత్తముమీద నాదయుక్తము లెయ్యవియో యయ్యవి యన్నియు నేకోలదిగనో కూనురాగమును దీసియేని దృప్తివహించుచుండును. గానమునుగూర్చి యెన్నియో ఇతిహాసములు గలవు. నారదాంజనేయాదుల గానశ్రవణమువలన మహీధ్రము గరగుట, యదిచూచి తల్లితల్లి సంతోషించుట, యది మొదలుకొని భుజగభూషణుడు రాగరసమగ్నుడగుట మొదలైన యితిహాసముల వినియే యున్నాము. ఇతరవాఙ్మయముకంటె మన తెనుగున ఛందోబద్ధమగు గానసామగ్రి కావలసినంత లభింపగలదు. జాను తెనుగునుడికారపు సొంపుబెంపటువంటిది. సంస్కృతమున జయదేవుడు, నారాయణతీర్థులు పుట్టకుతేనె లుట్టిపడునట్టి రచనల నూల్కొలిపిరి గాని, అది సర్వజన సామాన్యముగ నుండకపోవుటచే త్యాగరాయడే ముందు తలపింపవలసినవాడయ్యె. గానయోగ్యములగు ఛందస్సులతో తెను గొప్పారుచున్నది. తుద కేలో కోక్తి యైనను యతిప్రాసమిళితముగాని దొండులేదు. ఇంతకు తెనుగువారు, అబ్బాయిని లాలించుట మొదలు కొని 'హరీ'యను పర్యంతము గానముతో గడపవలసినదే

సోదరసోదరీమణులు గాన మాలపించి, పులకితులై యెల్లకాలముల హృదయకల్లోలమును విడచిపుచ్చి లలితకళ యగు గానకళ నుద్ధరించుట యూసింపదగినది.

---

# బాదామి – వాతాపిపురము

కో. నరసింహాచారిగారు

వాతాపిపురము క్రీ. శ. ఆరవ శతాబ్దపు మధ్య కాలమునుండి ప్రసిద్ధదశయందుండిన పశ్చిమచాళుక్యులరాజధాని. ఇందు రాజ్యమేలిన చాళుక్యులలో రెండవ



రెండవపులకేశి

పులకేశి ప్రముఖుడు. ఇతని కాలమున పారశీకరాజ్యమునకును, చాళుక్యరాజ్యమునకును రాయబారములు జరుగుచుండినందులకు నిదర్శనములు చిత్రరూపమున అజంతాగుహాలయములందు కలవు.

ఈ సుప్రసిద్ధ చాళుక్య రాజధానియగు వాతాపిపురమునందలి ముఖ్యవిశేషములందలి గుహాలయములే. ఈ గుహాలయములు అయిదు. ఇవికాక అనేక దేవాలయములుకూడ ఇందు కలవు. గుహాలయములు బాదామి రైలు స్టేషనునకు మూడుమైళ్లదూరమున నున్నవి.

గుహాలయములు మలచబడిన కొండసమీపమున నే నేటి బాదామినగరము కలదు. పురాతనకాలమున వాతాపిపురము రెండుగోడలచే చుట్టబడి, ముందు రెండు అగడ్తలచేతను, వెనుకభాగమున ఎత్తయిన కొండ



౧. ఆలయము సమీపదృశ్యము.

చేతను రక్షింపబడుచుండెను. ఈ కొండ శిఖరమున రెండుకోట లుండెడివి. ప్రస్తుతమున నీకోటల శిథిలములు కానవగును. కొండల వరుసయందు గల వంపునందు అనేకశతాబ్దములకు పూర్వ మొక యనకట్టను కట్టి



౨. ఆలయము నైఋతినుండి చూడబడు రీతి

యొకస్వాభావికతటాకమును ఏర్పరచియుండిరి. ఈతటాకము భూతనాథతటాక మనబరగుచుండును. తటాకమును చుట్టి అనేకదేవాలయములు కలవు. అందు తూర్పుదిశయందలి దేవాలయసమూహామునకు భూతనాధాలయ ప్రథమసమూహా మని పేరు. ఉత్తరదిశయందు



3. ఆలయము తూర్పునుండి చూడబడు రీతి

గలవాటికి భూతనాధాలయ ద్వితీయ సమూహా మనిపేరు. ఇవన్నియు శివాలయములు (చిత్రములు ౧, ౨, 3). ఇవి కాక, తూర్పున తటాకము ప్రక్కనే రాళ్ల మలచిన రెండు శిల్పములు కలవు :— (౧) అనంతశయను డగు నారాయణుని విగ్రహము, (౨) బోధిసత్త్వపద్మపాణి విగ్రహము. వీనిప్రక్కనే పైజెప్పిన గుహాలయములు గూడ గలవు. మెట్లవరుస యొకటి మొదటిగుహాలయమునకును, అందుండి రెండవగుహాలయమునకును, అట నుండి నాలుగవ గుహాలయ ప్రాకారము వెలుపలకును కలదు. ఇచ్చట మెట్లవరుస రెండుగా చీలి, ఒకవరుస దక్షిణదిశయందలి కొండకొనను గల కోటకును, రెండవవరుస నాల్గవగుహాలయ ప్రాకార సమీపమునకును పోవుచున్నవి. నాలుగవగుహాలయమునకు పోవువరుస, దాని వెనుక క్రిందుగా దిగి అయిదవ గుహాలయమును చేరుచున్నది.

గుహాలయములలో మొదటిదియు, మూడవదియు, నాల్గవదియు శివాలయములు. రెండవది విష్ణ్వాలయమును, అయిదవది జైనాలయమును అయియున్నవి.



౪. గుహాలయము 1. ముందటిదృశ్యము

మూడవ గుహాలయముయొక్క వసారాయందలి యొక స్తంభముపైనుండు పశ్చిమచాళుక్యరాజగు మంగళేశ పృథ్వీవల్లభని శాసనమును బట్టి గుహాలయములు మలచబడిన కాలము క్రీ. శ. ౫౭౮ అని ఏర్పడుచున్నది.

మొదటి గుహాలయము

(చిత్రము ౪.) మెట్లెక్కి ఆలయమును సమీపింపగనే ఆలయము ముందట నొక అరుగు కలదు. ఆ యరు

గునుండి ఆలయములోనికి పోవుటకు కొన్ని చిన్న మెట్లు కలవు. ఈ చిన్న మెట్ల కిరుప్రక్కల చిత్రములు చెక్కబడి యున్నవి. ఇవన్నియు దేవగణముల శిల్పములై యున్నవి.



౫. చిన్న గుహయందలి మహిషాసురమర్దని విగ్రహము
గుహాలయము 1.

మెట్లకు ఎడమప్రక్క పదునాలుగు శిల్పములు గాయకుల దెల్పునట్టివియు, మెట్లకు కుడిప్రక్క పదుమూడు శిల్పములు



౬. గుహాలయము 1. నటరాజా

నటకుల దెల్పునట్టివియు కలవు. కుడిప్రక్క ఆలయ ముఖము ముందునకు తిరిగి L ఆకారము కలిగియున్నది.

ఈ చిన్న ప్రక్కయందు ఒక చిన్న గుహయు, ఒక చిన్న ఆలయమును కలవు. చిన్న గుహక్రింద మరి తొమ్మిది చిత్రములు కలవు. గుహయందు మహిషాసురమర్దనుని విగ్రహము కలదు (చిత్రము ౫). చిన్న గుహ కింకను కుడిప్రక్క గల చిన్న ఆలయము శిథిలమై యున్నది. ఇందు నటరాజ విగ్రహము కలదు (చిత్రము ౬). ఈ శిల్పమున నటరాజునకు పదునెనిమిది చేతులు కలవు. నటరాజునకు వెనుక నందియు, కుడిప్రక్క గణేశుడును, గణేశుని వెనుక ఇరువురు మార్దంగికులును కలరు.

ప్రధాన గుహాలయమున ముఖమునందు నాలుగు స్తంభములు కలవు. స్తంభములపై గుండ్రములగు శిల్పములు చెక్కబడియున్నవి. (చిత్రములు ౭, ౮). ఆలయ



౭. గుహాలయము 1. స్తంభముల శిఖరములు

ములోపల కుడ్యములపై అర్ధనారీశ్వరుడు, అనంతశయనుడు మొదలగు విగ్రహములు చెక్కబడియున్నవి.

### రెండవ గుహాలయము

ఇదియు ఇంచుమించుగ మొదటి గుహాలయమును పోలియున్నది. ఇది విష్ణ్వాలయము. ఇందు విష్ణువిగ్రహము కలదు. ఆలయపు అరుగునకు ప్రక్కభాగమున కుబ్జుల యొక్కయు, దేవగణముల యొక్కయు శిల్పములు అనేకములు కలవు. ఇందు ఒక అరుగుపైన ఒక ద్వారపాలుని విగ్రహము కలదు; అరుగు ప్రక్కలయందు అనేక కుబ్జ విగ్రహములు కలవు (చిత్రము ౯). ఇవికాక అనేక

సుందరవిగ్రహముల శిల్పములుకూడ ఈ ఆలయమున గలవు.



౮. గుహాలయము 1. స్తంభముపైగల చిత్రములు

మూడవ గుహాలయము

ఇది రెండవ ఆలయమునకు ఎడమప్రక్క గలదు. దీనియం దుండునది బోధిసత్త్వుని విగ్రహము. దీని వసారాలో మిక్కిలి సుందరము లగు శిల్పములు కలవు (చిత్రము ౧౦). గుహాలయపు కప్పుయొక్క అంచున ఒక సుందరమైన గరుడవిగ్రహము కలదు (చిత్రము ౧౧).



౯. గుహాలయము 2. ద్వారపాలుడు

నాల్గవ గుహాలయము

గుహాలయ సముదాయమునందంతయు ఈ నాల్గవ ఆలయమే మిక్కిలి సుందరమైనది. ఇందలి శిల్పము లన్నింటిని పూర్ణముగా వర్ణించవలెనన్న నొక గొప్ప గ్రంథమగును.

ఇచ్చట నుదాహరింపబడిన చిత్రములు మచ్చునకేకాని వేరు కాదు. వాతాపిపుర గుహాలయ శిల్పములందు కృష్ణలీలలును, రామకృష్ణులు మధురానగరమునం దొనర్చిన ధీరకృత్యములును, దశావతారములును, సముద్ర మథనమును, గరుడుడు అమృతమును హరించుకొని



౧౦. గుహాలయము 3. వసారాలోని శిల్పములలో నొకటి



నూతన జర్మనీ మంత్రివర్గము

పోవుటయు మొదలయిన యనేక పురాణ గాథలు కలవు. ఇట్టిదృశ్యములు మన పురాతనరాజ్యములు పూర్వము సజీవము లై యున్న కాలమున నెంత గంభీరముగను, గౌరవనీయములుగను నుండినవో ప్రస్తుత మంతకంత శోకోత్పాదకము లై యున్నవి. వీటి యుచ్చదశయందు చూచుటకు నోచుకొనకున్నను శిథిలావస్థయందైనను వీటిని గాంచగలిగి, తన్మూలమున నీ దృశ్యముల పూర్వస్థితిని ఊహించుకొని సంతసించుట కవకాశ మొసంగిన సర్వేశ్వరునికి వందనశతములు.



౧౧. గుహాలయము 3. ఆలయపుకప్పు అంచున గల గరుడవిగ్రహము



రామడు సీత నోదార్చుట చిత్రకారుడు: కప్పగంతుల విశ్వనాథంగారు

# బుద్ధమూర్తి

పిలకా గణపతిగారు

గ్రామసగసీతీరమందలి
యూరిసావడి కెదుటనుండిన
నింబవృక్షచ్ఛాయ బుద్ధుని
మూర్తి పడియుండెన్.

నిశ్చలమ్మగు కొలనిజలమున
యువతి యొక్కతె ఘటము ముంచెను;
చిన్నితరగలు మెల్లమెల్లగ
దీరమును జేరెన్.

గ్రామయువతులు బుజములందలి
ఘటజలమ్ములు తొణుకుచుండగ
బాలకుల నడపించుకొనుచును
నిండ్ల కేగి రటన్.

పాలచెంబులు కేల దాలిచి
లేగదూడల లాగికొనుచును
రయితులందఱు నొక్కరొక్కరె
వెడలి రాత్రోవన్.

దున్నమూపున నెక్కి పశువుల
గాలితో నదలించుకొనుచు
నోట బూరల నూదు గోపకు
మారు లేగి రటుల్.

కాకములు వృక్షమున నూగిన
నింబఫలములు మెక్కి నిర్దయ
బూదిలో బొరలాడు నాప్రభు
మూర్తిపై నుమిసెన్.

నోరులేని యనాథులకు దా
న్యాయమనియెడి పేరితో నా
యూరిపెద్దయుగూడ నట న
న్యాయములు చేసెన్.

అంద ఱటులే వెడలిపోయిరి;
చూడలే దామూర్తి నెవ్వరు;
ఆదయామయు డటులె కన్నులు
తెరచి సహియించెన్.

సంజచీకటి క్రమ్ముకొనియెను;
కాపుబడతుక యొకతె పూజా
ద్రవ్యములతో వచ్చి యచ్చట
నలికి మ్రుగ్గిడియెన్.

కాళ్ల కంతట జసపు రాచెను;
నొసట గుంకుమతిలక ముంచెను;
కుక్కుటమ్మును గోసి రక్తము
పళ్లెమున బోసెన్.

గుగ్గిలముతో ధూపమిడియెను;
యెట్టులెట్టులొ దీప మిడ నది
చూడలేకయొ యేమొ! తత్క్షణ
మెగసియే పోయెన్.

నేత్రయుగ్మము పేలిపోయెను;
క్రూరమతవిద్వేషిహస్తకు
ఠారఘాతమ్ముల జలింపని
మూర్తిలో నేడ్చెన్.

గాలి హోరున చెద్వ[illegible]డగెను;
వేపశిరమును [illegible] యూకిసయెను;
బాలికలకు బ్రసాద మిడ యా
వనిత తా నేగెన్.

# వీరాభిమన్యా!

శ్రీ పరుచూరి భువనేశ్వరీదేవి, పరుచూరి అన్నపూర్ణాదేవిగార్లు

[రణాంగణము రక్తమయము. ప్రకృతికన్య కనువిచ్చి చూచినది. రక్తకణికలు ప్రజ్వరిల్లినవి. భావవీచికలు పరువసాగినవి. ప్రభంజనుఁడు తన్మయాతిరేకమునఁ బాడుకొనసాగెను.]

సమదాటోపముతోడ వీరమును నాస్వాదించి పెత్తండ్రిమా
నము ప్రాణంబును దక్కఁగా వెడలనున్నావేమొ? శాంతింపు మో
యి! మహాయోధుఁడవౌదు నీస్మృతికి రానేరాఁడ ద్రోణుండు రౌ
ద్రము మూర్తీభవ మందినట్లు లటు పద్మవ్యూహమం దుండఁగా.

ఏమోయీ! యిసుమంతలో మొగముపై నీకెంపుచాయల్ మహా
ధూమజ్వాలలు గ్రక్కుచున్న వతఁడే ద్రోణుండు కాఁబోలు పో
పో మారొక్క వెనుకంజవేయకు బలే వ్యూహంబు నీకందుబా
టే ముస్తాబయి చించు సైంధవుఁడు పాటింపంగ నీ కడ్డమే?

సమరక్రీడకుఁ బిల్చు నీపృథుధనుష్టంకారరావంబు గా
ఢముగా నాటినమాటవోయి జయఘంటాఘోష విన్పింపఁ బా
పము కర్ణాదిమహారథుల్ శకుని యశ్వత్థామ దుశ్శాసనా
దిమహాయోధులు డిల్లవోయి రదె నిస్తేజంబు జాల్వారఁగా.

పోరుము పోరుమోయి తెగిపోయిన జీవశవాలనుండి సం
ధ్యారుణరక్తదీధితు లజాండకరండము లల్లుకొన్న వీ
తూరి జయంబు నీద కనుదోయికిఁ దోఁపఁడు రాజరాజు నా
కీరణరంగమం దనుచు నీరస మొందకు మోయి యోధుఁడా!

కన్నులలోని రక్తకణికల్ కరఁగించి యొకింత తేరిపా
ర న్నొగలందు నున్న కురురాజుఁ గనుంగొనుమోయి! త్వచ్ఛర
చ్ఛన్నరథంబు దూఁకి కడు శీఘ్రముగాఁ బఱతెంచుచున్నవాఁ
డన్న యొకింత తాళుము సుధాంశుని వంశము నిష్కళంకమా.

నీచిరుకాళ్లలో జవము నీచిరువ్రేళ్ల చలాకు సిద్ధమా
నీచిరుచూపులో కళుకు నీచిరుతూపులలో చురుక్కులే

మీ చేరుపంగఁబోకు మిపుడే పగవారల పచ్చిగుండెలం
దోఁచి ఫలించె నీకు నగదుంబ్రతిబింబము లవ్వి వీరుఁడా.

ఒక్కవ్రేటున లేచిన యుర్విపతుల- శిరము లాకాశపథమున చిందులాడ
నీదు బాణాళివాద్యంబు నెరపుచుండెఁ-బితను మరపించినా వస్త్రవిద్య నోయి!

అకటా! యొక్కని జేసి నీకు మది యన్యాయంబు నాకుండ నొ
క్కొకఁడే చుట్టును మూఁగి చిత్రవధ తా మూహింపఁగాఁబోలు వె
న్కకుఁగూడం బరువెత్తుచుండి రభిమన్యా! రాజరా జైతఘా
తుకుఁడోయీ! గురుఁ డెంతక్రూరుఁ డెటు చేతుల్ వచ్చు నీమీఁదికిన్?

జుమ్మని గొట్టు నీయినుపచువ్వ లవే పిడుగుల్ వశంగ వి
ల్లమ్ములు మార్చికొంచు నని యందఱి కన్నివిధాలగా జవా
బుమ్మడితోడ నిత్తు వహహా! యని నీకు సుభద్రరొమ్ములోఁ
గ్రుమ్మిన పోటులో యుదరగోళములో మన కృష్ణుబోధలో.

కటికికసాయికోతయనిగాని శమింపరు కూటనీతి క
క్కట, పయికోఁ గడంగిరి నిగాఢముగా, నిఁక తండ్రి నీవు సం
కటమని లోఁ దలంపవు స్వకార్ముకజాలమ భగ్నమయ్యె చెం
గటఁ గల ఖడ్గమున్ గదయుఁ గైకొని పోరి కుపక్రమించితే.

రథమా భగ్నము, సూతుఁడా హతుఁడు, నీరథ్యంబులా నీల్గి సం
శిథిలంబయ్యెను, జుట్టుముట్టె రిపురాట్ సేనాపతిస్తోమ మె
వ్విధి సాధింతువురా ప్రతిక్రియ గదావిన్యాసమా, ఖడ్గమా
పృథుగర్వాపహృతిం దలంక నిదినీపెం పొప్పఁగా వీరుఁడా!

అకటా! యేమిటి కేలుదోయి మణిబంధాన్వీతమై లేదు ఘా
తుకకృత్యం బాడిగట్టినావుగద, ఛీ దుర్యోధనా, ద్రోణ, ధా
ర్మికబుద్ధిం బ్రకటించినావటర, మేల్ మేల్ రేపు నీపెద్దచా
పకళానైపుణిఁ జూపవచ్చు బ్రతుకం బార్థుండు సైరింపఁగా.

కటకటా, యేకధార రక్తస్రవంతి - వరదలై పొంగి శత్రుభూవరుల ముంప
బాహుమూలంబుల గదాసిపటిమ నెరపి - అని యొనర్చెద వౌర, వీరాభిమన్య!

ఉబికి యుబ్బూఁతలూఁగి నీసొబగుమేని - వేఁడిరక్తము మీతల్లి వీరమాత
యన్నవడువున భూదేవియమలనిటల- మందు సిందూరతిలకంబు పొందుగాంచె.

పగతురు వచ్చినార లొకపల్కును బల్కవు యుద్ధనైపుణిన్
మగలు కదల్చినార లొకమ్మాత్రము చూడవు సోలిపోదు వా

టగఁదలపోసి యెట్టయెదుటం బడినాఁడు కుమారలక్ష్మణుం
డిఁక విధి యేమిసేయునో ? సహింపవు న్యక్కృత జీవ ముండఁగా.

పడుచును లేచుచున్ సొరిగి పల్మరు స్రుక్కుచు తెప్పరిల్లి గ్రు
క్కుఁడు సలిలంబు గోరఁబరికింతువు నల్దెస లింకఁ బార్థుఁ డె
క్కడఁ బడియుండెనో ? యెడఁదఁ గన్గొనఁడే తగ మేనమామ బా
లుఁడవనిగాని నీపితలు లోనఁ దలంచియుఁ జేరరారుగా.

మెరసెన్ జ్యోతి, మనస్వితావిమలమై మేనెల్ల రోమాంకుర
స్ఫురదుద్దామత దాల్చె లక్ష్మణగదాస్ఫూర్తిం దదీయాంగజ
ర్ఝరితధ్యానముతోడఁ దద్గదకు మోక్షం బిచ్చి వీరాభిమ
న్యూ ! రణక్షోణి యశోక్షతల్ బడయుమా యాచంద్రతారార్కమున్.

---

# కుంతి

## శ్రీమతి దీవి సీతారత్నముగారు

హృదయములోని మంటలు శమింపవు వానికి నారు లెన్నఁడో ?
వదలదొ ? నేటికైన దలవంపుల నీపడిపంచగాయు నా
బ్రదుకు యదూత్తమా ! పడినబాధలు సెప్పిన నేమివచ్చు నీ
మదుసలివగ్గు న న్నడుగబోకుమ యన్నిటి కీవ వారికిన్.

దూరము పారజూచి తమతో నొకమాట వచింప నాకు నో
రూరునుగాని వారి గనియున్ దురపిల్లుదు—వీరమాత లె
వ్వారలొ ? ఇంక గృష్ణ భువి వారు యథామతి సేయుటొప్పు సం
సారరహస్య మీ వెరుగజాలవొ ? రాజుల పోకడ నీకు గ్రొత్తయే?

పోమెద వారికిం దగిన బుద్ధు లనుజ్ఞ నొసంగుమంటి నీ
పోమెడిచొప్పు పొందునకొ, పోరునకో ? యిటనున్న వార ల
న్యాయులుగారుగా ? యటులెవ్వైన దుదిన్ ఫల మిచ్చగింపరో
యీమెడ జెప్ప నేమిగల దింత యెరుంగరె వారు మాధవా !

---

# భ్రమరగీతి

శ్రీమతి కృష్ణవేణమ్మగారు

ఓయిభ్రమరక ! నీ వరుణోదయాన
స్నిగ్ధ సుస్వప్నకుసుమాలు చిలుకరించు
లలితభావాల హృదయతంత్రుల గదించి
ప్రకృతిలక్ష్మికి నిడుదు నివాళిగీతి.

గాఢ్పుతాకున దాగుచు గళల జిమ్ము
తమ్మిపూబోణి సొగసుందనమ్ము నరసి
ప్రేమసౌరభముల్ వెల్లివిరియ నేవొ
తేనియల నోల్కు భావగీతికల నల్లు
దాయపూర్వకవిత్వ మె ట్లబ్బె నీకు ?

జిలుగునునుసంజబాట రచించుకొన్న
యాసునించు చిత్రాల గూఢార్థ మేమొ
నిగనిగల్ గొల్పు మురుపువన్నెలను విరియు
శక్రచాపమ్ములోని ప్రశస్తి యేమొ
తెలిపెడు ద్వదీయమర్మగీతికలు భ్రమర !

దరుల జుంబించు సెలయేటి తరగలందు
గరికపోచల మెసవు లేగదుపులందు
ముద్దుకసుగందు చిఱునవ్వుమొలకలందు
నలరుచున్నది నీదు గీతామృతమ్ము.

పూవుపొదరిండ్లె నలమిన తావకీన
నవ్యసుధలీను మధురగానమును వినుచు
మానసోల్లాస మొంది తన్మయత గాంచు
పసులకాపరిచే మంజుభాగ్యరేఖ.

ప్రానుపడజేయు భవదసమానగీతి
నాటి శుభశారదారామ వాటికలను
వలపుచిలికిన మాధవవంశనాద
మగుచు మార్మ్రోగు నాహృదయప్రతోళి.

నవవసంతదినాన వనస్థలాన
బాలమలయానిలుండు వీవనలు వీవ
మృదులసుమశయ్యపై నీదు మేను వ్రాల్చి
హాయిగా సుప్తి నొందెద వోయి భ్రమర !

*       *       *       *

ఇంత యిపురించినట్టి ప్రశాంతవేళ
గలగిపోయిన హృదయరాగాన బడుచు
గ్రొందళుకు లొల్కు పువ్వురేకుల గదల్చి
యరయు దెవ్వరికై విపనాంతరమున ?

# ఆదర్శ మహిళామండలి

శ్రీమతి చదలవాడ రాఘవమ్మగారు

వేదకాలమునందు నిరుపమ
వేదముల పఠియించి యజ్ఞము
లందు ఋత్విక్పీరముల
నెందటో పొందిరిగా.

శ్రుతిచయజ్ఞ యపాల యనునొక
కాంత యాధ్వర్యవము బొంది మ
హేంద్రు డాదిగ దేవతలకును
సోమరస మిచ్చెగా.

యాజ్ఞవల్క్యునితోడ జనక మ
హాసభాంగణమందు నిర్భయ
ముగను వాదము జరుపలేదే
గార్గి మునికాంత.

ఆదికవి వాల్మీకిచెంత ని
తాంతశాంతవినమ్రతలతో
శాస్త్రముల పఠియింపలేదే
యతివ యాత్రేయి.

పండితులు ముక్కునను వ్రేలిడు
కొనగ వికటనితంబ యనునొక
రమణి యాలంకారశాస్త్రము
లెన్నొ రచియించెన్.

మధుర రచనాభావములతో
సుధల జిల్కుచునుండు మధురా
విజయమును రచియింపలేదే
గంగయను కాంత.

ముద్దులొలికెడి భావములతో
రసములూరెడి రచనములతో
రామకధ వర్ణింపలేదే
మొల్లయను కాంత.

కదనరంగమునందు వైరుల
మద మడంపగ నాడుసింగము
పగిది రణమున కురుకలేదే
రాణి సంయుక్త.

వీరవనితాదర్శకంబై
వీరపురుషుల నడలజేసెడి
ఝాన్సిలక్ష్మిబాయి శౌర్యం
బెల్ల రెరిగినదే.

అన్ని విద్యలయందు నధిక
జ్ఞాన సంపాదనము చేసిన
కాంత లెందరు లేరు పూర్వం
బిప్పుడును గూడన్.

---



తిరుచానూరు గుడిగోపురము M. P. S.



దేవాలయగోపురము, తిరువణ్ణామలై M. K. F

# సీతాకోక చిలుక

శ్రీమతి ఓలేటి నిత్యకల్యాణమ్మగారు

ప్రకృతిమురువిడు శక్రచాపపు
వన్నియలతో సొగసుజూపుల
లోకమే మరపింతు సీతా
కోకచిలుక చెలీ !

ముగ్ధభావపు లేమెడందను
పొంగుప్రేమశ్రీ హసింపుచు
శోకమెరుగని బ్రతుకు సీతా
కోకచిలుకా, నీయది.

పూవుపుప్పొడిపట్టుపాన్పున
కావిచివురుల యుసుకతిన్నెల
నేకతమ శయనింతు సీతా
కోకచిలుక చెలీ !

ప్రకృతి పెంపుడు బిడ్డవగుదో
స్వాదుసౌందర్యాభమూర్తివో
గోనబురంగుల పులుగ, సీతా
కోకచిలుక చెలీ !

సంజమంకెనమిసిమిచాలున
సంచరించుచు నేగు నీతో
వీక నాయెద పర్వు సీతా
కోకచిలుక చెలీ !

కలుషవాంఛల విసపువీథుల
గలగు మానిసి, తావకప్రే
మైకజీవిత మరసి సీతా
కోకచిలుకా ! ముగ్ధుడౌ.

సృష్టిసౌందర్యార్చనకునై
స్నిగ్ధగీతుల గవికుమారిక
కోరిపాడును నిన్నె సీతా
కోకచిలుక చెలీ !

---



విలాసినీ విభ్రమములు— ౧.

# హింస

శ్రీ శ్రీ శ్రీ రాజా విక్రమదేవవర్మగారు

హింస యనఁగాఁ బ్రాణుల వధ. ఏ ప్రాణికిని జంప కుండుటయే కాక, యెట్టి కష్టమును గలిగింప కుండుటయే న్యాయమును, బరమధర్మమును. ప్రాణులలో మనుష్యుఁడు జ్ఞానాధికుఁడు. మనుష్యుఁడు తన కెట్టి కష్టమును గోరఁడు కనుకఁ దా నితర ప్రాణుల కెట్టి కష్ట మును గలిగింపరాదు. అట్లయినను యజ్ఞములందు జీవహింస సేయవచ్చుననియు, యజ్ఞార్థము గాని జీవ హింసఁ జేయరా దనియు వైదికమతము సెప్పును. బలికొఱకుమాత్రమే జీవహింసఁ జేయుటకు శాక్తాగమ మత మంగీకరించును. ఎప్పుడును జీవుల కెట్టిబాధను గలి గింపరాదని బౌద్ధమతము నుడువును. జంతువులనే కాక వృక్షాదులనుసైతము హింసింపరా దని జైనమతము వెల్ల డించును. పారసీలు దమ పవిత్రాగ్నికి జంతుబలి సమ ర్పింపకుండుటవలన జంతువధకు జెందవస్తామతము సమ్మ తింపదనుట స్పష్టము జగదీశునకు బలిగా జంతువధ సేయు టొప్పు నని యిస్లాముమతోద్దేశము మనుష్యు లను దక్కఁ దక్కినజంతువులను వధింపవచ్చునని క్రైస్తవ మతాశయము. మనుష్యులను జంపకుండుటమాత్రము సర్వమతసమ్మతము

మృగాదుల హింసకు 'వధ' యనియు, మనుష్య హింసకు 'హత్య' యనియు నుడువుదురు. హత్య గొప్ప నేరముగా నెన్నఁబడుచున్నది. కనుకనే హత్యఁజేయు నరునకు మరణదండము విధింపఁబడును. మరణదండము చట్టములనుబట్టి యుక్తమే యయినను, లెస్సగా నాలో చించునెడ నది యయుక్తమే యగును కావుననే మరణ దండ ముండరా దని పెక్కురుపండితుల యభిప్రాయము.

ఒకఁడు వేఱొకనికి హత్యసేయు దుర్వృత్తి యాదిమకాలమునం దుండెను. కాని యిప్పుడు జగము జ్ఞానోన్నతిని గనుటవలన నా దుర్వృత్తి ప్రాయశః లేదనియే చెప్పనొప్పును అట్లనుటవలన నిప్పుడు హత్యలు లేవని చెప్పుట నాయాశయము గాదు. కామినీకాంచ నాసక్తచిత్తులగు మూఢులే ప్రాయశః హత్యలను జేయు వారు విద్యాధికులలో హత్యలను జేయువారు తాత్కా లికచిత్తోద్రేకము గలవారే అట్టి చిత్తోద్రేకము దుర్ద మమే యగును కాని యెట్లయిన నది యడంపంబడు నేని హత్య జరుగనే జరుగదు. కనుక హంతకుల సంఖ్య విద్యాధికులలో స్వల్పాతిస్వల్పము హంతకులసంఖ్య మూఢులలోనే హెచ్చుగాఁ గాననగుటవలన హత్యకుఁ బ్రధానకారణ మజ్ఞానమగుటయే నిక్కువము. జనులు జ్ఞానవంతు లగుదురేని, జగమునందు హత్యలు జరుగ వనిన నది యత్యుక్తి గాఁజాలదు.

దండమనఁగా శిక్ష, శిక్షయనఁగా నుపదేశము, రాజు ద్రోహికి శిక్షవిధించుట యతనికి (ద్రోహికి) జ్ఞానము గలిగించుటకొఱకే. అంతేకాని యతనిని బీడించుటకుఁ గాదు. ద్రోహి రాజునకు వైరిగాఁడుగదా. రాజదండము నొందివచ్చినవారిలో ననేకజనులు మరల నపరాధులు

గాకుండుటవలన రాజదండము గుణసంస్కార మగుట ప్రత్యక్షము.

మరణదండప్రయోజనమును నాలోచింతము. హంతకు నంత మొందించుటవలన హతుఁడు బ్రతుకఁడు. హంతకుఁడు మరణదండ మొంది కొన్ని నిముసములలోనే మరణించుటవలనఁ దాను నిజదుర్గుణమును సంస్కరించుకొనుటకు వీలు గలుగదు. ఒక కంటకము నూడఁదీయుటకు వేఱొక కంటకము గావలసివచ్చునట్లు లోక హత్యకుమఱొకహత్యయావశ్యకమని నుడువుట యుక్తము గాదు గదా. "రాజ దండమునకు 'హత్య' యన నొప్పునా?" యని కొందఱడుగవచ్చును. మనుష్య హింసకు 'హత్య' యనునామము రూఢివాచకమయినట్లు మన మెఱుంగుదుము. జనుని శస్త్రముచేతఁ జంపినను, విషమిచ్చి చంపినను, గంఠము నులిమి చంపినను, నీటముంచి చంపినను, నేరమారోపింపక చంపినను, నేర మారోపించి చంపినను జేయు చేఁతయగునట్లు హత్య హత్యయే యగును. పేరును మార్చినంతమాత్రమువలన వస్తువు మాఱునా? హంతకునకుఁ జంపకుండినవాఁడు మఱికొన్ని హత్యలు సేయునని యనరాదు. తగినంత సాక్ష్యము లేకుండుటవలన వీముక్తులయిన హంతకులు మఱి హత్యలు సేయకుండుట గ్రొత్తవిషయము గాదు. హంతకునకు మరణదండము విధించుటవలన నితరజనులు భీతిల్లి హత్యలు సేయకుండుటకుండుట వలను పడదు. ఎన్నియో మరణదండములు విధింపంబడి యున్నను, హత్యలు జరుగుచునే యుండుటవలన మరణదండము హత్యజరుగకుండం జేయంజాలదు. లెస్సగా నాలోచించినచో మరణదండము నిష్ప్రయోజనమనియు, సంఘమునకు నష్టిగలిగించునదనియుఁ, బాపకార్యమనియుఁ దోఁచకమానదు.

పోర్చుగలు, హాలండు, నార్వే, రష్యా, ఆస్ట్రియా, స్వీడను దేశముల చట్టములనుండి మరణదండ మంతరించెను. ఫినల్యాండు, డెన్మార్కు, బెల్జియము, న్యూజిలాండు, దక్షిణామెరికా, మధ్యామెరికా, మెక్సికో దేశముల చట్టములనుండి మరణదండ మింక నంతరింప కున్నను వాడుకనుండి యంతరించెను. మరణదండము విధింపఁబడుచున్న దేశములనుండి దాని నంతరింపజేయఁ బండితులు యత్నించుచున్నవారు అది కొంతకాలములో నంతరించును.

జనులకు యుక్తమగు జ్ఞానమును గలిగింపక యెన్ని దండములను విధించుచున్నను నేరములు జరుగక మానవు కనుక జనులకు యుక్తమగు జ్ఞానమును గలిగించి నేరములు లేకుండునట్లు సేయుట ప్రభువుల కర్తవ్యము, అందులకుఁ దోడ్పడుట ప్రజల కర్తవ్యము

కృపాపారావారుఁడగు భగవానుఁడు జీవహింస జగమునుండి త్వరగా నంతరించునట్లు లొనర్చునుగాక!



# స్వయంనిర్ణయ సూత్రము

గా. హరిసర్వోత్తమరావుగారు, యం. ఏ.

స్వయంనిర్ణయసూత్రము రాజనీతిశాస్త్రమునందు క్రొత్త కల్పనయని కొందర భిప్రాయపడుచున్నారు కాని, అదియంత నిజముకాదు ఏనాడు వోటింగు పద్ధతికాని తత్ప్రతిర్యామ్నాయమగు నితరపద్ధతిగాని యంగీకృతమైనదో, ఆనాడే స్వయంనిర్ణయసూత్రమునకు నంకురార్పణము కలిగినది రాజకీయ వ్యవహారములలో ఇది ప్రముఖముగా నమలులోనికి వచ్చినకాలము ఇటీవలిదేయని యొప్పుకొనిన తప్పుగాదు

బ్రిటిషుసామ్రాజ్యమున కంకితమయి అందు భాగముగా మెలగుచుండిన నేటి అమెరికాసంయుక్తరాష్ట్రములు స్వాతంత్ర్యమును ప్రకటించినదిన మీసూత్రమునకు జన్మదినముగా భావింపవచ్చును "నిర్బంధములేక తమ ఇష్టానుసార మొప్పుకొని పరిపాలితులు న్యాయముగా ప్రసాదించిన అధికారములే పరిపాలకుల యధికారములుగా నుండదగును అప్పుడే నిజమైన శాంతి సుస్థాపితము కాగలదు. ఇతరత్ర శాంతి యుండజాలదు; ఉండజనదు " ఈసూత్రమును, ఈపదములును అమెరికావారి స్వాతంత్ర్య ప్రకటనమునందు గలవు ప్రపంచ సంగ్రామము జరుగుచుండగ ౧౯౧౮-వ సంవత్సరమునందు జనవరి ౨౮-వ తేదీని అమెరికాఅధ్యక్షుడు విల్సను ప్రపంచశాంతికి పదు నాలుగు సూత్రములను వివరించుచు ఈసూత్రమును ఈపదజాలముతోనే వర్ణించెను "స్వయంనిర్ణయసూత్రము వట్టి బూటకపుపదము కాదు రాజకీయ వ్యవహారములలో జీవకళతో తేజోవంతమై యుండు శక్తి యిది. దీనిని నిరసించు రాజకీయనాయకుల కీకమీందు కడగండ్ల బడకతప్పదు " అని విల్సను అమెరికాసంయుక్త రాష్ట్రముల కాంగ్రెసున సంభాషించుచు లోకమును హెచ్చరించెను. అమార్చి మాసములోనే రుష్యాలో విప్లవ మారంభమయినది. కెరెన్స్కీమహా నాయకుని క్రింద నూతనోద్దేశములు కార్యరూపము దాల్చినవి రాడికలుశక్తు ప్రబలమై యుండినది ఏప్రిలు ౧౦-వ తేదీన రుష్యా ప్రభుత్వ మీక్రింది ప్రకటనను గావించెను—

"స్వతంత్రమైన రుష్యా ఇతర ప్రజాసమూహములపై సామ్రాజ్యము వహింపవలెనను ఆశ…… ఏరాజకీయ జాతికాజాతి తన యిష్టానుసారము తన పరిణామమును దీర్చుకొనవచ్చుననుటే రుష్యాయొక్క మతము ఆవిధమగు బునాదులపైచి శాశ్వత శాంతి ప్రపంచమున నెలకొల్పుటే మాయుద్దేశము "

ఈకాలప్రాంతముననే విల్సను విజృంభించి "నేటి నాగరక ప్రపంచ మంతయును స్వయంనిర్ణయ సూత్రమునే యమలున పెట్టగల"దని నొక్కి ప్రకటించె.

నాటినుండి ఒక్కపెట్టున స్వయంనిర్ణయసూత్రప్రశంస యెల్ల నాలుకలమీదను నాడినది రాజకీయ వ్యవహారములలో యీ సూత్రమునకు ప్రసిద్ధ ప్రయోజనము కల్గినది

స్వయంనిర్ణయ సూత్రమునకు గల సంపూర్ణ వ్యాప్తిని గురించి ముందాలోచింతము. కాని ప్రపంచ సంగ్రామముచే కలిగిన పరివర్తనములలో ఈసూత్రమున కొక్కవిధమైన ప్రచారముమాత్రము మిక్కిల నిరివిగా కలిగినది. సంగ్రామమునకు ముందు యూరోపుఖండము రాజకీయముగా కొన్ని రాష్ట్రములుగా నేర్పడి యుండినది జర్మను కెయిజరు, ఆస్ట్రియా చక్రవర్తి, రుష్యాప్రభువు, జారు, మరి ఇతరాధికారులును తమకు దొరకిన ప్రజలనందరిని అంకితులను జేసికొని ప్రజల యిష్టమున్నను లేకున్నను తమ యిష్టానుసారము రాష్ట్రస్వరూపములను దీర్చుకొని రాజ్యము లేలుచుండినారు యుద్ధము ప్రబలి నిరంకుశపరిపాలకుల యుగ మంతరించి ప్రజలకు స్వేచ్ఛ యేర్పడు సందర్భములలో అనవసరమైన నిర్బంధము లన్నియును నంతరించునవి యయ్యె. ఆకారణముచేత యూరోపుఖండపటమును యుద్ధానంతరము దీర్చునప్పుడు ప్రపంచయుద్ధమున గెలుపునొందిన బ్రిటను, ఫ్రాంసు, ఇటలీ మొదలైన బలవత్తరభూములమాట కొంత సాగుట సహజమే యైనను, నానారాష్ట్రసమితి యని పేరుపెట్టి ఈ రాష్ట్రములే తమ పలుకుబడిని కొన్నికొన్ని సందర్భములలో చెల్లించుకొనిన మాట వాస్తవమే యైనను మొత్తముమీద ఆయాప్రాంత ప్రజల యంగీకారముమీదనే రాష్ట్రనిర్ణయము కావలసివచ్చినది ఈ పనికిగాను ప్రపంచసంగ్రామానంతరము స్వయంనిర్ణయసూత్రము యూరోపు విరివిగా వినియోగించినది జర్మనీతో జరిగిన

సంధిషరతులలో ఆలెక్‌స్టన్, మేరియన్ లెండరు, అప్పర్ సైలీసియా, నార్తుశ్లెస్‌విగ్ అను ప్రాంతములు తమ కోరికప్రకారము ఏరాష్ట్రములో చేరునదియు నిర్ణయించుకొనవలసిన దని ఏర్పరచ బడెను. అప్లే యూపెన్ మాల్మెడీయను మండలములలోను వారి కేది యిష్టముకాదో తెలుపుటకు ప్రజలసమ్మతులు తీసికొనబడెను ఆస్ట్రియాతోడి సంధిషరతులలో క్లెగన్‌ఫర్టు బెస్కెన్ అను మండలములకు స్వయంనిర్ణయాధికారము ప్రసాదిత మయ్యెను. సార్‌వ్యాలీ అను ప్రదేశమును గురించి స్వయంనిర్ణయసూత్రముమీద నాధారపడిన యేర్పాటు జరిగియున్నది ౧౯౨౦-వ సంవత్సరము మొదలు ౧౯౩౫-వ సంవత్సరము వరకును ఈప్రాంతము నానారాష్ట్రసమితివా రేర్పరచునట్టి కమిషనుచే పరిపాలితము కావలసినది. ౧౯౩౫-వ సంవత్సరమున ఆప్రాంతపు ప్రజలయొక్క సమ్మతులు తీసికొనవలసినది. ఆ ప్రజలు మూడు విధములయిన నిర్ణయములలో నేదోయొక నిర్ణయమునకు రావచ్చును. జర్మనీలో చేరిపోవచ్చును. లేదా ఫ్రాంసులో చేరిపోవచ్చును. లేదా నేటిమోస్తరుగ నానారాష్ట్రసమితివారిచే నేర్పడు కమిషనుకు లోబడియే యుండవచ్చును

ప్రపంచసంగ్రామానంతరము స్వయంనిర్ణయ సూత్రము ఈవిధముగా నెక్కువగా వినియోగపడినది స్వయంనిర్ణయసూత్రమున కది యొక్కటియే స్వరూపమని భ్రమపడి కొందరు విమర్శకులు దీని ప్రయోజన మంతగా కలుగలేదని వ్రాసిచ్చినారు పడమటి హంగెరీ ప్రజలు మేము జర్మనీతో చేరుదు మనుచున్నను వారి కాయధికారము ప్రసాదింపలేదు ఆల్సేసులో రేయిను ప్రాంతమును ఫ్రాంసులో చేర్చునప్పుడు అచ్చటి ప్రజల సమ్మతిని కైకొనలేదు. పోసెను, పడమటి ప్రష్యాప్రాంతములను పోలండులో చేర్చివైచునప్పుడు ఆప్రాంతముల ప్రజల నడుగలేదు ఇవియన్నియు స్వయంనిర్ణయ సూత్రమునకు వ్యతిరేక మనువారు కలరు. ఈవాదమునందు సత్యము లేకపోలేదు. యుద్ధానంతరము ఒలవత్తరమయిన్న జర్మనీ రాష్ట్రమును సృష్టి చేయుట మిత్రమండలికి, అందులో ముఖ్యముగా ఫ్రాంసుకు ఇష్టము కాదు కాబట్టి హంగెరీ జర్మనీతో చేరి పోవుటకు వీ రంగీకరింపరైరి. ఆల్సేసులో రేయినువిషయ మిట్టిదికాదు. నిజమువ కాఫ్రాంతము ఫ్రాంసులో చేరదగినదని పరంపరగ నంగీకృత మైనది. అది నిజముగా ఆదియందు ఫ్రాంసునుండి విడదీయబడియుండిన భాగమే. కాబట్టి మరల దీనిని ఫ్రాంసునందు చేర్చుటలో సమ్మతులతో పనియుండలేదు, పోలెండుకు జేర్చిన పోసెను ప్రాంతము విషయమునను సమ్మతులతో పనియుండలేదు. జర్మనీవా రేర్పరచిన జనాభాను బట్టియే అచ్చట నూటికి ౬౫ గురు పోలుజాతివా రుండినారు. పడమటి ప్రష్యాభాగమునమాత్రము జర్మనుజాతియే యెక్కువగా నున్నను వారి సమ్మతికొనకయే వారిని పోలెండుకు మార్చివేయుట స్వయంనిర్ణయసూత్ర విరోధమని యంగీకరింపవచ్చును కాని ఇట్టి యొకటిరెండు లోపములుమాత్రముచేత స్వయంనిర్ణయ సూత్రము కలుషితమయినదని యనజెల్లదు. ఏరాష్ట్రములో జేరుదమను నిర్ణయమునకు ప్రజలు వచ్చుటమాత్రమే స్వయంనిర్ణయసూత్రమను భ్రమ ఇట్టి వాదములకు తావిచ్చినది. స్వయంనిర్ణయసూత్రమునకు ఈమాత్రమే యర్థమనరాదు. అమెరికా సంయుక్త రాష్ట్రముల స్వాతంత్ర్య ప్రకటనలోని వాక్యముల నింకొకపర్యాయము స్మరింపం జనును

"పరుల నిర్బంధము లేక తమ ఇష్టానుసార మొప్పుకొని పరిపాలితులు న్యాయముగా ప్రసాదించిన అధికారములే పరిపాలకుల యధికారములుగా నుండదగును అప్పుడే నిజమైన శాంతి సుస్థాపితము కాగలదు ఇతరత్ర శాంతి యుండజాలదు, ఉండజనదు"

ఈసూత్రము ననుసరించి స్వయంనిర్ణయసూత్రము రాజకీయ విషయములలో సర్వాంతర్యామి ఏరాష్ట్రపు సరిహద్దులలో తామిమిడియుందు మని నిశ్చయించికొనుట ప్రజలకు గల యధికారములలో బహుస్వల్పాధికారము ఏ విధమయిన ప్రభుత్వవిధానమును అమలులో బెట్టుకొందుము? మన రాజ్యవిధాన మెట్టిది యేర్పడవలయు? శాసన సభలకును, అధికారవర్గమునకును, న్యాయవిచారణశాఖలకును నుండదగిన సంబంధము లెట్టివి నియమింతము? మున్నగు సర్వ విషయములలోను ప్రజల యాశయములు చెల్లుబడి యగుటకు స్వయంనిర్ణయసూత్రమే యాధారము ప్రపంచసంగ్రామము గడచిపలలోను, అనంతరమును రుష్యాయు, ఇతర క్రొత్త స్వతంత్రరాష్ట్రములును విజృంభించి చేసికొనిన ఏర్పాటు లన్నియు స్వయంనిర్ణయసూత్రమునందే చేరుచున్నవి. అదివరలో నెన్నియో కడగండ్ల బడుచుండిన బొహీమియా ప్రజయు, మొరేవియా ప్రజయు, సైలీషియా ప్రజయు, స్లావేకియా ప్రజయు స్వేచ్ఛమై ఒక్కటిగా జేర నంగీకరించి జెకోస్లావేకియా రాష్ట్రము నిర్మించుకొనిరి దీనికిని స్వయంనిర్ణయసూత్రమే ఆధారము

స్వయంనిర్ణయసూత్రముయొక్క ప్రథమాధారము ప్రజల సమ్మతి ఏకప్రాంతప్రజలవిషయమున నితరప్రాంత ప్రజ జోరబడిగాని, నిరంకుశాధికారులు చొచ్చిగాని నిర్ణయములు చేయుట ఈ సూత్రమునకు విరోధము. అంతియకాని ఆప్రాంతప్రజ నేరుగా వోటు లిచ్చియో, ప్రతినిధుల నేర్పరచుకొనియో తమకు రాజకీయముగా సమ్మతమైన సృష్టి గావించుకొనుట స్వయంనిర్ణయ విధానమునందు జేరును. ప్రపంచ చరిత్రలో రెండు గొప్ప పద్ధతులు ఈసూత్రస్వరూపము లయినవి ప్రచారమునందు బహుకాలముగా నున్నవి మొదటిది 'రెఫరండము' రెండవది 'కాన్‌స్టిట్యూయెంటు అసెంబ్లీ' మహాసంగ్రామానంతరము 'ప్లెబిసైటు' అను పేరిట వ్యవహరించిన స్వయంనిర్ణయసూత్ర స్వరూపమునకును రెఫరెండము అను

పద్ధతికిని ఏవిధమైన భేదమును లేదు. ఈరెంటికిని ఒక్కటే యర్థము. ఏదేనియొక్క సమస్య రాజకీయవిషయములలో నేర్పడినప్పుడు ఆసమస్యనుగురించి యుక్తవయస్కులైన ప్రజలలో నొక్కొక్కరి సమ్మతియసమ్మతులను తీసికొని తదనుగుణముగా ఆసమస్యను పరిష్కరించుట ప్లెబిసైటు రెఫరెండముల పరమోద్దేశము దీనిని 'ప్రజాభీష్టపద్ధతి' యని వర్ణింపవచ్చును. ఏకసమస్య విచారణకే యీపద్ధతి పనికివచ్చును.

ఈ ఏకసమస్య రాజ్యాంగనిర్ణయమునకు సంబంధించినదియైనను కావచ్చును అనేక స్వతంత్రరాష్ట్రములలో రాజ్యాంగనిర్ణయములలో మార్పులు జరుగవలసియుండునెడల 'ప్రజాభీష్టపద్ధతి'ని జరుగుట యాచారమైనది. స్విట్జర్లాండులో ఈపద్ధతి విరివిగా ప్రచారమునం దున్నది. తుదకు బ్రిటిషుసామ్రాజ్యములో చేరిన విభాగమైన ఆస్ట్రేలియాబోటి రాష్ట్రమునందును ఈపద్ధతి ప్రచారమున గలదు మార్పు జరుగవలసి యున్నచో ప్రజాభీష్టపద్ధతిని వోట్లు తీసికొందురు ఆస్ట్రేలియను కామన్వెల్తు (సంయోగము) లోని రాష్ట్రములలోని బహుసంఖ్యాకరాష్ట్రములందు బహుసంఖ్యాకులైన వోటర్లును, వోటుచేయునట్టి వోటరులలో బహుసంఖ్యాకులును మార్పు నంగీకరింతురేని ఆమార్పు గవర్నరుజనరలు గారికి పంపి ఇంగ్లీషురాజుగారి సమ్మతికొనుడని కోరుదురు సమ్మతియియ్యని సందర్భ ముండదు మరియొక విశేషము ఆస్ట్రేలియాలో ౧౯౧౬-వ సంవత్సరమున నీక్రింది ప్రశ్నపై ప్రజాభీష్టము కోరబడియెను—

"ఇప్పుడు మహాసందిగ్ధసమయముగా నున్నది ఆస్ట్రేలియాలో నుండు ఆస్ట్రేలియా పౌరులను సైన్యములో చేరి సేవచేసితీరవలెనని నిర్బంధించుటకు ఆస్ట్రేలియాప్రభుత్వమునకు అధికార మున్నది ఈయధికారము ఆస్ట్రేలియాకు బయటనుండు ఆస్ట్రేలియాపౌరుల యెడల వర్తింపజేయవచ్చునా, రాదా? మీయభిప్రాయముం జెప్పుడు."

తుదకీప్రశ్నకు వ్యతిరేకమైన ప్రత్యుత్తరమే స్థిరమయ్యెను ఈవిధముగా బ్రిటిషుసామ్రాజ్యములోనే 'ప్రజాభీష్ట పద్ధతి'కిని గొప్ప ప్రచారమున్నది ఆరంభమునుండి ఈ పద్ధతి ననుసరించియే సర్వరాజ్యాంగవిధానమును ఏర్పడిన రాష్ట్రములు చరిత్రయందు రెండు కానవచ్చుచున్నవి. మొదటిది స్విట్జర్లాండు, రెండవది అమెరికా సంయుక్తరాష్ట్రములు. ఈరాష్ట్రములలో ప్రథమమునుండి రాజులును, ప్రభువులును లేరు చిన్నచిన్న పట్టణములు, అధినివేశములును ప్రజాధీనమ్ముగా నేర్పడినవి వాని సంయోగము క్రమక్రమముగా నేర్పడి ఈ రెండు రాష్ట్రములలోని రాజ్యాంగము లేర్పడినవి. కాబట్టి ఇందలి రాజ్యాంగములు సర్వమును నేరుగా 'ప్రజాభీష్టపద్ధతి' నేర్పడిన వని చెప్పనొప్పును. కాని; ఎల్లరాష్ట్రములును ఈవిధముగా నభివృద్ధి యైనవికావు మహాజనసమూహములు, వివిధరాజకీయ సాంఘికపరివర్తనములు, నూర్లకొలది సంవత్సరముల చరిత్రలు కల రాష్ట్రములే ప్రపంచమునందు చాల ఎక్కువ ఇట్టి రాష్ట్రములలో వేలవివరణములతో గూడిన రాజ్యాంగ నిర్మాణమునకుగాని, సూక్ష్మవిమర్శనలతో నిండిన శాసననిర్మాణమునకుగాని, నిమిష నిమిషమునను జరుగవలసిన పరిపాలనకార్యమునకుగాని ఈపద్ధతి ప్రయోజనపడదు లక్షలకొలది, కోట్లకొలది ప్రజలు సమ్మతులిచ్చి ఈపనులు నెరవేర్చలేరు అందుచేత స్వయంనిర్ణయ సూత్రము ఈ విషయములలో మరియొక స్వరూపమును దాల్చినది. ఆ స్వరూపము 'కాన్స్టిట్యూయెంటు అసెంబ్లీ', అనగా ప్రత్యేకము రాజ్యాంగనిర్ణయకార్యమునకుగాను రాష్ట్రప్రజలోని యుక్తవయస్కులెల్లరును వోటిచ్చి యెన్నుకొనునట్టి ప్రతినిధివర్గము ప్రపంచమున రాజకీయస్వాతంత్ర్యమును పూర్ణముగా సంపాదించిన రాష్ట్రములు అనేకములు ఆదియం దిట్టి 'కాన్స్టిట్యూయెంటు అసెంబ్లీ' యాధారముగానే తమ రాజ్యాంగస్వరూపమును నిర్ణయించుకొనినవి ఆ కాన్స్టిట్యూయెంటు అసెంబ్లీచేరి నిర్ణయించునట్టిప్రాతిపదికముమీద తక్కిన రాజకీయ కార్యక్రమమంతయును ఆధారపడి జరుగును. ఈ విధముగ నేర్పడిన 'కాన్స్టిట్యూయెంటు అసెంబ్లీ' లలో (వీనిని తెలుగులో 'మాతృక సభ' లని వ్యవహరింతము) నెన్నదగిన యిటీవలి యుదాహరణ మొక్కటి గైకొందము. ఇది జర్మనీకి ప్రజాసత్తాకమును ప్రసాదించిన సంఘము ౧౯౧౯-వ సంవత్సరారంభమునం దీసంఘ మేర్పడినది ఈసంఘ మేర్పడునాటికి జర్మనీలో చిత్రమైన పరిస్థితులు ప్రబలియుండినవి దేశమునందు రాజకీయముగా ఆరుపార్టీలుండినవి ఒక్కపార్టీకైనను ఇతరపార్టీలకంటె మొత్తముమీద ఎక్కువ పలుకుబడి యుండలేదు మహాసంగ్రామములలో పడిన కడగండ్లచేత దేశమునకు ఆర్థికముగా తలయెత్తలేని పరమదురవస్థ సంప్రాప్తమయియుండినది కెయిజరును, అతని బంధువర్గమును పదచ్యుతులై వదలిపోయియుండినారుగాని దేశములోని, పనివారల సంఘములును, ఓడకూలీలవారి సంఘములును ఎచ్చటికచ్చట అధికారము స్థాపించుకొని ఇచ్చకువచ్చినట్లు ద్రవ్యము వసూలుచేయుచు కర్చుపెట్టుచు అరాచకము కల్పించుచుండినారు కమ్యూనిష్టులను సమానసంపత్తివాదులు జర్మనీ ముఖ్యస్థానమగు బెర్లినునగరమునందు ప్రబలి రాజ్యమునే పట్టుకొనజూచుచుండినారు. వీరిని పరాజితులను గావించుటకు అప్పటి ప్రభుత్వములవారు మూడు పర్యాయములు బెర్లిను వీథులలో యుద్ధములు చేయవలసి వచ్చినది. వేలకొలది ప్రజలీపోరాటములలో ప్రాణములు కోల్పోవలసినవారైరి. ఆకాలపు చిత్రపరిస్థితిని అర్థముచేసికొనుటకు రెండు చిన్న ఉదాహరణములు చాలియుండును. జర్మనీలో తలమానికముగ బరగిన ప్రష్యారాష్ట్రమునందు ౧౯౧౮-వ సంవత్సరము నవంబరు మాసమునందు ఒక్కొక్క

ప్రభుత్వశాఖను పరిపాలించుటకు ఇద్దరిద్దరు మంత్రు లేర్పడిరి రాష్ట్రాధ్యక్షులును ఇరువురు ఈఇరువురును వేరువేరు పార్టీలకు చేరినవారు వీరలలో నొకడు పనిచేయ రెండవవాడు చెరుపుటకు పనికివచ్చుచుండినాడు. విద్య, దేవాలయముల శాఖకు మెజారిటీ సోషలిస్టుపార్టీ వాడగు హీనిస్కు అను నతనిని, స్వతంత్ర సోషలిస్టుపార్టీ హాఫ్మన్ అను నతనిని ఇరువురను మంత్రులుగ నియమించిరి ఈ హాఫ్మన్ మతము పరిత్యజించినవాడు, జర్మనుభాష వ్రాయుటకు గాని, చదువుటకు గాని బాగుగ రానివాడు, విద్యాలయములకును బీరకాయల మార్కెట్టుకును భేద మెరుంగని వాడ; నోరు తెరచిన వట్టిబూతులు; పేనా పట్టిన వట్టిగీతలు, కాని బైబిలులోని మాటలనుమాత్రము కొన్నిటిని పట్టుకొని ఎల్లప్పుడు వాడువాడు.

ఇట్టివాడు అధిపతి యైనపిదప చదువులు చదువులె, మతము గతమే. తాను వేయునట్టి 'ఆర్డినన్సులు' (వీటిని భారతభూమి నేడు బహుచక్కగా నెరుగును) తన సమానోద్యోగి హీనిస్కుకు తెలుపనైన తెలుపువాడు గాడు. సర్కారువారు మతసంస్థల కిచ్చుచుండిన విరాళముల నొక్కమాటతో నితడు రద్దు చేసెనట! మత సంబంధమయిన చదువులు చెప్పనేరాదని శాసించెనట! చరిత్ర చెప్పుటకు తనపార్టీ సిద్ధాంతముతో వ్రాసిన పాఠపుస్తకములు తప్ప మరి యేవియు నుపయోగింపరా దనెనట! పాపము హీనిస్కు యేమి జేయగలడు! ఈ ఆర్డినన్సులు రద్దు చేసినాడు హాఫ్మన్ కుపితుండయి రాజీనామా యిచ్చువాడయ్యె కాని కొన్నిమాసములు ముందు కాలపు జీతముకూడ బొక్కసములోనుండి తీసికొనిగాని ఈపని చేయడయ్యె. ఇంతకంటెను చిత్రమైనపరిస్థితి అదివరలో 'బ్రన్సువిక్కు' రాజ్యముగా నుండిన ప్రాంతమున జరిగినది అక్కడి ప్రభుత్వమున కధ్యక్షుడు 'మర్జెస్' అను కుట్టుపనివా డేర్పడియె. దేవాదాయముల మంత్రిత్వమున కొకచాకలి యమ్మవా రేర్పడియె.

ఇట్టి విచిత్రమైన సాంఘికసుస్థితియందు ఇంకను జర్మనీ స్వరూపమే యేర్పడని దినములలో (అప్పటి కింకను ఆవెన్స్టన్, షెల్స్విగ్గు మున్నగు మండలములలో ప్రజాభీష్టము తీసికొని యుండలేదు) కాన్స్టిట్యుఎంటు అసెంబ్లీకి ఎన్నికలు జరిపినారు. జర్మనీ జాతిలోని ౨౦ సంవత్సరములకు పైబడిన స్త్రీపురుషు లందరికిని వోటు అధికార మిచ్చినారు ఆరుపార్టీల ప్రతినిధులును ఎన్నికలలో వచ్చినారు సోషలిస్టుడెమొక్రాటులు ౧౬౩ గ్గురు, క్రిష్టియన్ పీపిల్సుపార్టీవారు ౯౧ గురు, డెమొక్రాటులు ౭౫ గురు, జర్మనునాషనల్ పీపిల్సుపార్టీవారు ౪౨ రు, స్వతంత్రసోషలిస్టులు ౨౨ రు, జర్మన్ పీపిల్సుపార్టీవారు ౨౧ రు, ఏపార్టీకిని చెందనివారు పదుగురు కలిసి కాన్స్టిట్యుయెంటు అసెంబ్లీ అయినారు ఇందులో సోషలిస్టు డెమొక్రాటులును క్రిస్టియన్ పీపిల్సుపార్టీయును నేకమై రాజ్యభారము వహించినారు అదివరలో రాజ్యాంగము నడపుచుండిన మితవాదవర్గముల యధికారులే ఈక్రొత్తప్రభుత్వపు నౌకరులయి దేశభక్తితో కార్యములు నడపినారు. వివాదములు, సంఘట్టనలు, సంఘర్షణలు అన్నియు జరిగి మాసములు మాసములు విమర్శనందిన పిదపనే జర్మనీ రాజ్యాంగనిర్ణయము ఈ అసెంబ్లీలోనే ౨౧౨ వోట్లబలముగ నంగీకృతమైపోయినది ఇదియంతయు స్వయంనిర్ణయసూత్రము అమలులో పెట్టుటకు జరిగినపనియే. ఇట్టి సర్వశక్తమయిన స్వయంనిర్ణయసూత్ర స్వరూపమును వివరించుచనప్పుడిటీవలి వ్రాతకాండ్రు కొందరు వెర్రిమొర్రివ్రాతలు వ్రాసియున్నారు. వాని వివరణము గాని, విమర్శగాని యప్రస్తుతము.

ఈ సూత్రమునకు వ్యాప్తి యింకను కలుగవలసి యున్నది ముఖ్యముగా దీనిని బ్రిటిషు ప్రభుత్వమువారు మనదేశము విషయమున అమలులో పెట్టవలసియున్నారు ఇంతదనుక మన దేశీయ మహాసభవారు స్వాతంత్ర్యమును కోరుచు వచ్చినారు కాని స్వాతంత్ర్యపు పోరు సాగించుకొనుటయందే మనదృష్టి కేంద్రీకృత మయిపోయినది. గాంధి ఇర్విను సమాధానము గూడ కన్ఫరెన్సు, కన్సీలియేషన్ పద్ధతులకు, అనగా సమరసగోష్ఠి, సమాధానప్రయత్నములకు బునాదివైచినదేగాని స్వయంనిర్ణయసూత్రమును అమలులోపెట్టి మాభారతవర్షీయ రాజ్యాంగవిధానమును నిర్ణయింపించవలసిన దని కోరలేదు. అంతే కాదు. గాంధి ఇర్విన్ సమాధానానంతరము రౌండుటేబిలు కన్ఫరెన్సును అంగీకరించుటను జేసి గాంధీజీబోటివారు స్వయంనిర్ణయసూత్రమును దృష్టిపథమునం దుంచలేదనుటయు గోచరింపకపోదు. పైమనుకమీషను నేర్పరచిననాడే నాబోంట్లము స్వయంనిర్ణయసూత్రము ననుసరించి కాంస్టిట్యుయెంటు అసెంబ్లీ నేర్పరిచి ప్రభుత్వసంవిధానసంస్కరణము చేయింపవలసినదని సూచించితిమి. కాని అప్పటి కింకను మన వాతావరణము సిద్ధముకాలేదు. ఇటీవల కొన్ని శుభసూచనలు కానవచ్చినవి నెహ్రూనివేదిక యొకవిధముగా స్వయంనిర్ణయ సూత్రము ననుకరించినది అయిన నప్పుడేర్పడిన 'ఆల్ పార్టీసు కాన్ఫరెన్సు' వేరుగ యుక్తవయస్కులగు స్త్రీపురుషు లేర్పరచిన కన్ఫరెన్సు కాదు; అధికారమున నున్న ప్రభుత్వమువారు అంగీకరించి నడిచిన కన్ఫరెన్సును కాదు. నెహ్రూనివేదికను ముస్లిము సోదరులు పాక్షికముగ దిరస్కరింపను తిరస్కరించిరి నెహ్రూనివేదికకు తరువాతిది నిమ్నజాతుల ప్రాతినిధ్యసమస్యయొక్క పరిష్కారము దీని విషయమున రాంసె మెక్డనాల్డుగారు అవార్డు నిచ్చుచు "ప్రజ లీ విషయమున సమాధానపడి తమ సంవిధానమును నేకగ్రీవముగా మాకు నందజేయునెడల మేము దాని నంగీకరింతు" మనిరి గాంధీజీ కారాగారమున నుపవాసములను చేసి ఈ సమస్యను తీర్మానించుటకు నిమ్నజాతుల ప్రతినిధులను, హిందూప్రతినిధులను చేర్చగలిగెను. వీరంద రేకాభిప్రాయమునకు రాగా బ్రిటిషుప్రభుత్వమువా రంగీకరించిరి. ఇందును నొకవిధముగు స్వయంనిర్ణయ సూత్ర

చ్ఛాయ యున్నది ఈ సందర్భమునందుగూడ ఇరుపక్షముల ప్రతినిధులును నేరుగా సర్వప్రజలచేత నెన్నుకొనబడినవారు గారు కాబట్టి తరువాతకొందరు— బహుస్వల్ప సంఖ్యాకులే యైనను — అసమ్మతి సూచించుటకు అవకాశము కలిగినది. అటుతరువాత ప్రయత్నము మన పెద్దలందరును హిందూ మహమ్మదీయ సిక్కు ఇత్యాది సమస్యలను తీర్చుటకు చేసినట్టియు, చేయుచుండునట్టియు ప్రయత్నము ఇందును ప్రజల ప్రతినిధులే పాల్గొనుచున్నారు అయిన వీరును నేరుగా సర్వప్రజలచేతను నెన్నుకొనబడినవారు గారు ఇంకను తరువాతి ప్రయత్నము హరిజనులకు దేవాలయప్రవేశము ఇవ్వదగునా యనునది ఇందులో గాంధిజీ స్వయంనిర్ణయ సూత్రమునకు తలయొగ్గుట కంగీకరించినాడు రెఫరెండము పద్ధతిని అమలులో పెట్ట నిశ్చయించినాడు తన యోగముచేత సాధించెదనను మతమును వీడుట కంగీకరించినాడు డాక్టరు సుబ్బరాయన్ గారి • బిల్లున కిదియే సూత్రము కాబట్టి పాక్షికముగా, స్వల్పవిషయములలో స్వయం నిర్ణయసూత్రము భారత భూమిలోనికి ప్రవేశము కాంచినది నాయకులును; పాలితులును దీనిని మహత్తర విషయములలో—జర్మనీ యందువలె, ఇతరనాగరికరాష్ట్రములందువలె అమలులో పెట్ట నంగీకరింతురా యనుటయే యిప్పటి ప్రశ్న.

ప్రస్తుతపు స్తంభిత రాజకీయస్థితిలో నాయకులకును పాలితులకును ఈసూత్రము నంగీకరించుటే మందుకు పరస్పర స్నేహమునకును, శ్రేయస్సునకును మార్గమని నానమ్మకము రెండుపక్షములవారి ప్రతిష్ఠకును ఇట్టిమార్గమువలన భంగము లేకుండును బ్రిటిషు ప్రభుత్వమువారు సర్వవిధములయిన నిరోధక పద్ధతుల నవలంబించియు దేశమునందు కాంగ్రెసుపక్షమువారు నాటిన స్వాతంత్ర్యాభిలాషను ఆరంభించిన సివిల్ డిస్ ఒబీడియన్సును నిలుపజాలరైరి రౌండుటేబిలు కన్ఫరెన్సులు మూడు పెట్టి ముఖ్యనాయకులని ఎందరెందరినో పిలిపించి సంప్రతించినను అందువలన ఫలము ప్రజామోదము పొందకపోయినది. మితవాదులును ఆశాభంగమును పొందినవారైనారు దేశీయ మహాసభవారును మూడు పర్యాయములు శాసనోల్లంఘనము నుపక్రమించినను బ్రిటిషు ప్రభుత్వముయొక్క హృదయమును మార్చలేకపోయినారు కావున నేటిదినము ఏపక్షమునకును నిజమగు సంతృప్తిలేదు చేసిన ప్రయత్నము గట్టెక్కలేదు. మహాత్మాజీచేత శాసనోల్లంఘనోద్యమమును విడిపించవలెనని బ్రిటిషు ప్రభుత్వపు పట్టుదల. విడువరాదని గాంధీజీపట్టుదల ఇది యెంతో కాలము సాగవలసిన స్థితిగాదు కాబట్టి భారత రాజ్యాంగ నిర్మాణమునకు భారత ప్రజలనే యధికారులను గావించ వలసినది ౨౦ యేండ్ల ప్రాయమునకు పైబడిన స్త్రీపురుషు లందరును వోటీయ్యవలసినది కాన్ స్టిట్యుయెంటు అసెంబ్లీ నేర్పరచవలసినది రాజ్యాంగ నిర్మాణము చేయ మనవలసినది. స్వదేశ సంస్థానముల గతి యేమియని ప్రభుత్వమువా రడుగవచ్చును. వానితోడి సంబంధము లేమియగునను ప్రశ్న కలుగవచ్చును మొదట బ్రిటిషుఇండియామాట తెమల్చిన స్వదేశ సంస్థానములమాట తరువాత నాలోచింప వచ్చును. వట్టి ఫెడరేషన్ అనుమాటలో గల మహిమ యేమియు లేదు. బ్రిటిషు ఇండియా రాజ్యాంగ సంస్కారవిధానమున ఇదివరలో స్వదేశ సంస్థానములు చేరుచుండుట లేదు ఇప్పుడు చేరనక్కరలేదు స్వదేశసంస్థానములతో సంధిషరతు లున్నవి గవర్నరు జనరలుగారికి అధికారము లున్నవి సంధి షరతులను నిర్వహించుకొనుటకు కావలసిన వ్యయము స్వదేశ సంస్థానములవారు బ్రిటిషు ప్రభుత్వమువారును తమలో తాము పెట్టుకొనుటకు నిశ్చయించుకొని స్వదేశసంస్థానములకును భారత రాజ్యాంగమునకును తగిన పొత్తు కుదురువరకును పరిపాలన జరుపుకొనవచ్చును "బ్రిటిషువారు, ఇతర పరదేశస్థులును ఇచ్చట ద్రవ్యము పెట్టుబడి పెట్టినారు; నివసించుచున్నారు ఈ సందర్భములలో వారిరక్షణ కావలసియుండును." అను ప్రశ్నయు కలుగవచ్చును మా కాన్ స్టిట్యుయెంటు అసెంబ్లీతో బ్రిటిషు ప్రతినిధు లీవిషయములు చర్చించి వారిని ఒప్పింపనగును. ఇరుపక్షముల వారికిని సమాధానము కుదురని సందర్భములలో నేమి చేయవచ్చునందురేమో? నానారాష్ట్రసమితి (లీగు అఫ్ నేషన్సు)లో భారతభూమి స్వతంత్ర మెంబరు. ఇతర ముఖ్యరాష్ట్రములును మెంబరులే ఆ సమితియొక్క మాధ్యస్థ్యమును కోరవచ్చును. "భారతభూమి ప్రజలలో మైనారిటీ లున్నారు భారతభూమి శ్రేయస్సునకే కొన్ని సంరక్షణ లవసరము. వీని కేమందురు?" అను వాదమును రాదగును కాన్ స్టిట్యుయెంటు అసెంబ్లీవారిచేత నీ విషయములు విమర్శింపించి వారిలో వారి కైకభావము కుదురనప్పుడు ప్రత్యేక ప్రశ్నలవిషయమై అందుకు సంబంధించిన ప్రజల యభీష్టము రెఫరెండముద్వారా రికార్డు చేయించవచ్చును. దీనికిని గొప్ప యవాంతరము లుండవు ఈ సూక్ష్మాంశములన్నియు నిప్పుడు తర్కింప వీలు లేదు బ్రిటిషు ప్రభుత్వమును అడుగవలసిన ప్రశ్న యొక్కటే. "మీ రీ దినము భారతరాజ్యాంగనిర్ణయమును ప్రజల యభీష్టము ప్రకారము తీర్ప నిశ్చయించినారా? మా కాన్ స్టిట్యుయెంటు అసెంబ్లీయు రెఫరెండములును, తీర్మానించు తీర్మానములను మీరు పార్లమెంటులో నంగీకరించి భారతభూమిని బ్రిటిషు కామన్వెల్తులో నుండనిత్తురా?" భారతనాయకులు తమ్మును తా మడుగుకొనవలసిన ప్రశ్నయు నిదియే. "ప్రజాసమూహమునందు మనకు విశ్వాస మున్నదా? వారిలో యుక్తవయసు వచ్చినవారి కందరికిని వోటిచ్చి వారు కోరు రాజ్యాంగ విధానమును వారికి తెచ్చియిత్తుమా? లేక మన మెదడున బుట్టిన రాజ్యాంగవిధానమునకయి మనము పాటుపడుచుందుమా?"

బ్రిటిషు ప్రభుత్వమువారు ఈపద్ధతు లవలంబింపక తమ రౌండుటేబిలు పద్ధతులును, తమ పార్లమెంటరీ జాయింటు కమిటీ పద్ధ

తులును అవలంబించి రాజ్యాంగ విధానమును తీర్చునెడల ఈపర్యాయము ఎలెక్షనులు స్వయంనిర్ణయసూత్రాధికార సంపాదన టిక్కెట్టు మీద నడుపవలసినది; శాసనసభలు సమావేశమైన వెంటనే ఈవిధాన మంగీకరించి రాజ్యాంగము తీర్చవలసినదని తీర్మానములు చేయించవలసినది; సభలు రద్దుచేయింపవలసినది; ఎన్నిపర్యాయము లావశ్యకమయిన నన్నిపర్యాయములు దేశమిట్లు చేయుటకు సంసిద్ధముగానున్నదని చూపవలసినది. ఈపరిశ్రమ కొనసాగింపగలవరకును మనకు మన ప్రజలయెడల విశ్వాసముగాని, మన ప్రజలకు మనయెడల నమ్మకముగాని పూర్ణరీతిని ఏర్పడినదని యనుకొనుటకు వీలుండదు. ఎంతటి మహాత్ములును అతని పార్టీవారు సంపాదించిన ప్రభుత్వమయినను ప్రజలు సంపాదించిన ప్రభుత్వముకాదు

స్వయంనిర్ణయ సూత్రమా, నీకు విజయంబగుగాక



M. W. R.





1. విఠలుభాయి పటేలుగారికి న్యూయార్కున సన్మానము.
2. సుప్రసిద్ధ వైమానిక దంపతులు — అమీజాన్సను, జె. ఎ. మాలిసన్ గార్లు.



1. ఎ. యం. భరత్ గారు, కన్ననూరు; 2. యతిరాజం రాఘవానంద మూర్తి గారు ;
3. గుంటూరు హనుమదారోగ్యవ్యాయామమందిరసభ్యులు.

# నాయెఱుక

ఆదిభట్ట నారాయణదాసు గారు



ఆదిభట్ట నారాయణదాసుగారు

తల్లిని దొలి నృదపఁ దండ్రిమొదలగు చుట్టములును బువ్వమంచినీళ్లాఁకలిదప్పికలు చీమలీఁగలు పిట్టలుతేఁగలు మొదవులెనుములు పాలికాపులు బాసిసలు పిన్న పెద్ద లిరుగుపొరుగులు చెట్టుపుట్ట కూర నారవేళ్లు చెఱువు లిండ్లువాకిళ్లు తోఁటలుందొడ్లు మిఱ్ఱుపల్లములు పొలములుచేలు పసరములు మేయు బీడులు మెఱకలు వాగులు వాల్గొమ్ములు తూములు పొంత లీఱుకుదారులు ముండ్ల కంచెలు పంట పైరులు పెరళ్లు దుక్కిసాళ్లు నీటిబుగ్గలు కప్పలు చేపలు నత్తకాయ లెండ్రపీఁతలు నీటికట్టెలు బురదబుక్కుడములు జెఱ్ఱిపోతులు ఱోఁకలిబొండలు నీటిప్రుర్వులు మడిగట్లు మెట్టలుకొండలు నెలప్రొద్దు చుక్కలు పలుతెఱఁగుల మబ్బులు పేరాసపెద్దమ మింట నారఁబోసిన పసపుకెంపుదినుసులు వడ్లు మినుములు కందులు పెసలూఁదలు చోళ్లాగికలు చామలు గంటెలు జొన్న లులవలు ప్రత్తి జనుము గోఁగు పెఱుకుతీరుల తినుబడిదిన్సులు పూవుపిందెదోరగాయపండ్లు చలిదికూడు తరవాణి పప్పు పులుసు చారు మజ్జిగ పాల్పెరుఁగుజున్ను మీఁగడలు దాఁకురుమూఁతలు చిప్పచిప్పగోళ్లు వెన్నెలకుప్పలు గవ్వలు గచ్చకాయలు పిక్కబేసీలు గొట్టికాయలు కుప్పిగంతులు పిల్లమొగ్గలు

చాకిబానలు కిఱ్ఱుగానుగులు కడిబంతులు గోణిబిళ్ల కుండబంతులు చెఱ
ప్పట్టెలు చెడుగుడులు గుడిగుడికుంచములు వంతులాటలు గుజ్జనగూ
ళ్లాల్మగల యాటలు దొంగాటలు పేకాటలు చెఱకుకట్ట పందెములు
కోతికొమ్మ కోలాటము దండెపట్లు మెడపట్లు గుద్దులాట కొట్లాట
తిట్లాట పరుగులాట జాఱాట మునుఁగుట నిలువీఁత బారీఁత లోయీఁత
పచ్చికబయళ్ల నొన్నమ్మల నేమ్మపుట యేటియిసుకతో నెండుగడ్డితో
నెడ్ల నోబ్బెతుల నావుల నేసలఁ దోమి కడిగి వానిపై నెక్కి దర్వులు
పాడుచు దొడ్డి నట్టుట బుగ్గిలో నోనమాలు వ్రాయుట పొత్తము
గిఱగిఱఁ ద్రిప్పించి తలక్రిందుగాఁ జదువుట తొలిచదువుల వల్లించి
యప్పచెప్పుట యాడుట పాడుట చిడతలు వాయించుట
యీలవేయుట మెట్టదాపులనుండి యాకులు, పలుఁదోముపుల్లలు
తెచ్చుకొనుట విస్తళ్లుకుట్టుట కన్నెపల్పులు తొడల నేనుట
జందెము లొడుకుట యల్లాల బల్లాలో యనిపాడుచుఁ బనికత్తెలకు
సరుగుడునుండి వరినారుకట్ట లందించుట మందకాచుట వరికుప్పల
సందున రేయిఁ బండుకొనుచు మంటకాచుకొనుచున్నపుడు పేల్కొ
న్నగుఱుతుగా బిగ్గఱగా నఱచుట కొబ్బరిమావివంకాయల
నడగళ్ల కెల్ల నోర్చి యెంతయో దవ్వునుండి చిమ్మచీఁకటివేళ
రాళ్లనక ముండ్లనక పొంచి వడినడపరుగుమెలపుల నారితీరి
సన్నసన్నగా నోరులకుఁ జిక్కక తెచ్చుకొని దాఁచుకొనుట కోరి
జగడముతెచ్చుకొని యొరులఁ దన్నుచుం దాపులు తినుచుంట పదాఱు
పండుగుల సరదడి నోడిదొడుకుల దుడుకుచేయు పన్నెండేండ్లలోపు
నాబుడుతతనంబు జడుపులేక గడపినాఁడను నాపన్నెండేండ్ల యీడు
లోపున నాపుట్టుతెల్వితేఁటలతో నెల్లతెఱఁగుల నున్నదున్నట్లు నిజ
ము తెలిసికొనుట, వేల్పులమీఁది నమ్మకము, పెద్దలమాటపై గుఱుతు,
చావునకై వెఱపులేమి, నాచదివిన చదువుల నీవరింపఁబడిన గొప్ప
వారితో సరిగా నాబ్రతుకు కొనసాగించుకొనుకోరిక, కలిమిలేములు
రెండిరటిన్నాడ సరకుచేయకుంట, యెండగాలివానల కొకింతయు జంక
కుండుట, కొద్దిగొప్పల వాసి నెన్నకుంట, యాఁడువారి పొత్తొల్లమి,
నాయీడు మగపిల్లలందఱితో నేస్తముగట్టుకొనుచుంట, పందెమువేసి
చదువుసందెల నెరివారిలో నెగ్గుచుండుట, యుబ్బుసిబ్బితలు
తెలియకుంట వేయేల యంతయు నావలసిన మంచినడువడియే నా
కబ్బెను. నాపన్నెండేండ్లయీడు గడచుచున్నకొలఁది మీఁదుక్రిందుల
నూఁగుదొడఁగుచు ముక్కుముదురుచుఁ గాళ్లు పెంచుచున్నకొలఁదిఁ
జదువవేసిన నున్నతెలివిపోయెనన్న సామెతగా నాయెఱిఁగిన పిన్న
పెద్దలలో వీరెక్కువవారు తక్కువదిచక్కనిదదేబ్రాసి యనుచు
నిప్పటి దొరల నుడి చదువుకొని మిద్దెల నేడ్మల బానిసల నండ్ల
న్నగల నానెమ్ముల విలువైన కూడుగుడ్డలకై డాబుచేయు కోరిక
మొగదాళ్లు ద్రిప్పి నేలదండెములు తీసి ముప్పిరిగొన్న జెబ్బలు నులుము
కొను పొగరు, వీఁడెంత, వాఁడెంత చదువుసందెలన్నాని సాముగరిడీల
న్నాని మఱికొన్నాళ్లలో నాతోటిపాటివారి నెల్ల నోర్చఁగలనను పోతర
మద్దముఁజూచి నన్ను నేనే వెక్కిరించుకొనుచు వింతవింతతీరుల కొప్పు
ముడి వైచుకొనుచు ముంగుఱులు వంచుకొనుచుఁ బట్టపు చెఱుగొట్టుల
సంగడి మరిగి పనికిమాలిన తిరుగులు తిరుగుచుఁ జీవాట్లు తినియు
న్నిగ్గఱిపోకిరితనము వీడలేక రేఁబవళ్లన కెల్ల సందుగొందులం
బెంకెతనము చేయుచు నెలయాండ్ర పంచలన్గనిపెట్టికొని వలపురేఁచు
నాటపాటమాటమీటచదువుమెలపుల నక్కుచు నారుచు బడిదొంగనై
నాయంతట నేనే కావలసినచదువెల్ల నేర్చుకొనఁ గలుగుదు నా
కొరులు నేర్పపాటి మగవాండ్రెరీయని యెల్ల చదువరిమాటకారిలయ
కాండ్ర నలఁతిగాఁ జూచుచు చిన్నప్పటినుండి నాపుట్టుతెల్వితేఁటల
నాటపాటల నడ్డుగడింపఁగ గలిగినకొలంది నాపదాఱవ యేఁటఁ
జదువమొదలిడిన దొరనుడిబడి నాయిరువదోకేఁడునందు మొదటిమెట్టు
దాఁటఁగలిగి రెండవమెట్టు రెండేండ్లు జదివియు నసింతలో నదివఱకే
యాటపాటల నడితీరి నెలకు రెండువందల రొక్కము గడింప మొద
లిడుటచేతను, బానిసకొల్వున కొడఁబడు నలవాటునకుఁ బుట్టుకనుం
డియు జోగకుండుటంబట్టియుఁ, గైపుసూటముల నగులుటచేతను, బేకాట
మొదలగు కొఱగాని తగులముల నేఁ జిక్కుకొనుటంబట్టియు, నాటపాట
లకు మించిన చదువీఁకెద్దియుని గట్టినమ్మికచేతను దొరనుడిచదువు
కొనసాగించుకొననేరనైతిని ఇరువదిరెండవయేఁట నేలుబడినుడిబడి
న్దొలిమెట్టెక్కినాఁడ నిఁకఁ జాలు న్గొల్వులొంగుబడి నాకేల రెండవమె
ట్టెక్కనన్నరే లేకున్న న్నరే యని నాతోఁచిన యాటపాటమాట
మీటల నారితేఱి నాయంతవాఁడింకొకఁడు కాఁజాలకుండున ట్లేఁబది
యేండ్లు వచ్చుదనుక రేయింబవళ్లనక మఱేపనులన్ సరకుచేయక
పట్టుదలతోఁ బాటుపడుచుంటిని. నాయిరువదినాల్గేఁడులనుండి వెలిచవు
లొల్లక లాతిచెలువల నాకన్నతల్లులవలెఁ బరికించు నోమేఁ బదియే
డేండ్లదనుక సాగించుకొనఁగల్గినాఁడను. నాపదునెన్మిదేండ్ల యీడు
నకే యచ్చతెనుఁగునఁ గొన్ని, యచ్చముగా వేల్పునుడులఁ గొన్ని, నాటు
మాటలన్ వేల్పునుడులన్ గలగల్పుగాఁ గొన్నియుం బలుతెఱఁగుల
వడిఱవళినడదర్వు లేర్పఱచి వలపు తెగువ నెనరు నవ్వు కినుక వెఱ
యేవ యబ్రముయొఱ్ఱ్మలను తొమ్మిదిచవు లింపారఁ బ్రోఁజుముల
నుగ్గడింపఁబడిన వేల్పుల న్గూర్చియు, గొప్పపేరెక్కిన మంచివారల
గుఱించియు నాయలవికొలంది నుమెచ్చుటలల్లి యచ్చొత్తించి
వెల్లడింపఁగలిగినాఁడను మఱియు నాటపాటమాటమీటచదువుల గడి
దేరుచు వేనవేలం బిన్నపెద్దల నగ్గిరిసిన పేరోలగంబుల న్గొండలన్
మాఱుమ్రోఁగించుచు నాంన్నిన ముచ్చటమువ్వడిఱవళుల నెదురులేక
చూపఱకుఁ దీపులొదవించు మేనికదలికల నలరించి బంగరుముఱు
గులు మురిడీగొలుసులు రవలంటుపోగులు దండకడెములు బిళ్లపేరులు
గండపెండెరము సరిగంచుబట్టలు మొదలగు కానుకలఁ గొనుచు నా
మూఁడేండ్లయీడుమొదలుకొని యింతదనుక మంచివారల మెప్పు

గొనుచు నాపర్వు నిలపెట్టుకొనుటకై రేయింబవళ్లు చదువుసందెల వ్రాఁతకోతలం బాటుపడుచుంట నాతోఁబుట్టుచెల్వములు. వంజాడు వములుట దొంగతనము నాతలవ్రాఁతలుకావు ముందుచూపే గాని వెన్కచూపు నాకు లేనేలేదు నా కారవయేఁట వడుగైనమొదలీ ప్రోలిచెడుజట్టుకూడకున్న నాపదమూఁడేండ్లయీడువఱకు వేల్పులపై నాకున్న నమ్మకమునకు న్నా బాపనితెగ మరియాద నిల్పుకొనునోము పట్టుదలకు స్మేర లేదు. నాయేఁబదియైదేండ్ల యీడువఱ కిచ్చకము కొండెము దబ్బర వెఱపు వెత్తి డబ్బుకక్కుర్తి డాబు తబ్బిబ్బు టక్కరితనము టకటొంకు బానిసెకొల్వులోంగుపాట్లు నా కెంతయు దవ్వులు. నామూఁడేండ్ల యీడునుండియు నా నలువదేండ్లయీడు గడచువఱకు దఱచుగా నాకలలందు నాచదివినవేల్పులు న్నావినిన తొల్లింటి గొప్పవారలు న్నాకగపడి నన్దనుపుచుండిరి నాయేఁబదేండ్లయీడు గడచినంతలో నన్గట్టుకొన్న యాపెతోడనే నాయొట్టుజుట్టుబొట్టు నోముపడికట్లన్నియుం బోలసిపోవ నిక్కొఱగాని సిగ్గిడిముసలి డొక్కమిసలయ్యొనైనప్పటికి న్మెచ్చవడక మగనివెంబడి వన్నెవాసులు మీఱ వేల్పునగరియేలుబడి న్జూరగొన్న మగనాండ్ర న్గసింతయు న్గీడెఱుఁగక తమతోటిపాటివారందఱు న్మెల్మెలన మంచి నడవడి న్గలనైనఁ దప్పక తమతమ తెగల పరువుసున్నవఱకు న్గాపాడుకొన్న మేటియిలుదొరలన్ జేతికెముకలేని యీవికాండ్ర న్దమతోటిపాటి యిర్గుపొర్గులకెల్ల మేలుకొఱకై తమయొడ ళ్లొప్పగించు నెఱసరిమగమిన్నల న్మఱియు నెట్టి యిక్కట్టులకైన నోర్చి కూడుగుడ్డ కూరుకకూటమివేడ్కల న్మానుకొని తమయెసుఱులకుఁ దెగించియైన వింతవింతవెరవుల న్గనిపెట్టి యెల్లవారలకు న్మేల్గఱపు చదువరిమేల్బంతుల న్గాంచి తనివి నోర్వఁగలనేని నాయీమిసలున్న బ్రతుకు రేపులు గడచిన మాపులకన్న మిక్కిలిమేల్లే యవుఁగాని ముదిమికి న్దనివియోర్పులకు న్బొత్తుగాఁ గిట్టనేకిట్టదు పైవారెట్లున్నారో నే నెఱుంగఁ జాలనుగా నా కీముసలిరికమునఁ బనికిమాలిన యెద్దియో దిగులే మిగిలెను. గుండెనిబ్బరము జాఱిపోయె నొకేఁడున కొకేఁడు పైఁబడ్డ కొలంది నూబిచీట మున్గుచున్న న్లేదారియు న్దోఁచకుండె నిదిట్లుండఁగాఁ బైపె చ్చేమోతెలిసిన పెద్దవలెఁ బైకి నాలో లేని యడఁకువఁ జూపకతీరకవచ్చె నబ్బా యీ ముదివంతకెల్ల నాచిన్ననాఁటి చెడునడతయేకదా పుట్టిల్లు తన చిన్ననాఁటినుండియుఁ దన తల్లిదండ్రులు చదివించిన పెద్దలు మంచినడఁతగల చెలికాండ్రు న్దనకు మప్పిన మంచినడునడి తప్పక తన మర్యాద గాపాడుకొన్నవాఁడు తానూఱేండ్లముదుకఁడయ్యును వలవంతలపాల్గాఁబోక హాయిగాఁ దన బ్రతుకు గడుపుకొనఁగలఁడు. తనతోటిపాటి యందటివలన నెవఁడెల్లప్పుడు న్మంచివాఁ డనిపించుకొనునో యట్టివాఁడే వేల్పుగుట్టెఱిఁగి యొరుల న్దనియించి తాఁ దనిసి యెన్నఁటికే జెడని నిండు హాయి న్గొనఁగల గొప్పవాఁడు. వేఁడివెల్గు నెల చుక్కలు పాలదారి మెఱపు ఉఱుములు పిడుగుపాటు లెండగాలివానలు మొదలగు మింటి దినుసులనుండియు నేలవడకులు చిచ్చు కొండలు కారుమంటలు పెద్దేటి వఱద లూబినేలలు చెడుపురుగు పులిపుట్రలు మన్నెపుకాకలంటు తెవుళ్లు తప్పని యింటితగవుతంటాలు క్రొత్తయీడువలపు బులుపు సలుపులు చెడ్డయలవాట్ల కడగండ్లు మైమఱుపు ముదిమి దొంగదొసఁగులు జగడగొండులు వెట్టివెంబడులు కూళమైతొల్పులు మొదలగు నేల దినుసులు చావుపుట్టువులుగూడ నెవ్వరికైన న్దమకోరినట్లు జరుగవుగా ఱొటఁ దలపెట్టి ఱొఁకలిపోట్లకు వెఱచునట్లు బ్రతుకుచిక్కులఁ బడినవారు కట్టుతప్పించుకొని పెన్నెఱవున హాయిగా మెలఁగఁదగు వెరవు పొంగుమాగుల నొక పోల్కి నోర్మిగొనుటతప్ప నింకెద్ది తనివి యోర్పుల న్నెమ్మదిగలవారలకు వారివారి బ్రతుకువంత తా మేమో యీడఁబోడచెదమని తంటాలుపడు పొగరుఁబోతుల బ్రతుకు నడలు కన్నఁ గొంత నయముకాకతప్పదు. నాపెద్దలు నాకుఁ జెప్పిన మాటలంబట్టియు, నాచదువుంబట్టియు నాయంత నే నరసినకొలందియు నిప్పటి కీడెబ్బదేండ్లముదియీడున నన్నుగూర్చియు నా యీతలంపుల కతమున్గటించియును నా యీవ్రాఁతవలనఁ దెలుపఁ గలిగినది నా కెద్దియైన నిజ మెఱుంగఁ దరముకాదనియే – న న్నేనేఁ దెలిసికొనఁజాల నపుడు నాకు వేఱైన యీమంటిమింటిదినుసుల గుట్టు విప్పిచెప్ప నా తరమా నాకంటె వేఱుదినుసు లేదనియును మంచిచెడ్డలు హెచ్చు తగ్గులు తుదమొదళ్లు ముందువెన్కలు చావుపుట్టువులు క్రిందుమీఁదులు కతముకర్జములు నాతలంపురూపులేయనియు ఉత్త నానీడ చూచుకొని బెదరుచుంట నాయోజయనియును లెక్కకిట్టింపఁగల్గినాఁడను గాని నా తెల్వికి, న్మఱియు నానడతకు సరిపడకుంటయే యిపుడున్న పెద్దచిక్కకదా ? మఱీచిక్క వదల్చుకొని పెన్నెఱవునఁ బడుటకుఁ బట్టుదలతో నేను చేయఁదగిన పను లీరెండే-యవెవ్వియన మొదటిది నిన్నరేపులఁగూర్చి పొడమిన తలంపుల నడంచుకొనుట. రెండవది నా తలిదండ్రులు మొదలగు పెద్దలు చెప్పిన మంచినడువడి న్బెడఁబడక యెట్టియిడుములం బడియైన నాతోటిపాటివారల కేనిపముచేతనైన న్గీడు సలుపకుంట. ఈ రెండుతెన్నులే యెవ్వరికైన నొడ్డెక్కించు వెరవులని యిప్పటి నానమ్మకము. నాయెన్నుకొన్న గొప్పవారల కోర్కెపై నే నిట్లు వెల్లడించిన వ్రాఁతతప్పులు నాయిలువేల్పు ప్రొద్దు మన్నించి నాయెఱుక నలరించుఁగాక.

# తుమ్మెదా!

శ్రీమతి చావలి బంగారమ్మగారు

ఒక్కపువ్వు తేనెతో తుమ్మెదా సుడిదిరిగి వస్తావు తుమ్మెదా
నీ కోకపూట జరగదా తుమ్మెదా అతి చురుకు గలదానవే తుమ్మెదా
ముద్దరాళ్లను జేరి తుమ్మెదా కంటబడితే నీవు తుమ్మెదా
నీవు ముద్దెట్టుకొందువే తుమ్మెదా వాటి వెంట నంటకపోవె తుమ్మెదా
మోము విప్పిన పూలు తుమ్మెదా జుర్రున్న ఆ తేనె తుమ్మెదా
నీ మోమువంకే జూచు తుమ్మెదా నువ్వు జుర్రుకుంటావేమె తుమ్మెదా
ఒక్కచో నిలవవు తుమ్మెదా తలకు తగిలిందంటె తుమ్మెదా
నీ కాళ్లు తెలియదో ఏమొ తుమ్మెదా అది తెలుపెక్కుతుందంట తుమ్మెదా
ఎప్పుడూ తిరిగేవు తుమ్మెదా నల్లన్ని నీవొళ్లు తుమ్మెదా
నీ వెది తలచుచుందువే తుమ్మెదా అది తెల్లబడలేదేమి తుమ్మెదా
అన్ని పువ్వులతేనె తుమ్మెదా కడపటిమాట విను తుమ్మెదా
నీ వారగించి పోయి తుమ్మెదా నీ కడు పెంత కలదమ్మ తుమ్మెదా
అటు తిరిగి చూడవు తుమ్మెదా పువ్వురేకంతైన తుమ్మెదా
అది మంచిదని తోచెనా తుమ్మెదా నీ పొట్ట లేదాయెనే తుమ్మెదా
నువు పోవు జాడతే తుమ్మెదా పంతమ్ము గాకున్న తుమ్మెదా
అవి నిలిచి చూచుచునుండు తుమ్మెదా నీ కెంత గావలెనమ్మ తుమ్మెదా
ఆకాశయానంబు తుమ్మెదా నంగనాచీ వలెను తుమ్మెదా
నీ ఝుంకారనాదంబు తుమ్మెదా నీ వొంగి చూచేవేమె తుమ్మెదా
అదె వింటు ఆ పూలు తుమ్మెదా కంట బడినా నమ్మ తుమ్మెదా
నిన్నట్టె ధ్యానముసేయు తుమ్మెదా నన్నంటు చేయకుమమ్మ తుమ్మెదా
కళ్లు విప్పని పూలు తుమ్మెదా ఇంగితం బెరుగవే తుమ్మెదా
నీ కళ్ల కెట్లగబడునే తుమ్మెదా నే నీశ్వరునిమెడ నుందు తుమ్మెదా

---

# స్థానిక స్వపరిపాలనము

భూపతిరాజు వెంకటరామరాజుగారు, బి. ఏ., బి. యల్.

స్థానికస్వపరిపాలన మనగా రాజు లేక ప్రెసిడెంటు, పార్లమెంటు, శాసనసభలు, మంత్రివర్గము మొదలగు ఆధునిక రాజ్యాంగపద్ధతుల యంతర్భాగములు గాక కేవలము పట్టణములు, పల్లెలకు సంబంధించిన సమస్యలనిమిత్తము నిర్మింపబడిన సంస్థలకు గల నామము బ్రిటిషువారు హిందూదేశమును స్వాధీన పరచుకొనినదాది స్థానికస్వపరిపాలనము తాల్చినరూపము పూర్వపు హిందూరాజులకాలములో లేకపోయినను ఆకాలమునాటి గ్రామ పంచాయతీలద్వారా ప్రస్తుతము స్థానిక స్వపరిపాలనసంస్థలు చేయు పనులలో చాలవరకు నెరవేర్పబడుచుండెడివి బ్రిటిషురాజ్యస్థాపనతో క్రమక్రమముగా పాశ్చాత్యస్వపరిపాలన సంస్థలు దేశములో నలుమూలలను వ్యాపించి ప్రజాహితజీవితమునం దంతర్భాగములై తన రారుచున్నవి స్థానిక స్వపరిపాలనమనెడి పదములో యీ దిగువ నుదాహరింపబడిన సంస్థ లిమిడియున్నవి—

| | |
|---|---|
| (౧) కార్పొరేషనులు | (౪) జిల్లాబోర్డులు |
| (౨) మునిసిపాలిటీలు | (౫) తాలూకాబోర్డులు |
| (౩) యూనియనులు | (౬) గ్రామపంచాయితీలు |

పైన పేర్కొనబడినసంస్థలలో మొదటిమూడును పట్టణములకును, తక్కిమూడును పల్లెలకును సంబంధించినవై యున్నవి. ఈసంస్థల కన్నిటికిని భిన్న నామము లేర్పడినను వాని నిర్మాణోద్దేశ్యమును, అవి నెరవేర్చు కార్యములును సామాన్యమూలసూత్రములపై ఆధారపడి యున్నవి ఆయా సంస్థలయొక్క స్థానిక ప్రదేశములలోగాని నిర్ణీతసమస్యలనే యీసంస్థలన్నియు పరిష్కరించుకొనగలవు గాని యితర ప్రదేశములలోగాని తమ విధ్యుక్తధర్మములను మీఱిగాని యివి యేమి చేయుటకు వలనుపడదు. ఏలననగా వీనియొక్క విధులన్నియు శాసనబద్ధములై యున్నవి. ప్రతి నాగరిక దేశమునందలి రాజ్యాంగ స్వరూపమునం దిమిడియున్న సమస్తభాగములు, అనగా పయిన వివరించిన పారమెంటు మంత్రివర్గము, స్థానిక స్వపరిపాలనసంస్థలయొక్క విధులును, హక్కులును వివరముగా శాసనములలో పొందుపరుపబడియున్నవి. ఇయ్యది పాశ్చాత్యదేశములలో ననుసరింపబడుచున్న సంప్రదాయము. ఈపద్ధతినే బ్రిటిషువారు హిందూదేశములో ప్రవేశపెట్టిరి ఈసంస్థల యొక్క హక్కులును, విధులును ఆయాశాసనములలో వివరముగా శాసింపబడినవి హిందూదేశమునందలి స్వపరిపాలన సంస్థలు ప్రస్తుతము నెరవేర్చుచున్న కార్యములును, అవి యెంతవరకు ప్రజల సౌకర్యార్థ ముపయోగపడుచున్నదియు గమనించుటకుముందు బ్రిటిషు రాజ్య స్థాపనముమొదలు నేటివరకు వీనియొక్క చరిత్రను సంగ్రహముగా నిందు బొందుపరచెదను. ఇందువలన ప్రస్తుతరూపము నివి యెటులు దాల్చినవో పాఠకులకు సుబోధము కాగలదు.

ఆధునికస్థానికస్వపరిపాలనసంస్థలు హిందూదేశమున తొలుత బొంబాయి, కలకత్తా, మదరాసు పట్టణములలో నెలకొల్పబడినవి ఈస్టుఇండియా కంపెనీ పరిపాలించెడి కాలములో దీనిపయిని అధికారము కలిగియుండెడి 'కోర్టుఆఫ్ డైరక్టర్సు' అనెడి సంస్థ క్రీస్తుశకము ౧౬౮౭-వ సంవత్సరమున మదరాసు పట్టణములోని యూరపియనులు హిందూదేశీయులతో గూడిన యొకకార్పొరేషనును నిర్మించియుండిరి. కాని ౧౯-వ శతాబ్దమువరకు నివి యంతగా అభివృద్ధి గాంచలేదు. ఈశతాబ్దములోనే పైమూడు పట్టణములలో ఉన్న కార్పొరేషనులకు మెంబర్ల నెన్నుకొనుపద్ధతి నమలులో బెట్టుటయే కాక యితరపట్టణములలోగూడ మునిసిపాలిటీలను స్థాపించుటకు ౧౮౪౨-వ సం మొదలు ౧౮౬౨-వ సం. వరకు కొన్ని శాసనములు కావింపబడినవి అయినను ప్రజలు ఇందువిషయమై నిర్లక్ష్యభావమును వహించియుండిరి.

తదుపరి ౧౮౭౦-వ సం. లో వైస్రాయి మేయోప్రభువు మునిసిపాలిటీలను అభివృద్ధిచేసి పరిపాలనవిధానములో హిందూ

దేశీయుల సహకారమును పెంపొందించవలయునని ఒక తీర్మానములో రాష్ట్రీయ ప్రభుత్వములను ప్రోత్సహించినందున మునిసిపలు సంస్థలు పెక్కులు స్థాపింపబడి యెలెక్షను అనగా ఎన్నికపద్ధతి ప్రవేశపెట్టబడినది పిమ్మట ౧౮౮౨-వ సం ములో ఇందువిషయమై రిపను ప్రభువు ఒకముఖ్యమయిన తీర్మానమును గావించియుండెను స్థానిక స్వపరిపాలనచరిత్రలో ఈ తీర్మానము చాల ప్రముఖమయినది. స్థానిక స్వపరిపాలన సంస్థలను ప్రజలకు వశపరచుటవలన పరిపాలన విధానము అభివృద్ధి గాంచకపోయినను ప్రజలకు పరిపాలన పద్ధతులయం దనుభవమును, జ్ఞానమును పెంపొందించుటయే బ్రిటిషు గవర్నమెంటువారి ముఖ్యాశయమని రిపనుప్రభు వీతీర్మానములో తేటతెల్లముగా వక్కాణించియున్నాడు. హిందూదేశీయులు స్వపరిపాలనసూత్రమునకు నిర్లక్ష్యభావమును వహించియుందురనియు, పబ్లికు సమస్యలలో నావంతయయినను శ్రద్ధవహించరనియు, తాము చేయగలిగిన కార్యములను గవర్నమెంటు వుద్యోగస్థులచే చేయించుకొనుటయే వారి యభీష్టమనియు సామాన్యముగా వచింపబడెడు అభిప్రాయములతో తా నేకీభవింపననియు, ఈఉద్యమము సఫలతగాంచక పోయినను హిందూదేశీయులకు స్వపరిపాలనమునందు శిక్ష గరపుటయే ప్రభుత్వమువారి పరమావధి యనియు రిపను ప్రభువు ఉన్నతాశయములను తన తీర్మానములో వెల్లడించియుండెను.

రిపనుప్రభువుతీర్మానమువలన స్థానికస్వపరిపాలనము నూతన రూపము దాల్చి హిందూదేశమున నలుదెసలను వ్యాపించినది. ప్రతిరాష్ట్రము రిపనుప్రభువుయొక్క ఆశయములను నెరవేర్చుటకు నూతన శాసనములను తమతమ స్థానిక రాష్ట్రీయ పరిస్థితుల కనుగుణముగా నుండునట్లు గావించియుండి స్వపరిపాలనసంస్థలకు నూతన జీవమును, వికాసమును ఒనగూర్చియుండిరి. మదరాసు రాజధానిలో గ్రామములను బునాదిగా చేసి ఒకటిలేక యెక్కువ గ్రామములమీద అధికారముతో యూనియనుబోర్డులను లేక పంచాయితీలను స్థాపించి పల్లెలకుకూడ స్థానికస్వపరిపాలనమును వ్యాపింపజేసిరి. వీనిపయిన ఒక్కొక జిల్లాలో కొంతభాగమునకు తాలూకాబోర్డులను, జిల్లాకంతకును జిల్లాబోర్డును అన్నిజిల్లాలలోను స్థాపించియుండిరి. బొంబాయి రాజధానిలో పంచాయితీలునిర్మించక తాలూకా జిల్లాబోర్డులుమాత్రమే నెలకొల్పిరి ఇట్లు ఆయారాష్ట్రపరిస్థితుల ననుసరించి స్థానికసంస్థలు కొంచెము భిన్నరూపము దాల్చినను అన్నిరాష్ట్రములయందును పల్లెల సౌకర్యార్థము లోకలుబోర్డులు హిందూదేశ చరిత్రలో తొలుత ఏర్పరుపబడినవి. ఎలెక్షనుపద్ధతియు, కొన్నిబోర్డులకు ప్రెసిడెంటులను ఎన్నుకొను అధికారమును, ఈ సంస్థలకు వలయు ఆదాయమును యేర్పాటు చేయుటయు మున్నగు సంస్కరణములు ప్రవేశపెట్టబడినను ౧౯౧౮-వ సం. వరకు నివి యంతగా అభివృద్ధి గాంచలేదు. ఏలననగా ఈ స్థానిక సంస్థలకన్నిటకిని జిల్లా కలెక్టరులే ప్రెసిడెంటులుగా ఉండెడివారు. మరియు స్థానికసంస్థలద్వారా ప్రజాసేవ చేయవలె ననెడిభావము ప్రజలలో ఇంకను వ్యాపించలేదు.

౧౯౧౮-వ సంవత్సరములో వెలువడిన మాంటేగ్యూ చెమ్సుఫర్డు రిపోర్టులో ఈ లోపము లన్నియు స్పష్టీకరింపబడినవి వీనిని నిర్మూలించే నిమిత్తము స్థానికసంస్థలకు సంబంధించిన విషయములలో వీనికి సంపూర్ణస్వాతంత్ర్య మివ్వవలె ననియు, సాధ్యమయినంతవరకు ప్రభుత్వపు జోక్యమును ఈ సంస్థలలో తగ్గించవలయుననియు, ప్రజోద్దేశమే యీసంస్థలకు మూలాధారముగా నుండవలయుననియు కొన్ని ముఖ్య సూత్రములను నిరూపించిరి ఇందువలన ౧౯౧౯-వ సంవత్సరములో వైస్రాయి చెమ్సుఫర్డు ప్రభువు ఒకతీర్మానము గావించి వీటిని ప్రజాస్వామిక సంస్థలుగా జేయుటకు కొన్ని సూచనలు చేసియుండిరి. ఈవత్సరములోనే ప్రస్తుత మమలునందున్న ఇండియాగవర్నమెంటు ఆక్టు పార్లమెంటులో శాసింపబడినది ఈశాసనమును బట్టి యిదివరలో ఉన్నవారికంటె యెక్కువమంది మెంబరులతో గూడిన నూతన శాసనసభలును, ఈశాసనసభలకు బద్ధులయిన మంత్రులును, రాష్ట్రీయప్రభుత్వములలో ప్రవేశపెట్టబడి గవర్నమెంటుకు సంబంధించిన కొన్ని డిపార్టుమెంటులు ఈ మంత్రుల పరిపాలనమునకు ట్రాన్సుఫరు చేయబడినందువలన స్థానిక స్వపరిపాలనశాఖ ఇండియనుమంత్రుల హస్తగతము చేయబడినది అందుచేత ఈ సంస్థలయొక్క భావిదశకు శాసనసభలకు లోబడిన మంత్రులు బాధ్యత వహించిరి. ఆయారాష్ట్రములలోని మంత్రులు తమ నూతనాధికారములను స్థానిక సంస్థలు, రాష్ట్రీయ ప్రభుత్వముయొక్క కొద్ది అధికారమునకు లోబడి తమకు సంబంధించిన సమస్యలలో సర్వస్వతంత్రాధికారము కలవిగను, ఆయాసంస్థలయొక్క స్థానికనియోజకవర్గములకు సంపూర్ణ బాధ్యత వహించునవిగను చేయుటకు వినియోగించిరి అన్ని సంస్థలలోను ఎన్నిక మెంబర్లు వృద్ధిపొందింపబడి, మెజారిటీ యివ్వబడినది మెజారిటీ ఎన్నిక మెంబర్లలో ఉండుటవలన ఈ సంస్థలయొక్క అధికారము లన్నియు ప్రజల హస్తగతమయినవని చెప్పవచ్చును గవర్నమెంటు అధికారుల చేతులలోనుండి అధికారము తీసివేయబడినది నియోజకవర్గములు పెంచబడినవి. అనగా వోటర్లు వృద్ధిచేయబడిరి. ఈ సంస్థలపయిని అదివరకు ఉండెడి రాష్ట్రీయప్రభుత్వపు జోక్యము చాలవరకు తగ్గింపబడినది అన్ని సంస్థలకును మెంబర్లలోనుండి ప్రెసిడెంటులను ఎన్నుకొను హక్కు ఇవ్వబడినది వర్తమానకాలమందు మన మదరాసు రాజధానిలో ఇకను ముఖ్యమయిన మార్పులు గావింపబడియున్నవి. ఇచ్చట నియోజకవర్గములు పెంచబడినవి. నామినేటెడు మెంబర్లు పూర్తిగా తీసివేయబడిరి. ఇదివరలో జిల్లాబోర్డుకు మెంబర్లు తాలూకా బోర్డు మెంబర్లచే ఎన్నుకొనబడుచుండిరి. ఇపుడటుల గాక

జిల్లా, తాలూకాబోర్డుల కన్నిటికిని వోటరులే యెన్నుకొను హక్కు యివ్వబడినది అనగా డైరెక్టు ఎలెక్షను ప్రవేశపెట్టబడినది అందుచేత జిల్లా, తాలూకాబోర్డు లన్నియు ప్రజలకే బాధ్యతవహించునటుల సంస్కారము గావింపబడినవి

హిందూదేశములో ప్రస్తుతము బొంబాయి, కలకత్తా, మదరాసు పట్టణములలో ౩౦ కార్పొరేషనులును, ౭౪౯ మునిసిపాలిటీలును గలవు కార్పొరేషనులయొక్క హక్కుబాధ్యతలను నిరూపించు ప్రత్యేక శాసనములు గలవు మునిసిపాలిటీల కాయా రాష్ట్రములలో శాసనములు గలవు మదరాసు, బెంగాలు, సంయుక్త రాష్ట్రములలో గ్రామపంచాయతీలు విశేషముగా వృద్ధిపొందుచున్నవి ఇతర రాష్ట్రములలో పంచాయతీలు వృద్ధిపొందలేదు గ్రామముల సౌకర్యమునిమిత్తము ఉద్దేశింపబడిన సంస్థలలో జిల్లాబోర్డులే ప్రముఖమయినవి పంజాబు, సంయుక్తరాష్ట్రములలో తప్ప తక్కినరాష్ట్రములలో జిల్లాబోర్డులకు దిగువను తాలూకా లేక సర్కిలుబోర్డులు గలవు ఇవి జిల్లాలలోని కొంతభాగమునకుమాత్రమే అధికారము కలిగియున్నవి జిల్లాబోర్డులు జిల్లాకంతటకును అధికారము కలిగియున్నవి. పంజాబురాష్ట్రములోతప్ప తక్కిన యన్ని రాష్ట్రములలోను జిల్లాతాలూకాబోర్డులకు ప్రెసిడెంటులు బోర్డు మెంబర్లలోనుండియే యెన్నుకొనబడుచున్నారు పంజాబురాష్ట్రములో ఇంకను చాలవరకు జిల్లాఆఫీసరులే ప్రెసిడెంటులుగా ఉన్నారు. వృత్తిపన్ను, ఆదాయపుపన్ను, స్థిరాస్తిపన్ను, రహదారీపన్ను మున్నగునవి మునిసిపాలిటీల ఆగాయమునకు ఆధారముగా నున్నవి భూమిశిస్తుతో గవర్నమెంటువారు వసూలుచేసెడు రివిన్యూసెస్సులును, గవర్నమెంటువారు యిచ్చెడిగ్రాంటులును లోకలుబోర్డుల ఆదాయమునకు ముఖ్యాధారములై యున్నవి

ఇకను స్థానికస్వపరిపాలనసంస్థలు చేయుచున్న పనులను గమనించవలసియున్నగి పట్టణములకు సంబంధించిన మునిసిపాలిటీలు మొదలగునవియు, పల్లెలకు సంబంధించిన బోర్డులు, పంచాయతీలు మున్నగునవియు ఇంచుమించుగా ఒకేబాపతుపనులను నెరవేర్చుచున్నవి వాని నీదిగువ నుదాహరించుచున్నాను.—

(౧) విద్యాభివృద్ధి, (౨) ఆరోగ్యము, (౩) పారిశుద్ధ్యము, (౪) పబ్లికువర్క్సు—అనగా రోడ్లు, వంతెనలు, విశ్రాంతిగృహములు వగయిరా, (౫) వైద్యసహాయము

పయినవివరించిన విధులను స్థానికస్వపరిపాలనసంస్థలును, యిందులో ముఖ్యముగా లోకలుబోర్డులును ఎంతవరకు నెరవేర్చుచున్నదియు, ఈసంస్థలు ఎంతవరకు ప్రజాసౌకర్యమునకు తోడ్పడుచున్నదియు, వీనిలో చేరెడిప్రజలు స్వార్థము నపేక్షింపక యెంతవరకు దేశసేవాతత్పరులై మెలగుచున్నదియు మున్నగు విషయములు కొంచెము యోచించవలసియున్నది దేశమునం దన్ని రాష్ట్రములలోను స్థానిక స్వపరిపాలనసంస్థలు కొన్ని తమ విధ్యుక్త ధర్మముల నతి సమర్థతతోడను, చాకచక్యముతోడను, దేశసేవాభిలాషతోడను నెరవేర్చుచుండిన సంగతి యెల్లరకు విశదమే పట్టణములనుండి పల్లెలకును, పల్లెలనుండి యితరపల్లెలకును రోడ్లు, వంతెనలు వేయబడి రాకపోకల సౌకర్యములు పెక్కుమడుంగుల వృద్ధిచేయబడినవి. ప్రాథమిక పాఠశాలలు విశేషముగా నెలకొల్పబడినవి ఆరోగ్య పారిశుద్ధ్యముల విషయమై నాగరికదేశములం దనుసరింపబడుచున్న ఆధునికపద్ధతులు కొంతవరకు అవలంబింపబడినవి పాశ్చాత్యవైద్యసహాయము నొసగెడి యాస్పత్రు లచ్చటచ్చట సృష్టింపబడినవి ఇట్లు కొన్నివిధముల గ్రామసౌకర్యములు వృద్ధిపొందింపబడినవి అయినను ఈ సంస్థల గుణదోషములను పరిశీలించునప్పుడు మంచిచెడ్డలు రెండును పేర్కొనవలసియున్నది లోకలుబోర్డులలో ఇప్పుడు అనేకలోపములు గలవు ఈ సంస్థలు తొలుత హిందూదేశములో ఎందునిమిత్తము స్థాపింపబడినవో ఆయవసరము ప్రస్తుతము లేదు హిందూదేశీయులకు స్వపరిపాలనమునందు శిక్షను గరపునిమిత్తమే యీ బోర్డులను ప్రవేశపెట్టితిమని రిపనుప్రభువు మొదలగు పెక్కు బ్రిటిషు రాజకీయవేత్తలు వక్కాణించియున్నారు పైరాజ్యాంగపద్ధతులలో ననగా రాష్ట్రములలోను, కేంద్రప్రభుత్వములోను బాధ్యతతోగూడిన ప్రభుత్వములను నెలకొల్పుటయే మాయాశయమని మెక్డానల్డు ప్రధానమంత్రి రౌండుటేబిలు కాన్ఫరెన్సులోను, పార్లమెంటులోను బ్రిటిషుప్రభుత్వమువారితరఫున ఎలుగెత్తి చాటియున్నవిషయ మెల్లరకు గోచరమే. ఇట్లు పెద్దవిషయములలోనే మనకు స్వరాజ్య మిచ్చెదమనెడి యీ రోజులలో ఇంకను కేవలము స్థానికస్వపరిపాలన సంబంధమయిన యల్పవిషయములలో మనకు శిక్షనుగరపు నవసర మేల? ఈ స్వల్ప విషయములనిమిత్తము బహుబీదదగు హిందూదేశములో ప్రత్యేకసంస్థలుండవలయునా? ఇవి నెరవేర్చెడిపనులు చేయుటకు తగిన గవర్నమెంటు డిపార్టుమెంటుల ఉద్యోగస్థులు లేరా? ప్రస్తుతపుదేశము యొక్క ఆర్థికపరిస్థితులనుబట్టియు, లోకలుబోర్డులయందు గల పెక్కు లోపములనుబట్టియు ఈ బోర్డులను తీసివేసి యివి చేయుపనులను యితరడిపార్టుమెంటులచేత చేయించుకొనవచ్చు ననెడి యభిప్రాయమును పాఠకుల విమర్శననిమిత్తము నివేదించుకొను ఉద్దేశమే యీ వ్యాసరచనకు నన్ను పురికొల్పినది నా యీ సూచనయందలి యవసరమును, లాభనష్టములును, చదువరులు నేను క్రింద గ్రంథవిస్తరభీతిచే సంక్షేపముగా వివరించిన విషయములను, బోర్డుల లోపములను పూర్ణముగా విమర్శించినచో గోచరము కాగలవు గనుక వాని నీదిగువ నుదాహరించుచున్నాను

(౧) ప్రపంచమున గల దేశము లన్నిటిలోను భారతదేశము బహుదారిద్ర్యదశయం దున్నవిషయ మెల్లరంగీకరించినదే ఇట్టి బీద

దేశములో అనవసరమగు సంస్థలు గాని, ఉద్యోగములు గాని నిర్మించుట లాభకరమా?

(౨) నాగరిక దేశము లన్నిటిలోను రాజ్యాంగ సంస్థలలో పార్టీలు లేక భిన్న పక్షములు గలవు గాని యివి రాజకీయ ప్రణాళికల మీదను, రాజ్యాంగ సమస్యలు లేక సూత్రముల పైనను ఆధారపడియున్నవి. కాని హిందూదేశములో స్థానిక సంస్థలలోని పార్టీలు కేవలము వ్యక్తులనుబట్టి యున్నవి అనగా ఆయా సంస్థలకు సంబంధించిన సమస్యల విషయమై పార్టీలు దృష్టి నిలుపక స్థానిక నాయకుల యభిప్రాయములమీదనే యాధారపడి యున్నవి. ఇయ్యది ఆధునిక రాజ్యాంగ పద్ధతుల సూత్రములకు భిన్నముగా నున్నది

(౩) కొన్ని బోర్డులలోని ప్రెసిడెంటులు కంట్రాక్టుల నిచ్చుట లోను, ఇతర విషయములలోను స్వలాభమును పొందుచున్న విషయము అనుభవజ్ఞులకు విశదమే బోర్డులు దేశసేవ నిమిత్తమే యుద్దేశింపబడినను, స్వలాభమును పొందుట కనువగు సంస్థలనెడి యభిప్రాయము వ్యాపించియున్నది ఈ యభిప్రాయానుసారముగా బోర్డుల అధికారులు తమ పరిపాలనమును సాగించుచు పబ్లికు ధనమును తాము సాగినంతవరకు సొంత బొక్కసములలోనికి చేర్చుచుండినను ప్రజలు ఇందు విషయమై కేవలము నిర్లక్ష్యభావమును వహించుచుండుటయు, అట్టి అధికారులను తిరుగ బోర్డులలో ప్రవేశింపచేయుటయు జరుగుచున్నవి

(౪) హిందూదేశము బ్రిటీషు పరిపాలనమునకు లోబడిన పిమ్మట ఈ దేశములో నెలకొల్పబడిన డిపార్టుమెంటులును, ఉద్యోగములును అమితముగా నున్నవి ఇట్టి బీద దశ మరొక దేశములో దేనిలోను ఇన్ని డిపార్టుమెంటులుగాని, ఉద్యోగములుగాని లేవు ప్రస్తుతము మదరాసు రాజధానిలోని జిల్లాలలో గల యుద్యోగస్థులను తిలకింపుడు రాజధానిలో ఉన్నవారు గాక జిల్లాలలో పెద్దజీతములు పొందెడి ఆఫీసర్లను చూచినచో ఈ బోర్డులనెడి ప్రత్యేకసంస్థల యనావశ్యకత బోధపడగలదు—

(౧) జిల్లాకలెక్టరు, (౨) జిల్లా పోలీసు సూపరింటెండెంటు, (౩) జిల్లా రిజిష్ట్రారు, (౪) జిల్లా మెడికలు ఆఫీసరు లేక సర్జను, (౫) జిల్లా ఎడ్యుకేషనలు ఆఫీసరు, (౬) జిల్లా లోకల్ ఫండు అకౌంట్సు యిన్స్పెక్టరు, (౭) పోస్టలు సూపరింటెండెంటు, (౮) జిల్లా బోర్డు ప్రెసిడెంటు, (౯) జిల్లా బోర్డు యింజనీయరు, (౧౦) జిల్లా హెల్తు ఆఫీసరు, (౧౧) జిల్లా జడ్జి, (౧౨) డి. పి. డబల్యు ఎగ్జిక్యూటివు యింజనీయరు, (౧౩) ఇంకటాక్సు ఆఫీసరు, (౧౪) జిల్లా రెవెన్యూ ఆఫీసరు, (౧౫) పరపతిసంఘముల సబు డిప్యూటీ రిజిస్ట్రారు, (౧౬) జిల్లా పంచాయతీ ఆఫీసరు.

(౫) లోకలుబోర్డుకు సంబంధించిన పనులు అనగా విద్య, ఆరోగ్యము మొదలగు విషయముల కన్నిటికిని ఆయా ఆఫీసరులు పైన వివరించిన లిష్టులో గలరు. ఇంతమంది ఆఫీసరులు ఉండగా బోర్డులు చేయుపనులకు ప్రత్యేకసంస్థ లవసరమా? ఒకరిద్దరు తప్ప ఈ ఆఫీసరులందరును హిందూదేశీయులే. ఈ ఆఫీసరులచేత ఈ పనులన్నియు చేయించరాదా?

(౬) లోకలుబోర్డు పరిపాలనములో రాజ్యాంగ ప్రణాళికలు గాని, ఆధునిక రాజ్యాంగ సూత్రములు గాని అంతగా పరిగణింపబడుచుండుట లేదు అనగా ఆయా మెంబరుల లేక ప్రెసిడెంటులయొక్క స్వతంత్రేచ్ఛమీదనే నడుపబడుచున్నవి.

(౭) లోకలుబోర్డులను ఎత్తివేసినచో కొంతవరకు పబ్లికుధన వ్యయమును, ప్రజలపన్నుల భారమును తగ్గగలవు

(౮) హిందూదేశమునకు బాధ్యతాయుత ప్రభుత్వము నొసగెదమని బ్రిటిషువారు వాగ్దానము చేయుటలో స్వపరిపాలనకు మన మర్హులమనెడి యభిప్రాయము లేదా? అయినచో ఇంకను మనకు లోకలుబోర్డులకు సంబంధించిన స్వల్పవిషయములలో శిక్షను గరపనేల? లోకలుబోర్డులు ప్రారంభములో ఈశిక్షకొరకే యుద్దేశింపబడినవి ఇంకను ఈశిక్ష యవసరమా?

(౯) లోకలుబోర్డులు చేయుపనులకు గాక యీసంస్థలయునికికి చాలధనము వ్యయమగుచున్నది బోర్డుపనులకు తగినంతధనము ప్రభుత్వమువారు చేకూర్చుచుండుటలేదు ఇట్టి స్థితిలో ప్రత్యేక సంస్థలేల?

(౧౦) మాంటేగ్యూచెమ్సుఫర్డు సంస్కరణము లమలులోనికి వచ్చినదాది బోర్డులమీద ప్రభుత్వాధికారము చాలవరకు తగ్గింపబడి ప్రజలకు బాధ్యత వహించునట్లు చేయబడినది. ఇందువలన బోర్డులలో గవర్నమెంటుకుగాని, వోటర్లకుగాని బాధ్యత వహించి తమ పరిపాలనమును కొనసాగించుచుండవలెననెడి యభిప్రాయము కానరాదు.

(౧౧) బోర్డులసమస్యలనుగురించి ప్రజలలో బలమయిన రాజకీయాభిప్రాయము లేదు. అందువలన బోర్డుల పరిపాలనవిధానము అందలి యధికారుల సొంతయభిప్రాయములమీదనే యాధారపడియున్నది జనాభిప్రాయము (అనగా పబ్లికు ఒపినియన్) బలముగా నున్నచో బోర్డుల దుష్పరిపాలనము తగ్గగలదు.

(౧౨) కొన్నికొన్ని బోర్డులలో ఎన్నికలు జరుగుసమయమున మెంబరు పదవులను, ప్రెసిడెంటు పదవులను పొందనిమిత్తము వేలకువేలు ధనము వెచ్చించుచున్నారు. జీతములేకుండ దేశసేవ చేయుట కుద్దేశింపబడిన యీసంస్థలలో చేరుట కిట్లు వెచ్చింపనేల? ఇట్లు వ్యయపరచిన ధనమును ప్రత్యర్థులు బోర్డులలో చేరి తిరుగరాబట్టుకొనకుందురా?



1. మద్రాసు యునైటెడ్ క్లబ్బు—పురుషుల డబుల్సులో గెలుపొందిన ఆటకాండ్రు;
2. మిక్సెడ్ డబుల్సులో గెలుపొందిన ఆటకాండ్రు, 3. స్త్రీల డబుల్సులో గెలుపొందినవారు ( కుడివైపున ఇద్దరు ).

(౧౩) కొన్నిబోర్డులు ప్రస్తుతము సాంఘికవైషమ్యములతోడను, వ్యక్తులతోగూడిన పార్టీలతోడను తల్లడిల్లుచున్నవి. ఇట్టి వాతావరణములో నిజముగా సమర్థులును, దేశసేవాతత్పరులును అయిన దేశీయులు ఈబోర్డులలో ప్రవేశించుటకు ప్రతిబంధకముగా నున్నది

(౧౪) మాంటుఫర్డుసంస్కరణముల ప్రకారము గవర్నమెంటు అధికారుల హస్తములనుండి బోర్డులు తప్పింపబడినప్పటినుండియు బోర్డులలో దుష్పరిపాలనమును, బోర్డుధనము నేదో యొకరూపముగా స్వలాభము నిమిత్త ముపయోగించుకొనుటయు పెరిగిపోవుచున్నవి. ప్రజల నిర్లక్ష్యభావ మిందుకు తోడ్పడుచున్నది బాధ్యత మృగ్యమయినది

(౧౫) దేశమునందలి పల్లెలన్నింటిలోను క్రమక్రమముగా గ్రామపంచాయితీలను స్థాపించినచో ఇప్పుడు బోర్డులు నెరవేర్చు పనులు చాలవరకు చేయగలవు. అందుచే బోర్డులు ప్రత్యేకముగా నుండ నవసరము లేదు.

(౧౬) ఈలోకలుబోర్డులను పూర్తిగా తీసివేయుటకుగాని, లేక వీనిని సంస్కరించుటకుగాని హిందూదేశీయులకు పూర్ణమయిన అధికారము గలదు ఏలయనగా ఈసంస్థలు మంత్రులపరిపాలనకు ఇవ్వబడినవి మంత్రులు శాసనసభలకును, శాసనసభలు వోటరులకును బాధ్యత వహించియున్నారు. అందుచేత బ్రిటిషువారిని కోరనక్కరలేదు

పయిని వివరించినలోపములన్నియు దేశమునం దన్నిరాష్ట్రములలో గాని, అన్ని లోకలుబోర్డులలో గాని యున్నవని యెంచగూడదు పట్టణములకు సంబంధించిన మునిసిపాలిటీలు మున్నగు సంస్థల నెత్తివేయవలెనని నేను సూచించుట లేదు. లోకలుబోర్డులను పూర్తిగా తీసివేయుటయో, లేక మార్పులు చేసి బాగుచేయుటయో హిందూదేశీయులు కడు జాగ్రత్తగా యోచించి పయిన ఉదాహరింపబడిన విషయముల నన్నిటిని విమర్శించి ప్రస్తుతపు దేశపరిస్థితులను గమనించి యిందుకు వలయుచర్యలు గైకొనవలయునని దేశీయులను హెచ్చరించుచున్నాడను.



వృద్ధాచల దేవాలయ గోపురము

M. K. W.

# భావన

కాళ్ళూరి వేంకటనరసింగరావుగారు

ఏమి! యీవేదఋషిపూతభూమి, యీపు
    రాణ కల్లోలినీ కలగాన ముఖరి
తాశ్రమోపాంతవనవాటి నవఘుళించె
ప్రకృతివికసన సౌభాగ్య పరిమళములు

మాతృసందర్శనమున నమ్లానవదన
కైరవము కెంపు దులకింప, కలకలనగు
బాలపోలిక తీయగ మేలుకొనిన
దీప్రకృతి జీవశోభలనేమొ నేడు!

అమలినోన్మేషరోచి స్సుధార్ద్రకళల
దేలిపోవు నీపన్యనదీతరుప్ర
తానశైలపరీతభూతలము నిండ
నెల్లెడల కౌముదీశాంతియే నెలకొనె.

అనుభవైకవేద్యానంద మమరగంగ
పోలె పొంగిపోయినది దిక్పాలికలను,
తొణకని జగద్హృదంత సంతోషజలధి
నొక్కబుద్బుదమై లయమొందితేను

గుప్పవర్ణ విశ్వమెల్ల బుగులొక్కనియెడు
పూర్వయుగతపోవాటికా పుణ్యగాన
కలకలముల భారతభాగ్యముల కొటార్ల
విప్పినట్లయ్యె వేదాల వీధులందు.

జ్ఞానవీణా చిదానంద గానలహరి
వ్యాసభగవాను లెంద రీవసుధ దేల్చి
రంద రుదయించి కలసట లందగించు
సందడుల ముక్తిసుందరి సందిళులను

జీవనమె మార్చివైచు నీభావదృశ్య
రంగవిహారణరతి నంతరంగమందు
కాలపరిణామభేదవిజ్ఞాన మడగి
కరగె తన్మయతాతరంగముల గలసి

అపుడు పలుకుల కందని యద్వితీయ
ప్రణయగౌరవ మూపెవైచినది నన్ను
వలపుపూదోటపోలె దగ్వాలయవాటి
పల్లవింపగ భావసంపదల విరిసి.

రజతగిరిదారి నమృతసరస్తటమున
మరుల బరమేశుపై రుచిమరగి కరగు
'వేదవతి' నుదాపింతు హృద్విద్యనుః
మురిసిపోయితి గరువాన విఱుగబడుచు

ఇంత దుర్లభోత్కంఠ పీడించు నాదు
వెఱ్ఱివేరాసకును నాకె విస్మయంబు
పొడమ లజ్జిలి తలవాల్చి పుడమివంక
నోరగా దిలకించుచు నుంటి నేను,

చిరుతసంజలు మలయు నాసిగ్గురేక
లెలచెమర్పు చెక్కుల నన్నగిలెనొ లేదొ
నీలిసోయగముల గాయు బాలజలద
కోమలచ్ఛాయతావిసోకులను సోలసె.

జల్లుమని సంభ్రమత్రపల్ వెల్లివిరియ
నరసితిని ఎద స్పృహలు ముమ్మరముసూప
అలతినవ్వుల వాలుజూపులను నాచి
పెడమరలి చూచినావె ప్రేముడిని నీవు?

*   *   *   *

అలరునెమ్మేని ఘర్మోదయమున గరగి
ఆత్మ వెల్లివిరియు ప్రణయమున గరగి
అవిరళామోద బాష్పతోయమున గరగి
అవశనయ్యె నర్పణమయి తపుడు నీకు.

ఎన్ని భవములనుండియో యేమొ! ఆత్మ
బక్వమగుచున్న రుచిపరిపాక పావ
నానురాగము చరితార్థమయ్యె నేడు
పలుకులేదె కృతజ్ఞతాభారమునకు?

ఐన నేమాయె, తరళదృగంచలముల
నిమ్మహానంద మొలుకగనీక, క్రమ్మి
బరువులై యూగు సిగ్గుదొంతరల నాప
వలవదోమది అంత యవస్థపడియు.

జన్మజన్మవియోగవాసనల నీది
ప్రోదిమై యలసటదీర నేదదేరు
తావకకటాక్షశీతలతావినీల
కాయమానలసచ్ఛాయ నాయెడంద.

ఇంతభాగ్యమె! వేదనాక్రాంతమున్న
క్షీప్రవాసప్రణయినికి నోపగలదె
వలపు ఏకాంతమ్ముల కలవడ్డనీన
కళవళమ్ములేక దివ్యసాంగత్యసుఖము?

ఎటు సహింతువో యీయమాయికమనస్క
నీపదాబ్జములందు కన్నీరునించి
జంకుచే నీమొగముచూడజాల కొదిగి
యోసరిల చెయిచెయి దార్చుచో హృదీశ!

ఏల లోనిలోతుల గలయింతు? జాలి
వాలుజూపుల జనవుల మేలుకొలిపి
జుమ్మునర్ సొమ్మసిలు నెమ్మనమ్ము భ్రమసి
ఈయనర్హ కౌగిలి కెలయింతువో!

వలదు, నీసుమహృదయము నలగునేమొ
కెరలు సంకులభావసంగీతహత్తుల్ల,
ఇరియుసందిట మురియులే మెరుగు ముగ్ధ
విసువుపుట్టింపదో నవరసికనాథ!

---

## దేవ!

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

భక్తకల్పకమని దీనబాంధవుండ
టనుచు నిర్వ్యాజకరుణాళువనియు సన్ను
బుధులు పొగడంగ బారపడి ప్రోపుం గోరి
చెడితిం జెడితినిం జెడితిం నిశ్చితము దేవ!

సంకటశిలాతివృష్టిం బ్రచండగతిని
గురియ నాపయి దుర్విధి కరుణ మాలి
నీవు గోవర్ధనం బెత్తి కావుదువని
భ్రమసి నినుం జేరి ముప్పత్తిప్పలను బడితి.

నిన్ను నిందించి ఫల మేమి?. నిచ్చ బుధుల
వెడంగుమాటలు మాటిమాటికి విశ్వసించి
రాతిబొమ్మలం గొలుచుట శ్రేయుంబగలు
ఫల మపేక్షించి నాదు తప్పిదము గాక!

---

కాశీ



హనుమాన్ ఘట్టము



మణికర్ణికా ఘట్టము



హరిశ్చంద్ర ఘట్టము

ఛాయాచిత్రకారుడు : వి. యస్. గోపాలదేశికాచార్యులుగారు.



శ్రీకృష్ణుని ఆలయము, తిరుచానూరు M. D. S.



తిరుచానూరు పుష్కరిణి M. D. S.



# గ్రామపునర్నిర్మాణము: స్త్రీలు

శ్రీమతి దేశరాజు భారతీదేవిగారు

హిందూదేశము స్వాతంత్ర్యసంపద గల్గి సాంఘిక, రాజకీయ, మత విద్యావ్యవస్థలయం దభ్యున్నతి గాంచి, లోకమున కొజ్జబంతియై, నాగరికత వహించిన మంచికాలములో నేర్పరుపబడిన గ్రామనిర్మాణపద్ధతులు పరాధీనత వృద్ధిగాంచినకొలది క్రమక్రమముగా తమ సత్త్వమును బోగొట్టుకొని, శిథిలమై నేడు సంపూర్ణ స్వరూపనాశనము నొందినవి. మహమ్మదీయప్రభుపరిపాలనయందునయితము ప్రాచీనగ్రామనిర్మాణస్వరూపము చెడలేదు. ఆంగ్లపరిపాలన మారంభమై, యభివృద్ధి నొందినకొలది దేశపురోభివృద్ధికి మూలకందమగు గ్రామనిర్మాణపద్ధతి విచ్ఛేదము గాజొచ్చినది. అందువలననే ప్రాచీనహిందూచరిత్రకారు లభివర్ణించిన హిందూదేశ గ్రామస్వరూపము మన కిపు డెచటను గానరాదు. ప్రస్తుతము ప్రపంచపరిస్థితుల ననుసరించియు, రాజకీయవ్యవస్థల ననుసరించియు సర్వదేశములవారును గ్రామపునర్నిర్మాణము గావించుకొని సాంఘిక రాజకీయార్థికారోగ్యబలములను పెంపొందించుకొని, అభివృద్ధి నొందుచున్నారు; మఱియు నాగరికాగ్రగణ్య దేశీయులతోపాటు సమాన గౌరవమును గాంచుచున్నారు.

పరాధీనమైన మన భారతదేశమున గ్రామపునర్నిర్మాణోద్యమ మింకను శైశవావస్థయందే యున్నది. కాన భారతీయులెల్ల రీవిషయమై గట్టిప్రయత్నము చేయవలెను. దేశమనగా గ్రామసముదాయమే కావున గ్రామాభివృద్ధి లేక దేశాభివృద్ధి గలుగబోదు. గ్రామము లభివృద్ధినందినవన్న దేశమభివృద్ధినొందిన దన్నమాటే. అందువలన గ్రామాభివృద్ధి నెట్లు చేయవలెనో తెలిసికొని తత్ప్రయత్నముల సలుపవలెను.

ప్రజలు బలవంతులై, ఆరోగ్యవంతులై, సౌఖ్యవంతులై, విద్యావంతులై, ధనవంతులై, గోభూహిరణ్యవంతులై, స్వతంత్రజీవనులై యుండుటే గ్రామపునర్నిర్మాణమునకు ఫలము.

ఏదేశమునందలి గ్రామములప్రజలు పైన దెల్పిన సంపదలు గల్గియుందురో, ఆదేశ మభివృద్ధి నొందినదని చెప్పనొప్పు. పైనపేర్కొనబడిన సంపదలు కలుగుటకు కావలసిన యంశముల విచారింతము—

౧. నిర్మలమగు వాయుప్రసారము.

౨. పరిశుద్ధమగు మంచినీరు.

3. విశాలములై, దుర్గంధములేని వీథులు, గృహములు.

౪. ఎల్లరకు స్వతంత్రజీవనము గలిగించి, దేశహితకార్యోత్సాహము నెలకొల్పి, దేశాభిమానము గల్గించువిద్యావిధానము.

౫. శరీరారోగ్యము గల్గించు వ్యాయామము.

౬. ఆత్మగౌరవము, ఐకమత్యము పెంపొందింప జేయు మతబోధ.

పైఆరు ముఖ్యాంశములు గమనించి తత్సాధనోపాయముల వెదకి, కృషిసల్పుటకు గ్రామ పునర్నిర్మాణ సమస్య కేవలము పురుషులకు సంబంధించినదేగాదు. ఇందు స్త్రీలుగూడ కృషి సల్పుటత్యవసరము అందు కొన్ని యంశముల జయప్రదముగా నమలులో పెట్టుటకు పురుషులకంటె స్త్రీలకే యెక్కువ అవకాశములు గలవు గృహయాజమాన్యము, శిశుపోషణ స్త్రీల యధీనములోనే యుండునుగావున గృహము పరిశుభ్రముగా నుంచి గృహోపకరణముల నిత్యము నిర్మలస్థితిలో నుంచి, ఆహార పానీయములు పరిశుభ్రముగా నుండునట్లు జాగ్రతపడి 'గృహిణి' యను నామమును సార్థకపరచి గృహమును సౌఖ్యవంతముగా జేయు బాధ్యత స్త్రీలయందే కలదు.

ప్రతిగృహమును పరిశుభ్రమై ఆరోగ్యస్థానముగ నున్నచో గ్రామమంతయు పరిశుభ్రమై, ఆరోగ్యనిలయమై యుండును. ఈవిషయమై స్త్రీలే యెక్కుడు బాధ్యత వహింపవలెను అట్లే మంచినీటివిషయమైగూడ పురుషులకంటె స్త్రీలే యెక్కువ జాగ్రత్త వహించు నవకాశము గలదు. ప్రస్తుతకాలమున పల్లెటూళ్లలోని స్త్రీలు విద్యాగంధ మెరుంగనివారగుటచే నారోగ్యభంగకరముగ తాము త్రాగు మంచినీటిచెరువులయందు మురికివస్త్రముల నుదుకుచు, అంట్లు మున్నగునవి తోముచు నీటిని మలినమొనర్చి హానికలుగిజేయుచున్నారు తాము నివసించు గృహములకు చిక్కిలి సమీపములో పెంట కుప్పలు, మురికిగుంటలు, పేడదిబ్బలు పెట్టి తదీయ దుర్గంధబంధురమైన వాయువును పీల్చుచుండుటచే పసిబిడ్డలకేమి, బలహీనులకేమి, బలవంతులకేమి క్రమక్రమముగా నారోగ్యము చెడి పలువిధములగు రోగములు సంక్రమించుట కవకాశము సంభవించుచున్నది.

క. "ఆరోగ్యంబే భాగ్యం
బారోగ్యము లేకయున్న నఖిలధనంబుల్
కాఱడవి గాయు వెన్నెల
గా రాణింపవు సుమీ జగంబున కాంతా."

అనునట్లు సకలసంపదలలో నారోగ్యసంపద ప్రథమస్థానమలంకరించుచున్నది తలిదండ్రులు తా మారోగ్యవంతులుగ నున్నచో వారి సంతానమునయిత మనారోగ్యము గల్గినదై యుండును ఆరోగ్యవంతులగు దంపతులకు జనించిన శిశువులు స్ఫురద్రూపముగల్గి, యారోగ్యమును, బలమును, తేజస్సును గల్గి దీర్ఘాయుష్మంతులై జీవించుచున్నారు అనారోగ్యవంతులకు జనించినవారు కురూపులై, బాల్యారిష్టములకు లోనై, అల్పాయుష్కులై కూలుచున్నారు. ఆరోగ్యవిధులను తెలిసికొని యాచరించుట ముఖ్యముగనుక స్త్రీ లీవిషయమై శ్రద్ధవహింపవలయును. ఈపనికి ప్రతిగ్రామమునందు స్త్రీ పురుషులకు విద్య గరపవలయును

మనదేశమున నూటికి ఎనుబదిమందికి మించిన జనులు గ్రామములలో నివసించుచున్నారు. వీరు కేవలము వ్యవసాయవృత్తిపైమాత్ర మాధారపడియున్నారు. కాని వ్యవసాయవృత్తివల్ల తగినంత యాదాయము వచ్చుట లేదు. కావున వ్యవసాయాదాయమునకు తోడు మరికొంత యితరాదాయముగూడ తీయవచ్చును. అందునకై యింటింటను చేతిపనులు చేసి తద్ద్వారా కొంత ఆదాయము తీయవచ్చును. కుట్టుపని, పేము అల్లిక, చిత్రలేఖనము, నూలువడకుట మొదలగు పరిశ్రమల నభివృద్ధిచేయవలెను పురుషులు గృహనిర్మాణము, వడ్రంగము, శిల్పము, బంగారునగిషీపని మున్నగు పరిశ్రమల వ్యవసాయాదాయమునకుతోడు నేర్చుకొనవలెను.

ప్రస్తుతకాలమున జనులు వివాద పరిష్కారమునకై తమ గ్రామములలో గ్రామపంచాయతీ లేర్పరచుకొనక కోర్టుల కేగి, మితిలేని ధనవ్యయముచేసి కుక్కల

వలె కొట్లాడుచు, స్వార్థపరులైన న్యాయవాదుల యొక్కయు, పైరవీల్ల యొక్కయు, ప్లీడరుగుమాస్తాల యొక్కయు మాయమాటలచే మోసపోయి, పేరాసతో యిల్లు గుల్ల చేసుకొని, అసత్యప్రమాణములకు సిద్ధపడి, తుదకు ధననష్టము, దేహకష్టము గల్గి, ఆత్మభ్రష్టు లైపోవుచున్నారు. అట్టి కష్టనష్టములపాలు గాకుండ గ్రామవాసులలో సంభవించు వివాదములను గ్రామ స్థులే పరిష్కరించుకొనుటకై గ్రామపంచాయితీలు ఏర్పడ వలసియున్నది.

ఇట్టి యేర్పాట్లు గావించుకొనుటకును, ఐకమత్యము సంఘటింప జేయుటకును, దేశాభిమానము పురికొల్పు టకును, భగవద్భక్తి, సత్ప్రవర్తన, దేశహితైక జీవనము అభ్యాసము చేసికొనుటకును నానావిషయ ములందు ప్రవీణులైనవారిచే దినదినమును గ్రామము లలో ప్రబోధము చేయింపవలసియున్నది. ఈవిషయమై పురుషులేకాక స్త్రీలును కృషి చేయవలసియున్నది

ఎల్లవారును పఠించుట కుపయోగించు ఉత్తమ గ్రంథసముదాయమును జేర్చి గ్రంథాలయములు నెల కొల్పవలెను ప్రస్తుతరాజకీయ, సాంఘికపరిస్థితుల గూర్చియు, తదితరవిషయములగూర్చియు ప్రకటించు వృత్తాంతపత్రికల విద్యాధికులు చదివి, వాని సారాం శము విద్యాహీనులకు బోధించుచుండవలెను. పైన పేర్కొనబడిన విషయములేగాక తదితరసమస్తదేశోప యోగకరవిషయములనుగూర్చి విచారించి, ఆచరణలో బెట్టుటకు తగిన గ్రామసంఘము లేర్పరుపవలెను ఈ కార్యము లన్నియు నెరవేర్చుటయే గ్రామపునర్నిర్మాణ మొనర్చుటయగును.

ఈగ్రామపునర్నిర్మాణమునందు స్త్రీపురుషులందరు పూనికతో పనిచేయవలెను భారతాకాశమున దేదీప్య మానజ్యోతిర్మయస్వరూపుండై వెలుంగుచున్న గాంధీమ హాత్ముని సందేశంబువలన మనదేశమున నూతనచైతన్య ముద్భవించి, ఆబాలగోపాలమునకును దేశాభిమానాంకుర ములు మొలకలెత్తుచున్న యీశుభకాలమున దేశాభ్యు దయమునకు పునాదియనదగు గ్రామపునర్నిర్మాణ మొనర్ప నెల్లరు సమకట్టవలెను.

---

# మ ధు క్ష ణ ము

"వి రా గి"

చలువరేయి కవుంగిలి పులకరింపు
మెరు శుభోదయతంత్రి నదించివేసె
ఏ మధురజీవ గీతిపరీమళాల
ఆనెనో వేదనామలినానుభూతి!

నాపిపాసాహృదంతి కాశాపథాల
అంత వర్షించె ఏకరుణార్ద్రమధుర
హాసరేఖికోన్మేష దృగంచలాం
జీరుకాడిన నవ్యసుధారసమ్ము.

ఎన్నడో పేదవడి నీరవించుకొన్న
ఈ విపణ్ణశుష్కగళాన ఈమధుక్ష
ణాన విరిసెను వీణారవాన నేవో
కిన్నరీ దివ్యగాన సంకీర్తనాలు

ఇది యపూర్వమధుక్షణమే మొ-ఇంత
తిమిరభీషణ జలదాల తెర సడల్చి
ఈనవోదయవిశ్వకల్యాణమైన
ఈశరచ్చంద్రికోత్సవ నృత్యమేమి?

---

# భారతదేశపు బీదఱికము

గోరింట సూర్యనారాయణ రాజుగారు, బి. ఏ.

శ్రీకు ఇటాలియను దేశజులు అజ్ఞానావృతులై యున్నపుడు అష్టైశ్వర్యములతో తులతూగుచుండెడి భారతదేశ మీనాడు బీద దినుమాట సామెత యైపోయినది పాశ్చాత్యదేశములలో నాగరికత విజృంభింపసాగినకొలదియును భారతీయులచే తయారయిన విలాసవస్తువులను కొని తమ గృహముల నలంకరించుకొనిన పాశ్చాత్యులచే తయారయిన వస్తువులే ఈనాడు భారతగృహములం దేమూల జూచినను గానవచ్చుచున్నవి పాశ్చాత్యులు పక్వాన్నమున నెట్టిదో యెఱుగని సమయమున మృష్టాన్నములు గుడిచిన భారతీయులలో ననేకు లీనాడు డొక్కనిండ యన్నములేక మలమలమాడ చున్నారు

భారతీయుని సాలీనా ఆదాయము ౧౮౭౫ లో రు ౨౭ అని ఎకిన్సనుగారు వ్రాసియుండిరి ప్రస్తుతము సుమారు రు ౪౭ ఉండు నని వాడియాజోషిగారల లెక్కలు తెలుపుచున్నవి కాని యిండెక్సు నంబర్లనుబట్టి చూడగా ఈ రెంటికిని భేద మంతగా గనబడదు ఈ రోజులలో భారతీయు లైశ్వర్యవంతులై సుఖించుచున్నారనెడి 'రాజభక్తుల' మాట లెవరో అల్పజ్ఞులు నమ్మెదరుగాని అమెరికా దేశీయుని సాలీనా ఆదాయము ౭౫ పౌను లుండగా భారతీయుని యాదాయము దాదాపు ౩ పౌను లని యెఱిగినవా రెవరు నమ్మెదరు?

స్పెయినుదేశము అమెరికాను జయించిన పిదప యూరపు ఖండము రజతమయ మైపోయినది. అమెరికానుండి వచ్చు స్పెయిను దేశజుల వెండితో నిండిన యోడలను కొల్లగొట్టి కొంద రింగ్లీషు ఓడ దొంగలు సూక్ష్మపద్ధతిని వెండి నార్జించిరి. పదునెనిమిదవ శతాబ్దములో ఆస్ట్రేలియా కాలిఫోర్నియాలయందు బంగారుగనులు కనిపెట్టినపిదప ౧౮౫౦–౧౮౭౫ సంవత్సరములలో అంతకు క్రితము మూడున్నర శతాబ్దములపుడు తయారయినంత బంగారును తీయుటచే యూరపు లక్ష్మీమందిరమయ్యెను కాని భారతీయులు సంతుష్టాత్ములై, అన్యజాతి నిర్మూలము గావించియో, యణగద్రొక్కియో పాశ్చాత్యుల వలె ధనార్జనకు గడంగక పోవుటచే యథాపూర్వముగనే యుండిపోయిరి.

భూగోళ పరిస్థితులనుబట్టి చూచ హిందూదేశమున కనేకసదుపాయములు గలవు హిందూదేశము పూర్వార్ధగోళమున మిక్కిలి యనుకూలమగు స్థల మాక్రమించియున్నది పరదేశముల ప్రమేయము లేకనే సుఖజీవనము గడుప నిరుపమానప్రకృతిసంపద హిందూదేశమునకు గలదు కాని వివిధహేతువులచే నివియేవియు రాణించుటలేదు. హిందూదేశమునకుగల ౪,౫౦౦ మైళ్ల సముద్రతీరమందు ౨౩౬ ఓడరేవులున్నను, కలకత్తా, బొంబాయి, మదరాసు, కరాచి, రంగూను పట్టణములే విదేశీయవర్తకములో ౯౮ వ వంతు చేయుటచేత మిగిలినవి నామమాత్రావశిష్టము లైయున్నవి ప్రాచీన హిందూదేశమందు ౬౦ గగులు గలిగినంతటి పెద్దయోడలుకూడ నిర్మింపబడుచుండెడివి. కలకత్తాలో ౧౮౦౦-వ సంవత్సరమున ౧౦౦,౦౦౦ టన్నుల భారతీయనౌకలు గలవు ఈనా డొక్కటియును లేదు ఆంగ్లేయుల ఓడలపై దిగుమతియగు వస్తువులకు తక్కువ దిగుమతిపన్ను విధించుట ఆంగ్లేయనౌకానిర్మాతల కుత్సాహమునకును, భారతీయనౌకానిర్మాణ పరిశ్రమ వినాశమునకును హేతువైనది ప్రస్తుతము హిందూదేశము సాలునకు ౫౦ కోట్ల రూపాయిల ఓడరేవు అన్యదేశీయుల కిచ్చుచున్నది అందు ౭౪% బ్రిటిషువారికి పోవుచున్నది హిందూదేశమునందలి ౯-వ వంతు వ్యవసాయము నైరృతివర్షవాయుక్రమముపై నాధారపడియుండును ఈ వర్షపాతముపైనే కరెన్సీ క్రియలును, తుదకు బడ్జెటును ఆధారపడియుండును భారతీయులలో ౭౩% వ్యవసాయమే వృత్తిగా గలిగియుండగా ఈ దేశమున ౩% లాభము వచ్చు రైల్వేలపై ౬౫౮ కోట్లరూపాయలు ఖర్చయినవి ౮% లాభము వచ్చు ఇర్రిగేషనుకు ౭౮ కోట్లు ఖర్చయినవి. దీనికి తోడు ప్రజలు వ్యవసాయమును సరియైనపద్ధతుల ననుసరించి చేయుట లేదు. హిందూదేశమందలి చెఱకుగానుగులు ౭౦% రసముమాత్రమే తీయగలుగుచుండ, అమెరికాసంయుక్తరాష్ట్రములందు ౯౬% తీయుచున్నవి. ఇట్టి కారణములచేతనే మనదేశమందలి చెఱకుపంటవలని యాదాయము క్యూబాదేశపు ఆదాయములో మూడవవంతును, జావాలో నాల్గవవంతును, హవాయిలో నయిదవవంతును మాత్రమే



డా॥ యం. దామోదరంగారు
ఎం. ఏ., పి. యస్. సి.



రెడ్డి లక్ష్మమ్మగారు



దామరాజు లక్ష్మమ్మగారు
(పశ్చిమగోదావరి జిల్లాబోర్డు సభ్యురాలు)



చందన పద్మావతీబాయిగారు
(కడప జిల్లాబోర్డు సభ్యురాలు)



ఆంధ్రభీష్మ
న్యాపతి సుబ్బారావు పంతులుగారు



మల్లాది అనంతరామయ్యగారు




తేకుమళ్ల రామారావుగారు,
యం ఏ., బి. ఇ. డి.



కీ. శే. జాన్ గాల్స్వర్దీగారు



పూర్వపు అమెరికా అధ్యక్షులు
కీ. శే. కూలిడ్జిగారు.



కీ. శే. ఆరోగ్యస్వామి మొదలియారుగారు

అయియున్నది భారతదేశమున వ్యవసాయదారులపై కరభార మత్యధికము. మొన్నటివఱకును సాలునకు రు ౨౦౦౦ ల వఱకు ఆదాయము వచ్చు వర్తకుడు పన్ను చెల్లించ నక్కరలేకయుండగా రు ౩౫ లు ఆదాయము వచ్చు కృషీవలుడు నీటిపన్ను రు ౫ లు గాక పైగా రు ౩ లు చెల్లించవలసియుండెను ఇవి గాక ఆంధ్ర దేశమున రూపాయికి మూడణా లింకను పన్ను హెచ్చింపబడెను హిందూదేశమందు మృగసంపత్తియును మిక్కుటముగా నుండెడిది సంగ్రామముల కుపకరించెడి యశ్వరత్నము మంతగా లేదు కాని పూర్వ మీదేశము ప్రపంచమునకు గోశాల యన నొప్పెడిది కాని, మహమ్మదీయులును, పాశ్చాత్యులును మన గోమాంసమును రుచిమఱ గుటయు, పాశ్చాత్యులు డబ్బాపాలను మనకు రుచిమాపుటయు తటస్థించినతర్వాత గోరక్షణకూడ హిందూదేశమున నంతరించినది. నానావిధ ఖనిజములును హిందూదేశమున దొరకును దొరకిన నేమిలాభము? నిక్షేపఖనన మున్నదనినమాటయే కాని, భారతీయు లకు గనులపై నల్పమగు మక్తామాత్రమును, విశేషలాభము విదేశీయు లకును పోవుచున్నది లోహమిశ్రిత మగు మంటినే విదేశములకు గొంపోయి అక్కడ శుద్ధిచేయుటచేత పెక్కులోహముల యుప యోగమే భారతీయులు మఱచుచున్నారు

భారతదేశమున స్వతంత్రపరిపాలనము లేకుండుటచే, దినుసు లను మించి ఎగుమతులుండెడి దేశము నానాటికి భాగ్యవంతమైన దగు ననెడి సామాన్యసూత్ర మీదేశమునకు వర్తించదు మొగలులు పాలించెడి కాలములో ధన మెన్నడును భారతదేశపు సరిహద్దులను దాటి పోయెడిది కాదు కాని యిపుడు ఇండియామంత్రికి సాలునకు సుమారు ౩౫ మిలియనుల పౌనులు పంపవలెను వైస్రాయిగారికి సాలునకు ౨౫ లక్ష రూపాయిలును, ప్రతి కలెక్టరునకును ౨౦ వేల రూపాయిలును, ప్రతి తెల్లవానికిని భారతీయునికంటె కొన్నిరెట్లును వేతనము లుండుటచేత ఇంను చాలభాగము సీమ చేరుచున్నది. ఇక పాశ్చాత్యుల కీదేశమం దుండు పక్వపదార్థముల జేయు మిల్లులు, బ్యాంకులు, భీమాకంపెనీలు, యానకర్మలు మితిలేని లాభ మొసంగు చున్నవి వీని లాభముకూడ విదేశములకు పోవుచున్నది

జాతీయజీవనమునకు విద్య వెన్నెముకవంటిదై,— జాతీయాభ్యు దయమునకు విద్యావశ్యకతను గుఱించివ్రాయుట అప్రస్తుతము ఆ విద్యకై మన ప్రభుత్వము ౮% ఆదాయములోపుగా ఖర్చు చేయు చున్నది హిందూదేశమున బ్రిటిషురాజ్యాధికారులు విద్యావిషయమై ప్రప్రథమమున అప్రమేయులై యుండి రనియు, తరువాత తీవ్ర ప్రతికూలురై చాలవఱకు జయముగాంచి రనియు, తుదకు ప్రపంచ మందరి చేతను నిరసింపబడిన ప్రస్తుత విద్యావిధాన మవలంబించి రనియు హావెలుగారు వ్రాసిరి నిర్బంధప్రాథమికవిద్య మనదేశమునకు అత్యవసరము. దీనికై గోఖలే పడరానిపాట్లు పడెను గాని నిష్ఫలు డయ్యెను ప్రభుత్వమువారు మన విద్యాపిపాస దీర్పకున్నను, భారతదేశమందలి పాశ్చాత్య విద్యార్థులకుమాత్రము లోటు చేయుట లేదు భారతదేశమున సగటున విద్యార్థికి ౧౨ అణాలు ఖర్చగు చుండ, భారతదేశమందలి పాశ్చాత్య విద్యార్థికి రు ౨౨౧ లు ఖర్చగు చున్నవి ప్రాచీనకాలమునుండి సంప్రదాయసిద్ధముగ వచ్చుచుండు జ్ఞానము నశింపనీయక, నూతనజ్ఞానమును సంపాదించుటలో ప్రజలకు తోడ్పడు సాధనము విద్య "హిందూ దేశమందలి బ్రిటిషురాజ్య యంత్రమును నడపించుట కవసరమగు నౌకర్లను తయారుజేయుటకు గాను ఫోర్టువిలియంకాలేజీని స్థాపించవలె" నని మార్క్వెస్ ఆఫ్ వెల్లస్లీ గారనుటలో ఈకాలపు ఆంగ్లవిద్యావిధాన మెందుకు కల్పింపబడెనో సువ్యక్తము కాగలదు

ప్రకృతిపై నాధారపడినదియు, ఒకేవోట చేయరానిదియు, తీవ్రపురుషకార మపేక్షింపనిదియు, భిన్నకర్మకు తావీయనదియు నగు వ్యవసాయముపై భారతీయు లాధారపడి యుండిరి గాని, దీనికంటె అనేక-రెట్లు లాభదాయకములగు పెక్కుపరిశ్రమలకు పాల్గొనరైరి ఆధు నికప్రపంచమందు పక్వకర్మ లెక్కువగాగల దేశమే భాగ్యవంతమైన దగును ఇండియాయందు ఇంగ్లాండు మొదలగు దేశముల పరిశ్రమల కుపకరించు ముడిపదార్థములమాత్రమే తయారుజేయ సహాయ మొసంగబడినది పరిశ్రమల విషయమై బ్రిటిషుప్రభుత్వము అప్ర మత్తతతో నుండుట సరిగదా, చాలవఱకు వినాశహేతువుకూడ నైనదని చెప్పక తప్పదు ప్రపంచయుద్ధమునకు పూర్వము భారతీయుల పెట్టుబడికంటె విదేశీయుల పెట్టుబడి మూడురెట్లుండెడిది దేశమున కిట్టి దురవస్థ సంభవింప కుండుటకు జపానునందు విదేశీయులు భూస్వాములుగా నుండుటకు గాని, నిక్షేపఖననమందు సదుపాయములు పొందుటకుగాని తావీయని శాసనము గలదు ఇండియాలో పక్వకర్మాభివృద్ధికి తోడ్పడని హేతువు లింకను అనేకములు గలవు ఇంగ్లాండునందు యంత్ర నిర్మాణమున కయ్యెడి ఖర్చుకంటె మనదేశమున మూడురెట్లగును అన్యదేశములందువలె రైల్వేలు జాతీయకర్మల కుత్సాహము గలిగించుట లేదు నిస్సారమగు బొగ్గు, ప్రియమైన పెట్టుబడి, అశాస్త్రీయమైన కార్యనిర్వహణము, ఎగుమతి, ఎక్సైజు పన్నులు ఇవన్నియు భారత పక్వకర్మలకు నిరుత్సాహకరము లగుచున్నవి

నవీనపద్ధతుల ననుసరించి అపారమూలధన ముండినగాని పక్వ కర్మలు ప్రబలజాలవు భారతీయులు తమ భార్యలమెడలనే బ్యాంకు లుగా పరిగణింతురుగాని బ్యాంకులందు నిలువజేయుట యికను నేర్చు కొనలేదు అందుచే హిందూదేశమున వడ్డీరేటు ౯% కు పైగా ఉండు టయును, ఇంగ్లాండునందు ౨% ఉండుటయును గలదు. తణఖా ఆస్తులపై ౧౫% కు మించియు, అన్యఋణములకు ౬౦% మించియు

వడ్డీ తీసికొనగూడ దనెడి కౌటిల్యుని అర్థశాస్త్రము జూచినచో హిందూదేశమందు పూర్వము సహితము వడ్డీ యెక్కువయని తెలియు చున్నది ఇక బహువిధ 'నావులను' గుఱించి చెప్పనక్కరయే లేదు కాలక్రమమున సిమ్లా, పెకావ్, ఆగ్రా మొదలగు బ్యాంకులు స్థాపింప బడినవిగాని పరస్పరవైషమ్యముచే నంతరించినవి భారతీయు లజ్ఞాను లును, అన్యాయపరులును ఔటచేత బ్యాంకు లంతరించినవని పాశ్చాత్యులు నిందారోపణ చేసిరిగాని, పాశ్చాత్యులచే స్థాపింపబడిన బ్యాంకులు గతశతాబ్దములో ౩౦ వఱకును అంతమొందిన వనియును, చిన్న సంస్థయయ్యు, ప్రజల నాకర్షించుటకు బర్మా బ్యాంకనెడి పేరుతో పాశ్చాత్యులచేత స్థాపింపబడిన బ్యాంకుకు ధనము చేరగానే బ్యాంకు మేనేజరులు బర్మానుండి ధనముతో నదృశ్యులైరనియు మాలవ్యా సమాధానమిచ్చెను హిందూదేశమందు రిజర్వుబ్యాంకు స్థాపించినగాని బ్యాంకు పరిస్థితులు చక్కబడనేరవు కార్మికబ్యాంకు లీదేశమున లేనేలేవు ఇండియాలో పెద్దదియగు ఇంపీరియల్ బ్యాంకు ఆరునెలలకు మించి ఋణ్పేయుటకు నిషేధింపబడినది వర్తకుని నీతిపై యాధారపడి తన పెట్టుబడులలో ౭౫% వెస్టు మినిష్టరు బ్యాంకు ఇచ్చుచుండగా, ఇండియాలో అట్టి పెట్టుబడులు ౧% గూడ లేవు మన దేశమందు సుమారు ౧౫ మారకపు బ్యాంకులు గలవు ఇవన్నియును అన్యదేశజులవే అందెనిమిదిమాత్ర మాంగ్లేయులవి ఇవి చిట్టాఆవర్జాలను ప్రకటింప నక్కరలేదు మన ౬౦౦ కోట్ల రూపాయల విదేశీయ వర్తకమును వీరిచేతిమీదుగనే జరుగుటచేత లాభమంతయు అన్యదేశములకు పోవుచున్నది ఇదియునుగాక ఓడసరకులను విదేశీయ భీమాకంపెనీయందే భీమాచేయుట కివి బలవంతపెట్టు చున్నవి ప్రభుత్వపు మారకపు బ్యాంకును స్థాపించి, విదేశీయ మారకపు బ్యాంకులు ప్రభుత్వ శాసనములకు బద్ధులై యుండునట్లు చేసినగాని యీదుర్గతి నశింపదు హిందూదేశమందు వ్యాపారము చేయు వారలకు బ్యాంకుల నిర్వహణముతో సంబంధములేదు విదేశీయులగు బ్యాంకు నిర్వహణాధికారులకు హైందవ వ్యాపారాభ్యుదయము వాంఛించునంతటి యభిమాన ముండుననుట అసహజము.

జాతీయపరిశ్రమాభివృద్ధికి ఎగుమతి దిగుమతి పన్ను లవసరము. తొలుత బ్రిటిషువారిని కాని విదేశవస్తువులపై అధికముగా సుంకము విధింపబడెడిది రైల్వేసామానులపై పన్ను విధింపకుండుటచేత విదేశపురైల్వేకంపెనీలకు మిక్కిలి లాభము ప్రాప్తించినది సురేకారముపై ఎగుమతి పన్ను విధించియుండుటచే ఆపరిశ్రమ యింకను పూటుకొనలేదు. పందొమ్మిదవ శతాబ్దానంతర ప్రాంతమున హిందూ దేశమందు తయారగు ౨౦-వ నంబరును, దానికి మించినట్టియు నూలునకు ౫% ఎక్సైజుపన్ను విధించుటచేత ఘోరాందోళనము జరుగ, ఆర్థిక మంత్రి యగు సర్ జేమ్సు వెస్ట్లెండుగారు ఈ పన్ను హోముగవర్న మెంటువారి ఆర్డరులచే విధింపబడె నని స్పష్టముగా తెలిపిరి. తరువాత దేశీయ విదేశీయములగు నూలులపైమాత్రము పన్ను లేకుండజేయుటచే నది బొంబాయియందు తలలెత్తుచున్న మిల్లుల బడద్రోయు పన్నాగమని పెక్కురు పరితపించిరి ఇట్టి కుకర్మలచేతనే ఢక్కామజిలీనులకు ప్రపంచప్రఖ్యాతిపడసిన భారతీయులు కాపెనమునకు సహితము అన్యదేశములపై ఆధారపడెడు స్థితికి వచ్చిరి బ్రిటిషు సామ్రాజ్యమునందు తయారగు వస్తువులకు డొమినియనులు ప్రత్యేక సదుపాయము (ఇంపీరియల్ ప్రిఫరెన్సు) చూపుట శ్రేయోదాయకమని కొందరి మతము హిందూదేశమునకు రక్షణ కావలసినచో సామ్రాజ్యపుసరకులనుండియే రక్షణ కావలయును. అందుచేతనే కర్జనుప్రభువు గవర్నమెంటు "ఇండియా బ్రిటిషు వస్తువులకు ఇంపీరియల్ ప్రిఫరెన్సు చూపనేర"దనెను "తనపై భారము వేసికొనదలచినచో ఇండియా ఇంగ్లాండుకు ఇంపీరియల్ ప్రిఫరెన్సు చూపవచ్చునని" ఫిస్కల్ కమిటీ యనెను ౧౯౩౦ వ సంవత్సరములో నిది పనికిరాదని జాతీయవాదులెల్లరును ఆందోళనము చేసిరి కాని వారి ప్రయత్న మరణ్యరోదన మయ్యెను

కరెన్సీ విధానము కూడ జాతీయాభ్యుదయమునకు తోడ్పడు వానిలో నొకటి హార్షలుకమిటీ ౧౯౧౩-వ సంవత్సరములో టంకసాలలను మూయుటచే భారతీయులకు ౧౫౦ కోట్ల రూపాయలు నష్టము వచ్చెనని సర్ డేవిడ్ యూలుగా రంచనావేసిరి తరువాత గోల్డు ఎక్స్చేంజి స్టాండర్డు, గోల్డు స్టాండర్డు రిజర్వులు స్థాపింపబడినవి గోల్డు ఎక్స్ఛేంజి స్టాండర్డు జాతీయప్రభుత్వమునకు లాభదాయకమేకాని కృత్రిమస్వభావము గలిగిన విదేశప్రభుత్వమున కింకను లాభదాయకము గోల్డు స్టాండర్డు రిజర్వుయొక్క అర్థము సరిగా తెలిసికొనక ఇండియామంత్రి దానిని దుర్వినియోగము చేసెను తదుపరి రూపాయిని రెండు షిల్లింగుల బంగారుతో జతకలుపగా హిందూదేశమం దాదాయ మడుగంటసాగినది భారతధనము పాశ్చాత్యుల యోపెలలోనికి కరుగసాగినది దీనిమూలమున గోల్డు స్టాండర్డు రిజర్వుకే ౫౫ మిలియనుల పౌనులు నష్టమువచ్చెను ప్రపంచ యుద్ధానంతరమున ప్రతిదేశమును యుద్ధమునకు పూర్వపు రేటుకై ప్రయత్నించగా, ఇండియాలో రూపాయిని ౧ షిల్లింగు ౬ పెన్సులతో జతపఱచిరి ౧ షిల్లింగు ౮ పెన్సుల రేటుకంటె హెచ్చురేటుకు ఇండియా ప్రభుత్వము కాంక్షించుచున్నట్లు ౧౯౨౪-వ సంవత్సరమున అక్టోబరు పదవ తేదీని ఇండియామంత్రికి పంపిన తంతివార్త వలన తెలియుచున్నది. ఈ మార్పు భారతీయుల కుండెడి ౪౦౦ కోట్ల రూపాయల ఋణముపై ౧౨½% భారమధికము చేయుటకును, ఇండియానుండి ఎగుమతులు తక్కువగుటకును, దిగుమతులు వృద్ధిచెందుటకును చాలవఱకు తోడ్పడెను అనగా భారతీయుల కాదాయము క్షీణించుటకును, ఉన్నసొమ్ము విదేశీయులు గొంపోవుటకును

తోడ్పడెను ఈ మధ్య అస్సెంబ్లీతో నాలోచింపకయే రూపాయిని స్టెర్లింగుతో జతపర్చుటచేత బ్రిటిషువస్తువులు ఇంపీరియల్ ప్రిఫరెన్సు ఇచ్చినవాటి విధముగ నమ్ముడగుటకు అవకాశము గలిగినది. టంకసాల లేకపోవుటచే మనదేశమందు తయారగు మూడుమిలియనుల పౌనుల విలువగల బంగార మేశ్రేట యింగ్లాండునకు పోవుచున్నది ధర హెచ్చుగుటచే విక్రయింపబడిన బంగారము మనదేశమునుండి పోవుచుండగా అర్థశాస్త్రజ్ఞు లందఱును విచారించుచుండ, ఇంతకు క్రితము సంపాదింపబడినదే యీబంగార మగుటచే విచారించ నవసరములేదని వెల్లింగ్టను ప్రభువుగా రూరడించిరి

భారతదేశమందలి గ్రామవాసులకు కడుపునిండ కూడు, మొల నిండ గుడ్డ లేకయున్నను, సైన్యమునకై పాలునకు సుమారు ౫౬ కోట్ల రూపాయలు మొత్తము ఆదాయములో దాదాపు మూడవవంతు వ్యయమగుచున్నది ఈమిలిటరీ వ్యయముపై అసెంబ్లీక కూడ వోటు చేయుట కధికారములేదు మిలిటరీ వ్యయము ఇండియాకు ౫౦ కోట్ల రూపాయిలున్నను అధికమే యగునని ఇంచికేపు కమిటీ సలహానొసంగెను సిపాయిల తిరుగుబాటునకు పూర్వము ఏడుగురి సైనికులలో నొక్కయూరోపియను సైనికు డుండెడివాడు తదనంతరము ముగ్గురిలో నొక డుండున ట్లేర్పాటు చేయబడెను భారతసైనికోద్యోగి కంటె బ్రిటిషు సైనికోద్యోగి కాఱురెట్లు ఖర్చగును గాన మిలిటరీ ఖర్చు పెరిగిపోయినది ఇండియాసేనలను బ్రిటిషు సేనలతో కలుపుటచేతను, బ్రిటిషు సైనికోద్యోగులు మనకు పనిచేయునెపమున మన ఖర్చులపై విద్య నభ్యసించుటచేతను, హిందూదేశమున కిసుమంతయు సంబంధములేని యుద్ధములు ఆఫ్గనుస్థానము, చైనా, అబిసీనియా, పెరకు, ఈజిప్టు, పర్షియా, బర్మాదేశములందు ఇండియాసేనలు చేయుటచేతను మితిలేని ప్రభుత్వధనము వ్యయపడిపోయినది ప్రపంచ యుద్ధముతో ప్రమేయములేని మన భారతదేశమున కాసమయమున ౧౩౮ కోట్ల రూపాయలు ఖర్చయ్యెను ౧౦౦ మిలియనుల పౌనులు ఇంగ్లాండునకు యుద్ధ విరాళముగా నొసంగబడెను ప్రభుత్వధనము ప్రజాసౌకర్యములకై వినియోగించె*, యుద్ధభీతిలేని దేశమందలి ప్రజలు ధన్యులు

హిందూదేశమందలి సాంఘిక మతాచారములందు సుగుణములతో బాటు దుర్గుణములుకూడ గలవు సమిష్టికుటుంబము లీదేశమున నుండుటచే ముసలితనపు పింఛనులును, అనాథశరణాలయములును అవసరములేకున్నను ప్రతివ్యక్తియు తన శక్తియంతయు ధారపోసి పని చేయుట కుత్సాహము పొందుటలేదు తండ్రియాస్తిని పుత్రులందఱును సమానముగా విభజించుకొనుటచే, ప్రజలెప్పుడును మంటినిగరచుకొనియుండుటయు, ఎక్కువ పెట్టుబడితో వస్తువ్యుత్పత్తి చేయుటకు వీలులేక పోవుటయు, ప్రజలు నానాటికి బీదవారగుటయు కలుగుచున్నది కాని యింగ్లాండునందు జ్యేష్ఠ పుత్రునికే తండ్రియాస్తి సంక్రమించుటచే మిగిలిన పుత్రులలో కొంద ఱుద్యోగులో, వర్తకులో యగుచున్నారు మఱికొందఱు వలసపోవుచున్నారు అధినివేశరాజ్యనిర్మాణము చేయుచున్నారు నియుక్తకర్మలుగల జాతు లుండుటచేత ఇండియాలో పోటీమీద వస్తువ్యుత్పత్తి చేయుటయు, పురుషకారమందు గౌరవమును లేవు భారతీయ స్త్రీల నన్యదేశస్త్రీలవలె కర్మకరులుగా బరిగణింప వీలులేదు వివాహములకనియు, ఉత్తరక్రియలకనియు విశేషధనవ్యయముచేసి భారతీయులు ఋణగ్రస్తులగుచున్నారు ఐహికసుఖాపేక్ష వీడి యాముష్మిక సుఖమును కాంక్షించుమనెడి హిందూ ధర్మావలంబకులగు భారతీయు లనేకులు ధనార్జనకు విముఖులై యున్నారు

సగటున భారతీయుని జీవనము సుమా రిరువదిరెండేండ్లు ఇంగ్లాండులో ౧౦౦౦ కి ౨౭ గురు చొప్పునను, ఇండియాలో ౩౯ మంది చొప్పునను జనన మందుచున్నారు ఇట్లు ప్రజాభివృద్ధి యగుచున్నదేకాని వస్తువ్యుత్పత్తికి వలసినశక్తి వృద్ధినొందమిచే ఇండియా నానాటికి బీదదగుచున్నది కావున వస్తువ్యుత్పత్తికి శక్తిని వృద్ధిపఱచుటయు, సంతాన నిరోధమును అవసరము నిపుణులైన కర్మకరు లుండిననేకాని వస్తువ్యుత్పత్తి వృద్ధినొందజాలదు రైలుమార్గమువేయు ఇంగ్లీషుకూలీలకు ఇండియాకూలీల కిచ్చెడి యణాలన్ని షిల్లింగుల నిచ్చెదరు అయినను మైలేజీ ఒకటియే యగుచున్నది ఇండియాపనివాడు ½ టన్ను బొగ్గును త్రవ్వెడి కాలములో ఆంగ్లేయుడు ౨½ టన్నులును, అమెరికా దేశీయుడు ౫ టన్నులును త్రవ్వగలుగుచున్నాడు దీనివలన హైందవ కర్మకరులకు వృత్తి విద్యయు, యంత్రసహాయమును అవసరమని స్పష్టపడుచున్నది.

పూర్వము సాంఘిక మతవిషయ సందర్భములలో మాత్రము భారతీయులు త్రాగెడివారు. కాని, పాశ్చాత్యసంపర్కము కలిగిన తర్వాత త్రాగుడువస్తువు లనేకముల నుత్పత్తిజేసి, ప్రతిపట్టణమందును, కొన్నికొన్ని పల్లెల కొకచోటను దుకాణము లుంచి ప్రతిదిన మమ్ముచుండుట కేర్పాట్లు చేయుటచే మునుపటికంటె త్రాగుడు వృద్ధిజెందినది ఈ త్రాగుడు ఖరీదు క్రమక్రమమున సంసారముల కూల్చునంతటి యెక్కువగామాత్రమే యున్నది కాని, త్రాగుబోతుల దరిజేరనీయనంతటి యెక్కువగా లేదు దీనిని నిషేధించుటకై ప్రభుత్వమువారు ప్రబల ప్రయత్నము చేయనైనను చేయవలెను; చేయువారి కుత్సాహమైనను కలుగజేయవలెను కల్లు త్రాగగూడదనెడు 'కాంగ్రెసువారుల' లో కాఫీ త్రాగనివా రుండరు గంజిలోని కుప్పు కొదువగానుండు భారతదేశమందు కాఫీదుకాణములలో కోట్లకొలది రూపాయలు ఖర్చగుచున్నవి కల్లుదుకాణము నిషేధింపబడినపుడు కాఫీదుకాణ మేల నిషేధింపబడగూడదు?

భారతదేశము పాశ్చాత్యదేశములతో సమముగ భాగ్యవంతముగ నుండ జాలు భాగ్యము లభింపదని ఖిన్నహృదయు లగు భారతీయు లనేకులు గలరు. యుద్ధసామగ్రులు చేయుటయందు నిమగ్నులగు పాశ్చాత్యులు మఱల ప్రపంచయుద్ధమువంటి ఘోరయుద్ధము నాచరించి, రుధిరప్రవాహముల గొట్టుకొనిపోవరనుట కుత్తరవాదు లెవరు? పాశ్చాత్యదేశములు పరస్పర వైషమ్యముచేత క్రూరమృగములవలె నిరంతరము బుసకొట్టుచుండ వాటికి శాంతి సుఖములెక్కడివి? భారతదేశము బాహ్యసంపదయందు బీదదైనను ఆత్మశక్తియం దగ్రగణ్యము. భారతదేశము పాశ్చాత్యదేశములవలె యంత్రశాలలే పరమావధిగా దలంచక అసహాయు లగు అన్యదేశజలపైబడి యర్థార్జనకు గడంగక, అఖిల మానవసోదరత్వమును గ్రహించి ఆత్మశక్తియందలి విశ్వాసమును వీడక, అఖిలప్రపంచమున కాదర్శప్రాయమై యలరుచుండుగాక!

# "సుదాసు"ని హృదయవేదన

'ఒకరు'

౧

ఎందఱు దరిద్రజనులు నా కెదురుపడుదు
రెపుడు బయటికివచ్చిన నెల్లయెడల
నీశ్వరుఁడు నాకు నిచ్చిన యిన్నిసిరుల
కేది బదులుగనే వీరి కీయఁదగును?

అసలు వీరలకన్న నాకర్హతయును
లేదు, దయచేసినాఁ డట్లు లేకయున్న
నీశ్వరుఁడు వీరికంటెను హెచ్చుసిరులు
నాకు, దుర్గ్రాహ్య మీశ్వరన్యాయపక్షి!

ఎందఱో వారు తిండిలే కేడ్చుచుండి
రెందఱో వీర లింటింటి కేఁగుచుండి
దేవురించుచునున్నారు తిండికొఱకు
నాకుఁ దినలేనియంత యున్నయది తిండి.

ఎందఱున్నారు తలదాల్పనేని యింత
చోటులేని యభాగ్యు లీక్షోణిపయిని
నాకుఁ గనుమేరవఱకు నున్నయవి యిండ్లు
పట్టుపఱుపులుగలవు నేఁ బండుకొనఁగ.

అగునో స్వోద్దేశములు నాకు నమితములుగ
నీశ్వరుఁడు దయచేసిన యిన్నిసిరులు?
సరి, భజింతునుగాక నే సతత మతని
నుడుగ కాతని సేవసేయుదునుగాక!

౨

పగలెల్లశ్రమపడి తగ గడించిన కూలి
బాలుర తిండికేఁ జాలకుండ
నెవ్వరో దయతోడ నిచ్చిన ప్రాఁజీర
పెండ్లాము సిగ్గు నొప్పించుచుండ
నంధులు పంగులు నైన యభాగ్యుల
పరిదేవనము వినఁబడుచునుండ
నాఁకటిపెల్లున నంగంబులును దూలి
వారని దుఃఖంబు వచ్చుచుండఁ
జేయునది లేక యొకట మూర్ఛిల్లియుండు
నాదరిద్రునకన్న వేఱైనవాఁడు
కలఁడె? యీశ్వరుఁ డాతని తలఁపు లెఱిఁ
తృప్తుఁగాఁ జేసి ఋణము దీర్చికొనరాదె?

# గుహుఁడు

కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రి గారు

వాల్మీకిమహర్షి శ్రీమద్రామాయణమున “తత్ర రాజా గుహో నామ రామ స్యాత్మసమ స్సఖా, నిషాదజాత్యో బలవాన్ స్థపతిశ్చేతి విశ్రుతః” అని శృంగబేరపురాధీశుఁడును, నిషాదజాత్యుఁడును నగు గుహుని శ్రీరామునకుఁ బ్రాణమిత్రునిగా వర్ణించియున్నాఁడు.

శ్రీమద్రామాయణమును బట్టిచూడ నీ కోయ ఱేఁడు త్యాగశీలుఁడుగాను, కరుణార్ద్రహృదయుఁడుగాను, వీరాగ్రేసరుఁడుగాను, భక్తవరుఁడుగాను, సన్మిత్రుఁడుగాను, శిల్పకళానిపుణుఁడుగాను, విద్వాంసుఁడుగాను భాసిల్లుచున్నవాఁడు. ఎట్లన—

శ్రీరాముఁడు కోసలరాజ్యసంపదను బరిత్యజించి కానల కేఁగుచున్నాఁడని తెలిసికొని వినయ, భయ, భక్తులతో “తమార్తంసంపరిష్వజ్య గుహో రాఘవమబ్రవీత్, యథాఽయోధ్యా తథేయం తే రామ కింకరవాణి తే, స్వాగతం తే మహాబాహో తవేయ మఖిలా మహీ, వయంప్రేష్యా భవాన్భర్తా సాధురాజ్యం ప్రశాధి నః” అని శ్రీరామునిఁ గౌఁగలించుకొని కుశలమడిగి, తన నిషాదరాజ్యమును స్వీకరించి తన్నుఁగృతార్థునిగాఁ జేయుఁడని ప్రార్థించుటనుజూడ యీ గుహుఁ డెంతటి త్యాగశీలుఁడో విదితమగును.

సీతారాములు గంగయొడ్డున నింగుదీపాదపము క్రింద నిదురించునపుడు కంటిపై రెప్పపడకుండ ధనుర్ధారియై సీతారాములఁ గాచుచున్న లక్ష్మణుని జూచి “గుహస్సంతాప సంతప్తో రాఘవం వాక్యమబ్రవీత్, ఇయం తాత సుఖా శయ్యా త్వదర్థ ముపకల్పితా, ప్రత్యాశ్వసిహి సాధ్వస్యాం రాజపుత్త్ర యథాసుఖం, ఉచితోఽయం జనస్సర్వః క్లేశానాం త్వం సుఖోచితః.” అని గుహుఁడు పలికినవినయోక్తుల నాలింప నాతని సౌహార్దము వ్యక్తము కాఁ గలదు.

గుహుఁడు లక్ష్మణునితో “నహి మే విదితం కించిద్వనేఽస్మిం శ్చరతస్సదా, చతురంగంహ్యపిబలం సుమహత్ప్రసహేమహి” అని “పగతురు చతురంగబలములతో మీపైకి దాడివచ్చినను నేను నాపరివారముతో వారిని బాఱఁదోలఁ గలను.” అని తెలుపుటచేతను, వాల్మీకి గుహునకు ‘బలవాన్’ అని విశేషణ ముపయోగించుటచేతను ఇతఁడు వీరాగ్రేసరుఁడని తెలియనగును.

గుహుఁడు లక్ష్మణునితో “నహి రామాత్ప్రియతమో మమాస్తి భువికశ్చన, బ్రవీమ్యేతదహం సత్యం సత్యేనైవచ తేశపే, అస్యప్రసాదా దాశంసే లోకేఽస్మి న్సుమహద్యశః, ధర్మావాప్తించ విపులా మర్థావాప్తించ కేవలాం.” అని తెలిపినపద్యముల భావమునుబట్టిచూడ గుహుఁడు శ్రీరామభక్తవరుఁడని స్ఫుటమగుచున్నది.

శ్రీరాముఁడు రావణవిజయానంతర మయోధ్యకేఁగుచు భరద్వాజాశ్రమమున దిగి, భరతునికడ కాంజనేయుని బంపనెంచి “శృంగబేర పురం గత్వా గుహం గహన

గోచరమ్, నిషాదాధిపతిం బ్రూహి కుశలం వచనా న్మమ శ్రుత్వాతు మాం కుశలిన మరోగం విగతజ్వరమ్, భవిష్యతి గుహః ప్రీత స్సమ మాత్మసమ స్సఖా" అని గుహునితోఁ దన విజయవార్తను దెల్పి, పిమ్మట నందిగ్రామమునకు వెళ లుమని ఆంజనేయుని నాజ్ఞాపించెను. జనకాద్యాప్తబంధువుల కెవ్వరికిని తనరాక నెఱింగింపక యొక్క గుహునికిమాత్రము తెలుపుమనుటచే గుహుఁడు శ్రీరామున కెంతటి ప్రాణసఖుఁడో బోధపడును

వాల్మీకి "గుహుఁడు స్థపతియని ప్రసిద్ధికెక్కినవాఁ" డని తెల్పియున్నాఁడు. స్థపతియనఁగా శిల్పి. దీనింబట్టిచూడ గుహుఁడు శిల్పకళాకోవిదుఁడని విశదమగుచున్నది. మఱియు గుహుని పురమునకు 'శృంగబేర' మని పేరు. మృతములైన శృంగములు కల మృగముల దేహములను బాగుచేసి చక్కఁగాఁగుట్టి, వానిని జీవించియున్న మృగములట్లు నిర్మాణము చేయ నేర్పరు లీపురమున నుండుటచే దీనికీపేరువచ్చినది. అట్టిపురమున కీతఁడు రాజగుటచేఁ గృత్రిమమృగనిర్మాణనిపుణుఁడనికూడ తలంపనగును. గుహుఁడు భరతాదులు గంగనుదాఁటుటకు సిద్ధముచేసిన నావల వర్ణనమునుబట్టి చూడ నీతఁడు నౌకానిర్మాణమునఁగూడ మిన్నయని యూహింపనగును.

కిష్కింధాకాండమున నాంజనేయుని సంభాషణము వలన నాతఁడు విద్యాధికుఁడని తెలిసికొనునట్లు గుహుఁడు శ్రీరామలక్ష్మణులతో చేసిన ప్రసంగమువలనను, భరతునితో "కచ్చిన్నదుష్టో వ్రజసి రామస్యా క్లిష్టకర్మణః, ఇయం తే మహతీ సేనా శంకాం జనయతీవ మే." అనియు ధన్య స్త్వం నత్వయా తుల్యం పశ్యామి జగతీతలే, అయత్నా దాగతం రాజ్యం య స్త్వం త్యక్తుమిహేచ్ఛసి, శాశ్వతీఖలు తే కీర్తి ర్లోకా ననుచరిష్యతి, య స్త్వం కృచ్ఛ్రగతం రామం ప్రత్యానయితు మిచ్ఛసి." అనియు గుహుఁడు చేసిన సంభాషణమునుబట్టిచూడ నీతఁడు విద్వాంసుఁడని విదితమగును.

మఱియు "క్షాలయామి తవ పాదపంకజే నాథ దారుదృషదోః కిమంతరం, మానుషీకరణరేణు రస్తి తే పాదయో రితి కథా ప్రథీయసీ" అనఁగా శ్రీరాముఁడు గంగానదిని దాఁటుటకు నావయొద్దకు రాఁగా గుహుఁడు శ్రీరాము నిట్లు ప్రార్థించెను: "ఓ ప్రభూత్తమా! ఏలినవారి పాదపద్మములయందుఁ బాషాణాదిఘనపదార్థముల యోషామణులనుగఁజేయు మహిమకల పరాగ మున్నట్లు ప్రసిద్ధ గాథ కలదు. కావున ముందు మీపాదారవిందములఁగడుగ ననుగ్రహింపుఁడు. పిమ్మటఁ బడవనెక్కవచ్చును. రాతిని నాతినిగా మార్చిన మీపాద రేణువుపడవను బడతినిగాఁ జేయుటలో సందేహముండునా? కఠినతమ మగు పాషాణమునే కోమలాంగినిగాఁ జేసిన మీపాదపరాగము కట్టను గుఱ్ఱదానినిగాఁ జేయుట నిస్సందేహము. నాచే మీ పాదారవిందములు క్షాలనముచేయఁబడనిచో నే నీసంసార వాహినిని, తనురు గంగాస్రవంతిని దాఁటుట యసాధ్యమగును. నావ నాతియే యైన నో దమ వనయాత్రయు, నా జీవనయాత్రయుఁగూడ సాగనేరవు." పైనఁదెల్పిన పద్యార్థమునుబట్టిచూడ గుహుఁడు వాక్చాతుర్యము గల వాఁడుగాఁగూడ భాసిల్లుచున్నాఁడు.

ఇట్టి శక్తిసామర్థ్యములు గల గుహునకును శ్రీరామునకును నింతటి ప్రాణమైత్రి యెపుడెట్లు సమకూరెనో తెలియరాకున్నది.

కుచేలుఁడు శ్రీకృష్ణునికివలె గుహుఁడు శ్రీరామునకు సహపాఠి యనుటకుఁ దగు నాధారములేదు. వాల్మీకి మహర్షి యేకారణముననో విద్యాభ్యాసాదివిలసితమగు శ్రీరాముని శైశవము నంతవిపులముగ వర్ణింపక "తేషామపి మనుజవ్యాఘ్రా వైదికాధ్యయనే రతాః, పితృశుశ్రూషణ రతా ధనుర్వేదే చ నిష్ఠితాః" అని యొకపద్యముతో విరమించెను. దానంజేసి గుహుఁడు శ్రీరామునకు సహాధ్యాయియని యూహించుటకు వలనుకాదు. మఱియును గుహుఁడు శ్రీరామునికంటెఁ జాల వృద్ధుఁడు.

శ్రీమద్రామాయణమున "కుశలో దండకారణ్యే వృద్ధో భ్రాతుశ్చ తే సఖా" అని సూతుఁడు భరతునితో గుహుఁడు దండకాటవీమార్గముల నెఱింగినవాఁడని తెల్పు

పుటచే గుహుఁడు శ్రీరామునకు వేఁటలాడు వేళల నరణ్యమున సహాయుఁడై యుండుటచే నిట్టి మైత్రి చేకూరెనని తలంప నవకాశము లేదు. శ్రీరాముఁడు మృగయాది వ్యసనములకుఁజిక్కినవాఁడుగాఁదోఁపఁడు జ్ఞానవాసిష్ఠమున శ్రీరాముఁడు చిన్నతనముననే లోకవృత్తవిరక్తుఁడైనట్లును, వసిష్ఠమహర్షి శ్రీరాముని యింగితము నెఱింగి యాతనికి శ్రీకృష్ణుఁ డర్జునునకువలెఁ దత్త్వముపదేశించినట్లును వర్ణింపఁబడియున్నది. దీనింబట్టిచూడ శ్రీరాముఁడు చిన్నతనమున వేఁట లోనగు వ్యసనములకు వశుఁడైనట్లు తలఁప వీలుకాదు.

మఱియు "న మృగయాభిరతి ర్నదురోదరం నచ శశిప్రతిమాభరణం మధు, త ముదయాయ నవానవ యౌవనా ప్రియతమా యతమాన మపాహరత్." అని రఘువంశమున కాళిదాసుఁడు దశరథుని మానసమును మృగయాదివ్యసనము లెవ్వియు నపహరింపఁజాలవాయెనని వర్ణించియున్నాఁడు అట్టి దిట్టకుఁబుట్టిన శ్రీరామునకు మృగయాదివ్యసనము లుండవని తలంచుటయే సమంజసము.

శబరియను నిషాదాంగన యొకర్తు తాపసులవలన "ఆగమిష్యతి తే రామ స్సుపుణ్య మిద మాశ్రమం, స తే ప్రతిగృహీతవ్య స్సౌమిత్రిసహితోఽతిథిః. తంచదృష్ట్వా పరా ల్లోకా నక్షయ్యాం స్త్వం హి గచ్ఛసి" అని శ్రీరాముని దివ్యమహిమలఁ దెలిసికొనినట్లు గుహుఁ డెవరివలనను బోధింపఁబడియుండలేదు.

శ్రీమద్రామాయణమున జటాయువు దశరథునకు మిత్రుఁడైనట్లుమాత్రము తెలుపఁబడినదికాని, స్నేహకారణము వివరింపఁబడలేదు. ఇతరత్ర దశరథ జటాయువులకు మైత్రి యెట్లు సమకూరెనో తెలుపుగాథ కలదు. అట్లే శ్రీరామగుహుల స్నేహకారణమును వివరించు కథ కానరాదు.

శ్రీరామచరితమును వర్ణించు సంస్కృతాంధ్ర గ్రంథములయందు గుహుఁడు శ్రీరామునకుఁ బ్రాణసఖుఁడనియు, పరమభక్తుఁడనియుఁ దెలుపఁబడినదియే కాని స్నేహకారణము వివరింపఁబడియుండలేదు.

శ్రీమద్రామాయణవ్యాఖ్యాతలును "ఉత్తమకులోద్భవుఁడగు శ్రీరాముఁడు నీచకులజుఁడగు గుహుని స్నేహితునిఁగాఁ జేకొనుట తగునా?" అని శంకించి శ్రీరాముఁడు సౌశీల్యము కలవాఁడగుటను, భక్తవత్సలుఁడగుటను దోషములేదని సమర్థించిరేకాని వీరిరువురకు మైత్రి యెట్లు చేకూరెనో తెలుపరైరి.

కావున శ్రీరామునకును గుహునకును ఇంతటి ప్రాణమైత్రి యెట్లు పొసఁగెనో తెలుపు పూర్వగాథ యేదియేని యున్నదో నద్దాని ప్రసాదింప పెద్దల వేఁడుచున్నాఁడను.

---

# ప్రేమప్రవాసనము

ఓలేటి సీతారామమూర్తిగారు

౧

ఘోరమై నాదుహృదయ ప్రతోళియందు
భయదవేదనాకీలలు ప్రజ్వలించె,
ప్రసవకోమలమైన యీబ్రతుకె యింక
మృత్యువిషవస్తియందు జీర్ణించిపోవు.

౨

నాసుధాజీవితజ్యోతి, నాయనుంగు
ప్రాణసఖిచూపు ప్రేముడి పలుకరింత
సొగయు స్వర్గలీలాప్రేంఖ జోగు నన్ను
ఈకఠోరవిశ్వము కాంచలేకపోయె.

౩

ఎడదక్రొంబూవులో దువాళించిపోవు
ప్రేమరసమెల్ల యామె కందించు నన్ను
కరములంబట్టి లాగె భీకరవిషోగ్ర
దృష్టితో లోక, మేను కంపించి యేడ్వ.

౪

ఒరయికను జాతి నిర్భాగ్యసరణిజూపి
అకట! ప్రేమసంపద ధూళియం దడంగె
లేదులేదు లేశంబేని హృదయమందు
పెక్కణించెడు నిట్టూర్పువేడిదక్క.

౫

ఇటులు ప్రేమప్రవాసనమ్మె యొనర్చి
యరవిడిన నాదు జీవితహాససుమము
గాల్చివైచిన యా లోకఘాతుకునకు
ఏమహాభీలశిక్ష విధింతు దేవ?



నీళ్లుతోడుట    చిత్రకారుడు. కప్పగంతుల విశ్వనాథంగారు.

# మ హా మ ఘ ము



౧. మహామఘ తీర్థము



౨. మహామఘతీర్థము, ఒండలి, పాచి, మెండలగువానినితీసివేసి శుభ్రపరుపబడినది. ఇందు గంగాదినదులు ప్రవేశించియున్నవన్న రూపములలో కొన్ని కానవచ్చుచున్నవి.



౩. కాశీవిశ్వనాథస్వామి ఆలయము



౪. మహామఘ తీర్థము, ౧౯౨౧-వ సంవత్సరమునందు



౫. కుంభేశ్వరస్వామి ఆలయము; పొందామరకొలను



౬. నాగేశ్వరస్వామి ఆలయము



౭. మహామఘదివసమున
కుంభేశ్వరస్వామి తైర్థికులకు దర్శనమిచ్చు మంటపము.



౮. నాగేశ్వరస్వామి ఆలయము: అంతఃప్రాకారము



౯. మహామఘ ప్రవర్షిణి



౧౦. నాగేశ్వరస్వామి ఆలయము: గర్భగృహము



౧౧. శార్ఙ్గపాణి దేవాలయగోపురము



౧౨. కావేరి స్నానఘట్టము



౧౩. నాగేశ్వరస్వామి ఆలయమునందలి
సుబ్రహ్మణ్యస్వామి గర్భగృహము రథాకృతి నున్నది.



౧౪. కావేరితటమున కళాశాల



౧౫. శార్ఙ్గపాణి దేవాలయము, పొందామరకొలను

# విష జంతువులు

వ్యాసనిపుణ, మరకాని పరాత్పరరావుగారు *

## సర్పములు

సర్పములకును, కాళ్లులేని బల్లుల జాతికిని భేదములు కనుగొనుట జాలగష్టము హిందూదేశములోని కొండచిలువలలో తోక ప్రారంభించుచోట కాళ్లమాదిరి మొలకలు గానవచ్చును దీనినిబట్టి యొకప్పుడు పరిణామదశలో వ్యాళమునకు గూడ కాళ్లున్నవని తెలిసికొన గలుగుచున్నాము ఉరగములలో దవడలయొక్క బొమికలు సాగుచటుల నతుకబడి యుండును. కావుననే యివి తమకంటె పెద్ద జంతువులను మ్రింగుటకు వీలగుచున్నది వాని నేత్రములకు కదలగల పై రెప్పలుండవు గాన నవి మనవైపు జూచిన రెప్పవేయక చూపును నిలుపును అందుచే భయమును గలుగజేయును వానికి మెడయుండదు; దేహముకన్న తల వెడల్పుగా నుండును

వీనినాలుక బహు మృదువుగానుండి చివర రెండుగా విభజింపబడియుండును. పిల్లికి మీసము లెట్లుపయోగమో, సర్పములకు ఈ నాలుకయట్లె ఈనాలుకతో చీకటిలో దానిత్రోవ తెలిసికొనగలదు

జంతువర్గములో సరీసృపములయొక్క గమనము చాలయద్భుతమని జంతు శాస్త్రజ్ఞులయొక్క యభిప్రాయము.

విషము లేనిపన్నగములలో పైదవడలో సన్నని రెండువరసల పండ్లుండును. ఇవి వాడిగలిగి వెనుకకు వంగియుండును. ఇటువంటివే యొకేవరుస క్రింది దవడలో నుండును ఈ పండ్లిట్టుల వెనుకకు వంగియున్నవి గనుకనే అది దాని యాహార జంతువును పట్టుకొనిన నది తప్పించుకొనజాలదు దీనిని గుర్తించియేకాబోలు, సర్పము మీదకు వచ్చిన మన బట్టను మీదకు విసరుచో నాపాము బట్ట పట్టుకొనును గాన యీ వంగినపండ్లలో దగుల్కొనును అందుచే నాసర్పము విడిపించుకొనజాల దని మనలో వాడుకగా ననుకొందురు.

విషసర్పములలో విషదంష్ట్రలు గొట్టములవలె నుండును కొన్నిటిలో నీకోరలొకప్రక్క పల్లముగా నుండును మనలో నుమ్మిని తయారుచేయు మాంసగ్రంథు (Salivary glands) లీ విషమును తయారుచేయునవిగా మారియున్నవి. ఇవి కంటికి క్రిందుగాను, వెనుకగాను అమర్పబడి యుండును. నోరు బాగా తెరచి కరువబోయినప్పుడు మాంసపుకండలీమాంసగ్రంథులనునొక్కును గాన విషముకోరలలోనుండి ప్రవహించి కోరదిగిన చోటనుండి యితరజంతువులలోనికి ప్రవహించును

వేడిమి ఎక్కువగ ఉన్న ప్రదేశములలో సర్పము లెక్కువ. వివిధములగు రకములలో యెక్కువసంఖ్యలో హిందూదేశము, మలయా (Malaya) ప్రాంతములు ముఖ్యము బ్రిటిషుదీవులలో మూడు రకములుమాత్రమే యున్నవి

ఇవి సాధారణముగా భూమిమీదనే నివసించును. పర్వత ప్రాంతముల ఇసుక యెడారులలో యెక్కువగా గానవచ్చును కొన్ని భూమిలో త్రవ్వుకొని నివసించును కొన్నిరకములు చెట్లమీద నివసించును. కొన్ని నేలమీద, నీటిలోను, మరికొన్ని సముద్రపు నీటిలోను వాసస్థల మేర్పరచుకొనును.

ఇవి గ్రుడ్లుపెట్టును తెల్లని తోలుమాదిరిగా నుండుగుడ్లలో యీగ్రుడ్లుండును తడవకు చాలగ్రుడ్లను పెట్టును.

నేలలో పెట్టబడుగ్రుడ్లు ఎండవేడిమివలననే పొదుగబడును. కొండచిలువలు తమంతట తామే పొదుగును.

ఒక రకపు సర్పములను గ్రుడ్డిసర్పము లందురు ఇవి భూమి అడుగుననే నివసించును వీనికి కళ్లుండవు చీమలనుతిని ముఖ్యముగా బ్రతుకును వీనిలో ౧౦౦ రకములున్నవి ముఖ్యముగా ఇవి ఉష్ణదేశములలో గానవచ్చును జంతుపరిణామములో ఈచిన్నగ్రుడ్డి అంధకారములోనుండు సర్పములతరువాత బహు పెద్దవిగానుండునవి కొండచిలువలని యూహింపబడుచున్నది వీనితరువాత విషసర్పములు (Vipers) జంతుపరిణామములో వెలువడినటుల గానుపించును

## కొండచిలువలు

ఇవి విషజంతువులుగావు పై దవడలో రెండువరుసల పళ్లుండును. కోరలుండవు వీనితోకలు ఇతర వస్తువులను పట్టుకొనుటకు

---

* ఇటీవలి వార్తలవలన తెలియవచ్చిన యీ వ్యాసకర్త మరణమునకు మిక్కిలి చింతిల్లుచున్నాము. —సం.

మీలుగా నేర్పరుపబడినవి కొంతప్రదేశములన్న వీనికి ప్రేమ గాన వీనిని కొండచిలువలందురు దక్షిణ-పూర్వ ఆసియాలో, ఆస్ట్రేలియా, మధ్య, దక్షిణ-ఆఫ్రికాలలోను ఈ జాతు లున్నవి

ఇవి ౩౦ అడుగులవరకు ఉండును ఇవి తమ యాహార జంతువులదేహములను తోకతో జుట్టి బిగించి నలిపి చంపును. అట్లు పూర్తిగ చచ్చినజంతువును తల దగ్గరనుండి మ్రింగును ఈ విధముగా జుట్టుటవలన జంతువుయొక్క బొమికలు విరిగిపోవును గాన తేలికగా మ్రింగుటకుపడును ఇటుల నొకమారు భుజించిన వీనికి కొన్ని దినములు, మాసములు వరకు మరల నాహార మవసర ముండదు ఇవి పందేళ్లను గొర్రెలను,చిన్నదూడలనేగాక తరచుగా మనుజులనుగూడతినుచుండును.

## “బో” సర్పములు ( Boas )

ఇవి చెట్లమీద ఉండును ౧౨ నుండి ౩౦ వరకుఅడుగులు పొడవుండును పలుచని గోధుమరంగు లేక నలుపుగా నుండును. వీపుపైన చారలుండును వీనిరంగివి నివసించు చెట్లరంగు మాదిరిగనే యుండును గాన వీనియునికి తెలిసికొనుట కష్టము ఇవి దక్షిణఅమెరికాలో మాత్రము కానవచ్చును ఇవి కుక్కలను, ఖేళ్లనుతిని బ్రతుకును.

## ఎలుకపాము

ఇవి మన పిల్లులంత యుపయోగము ఇవి యెలుకలను, మంచులను పట్టి తినును రూపములో నివి త్రాచును బోలియుండును గాని యివి విషజంతువులుగావు

## వృక్ష సర్పములు

ఇవి హిందూదేశములో, ఆస్ట్రేలియాలో నున్నవి వీనికి పెద్ద పెద్ద కళ్లుండును. పచ్చరంగు గలిగియుండును వీనిరంగును ఇవి నివసించు చెట్లరంగును ఒకేమాదిరిగ ఉండును కావున నివి చెట్లమీద నున్నటుల గుర్తించుటయే కష్టము.

విష తీవ్రత త్రాచులలోను, కట్లపాములలోను గానవచ్చును. ఈ దేశములలో పాములవలన నష్టము త్రాచువలన, తరువాత కట్లపాముల వలన అగుచున్నది త్రాచులకున్న పడగ యాభాగములో నున్న బొమికలు ప్రత్యేకముగా కదలుటవలన గలుగుచున్నది ఈబొమికలను దానియిష్టము వచ్చినప్పుడు కదల్పగలదు దీనిపై నున్న తోలు వదులుగా నుండును కాన నిటుల జేయగలదు ఈపడగ వెనుకభాగమున సులోచనముల మాదిరిగ నుండును కొన్నిటిలో నివి యుండక పోవచ్చును లేక యొకకన్నే యుండవచ్చును ఇది ౬ లేక ౭ అడుగులవరకు ఎదుగును. అడవులలో నిది ౧౩ అడుగులవరకు గాన నగును ఈపెద్దసైజు త్రాచు సాధారణముగా చిన్నత్రాచులను తక్కినపాములను తిని జీవించును.

## సముద్రపు పాములు

వీని తోకలు పడవలను నడుపుతెడ్లమాదిరిగా పూర్వబడి యుండును కాన ఇవి చాల త్వరితముగ ఈదగలవు ఇవి విషపు జంతువులు చేపలనుతిని బ్రతుకును ఇవి యుష్ణపు సముద్రములలో నివసించును ఇవి గుడ్లను పెట్టవు పిల్లలనీనును.

## వైపరులు

పరిణామములో ప్రత్యేకమైనవి సర్ప జాతిలో ‘వైపరు’లనునవి. వీనికి పైదవడబొమికలు చాల తేలికగా కదలునట్లు నేర్పరుపబడినవి గాన నివి నోరు చాల వెడల్పుగా తెరువగలవు పైదవడ ముందరి వైపున గొట్టములవలె నుండు రెండు విషపుకోర లుండును వీనితల వెడల్పుగా నుండును శరీరము లావుగను, తోక చిన్నదిగను, మొండిదిగను ఉండును కంటిపాప నిలువుగా నుండును గాన ఇది రాత్రి సంచరించునని తెలియుచున్నది ఈజాతివన్నియు విషపుజంతువులే.

ఈజాతిసర్పములు ఇసుకలో పూడ్చుకొని తలమాత్రము బయటికి పెట్టుకొని పడుకొనును ఏదైన జంతువు దగ్గఱగా వచ్చిన యెగిరి మీదపడును వీని విషము అరగంటలో మనుజునిగాని, గుఱ్ఱమునుగాని చంపును. ఉత్తరఅమెరికాలో విపరీతమైన సర్పమున్నది. ఇది కదలిన దాని తోకమీద నున్న కొమ్ముల మాదిరివి ఒకవిధమైన శబ్దమును గలుగజేయును కాన ఈసర్పము వచ్చుచున్నటుల తెలిసికొనగలము

ఈపన్నగము లన్నియు రెండుముఖ్యములగు తెగలుగా విభజింపబడినవి మొదటిది త్రాచుపాములు, రెండవది కట్లపాము జాతులు ( Vipers ) ఈరెండును ఇతర జంతువులకును, మనుజులకును చాలనపాయకరములే ప్రతివత్సరము ఈపాముల కాటువలన సుమారు౨౫,౦౦౦ మంది మృతిజెందుచునట్లు లెక్కలవలన తెలియుచున్నది లెక్కలలో పడని సంఖ్య సుమారు ఇంతయే యుండునని యూహింపబడుచున్నది.

సర్పము ఇతర జంతువులను కరచినప్పుడు కొంత విషము కాటుద్వారా శరీరములోనికి ప్రవహించును ఈవిషము శరీరమంతయు ప్రవహించి మెదడును, గుండెలను చెఱచి మృత్యువును గలుగజేయును కరచినది విషసర్పమని యీవిధముగా గ్రహింపవచ్చును. రెండు చిన్న రక్తముకాఱునట్లు ఒక అంగుళము ఎడముగా కరచినచోట గానవచ్చును ఈవిషము రక్తముగుండా గుండెలలోనికి ప్రవహించకుండా జేసిన మరణము కలుగదు. కాన తొలిచికిత్సకులు (First aid) గాయమునకు హృదయమునకును మధ్య రక్తము పైకి ప్రాకకుండ గట్టికట్టును కట్టవలెను ఎటులన వ్రేలిమీద కరచిన కాటుకు పైన గట్టి సన్నని త్రాడుగాని, గుడ్డపేలికనుగాని గట్టిగా గట్టవలెను. కట్టిన తరువాత గాయమునుండి రక్తము ప్రవహించునట్లుగా

సన్నని కత్తితో గాయమును పెద్దదిజేసి, గాయమున్న భాగమును క్రిందికి వ్రేలాడవైచి వేడినీటిని గాయముగుండా పోయవలెను ఈప్రవహించు రక్తముద్వారా కొంత విషము శరీరమునుండి వెలువడును ఆగాయము మీద Potassium Permanganate అను మందును వేసి రుద్ద వలెను వీలైన ఈమందును వేసి నీటిలో గలిపి యానీటిలో యా గాయపు భాగమును మునుగునట్లుంచవలెను ఈమందు ఈవిషమును నాశనము చేయగలదు ఈవైద్యము ౧౮౭౯-వ సంవత్సరములో గను గొనబడినది లేక గాయమును యెఱ్ఱగా కాల్చిన యినుముతోగాని, ఎఱ్ఱని అగ్నికణముతోగాని, మరి ఇతర ద్రావకములతోగాని కాల్చి వేయవలెను

ఈపాముకాటువలన గలుగు ఉద్వేగమునకు (Shock), శక్తిపాత మునకు (Collapse) కాఫీ మొదలైన వీయవలెను అవసరమైన కృత్రిమ శ్వాసను (Artificial respiration) కలుగజేయవలెను. చికిత్సకుని నోటిలో యేవిధమైన పుండ్లులేకున్న ఆగాయమునుండి విషమును పీల్చి యుమిసి నోటిని బాగుగా బ్రాందితో కడుగుకొనవలెను

ఈసర్పముల విషమును గుఱ్ఱముయొక్క రక్తనాళములలోనికి ప్రవేశపెట్టిన గుఱ్ఱము ఈవిషమునకు విరుగుడు పదార్థములను (Anti-venin) తయారుచేయును ఈగుఱ్ఱపు రక్తమును దీసి తిరుగ కరవబడిన మనుజుని లోనికి ప్రవేశపెట్టిన మనుజుడు తప్పక బ్రతు కును. ఈమందు పాతది పనికిరాదు కరవబడిన అరఘంటలోపల ఈచికిత్స జేయవలెను ఎక్కడనో కొండలలో, అడవులలో గరు వబడిన వారికి ఈచికిత్స వలనుపడదు కాన యీవైద్య మంత యుప యోగములో లేదు గడ్డిని త్రవ్వువారి వేళ్లను కరచిన వారు తక్షణమే యావ్రేలిని కోసివైచుకొని జీవించుచున్నారు ధన్వంతరి శిష్యుడైన సుశ్రుతుడు ఈ సర్పముల విషయమై చాలవ్రాసినను, ఆవైద్య మిప్పు డుపయోగములో నున్నట్లు కానరాదు

## విష సర్పములు రెండు రకములు

౧ త్రాచుజాతి (Colubrines)

౨ కట్లపాము జాతులు (Vipers)

ఈ రెండు రకముల విషము వేఱువేఱు విధములుగా పని చేయును త్రాచుల విషము నరములద్వారా పనిజేయును రెండ వది ఆమమును తయారుచేయు పొరలనుండి రక్తస్రావము గలుగజేసి యారక్తనష్టమువలన ప్రాణమును తీయును కావున నీ రెండవజాతి యంత తీవ్రముగా బనిచేయజాలవు

## త్రాచుల కాటు

ఒక నిముసమాత్రము కరచినచోట భరింపరాని మంట పెట్టును శీఘ్రముగా మత్తును గలుగజేయును తటాలున క్రిందినుండి పైకి పక్ష పాతము క్రమ్ముకొనట్లును కాళ్లలో సత్తువ బోవును గాన నేల గూలజేయును మనస్సు అయోమయ మగును.

గుండెలు పత్తుకొనిపోవుచున్నటుల నుండును. దడయుం డును నాడి నీరసముగాను, కనుపడియు కనుపడనట్లుగా క్రమము తప్పినట్లుగాను ఉండును గొంతుకలో అడచుకొనినట్లు ఉండి లోని కేమియు దిగదు మాట్లాడలేము, మనోనైర్మల్యము బుట్టును నెత్తురు కక్కుకొనవచ్చును తల వాలిపోవును ఊపిరి కష్టముమీద వచ్చును. బహునిద్ర వచ్చుచున్నట్లుండును దీనినే సర్పనిద్ర యందురు.

## కట్లపాముల కాటు

ఈ పాములనుబోలినవి విషము లేనివి యొకజాతి వున్నవి. వీనిని వసారాపాము లందురు.

ఈ కట్లపాముల కాటువలన మొదటినుండి చివరవఱకు అపరి మితమైన మంట నోటినుండి, నాలుకనుండి, కడుపులోనుండి, పెదవుల నుండి, ముక్కులోనుండి, కళ్లనుండి, ప్రతి ఆమమును తయారుజేయు పొరలో నుండి, ఆసనమునుండి, మూత్రద్వారములనుండి కాటు నుండి నెత్తురు గారును

గుండె లాగుటవలన మరణము తటస్థించును గుండె లాగిన తరువాతనే యూపిరి యాగును

మనుజుని చంపగలిగినంత విషము లోనికి బోకపోయిన జ్వరము మొదలిడి ఒంటిమీద పుండ్లు ఏర్పడి చర్మవ్యాధివలన కొన్నిమాసముల తరువాత మరణింపవచ్చును ఇట్లు తటస్థించిన పాషాణమును మందుగా నిచ్చిన కుదురవచ్చును పాముకాటు సరిగా తగులక పోయినను, కరచినది విషసర్పము కాకపోయినను అతిభయమువలన కూడ మరణింపవచ్చును.

కాటువలన విషము సరిగా రక్తనాళములలోనికి పోయిన కొలదికాలములోనే మరణించును చర్మముక్రిందికిపోయిన సుమారు పదినిముసములలో రక్తములోనికి ప్రవేశించును గాన ఈలోపుగ కట్టుకట్టుట మొదలగు చికిత్సలను జేయవచ్చును

## విషాది వివరణ పట్టిక

| | విష గ్రంథిలో నుండు విషము | కరచినప్పుడు వెడలు విషము | మనుజుని చంపు విష పరిమాణము | మరణము తటస్థించు కాలము |
|---|---|---|---|---|
| | గ్రెయినులు | | | |
| త్రాచుపాము | 1/2-18 | 6 | 1/12 | 10 ని మొ 30 గంటల |
| కృష్ణసర్పము | 2-6 | 4 | 1/12 | 10 ని మొ 24 గంటల |
| వైపరులు | 1-4 | 2 | 1/8 | 6 గం. మొ 8 రోజల |
| కట్లపాము | 1/50-2 | 1 | 1/100 | 12 గం మొ 8 రోజల |

పొగాకు తోటలవైపునకు పాములు రావు గాన పొగాకును మందుగా వాడుచుందురు. ఇదియు గొంతపని చేయును

శీతకాలములో విష మెక్కువగా యుండునట చీకటిలో వెలుతురు కన్న ఎక్కువ విషముండును పాము చాలదూరము నుండి వచ్చినగాని, కరచినపుడు రెండు దవడలు సరిగ కలియకపోయినగాని విషము చాలకొద్దిగా నెక్కును

మంచినీళ్లలో నుండెడి పాములకు విషముండదు సముద్రములోనుండు సర్పములకు కృష్ణసర్పము కన్న పదిరెట్లెక్కువ విషముండును ఉష్ణప్రదేశములోని పాములకు ఎక్కువ విషముండును సర్పముయొక్క వయస్సును బట్టికూడ విషము మారును త్రాచులు సుమారు ౨౦౦ సంవత్సరములు బ్రతుకును. సర్పము కోపముగానున్న విష మెక్కువగా నుండును ఆహారమును తిన్నతరువాతను, కుబుసము విడిచినతరువాతను విషముండదు ఈసర్పములన్నియు చెట్లెక్కగలవు నదులు దాటగలవు త్రాచుజాతిపాములు చాల జ్ఞాపకశక్తిగలవి వాటిని బాధించినవారిని చాలకాలమైనను జ్ఞాపకముంచుకొని వీలైన తిరిగి శిక్షించగలవు

---




పరీక్షల హడావుడి

# మానవ ప్రబోధము

కూరెళ్ల రామనరసింగరావుగారు

త్వరమ్మై వాయుపథానఁ బోవుచుఁ బ్రయత్నం బింతయున్ లేకయే
వరిధాన్యంబునో, కాయనో, ఫలమునో, పర్ణంబునో గాంచి, స్వో
దరమున్ నించి, ఫలంబొకండు నిజసంతానక్షుధన్ బాపఁ గొం
చరుగున్ గాదె విహంగ మత్యధిక హర్షాయత్త చిత్తంబుతో.

ఘోరవనాంతరంబులను గ్రుమ్మరి దృష్టికి గోచరించు స
ద్వారణ మస్తకస్థ పిశితంబు నఖంబులఁ జీల్చి దాని నా
హారముగాఁ గొనుంగద మృగాళివిభుండు క్షుధాగ్నికీల, తన్
గారియఁబెట్టుచున్న, లఘుకార్య మొనర్చునె సజ్జనుం డిలన్.

అతిసూక్ష్మంబగు చీమ దాఁ గనెడి యాహారంబు స్వల్పంబుఁదా
నతిశీఘ్రంబుగ సంగ్రహించిచనుఁగా నావాసముం జేరఁగా
నతిసంతోషయుతాంతరంగమున, ముఖ్యంబౌ గుణం బెన్నఁ డీ
క్షితిపైఁగాని యముఖ్యముల్ తలఁప సృష్టిన్ సూక్ష్మమున్ స్థూలమున్.

చారుసుగంధ సంభరిత సల్లలిత ప్రసవప్రభూత వి
స్తారమరందధారలను షట్పదరాజము గ్రోలు, నైన నా
నేరుపు ధాతయుం దెలియనేరఁడు, తత్సమరూపసంపదల్
మారవు సుంతయేనియును, మాన్యుల సంగ్రహణంబు లిట్టివే?

*          *          *          *

ఆలోచించును రాత్రియుంబవలు నేండ్లైనన్, విశేష ప్రయ
త్నాళిం జేయు, రచించుఁ దంత్రములు, న్యాయాన్యాయముల్వీడుఁ డా
నేలాగైన ధనంబుఁ గూర్పఁగ జనుం, డేటా మహాచంచలం
బౌ లక్ష్మీకృప కిన్నిపాట్లు, ఖగజన్మం బెత్తినన్ జెల్లదే?

సకల స్థావర జంగమంబుల ధరాచక్రంబునన్ మానవుం
డొకఁడే యర్థసమార్జనార్థమయి యాయుర్దాయ మర్పించు, వి
ద్యకు విత్తంబ మహాశయంబగు, స్వసౌఖ్యంబా ఫలం బక్కటా!
సకలప్రాణిసమూహముల్ దనవలెన్ సౌఖ్యంబు వాంఛింపదే!

తనవంశీయులకెల్లను - జనుఁడేలా, ధనముఁగూర్ప శ్రమలంబడునో?
గణియించెడివాఁ డొక్కఁడు - గుణియించు మరొక్కఁడంచు క్షోణిని వినుచున్.

*　　　*　　　*　　　*

చాలు విహంగపాళి కనిశంబు వసింపఁగ శాఖశాఖలే
చాలుఁ బిపీలికంబులకు క్ష్మాతలమందునఁ జిన్న రంధ్రమే
చాలు మదద్విరేఫములు సంతతమున్ వసియింప సూనమే
చాలు యథేచ్ఛమై మెలఁగ సత్త్వచయంబునకున్ బిలంబులే.

చతురంభోనిధిమేఖలావలయితక్ష్మాపాలనంబైన నీ
క్షితిపైఁ జాలదు మర్త్యుతృష్ణ నుడుపన్, జీవించునే తాను శా
శ్వతుఁడై, తత్పదవిం గనుంగొనుచు, నాశాబద్ధుఁడై మానవుం
డతిహీన్యంబగు వర్తనంబునకుఁ బాల్పైనన్ ఫలం బున్నదే?

వనసత్వంబగు సింహమే కరిఘటావ్రాతంబుపైఁగాని లం
ఘనముంజేయదు తామరొందుపయి, విజ్ఞానప్రభానాన్వితుం
డు నరుం డక్కట! యిద్దియోగ్యమనుచున్, న్యూనంబిదంచున్ మదిన్
గనఁడేనాడు స్వకార్యనిర్వహణమార్గాన్వేషణాసక్తిమై.

ధరణిఁ బిపీలికంబునయితంబు స్వజాతికి భుక్తిఁ గూర్పఁగాఁ
ద్వరఁబడు, మానవుండొ పెరవారు గణించు ననూనవైభవో
త్కరములఁ దాగ్రహింపఁగను దత్తరమందును గాని, గవ్వయుం
బరుల కొసంగనొల్లఁడు, క్షమాస్థలిలోభము వేరె యున్నదే!

అరయఁడు మానవుండు హృదయాన స్వవాంఛిత జాలసిద్ధికై
పరుల సుఖంబు దుఃఖమును, భావనసేయు స్వలాభమే నిరం
తరము, మరందధారలను దాగ్రహియించెడివేళనైన బం
భరము లతాంతపంక్తికి సుమంతయు క్లేశముఁ గూర్చునే ధరన్!

*　　*　　*　　*　　*　　*　　*　　*

ధనసంపాదనకార్యమందు వలదే ధర్మం బధర్మంబునా,
తనకై చేసెనె ధాత సృష్టిని, దురంతాశామహాపాశబం

ధనమందుం బడి లోభ భూతమునకున్ దాసానుదాసుండునై
మనుజుం డక్కట, నీతిబాహ్యుఁడయినన్ మాన్యుంబె ధాత్రీస్థలిన్!

ఆశాపాశము భిన్నభిన్నములుగా నాలోభభూతంబుఁ దా
నాశంబొనటుఁ జేసి సర్వభువనానందంబు సంధింపఁడే,
యాశాముద్రితధాత్రి, మానవుఁడు దా యత్నించినన్, సృష్టిలోఁ
దా శశ్వద్గతిఁ జేయఁజాలని మహాత్కార్యవ్రజం బున్నదే!

పరతత్త్వామలరూపమే నిఖిలజీవవ్రాతమంచున్ మదిన్
బరికింపన్ 'స్వ' 'పర' ప్రసక్తి బహుపాపంబంచు జీవావళీ
పరమోత్కృష్టసుఖంబె జన్మకు శుభప్రారంభమంచు న్నిరం
తర మేనాఁడు తలంచి మానవుఁడు తద్భంగిన్ బ్రవర్తించునో!

---

# అంతరాత్మ

శ్రీ ఊటుకూరు సత్యనారాయణరావు బహద్దర్ గారు

ఏమొ యేదేశమున నుండి యిటులసాగి
వచ్చుచున్నవో, ఎన్న డభ్యాసమైన
లేనిగతి నడచినట్టు లీ లేతపాద
ములగురుతు లివ్వి ఆయాసమున పథశ్ర
మాపహారమ్మునకు నట నాగెబోలు
పాదయుగళమ్ము నొక్కచో నూది నిలిపె.

పాప మట కూరుచుండె, జపాసుమములు
రాలియుండును కేశభారమ్మునుండి
పోవునప్పు డా చీపురుముండ్లపొదల—
నపుడె తడియార్చుకో విప్పవట్టి కురుల
అగరువాసన ఆక్రేవలందు దోచు.

* * * *

ఆక్రమాగత పాదచిహ్నములుపోయి
ఒకయడుగుమాత్రమే పూనియుండె నచట
ఆనిలిచియున్న మోడు శాఖాంతరముల
వ్రేలుచున్నది వాడినవిరులదండ
ఎవరికొర కిట్లు సాధ్వి కృశించినావొ!

చిత్తమున బయలునె యుపాసించి తుదకు
అంతరించెనుకావలె, నకట! ఎంత
సరళభావము, ఎంత ప్రశాంతముక్తి!—
ఆ వినిర్మలతరహృదయాంతరమున
ఏ యమూల్య తత్త్వములు లయించినవియొ?

అరసికోలేని జన్మజన్మాంతరాంత
బహువిధానుభవఫల ప్రభావకలన
ఏమొ చింతింతు వామూర్తి యెవ్వరనెదు,
అది యెవరు గాదు నీయంతరాత్మ సుకవి!

---

# రాలుబువ్వలు

'విధురుడు'

ఈతెలి పారిజాత మపుడే నిలువెల్ల సుమించి గౌతమీ
 శీతమరుత్తరంగపరిషిక్తనిశాంతరసీమ వాసనా
యాతన మమ్ముఁబోఁటి కృపణాత్ములఁ గర్కశశిక్షఁ దీర్చు జ్యో
త్స్నాతిమనోజ్ఞతల్పముల హాయిగ నాసఖి పవ్వళించునో?

ఇది మొద లేమొ నే ననుభవింప విధించిన తీవ్రశిక్ష కీ
హృదయపుటంపు మూఁతల బిగించిన నాయతిలోకభావనా
స్పదమధుమూర్తియే యగు ప్రసన్నతనంది హిమాలయోచ్ఛిరః
పదముల కెక్కిపోయినను బైకిని గ్రిందికిఁ ద్రిమ్మరించెడున్.

తొలకరిసోయగాలఁ దులతూఁగు వినీలవిహాయసాల భా
సిలు నవమేఘపు న్మధురసీమల నొక్కట మోహరించిత
ళ్కులగమిఁ జిమ్మి యోచపలకోమలి, తళ్కన మాయ మైతిగా
కలరుచిరేంద్రచాపపరికల్పితడోలిక నూఁగ రానటే!

ఏయనుభూత పూర్వజని నింకులు వారిన దివ్యబోధలో
'కో' యని కూఁతవెట్టుకొని గుండెలు చీలిచి పైకిదూఁక బా
లా, యరుణారుణంపు మృదుళాంగుళులన్ దులకించి వీణలో
తీయనిపాటలన్ వెలికిదీయకుమమ్మ, భరింపలే నిఁకన్. —'సెలయేఱు'

---

# ప్రేమతర్కము

చావే మేలని యంటావే
దేవత లేటికి చావరురా?
బతుకే చేదని యంటావే,
బతికే రేలను దేవతలు?
ప్రేమ వొట్టిదే యంటావే,
ప్రేమింతు రేల దేవతలు?

ప్రేమే సర్వ మ్మంటావే,
ప్రేమించ కేమి సేతుమురా?

---

(శాఫోగీతానికి తెలుగు) —బసవరాజు అప్పారావు





1. గామాసోదరుల మల్లయుద్ధప్రదర్శనము; 2. సర్ సామ్యూల్ హోరుగారి టెన్నిసు ఆట; 3. బెట్టనుకన్య (18 ఏండ్లు) క్రికెట్టు ఆడుట.

# తెల్ల కాకితము

## (White Paper)

## పీఠిక

### 1931 సం. డిసెంబరు శ్వేతపత్రము

ఇండియన్ రౌండు టేబిలు మహాసభకు ప్రకటించిన విధముగను 3972-వ ఆజ్ఞాపత్రమునందు తెలిపియుండినవిధముగను భారతరాజ్యాంగ సంస్కరణముల విషయమై ఆంగ్లేయప్రభుత్వమువారవలంబింపదలచిన యేర్పాటులను వర్ణించుచు 1931 డిసెంబరులో పార్లమెంటు రెండు సభలును తీర్మానించి యుండెను. ప్రభుత్వమువారేర్పరపదలచిన స్వపరిపాలనము పూర్తియగులోపల తాత్కాలికముగ కొన్ని మినహాయింపులకు లోబడి ప్రస్తుతమున్న భారతప్రభుత్వపద్ధతిని సంస్థానములతోను రాష్ట్రములతోను కూడిన పరిపాలనబాధ్యత గల సంయుక్తప్రభుత్వముగ మార్చుటకుద్దేశించి దానికవసరమైన మరి కొన్ని సంప్రదింపులు విచారణలు జరిపించుట విపులముగ తెలుపదలచినప్పుడు రాజనీతి లక్షణమని చెప్పవచ్చును. ఆ పరిమితులను మామూలుగ రక్షణలని వ్యవహరించుచున్నారు. భారతవర్షము యొక్కయు ఆంగ్లదేశముయొక్కయు లాభములనుపాటించి వాని నేర్పరచితిమి.

తరువాత మరి కొంత విచారణయు, సంప్రదింపులును రౌండు టేబిలు సభయందు మూడవ సమావేశముకూడ జరిగినందున భారతప్రభుత్వనిర్మాణము విషయమై యెక్కువ నిర్ధారణగను పూర్తి వివరముతోను ప్రభుత్వమువారు తాము గావింపదలచిన యేర్పాటులు తెలుపగలస్థితిలో నుండిరి. గత జూను 27-వ తేదిని కామన్సు సభలో భారత కార్యదర్శి ప్రకటించిన విధమున పార్లమెంటు రెండు సభలలో నుండి జాయింటు సెలక్టుకమిటీని నిర్ణయించి భారత ప్రతినిధులతో సంప్రదించి తమ యభిప్రాయము వెల్లడింప వలయునని కోరుట వారి యుద్దేశము. ఈ రిపోర్టు తయారైన వెనుక ప్రభుత్వమువారు తమ తుది నిర్ణయములతో నొక బిల్లును ప్రతిపాదించుట ప్రభుత్వమువారి విధాయకము.

### ప్రస్తుత పత్రపు స్వరూపము, ఉద్దేశము

మొట్టమొదటనే ఒక సంగతి స్పష్టపరుపవలెను. చిన్న పేరాలలోను లేదా క్లాజులలోను ఆ యేర్పాటులను స్పష్టముగ నుదాహరించియున్నను, ఇప్పుడు ఉపయోగించిన భాషయే సాధారణముగ చట్టమునందుకూడ వాడుదురని తలపకూడదు. ప్రస్తుతపు ఏర్పాటులు అన్ని విషయములందును పూర్తిగ నున్నవనిగాని, ఈ శ్వేతపత్రములో లేని యంశములు బిల్లులో నుండవనిగాని యెంచకూడదు. అయినప్పటికి నీపీఠికలో తెలిపిన ప్రకారము ప్రస్తుతపు సూచనలను గ్రహించినప్పుడు ప్రభుత్వమువారవలంబించిన ముఖ్యసూత్రము స్పష్టపడును.

ఈ పత్రపు ఉద్దేశము విషయమై మరియొక సంగతికూడ విశదీకరింపవలయును. పార్లమెంటులో ముందు దీనిని గురించి చర్చ జరుగకముందు ప్రభుత్వమువారు తెలిపిన సూచనలను సమర్థించుచు నిక్కడ తెలియజెప్పుటగత్యముకాదు. ఆ సూచనల స్వభావము వానివలన కలుగబోయే మార్పులు తెలుపుట తప్ప అంతకంటె ఏమియు దీనిలో తలపెట్టలేదు

### ఇండియన్ ఫెడరేషను, దానినిర్మాణాంతర్గతమైన విధానము

సంస్థానములతోను, రాష్ట్రములతోను కూడిన ఫెడరేషను ఏర్పరచుటకును, ఆనిర్మాణమున కంగభూతమైన యేర్పాటులు గావించుటకును ప్రస్తుతమున్న భారత ప్రభుత్వ విధానమును పూర్తిగ మార్చవలసియుండును. 18-వ శతాబ్దమునుండియును భారత ప్రభుత్వమునకు సంబంధించిన చట్టములు దీనితో రద్దగుననియు పార్లమెంటువారు చర్చించి నిర్ణయించుచట్టము దానికి బదులుగ నమలులోనికి వచ్చుననియు యెంచుచుంటిమి. ఆచట్టమునే దీనిలో భారతప్రభుత్వచట్టమని వ్యవహరించితిమి. శాస్త్రరీత్యాను రాజ్యాంగ సంబంధములోను జరుపవలసిన మార్పులలో ఏర్పడు సమస్యలను సంగ్రహముగ నిట్లు పేర్కొనవచ్చును.

ఇతరత్రగల ఫెడరేషను ఏర్పాటులందు స్వతంత్రాధికారము కలిగిన కొన్ని రాజ్యాంగాంతర్భాగములు తమలో దాము సంప్రదించుకొని తమకున్న యధికారములను స్వతంత్రముగ వ్యవహరించుకొనుచు తమకున్న యధికారములలో కొంత ఫెడరేషనుకు ఒప్పగించుటకును తమ అందరిపక్షమున నది వ్యవహరించుట కంగీకరించుట వలనను ఫెడరేషనులు నిర్ధారణమగుచుండెను కాని భారతవర్షమునం దిట్టి పద్ధతి కానరాదు బ్రిటిషుఇండియా అంతయు నొకభాగమై భారతకార్యదర్శిపాలనాధికారముక్రింద నున్నది భారతకార్యదర్శికి సలహా చెప్పుటకు చట్టసమ్మతమైన యొక సంఘము కలదు భారత ప్రభుత్వమునకు, దేశాదాయమునకును సంబంధించిన కార్యములపై వారి కధికారము కలదు రాష్ట్రములకు సంబంధించిన అధికారములను వీరి యనుమతి ననుసరించి వారి కొప్పగించిరి వారి యధికారమునకు లోబడి రాష్ట్రములు వ్యవహరించుచుండును అందుచే భారతకార్యదర్శి కలిగింపని స్వతంత్రాధికారము లేవియు రాష్ట్రములకు లేవు.

## సంస్థానములు

సంస్థానములు శ్రీచక్రవర్తిగారికి లోబడియున్నను వారి పరిపాలనములో లేవు గవర్నరుజనరలుద్వారా వారి వ్యవహారములు నిర్ణీతమగు చుండును. పార్లమెంటువారికి సంస్థానములమీద ప్రత్యక్షాధికారము లేదు పార్లమెంటువారు సంస్థానములకు చట్టము లేర్పరుచుటకు వీలులేదు అందుచే సంస్థానములనుండి ఫెడరేషనుకు సంక్రమింపవలసిన యధికారములవిషయమై సంస్థానాధీశులతో సంప్రదించి నిర్ణయింపవలయును రాష్ట్రములనుండి సంక్రమింపజేయదలచినంత యధికారమును వారు ప్రసాదించుట కంగీకరించి యుండలేదు అందుచే ఫెడరేషనులో చేరు రాష్ట్రములమీదను, సంస్థానముల మీదను ఫెడరలుప్రభుత్వమువారును, శాసనసభవారును చలాయింపదగిన యధికారమునందు తారతమ్య ముదయించుచున్నది

అందుచే దీనికొరకు తమ సంస్థానాధీశు లేర్పరచిన ప్రతినిధులతోను, బ్రిటిషు భారతవర్ష మెన్నుకొనిన ప్రతినిధులతోను కలిపి ఫెడరలు శాసనసభను ముందు తెలుపబోవు మినహాయింపులకు లోబడి శాసనసభకు బాధ్యతవహించు మంత్రివర్గము తోడ్పాటుతోను, సలహాతోను చక్రవర్తి ప్రతినిధిగ గవర్నరుజనరలుతో కూడిన కార్యనిర్వాహకవర్గమును నిర్మించి బ్రిటిషు ఇండియాకు సంబంధించిన వ్యవహారములను ఫెడరేషనులో చేరు సంస్థానము లంగీకరించు వ్యవహారములను నిర్వహించుచుండవలయును. ప్రభుత్వ చట్టమునందు నిర్వచించిన విధానమునకు సరిగ నుండని షరతులమీద ఫెడరేషనులో చేరదలచిన సంస్థానములను చేర్చుకొనకుండుటకు సార్వభౌమునకు స్వాతంత్ర్యముండును.

ప్రస్తుతమున్న భారతప్రభుత్వచట్టము రద్దుఅగుటతోనే బ్రిటిషు ఇండియాపాలనమునకు సంబంధించిన యధికారము లన్నియు సార్వభౌమునికి సంక్రమించును ప్రస్తుతవిధానము మారులోపల సార్వభౌమునిపక్షమున నా యధికారములను గవర్నరుజనరలు, గవర్నరులు, భారత ప్రభుత్వచట్టముక్రింద నియమితులైయున్నవారు చలాయించెదరు సంస్థానాధీశు లంగీకరించిన యధికారములుగాక నిప్పుడు సార్వభౌమునకు లోబడి గవర్నరుజనరలుగారి యధికారమందున్న వ్యవహారములు, రాజప్రతినిధిగారి యధికారములోనుండి ఫెడరల్ రాజ్యాంగమునకు లోబడియుండవు.

ఫెడరేషనువారు గవర్నరుజనరలు పదవిని లెటర్సుపేటెంటుబట్టి నియమించెదరు ప్రభుత్వనిర్మాణచట్టము ననుసరించి వారు నిర్వహింపవలసిన యధికారములు సార్వభౌముడు అప్పగింపదలచినదానికి సంబంధించని ఇతరాధికారములు ఆయధికారపత్రమునందు పేర్కొందురు. చక్రవర్తిగారి యనుమతి ననుసరించి గవర్నరుజనరలుగా రాపదవి స్వీకరించెదరు సార్వభౌముడు అధికారనిర్వచన పత్రమునందు తెలుపునట్లు వారు తమ ధర్మమును నిర్వహించుచుందురు ప్రతి రాజధాని గవర్నరుసందర్భములోను ఇట్లే యేర్పాటులు జరుగును

రాజప్రతినిధి ఇకముందు ప్రత్యేకోద్యోగము నిర్వహించుచుండును లెటర్సుపేటెంటు ననుసరించి ఆపదవి కలుగజేయబడును రాజప్రతినిధి యధికారము ననుసరించి గవర్నరుజనరలుకు ఫెడరేషనులో చేరని సంస్థానములపై నధికారముండును దీనికిని ప్రభుత్వనిర్మాణచట్టమునకును సంబంధ ముండదు

బ్రిటిష్ ఇండియాకు సంబంధించినంతవరకును సంయుక్త ప్రభుత్వ విధానమును ఫెడరలు విధానముగ మార్చుటకు మొదటిమెట్టు ఫెడరలుప్రభుత్వాధికారములను రాష్ట్ర ప్రభుత్వాధికారములను నిర్ధారణ చేయవలయును రాష్ట్రములకు స్వతంత్రాధికార మొసగవలయును పరిపాలనమునందు రెంటికి వేరువేరుగ నిర్ణీతాధికారముల నేర్పరుపవలయును. రాజధానులందలి కార్యనిర్వాహకాధికారము సార్వభౌమునియందుంచి వారి ప్రతినిధులుగ గవర్నరులు అధికారము చలాయింపవలెనని నిర్దేశించిరి. గవర్నరుగారికి మంత్రివర్గము సలహా చెప్పుచుండును మంత్రులు శాసనసభకు లోబడియుందురు. ప్రజ లెన్నుకొన్న ప్రతినిధులు దానిలో ప్రతినిధులుగ నుందురు. ఫెడరలు శాసనసభయు, రాష్ట్రశాసనసభయు నేయేకార్యముల నిర్వహించుట కధికార ముండునో నిర్ణయించెదరు కొన్నికార్యములు రెండును కలిపి నిర్వహించు నధికార ముండును. ఉభయులు చేయు శాసనములందు ద్వైధీభావము లేకుండ నిబంధన లుండును,

## ఫెడరేషను నిర్మాణము

### ప్రారంభకాలము దాని షరతులు

ప్రభుత్వ నిర్మాణచట్టమును నిర్మించుటతోడనే ఫెడరేషను నిర్మాణము సిద్ధింపదు ప్రభుత్వచట్టము నిర్మితమైన గాని బ్రిటిషు ఇండియాలో దీని సందర్భములో జరుగవలసిన పని పూర్తి కాదు. శాసనసభలకు వోటరుల జాబితాలు తయారు కావలసియుండును ఎన్నికస్థానములు నిర్ణయము కావలయును ఇదిగాక సంస్థానములతో సంప్రదించి నిర్ణయింపవలసిన యవసరముండును. వారు ఫెడరేషనులో చేరు షరతులను ఏర్పరచవలయును ప్రభుత్వ చట్టము నిర్మితమైన గాని ఇది సాధ్యముకాదు. ఫెడరేషను స్వరూపము, దాని యధికారములు అప్పటికికాని వారికి తెలియదు. సంస్థానముల ప్రజలలో సగము ప్రజలకు చెందిన సంస్థానాధీశులును, సగమునకు తక్కువకాని సంస్థానములు చేరుట కంగీకరించిన గాని ఫెడరేషను నిర్మాణ మగుటకు వీలులేదని ప్రభుత్వమువారు నియమ మేర్పరచిరి.

రాజప్రకటనము జరిపి ఫెడరేషనును ఉపక్రమింపవలయు నని ప్రభుత్వమువారి యుద్దేశము దానిని ప్రారంభించుటకు పార్లమెంటు సభలు రెండును సార్వభౌముని కోరినగాని రాజప్రకటన వెలువడదు.

దీని కుండవలసిన ఆర్థిక పు టేర్పాటులవిషయమై 32-వ పేర లో కలదు.

### రాష్ట్రీయస్వాతంత్ర్యము ముందు

ఫెడరేషను సిద్ధించేవరకు ఆగకుండ రాష్ట్రస్వాతంత్ర్యము ముందు ప్రసాదింపబడును. భారతప్రభుత్వపు మార్పులకంటె రాష్ట్ర ప్రభుత్వపు మార్పులను ముందు చేయవలసి యుండును ఫెడరేషను నిర్మాణమును చట్టమునందు తలపెట్టిన యుద్దేశము నెరవేరుటకు రాష్ట్ర స్వాతంత్ర్యప్రదానము మొదటి మెట్టుగ నుండును ఒకవేళ ఫెడరేషను ఏర్పాటుకు తమ స్వాధీనములో లేని కారణములవలన అభ్యంతరము కలిగే యెడల నప్పుడు ప్రభుత్వమువారు భారతీయులతో సంప్రదింతురు.

అందుచే నెంత కొద్ది కాలము ముందుగ నైనను ఫెడరేషను కంటె ముందు రాష్ట్ర స్వాతంత్ర్య మేర్పడుటకు చట్టమునందు ఏర్పాటుండవలయును 202-వ పేరాలో దీని సందర్భములో చేయ దలచిన తాత్కాలికపు టేర్పాటును గురించి యున్నది

### ఫెడరలు కార్యనిర్వాహక వర్గము

ఫెడరేషను కార్యనిర్వాహకాధికారము చక్రవర్తియం దుండును. దానిని వారి ప్రతినిధి యగు గవర్నరుజనరలు నిర్వహించును. వారికి మంత్రివర్గపు తోడ్పా టుండును. సంస్థానప్రతినిధులు రాష్ట్రముల ప్రతినిధులతో కూడిన శాసనసభకు బాధ్యులై యుందురు. ప్రభుత్వచట్టము ననుసరించి గవర్నరు కొసంగిన ప్రత్యేకాధికారములలో గాక రాష్ట్రవ్యవహారములలో గవర్నరులు తమ మంత్రుల సలహాల ననుసరించి వ్యవహరించుచుండవలయును. ఫెడరలు ప్రభుత్వమునందు బాధ్యత ఇటులుండదు. అక్కడ దేశరక్షణ, విదేశ వ్యవహారములు, క్రైస్తవ మత వ్యవహారములు గవర్నరు జనరలుగారి సొంత యధికారముక్రింద నుండును ఆంగ్ల ప్రభుత్వమువారు పార్లమెంటువారు నిర్ణయించువిధమున వీరు ఆవ్యవహారములను నిర్వర్తింతురు. దేశరక్షణసేన విషయమై యిప్పుడుండిన ఏర్పాటులే యుండును. చట్టము ననుసరించియు నిర్వహింపవలసిన కొన్ని ప్రత్యేక వ్యవహారములలో వారు తమవిచక్షణను వినియోగింపవలసిన వ్యవహారములలోను గవర్నరుజనరలుగారు తమ మంత్రివర్గముతో యోచింపకుండ స్వతంత్రముగ వ్యవహరింపవచ్చును తక్కిన వ్యవహారములలో మంత్రులసలహా ప్రకారము వారు పరిపాలనము జరుపుదురు. చట్టము ప్రకారము తమకు సంక్రమించు ప్రత్యేకాధికారముల యుద్దేశమునకు భంగము కలుగునని వారికి తోచినయెడల వారు మంత్రులిచ్చిన సలహాను పాటింపకుండ వారికి యుక్తమని తోచిన విధముగ వారు కార్యనిర్ణయము చేయవచ్చును

ప్రభుత్వశాఖల విషయమై గవర్నరుజనరలుగారు ముగ్గురు కార్యనిర్వాహకులను నియమించుకొన వచ్చును. వారి యుద్యోగములు జీతములన్నియు సార్వభౌముని ప్రభుత్వమువారి యనుమతినిబట్టి యుండును వీరి నియామకములో గవర్నరుజనరలుగారి కట్టి యాటంకము నుండదు ఆయుద్యోగమునకు తగినవారిని నియమింపవలయును ఇంతకంటె వేరు నియమముండదు. ఆ కార్యనిర్వాహక సభ్యులు, రెండుశాసనసభలందు అంగీకారరీత్యా సభ్యులై యుందురు. వారికివోటుచేయు నధికారముండదు కావున వారిని క్రింది పేరాలలో నుదాహరించిన సంఖ్యలో చేర్చలేదు

### ఫెడరలు శాసనసభ

ఫెడరలుప్రభుత్వమునందు రెండు శాసనసభ లుండును. వీనికి రెంటికి సరిసమానాధికారము లుండును. కాని దీనిలో రెంటికిని కొంత భేదముండును. ఆదాయవ్యయ వ్యవహారములకు సంబంధించిన బిల్లులను, ప్రభుత్వవ్యయము మంజూరు కోరు బిల్లులను మొదటిసభలో ప్రవేశపెట్టుదురు. మొదటిసభకంటె ప్రభుత్వవ్యయమును మంజూరు కోరుబిల్లుల విషయమై రెండవసభవారి యధికారములు తగ్గియుండును. (సూచనలలో 48-వ పేరాను చూడుడు.) సరిసమానాధికారము లుండినప్పుడు రెంటికిని బేటీరాకుండ చేయుటకు ఏర్పాటు లుండవలయును. ఆ యేర్పాటులు 41-వ పేరాలో కనిపించును.

ఫెడరలు ప్రభుత్వమునందలి మొదటి సభ, లేక అసంబ్లీ సభలో 375 మంది సభ్యులుందురు వారిలో సంస్థాన ప్రతినిధులు 125 మంది యుందురు సంస్థానాధీశులు వారిని నియమింతురు తక్కిన వారు బ్రిటిషుఇండియా ప్రతినిధులై యుందురు రాష్ట్రములవారిని వారు నియమింతు లగుదురు. ప్రతిరాష్ట్రములోని సంఘములు మున్నగు వారి ప్రతినిధు లుందురు. ఆసంఖ్య II-వ అనుబంధములో కలదు బ్రిటిషుఇండియా సభ్యులను సరాసరిగ నెన్నుకొందురు

రెండవసభ, లేక స్టేటుకౌన్సిలులో 260 మందికి మించని సభ్యులుందురు వారిలో 100 మందిని సంస్థాన ప్రతినిధులు ఏర్పరచుకొందురు. బ్రిటిషుఇండియా సభ్యులలో 150 మందియందు చాల మందిని సింగిలువోటువలన ప్రతి రాష్ట్రశాసనసభ ప్రతినిధులు ఎన్నుకొందురు మైనారిటీలైన యూరోపియనులు, ఆంగ్లో ఇండియనులు, ఇండియను క్రిస్టియనుల ప్రతినిధులు విషయమై ఆ పద్ధతి కొంచెము భిన్నముగ నుండును వీరి ప్రతినిధులు రాష్ట్రసభలందు తగినంతమంది యుండరుగాన వీరి విషయమై ప్రతిరాష్ట్రమునందును చేయదలచిన యేర్పాటులు వీరికి నిర్ణయించిన స్థానములసంఖ్యయు I-వ యనుబంధములో కలదు ఈమూడుసంఘములకు తప్ప తక్కిన వారికి కులములవారీని స్థానము లిచ్చుపద్ధతిని మాన్పించిరి కాని మహమ్మదీయుల విషయమై వారికి బ్రిటిషుఇండియాస్థానములలో మూడవ వంతు స్థానములు రెండవ సభలో దొరకునట్లు చేయుట ప్రభుత్వము వారి యుద్దేశమై యున్నది ఇట్లు వారివారివి దామాషాయివి స్థానములు రానియెడల ఆ యుద్దేశము నెరవేరుటకు తగినట్లు ఏర్పాటులలో మార్పులు చేయుదురు

అధికారులుకానివారిని, అనుభవజ్ఞులైనవారిని పదిమందికి మించకుండ గవర్నరుజనరలుగారు నియమింతురు.

రెండు శాసనసభలకు సంస్థానప్రతినిధుల స్థానముల విషయమై ప్రస్తుతము సంస్థానాధీశులతో సంప్రదింపబడుచున్నది కావున దీని విషయమై ఇప్పుడు ప్రభుత్వమువా రేమియు తెలుపజాలకున్నారు. ఆసంస్థానముల గౌరవము, ప్రాబల్యము మున్నగు విషయములను జూచి ఆసంఖ్యను నిర్ణయింపవలసి యుండును. మొదటి సభకు ప్రజాసంఖ్యను బట్టి నిర్ణయ ముండవలయును

## రెండవసభకు ఎన్నిక హక్కు

రెండవ సభలోని బ్రిటిషుఇండియాస్థానములకు రాష్ట్ర శాసనసభలు పరోక్షముగ సభ్యుల నెన్నుకొనును గనుక ఎన్నిక అర్హతలు విధింపవలసిన యవసర ముండదు. సాధారణముగ నిది యుండనక్కర లేనప్పటికీ కొందరి విషయములో కొంత ఆస్తికి సంబంధించి నట్టియు, నితరమైనట్టియు అర్హతలు అవసర ముండును.

## మొదటి సభకు ఎన్నిక హక్కు

ఇప్పుడు రాష్ట్రీయ శాసనసభలకున్న ఎన్నికహక్కువంటిదే ఫెడరలు ప్రభుత్వమునందలి మొదటి సభకు నుండును బీహారు ఒరిస్సా రాష్ట్రములలో అర్హతలు మారును కాని దానిస్వభావము, అర్హత గల వారి సంఖ్య, చాలవరకు ఇప్పటివలెనే యుండును మధ్యపరగణాలలో ఎన్నికఅర్హతగలవారి సంఖ్య చాల తక్కువగనున్నది అందుచే నా స్థానికప్రభుత్వమువారు దానికి బదులు ఎక్కువమంది అర్హతగలవారుండునట్లు ఒక యేర్పాటును తలపెట్టిరి ఆస్తిఅర్హత బట్టియే ప్రస్తుతమన్ని రాష్ట్రములలోను ఎన్నికయర్హత గలదు పైన తెలిపిన మార్పులతో దానినను సరించుటలో మొదటి శాసనమునకు దానికితోడు స్త్రీ పురుషుల కిద్దరకు సరిసమానముగనుండు విద్యావిషయకమైన అర్హతను విధింపదలచిరి అవసరమైనప్పుడు కొన్ని నిర్ణీతజాతులవారికి (నిమ్నజాతులు) వారిజనసంఖ్యలో రెండవవంతు ప్రజలకు హక్కుకలుగునట్లు (బీహారుఒరిస్సాలను మినహాయించి) మరియొక పద్ధతి నవలంబింతురు బీహారుఒరిస్సాలలో ఎన్నికదారుల సంఖ్య ఇతర వోట్లకంటె తక్కువగనున్నది పశ్చిమపరగణారాష్ట్రములో నితరజాతులవారలంతగ లేరు ఇప్పటికంటె స్త్రీలలో ఓటర్లసంఖ్య పెరిగినను పురుషుల సంఖ్యలో వారి మొత్తము ఇప్పటివలెనే యుండును. ఎసంబ్లీలో స్త్రీలు సభ్యురాండ్రగుటకు స్థానములు ప్రత్యేకింపబడును. ఫెడరలుఎసంబ్లీకి చాలమంది స్త్రీలు ఓటర్లయి యుండుట ముఖ్యమని ప్రభుత్వమువారు భావించుచున్నను చాలమార మాలోచించి వారిసంఖ్యను వృద్ధిచేయుటచే తత్సందర్భములో ఏర్పాటులు జరుపుట కుండు చిక్కులను బట్టియు, ఒక విద్యావిషయకమైన యర్హతను నిర్ణయించినప్పుడే స్త్రీ లెక్కువమంది యర్హత పొందుటకు వీలు కలుగును గాని, అట్లు భిన్నమైన యర్హతను పాటింపకూడదను ఆక్షేపణను బట్టియు, దానిని విరమింప వలసి వచ్చెను వర్తకసంఘములు, కార్మిక సంఘములు మున్నగువానికి స్థానములు లభించుటకు ఎన్నికవర్గము లుండును

IV-వ అనుబంధములో ఎన్నిక యర్హతల వివరము లున్నవి వోటరుల జాబితా తయారగువరకు సామాన్యముగ నా యర్హతలను తెలుపుటకు వీలుకాదు. దానిని తయారుచేయుటకు మొదలుపెట్టినప్పుడు వివరములలో చేయవలసిన మార్పులు కనిపించును ఫెడరలు శాసనసభకు మొత్తపు జనసంఖ్యలో నూటికి 2, 3 వంతుల మధ్య ఎన్నికదారులుండునట్లు చేయుట కుద్దేశింపబడినది. మొత్తము మీద ఎన్నికదారుల సంఖ్య 70, 80 లక్షలమంది మధ్య నుండవచ్చును.

## మంత్రులకు గవర్నరుజనరలునకు సంబంధము

ప్రభుత్వశాఖలను గవర్నరుజనరలు గారు, సొంత బాధ్యతమీద నిర్వహింపవలసి యున్నను, ప్రత్యక్షముగ చూచినప్పుడు తక్కిన

ప్రభుత్వకార్యములకు సంబంధము లేకుండ వ్యవహరించుట సాధ్యమై యున్నను అట్టిది భావ్యముగ నుండదు. కావున మంత్రులకును, తన కార్యనిర్వాహకులకును సంబంధమును మైత్రియు బలపడునట్లుచేయుట ప్రాజ్ఞుడగు గవర్నరుజనరలునకు విధాయకమైయుండును వారిలో నొకరిమాట యొకరికి అతకకపోవునట్లుగాక అందరు కలిసి సంప్రదించి ఏకముఖముగ పనిని నిర్వహించునట్లు చేయవలయును ఈస్థితి చేకూరుటకు కావలసిన నియమములను అధికార నిర్వచన పత్రమునందు వెల్లడింపగలరు అందులో దీనికి కావలసిన మార్గమును సూచింతురు. అందరు నొకరితో నొకరు సంప్రదించి పనిచేయవలె నని యుండును సైనికవ్యయమును నిర్ణయించుటలో మంత్రులయభిప్రాయములను వారు కనుగొని వానిని యోచించి మరియు నిర్ధారణ చేయవలయును. దేశరక్షణమునకు ఒక బ్రిటిషువారి బాధ్యతకంటె భారత ప్రజల బాధ్యతయే యెక్కువగ నుండుునని దానిలో నుదాహరింతురు వారిట్లు మంత్రులతో ప్రభుత్వశాఖల వ్యవహారములో సంప్రదించినను కాని విషయమై నిర్ణయించునప్పుడు బాధ్యత నంతను గవర్నరుజనరలుగారే వహింప వలయును.

## గవర్నరుజనరలు ప్రత్యేక బాధ్యత

ప్రభుత్వశాఖలుగాక ఇతర వ్యవహారములలో మంత్రుల సలహాను పొందవలయు నని కూడ నుండుటచే గవర్నరుజనరలు ప్రత్యేక బాధ్యత విషయమై భిన్నసందర్భముండును వారి ప్రత్యేకాధికారమునకు భంగము రానంతవరకును వారు మంత్రుల సలహాను పాటింపవచ్చును. ఆ ప్రయోజనము నెరవేరనప్పుడు వారు తమ విచక్షణనుచూపి సొంత బాధ్యతను వహించి అది కొనసాగునట్లు చూడవలయును ప్రభుత్వచట్టములో పేర్కొనిన ప్రత్యేకబాధ్యతను నిర్వహించునప్పుడిట్లు వారు చేయవలయును అధికార నిర్వచన పత్రమునందు దానికి సంబంధించిన ఉత్తరవులుండును వారు దాని ప్రకార మనుసరించుచుండవలయును. ఇందువలన ప్రభుత్వచట్టమునకుతోడు అధికారనిర్వచన పత్రమును ముఖ్యమైనదిగ నుండును వీనిలో మార్పులు చేయుటకుగాని క్రొత్తవి చేర్చుటకుగాని పార్లమెంటులో వీలు కలిగించెదరు

వారి కుండవలసిన ప్రత్యేక బాధ్యత క్రిందివిషయములలో నుండును దేశశాంతికి భంగమురాకుండ కాపాడవలయును దేశపరపతికి భంగము కలుగనియ్యకూడదు మైనారిటీల న్యాయమైన హక్కులను కాపాడవలయును చట్టమునందు గల ఉద్యోగుల హక్కులను లాభములను కాపాడవలయును సంస్థానముల హక్కులు రక్షింపవలయును వర్తకవిచక్షణ జరుగకుండ కట్టుదిట్టము చేయవలయును. ప్రభుత్వశాఖల పరిపాలనమునకు భంగముకలుగకుండ చేయవలయును. ఈ సందర్భములో గవర్నరుజనరలుగారు ప్రత్యేకబాధ్యత వహించవలయునని ప్రభుత్వచట్టములో కలదు

పైని సూచించిన విషయములందలి ప్రయోజనములు తెలియజెప్పుటకు ముందు గవర్నరుజనరలుకు ఇయ్యదలచిన ప్రత్యేకబాధ్యతల విషయమై కొంత చెప్పవలయును దీని విషయమై గవర్నరుజనరలు కలిగించుకొనవలసిన యవసరము లేనంతవరకు మంత్రులపరమందున్న శాఖలపనుల నిర్వహణమునందు వారి బాధ్యత సంపూర్ణముగ నుండును. వారి శాఖలందు తమ యుత్తరువులవలన మైనారిటీల క్షేమమునకు ఎట్టి భంగము కలుగకుండ చూచుట మంత్రులబాధ్యతగాని గవర్నరుజనరలుబాధ్యత కానేరదు ఒకవేళ వారిక్షేమమునకు ఒక యుత్తరువు భంగకరముగ నుండునని గవర్నరుజనరలు గారికి తోచుచో వారు మంత్రుల సలహాను పాటించుటలేదని చెప్పవలయును ప్రత్యేకబాధ్యతను వారికిచ్చినయుద్దేశ మిదియే. ఇట్టి యధికారము వారికున్నది గదాయని నిరంతరము వారు మంత్రుల సలహాలను నిరాకరింపకూడదు రాజ్యాంగమును కొనసాగింపదలచినవారందరు కలిసి ఏకముఖముగా పనిచేసి కార్యనిర్వహణమునందు ఐకమత్యముతో పాలనసమస్యలను తిలకించుచు ఉభయులు పాలన సౌలభ్యమునకై సాహచర్యముతో కృషిచేయగలరను నమ్మకముతో ఇవి ఉద్దేశింపబడినవి నిత్యకృత్యములందు గవర్నరుజనరలు ప్రత్యేకాధికారములు వినియోగింపవలసిన వ్యవహారములు కలిగినను వారొకరితో నొకరు సంప్రదించుకొని ఏకీభావము ఒడంబడిక పొందుటవలన వారు దానిని వినియోగింపవలసిన యవసరము లేకుండ పోవును.

పైని వివరించిన ఒకటి, మూడు, నాలుగు, అంశములు ప్రభుత్వము వారిదివర కవలంబించిన కార్యనీతిని గురించి ప్రకటించుచువచ్చిన విషయములకు సంబంధించి యున్నవి. దేశరక్షణ విషయమై గవర్నరుజనరలుగారు సొంత బాధ్యత వహించి వ్యవహరింపవలసి యుండును. మరియొక శాఖలో మంత్రి యవలంబించిన కార్యములు గవర్నరుగారు నెరవేర్చవలసిన కార్యవిధానమునకు భంగకరమై యుండినప్పుడు, అట్టిది రాకుండ చేయుటకై గవర్నరుజనరలుగారు తమ ప్రత్యేక బాధ్యతను వినియోగింప వలసివచ్చును

అయిదవ యంశమును యోచించినప్పుడు ఫెడరలు ప్రభుత్వ కార్యములందు సంస్థానమునకు సంబంధించినంతవరకు గవర్నరుజనరలుగారికి ప్రత్యేకాధికారము లిచ్చుతలంపు లేదు. సంస్థానములు ఫెడరేషనులో చేరునప్పుడు అవి యేర్పరుచుకొను షరతులపై వాని యధికారములను ఫెడరలు ప్రభుత్వమునకు సంక్రమింపజేయును ఆ యధికారములను బట్టి ప్రభుత్వచట్టముప్రకారము వ్యవహారములు జరుగును సార్వభౌమునకును సంస్థానములకును ప్రత్యక్షముగ నుండవలసిన సంబంధమునకును ఇది వర్తింపదు. చట్టములో నుదాహరింపబడని విషయములకే ఇది వర్తించును ఫెడరలుప్రభుత్వసంబంధముతో కాకుండ గవర్నరుజనరలు స్వతంత్రముగ రాజప్రతినిధి చలా

యుంపవలసిన యధికారమునకు సంబంధించినదై యుండును. కాని సంస్థానములకు సంబంధింపక బ్రిటిషు ఇండియాకే సంబంధముగల కొన్ని యంశములు తన యధికారములను ఒప్పగింపని సంస్థానపు ప్రజలహక్కులకు భంగకరమైనవై యుండినప్పుడు గవర్నరుజనరలు గారు కలిగించుకొందురు ఒక రాష్ట్రములో నుదయించు కొన్ని సందర్భములు దాని సమీపమునందలి సంస్థానమునకు భంగకరమైనవిగ పరిణమింపవచ్చును. అట్టిస్థితిలో సంస్థానములకును సార్వభౌమునకును జరిగిన ఒడంబడికలుబట్టి వారి హక్కులు కాపాడుటకు వాని విషయమై చర్య తీసికొనవలసిన యవసరము కలుగును.

29. కొందరి కనుకూలముగను, మరికొందరికి ప్రతికూలముగను నుండగలవని తనకు దోచెడి ప్రతిపాదనల విషయములో తగు చర్యను గైకొనుటకు గవర్నరుజనరలునకు శక్తి నొసంగుటకే (VI) యారవ యంశ ముద్దేశింపబడినది శాసనములపూర్వకముగా వ్యత్యాసము కలుగు విషయములో, ప్రభుత్వమువారి యుద్దేశ్యముల వివరించెడి ప్రకరణములో 122,24 పేరాలలో, వివరములతోగూడిన ప్రతిపాదనలను గాననగును. సమాఖ్యయందుగాని, రాష్ట్రములయందుగాని పైప్రతిపాదనలకు విరుద్ధముగ నుండగలశాసనములు చెల్లనేరవు. న్యాయస్థానములం దట్టిశాసనములు చెల్లనేరవని యభియోగముల గొని తెచ్చుటకు వీలుండును. పరిపాలనవిషయములో వ్యత్యాసములను కలిగింపగలవని తోచెను. మంత్రుల సలహాలను త్రోసిపుచ్చి, తద్వ్యతిరేకముగ చర్య గైకొనుటకు, గవర్నరుజనరలునకుగాని, గవర్నరుకుగాని యధికార ముండగలదు తనకు సందేహాస్పద మగు నేచట్టమునైనను నిలిపెపెట్టుటకు గవర్నరుజనరలున కధికారముండును.

30 ప్రత్యేకబాధ్యతలనుగూర్చిన పట్టికలలో రెండవ యంశమునుగూర్చి వివరముగ పేర్కొననగును. ఏలయన, "ధనవిషయకమగు సంరక్షణలు" అను పేరుతో నిపుడు వ్యవహరింపబడెడి సమస్య యంతకును నిది సంబంధించియున్నది. ఈ బాధ్యతను నిర్వర్తించుట కొరకై గవర్నరుజనరలున కొసంగబడిన యధికారములకును, రిజర్వు బ్యాంకును గూర్చి యీ క్రింద నుడువబడిన యంశములకును లోబడి యుండు విధమున నొక్క రిజర్వుడు శాఖలో చేర్చబడిన విషయములలో తప్ప తదితర విషయములందువలెనే సమాఖ్య (ఫెడరేషన్) యొక్క ధనప్రతిపత్తి (ఫైనాన్సు) కూడ మంత్రికే వశపరుప నుద్దేశింప బడియున్నది. గవర్నరుజనరలుయొక్క ప్రత్యేకాధికారములను వినియోగింప నవసర మేర్పడినతప్ప, నవసరమగు నాదాయముల నేర్పరచుట కుపకరింపగల సాధనములు, మంత్రులు బాధ్యత వహింపగల విషయములలో ఖర్చు వివరములను స్థిరపరచుట, విదేశములందును దేశమునందును ఋణములనుజేయుట మున్నగు విషయములలో నొక నిర్ణయమునకువచ్చు బాధ్యత మంత్రులకుతప్ప మరెవరికిని చెందనేరదు.

ఋణములను దీర్చుట, గవర్నరుజనరలుయొక్క జీతము, ఫెడరలు న్యాయస్థానమునందలి న్యాయమూర్తులయొక్క జీతములు, పెన్షనులు మున్నగు బాధ్యతలను నిర్వర్తించుటకు వలయుధనము ఫెడరేషనుసమాఖ్యయొక్క యాదాయమునుండి తప్పక యొసంగబడ వలయును ఇతరఖర్చువిషయములో ప్రతిసంవత్సరము ధనము మంజూరు చేయబడును కాని ఖర్చునందలి కొన్ని యంశములు, ముఖ్యముగ రిజర్వుడుశాఖలకగు వ్యయము శాసనసభవారి యామోదమును బడయ నవసరముండబోదు (ఈ యంశములనుగూర్చిన సంపూర్ణ పట్టికకు, "ప్రభుతోద్దేశ్యము" లందలి 49 వ పేరా జూచునది)

31 "ఫెడరేషనుయొక్క పరపతిని, ధనవిషయక స్థైర్యమును, కాపాడుటకొరకు" అను గవర్నరుజనరలుయొక్క ప్రత్యేక బాధ్యతకుగల యుద్దేశ్యము యీ క్రింద వివరింపబడినది.—ప్రపంచ మందలి దనవిషయకములగు మార్కెట్టులలో ఇండియాదేశముయొక్క పరపతికి హానిని కలిగించుటవలన, ప్రత్యక్షముగనో, పరోక్షముగనో ఫెడరేషనుయొక్క బాధ్యతలలో వేనికొరకైనను గాని, గవర్నరు జనరలుయొక్క రిజర్వుడుశాఖల యవసరములకొరకు గాని వలయు సాధనసంపత్తి నేర్పరుచుట కెక్కుడగు ప్రతిబంధకమును గవర్నరు జనరలుయొక్క యభిప్రాయములో ఆయవ్యయనిర్ణయము ఋణములు చేయుట మున్నగు విషయములలో తమ మంత్రియొక్క విధానము కలిగించుటవలన నేర్పడిన యవసరములో గవర్నరు జనరలునకు జోక్యము కలిగించుకొన నధికారము నొసంగుటయే యాయుద్దేశ్యము, మంత్రియొక్క బాధ్యతకు గల విస్తీర్ణమును తగ్గించుటకుగాక, కొన్ని సందర్భములలో స్థైర్యమునకు విపత్తును కలిగించి, గవర్నరు జనరలుయొక్క యధికారములను వినియోగించుట కవసరమును కలిగింపగల ధనవిషయకమగు చర్యలు మున్నగువానిని సవివరముగ పేర్కొనుట కష్టమగుటవలననే, యీ ప్రత్యేక బాధ్యతయొక్క నిర్వచన మొక మోస్తరుగ విశాలార్థముగల పదజాలముతో గావింపవలసియున్నది. ఈ ప్రత్యేకబాధ్యతను నిర్వర్తించుటలో గవర్నరు జనరలునకు సాహాయ్యము లభింపగలందులకై పరిపాలనాధికారము లేని విషయిక సలహాదారు నొకని నియమించుట కతని కధికార మొసంగబడును. మంత్రికికూడ నీయధికారియొక్క సాహాయ్యము లభింపగలదు.

ఇపు డింకను చెల్లింపబడకయున్న ఇండియా స్టెర్లింగు ఋణములయొక్క "ట్రస్టీ" స్వభావ మింక ముందును నుండగల దనియు, భావికాలపు ఫెడరల్ స్టెర్లింగు ఋణములకుకూడ నీ స్వభావము వర్తింపగలదనియు, ప్రభుతోద్దేశ్యముల ప్రకరణము నందలి 147 పేరాలో చెప్పబడియున్నది.

32. మొదటి ఫెడరలు మంత్రివర్గము ఏర్పడుటకు ముందుగా రాజకీయపక్షముల పలుకుబడికి లోబడని రిజర్వు బ్యాంకును భారత

శాసనసభవారు నిర్మాణము చేయవలెను అది సరిగా పనిచేయుచుండవలెను. ఆ బ్యాంకుకు నాణెములు మారకములపై అధికార మీయబడును. అంతవరకును ఫెడరలు ఆర్థికములు ఫెడరేషనుకు వశపరుపబడవు.

సరియైన పద్ధతులపై రిజర్వుబ్యాంకును సాధ్యమైనంతత్వరలో ఏర్పరచుటకు ఇండియా బ్రిటను దొరతనములవారు గట్టిప్రయత్నములను చేయుచున్నారు. కాని యిది సరిగా నెరవేరుటకు ప్రపంచ-ఆర్థికస్థితి బాగుపడవలసి యున్నది

"ఇండియా ఆదాయవ్యయములు అనుకూలస్థితిలో నుండవలెను ఇపుడు ఇండియాదొరతనమువారు లండనులోను, ఇండియాలోను తీర్చవలసిన తక్కువ వాయిదా ఋణపుమొత్తములో అధికభాగము తీర్చివేయబడవలెను నిలువధన మధికముగా చేరవలెను ఇండియా దేశపు ఎగుమతులు వెనుకటిస్థితికి రావలెను" అని మూడవ రౌండు టేబిలుసభవారు నిర్ణయించియున్నారు

రిజర్వుబ్యాంకు నేర్పరచుటకు తక్కిన సౌకర్యములన్నియు సమకూరినను, ఆ బ్యాంకునేర్పర్చుటకు వీలులేక పోయినప్పడును, క్రొత్త ఫెడరలు ప్రభుత్వమునకును, రాష్ట్రీయ-దొరతనములకును తగిన ఆర్థికస్థితిని కలిగించుటకు ప్రపంచపరిస్థితులనుబట్టి మరల ఆలోచించవలసియుండును. నిజముగా నట్టి దుస్థితి కలిగినయెడల బ్రిటను దొరతనమువారు భారత ప్రతినిధులను రావించి వారితో సంప్రదించెదరు.

33 రిజర్వు శాఖలు వాటికి సంబంధించని యితర శాఖలలో గవర్నరు జనరలుకు ప్రత్యేకబాధ్యతలు వీటిలో మాత్రమే గాక మంత్రుల సలహాను గవర్నరు జనరలు వినవలసిన అవసరము లేనట్టి శాఖలు మరికొన్నిగూడ గలవు వీటి విషయమున గవర్నరు జనరలుకు కొన్ని ప్రత్యేకాధికారము లీయబడును వాటిని వీరు తమ యిష్టానుసారము వినియోగించుదురు చట్టమును వ్రాయుట పూర్తియగువరకును ఆ అధికారముల పరిమితిని సరిగా నిర్ణయించుటకు వీలులేదు. గాని యీ దిగువ అంశములు వాటిలో చేరునని బ్రిటను దొరతనమువారూహించుచున్నారు

(1) శాసనసభలను పిలుచుట, ముగించుట (2) బిల్లుల నుపపాదించుటకు అనుమతి నిచ్చుట, లేక నిల్వయుంచుట. (3) కొన్ని విధములగు శాసనముల నుపపాదించుటకు ముందుగా అనుమతి నిచ్చుట (4) అత్యవసర పరిస్థితులు కలిగినప్పుడు చట్టముప్రకారము నిర్ణయింపబడినకాలము నిల్వయుంచునెడల చాలప్రమాదము కలుగునని తోచినప్పుడు అంతవరకు ఆగకుండ రెండు ఫెడరలుసభల సమిష్టి సమావేశమును సమావేశ పఱచుట

## శాసనసభలకు గవర్నరుజనరలునకు గల సంబంధము

34 గవర్నరుజనరలు తన బాధ్యతలను నిర్వహించుటకు కొన్ని ప్రత్యేకాధికారములు అవసరము గావున యీ దిగువ అధికారములు ఇదివరకు దెలిపిన వాటికి చేర్చవలెను

(ఇ) శాసనసభలలో ఓటుచేసినదానికి విరుద్ధముగ ప్రవర్తింపవచ్చును. దీని వివరములు ముందు దెలుపబడును.

(ఎఫ్) శాసనసభలందు చర్చలను ఆపుచేయవచ్చును. వివరములు దిగువ దెలుపబడును.

(జి) తన అధికారములను బాధ్యతలను సరిగ అమలుజరుపుటకు అవసరమగు మార్పులను శాసనసభాకార్యనిర్వహణ నిబంధనలయందు చేయువచ్చును.

35 గవర్నరు జనరలుగారికి మంత్రులకు గల సంబంధమును మాత్రము నిర్ణయించిన చాలదు. అనగా కార్యనిర్వాహక సభ్యుల చర్చలు జరుపువిధానముగూర్చిగల అధికారమును మాత్రము సూచించిన చాలదు రిజర్వుశాఖలకు సంబంధించిన బాధ్యతగాని పైన దెలిపినట్టి ప్రత్యేకబాధ్యతగాని నిర్వహించుటకు సామాన్యముగ శాసనసభలు అంగీకరించిన విషయములందేకాక అంగీకరింపని విషయములందు గూడ గవర్నరుజనరలు స్వతంత్రముగ చర్యగైకొనుటకు ప్రత్యేకాధికార ముండవలెను ఈ బాధ్యతల నిర్వహణమునకు అవసరమని తోచినపుడు గవర్నరుజనరలు తన మంత్రుల సలహాకు విరుద్ధముగను శాసనసభా తీర్మానమునకు విరుద్ధముగనుగూడ చర్యగైకొనవచ్చును. శాసనసభలో గావింపబడిన చట్టములకుసంబంధించిన విషయములందును ద్రవ్యమునకు సంబంధించిన విషయములందుగూడ గవర్నరు జనరలునకు ఈ అధికారముండును.

36 ఒకప్రత్యేకవిషయ నిర్ణయమునందు బాధ్యత మంత్రులపై నుండునా, శాసనసభలయందుండునా అను విషయమున సందేహముండరాదు అనగా, గవర్నరుజనరలుగారి కొసంగబడు ప్రత్యేకాధికారములను వారు నిర్వహించునపుడు వాటి ఫలితములకు పూర్తిగా వారే జవాబుదారిగా నుండవలెనని స్పష్టముగ సూచింపవలెను. గవర్నరు జనరలు తనబాధ్యత నిర్వహించుటకు అవసరమని తలంచు ఒక చట్టమునకు మంత్రు లంగీకరింపనపుడుగాని, మంత్రులు బాధ్యత వహించు చట్టమునకు శాసనసభ అంగీకరింపనపుడుగాని, మంత్రులు గవర్నరుజనరలు కలసి అవసరమని తలంచు చట్టముయొక్క ఉద్దేశములకు విరుద్ధముగ శాసనసభలు మార్చినపుడుగాని గవర్నరుజనరలుగారు ఈ ప్రత్యేకాధికారములను అమలు జరుపవచ్చును

37. పై జెప్పిన రెండు విపరీత సందర్భములలోను కట్టుదిట్టము చేయదలంచిన ముఖ్యమైన అధికారమొకటి కలదు. గవర్నరుజనరలు

తానే బాధ్యత వహించి ఒక చట్టమును శాసనసభలో ప్రతిపాదించినపుడు తన మంత్రులుగాని, శాసనసభ్యులుగాని అట్టిచట్టముల కంగీకరింపనియెడల శాసనసభవారి తీర్మానము సభానిర్ణయ మయినంతమాత్రమున చట్టపూర్వకముగ అమలులోనికి రాజాలదు గవర్నరుయొక్క చట్టమునకు మంత్రులు అంగీకరింపవలసిన యగత్యముగాని సమాధానపడవలసిన యగత్యముగాని కల్పించుట భావ్యముగాదు. మంత్రులు శాసనసభ్యులకు జవాబుదారులు గనుక శాసనసభ్యులకు సమాధానము చెప్పవలసి యుందురు శాసనసభ్యులు తమ నియోజకవర్గములకు సమాధానము చెప్పవలసి యుందురు కనుక మంత్రులు గవర్నరు జనరలుయొక్క అభిప్రాయ నిర్ణయమునకు అంగీకరించి గవర్నరు జనరలుతో సమాధానపడవలసిన యగత్యము ఉండకూడదు కాని గవర్నరుజనరలు తాను సుంతబాధ్యత వహించి ప్రతిపాదించిన చిత్తుచట్టమును సభ్యు లేరీతిగా ఎంతవరకు ఆమోదించ గలరో పరీక్షించుటకు గవర్నరుజనరలు శాసనసభలో దానిని ప్రతిపాదించి పరీక్షించును ప్రతిపాదించి పిమ్మట అధికసంఖ్యాకులచే ఆమోదింపబడినచో గవర్నరుజనరలు ప్రజాపక్షాభిమానమును పొందినవాడగును అల్పసంఖ్యాకులే శాసనసభలో దానిని ఆమోదించినయెడల, అంతవరకైనను తనకు ప్రజానాయకులు ఆమోదించినారను సంగతిని గ్రహింపగల్గును.

అంతట తానే సొంతబాధ్యతవహించి ఆచిత్తుచట్టమును అమలుపరచును అయితే ఈరీతిగా సభలో ప్రతిపాదించవలసిన అవసరము లేకుండా గవర్నరుజనరలు ఆర్డినెన్సు రూపముగా అట్టి చట్టములను ఏల అమలుపరచరాదని అడుగవచ్చును కాని ప్రజాభిప్రాయమును గవర్నరు జనరలు తెలిసికొనగోరిన యెడల ఆర్డినెన్సులను జారీచేయజాలడు. శాసనసభలో ప్రతిపాదింపబడిన యనంతరము సభలో ఓడిపోయిన బిల్లులను గవర్నరుజనరలు తన సొంతబాధ్యత ననుసరించి అమలుపరచేయెడల అట్టి చట్టములు "గవర్నరు జనరలు చట్టములు" అని పిలువబడును రెండు కేంద్రసభలవారిచే ఆమోదింపబడి అమలుపరచబడిన చట్టములకు ఇవి భిన్నములు

38. ఖజానాశాఖామంత్రి తన సహచరులతోను, గవర్నరు జనరలుతోను సంప్రదించి బడ్జెటును తయారుచేయును. రిజర్వు శాఖలకును స్వదేశసంస్థానముల విషయములో ఇండియా ప్రభుత్వము వారు నిర్వర్తించవలసిన వ్యవహారవిధులకు వలయు ద్రవ్యమొత్తముల కన్నింటికిని గవర్నరుజనరలుగారే స్వతంత్రబాధ్యత వహించి జవాబుదారులై యుందురు కాని అట్టి మొత్తములు నిర్ణయించుటలో గవర్నరుజనరలుగారికి జారీచేయబడు యాదాస్తుల ననుసరించి తమ మంత్రివర్గముతో ముందుగ తప్పక సంప్రదించవలయును దేశసంరక్షణ సైనికపుఖర్చు విషయములో గవర్నరుజనరలుగారు తమ మంత్రులతో తప్పక సంప్రదింపగలరు. రిజర్వుడుశాఖలు కానట్టి తదితరశాఖల కన్నింటికి సంబంధించిన ఖర్చు మొత్తముల కన్నింటికి మంత్రులే జవాబుదారులై యుందురు కాని పన్నులువగయిరా విధించి రివెన్యూ వసూలు చేసే విషయములలోను ఆయా రివిన్యూలను వేరువేరు ప్రభుత్వములకు విభజించే విషయములోను చేయబడు ప్రతిపాదనలన్నియు ప్రభుత్వమువారు సార్వభౌముని ప్రతినిధులై అట్టి ప్రతిపాదనలను చేయగలరు మంత్రులు నిర్ణయించిన ఖర్చుమొత్తములు చాలవనియు, ఆ మొత్తములతో గవర్నరుజనరలు తన ప్రత్యేకాధికారములను చలాయింప జాలడనియు గవర్నరుజనరలునకు తోచినయెడల, గవర్నరుజనరలు ఆ యాపద్దులక్రింద హెచ్చుగ తాను కోరెడిమొత్తములను వేరొక షెడ్యూలుగ బడ్జెటునకు అనుబంధించవచ్చును గవర్నరు జనరలుగారు కోరెడి హెచ్చుమొత్తములనుగూర్చి శాసనసభ్యులు తమ సమ్మతినిగాని అసమ్మతినిగాని తెలియజేయుచు ఓటుచేయుటకు శాసనసభ్యులకు అధికారముండదు పర్యవసానమేమనగా మంత్రులచే నిర్ణయింపబడిన ఖర్చుమొత్తములకు మాత్రమే శాసనసభ్యులు తమ ఓట్లనిచ్చుటకు అధికారులయి యుందురు

39 శాసనసభ ఆదాయవ్యయపట్టికను పూర్తిగా చర్చించి, దాని వోటుకై నివేదింపబడిన మొత్తములను వోటుచేసిన తరువాత గవర్నరుజనరలు ఈ మొత్తములను అంగీకరించినట్లు సంతకము చేయవలెను. వోటుకు పెట్టదగని వానిని మంజూరు చేయునప్పుడు తాను మంజూరుచేయు పత్రమునందు, బడ్జెట్టు ప్రకటనలో తాను మొదట చేర్చి తనమంత్రులు ఆశీర్షికలక్రింద కోరిన మొత్తములకంటె హెచ్చు మొత్తములనుగూడ చేర్చవచ్చును అవసరమని తోచినచో వానిని తగ్గించవచ్చును శాసనసభవారు అంగీకరించిన మొత్తములను ఆయన తిరిగి అంగీకరింపవలసియుండును. ఇట్లుచేయుటలో తన ప్రత్యేకబాధ్యతలను నెరవేర్చుటకు అవసరమని తలచినచో, శాసనసభవారికి నివేదింపబడిన గ్రాంటును తత్సభవారెంత తగ్గించియుందురో అంతకు హెచ్చుగాని మొత్తమును ఆయన తన అంగీకార పత్రమునందు చేర్చనధికారము కలిగియుండును ఈపద్ధతివలన మంత్రివర్గమువారును, శాసనసభవారునుగూడ డబ్బు మంజూరు చేయుటయందు తమ తమ బాధ్యతలను సరిగా నిర్వహింప నవకాశముండును తమకు ఎంత బాధ్యతకలదో అంతబాధ్యతనుమాత్రమే మంత్రులు నిర్వహింపగలుగుటకును, అంతకంటె హెచ్చు బాధ్యత పెట్టుకొనకుండుటకును ఇది తోడ్పడును శాసనసభవారుగూడ మంత్రులతో తమ సమ్మతిగాని, అసమ్మతిగాని తెలుపుటకు హక్కు గలిగియుందురు. గవర్నరు జనరలు తనమంత్రులతోగాని, శాసనసభవారితోగాని భేదించినచో తన యిష్టప్రకారము ద్రవ్యము పుచ్చుకొనుటకును అవసరమైనచో తనకు ప్రత్యేకముగా గల శాసనాధికారములద్వారా సాంవత్సరిక-ఆర్థికశాసనమునందు తనకు కావలసిన ద్రవ్యముండునట్లు చేర్చుటకును అధికారముండును.



1. యస్. వెంకటనరసుశాస్త్రిగార్లు; 2. ఒలింపిక్ పందెములలో ఆరుమైళ్ల పరుగు పందెమున గెలుపొందిన యం. షణ్ముఖంగారు; 3. ప్రపంచవీరుల ముష్టియుద్ధము; 4. ఒలింపిక స్త్రీల పోటీయందు ఇంగ్లండు తరఫున పోటీచేసిన హాల్ స్ప్రైడుకన్య.

గవర్నరుజనరలు అంగీకారము కావలెనను పద్ధతి రెండుకారణములకై యేర్పరుపబడినది.

1. శాసనబద్ధములైన యేపద్ధతులపై ద్రవ్యము మంజూరు చేయబడినను, ఆడిట్ చేయు అధికారము, అనగా లెక్కలు తనిఖీచేయువారు ఒక్క పత్రమును మాత్రమే అంగీకరింప వీలుకలుగుటకు,

2 శాసనసభవారికి తెలియకుండా గవర్నరుజనరలు యేడబ్బును గైకొనకుండుటకు

## ఆర్డినెన్సులు చేయు అధికారము

40 ఇదిగాక శాసనసభ జరుగుచున్నప్పుడుగాని, జరుగనప్పుడుగాని అవసరము కలిగినచో తత్క్షణము అమలు చేయబడదగిన శాసనాధికారమును గవర్నరుజనరలు ఇచ్చుట యవసరమై యుండును. కావున ఇప్పుడు ఆర్డినెన్సుల జేయుటకు గవర్నరుజనరలుకు యే యధికారము లుండునో ఆ యధికారములనే గవర్నరుజనరలుకు ఈయదలచుచున్నాము రిజర్వుడు డిపార్టుమెంటు విషయమై తన బాధ్యతలను తన ప్రత్యేక బాధ్యతలను నిర్వహించుటకు గవర్నరుజనరలుకు గల ఆర్డినెన్సు చేయు నధికారము గాక మంత్రి సహితుడైన గవర్నరుకు ఇట్టి యధికారము లుండవలెనని గూడ తలంపబడుచున్నది శాసనసభ జరుగనప్పుడు కలుగు అవసరములకు మాత్రమే మంత్రిసహితుడైన గవర్నరుజనరలు ఆర్డినెన్సు చేయు నధికారము కలిగియుండును తిరిగి సమావేశమైనప్పుడు శాసనసభవారు రద్దుచేసిన తప్ప యిట్లు చేయబడిన ఆర్డినెన్సులు నిర్ణీతకాలమువరకు మాత్రమే అమలులో నుండును.

41. ఒక రిజర్వుడు డిపార్టుమెంటు విషయమై గాని, 119 పేరాలో తెలుపబడిన యింక కొన్ని విషయములనుగూర్చి గాని శాసనములు చేయదలచినచో గవర్నరు ముందుగా అంగీకరింపవలెను.

42. ఈసూచనల ఫలితములు చాల స్పష్టముగా చెప్పుట యుచితము శాసనసభవారి యంగీకారము లేకుండ శాసనములు చేయుటకు గవర్నరుజనరలుకు గల యధికారములు, ఆయన బాధ్యతలవలన గలిగినవియు, ఆ బాధ్యతలను నిర్వర్తించుటకు నిర్వహింపబడినవియు నగుచున్నవి రాజ్యాంగ విధానము ద్వారా గవర్నరుజనరలు నిర్వహింపవలసిన బాధ్యతలు రెండువిధములుగా నుండగలవు. (1) రిజర్వుడు డిపార్టుమెంట్లు పరిపాలించుటకు ప్రత్యేకబాధ్యత (2) రిజర్వుడు డిపార్టుమెంట్లు కాని డిపార్టుమెంట్ల విషయమై కొన్ని నిర్ణీత-ఉద్దేశ్యములకుగాను కల్పింపబడిన ప్రత్యేక బాధ్యత.

రిజర్వుడు డిపార్టుమెంట్ల పరిపాలన విషయమై మంత్రులు సలహా నిచ్చుటకు వీలులేదు. గవర్నరుజనరలు స్వయముగా పరిపాలింపదగిన శాఖల విషయమైగూడ వారు సలహానివ్వ నధికారము గలిగియుండరు తక్కిన విషయము లన్నిటిలోను మంత్రులు సలహా నివ్వదగియుందురు. ఈ సలహా రిజర్వు డిపార్టుమెంటు విషయమై తనకు గల బాధ్యతకు విరుద్ధముగా నుండదని గవర్నరు జనరలు తలచువో నంగీకరింపవచ్చును ఒక రిజర్వుడుశాఖ పరిపాలించునప్పుడుగాని, తన ప్రత్యేకబాధ్యత నిర్వహించునప్పుడు గాని, ముఖ్యవిషయములలో శాసనసభ తన యుద్దేశ్యములను నెరవేర్చలేదని గాని, తాను కోరిన డబ్బును మంజూరు చేయలేదనిగాని గవర్నరుకు తోచినచో, తనకుగల యధికారముల ద్వారా వానిని సరిచేసికొనవచ్చును గవర్నరుజనరలు నిర్ణయించువానికి మంత్రులు బాధ్యత వహింపరు

43 గవర్నరుగాని, గవర్నరుజనరలుగాని మంత్రుల సలహా లేకుండ చేసిన విషయములలో వారు బ్రిటిష్ ప్రభుత్వమునకును, పార్లమెంటుకును బాధ్యత వహింతురు రాజ్యాంగవిధానము ఈ విషయమును స్పష్టము చేయవలెను. గవర్నరు విషయములలో బాధ్యత గవర్నరుజనరలుకు గూడ నుండక తప్పదు

44 రాజ్యాంగయంత్రము స్తంభించిపోయినప్పుడు ఈ సూచనలు వర్తింపవు ఒకరాష్ట్రములోగాని, ఫెడరేషనులో గాని, యిట్టి స్తంభనలు జరుగువో వానిని దాటుటకును, సరియైన పరిస్థితుల నేర్పరుచుటకును, రాజుగారి పరిపాలనమును కొనసాగించుటకును గవర్నరుజనరలుకు అధికార మివ్వబడును

# గవర్నరుల రాష్ట్రము

## కార్యనిర్వాహక వర్గము

45. మద్రాసు, బొంబాయి, బెంగాలు, సంయుక్తరాష్ట్రములు, పంజాబు, బీహారు, మధ్యరాష్ట్రములు, ఆసాము, పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రము, సింధు, ఒరిస్సా యను 11 రాష్ట్రములు స్వతంత్ర రాష్ట్రములుగా నుండును ఈ రాష్ట్రము లన్నియు రాజుగారి ప్రతినిధియగు గవర్నరుచే పరిపాలింపబడును. వీరికి సలహాదారులుగ రాష్ట్రముయొక్క శాసనసభవారికి బాధ్యులైన మంత్రు లుందురు. గవర్నరు స్వయముగా తన యిష్టప్రకారము పరిపాలింపదగిన శాఖలలో తప్ప తక్కినశాఖ లన్నిటియందును మంత్రులు సలహా నివ్వదగియుందురు. తన ప్రత్యేకబాధ్యతలకు విరుద్ధముగునని తలచినప్పుడు తప్ప తక్కిన అన్నిసందర్భములలోను గవర్నరు వారిసలహా ననుసరించుచుండును తన ప్రత్యేకబాధ్యతకు సలహా విరుద్ధమని తోచినప్పుడు తన యిష్టప్రకారము గవర్నరు చేయవచ్చును.

## గవర్నరుల ప్రత్యేకాధికారములు, బాధ్యతలు

46 ఈ క్రింది మార్పులతో, గవర్నరుజనరలుయొక్క అధికారమును బాధ్యతలు గవర్నరుల విషయమునగూడ వర్తించును.

గవర్నరుజనరలుయొక్క రిజర్వుడు శాఖకు నకలగు శాఖ రాష్ట్రములలో లేకపోయినను కొన్నిరాష్ట్రములలో ఫ్రాంటియర్ భూముల పరిపాలనకై యేర్పాటులు కలవు. ఈ ప్రదేశముల యందలి ప్రజలు అనాగరికు లగుటవలన సాధారణ రాజ్యాంగముక్రింద వారిని అట్టి పెట్టుటకు వీలులేదు.

47. గవర్నరుయొక్క ప్రత్యేకబాధ్యతలు ఆ రాష్ట్రమునకు మాత్రమే సంబంధించి యుండును గవర్నరుజనరలు బాధ్యతలవలెనవి దేశమంతటికిని వర్తింపవు కాని గవర్నరుల విషయమై యొక్క నిబంధన చేర్చవలెను గవర్నరుజనరలు జారీచేసిన ఉత్తరువులను ఆయన అమలు జరుపవలెను. శాంతి నెలకొల్పుటకు గవర్నరుజనరలు చేసిన ఉత్తరువులను గవర్నరులు అమలు జరుపవలెను. గవర్నరుజనరలుయొక్క ఉత్తరువులకు తన మంత్రుల సలహాలు విరుద్ధముగానున్నచో గవర్నరు తన మంత్రులకు విరుద్ధముగా చేయగలిగి యుండవలెను. కొన్ని మినహాయింపబడిన ప్రాంతముల పరిపాలన విషయమైగూడ గవర్నరుకు ప్రత్యేకబాధ్యత యుంచబడును

ఈ పేరాలో వివరింపబడిన ప్రత్యేకబాధ్యతలు రౌండు టేబిలు సభవారిచే మూడవ సమావేశమునందు చర్చింపబడినవి పోలీసు దళముల పరిపాలనము, నియమ నిగ్రహములు సరిగా లేనిచో శాంతిసౌఖ్యములకు భంగము కలుగవచ్చునని మొదటి రౌండుటేబిలు సభలలో కొందరు భయమందిరి కాని ఈ విషయమునకును, గవర్నరు ప్రత్యేక బాధ్యతలకును గల సంబంధము మూడవ రౌండుటేబిలులో చర్చింపబడలేదు పోలీసుదళములకును, తన బాధ్యతకును గల సంబంధమును గురించి గవర్నరుల కొసంగబడు ఆజ్ఞాపత్రములలో ఉత్తరువులు చేయుటకు బ్రిటిష్ ప్రభుత్వమువారు సంకల్పించుచున్నారు.

48 ఫెడరల్ శాసనసభయు, రాష్ట్రీయశాసనసభలును ఉండుటచే రాష్ట్రములకు గవర్నరుజనరలు ఆర్డినెన్సులు చేయ నవసరము లేదు 40-వ పేరాలో తెలుపబడిన కారణములకుగాను ఈ యధికారము గవర్నరులకుగూడ నివ్వబడినది.

## రాష్ట్రీయ శాసనసభ

49 రాష్ట్రీయశాసనసభలలో 3-వ అనుబంధమునందు తెలుపబడినంతమంది సభ్యులుందురు. స్థాననిర్ణయము ఎన్నికపద్ధతి బ్రిటిష్ ప్రభుత్వమువారి సాంఘికనిర్ణయము ననుసరించి యుండును. ఒర్సిస్సాను ప్రత్యేకరాష్ట్రముగాచేయుటకు తరువాత అవసరమైన కొన్ని మార్పులు చేయబడెను. నిమ్నజాతుల ప్రాతినిధ్యము విషయమై గూడ కొన్నిమార్పులు చేయబడెను. ఈ రెండింటిలో తప్ప వేరు మార్పులేమియు లేవు వివిధసంఘములును అంగీకరింపనిది వారికి సంబంధించిన నిర్ణయములను మార్చవలెనని పార్లమెంటుకు సలహా నివ్వరని బ్రిటిష్ ప్రభుత్వమువారు తెలిపిరి పూనా ప్యాక్టులో నిమ్నజాతులును తక్కిన హిందువులును ఒడంబడికకు వచ్చిరి. గనుక దానిని ఆంగ్ల ప్రభుత్వమువారు అంగీకరించిరి

సాంఘిక నియోజకవర్గముల ఏర్పాటును 10 ఏండ్ల తరువాతగాని ఆయాసంఘములు అంగీకరింపనిదిగాని మార్చరని నిర్ణయములో బ్రిటిష్ ప్రభుత్వమువారు స్పష్టము చేసిరి ఇట్టి యంగీకారము కలదా లేదా యని తెలిసికొనుటకు ఏర్పాటు చేయవలెను

రాష్ట్రీయ శాసనసభ్యులందరు ఎన్నుకొనబడిన సభ్యులుగానే యుందురు అధికారులు ఈశాసనసభలకు ఎన్నుకొనబడుటకు వీలు లేదు బెంగాలు, సంయుక్త రాష్ట్రములు, బీహారు రాష్ట్రములలో రెండు శాసనసభలుండును తక్కినవానిలో ఒక్క సభమాత్రమే యుండును. రెండవసభలున్న రాష్ట్రములలో వానిని రద్దు చేయుటకును లేనిరాష్ట్రములలో వాని నేర్పరచుటకును ఎర్పాటులు చేయబడును. రాష్ట్రీయ శిష్టసభలవారి అధికారములు ప్రజాప్రతినిధి సభలవారి యధికారములంత విస్తారముగా నుండవు

## రాష్ట్రములయందు ఎన్నికల పద్ధతి

50 రాష్ట్రీయ శాసనసభలకు ఎన్నికలు జరుగు విషయము 5-వ అనుబంధములో వివరముగా నివ్వబడినవి ఫెడరల్ శాసన సభలవలెనిచ్చటను వోటరుల జాబితా తయారగువరకు యోగ్యతలు నిశ్చితముగా నిర్ణయింపబడుటకు వీలులేదు. పట్టిక తయారుచేయుట ప్రారంభమైనతరువాత ఆయారాష్ట్రముల స్థితిగతులను బట్టి మార్పులుచేసికొనుట యవసరమై యుండును ఎన్నికలకు యోగ్యత ఆస్తి దీనికితోడు స్త్రీలకు, పురుషులకు సమానమగు విద్యాయోగ్యత యుండును భర్త ఆస్తినిబట్టిగూడ స్త్రీకి వోటుండును. ఇదివరకు నిమ్నజాతులకు నూటికి 9 వంతులు మాత్రమే ప్రాతినిధ్యముండినది. ఇప్పుడు అది 10 వంతుగ చేయబడుచున్నది వర్తకుల ప్రాతినిధ్యము, కార్మిక ప్రాతినిధ్యము, ఇతరశ్రేయముల ప్రాతినిధ్యమునకు కొన్ని స్థానములు ప్రత్యేకింపబడును. ఇప్పుడు 21 గురు పురుషులకు వోటుచేయగల స్త్రీ ఒక్కతెయై యుండగా నూతన రాజ్యాంగములలో 7 గురు పురుషులకు ఒక స్త్రీ యుండును.

51. ఈసూచనలను అంగీకరించుచో బెంగాలులో 75 లక్షల వోటర్లుందురు. అనగా మొత్తము జనాభాయగు 5 కోట్లలో నూటికి 15 వంతు లుండును బెంగాలుకంటె బొంబాయిలో హెచ్చుమంది వోటర్లుండగలరు. మద్రాసు, సంయుక్త రాష్ట్రములలో బెంగాలులో నున్నంతమందియే యుందురు తక్కినరాష్ట్రములలో నంతకంటె చాల తక్కువగానుండును బీహారు ఒరిస్సాలలో 100 కి తొమ్మిదిమంది వోటర్లుమాత్రమే యుందురు. అన్నిరాష్ట్రములలో కలిసి మొత్తము

జనాభాలో 100 కి 14 వంతులును, వయస్సువచ్చినవారిలో 100 కి 27 వంతులును వోటు కలిగియుందురు

సింధు, ఒరిస్సా రాష్ట్రములకు ప్రత్యేక ఎన్నిక విధానము ఏర్పరుపబడును సింధు ఎన్నికపద్ధతి బొంబాయిరాజధానియందలి ఎన్నికపద్ధతివలె నుండును నూతన ఉత్కళరాష్ట్రము మధ్యరాష్ట్రములలో కొంతతీసి, మద్రాసులో కొంతతీసి ప్రస్తుతబీహారు ఒరిస్సా రాష్ట్రములో కొంతతీసి యేర్పరుపబడుచున్నది. ఈ రాష్ట్రము ఎన్నికల యందలి పద్ధతి హెచ్చుగా బీహారు ఒరిస్సా రాష్ట్రమును పోలియుండినను, కొన్ని మార్పులు అవసరమై యుండగలవు

## ఫెడరేషనుకు, వివిధభాగములకు సంబంధము

52 రాష్ట్రీయ స్వపరిపాలన మొసంగబడుచున్నది గావున ఫెడరల్ శాసనసభయొక్క అధికారములును, రాష్ట్రీయశాసనసభయొక్క అధికారములును వేరుచేయబడినవి అనగా ఫెడరల్ శాసనసభవారి అధికారములను రాష్ట్రీయ శాసనసభయు, రాష్ట్రీయ శాసనసభల యధికారములను ఫెడరల్ సభయు హరింప వీలు లేనట్లు ఏర్పరుపవలసి యున్నది.

53 రాజ్యాంగవిధానము నేర్పరచు శాసనములో వాని అధికారములు నిర్ణయింపబడును. చాల శాఖలలో ఈ రెండు ప్రభుత్వములవారి యధికారములు ప్రత్యేకింపబడుట వీలగును కాని ఈరెండు శాసనసభలవారికి లోబడవలసిన విషయములుగూడ కొన్ని యుండగలవు. 6-వ అనుబంధములో ఈవిషయమై వివరము లొసంగబడినవి.

54. కొన్ని విషయములలో ఫెడరల్ శాసనసభలును, రాష్ట్రీయ శాసనసభలునుగూడ శాసనములు కావింప వలనుపడదు.

ఉదాహరణము

రాజుగారికిగాని, వారి కుటుంబమునకుగాని సంబంధించిన విషయము బ్రిటిష్ ఇండియాలో నేభాగములోగాని సార్వభౌమని ప్రభుత్వము, బ్రిటిష్‌జాతికి సంబంధించిన శాసనము, సైనిక చట్టము, వాయువిమాన శాసనము, నావికుల నియమములకు సంబంధించిన శాసనము, రాజ్యాంగము నేర్పరుచుచు చేయబడిన శాసనము, సైనిక శాసనము, వాయువిమానశాసనము, నావికుల నియమముల గూర్చి శాసనమును బ్రిటిష్ ఇండియాలో నేభాగములోకూడ అమలుచేయకుండ భారతశాసనసభలు ఆటంకము చేయజాలవు భారతదేశములోనీ సైనికదళములలో చేరువారికి ఈశాసనములను విస్తరించుటకు శాసనసభలకు అధికారములుమాత్ర ముంచబడును వీనివిషయమై శాసనసభలు జోక్యము కలిగించుకొనగూడదని తెలుపుటయేగాక, ఇట్టి వానిపై చర్చింపదలచుచో గవర్నరుజనరలు ముందుగా అంగీకరింపవలెనను నిబంధనకూడ నుండును. చర్చింపవచ్చునని గవర్నరు అంగీకరించినను, అథవా శాసనసభవారు ఒకతీర్మానము గావించుచో దానికి విరుద్ధముగా చేయుటకు గవర్నరులకుగాని, గవర్నరుజనరలకు గాని ఆటంకము లేమియు నుండవు

జాతిసైన్యము జూపు శాసనములు చెల్లవని పైన 29-వ పేరాలో తెల్పబడిన విషయము తిరిగి యిచ్చట తెలుపబడవలసి యున్నది.

55. ఫెడరల్ ప్రభుత్వమునకును, రాష్ట్రీయప్రభుత్వమునకును గల సంబంధములు నివేదికయందలి 125-129-వ పేరాలలో వివరింపబడినవి. ఫెడరల్ శాసనసభల శాసనములను తమకు సంబంధించినంతవరకు రాష్ట్రములు అవలంబింపవలెనని 125-వ పేరాలో తెలుపబడినది. ఇదిగాక రాష్ట్రీయప్రభుత్వముక్రిందనున్న ఫెడరల్ శాఖలవిషయమై ఫెడరల్ ప్రభుత్వమువారి యుత్తరువులను రాష్ట్రీయ ప్రభుత్వమువా రంగీకరించవలెను. వీనిలో రిజర్వుడు శాఖలచే పరిపాలింపబడుచున్న ఫెడరల్ శాఖలుగూడ నున్నవి.

## ఫెడరేషనుకు, రాష్ట్రములకు ద్రవ్యనిర్ణయము

56 దిగుమతి పన్నులు, (ఉప్పుపన్ను తప్ప) రైల్వేలు మున్నగు వ్యాపారసంబంధమైన పనులవలన వచ్చు ద్రవ్యము, నాణెములను పోత బోయుటవలన వచ్చు లాభము, రిజర్వుబ్యాంకువలన వచ్చులాభము ఫెడరల్ ప్రభుత్వమువారిదిగా నెంచబడును. వీనివిషయమై శాసనములుచేయు అధికారము ఫెడరల్ శాసనసభది

ఎగుమతిపన్నులు, ఉప్పుపన్నులు, పొగాకుపన్ను, ఎక్సైస్ పన్నులు, మద్యములు తప్ప తక్కినవానిపై పన్నులు ఫెడరల్ ప్రభుత్వమువారివి వీనిలో నంతగాని, కొంతగాని రాష్ట్రముల కిచ్చు అధికారము ఫెడరల్ ప్రభుత్వమువారి కుండును. శాసనాధికారము ఫెడరల్ ప్రభుత్వమువారిది.

ప్రయాణికులమీదను,వస్తువులమీదను వేయు టర్మినల్ పన్నులు, కొన్ని రకములైన స్టాంపుడ్యూటీలు ఫెడరల్ శాసనసభవారి యధీనమున నుండును. ద్రవ్యము రాష్ట్రములది. కాని కొంత సర్‌ఛార్జి విధించుటకు ఫెడరల్ ప్రభుత్వమునకు అధికారము కలదు. —

భూమిశిస్తు, మద్యములమీదను, మత్తుపదార్థములమీదను పన్నులు, కొన్ని మినహాయింపులతో స్టాంపులు, ఫారెస్టులు ఇప్పుడు రాష్ట్రీయాదాయశాఖలుగా నున్నవి ఇవి రాష్ట్రీయప్రభుత్వమువారివి. శాసనాధికారముగూడ రాష్ట్రీయశాసనసభలకే యుండును.

ఇందువిషయమై వివరములు 6-వ అనుబంధములో నివ్వబడినవి.

57 రాబడిపై పన్నులు ఈవిధముగా విభజింపబడును —

కార్పొరేషనుపన్ను ఫెడరేషనువారిది ఫెడరేషనులో చేరు రాష్ట్రములును, సంస్థానములును ఈ శీర్షిక క్రిందికి వచ్చు శాఖలకై డబ్బును 10 సంవత్సరముల యనంతరము ఇత్తురు. భూమిపై వచ్చు

పన్నులు తప్ప తక్కిన వన్నియు ఫెడరేషనువారివి. ఫెడరల్ ఉద్యోగములలో నున్నవారిపై విధింపబడిన పన్నులు, చీఫ్ కమిషనరుల రాష్ట్రముల మూలకముగా వచ్చు పన్నులు, ఫెడరల్ ప్రభుత్వము వారిక్రిందనున్న యితర ప్రదేశములయందలి పన్నులు, ఫెడరేషను వారివి ఫెడరల్ సర్‌చార్జిలవలన గాక యితరబాపతుల మూలముగా వచ్చు ఆదాయమును ఫెడరల్ ప్రభుత్వమువారును, రాష్ట్రీయ ప్రభుత్వములవారును పంచుకొందురు. ఫెడరల్ ప్రభుత్వమువారికి నూటికి 25 కు తగ్గకుండ 50 కి హెచ్చకుండ సంక్రమించును

రాష్ట్రీయాదాయము ఫెడరల్ ఆదాయముల విషయమున ఫెడరల్ శాసనసభ శాసనములు చేయదగును ఫెడరల్ మంత్రివర్గమును, రాష్ట్రీయమంత్రులను విచారించి గవర్నరుజనరలు శాసనప్రవేశమునకు అంగీకరింపవలెను.

రాబడిమీద పన్నుపై ఫెడరల్ శాసనసభ సర్‌చార్జి విధించును ఇందువలన వచ్చిన డబ్బు ఫెడరేషనుది ఫెడరేషనువారికి ఆయా రాష్ట్రములు తగినంత ధనము లివ్వవలెను.

రాజ్యాంగవిధానము అమలులోనికి వచ్చునప్పుడు 1931 సం॥ లో రాబడి పన్నులపై విధింపబడిన సర్‌చార్జీలు అమలులో నున్నచో నని ఫెడరేషనువారివి వీనికి తగిన డబ్బును రాష్ట్రము లివ్వ నవసరము లేదు.

రాష్ట్రమునందలి ధనికులపై రాష్ట్రీయ ప్రభుత్వమువారు పన్నులను విధింతురు. ఇవి రాష్ట్రములకు జెందును ఫెడరల్ ప్రభుత్వమువారు వసూలు చేయుదురు సర్‌చార్జి రేటు 12½ కంటె హెచ్చు కాగూడదని నియమ ముండవలెను.

58 ఈ ఫెడరేషను ఏర్పడిన క్రొత్తలో రాష్ట్రములకు ద్రవ్య మిచ్చు పద్ధతివలన ఫెడరేషనుకు డబ్బుండదు. కావున రాబడి పన్ను వలన వచ్చినదానిలో కొంతడబ్బు ఫెడరేషనువా రుంచుకొనవలెను. ఇది మూడేండ్లవరకు మారదు తరువాత ప్రతిసంవత్సరము కొంత తగ్గుచుండును. 10 యేండ్ల తరువాత నది యుండదు. విచారణపై నిది నిర్ణయింపబడును

రాష్ట్రములకు డబ్బు పంచిపెట్టుటవలన తమకే డబ్బు తక్కువగునని తోచినచో గవర్నరుజనరలు తన యిష్టప్రకారము దానిని ఆపివేయవచ్చును.

## క్రొత్త రాష్ట్రములు : వానికి సహాయము

59. పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రము, సింధు, ఒరిస్సాలకు పరిపాలనకు కావలసిన డబ్బుండదు. తక్కువపడును వీనికిని, ఆసాము రాష్ట్రమునకును కొంతకాలమువరకైనను సహాయము చేయవలసియుండును వీని కిచ్చు సహాయము స్థిరముగానైన నుండవచ్చును. లేదా కొన్ని సంవత్సరముల తరువాత సహాయము ఆపివేయబడ వచ్చును.

60 ఫెడరేషను అమలులోనికి వచ్చుటకు పూర్వము ఫెడరల్ ప్రభుత్వముయొక్కయు, రాష్ట్రీయ ప్రభుత్వములయొక్కయు ఆర్థిక స్థితి విచారింపబడవలసి యుండును అప్పుడు గాని యెవరికి ఎంత డబ్బు ఇవ్వవలెనో తేలదు ఈ విషయములు ఆర్డర్సు-ఇన్-కౌన్సిలు ద్వారా నిర్ణయింపబడవలెను వీనిముసాయిదాలు పార్లమెంటువారిచే నంగీకరింపబడవలెను ఫెడరల్ ప్రభుత్వమువారికి తగినడబ్బు ఉండుట ముఖ్యమని బ్రిటిష్ ప్రభుత్వమువారు తలచుచున్నారు. రాజ్యాంగయంత్రము జరుగుటకు మాత్రమే గాక భారతదేశమునకు పరపతి కలుగుటకుగూడ నిది యవసరము. ఫెడరల్ రాజ్యాంగ విధానము అమలులోనికి వచ్చునప్పుడు డబ్బు చాలక రాజ్యాంగ యంత్రము నడువని స్థితి రావచ్చును. తగినడబ్బు సప్లయి చేయవలసి యుండును పైన చెప్పిన విధమున విచారణ జరిగినతరువాత డబ్బు తక్కువపడునని తోచినచో ఈ సూచనలలో సంకల్పింపబడిన ఫెడరల్ ఫైనాన్సు స్కీమును మార్చవలసియుండును

82-వ పేరా చివర చెప్పబడినమాటలు ఈ సందర్భమున విచారింపదగి యున్నవి.

61. ఫెడరల్ ఫైనాన్సు పద్ధతిని అమలుపరుచుటకు కొన్ని యిబ్బందులు కలవు వీనిలో నొకటి సార్వభౌమునికి సంస్థానములవారిచ్చు కప్పములు రెండవది ఇక ముందు ఫెడరల్ ఆదాయముక్రింద చేరగల కస్టమ్సు, సాల్టు, పోస్టు, టెలిగ్రాఫు మున్నగు శాఖలక్రింద మినహాయింపులు ఈ క్లిష్టసమస్య యంతయు ఇండియన్ స్టేట్సు ఎన్క్వయిరీకమిటీలో వివరింపబడినది సంస్థానము లిచ్చు కప్పములను ఫెడరల్ ఆదాయమునకు మార్చుటకు తీర్మానింపబడినది. వీనిని క్రమముగా తగ్గింపవలెనని యుద్దేశ్యము. అన్నిటికి ఒకే పద్ధతి యవలంబింపబడజాలదు ప్రతి సంస్థానము విషయము ప్రత్యేకముగా విచారింపబడవలెను ఈ విషయములను నిర్ణయించుటకు ఒక సంఘము అవసరమై యుండవచ్చును.

# న్యాయవిచారణ

## ఫెడరల్ కోర్టు

62 ఫెడరేషనులో భిన్నవిశిష్ట రాష్ట్రములు, సంస్థాన ప్రభుత్వములు అంతర్భాగములుగ చేరియున్నవి. సదరు ఫెడరేషనుప్రభుత్వమునకు చెందిన కేంద్రశాసనసభకును, కార్యనిర్వాహకవర్గమునకును అధికారబాధ్యతలను నిర్ణయించి విభజించవలసి యున్నది. అంతియ గాక ఫెడరేషనులో అంతర్భాగము లైన రాష్ట్రప్రభుత్వములకుగూడ

అధికారభాధ్యతలను నిర్ణయించవలసియున్నది ఇట్టి అధికారబాధ్యతల నిర్ణయించి తగాదాలను పరిష్కరించుటకై ఫెడరల్ కోర్టు అను న్యాయవిచారణసభ అవసరమై యున్నది ఈ నూతన రాజ్యాంగ విధానముయొక్క విధినిషేధముల కన్నింటికిని సక్రమమైన న్యాయము చేయుటకు నిర్ణయాధికారముగల కోర్టు అవసరమగును కాబట్టి ఫెడరల్ ప్రభుత్వాధికారముల విషయములోను, రాష్ట్రీయ ప్రభుత్వాధికారవిషయములోను, సంస్థాన ప్రభుత్వాధికార విషయములోను కలిగెడి తగాదాల నన్నింటిని పరిష్కరించుటకు పైమూడింటితో సంబంధము లేని నిష్పాక్షికమైన న్యాయవిచారణసభ యుండవలెను

ఆయా హైకోర్టులు గాని, సంస్థాన ప్రభుత్వముల కోర్టులుగాని వేర్వేరు రీతులుగా రాజ్యాంగ ప్రణాళికానిబంధనలకు అన్వయము చేసి తీర్పులుచెప్పే యెడల అట్టితీర్పులు పరస్పర విరుద్ధములై అల్లకల్లోల కారణమగును రాజ్యాంగ విధాన శాసనము సందిగ్ధార్థ భూయిష్ఠమై ద్వంద్వార్థ సంకలితమై యుండును.

63. ఫెడరల్ కోర్టులో అసలుదావాలును, అప్పీలు దావాలును కూడ దాఖలు చేయబడవచ్చును. ఫెడరేషను ప్రభుత్వమునకును, ఫెడరేషనులోని అంతర్భాగముగా చేరిన రాష్ట్రీయ-లేక-సంస్థాన ప్రభుత్వమునకును కలిగెడి తగాదాలను గాని, లేదా రెండు గాని, అంతకెక్కుడు గాని రాష్ట్రీయప్రభుత్వములకు పరస్పరముగా కలిగెడి తగాదాలను గాని అసలు దావాలుగా స్వీకరించి ఫెడరలు కోర్టువారు విచారణచేయవచ్చును సదరు దావాలు రాజ్యాంగవిధాన నిబంధనల అన్వయమును గూర్చినవై యుండవలెను లేదా అట్టి నిబంధనల మూలమున కలుగగల హక్కు బాధ్యతలను గూర్చినవై యుండవలెను.

రాజ్యాంగవిధానచట్టములోని నిబంధనల అన్వయమునకు సంబంధించిన దావాల విషయములో హైకోర్టు గాని, సంస్థానప్రభుత్వపు కోర్టు గాని తీర్పులు చెప్పియుండినయెడల, అట్టి తీర్పులపై ఫెడరల్ కోర్టుకు అప్పీలుచేసికొనవచ్చును ఇట్టి అప్పీలు దావాలను విచారణ చేయుటకు ఫెడరలు కోర్టుకు అధికార ముండవలెను. అవసరమైన ప్రతి చిన్న విషయములోను ఫెడరల్ కోర్టుకు దావాలు దాఖలు చేయుచు సదరుకోర్టుకు లేనిపోని పని కల్పింపకుండు నిమిత్తమై కొంత నిర్ణీతమగుమొత్తమునకు తక్కువ కాని మొత్తమునకు వ్యాజ్య కారణముగా కలిగినట్టి అప్పీలుదావాలనే దాఖలుచేయ వలయునని విధింపవలయును అట్టి అప్పీలుదావాలను దాఖలుచేయుటకు ఫెడరల్ కోర్టు అనుమతి గాని, హైకోర్టు అనుమతి గాని, సంస్థానప్రభుత్వపు కోర్టు అనుమతి గాని ముందుగా పొందవలెను. కాని అట్టి అనుమతి అవసరము లేకుండానే ప్రీవీ కౌన్సిలుకు మాత్రము అప్పీళ్లు దాఖలుచేయ వచ్చును. అయితే అట్టి దావాలు రాజ్యాంగవిధాన నిబంధనాన్వయములకు సంబంధించిన తగాదాలై యుండవలెను. అదివరకే ఆదావాలు ఫెడరలు కోర్టులో విచారణ చేయబడి తీర్పుచెప్పబడి యుండవలెను ఇతర తగాదాలలోను వ్యాజ్యములలోనుమాత్రము ఫెడరల్ కోర్టు యొక్క అనుమతితోనే ప్రీవీకౌన్సిలుకు అప్పీలుచేయవలెను. సార్వభౌముడు ప్రత్యేకానుమతి నొసంగినయెడల ఫెడరల్ కోర్టుయొక్క అనుమతి అక్కరలేదు. హైకోర్టులో తీర్పుచెప్పబడినపిమ్మట ఫెడరల్ కోర్టుకు అప్పీలు చేయవలసియున్న సందర్భములో సార్వభౌమునకు అప్పీలు చేయుటకు వీలులేదు

64. ఏదైన నొక క్లిష్టసమస్య విషయములో ఫెడరలు కోర్టు యొక్క నిర్ణయమును తెలిసికొనుట అవసరమని తోచినప్పుడు గవర్నరుజనరలు సదరు తగాదాను ఫెడరలు కోర్టువారికి ఆవిషయమును పరిష్కారార్థమై స్వతంత్రించి విన్నవించవచ్చును.

65 ఫెడరలుకోర్టులో ఒక ప్రధాన న్యాయమూర్తియును, కొందరు నిర్ణీతసంఖ్యాకులగు న్యాయమూర్తులును న్యాయవిచారణ కర్తలుగా నుందురు వీరందరును సార్వభౌమునిచే నియమింపబడుదురు. కాని, ఢిల్లీ శాసనసభలో రెండును కలిసి గవర్నరుజనరలుకు నివేదించుకొనుటవల్ల సదరు న్యాయమూర్తుల సంఖ్యను హెచ్చించునట్లు చేయవచ్చును

## సుప్రీము కోర్టు

66 పైజెప్పిన అధికారములతో ఫెడరలుకోర్టు ఒకటి నియమింపబడిన పిమ్మట వేర్వేరు హైకోర్టుల తీర్పులపై దావాలను దాఖలు చేసికొనుటకొరకు సుప్రీమ్‌కోర్టు ఇండియాలోనే ఉండవలెనని కొందరు వాదించిరి ఖండాంతరములోనున్న ప్రీవీ కౌన్సిలుకు అప్పీలుచేయుట వల్ల కక్షిదారులకు అపారమైన వ్యయమగు చున్నదనియును, న్యాయ విచారణ వేగముగా జరుగక కాలహరణ మగుచున్నదనియును,అందువల్ల ఇండియాలోనే సుప్రీము కోర్టు అను పేరుతో ప్రీవీ కౌన్సిలు అధికారముగల కోర్టు ఉండవలెననియు వారు వాదించిరి. కాని ఇండియాలో అట్టి కోర్టును ఏర్పాటుచేయుట అనవసర వ్యయకారణ మనియు, ఫెడరలుకోర్టుకును, హైకోర్టులకును కావలసిన మేధానిధులగు న్యాయమూర్తులు నియమింపబడిన పిమ్మట ఈ సుప్రీముకోర్టుకు వలయు మేధానిధులు మరికొందరు న్యాయమూర్తులుగా లభింపజాలరనియు, నూహింపబడినది. అట్టి సుప్రీముకోర్టు ఏర్పాటుచేయబడినయెడల అది ఫెడరల్ కోర్టుకు అనుబంధముగా నుండవలెనా, అంతర్భాగముగా నుండవలెనా అను చిక్కు ప్రశ్న యొకటి కలిగెను కనుక ప్రస్తుతము అట్టి సుప్రీము కోర్టును ఇప్పుడు ప్రతిష్ఠించ నవసరము లేదు; అట్టి అవసరము కలిగిన యెడల, ఫెడరలు కోర్టు వారే అట్టి సుప్రీము కోర్టుయొక్క ప్రతిష్ఠాపన నిమిత్తమై శ్రద్ధ వహించి ప్రయత్నించుటకు సదరు ఫెడరలు కోర్టుకు ప్రస్తుతము అధికార మొసంగబడవలెను. కాని అట్టి సుప్రీము కోర్టు ఏర్పాటు చేయబడేయెడల రాజ్యాంగ శాసనము (కాన్‌స్టిట్యూషను ఆక్టు) వలన అనుశాసింప బడినదై యుండవలెను.

## ఇండియా కార్యదర్శియొక్క సలహాదారులు

**67.** ఇండియాకార్యదర్శికి సహాయభూతముగా నొకసభ్యవర్గము ఈస్టు ఇండియాకంపెనీ అంతరించిననాటినుండియును ఏర్పడి వ్యవహరించుచున్నది. అట్టి సభ్యవర్గ మీ నూతన పరిస్థితులందు అనుచితముగా కన్పించుచున్నది. అందువల్ల ఇకముందునుండియును ఇండియా కార్యదర్శికి సలహాదారులుగా కొందరు ఒక చిన్న సంఘముగా ఏర్పడియుండుట చాలును. అట్టి సలహాదారులు ఇండియా కార్యదర్శికి ఉండి తీరవలెనని మాత్రము శాసింపబడవలెను.

**68** ఇండియా ప్రభుత్వము తరఫున ఏదైన కాంట్రాక్టు అగ్రిమెంట్లు చేసికొనవలసి వచ్చినప్పుడును, ఇండియా ప్రభుత్వముపై దావాలు దాఖలు చేయవలసినప్పుడును ఇండియా కార్యదర్శినే ప్రతివాదిగా చేర్చుట ఇదివరకు శాసనసమ్మతముగా నుండెను ఇండియా ప్రభుత్వమువారు దావాచేసినప్పుడు ఇండియా కార్యదర్శినే వాదిగా పేర్కొనవలసి యుండెను ఇకముందునుండియును ఆయారాష్ట్రీయ ప్రభుత్వములు సర్వస్వతంత్రములుగా వ్యవహరించవలసిన వగుటచేతను, బాధ్యతాయుతమైన ఫెడరలు ప్రభుత్వము అమలులోనికి రావలసియుండుటచేతను ఇండియాకార్యదర్శియే ఇకముందుగూడ ఇండియా ప్రభుత్వము తరఫున వాదిగా గాని, ప్రతివాదిగా గాని వ్యవహరించుట యుక్తముగా లేదు. అందువల్ల ఇకముందునుండియును సార్వభౌముని పేరనే ఇండియా ప్రభుత్వమువారు అధికారము వహించియుండిన యావదాస్తియును సార్వభౌమునికే చెందియుండవలెననియు, ఆయారాష్ట్రీయప్రభుత్వముల పేరిట గాని, ఫెడరల్ ప్రభుత్వము పేరిట గాని ఇకముందు దావాలను దాఖలు చేయవచ్చుననియును ఆయారాష్ట్రీయ ప్రభుత్వముల పేరిటనే, లేదా ఫెడరలు ప్రభుత్వము పేరిటనే కాంట్రాక్టులు చేసికొనబడవచ్చుననియు శాసించవలసి యున్నది. కాని నూతన రాజ్యాంగశాసనముల ప్రకారము ఫెడరేషను అమలులోనికి రాకపూర్వము ఇండియా కార్యదర్శి పేరిట దాఖలు చేయబడిన వ్యాజ్యముల సందర్భములో సదరు దావాలలోని తీర్పు నిర్ణయములను ఫెడరేషనువారు అమలుపరచవలసి యుండును.

**69.** ఇండియా కార్యదర్శికి సలహాదారులు ముగ్గురికి తక్కువకాకుండా 6 గురి కంటె ఎక్కువకాకుండా ఉండవలెను వీరిలో అధమపక్షము ఇద్దరు 10 సంవత్సరములకు తక్కువ లేకుండ ప్రభుత్వోద్యోగము చేసియుండవలెను. ఈ సలహాదారు లందరును 5 సంవత్సరములవరకు ఆహోదా వహించగలరు. ఈ సలహాదారులతో ఇండియా కార్యదర్శి విడివిడిగాగాని, సమష్టిగాగాని ఇష్టానుసారము యుక్తమని తోచినప్పుడు సంప్రతించవచ్చును. ఇండియాలోని పబ్లికుసర్వీసు ఉద్యోగీయులకు సంబంధించిన నిబంధనలను తయారుచేయు విషయములో సదరు సలహాదారులతో తప్పక సంప్రతించి వారిలోని అధిక సంఖ్యాకుల సమ్మతిని ముందుగా పొందవలెను. ఈరాజ్యాంగ శాసన సమ్మతముగా ఇండియాకార్యదర్శికి పబ్లికుసర్వీసు ఉద్యోగిచే దాఖలు చేసికొనబడిన అప్పీలు పరిష్కారవిషయములోకూడ సదరు సలహాదారులలో నధిక సంఖ్యాకుల సమ్మతి నైకొని వ్యవహరించవలెను

## పబ్లికు సర్వీసు ఉద్యోగీయులు

70 పబ్లీకు సర్వీసు ఉద్యోగములు —

(1) యావద్భారతదేశమునకు సంబంధించిన ఉద్యోగపదవులు.

(2) రాష్ట్రీయప్రభుత్వములకు సంబంధించిన యుద్యోగములు.

(3) కేంద్ర ప్రభుత్వమునకుమాత్రము సంబంధించిన ఉద్యోగములు యావద్భారతోద్యోగులు ముఖ్యముగా ఆయారాష్ట్రములలోనే ఉద్యోగముల చేయుచుందురు కాని అవసరమైనచో భారతదేశమందెక్కడనైనను వారు ఉద్యోగమును చేయవలసియుందురు

యావద్భారతోద్యోగులలో ఈ క్రిందితరగతులు చేరును —

1. ఇండియను సివిలుసర్వీసు.
2. ఇండియను పోలీసు
3. ఇండియను ఫారెస్టు సర్వీసు.
4. ఇండియను సర్వీసు ఆఫ్ ఇంజనీర్సు

పైజెప్పిన 3, 4 ఉద్యోగశాఖలు నూతన రాజ్యాంగ శాసనముప్రకారము రాష్ట్రీయప్రభుత్వములయొక్క మంత్రుల యధికారమునకు ఒప్పగింపబడును గనుక సదరు ఫారెస్టుశాఖ (అటవీశాఖ) ఇంజనీర్ల శాఖలలో యావద్భారతోద్యోగపదవులు ఉండవు.

రాష్ట్రీయ ప్రభుత్వోద్యోగశాఖలకు ఆయారాష్ట్రీయ ప్రభుత్వముల వారివల్లనే ఉద్యోగులు నియమింపబడగలరు

కేంద్రప్రభుత్వమునకు మాత్రము చెందిన ఉద్యోగశాఖలలో ముఖ్యమైన వేవనగా —

(1) రైల్వే ఉద్యోగములు, (2) ఇండియా పోస్టు టెలిగ్రాఫ శాఖోద్యోగములు, (3) రేవుసుంకముల శాఖోద్యోగములు ఇండియా కార్యదర్శిచే నియమింపబడినవారు ఈ పైచెప్పిన శాఖలయందు ఉద్యోగులుగా నున్నారు.

## ఉద్యోగుల హక్కులు

71 ఇండియా కార్యదర్శిచే నియమింపబడేవారి కందరికిని కొన్ని హక్కు లుండును అట్టి ఉద్యోగులు ఇండియా కార్యదర్శి అధికారమునకు లోబడి యుండెడి ఏ అధికారవర్గముచే నైనను బర్తరఫు చేయబడజాలరు. అట్టి ఉద్యోగులజీతముల మొత్తములను

మార్పు చేయుటకు గాని, తగ్గించుటకు గాని యే శాసనసభవారికిని అధికారము లేదు. ఇండియాదేశములో ఏ ప్రభుత్వాధికారియైనను అట్టి ఉద్యోగుల వ్యవహారప్రవర్తనాది విషయములలో అవలంబించెడి క్రమశిక్షార్థమైన విధినిషేధములగూర్చి సదరు ఉద్యోగులు ఇండియా కార్యదర్శికి అప్పీలు చేసికొనగలరు ఇట్టి ఉద్యోగులకుగల హక్కులను సంరక్షించవలసిన యగత్యము కలదు కనుక ఇండియా కార్యదర్శిచే నియమింపబడు అట్టి ఉద్యోగుల హక్కులను ఈరాజ్యాంగశాసనము అమలులోనికి వచ్చినపిమ్మటకూడ సంరక్షించవలయును కాని సర్వీసు పూర్తికాకపూర్వమే పింఛను గైకొనుటకు గల హక్కు సివిలుసర్వీసు ఉద్యోగులకును, ఇండియను పోలీసు ఉద్యోగులకును మాత్రము ఉండును. 72-వ పేరాలో సూచింపబడిన కమిటీవిచారణ ఫలితము నిర్ణయము అయ్యేవరకును అట్టి విచారణ పర్యవసానము ననుసరించి నిర్ధారణగా నిబంధన లేర్పరుపబడేవరకును సదరు హక్కు అమలులో నుండును

రాష్ట్రీయప్రభుత్వములోను, కేంద్రప్రభుత్వములోను కొందరు ఉద్యోగులు ఇండియాకార్యదర్శిచే నియమితులు కాకపోయినను వారికిగూడ కొన్ని ఉద్యోగసంరక్షణార్థమైన హక్కులు కలవు ఆ హక్కులనుకూడ ఇండియాకార్యదర్శి కాపాడగలడు.

72 ఇండియను సివిలు సర్వీసు ఉద్యోగములకును, ఇండియను పోలీసు ఉద్యోగములకును, పాదిరీల శాఖకును, సంబంధించిన ఉద్యోగములకు వలయు ఉద్యోగస్థులను ఇండియా కార్యదర్శి నియమించుచుండగలడు ఈ రాజ్యాంగ శాసన మమలులోనికి వచ్చిన 5 సంవత్సరముల తర్వాత ఇండియను పోలీసుశాఖకును, ఇండియను సివిలు సర్వీసుశాఖకును ఉద్యోగులను ఏరి కోరి నియమించే విషయములో ఒక విచారణసంఘము నియమింపబడి ఒక విచారణ జరుపబడును ఆ విచారణ సంఘములో ఇండియాలోని వేర్వేరు ప్రభుత్వములు పాల్గొనగలవు సదరు విచారణనిర్ణయ ఫలితములను ఆలోచించి నిబంధనలేర్పరచుట బ్రిటిష్ ప్రభుత్వమువారి యధీనమై యుండును పార్లమెంటువారే ఆ నిబంధనలను నిర్ణయించెదరు. ఆయా ఉద్యోగ పదవులకు భారతీయులెందరు నియమింపబడవలెనో, ఆంగ్లేయు లెందరు నియమింపబడవలెనో సదరు విచారణసంఘముయొక్క విచారణ జరిగి క్రొత్తనిబంధన లేర్పడేవరకు ప్రస్తుతము అమలులో నున్న దామాషా రేటు ప్రకారమే నియమింపబడెదరు.

వైద్యశాఖకును, రైల్వేశాఖకును, ఉద్యోగులను అధికారులను ఇండియా కార్యదర్శి నియమించే విషయములో ఇంకను విచారణ జరుగుచున్నది. ఆ విషయములో బ్రిటిష్ ప్రభుత్వపు సలహాలు జాయింటు పార్లమెంటరీ కమిటీకి నివేదింపబడును

73 ఉద్యోగములందున్న ఆఫీసర్లు పింఛనుకాలమందు తమ కుటుంబభరణముల నిమిత్తమై తమ జీతములో నుండి చెల్లించుచుండిన చందా మొత్తముల నిధిని ఇండియా ప్రభుత్వమువారు సదరు ఉద్యోగులకు చెల్లించవలసిన బాధ్యులై యున్నారు సదరు కుటుంబభరణ నిధి వారి జీతములలోనుండి రూపాయీల లెక్కను ఇండియా గవర్నమెంటు వశమందు పెరుగుచుండును. కాని సదరు ఆంగ్లోద్యోగులు పింఛను గైకొని ఇంగ్లండునకు మరలివెళ్లినపిమ్మట వారికి ఆ మొత్తము పౌనుల లెక్కను చెల్లింపబడవలసి యుండును కనుక సదరు మొత్తము ఉద్యోగుల నెలజీతములలో నుండి యివ్వబడు చందాలవల్ల ఏర్పాటు చేయబడునప్పుడే మొదటినుండియును పౌనుల లెక్కలోనే ఏర్పాటు చేయబడుట యుక్త మని యోచింపబడుచున్నది. ఇట్టి పద్ధతి సాధ్యమయ్యేయెడల ఉద్యోగులతో సంప్రతించి అట్టి ఏర్పాట్లుచేయబడును ఇట్టి ఏర్పాట్లుచేయవలసినయెడల ఈ రాజ్యాంగ శాసనమునందే అమలు శాసింపబడవలెను కనుక జాయింటు పార్లమెంటరీ కమిటీవారిచే ఆమోదింపబడు నిమిత్తము బ్రిటిషు గవర్నమెంటు తమతమ సలహాలను ఈవిషయమై త్వరలో నివేదించెదరు.

## స్టాచ్యూటరీ రైల్వేబోర్డు

74. భారతదేశములోని ప్రభుత్వపరిపాలిత రైల్వేలును, వేర్వేరు రైల్వేకంపెనీల సొంత రయిల్వేలును సక్రమముగా నిర్వహింపబడునట్లుగా పై అధికారము చలాయించు నిమిత్తము ఒక రైల్వే బోర్డును ఏర్పాటుచేయవలయును సదరు రైల్వేబోర్డు తన అధికారములను రాజకీయాందోళనముల ప్రసక్తి లేకుండ చలాయించ గల్గుటకు తగిన కట్టుదిట్టములను, చేయవలయును రైల్వే కంపెనీలకు ఒసంగబడిన హక్కులను, సౌకర్యములను సదరు రైల్వేబోర్డు కాపాడవలెను, కాని ఏవైన తగాదాలు కలిగినప్పుడు ఇండియా కార్యదర్శికి అప్పీలు చేసికొనుటకు అవకాశ ముండవలెను లేదా మధ్యవర్తులద్వారా పరిష్కారము చేసికొనుటకు అవకాశ ముండవలెను. ఈ సంకల్పోద్దేశములను అమలు పరచుటకై తగిన రైల్వేబోర్డు విధానము ఏరీతిగా ఉండవలెనో ఆవిషయమై ఇండియాగవర్నమెంటు వారితో సంప్రతింపు జరుగుచున్నది బ్రిటిష్ ప్రభుత్వమువారు త్వరలోనే అట్టి విధానమును వివరముగా నిరూపించగలరు

## ప్రాతిపదికమగు హక్కులు

75 దేశీయుల కందరికిని గాని, వేర్వేరు సంఘముల విషయములో విడివిడిగా గాని ప్రజల ప్రాతిపదికమగు హక్కులను కొన్నింటిని నిర్ధారణచేసి రాజ్యాంగ శాసనమునందే పొందుపరచి అనుశాసించవలెనని రౌండుటేబిలు సభయందు పెద్దతడవు చర్చింప బడెను. కాని అట్టి బాహుళ్యమైన, సర్వజన సామాన్యమైన హక్కులను నిర్ణయించి ప్రకటించుటకు అనేకాక్షేపణలు బ్రిటిష్‌ప్రభుత్వమువారికి కన్పించుచున్నవి కాని వ్యక్తి స్వాతంత్ర్యము, ఆస్తి స్వామ్యములను గూర్చి

యు, పబ్లికు ప్రభుత్వోద్యోగముల గూర్చియు జాతి మత విచక్షణ లేకుండ పరిపాలనము చేయబడునని మాత్రము ఈ రాజ్యాంగ శాసనములో పొందుపరచుట యుక్తముగానే యుండును

ఈ రాజ్యాంగ శాసనములో పొందుపరచుటకు అనుచితముగా నుండునని భావింపబడే ప్రాతిపదికమగు హక్కు నిర్ణయములను గూర్చి సార్వభౌముడే ఒక బహిరంగమైన అభయహస్తపూర్వక ప్రకటనను ప్రజలకు చేయవచ్చును అట్టి అభయహస్త ప్రకటనతో సదరు ప్రాతిపదికమగు హక్కులను పేర్కొనుట భావ్యముగా నుండునని బ్రిటిష్ ప్రభుత్వమువారు సార్వభౌమునకు నివేదించవచ్చును ఈ రాజ్యాంగ శాసనము అమలుపరచబడు సందర్భమున సార్వభౌముడు సదరు ప్రకటన చేయవచ్చును

## ముగింపు

ఇప్పుడు అమలులో నున్న ఇండియా ఆక్టు ననుసరించి యేర్పడి యున్న యేర్పాట్లును, క్రొత్త రాజ్యాంగశాసనము ప్రకారము కూడ అమలులో స్థిరముగా నుంచవలెనా, అక్కరలేదా? అనే చిల్లర విషయాలు అనేకము ఈ శ్వేతపత్రములో చర్చింపబడలేదు ఇండియా కార్యదర్శియొక్క కార్యాలయ వ్యవహారపు లెక్కలను తనిఖీచేయుటకు ఆడిటరుజనరలు యథావిధిగా ఇకముందుగూడ ఉండవలెనా అను విషయము మున్నగునవి పెక్కులు చిత్తుచట్టమును వ్రాయబడునప్పుడు అందులో పొందుపరచబడును

## సూచనలు

(1) ప్రస్తుతము ఇండియా ప్రభుత్వమువారు కొన్ని అధికారములను చలాయించుచున్నారు బ్రిటిషు ఇండియా పరిపాలన విషయమున ఇండియా ప్రభుత్వమువారికి కొన్ని అధికారము లున్నవి సంస్థానముల విషయమున సంధిపత్రముల ననుసరించి కొన్ని అధికారము లున్నవి కాని అన్ని అధికారములు సార్వభౌమునివి యనియు, సార్వభౌముని పేరుతో ఈ అధికారములు చలాయింపబడునను సూత్రమును ఆధారముగ జైకొని సార్వభౌముని ప్రభుత్వమువారికి సూచనలను గావించుచున్నారు

## ఫెడరేషను

### ప్రథమభాగము

(2) ప్రస్తుతము గవర్నరులచే పరిపాలింపబడు రాష్ట్రములు, ఫెడరేషనులో చేరుటకు అంగీకారము తెలుపు స్వదేశసంస్థానములను కలిపి ఫెడరేషను నిర్మింపబడును ఫెడరలు ప్రభుత్వమువారికి సంక్రమింపగల అధికారములకును హక్కులకును భంగ మేర్పడని విధమున సంస్థానాధీశులు ప్రత్యేకపు టొడంబడికద్వారా తాము ప్రస్తుతము అనుభవించుచున్న కొన్ని హక్కులను అధికారములను ఫెడరేషను ప్రభుత్వమువారి పరమొనర్చెదరు ఈవిధముగ ఫెడరేషను ప్రభుత్వమునకు క్రొత్తగ సంక్రమించు అధికారములను నూతన చట్టము ననుసరించి గవర్నరుజనరలుగారు, ఫెడరలు శాసనసభ, ఫెడరలుకోర్టు మున్నగు సంస్థలు చలాయించుచుండ గలవు సంస్థానాధీశులు తమ ఒడంబడికలయందు ఏయే హక్కులను,అధికారములను వదలుకొనెదరో ఆయాహక్కులు అధికారములు మాత్రమే ఫెడరేషను ప్రభుత్వమువారికి సంక్రమించును సంస్థానాధీశులు వదలుకొనని ఇతరహక్కులు అధికారములయందు ఫెడరేషన ప్రభుత్వమువారు జోక్యము కలుగ జేసికొనుటకు వీలు లేదు

(3) సంస్థానాధీశులు ఈ విధమున తమ అధికారములలో కొన్నిటిని ఫెడరేషను ప్రభుత్వమువారి పర మొనర్చిన పిమ్మట, వారికుండు ఇతర హక్కులు అధికారముల విషయమున సార్వభౌముని ప్రతినిధిగ నుండు రాజప్రతినిధితో వారికి సంబంధ ముండును గాని, ఫెడరేషను ప్రభుత్వపు ప్రధానోద్యోగి యగు గవర్నరు జనరలుగారితో సంబంధ ముండదు అనగా సంస్థానాధీశులు వదలుకొనని అధికారముల విషయమున జోక్యము కలుగజేసికొనుట రాజప్రతినిధికిమాత్రమే అధికార ముండునుగాని సభాయుతుడగు గవర్నరు జనరలుగారికి ఎట్టి అధికార ముండదు

(4) ఫెడరేషను ఏర్పడుటకు సార్వభౌముడు ప్రత్యేకప్రకటన ద్వారా ఒక తేదిని నిర్ణయించును ఆ తేదినాడు ప్రస్తుతము గవర్నరులచే పరిపాలింపబడుచున్న 9 రాష్ట్రములు, ప్రత్యేకముగ నిర్మింపబడు సింధు ఒరిస్సా రాష్ట్రములు, ఫెడరేషనులో చేర నంగీకరించిన సంస్థానములతో ఫెడరేషను ఏర్పడును కాని ఈ దిగువ వివరింపబడిన షరతులు కొనసాగినగాని సార్వభౌముడు అట్టిప్రకటన గావింపడు.

(అ) సంస్థానముల జనసంఖ్యమొత్తమునందు సగమువంతు జనసంఖ్యగల సంస్థానములకు అధిపతులైనవారును, సంస్థానాధీశులకై ఫెడరలుశాసనసభయందు ప్రత్యేకింపబడు స్థానములలో సగమువంతు స్థానములు భర్తీయగుటకు తగిన సంస్థానాధీశులు ఫెడరేషనులో చేరుటకు అంగీకరింపవలెను

(ఆ) ఫెడరేషను నిర్మాణపు తేదిని ప్రకటింపవలయునని రెండు పార్లమెంటు సభలు సార్వభౌమునకు వినతిపత్రమును పంపుకొనవలెను

ఈరెండు షరతులు నెరవేరిన పిమ్మటనే ఫెడరేషను నిర్మాణపు తేదిని సార్వభౌముడు ప్రకటించును

(5) ఫెడరేషనులో చేరిన రాష్ట్రములు, సంస్థానములు ఛీఫ్ కమిషనరులచే పరిపాలింపబడుచున్న ఢిల్లీ,అజ్మీరు, మార్వారు,కూర్గు,



నిజాంకళాశాల ఆంధ్ర సారస్వతసమితి వార్షికోత్సవము



ఆంధ్ర విశ్వకళాశాల విచారణసమితి-బందరు

బెలూచిస్థానము, అండమాను, నికోబారుదీవులు ఫెడరేషను ప్రభుత్వమునకు లోబడి యుండగలవు బ్రిటిషు బెలూచిస్థానము విషయమున మాత్రము గవర్నరుజనరలుగారు స్వయముగ రాష్ట్రపరిపాలనము జరుపుటకు ప్రత్యేకపు ఏర్పాటులు గావింపబడును బ్రిటిషు బెలూచిస్థానపు పరిపాలన ఖర్చులను నిరాకరించుటకుగాని, అంగీకరించుటకుగాని ఫెడరలు శాసనసభవారికి అధికారముండదు కాని ఆఖర్చుల విషయమై ఫెడరలు శాసనసభలలో చర్చ మాత్రము జరుగవచ్చును

ప్రస్తుతము ఏడెను సెటల్మెంటు ఛీఫ్ కమిషనరు పరిపాలనము క్రిందయున్నది ఫెడరేషనులో ఏడెను సెటిల్మెంటు పరిపాలన మేవిధముగ నుండును అనువిషయమై ప్రభుత్వమువారింకను ఆలోచించుచున్నారు అందుచే ఏడెను విషయమై ప్రస్తుతమెట్టి సూచనలు గావింపబడ లేదు.

## ఫెడరలు ప్రభుత్వవర్గము

(6) సైనిక, నావిక, వాయు దళములతోసహా ఫెడరేషను పరిపాలనము సార్వభౌముని పక్షమున గవర్నరుజనరలుగారు జరుపుచుండెదరు కాని ప్రత్యేకముగ ప్రధానసేనాధిపతిని సార్వభౌముడు నియమింపవచ్చును అన్ని ప్రభుత్వప్రకటనలు గవర్నరుజనరలుగారి పేరట ప్రకటింపబడును

రిజర్వు శాఖలయందు గవర్నరుజనరలుగాని, గవర్నరుగాని గావించు ప్రకటనలు తమ సొంత బాధ్యతపై గావింపబడిన ప్రకటనలుగ పరిగణింపవలెను

(7) సంస్థానముల విషయమున సంస్థానాధీశులు ఏయే అధికారములను వదలుకొనిరో ఆయా అధికారములనే ఫెడరలు ప్రభుత్వమువారు ఆయా సంస్థానములందు చలాయించెదరు.

(8) భారత ప్రభుత్వ నిర్మాణచట్టము ననుసరించి ఫెడరేషను నాననిర్వాహకోద్యోగియగు గవర్నరుజనరలుగారికి సంక్రమించు అధికారములను, చట్టమునకు విరుద్ధము గానటువంటి సార్వభౌమునిచే ప్రత్యేక ప్రకటన ద్వారా ఇవ్వబడు ప్రత్యేకాధికారములను గవర్నరు జనరలుగారు చలాయించెదరు ఈ అధికారములను చలాయించు విషయమున సార్వభౌమునిచే ప్రకటింపబడు అధికార నిర్వచనపత్రమున సూచింపబడు విధుల ననుసరించి గవర్నరుజెనరలుగారు ప్రవర్తించెదరు

(9) అధికారనిర్వచనపత్రపు చిత్తుప్రతి రెండు పార్లమెంటు సభలకును సమర్పింపబడును ఈ పత్రమునందు తగు సవరణను గావించుటకై సార్వభౌముని కోరుటకు పార్లమెంటుసభలకు అవకాశ మివ్వబడును

(10) గవర్నరుజనరలుగారి కివ్వవలసిన జీతము చట్టమునందే ఉదాహరింపబడును గవర్నరుజనరలుగారికి చేరవలసిన ఇతర ఎలవెన్సులు, వారి సిబ్బందిగుమాస్తాలకు చేరవలసిన జీతములు, ఎలవెన్సులు కౌన్సిలు ఉత్తరువుల ననుసరించి నిర్ణయింపబడును. ఈ మొత్తములపై వోటుచేయుటకు శాసనసభవారికి అధికారముండదు

## ఫెడరలు ఎగ్జిక్యూటివు ప్రభుత్వము బాధ్యత విభజనము

(11) ఫెడరలు పరిపాలనమున కొన్ని శాఖలను అనగా సైనిక శాఖ, విదేశాంగశాఖ, మతవిషయకశాఖలను గవర్నరుజనరలుగారు స్వయముగ నిర్వహించెదరు

(12) ఈ రిజర్వుడు శాఖలను పరిపాలించు సందర్భమున గవర్నరు జనరలుగారికి సహాయముసగుటకై ముగ్గురు ప్రత్యేకోద్యోగులను నియమించుటకు గవర్నరుజనరలుగారికి అధికార ముండును వీరి కివ్వవలసిన జీతములు, ఎలవెన్సులు, వీరి ఉద్యోగపదవులకు సంబంధించిన ఇతర షరతులు కౌన్సిలు ఉత్తరువులద్వారా నిర్ణయింపబడును

(13) పదకొండవ క్లాజునందు సూచింపబడిన శాఖలుకాక ఇతరశాఖల పరిపాలనము జరుపు సందర్భమున గవర్నరుజనరలుగారికి తోడ్పడుటకు ఒక మంత్రుల సంఘము ఏర్పరుపబడును గవర్నరుజనరలుగారే మంత్రులను ఏర్పరచెదరు వీరు రాజభక్తి ప్రమాణము గావించి కౌన్సిలు సభ్యులుగ పనిచేయుచు గవర్నరు జనరలుగారి కిష్టమున్నంతకాలము మాత్రమే అధికారమునం దుండెదరు ఈవిధమున మంత్రులుగ నియమింపబడినవారు ఫెడరలు శాసనసభలలో ఒక సభయందు సభ్యులుగనైన యుండవలెను లేనిచో నిర్ణీత కాలమున సభ్యులుగ ఎన్నుకోబడవలెను

(14) మంత్రులను నియమించు విషయమున సాధ్యమైనంతవరకు క్రిందిసూత్రముల ననుసరింపవలయు నని అధికార నిర్వచన పత్రముద్వారా గవర్నరుజనరలుగారికి సూచన గావింపబడును శాసనసభయందు అధిక సంఖ్యాకులగు సభ్యుల సహకారము పొందగలిగిన సభ్యుని సహాయముతో అల్ప సంఖ్యాకుల సంఘములయు, సంస్థానాధీశులయు ప్రతినిధులను సాధ్యమైనంతవరకు కలుపుకొని గవర్నరు జనరలుగారు మంత్రివర్గమును ఏర్పరుపవలయును

(15) మంత్రులసంఖ్య వారి కివ్వవలసిన జీతముల మొత్తము ఫెడరలు శాసనసభవారి చట్టముననుసరించి నిర్ణయింపబడును కాని ఇట్టి చట్టమును శాసనసభవారు ఆమోదించునంతవరకు చట్టమునందు సూచింపబడిన అంశములకు భంగము కలుగనివిధమున గవర్నరు జనరలుగాక మంత్రులసంఖ్య వారి కివ్వవలసిన జీతములను నిర్ణయించెదరు మంత్రుల జీతము ఒకపర్యాయము నిర్ణయింపబడినపిమ్మట వారి ఉద్యోగకాలమునందు ఆ జీతపు మొత్తమును మార్చకూడదు,

(16) తనకు అవసరమని తోచునప్పుడు మంత్రులసంఘ సమావేశమునకు గవర్నరు జనరలుగారు అధ్యక్షత వహింపవచ్చును అంతే కాక మంత్రులతో సంప్రదించి, మంత్రులసంఘ సమావేశముల జరుపు విధానమును రిజర్వుడు శాఖలకు కావలసిన సమాచారములను తెలియపరచుటకై అవలంబింపవలసిన విధానమును నిర్ణయించుటకు గవర్నరు జనరలుగారికి అధికార ముండును

(17) గవర్నరు జనరలుగారికి ఆర్థికవిషయములం దొసగబడి ప్రత్యేకాధికారములను నిర్వహించుటకు మంత్రుల సలహా పొంది గవర్నరు జనరలుగారు ఆర్థికవిషయములందు సలహాల నొసగుటకు ఒక ప్రత్యేకోద్యోగిని నియమింపవచ్చును మంత్రులుకూడా తమకు అవసరమని తోచినప్పుడు ఆ ఉద్యోగిసలహాపొంద వచ్చును కాని ఆఉద్యోగి గవర్నరు జనరలుగారికిమాత్రమే బాధ్యతగలవాడయి యుండును వీరికివ్వవలసిన జీతమును గవర్నరు జెనరలుగారే నిర్ణయించెదరు ఆ జీతపు మొత్తముపై వోటు చేయుటకు శాసనసభవారికి అధికార ముండదు

(18) రిజర్వుడు శాఖల పరిపాలనము విషయమై గవర్నరు జనరలుగారి కివ్వబడిన బాధ్యతలు గాక ఫెడరేషను పరిపాలనమున ఈ దిగువ వివరింప బడిన ప్రత్యేక బాధ్యతలను గవర్నరు జనరలుగారు వహించెదరు

1 భారతదేశపు శాంతికి భంగము కలుగజేయు ఉపద్రవములను తొలగించుట,

2 ఫెడరేషనుయొక్క ఆర్థిక స్థిరత్వమును, పరపతిని సంరక్షించుట,

3 అల్ప సంఖ్యాకుల కుండవలసిన న్యాయమైన హక్కులను సంరక్షించుట,

(4) చట్టము ననుసరించి పబ్లికు సర్విసు ఉద్యోగుల కుండు హక్కులను సంరక్షించుట ఈఉద్యోగులకు న్యాయముగ నుండవలసిన ఇతర హక్కులను సంరక్షించుట

(5) వర్తక విషయములందు వివక్ష లేకుండ జేయుట

(6) సంస్థానాధీశుల హక్కులను సంరక్షించుట

(7) గవర్నరు జనరలుగారి పరిపాలనమునకు లోబడిన శాఖలకు సంబంధించిన అన్నివిషయములు

ఏయే సమయములందు పై వివరింపబడిన ప్రత్యేక బాధ్యతలకు భంగము వాటిల్లునో నిర్ణయించు విషయమై అధికారము గవర్నరు జనరలుగారికే యుండును

(19) మంత్రులసలహా పొందిన పిమ్మట కూడ తన ప్రత్యేక బాధ్యతలకు భంగము కలుగుచున్నదని ఏ విషయమునం దైనను గవర్నరు జనరలుగారికి తోచినచో అధికార నిర్వచన పత్రము సూచింపబడు విధమున స్వతంత్రించి ప్రవర్తించుటకు గవర్నరు జనరలుగారికి పూర్తి అధికార ముండును

(20) రిజర్వుడు శాఖలను పరిపాలించు విషయమునను, తన ప్రత్యేక బాధ్యతలను నిర్వహించు విషయమునను, చట్టముననుసరించి తన కివ్వబడిన ఇతర అధికారములను చెలాయించు విషయమునను గవర్నరు జనరలుగారు అధికారనిర్వచన పత్రమునందు గావింపబడిన సూచనల ననుసరించి చర్య దీసికొనెదరు

(21) గవర్నరుజనరలుగారి కివ్వబడు అధికార నిర్వచనపత్రమునందు ఈక్రింది యంశములు చేర్చబడును —"మీ పరిపాలనమునకు లోబడిన రిజర్వుడు శాఖలవిషయమునను, మీ కొసగబడిన ప్రత్యేక బాధ్యతలను నిర్వహింపవలసిన విషయములందును, చట్టముననుసరించి మీరు చెలాయింపవలసిన ఇతర అధికార విషయములందును మీరు ఫెడరేషను ప్రభుత్వసౌష్ఠవమునకు భంగ మేర్పడునట్లు మీకు ఉచితమని తోచిన చర్య తీసికొనవలెను కని ఇట్టి విషయములందు మీరు ఇండియా కార్యదర్శిగారి సలహాల ననుసరించి ప్రవర్తించుచుండవలెను పైనివరింపబడిన విషయములందు పరిపాలనమునకు సంబంధించిన ఇతర విషయములందు మీరు మంత్రుల సలహాల ననుసరించి ప్రవర్తించుచుండవలయునని మా అభిప్రాయము కాని మంత్రుల సలహాల ననుసరించిన మీ ప్రత్యేకబాధ్యతలకు భంగము వాటిల్లునని తోచినచో మంత్రులసలహా లెట్లున్నను, మీ బాధ్యతలను నిర్వహింప మీకు ఉచితమని తోచినరీతిని ఇండియా మంత్రి సూచనల ననుసరించి మీరు ప్రవర్తించ వలయును" (అధికార నిర్వచన పత్రమున ఈ పై వ్రాయబడినవాక్యములు చేరియుండును)

## ఫెడరలు శాసనసభలు

(22) సార్వభౌముని ప్రతినిధిగ గవర్నరు-జనరలుగారు స్టేటు కౌన్సిలు, అసెంబ్లిసభ అను పేరుతో రెండుసభలు ఫెడరలు ప్రభుత్వపు శాసననిర్మాణసంస్థలుగ నుండగలవు ఫెడరేషను నిర్మాణము విషయమై సార్వభౌముడు గావించు ప్రకటనయందే ప్రథమ[illegible] సభల సమావేశపు తేది ప్రకటింపబడును ఫెడరలు శాసనసభలు ఆమోదించు ప్రతిశాసనము రెండుసభల అనుమతిపై గవర్నరు జెనరలుగారిచే ప్రకటింపబడినదిగ పరిగణింపబడును

(23) శాసనసభలను సమావేశపరుచుట, సభా సమావేశములను వాయిదావేయుట, సభను రద్దుచేయుట మున్నగు విషయములందు గవర్నరు-జెనరలుగారికి పూర్తిఅధికారములుండును కాని కనీసము సం త్సరమున కొక పర్యాయ మైనను ఈసభలు సమావేశము కావలయును ఒక సమావేశమునకు మరియొక సమావేశమునకు మధ్య 12 నెలలకన్న ఎక్కువకాలము గడవగూడదు.

(24) స్టేటుకౌన్సిలు కాలపరిమితి 7 సంవత్సరములుగను, అసెంబ్లీ కాలపరిమితి 5 సంవత్సరములుగను ఉండును ఈ కాలములోపుగనే గవర్నరు-జెనరలుగారు అవసరమని తోచినసభలను రద్దుచేయవచ్చును.

(25) మంత్రులు తాము సభ్యులుగ నుండని రెండవసభయందు మాట్లాడుటకు అధికారముగలవారై యుండెదరు కాని వోటుచేయు అధికారము వారి కుండదు మంత్రులు అధికారరీత్యా రెండుసభలయందు సభ్యులుగ నుండెదరు. కాని తాము ఏ సభకు ఎన్నుకోబడిరో ఆ సభయందు మాత్రమే వోటుచేయుదురు

## శాసనసభలనిర్మాణము

26 స్టేటుకౌన్సిలుసభయందు గవర్నరు జెనరలుగారి కౌన్సిలర్లుగాక 260 మంది సభ్యులుండెదరు బ్రిటిషు ఇండియానుండి 150 మంది ఎన్నుకోబడెదరు సంస్థానాధీశులు నూరుమంది సభ్యులను నియమించెదరు గవర్నరు జెనరలుగారు అనధికారసభ్యులను 10 మందిని నియమించెదరు

27 స్టేటుకౌన్సిలుసభ్యత్వమును అభ్యర్థించువారు కనీసము 30 సంవత్సరముల వయస్సుగలవారై యుండవలెను (ఒక సంస్థానాధీశుడే కౌన్సిలుసభ్యత్వమునకు అభ్యర్థిగనుండినచో ఆవరకు వారిపట్ల అనువర్తింపదు) అభ్యర్థి బ్రిటిషు ఇండియాపౌరుడుగనో లేక సంస్థానాధీశుడుగనో లేక సంస్థానపౌరుడుగనో ఉండవలెను నిర్ణీతమగు ఆస్తిగలవాడుగగాని లేక ఇంతకుముందు భారతశాసనసభాసభ్యుడుగ గాని, లేక నిబంధనలయందు సూచింపబడు ఇతర అర్హతలు గలవాడుగ గాని యుండవలెను.

(28) సభయందు ఖాళీలు ఈ క్రిందివిధమున భర్తీచేయబడును ఎన్నుకోబడిన సభ్యుని స్థానము ఖాళీయైనచో ఆ నియోజకవర్గము మరియొక సభ్యుని ఎన్నుకొనును నియమిత సభ్యుని స్థానము ఖాళీయైనచో మరియొక నియామకము జరుగును.

(29) అసెంబ్లీ సభయందు గవర్నరు జనరలుగారి కౌన్సిలర్లుగాక 375 మంది సభ్యులుండెదరు బ్రిటిషు ఇండియా యందలి నియోజకవర్గములు 250 మంది సభ్యులను ఎన్నుకొనెదరు సంస్థానాధిపతులు 125 మంది సభ్యులను పేర్కొనెదరు

(30) అసెంబ్లీ సభ్యులు కనీసము 25 సంవత్సరములు వయస్సు గలవారై బ్రిటిషు ఇండియా పౌరులుగానైన, లేక సంస్థానపు పౌరులుగనైన నుండవలయును

31. ఈసభయందు ఖాళీలు ఏర్పడిన 28-వ క్లాజునందు సూచింపబడిన విధమున ఆ ఖాళీలు భర్తీచేయబడును.

32. ఫెడరేషనులో చేరుటకు అంగీకరించిన సంస్థానాధీశులు మాత్రమే ఈ రెండు సభలకు సభ్యులను పేర్కొను అధికారముగలవారై యుండెదరు సంస్థానాధీశులలో కొందరు ఫెడరేషనులో చేర్చనందున ఏర్పడు ఖాళీలు భర్తీచేయబడక ఖాళీలుగనే యుండును

33 రెండు సభలకు ఎన్నుకోబడు సభ్యులు సభయందు తమ స్థానములలో కూర్చొనుటకుపూర్వము సార్వభౌముని పట్ల రాజభక్తి ప్రమాణము గావింపవలెను

34 సభ్యత్వపు అనర్హతలు ఈదిగువ వివరింపబడినవి.

1 ప్రభుత్వమువల్ల అధికలాభముకలుగు ఉద్యోగములందుండు వారు మంత్రులపట్ల ఈవరతు అనువర్తింపదు

2 కోర్టువారు పిచ్చివాడు అని నిర్ణయించినవారు.

(3) డిస్చార్జి పొందని ఇన్సాల్వెంటు.

(4) ఎన్నికల సందర్భమున చట్టవిరుద్ధమగు కార్యములు గావించి నేరస్థుడని కోర్టువారిచే నిరూపింపబడినవారు.

(5) కోర్టువారిచే ప్రాక్టీసు చేయకూడదని సస్పెండుచేయబడిన న్యాయవాదులు

(6) ఫెడరలు ప్రభుత్వమువారితో కాంట్రాక్టుగలవారు

ఇట్టివారు శాసనసభలయందు సభ్యులుగ నుండజాలరు

(35) ఈవిధముగ శాసనసభ్యులుగ నుండ అనర్హులైనవారు శాసనసభ్యులుగ నుండి తమహక్కులను చలాయించినచో నిబంధనలననుసరించి నిర్ణయింపబడు జరిమానాను చెల్లింపవలసినవారై యుండెదరు ఈ జరిమానాను కోర్టులద్వారా వసూలుచేయవచ్చును

(36) సభల నిబంధనలు స్టాండింగు ఆర్డరులకు మినహాయింపు కలుగనివిధమున శాసనసభ్యులకు సంపూర్ణమగు వాక్స్వాతంత్ర్యముండును

శాసనసభలయందొసగిన ఉపన్యాసముల నాధారముగ గైకొని సభ్యులపై ఎవరును కేసు తెచ్చుటకు వీలులేదు

(37) చట్టమునందు సూచింపబడని ఎన్నికలకు సంబంధించిన ఈ క్రింది విషయములు కౌన్సిలు ఆర్డరు ననుసరించి జరుపబడును

1 వోటర్ల అర్హతలు

2 నియోజకవర్గముల హద్దులను ఏర్పరచుట.

3 సాంఘీక నియోజకవర్గములు ప్రతినిధులను ఎన్నుకొనవలసినప్పుడు అవలంబింపవలసిన పద్ధతి.

4 ఖాళీలను భర్తీచేయు విషయమున అవలంబింపవలసిన విధానము.

5 పై అంశములకు సంబంధించిన ఇతర విషయములు

ఈ విషయములకు సంబంధించిన కౌన్సిలు ఆర్డరుల చిత్తు పార్లమెంటుసభవారి ఎదుట నిర్ణీతకాలమువరకు ఉంచవలెను

ఎన్నికలకు సంబంధించిన ఇతరవిషయములను నిర్ణయించు చట్టమును తయారుచేయుటకు ఫెడరలు శాసనసభ వారికి అధికార ముండును కాని ఇట్టి చట్టము తయారగునంతవరకు ప్రస్తుతము అమలునందున్న నిబంధనలు, చట్టములు అనుసరింపబడును

## శాసనసభా కార్యవిధానము

(38) ఆర్థికపు బిల్లులు అసెంబ్లీ సభయందుమాత్రమే ప్రవేశపెట్టబడును ఇతర బిల్లులను ఏసభయందైనను ప్రవేశ పెట్టవచ్చును

(39) చట్టమునందు సూచింపబడిన విధమున, రెండు సభల యందు ఆమోదింపబడిన బిల్లులను సార్వభౌముని పేరట చట్టముగ అంగీకరించుటకును, లేక తన అంగీకారమును నిరాకరించుటకును, లేక సార్వభౌముని ఆమోదమునకై నిలిపియుంచుటకును గవర్నరుజనరలు గారికి అధికార ముండును కాని ఇట్లు చేయుటకు పూర్వము పునరాలోచన మొనర్పవలయునను సందేశముతో బిల్లును మరల శాసన సభలకు పంపుటకును, కొన్ని సవరణలను సూచించుటకు గవర్నరు జనరలుగారికి అధికారముండును ఒక బిల్లు చట్టముకావలయుననిన పూర్తిబిల్లుకు అన్నిసవరణలతో రెండుసభలు ఆమోదింపవలయును పిమ్మట గవర్నరుజనరలుగారు ఆ బిల్లును ఆమోదింపవలయును రిజర్వుడు శాఖలకు సంబంధించిన బిల్లులు సభాయుతుడగు సార్వభౌముని ఆమోదము పొందినగాని చట్టములుకావు

(40) గవర్నరు జనరలుగారు ఆమోదించినబిల్లులను 12 నెలల లోగా సభాయుతుడగు సార్వభౌముడు నిరాకరింపవచ్చును

(41) ఒకబిల్లు విషయమున రెండు శాసనసభలకు భిన్నాభిప్రాయము లేర్పడినపుడు, కొన్నిసవరణలను ఒకసభవారు ఆమోదించి రెండవసభవారు నిరాకరించినప్పుడు, ఒక సభయందు బిల్లు ఆమోదింపబడిన మూడునెలల లోపుగ రెండవసభలో ఆబిల్లు ఆమోదింపబడనప్పుడు బిల్లుపై ఖాయమగు నిర్ణయము గావించుటకు గవర్నరు జనరలుగారు రెండుసభల సమష్టిసమావేశమును జరిపెదరు. ఈసమష్టి సమావేశమున ఈబిల్లుమీదను, సవరణలమీదను సమ్మతులు పుచ్చుకొనబడును ఈ సమావేశమున ఆమోదింపబడిన బిల్లు రెండుసభల యందు ఆమోదింపబడినట్లుగ పరిగణింపబడును.

ఆర్థికపు బిల్లుల విషయమునను, తన ప్రత్యేకబాధ్యతలను నిర్వహించు విషయమున కాలహరణము జరుగబడదని గవర్నరుజనరలు గారికి తోచినప్పుడును వారు తమంతట తామే సమష్టి సమావేశమును జరిపెదరు

(42) రిజర్వుడుశాఖల పరిపాలనమునకు తనకొసగబడిన ప్రత్యేక బాధ్యతలను నిర్వహించుటకును ఈ క్రిందివిధమున ప్రవర్తించుటకు గవర్నరు జనరలుగారికి ఈక్రింది అధికారము లివ్వబడినవి

1 రిజర్వుడు శాఖల పరిపాలనమునకుగాని, ప్రత్యేక బాధ్యతల నిర్వహణమునకుగాని నిర్ణీత కాలములోగా ఈ బిల్లు ఆమోదించుట అవసరమనుసందేశముతో గవర్నరుజనరలుగారు ఏ సభయందైనను ఒక బిల్లును ప్రవేశపెట్టవచ్చును

2 ఏ సభయందు చర్చ జరుగుచున్న బిల్లులను పై కారణముల ననుసరించి నిర్ణీతకాలములోగ చట్టముగ ఆమోదించుట అవసరమని గవర్నరుజనరలుగారొక సందేశమును పంపవచ్చును

ఇట్టి సందేశముతో పంపబడిన బిల్లు నిర్ణీతకాలములో రెండు సభలయందును ఆమోదింపబడనిచో ఆ బిల్లును చట్టముగ ఆమోదించుటకు గవర్నరు జనరలుగారికి అధికారముండును ఈ విధముగ గవర్నరు జనరలుగారిచే ఆమోదింపబడు చట్టములు ఇతర చట్టముల వలెనే అమలునందుంచబడును ఫెడరలు శాసనసభవారే చట్టములు చేయగలరో, ఆవిషయములకు సంబంధించిన చట్టములను మాత్రమే గవర్నరు జనరలుగారు ఈ విధమున ఆమోదింపవచ్చును

(43) ఈవిధముగ గవర్నరు జనరలుగారి సొంత బాధ్యతపై తయారుచేయబడు చట్టముల ఉపోద్ఘాతమునందు ఈవిషయము తెలుపబడును

(44) శాసనసభలయందు చర్చకు తేబడు బిల్లులు సవరణలపై జరుగు చర్చ తన ప్రత్యేకబాధ్యతలను చలాయించుటకు భంగము కలుగజేయుచున్నదని గవర్నరుజెనరలుగారికి తోచినచో అట్టి బిల్లులమీదగాని సవరణలమీదగాని చర్చను నిషేధించుటకు గవర్నరు జెనరలుగారికి అధికారముండును

## ఆర్థికవిషయాలోచన క్రమము

45 ఫెడరల్ శాసనసభలు రెండిటిలోగూడ పన్నులవిధింపుటకుగాని, ప్రభుత్వాదాయ వినియోగమునకుగాని, ప్రభుత్వ ఋణ సంబంధమైన యే ప్రతిపాదనకుగాని, ప్రభుత్వాదాయమునకు క్రొత్త ఖర్చు తెచ్చిపెట్టు యే ప్రతిపాదనకుగాని గవర్నరుజెనరలువారి శిఫారసు గావలసియుండును.

[దీనిలో గల రాజ్యాంగసూత్రము బ్రిటిషు సామ్రాజ్యములోని ప్రతి రాజ్యాంగమునను గలదు కామన్సుసభ స్టాండింగు ఆర్డరు 66 యిట్లున్నది— పబ్లిక్ సర్వీసుకు సంబంధించిన యేమొత్తమును గూర్చి పిటీషనుగాని, పబ్లిక్ రెవిన్యూనుండి ఖర్చుపెట్టవలయునను ప్రతిపాదనగాని, సార్వభౌముని శిఫారసులేనిదే యీ సభవారిచే చర్చింపబడదు]

46 ప్రతి సంవత్సరము ఫెడరేషనుయొక్క ఆయవ్యయముల అంచనాలును, రెవిన్యూ వినియోగ ప్రతిపాదనలును శాసనసభలు రెండిటి లోను గవర్నరు జెనరలుగారు ప్రవేశపెట్టజేసెదరు

ఈ ఆర్థికపత్రములో

1. శాసనసభ వోటునకు పెట్టబడు ప్రతిపాదనలు, వోటుకు పెట్టబడని ప్రతిపాదనలు వేఱువేఱుగా సూచింపబడును (వోటుకు పెట్టబడనివాటికి 49-వ పేరా చూచునది) వోటుకుపెట్ట బడని వానిలో స్థితవ్యయాంశములు ప్రత్యేకముగా సూచింపబడును (49-వ పేరాలోని పట్టికలో నక్షత్రాంకితములను పరీక్షించునది)

2 వోటుకు పెట్టబడునవిగాని పెట్టబడనివిగాని, గవర్నరు జెనరలు తన ప్రత్యేకబాధ్యతలు నిర్వహించుటకొఱకు అవసరములని తలచు అదనపు ప్రతిపాదన లేవైన నున్నయెడల, అవి వేఱుగా సూచింపబడును

47. రెవిన్యూ వినియోగ ప్రతిపాదనలను 49-వ పేరాలో సూచింపబడిన వ్యయశీర్షికలు తప్ప మిగిలిన వాటిని, గవర్నరు జెనరలుగారి ప్రత్యేకబాధ్యతల కొఱకు సూచింపబడిన ప్రతిపాదనలను గ్రాంట్లు డిమాండు మూలకముగా అసెంబ్లీ వారు వోటుకు పెట్టెదరు ఏ డిమాండుగాని అంగీకరించుటకును, నిరాకరించుటకు, పూర్తి మొత్తమును తగ్గించుటకు, ఏదేని నిర్దిష్టాంశమును తగ్గించుట అసెంబ్లీవారి కధికారము గలదు

48 తరువాత అసెంబ్లీ ముందుపెట్టిన డిమాండు లన్నియు స్టేటుకౌన్సిలుముందు పెట్టబడును అసెంబ్లీవారు నిరాకరించినట్టి గాని, తగ్గించినట్టిగాని డిమాండులను రెండుసభల సంయుక్త సమావేశమునందు పరిష్కరింప వలసినదిగా ప్రభుత్వమువారు స్టేటుకౌన్సిలులో ప్రతిపాదించి అంగీకరింప జేయవచ్చును

49 రెవిన్యూ వినియోగ ప్రతిపాదనలలో ఈక్రింద నొసగు వ్యయశీర్షికలకు సంబంధించిన ప్రతిపాదనలు రెండు శాసనసభల వోటునకు పెట్టబడవు. కాని శాసనసభలు వాటిని చర్చింపవచ్చును అందునను గవర్నరుజెనరలుగారి జీతము, అలవెన్సులు, సంస్థానాధిపతులతో సార్వభౌముని సంబంధ నిర్వహణార్థమగు వ్యయాంశములు చర్చింపగూడ వీలులేదు

వోటుకు పెట్టబడని వ్యయాంశములు

(1) ప్రభుత్వఋణములకు సంబంధించిన వడ్డీ, తఱుగుదల, నిధి మున్నగు వ్యయము*, రాజ్యాంగచట్టముబట్టిగాని, దాని ననుసరించిగాని నిర్ణయింపబడిన వ్యయము*; ఏ కోర్టుగాని, మధ్యవర్తులుగాని యిచ్చిన డిక్రీకిగాను తగులు వ్యయము

(2) గవర్నరుజెనరలు జీతము, అలవెన్సులు*; మంత్రుల జీతములు*, గవర్నరు జెనరలు సలహాదారుల జీతములు*, ఆర్థిక సలహాదారుని జీతము*, చీఫ్ కమీషనర్ల జీతములు*, గవర్నరు జెనరలుగారి సొంత సిబ్బందికి, సెక్రిటేరియటు సిబ్బంది, ఆర్థిక సలహాదారుని సిబ్బంది కిచ్చు జీతములు, అలవెన్సులు

(3) రిజర్వుశాఖల కగు వ్యయము, సార్వభౌమునికి సంస్థానాధీశులకు గల సంబంధనిర్వహణార్థ మగు వ్యయము, సెక్రెటరీ ఆఫ్ స్టేటుగారికి రాజ్యాంగ చట్టమువలన విధ్యుక్తనిర్వహణమున కగు వ్యయము

(4) ఫెడరల్, లేక సుప్రీము కోర్టుజడ్జిలయు, జ్యూడిషల్ కమీషనర్లయు జీతములు, పింఛనులు (వారి సంబంధీకుల కిచ్చు పింఛనులుగూడ)

ఈ కోర్టుల వ్యయమునకై మంత్రులను సంప్రతించి గవర్నరు జెనరలుగారు సర్టిఫై చేసిన వ్యయము

(5) బహిష్కృత భూములకును, బ్రిటిషుబెలూచిస్థానమునకు అగు వ్యయము

పబ్లిక్ సర్వీసులో కొన్ని శాఖలవారి జీతములు, వారియొక్కయు, వారి సంబంధీకులయు పింఛనులు, వారికైన మఱికొన్ని మొత్తములు (అనుబంధము 7, భాగము 3 చూచునది)

ఈ పేరాలో చెప్పబడిన వ్యయశీర్షికలలో నొక వ్యయాంశము చేరునా, చేరదా యను విషయమును గవర్నరు జెనరలుగారే తీర్మానించ సమర్థులు దాని నభ్యంతరపెట్టుట కెవ్వరికిని అధికారము లేదు

50. బడ్జెటు కార్యక్రమానంతరము వోటుచేయబడిన డిమాండులును, 49-వ పేరాలోను చెప్పబడిన వ్యయాంశములను గవర్నరుజెనరలుగారు తమ సంతకముతో ధ్రువపఱచెదరు ఇట్లు ధ్రువపడిన పత్రము రెండుశాసనసభలవారికి ప్రదర్శింపబడును కాని వాటిపై చర్చ జరుగగూడదు

ఇట్లు ధ్రువపఱచిన గ్రాంటులలో గవర్నరుజెనరలుగారు తన ప్రత్యేకబాధ్యతలకొఱకు అదనపు మొత్తముల జేర్పవచ్చును కాని యే వ్యయశీర్షిక క్రిందను శాసనసభకు ప్రదర్శింపబడిన వ్యయము మొత్తము నతిక్రమింపగూడదు

ఆ మొత్తములను గవర్నరుజెనరలుగారు ధ్రువపఱచుటతో వినియోగింపవచ్చును

51 ఆర్థిక సంవత్సరములోపల బడ్జెటుఅంచనాలో చేర్చబడని వ్యయమునకు రెవిన్యూ వినియోగమునుగూర్చి, అవసరమైన మార్పులతో 45-50-వ పేరాలలోని కార్యక్రమ నిబంధనలచే పూర్తింపజేయనగును

## ఫెడరల్ శాసనసభా కార్యక్రమము

52. రాజ్యాంగచట్టము ననుసరించి, రెండుశాసనసభలవారును తమ సభానుక్రమణికగూర్చి నిర్బంధనల నేర్పరచుకొనవలెను తదను సారముగా శాసనసభకార్యక్రమము జరుగును కాని గవర్నరుజెనరలు వారు సభాధ్యక్షునితో సంప్రదించి యీక్రింది విషయములం గూర్చి నిబంధనలు గావింపవచ్చును.

(ఎ) రిజర్వుశాఖల పరిపాలనను గాని తన ప్రత్యేక బాధ్యతలను గాని సంబంధించి ప్రతిశాసనసభలో కార్యక్రమము.

(బి) గవర్నరుజెనరలుగారి సమ్మతిని ముందుగా పొంది తప్ప క్రింది అంశములను చర్చించుటగాని, వాటినిగూర్చి ప్రశ్నించుట గాని నిషేధింపవచ్చును

(1) ఫెడరల్ శాఖలుగా సంస్థానాదీశుల అధికార దానపత్రములో అంగీకరించిన విషయములు తప్ప సంస్థానములకు సంబంధించిన ఇతర విషయములు

(2) గవర్నరుతో గవర్నరు జనరలుగారి సంబధపరముగా గైకొనబడిన చర్యలు.

(3) సార్వభౌముడు, లేక గవర్నరు జెనరలుగారికిని విదేశీ రాజ్యములు, లేక విదేశరాజ్యాధిపతులకును గల సంబంధముల గూర్చిన విషయములు.

ఇట్లు గవర్నరుజెనరలు చేసిన నిబంధనలకు, శాసనసభవారు చేసిన నిబంధనలకు మేళనము పొసగనిచోట్ల, గవర్నరుజెనరలుగారి నిబంధనయే చెల్లుబడి యగును. వ్యతిరిక్తమగు శాసనసభ నిబంధన నిరస్తమగును

## శాసనములంగూర్చి గవర్నరుజెనరలుగారి విశేషాధికారము

53. తన రిజర్వుశాఖల అవసరమునుబట్టి గాని రాజ్యాంగచట్టమువలని తన ప్రత్యేక బాధ్యతల నిర్వహించుటకుగాని, గవర్నరుజెనరలు తన విచక్షణ నుపయోగించి ఫెడరల్ శాసనసభవారు శాసించగల పర్యంతము తానే ఆర్డినెన్సులను తయారుచేసి ప్రకటింప వచ్చును. ఇట్టి ఆర్డినెన్సులు ఆరు నెలలకు మించకుండా అందు నిర్దేశింపబడిన కాలములో అమలులో నుండును ఒక ఆర్డినెన్సును మరి ఆరునెలల కాలము పొడిగించుటకు గవర్నరుజెనరలుగారి కధికారమున్నది. కాని అట్టి సందర్భములో వారు దానిని రెండుశాసనసభలకును ప్రదర్శించెదరు.

ఇట్టి ఆర్డినెన్సులు ఫెడరల్ శాసనసభ చట్టములకు గల పాటింపునే గలిగియుండును. రాజ్యాంగచట్టము ప్రకారము, ఫెడరల్ శాసనముల వలెనే యీ ఆర్డినెన్సులనుగూడ అట్లే త్రోసివేయు నధికారము సార్వభౌమునకుండును గవర్నరుజెనరలుగారు తమ ఆర్డినెన్సుల నుపసంహరించుకొనుటకును అధికారము గల్గియుందురు

54 పై పేరాలలో గవర్నరు జెనరలు సొంతవిచక్షణ నుపయోగించి ఆర్డినెన్సుల ప్రయోగించుటయేగాక, ఫెడరల్ శాసనసభ హాజరులో లేనపుడు బ్రిటిషు ఇండియా అంతటియొక్క గాని లేదా అందే భాగముయొక్కగాని సత్వరిపాలనకై, అవసర మేర్పడినదని మంత్రులు తలచుచో రాజ్యాంగ చట్టము ప్రకారము ఫెడరల్ శాసనసభలకు అధికారము గలమేరను, ఆర్డినెన్సుల ప్రకటింపవచ్చును ఇట్లు ప్రకటింపబడిన ప్రతి ఆర్డినెన్సు ఫెడరల్ శాసనసభ చట్టముయొక్క పాటింపునే గలిగియుండును కాని అట్టి ఆర్డినెన్సు ప్రతిదిగూడ.

(ఎ) ఫెడరల్ శాసనసభ ముందు ప్రదర్శింపబడవలెను శాసనసభ తిరిగి కూడిన 6 వారములకు అది అస్తమించును ఆర్డినెన్సు ప్రతిపాదనను శాసనసభ నిరాకరించినచో అప్పుడే అది అస్తమించును

(బి) ఫెడరల్ శాసనము లన్నింటివలెనే దీనిని గూడ త్రోసివేయు అధికారము సార్వభౌమునకుండును గవర్నరు జెనరలు ఆర్డినెన్సు నెప్పుడైన విరమింపవచ్చును

## రాజ్యాంగపతనమైనప్పుడు నిబంధనలు

55 రాజ్యాంగ చట్టము ప్రకారము ఫెడరల్ ప్రభుత్వమును సాగించుట సాధ్యము కాదని తనకు తోచినపుడు గవర్నరు జెనరలు ఫెడరల్ ప్రభుత్వాధికారము నంతటిని స్వహస్తగతము చేసికొనుచు ప్రకటన గావింపవచ్చును

ఇట్టి ప్రకటన పార్లమెంటు చట్టమునకుగల పాటింపు గల్గియుండును వెంటనే సెక్రటరీ ఆఫ్ స్టేటునకు పంపబడి పార్లమెంటునకు ప్రదర్శింపబడును ఈలోపల పార్లమెంటు రెండు సభలవారు ఆమోదింపనిచో 6 నెలలకు సమాప్తమగును పార్లమెంటుసభల తీర్మానమునుబట్టి యెప్పుడైన విరమింపబడవచ్చును

## చీఫ్ కమీషనర్ల రాష్ట్రములు

56. బ్రిటిషు బెలూచిస్థానము ఢిల్లీ, ఆజ్మీరు, మార్వారా, కూర్గు అండమాన్, నికోబార్ దీవులు ఒక్కొక్కటియు నొక్కొక్క చీఫ్ కమీషనరుచే రాజ్యాంగచట్టము ప్రకారము పరిపాలింపబడును. గవర్నరు జెనరలుగారు తమ యభీష్టముప్రకారము చీఫ్ కమీషనర్ల నియమించెదరు; తమ యిష్టప్రకారము తొలగించెదరు

57. బ్రిటిషు బెలూచిస్థానమును గవర్నరు జెనరలుగారే చీఫ్ కమీషనరు ద్వారా పరిపాలన సాగించుటకు ప్రత్యేక నిబంధన లేర్పరుపబడును.

58. బ్రిటిషు బెలూచిస్థానమునకు కావలసిన శాసనాదికమునకీ క్రింది యేర్పాటు.—

ఫెడరల్ శాసనసభ చట్టమేది కూడ గవర్నరు జెనరలుగారు ప్రత్యేకము అన్వయింపనిదే బ్రిటిషు బెలూచిస్థానమునకు చెల్లదు. అట్లు దానిని అన్వయించుటలో గవర్నరుగారు తనకుతోచిన మార్పుల గావింపవచ్చును రాష్ట్రమున కంతటికిని, లేదా అందులో ఏ భాగమునకు గాని చట్టము నన్వయింపవచ్చును బ్రిటిషు బెలూచిస్థానము శాంతిసత్పరిపాలనలకై గవర్నరు జెనరలు నిబంధనల గావించెదరు. అట్టి నిబంధనలవలన ఫెడరల్ చట్టమును దేనినిగాని ఆరాష్ట్రములో అమలులో నున్న దానిని ఖాయ మార్చవచ్చును. మార్చినట్లు గజెటులో ప్రకటింపబడిన తరువాత అట్టినిబంధన ఫెడరల్ చట్టములవలెనే ఆరాష్ట్రమున అమలులో నుండును ఈ నిబంధనలును ఫెడరల్ చట్టములవలెనే బ్రిటిషు సార్వభౌముని త్రోసివేతకు లోబడియుండును.

పై జెప్పిన విధానము అండమాన్ నికోబార్ దీవులకును వర్తించును

59 ఛీఫ్‌కమిషనర్ల రాష్ట్రములలో ఛీఫ్ కమీషనరునకు కార్యాధికారము సమగ్రముగా నుండును బ్రిటిషు బెలూచిస్థానముతప్ప ఇతరచోట్ల ఈ అధికారమును వినియోగించుటలో ఛీఫ్ కమీషనరు ఫెడరల్ ప్రభుత్వమునకు లోబడియుండును

60. ఫెడరేషనునకు ముందుగా కూర్గు శాసనసభ యెట్లున్నదో అట్లే ఫెడరేషను వెనుకగూడ నుండును దీని శాసనాధికారముగూర్చి యేర్పాట్లు గావింపబడును.

భాగము ౨

# గవర్నర్లరాష్ట్రములు

## రాష్ట్రకార్యనిర్వాహకవర్గము

61 గవర్నరు రాష్ట్ర మనగా బెంగాలు, మదరాసు, బొంబాయి రాజధానులు, సంయుక్త పరగణాలు, పంజాబు, బీహారు, మధ్య పరగణాలు, అస్సాము, వాయవ్యసరిహద్దురాష్ట్రము, సింధు, ఉత్కళము (వీరారుగూర్చి ప్రస్తావన 45-వ పేరా చూచునది)

62. గవర్నరు రాష్ట్రములో సార్వభౌముని తరఫున, సార్వభౌమునిచే నియమింపబడిన గవర్నరు అధికారముచేయును. ప్రభుత్వ శాసనము లన్నియు గవర్నరుపేరట జరగును.

63 రాజ్యాంగ చట్టమువలన రాష్ట్ర ప్రభుత్వాధిపతిగా సంక్రమించు నధికారమును, సార్వభౌముడు గవర్నరును నియమించునపుడు లెటర్సు పేటెంటుద్వారా రాజ్యాంగ చట్టమునకు వ్యతిరిక్తము గాకుండా తనకు గల ప్రత్యేకాధికారములో అనుగ్రహించిన అధికారమును గవర్నరు కలిగియుండును ఈ అధికార నిర్వహణమున గవర్నరు తన్ను నియమించునపుడు సార్వభౌము డొసగు ఆజ్ఞాపత్రము ననుసరించి వర్తించును.

64. గవర్నర్ల ఆజ్ఞాపత్రము చిత్తు పార్లమెంటులో రెండు సభల ముందు ప్రదర్శింపబడును అందులో నేదైన మార్పు చెర్పు కూర్పులనుగూర్చి పార్లమెంటువారు తమకు తోచిన సవరణలను సార్వభౌమునికి నివేదింపవచ్చును.

65 గవర్నరు జీతము రాజ్యాంగచట్టములో నిర్ణయింపబడును అతని అలవెన్సులు, అతని సొంత సిబ్బంది, సెక్రటేరియట్ సిబ్బందికగు ఖర్చు ఆర్డర్-ఇన్-కౌన్సిలు వలన నిర్ణయింపబడును. ఇవేవియు శాసనసభ వోటునకు పెట్టబడవు.

## రాష్ట్ర కార్యవర్గవిధానము

66 రాజ్యాంగ చట్టమును బట్టి రాష్ట్రమున తాను పరిపాలించుటలో నతనికి తోడ్పడుటకు సలహా నిచ్చుటకు మంత్రివర్గ మేర్పరుపబడును. చట్టమువలన గవర్నరు ప్రత్యేక విచక్షణకు వదలబడిన అంశములు, బహిష్కృత భూములు మంత్రుల అధికారవ్యాప్తిలో చేరవు మంత్రులను గవర్నరుగారు ఏరి, పిలిచి, కార్యవర్గ సభ్యులుగా ప్రమాణము చేయించెదరు. వీరి మంత్రిత్వము గవర్నరు యిష్టమునుబట్టి సమాప్తమగును మంత్రులుగా నియమింపబడువారు శాసనసభ సభ్యులుగా నైన ఉండవలెను నిర్దిష్ట కాలములోపల సభ్యత్వమును సంపాదింపనైన సంపాదింపవలెను

67 శాసనసభలో సంఖ్యాబలము గలవాని సలహాతో, శాసనసభ విశ్వాసమును చూఱగొనగల యట్టి వారలను (సాధ్యమైనంతవఱకు అల్పసంఖ్యాక వర్గముల ప్రతినిధులను గూడ) మంత్రులుగా నియమించుటకు ప్రయత్నింప వలసినదని గవర్నరు ఆజ్ఞాపత్రములో అనుశాసింపబడును

68 మంత్రుల సంఖ్యయు, వారి జీతములును రాష్ట్ర శాసనసభవారే శాసించెదరు కాని శాసనసభవారు తద్వ్యతిరేకముగా నిర్ణయించువఱకు గవర్నరుగారే రాజ్యాంగ చట్టపు హద్దులను మీఱకుండా, మంత్రుల సంఖ్యను, జీతములను నిర్ణయించెదరు.

ఒక మంత్రిజీతము అతడు అధికారములోనున్న పరిమిత కాలములోపల మార్పజేయబడదు

69. గవర్నరు తన యిష్టమువచ్చినపుడు మంత్రివర్గ సభల కధ్యక్షత వహించవచ్చును మంత్రులతో నాలోచించి, ప్రభుత్వ కార్యక్రమ నిర్వహణముం గూర్చి, తనకు వలసిన తాఖీదులను పంపించుట గూర్చి అవసరమైన నిబంధనల గావింపవచ్చును

70 ఒక రాష్ట్ర పరిపాలనమున గవర్నరున కీక్రింది యంశములయందును ప్రత్యేకబాధ్యత యుండును -

(1) రాష్ట్రముయొక్క, లేదా అందులో ఏభాగము యొక్క శాంతికి భంగము కలుగునట్లున్న, దాని వారించుట

(2) అల్పసంఖ్యాకవర్గముల సక్రమహక్కుల సంరక్షణము.

(3) పబ్లిక్ సర్వీసులవారికి రాజ్యాంగచట్టములో ప్రసాదింపబడిన హక్కులనుసమర్థించుట, వారి సక్రమహక్కుల కాపాడుట

(4) వాణిజ్య పక్షపాతమును నిరోధించుట.

(5) సంస్థానముల హక్కుల సంరక్షణ.

(6) బహిష్కృత భూములుగా నిర్ణయింపబడిన వాని పరిపాలన.

(7) గవర్నరు జెనరలు సక్రమముగా నొసగిన ఉత్తరువులనములుజరిపించుట

వాయవ్య సరిహద్దురాష్ట్రము, సింధురాష్ట్రము గవర్నర్లకు మఱియు ప్రత్యేక బాధ్యతలుండును

(8) సరిహద్దు జాతులంగూర్చి గవర్నరు జెనరలు అధికారమును అతని ఏజెంటుగా నిర్వహించుట

(9) సుక్కూరు ఆనకట్ట పరిపాలనము

ఏ సందర్భములలో యేది తన ప్రత్యేక బాధ్యతయో నిర్ణయించు నధికారము గవర్నరున కుండును.

71. తన ప్రత్యేక బాధ్యతలవిషయములో, మంత్రుల సలహాను ఆలోచించినవెనుక తనకు అవసరమని తోచినపుడు గవర్నరు తన యిష్టముచొప్పున చర్య గైకొనవచ్చును ఈ విషయమున తన ఆజ్ఞాపత్రములోని ఆదేశముల ననుసరించవలసినది.

72 తన ప్రత్యేక బాధ్యతలవిషయమునను, రాజ్యాంగచట్టము గలన తన విచక్షణకు వదలబడిన విషయము లేవైన ఉన్నయెడల వాటియందును, గవర్నరు ఆజ్ఞాపత్రాదేశములకు వ్యతిరిక్తముగా కుండా గవర్నరు జెనరలుగాని, సెక్రటరీఆఫ్ స్టేటుగాని యిచ్చు సలహాననుసరించి నడవవలయును

73. గవర్నరు ఆజ్ఞాపత్రములో ఈక్రింది నిబంధనలుండును "మీవిచక్షణకు వదలబడిన విషయములందును, బహిష్కృత భూముల పరిపాలనమందును మీరు రాష్ట్రస్వపరిపాలన కెట్లు నడచుకొనిన మంచిదని తలతురో అట్లు నడచుకొనవలసినది గవర్నరుజెనరలు యొక్క , ప్రధానకార్య సచివులలో నొకరి (సెక్రటరి ఆఫ్ స్టేట్) యొక్కయు సలహాల ననుసరించి పోవలసినది.

పై జెప్పినవిగాక యితరముగా మీపరమైన రాష్ట్రాధికారమును వినియోగించుటలో మీమంత్రుల సలహా ననుసరించవలసినది అట్లనుసరించుట మీప్రత్యేక బాధ్యతలకు భంగకరమని తోచిన సమయములందు మాత్రము మంత్రులసలహా యెట్లున్నను మీరు మీ ప్రత్యేక బాధ్యతల నిర్వహణముకకు తగినట్లు నడచుకొనవలసినది ఇందుగూర్చి గవర్నరుజెనరలు యొక్కయు మా ప్రధాన కార్యసచివులలో నొకరి యొక్కయు సలహా ననుసరించి పోవలసినది".

## రాష్ట్రశాసనసభ

74 ప్రతి గవర్నరు రాష్ట్రములోను రాష్ట్రశాసనసభ యుండును. దీని అంగములు రాజు (అతని ప్రతినిధి గవర్నరు), ప్రజా ప్రతినిధుల సభ (లెజిస్లేటివు అసెంబ్లీ.)

బెంగాలు, సంయుక్త పరగణాలు, బీహారు రాష్ట్రములలో మాత్రము శాసనసభాంగములు వరుసగా రాజు (అతని ప్రతినిధి గవర్నరు), లెజిస్లేటివు కౌన్సిలు, లెజిస్లేటివు అసెంబ్లీ రాజ్యాంగచట్టము అమలులోనికి వచ్చిన తరువాత పదేండ్లకు:

(1) రెండు శాసనసభ లుండు రాష్ట్రములలో, రెండు శాసనసభలును ఒకే సభగా ఉండవలయునని వేర్వేరుగా తీర్మానించి, తరువాత రెండేండ్లకు మఱి దానిని ధ్రువపఱచినట్లయితే, రెండు శాసనసభలకు బదులు ఒకే శాసనసభ అమలులోనికి వచ్చును.

(2) ఒక శాసనసభ ఉండు రాష్ట్రములలో రెండు శాసనసభలుండవలెనని రెండవసభ సభ్యత్వము యెన్నికల పద్ధతిని ఆర్డర్-ఇన్-కౌన్సిలు ద్వారా నిర్ణయించవలసినదని సార్వభౌమునకు విజ్ఞప్తి నంపుకొనవచ్చును.

రాష్ట్ర శాసనసభ ప్రారంభమగు రోజు ప్రకటన యందు నిర్దేశింప బడును

ప్రతి చట్టముకూడ లెజిస్లేటివు అసెంబ్లీ సమ్మతితో, లేదా రెండు సభలున్న చోట్ల రెండుసభల అనుమతితో గవర్నరు గావించు చట్టమని వ్యవహరింపబడును.

75 రాష్ట్ర శాసనసభను సమావేశపఱచుటకుగాని, సమావేశస్థల నిర్ణయము సేయుటకు గాని, విరమించుటకుగాని, ఉపసంహరించుటకు గాని గవర్నరునకధికారముండును ప్రతి సంవత్సరము శాసనసభ ఒక్కసారియైన సమావేశముగావలెను. రెండు సమావేశములకు మధ్య సంవత్సరమునకు మించి యెడ ముండరాదు

రెండు శాసనసభలున్న రాష్ట్రములలో రెంటిని ఒకటిగాగాని, వేరు వేరుగాగాని ఉపసంహరింపవచ్చును.

గవర్నరు తాను ప్రసంగించుటకై శాసనసభను సమావేశపఱచవచ్చును. ప్రతి లెజిస్లేటివు అసెంబ్లీ ఐదేండ్లుండును లెజిస్లేటివుకౌన్సిలు ఉన్నచోట్ల ఏడేండ్లకు ఇంతకులోపలనే ఇవి ఉపసంహారము గావించవచ్చును.



జి. నరసింహంగారు, బి. ఏ.
రిజిష్ట్రరు అక్కౌంటెంటు, మదరాసు.



శ్రీయుతులు వాకాటి కృష్ణమూర్తి, హెబ్బళ్లి కృష్ణభాగవతర్,
యం. వేణుగోపాల నాయుడుగార్లు

77 రెండు శాసనసభ లున్న రాష్ట్రములలో మంత్రి వర్గమునకు జెందిన సభ్యుడు తాను సభ్యుడుగా సభలో మాట్లాడవచ్చునుగాని వోటుచేయరాదు

## రాష్ట్ర శాసనసభ నిర్మాణము

78 ప్రతి గవర్నరు రాష్ట్రములో లెజిస్లేటివు అసెంబ్లీకి అనుబంధము 3 భాగము 1 లో వివరింపబడిన సభ్యుల సంఖ్య యెన్నిక విధానము అన్వయించును

79 రాష్ట్రశాసనసభ (అసెంబ్లీ) సభ్యుడు ప్రతివాడును 25 యేండ్లు వయసు దాటియుండవలెను బ్రిటిషుపౌరుడో సంస్థానపౌరుడో యై యుండవలెను.

80 రెండవసభ (లెజిస్లేటివు కౌన్సిలు) సభ్యులసంఖ్య, వారి యెన్నిక, నామినేషన్ విధానము అనుబంధము 3, భాగము 2 లో సూచింపబడినది

81 రాష్ట్రీయ కౌన్సిలులో సభ్యులు 30 యేండ్లు మించినవారుగా నుండవచ్చును బ్రిటిషుపౌరుడో, సంస్థానపౌరుడో యై యుండవలెను

82 రాష్ట్రశాసనసభలో ఖాళీలను భర్తీచేయుటకు ఫెడరల్ శాసనసభ నేర్పరచిన విధానమే అన్వయించును (28, 31 పేరాలను చూచునది)

## చట్టనిర్మాణ విధానము, గవర్నరుల అనుమతి

సూచన — చట్టనిర్మాణ విధానమునకు సంబంధించిన ఈక్రింది పేరాలు, 91-వ పేరా మినహా, ఒక్క శాసనసభయున్న రాష్ట్రములకు మాత్రమే యుద్దేశింపబడెను రెండు శాసనసభ లున్నపుడు ఈ విధానమునందు అవసరమగు సవరణ లొనర్పబడవలసియుండును అట్టి మార్పులలో ఆదాయవ్యయములకు సంబంధించిన చట్టములదప్ప ఇతర చట్టములను మొదట రెంటిలో నేశాసనసభయందైనను ప్రవేశ పెట్టవచ్చునను విషయముగూడ చేర్పబడును.

88 భారత ప్రభుత్వనిర్మాణచట్టమునకును, అధికార నిర్వచన పత్రమునకును (ఇన్‌స్ట్రుమెంటు ఆఫ్ ఇన్‌స్ట్రక్షన్సు) లోబడి గవర్నరుగారు రాష్ట్రీయ శాసనసభచే గావింపబడిన చట్టములకు సార్వభౌముని పేర అంగీకారము నొసగవచ్చును. అంగీకారమును నిరాకరింపవచ్చును, లేక గవర్నరు జనరలుగారి ఆమోదమునకు నిలిపియుంచవచ్చును. కాని ఈ పద్ధతుల నవలంబించుటకు ముందు సదరు చట్టమును పూర్తిగగాని కొన్ని, భాగములను గాని పునర్విచారణ మొనర్పవలెనని తనకు దోచిన సవరణలను సిఫార్సుచేసి తిరిగి శాసనసభకు పంపవచ్చును.

సవరణలతోగాని, సవరణలు లేకుండగాని శాసనసభచే నామోదింపబడి గవర్నరుగారి యొక్కయు, చట్టమున సూచింపబడినటుల కొన్ని సందర్భములలో గవర్నరుజనరలుగారి యొక్కయు ఆమోదము నందువరకేచట్టమును శాసనముగాదు అట్టిచట్టము గవర్నరుజనరలుగారియొక్కగాని, సార్వభౌమునియొక్కగాని అంగీకారమునకు నిలపియుంచబడియున్నయెడల, వారిఆమోదము ప్రకటింపబడువరకును శాసనముగాదు.

89 ఏదైనచట్టమును గవర్నరుగారు గవర్నరుజనరలుయొక్క ఆమోదముకొరకు నిలిపియుంచినపుడు, భారతప్రభుత్వనిర్మాణ శాసనమునకును, అధికారనిర్వచన పత్రమునకును లోబడి, గవర్నరుజనరలుగారు తన విచక్షణాధికారము నుపయోగించి చట్టమునకు తమ ఆమోదము నొసగవచ్చును, నిరాకరింపవచ్చును లేక సార్వభౌముని ఆమోదము కొరకు నిలిపియుంచవచ్చును అటుల చేయుటకు పూర్వము గవర్నరు జనరలు తనకుచితమని తోచినయెడల పైపేరాయందుదాహరింపబడినటుల, చట్టమును శాసనసభవారి పునర్విచారణకు పంపవలసినదను సిఫార్సుతో గవర్నరుగారికి తిరిగి పంపవచ్చును శాసనసభవారపుడాచట్టమును పునర్విచారణ మొనర్చి, సవరణలతో కాని, సవరణలు లేకుండగాని, ఆమోదించిన పిదప, తిరిగి గవర్నరుజనరలుగారి ఆమోదముకొరకు పంపవలెను

ఈ విధముగా గవర్నరుజనరలుగారి ఆమోదముకొరకు పంపబడిననాటినుండి ఆరునెలలలోగా గవర్నరుజనరలుగారాచట్టమునకామోదమునుగాని, నిరాకరణమునుగాని ప్రకటింపక, సార్వభౌమునికిగాని, తిరిగి గవర్నరునకుగాని పంపుటకు నిశ్చయింపనియెడల ఆరునెలల యనంతర మాచట్టమునకు కాలదోషము పట్టును.

## సార్వభౌముని అధికారము

90 గవర్నరుగారు గాని, గవర్నరుజనరలు గాని, ఆమోదమొసగినను, అప్పటినుండి ఒకసంవత్సరము లోగా, సార్వభౌముని ప్రభుత్వము అట్టి శాసనమును రద్దు చేయవచ్చును.

## సంయుక్త సమావేశములు

91. రెండు శాసనసభలున్న రాష్ట్రములయందు ఒకసభవారిచే గావింపబడిన శాసనము సవరణలతోగాని, లేకుండగాని మూడునెలలలోగా రెండవసభచే నామోదింపబడనియెడల అట్టిచట్టమును పరిష్కరించుటకుగాను గవర్నరు రెండుశాసనసభలకును సంయుక్తసమావేశము నేర్పరుపవచ్చును. మొదటిశాసనసభవారు ఆమోదించిన చట్టమును రెండవ శాసనసభవారిచే సూచింపబడి మొదటివారిచే అంగీకరింపబడని సవరణలను సంయుక్తసమావేశమునందధికసంఖ్యాకులచే సవరింపబడిన రీతిని చట్టము రెండు శాసనసభలచేతను ఆమోదింపబడినట్లు ప్రకటింపబడును.

ఆయవ్యయములకు సంబంధించిన చట్టముల సందర్భమున గాని, లేక గవర్నరుగారు తన ప్రత్యేకబాధ్యతల నిర్వహించుటకు వెంటనే అవసరమని భావించినచట్టముల సందర్భమునగాని గవర్నరు మూడు నెలలకాల నియమముతో ప్రసక్తి లేకయే వెంటనే సంయుక్తసమావేశము నేర్పరుపవచ్చును.

గవర్నరుగారి శాసననిర్మాణాధికారము

92 గవర్నరు తన ప్రత్యేకబాధ్యతలను నిర్వహించుటకొరకు గాను తనకుచితమని తోచుచో -

(ఎ) తన ప్రత్యేకబాధ్యతలను నిర్వహించుటకు తనఅభిప్రాయము అవసరమని సందేశమంపుచు ఏదేని చట్టమును శాసనసభవారి యెదుట నుంచుట కుత్తరువు చేయవచ్చును. సదరు చట్టము ఫలాని తేదీలోగా శాసనము గావలెననిగూడ ఆసందేశమున నిర్ణయింపవచ్చును

(బి) అదేకారణములచే శాసనసభయందు దదివరకు ప్రవేశపెట్టబడియున్న ఏచట్టముగాని ఫలాని తేదీలోగా శాసన మొనర్పబడవలెననికూడ సందేశమంపి ప్రకటింపవచ్చును.

ఆవిధముగ నిర్ణయింపబడిన తేదిలోగా చట్టము శాసనసభవారిచే ఆమోదింపబడియుండక పోయినను, లేక తాను సూచించిన రీతిని ఆమోదింపబడి యుండకపోయినను, గవర్నరు తాను సూచించిన రీతినిగాని, శాసనసభవారు గావించిన సవరణలలోగాని చట్టమును శాసనముగ నొనర్పవచ్చును అది గవర్నరుశాసనమని పిలువబడును.

ఈ విధముగా గావింపబడు "గవర్నరు శాసనము"నకు రాష్ట్రీయ శాసనసభచే గావింపబడిన శాసనమున కున్న అధికారము తోడనే చలామణి యగును రాష్ట్రీయ శాసనసభలు గావించు చట్టముల సందర్భమున గవర్నరు జెనరలు ఆమోదమునకు సంబంధించిన నిబంధనలే గవర్నరు శాసనములకుగూడ వర్తించును కాని, రాష్ట్రీయ శాసనసభకు గల చట్టనిర్మాణాధికారముల పరిమితికిమీరిన అధికారములు గవర్నరు చలాయింపజాలడు

93. గవర్నరు శాసనమునందు, సదరు శాసనము రాష్ట్రీయ శాసనసభచే గావింపబడినది గాదనియు, గవర్నరు సొంత బాధ్యతపై గావించిన దనియు, స్పష్టపరుచు పదము లుపయోగింపబడును

శాసనసభలో చర్చల నిలిపివేయు నధికారము

94. శాసనసభలో ప్రవేశపెట్టబడిన చట్టముగాని, ప్రవేశపెట్టనుద్దేశింపబడిన చట్టముగాని వానిలో నేదైన భాగముగాని, రాష్ట్రము యొక్క శాంతిని భద్రతను గాపాడుటలో తనపైగల "ప్రత్యేక బాధ్యత"కు ఆటంకము గలుగునని గవర్నరు భావించుచో, అట్టి చట్టమునుగాని, చట్టమునందు భాగమునుగాని చర్చింపరాదని నిషేధించుటకు గవర్నరున కధికార మొసగబడును.

ఆదాయవ్యయవ్యవహారములు-శాసనసభలు

95 పన్నును విధించుటకు గాని, ఆదాయమునుండి వెచ్చించుటకుగాని కావింపబడు ప్రతిసూచనయును గవర్నరుచే సిఫార్సు చేయబడ వలెను. రాష్ట్రీయ ప్రభుత్వఋణమునకు సంబంధించిన సూచనలకును, వ్యయమును కల్పించు సూచనలకునుగూడ నిదియే వర్తించును

96. ప్రతిసంవత్సరమునకును, రాష్ట్రీయప్రభుత్వపు ఆదాయమునకును, వ్యయమునకును అంచనాలను తయారుచేయించి, అట్టి ఆదాయము నేయేపనులకు వెచ్చింప దలచినదియు దెలుపుచు, నొక పట్టికను, గవర్నరు, శాసనసభవారియెదుటను రెండుసభ లున్నపుడు, రెండు శాసనసభల యెదుటను నుంచబడునటుల జేయును

ఆ పట్టికలయందు దీ క్రిందివిషయములు స్పష్టముగ దెలియునటుల ఏర్పరుపబడియుండును

(ఎ) శాసనసభవారి వోటునకు బెట్టబడునవేవియో, పెట్టబడనివేవియో దెలుపబడవలెను శాసనసభవారి వోటుకు పెట్టబడనివానిలో స్థిరమైన వ్యయము లెవ్వియో (98-వ పేరాలో పువ్వుగుర్తు పెట్టబడినమాదిరివి) దెలుపబడవలెను

(బి) వోటునకుబెట్టదగిన శీర్షికల క్రిందగాని, లేక వోటునకు బెట్టబడని శీర్షికల క్రిందగాని, తన "ప్రత్యేకబాధ్యతల" నిర్వహించుట కవసరమని గవర్నరు భావించునట్టి అదనపు ఖర్చులను వేరుగా విశదీకరించవలెను

97 98-వ పేరాయందు దుదాహరింపబడిన శీర్షికలకున్ను, గవర్నరు తన ప్రత్యేక బాధ్యతల నిర్వహించుట కవసరమని సూచించిన వ్యయములను గాక మిగిలిన వ్యయములకు సంబంధించిన సూచనలు, శాసనసభవారి అంగీకారముకొరకు ప్రతిపాదింపబడును ఆ మొత్తముల నొసగుటకు గాని, నిరాకరించుటకుగాని, తగ్గించుటకుగాని శాసనసభవారి కధికారము గలదు

98. ఈ పేరాయందు దుదాహరింపబడిన శీర్షికల క్రింద వచ్చు వ్యయములు శాసనసభవారి ఆమోదము బడయనక్కరలేదు. కాని వానిలో గవర్నరు వేతనము బత్తాకు సంబంధించిన వ్యయముల దప్ప మిగిలిన వానిని శాసనసభవారు చర్చింపవచ్చును

ఈ వ్యయముల శీర్షిక లేవియనగా ——

(1) ఋణములు చేయుట తీర్పులు మొదలగు వానికి సంబంధించిన ఖర్చులు వడ్డీలు అసలు తీర్మానము ప్రభుత్వనిర్మాణశాసనము క్రింద నిర్ణయింపబడిన వ్యయములు కోర్టువారు గాని, పంచాయితీవారు గాని చెప్పినతీర్పుల ప్రకారం చెల్లింపవలసిన మొత్తములు,

(2) గవర్నరు యొక్కయు, మంత్రులయొక్కయు గవర్నరు గారిసొంత లేక సెక్రటేరియట్ ఉద్యోగుల వేతనములు బత్తాలు.

(3) హైకోర్టు చీఫుకోర్టునందలి న్యాయమూర్తులయొక్కయు, జ్యూడిషలు కమిషనరుల యొక్కయు వేతనములు ఖర్చులు మంత్రులతో సంప్రదించిన పిదప గవర్నరు సదరుకోర్టుల వ్యయమునకు గావలసినదని శిఫార్సుచేయు మొత్తములు.

(4) పబ్లిక్ సర్వీసులలో ఉన్నవారికిని, వారిపై సాధారపడి యున్నవారికిని చెల్లింపవలసిన వేతనములు పింఛనులు ఇవి 7-వ అనుబంధమున వివరింపబడెను

ఏదేని ఒక వ్యయము పైశీర్షికలలోనికి వచ్చునా, రాదా యను విషయమును నిర్ణయించు తుదియధికారము గవర్నరున కొసగబడును.

99 ఆయవ్యయ పట్టిక చర్చలు ముగిసినపిదప గవర్నరు, సభవారిచే ఆమోదింపబడిన వ్యయములను, 98-వ పేరాయం దుదాహరింపబడిన వ్యయములును సంతకమొనర్చి, వివరించుచు ఒక పట్టికను తయారు చేయించి, శాసనసభవారి యెదుటనుంచునటుల చేయును. కాని అటుపిమ్మట శాసనసభవా రాపట్టికను చర్చింపరాదు. ఈ పట్టిక యందు గవర్నరు తన ప్రత్యేకబాధ్యతల నిర్వహించుటకు అవసరమని భావించిన ఏ ఇతర వ్యయమునైన చేర్పవచ్చును కాని ఆవిధముగ చేర్చుటవలన మొదట ఆ శీర్షికక్రింద శాసనసభయందు ప్రతిపాదింపబడిన మొత్తమునకు మించరాదు.

పైవిధముగ గవర్నరుయొక్క సంతకముతో నొసగబడిన అనుమతిని పురస్కరించుకొని సొమ్మును వెచ్చింపవచ్చును.

100. సాంవత్సరి కాదాయపట్టికయందు చేర్పబడినట్టియు, సంవత్సర మధ్యమునం దవసరమైనట్టియు ఇతర వ్యయములకుగూడ 95-99-వ పేరాలయం దుదాహరింపబడిన విధానమే అవసరమగుమార్పులతో వర్తించును

## ఆంగ్లోహైందవుల విద్యావ్యయము

101 శాసనసభయందు ¾ వంతుల సభ్యు లంగీకరించినగాని, ప్రస్తుతము, ఆంగ్లోహైందవ ఐరోపియను సాంఘికుల విద్యకొరకొసగబడుచున్న వ్యయమును తగ్గించు ప్రతిపాదన సభవారిచే నంగీకరింపబడినటుల పరిగణింపబడరాదు. కాని సాధారణ విద్యాపిరాళము తగ్గింపబడినపుడు యూరోపియను ఆంగ్లో హైందవపాఠశాలల కొసగబడు పిరాళములుగూడ అదేవిధముగ తగ్గింపబడుచో దాని కేనిషేధము వర్తింపదు

## "శాసన సభా నిబంధనలు-గవర్నరు అధికారములు"

102. రాష్ట్రీయ శాసనసభలలో కార్యక్రమమున కేర్పరుపవలసిన నిబంధనలను, ప్రభుత్వనిర్మాణ చట్టమునం గలి సూచనలకు లోబడి శాసన సభయే నిర్ణయించును. కాని గవర్నరు తన ప్రత్యేక బాధ్యతలకు సంబంధించిన విషయములం దవలంబింపదగిన నిబంధనలను శాసనసభాధ్యక్షునితో సంప్రదించి, నిర్వచించుట కధికారమొసగబడును.

శాసనసభవారు గావించిన నిబంధనకును, గవర్నరు గావించిన నిబంధనకును, విరోధము సంభవించినపుడు, గవర్నరు గావించిన నిబంధనయే నిలచును శాసనసభానిబంధన అట్లు విరుద్ధముగ యున్నంతవరకు అశాస్త్రీయ మగును.

## గవర్నరు - ఆర్డినెన్సుల అధికారము

103 ప్రభుత్వ నిర్మాణశాసనమునందు, తనకు విధింపబడిన ప్రత్యేక బాధ్యతల నిర్వహించుట కేసమయమునగాని అవసరమని భావించుచో, రాష్ట్రీయ శాసనసభ కెట్టి శాసననిర్మాణాధికారములు గలవో, అట్టి అధికారములను దా నుపయోగించి, "ఆర్డినెన్సు"ల గావింపవచ్చును. అట్టి ఆర్డినెన్సులు ఆరునెలల కాలమునకు హెచ్చుకుండ అమలునం దుండవచ్చును గవర్నరు, ఒక మారు గావించిన ఆర్డినెన్సును తిరిగి మరి యారునెలలకు పొడుగింపవచ్చును. ఆయా సందర్భముల గవర్నరాయార్డినెన్సును పార్లమెంటుసభల యెదుట నుంచవలసి యుండును. ఆర్డినెన్సు అమలునందున్న ప్రభుశాసనసభవారి శాసనము ఏవిధముగ చలామణియగునో అటుల నేచలామణి యగును కాని వానిని రద్దుచేయుట, అనుమతిని నిరాకరించుట సాధారణ చట్టములకు వర్తిలువలెనే ఆర్డినెన్సులకుగూడ వర్తించును. ఆర్డినెన్సు నెన్నడైన నుపసంహరించుకొను నధికారము గవర్నరున కుండును.

104 పై పేరాయందలి అధికారములు గాక శాసనసభ సమావేశమైయుండునపుడు, ఉపద్రవకరములగు పరిస్థితు లేర్పడెనని మంత్రుల సిఫార్సుపై రాష్ట్రముయొక్క పరిపాలనా క్షేమముకొరకు గవర్నరు అవసరమగు ఆర్డినెన్సులను గావింపవచ్చును. శాసనసభ కెంత అధికారము గలదో, అంతవరకు మాత్రమే ఆర్డినెన్సులకుగూడ అధికారముండును.

ఈ విధముగ గావింపబడిన ఆర్డినెన్సునకు, శాసనసభ గావించు శాసనములవలెనే చలామణి యగును. కాని యట్టిప్రతి ఆర్డినెన్సును—

(ఎ) శాసన సభ సమావేశమైనతోడనే, సభవారి యెదుట నుంచబడవలెను సభవారి యెదుటనుంచబడిన ఆరువారముల యనంతరమా ఆర్డినెన్సు రద్దగును ఈ లోగానే శాసనసభవారు సదరు ఆర్డినెన్సును నిరసించుచు తీర్మానించినయెడల వెంటనే రద్దగును.

(బి) గవర్నరీఆర్డినెన్సు నేసమయమునందైన నుపసంహరించుకొనవచ్చును. గవర్నరుజనరలు అనుమతిని నిరాకరించుట మొదలగు

నిబంధనలు, రాష్ట్రీయ శాసనసభ చట్టముల కెటుల వర్తించునో వీనికి గూడ నటులనే వర్తించును.

## ప్రభుత్వనిర్మాణము భగ్నమగుచో

105. భారత ప్రభుత్వనిర్మాణ శాసనము ప్రకారము రాష్ట్రీయ పరిపాలనను సాగించుట తాత్కాలికముగ అసంభవమగు పరిస్థితు లేర్పడె నని గవర్నరు భావించునెడల చట్టముప్రకారమితరుల కొసగబడిన అధికారముల నన్నిటిని తానే గైకొనుచుంటి నని ప్రకటన మొనర్చి ఆయధికారములను తాను చలాయింపవచ్చును. అట్టి ప్రకటనలు పార్లమెంటుచే గావింపబడిన శాసనమువలెనే చలామణి యగును. ఆ ప్రకటనను గవర్నరు వెంటనే భారతమంత్రికి అందచేయవలెను. అతను దానిని పార్లమెంటు సభవారి యెదుట నుంచవలెను. పార్లమెంటుసభలు రెండును ఈలోగా దాని నామోదించిననే తప్ప ఆరు నెలల కా ప్రకటనకు కాలదోషముపట్టును. ఈలోగా పార్లమెంటు వారు తీర్మానమును గావించి సదరుప్రకటనను రద్దుసేయవచ్చును.

## మినహాయింపబడిన ప్రాంతములు

106. ఏ రాష్ట్రీయ ప్రభుత్వ పరిపాలనయందుగాని యున్నట్టి ప్రాంతమును "మినహాయింపబడిన ప్రాంతము" గ గాని "కొంత వరకు మినహాయింపబడిన ప్రాంతము" అనిగాని సార్వభౌముడు తన మంత్రుల సలహా ప్రకారము ప్రకటింపవచ్చును. అదేవిధిముగ అంతకు పూర్వము గావించిన ప్రకటనలను గూడ రద్దుచేయవచ్చును.

107. "కొంతవరకు మినహాయింపబడిన ప్రాంతముల పరిపాలన యందు, గవర్నరునకు "ప్రత్యేక బాధ్యత" (70-వ పేరా చూడుడు) యుండును.

"మినహాయింపబడిన ప్రాంతము యొక్క పరిపాలనను గవర్నరు స్వయముగ నిర్వహించు చుండును"

108. "మినహాయింపబడిన ప్రాంతము"ను గాని, "కొంతవరకు మినహాయింపబడిన ప్రాంతము" నుగాని పరిపాలించుట కవసరమగు చట్టనిర్మాణమును గావించుట కీ క్రింది పద్ధతు లవలంబింపబడును:

భారత శాసనసభ గాని, రాష్ట్రీయ శాసనసభ గాని గావించిన శాసనమేదియు గవర్నరు ఉత్తరువుచేయునంతవరకు అతను నిర్ణయించు షరతులకు లోబడి తప్ప, ఈ ప్రాంతములకు వర్తింపదు. ఈ ప్రాంతముల సుపరిపాలన కొరకును, శాంతి భద్రతల కొరకును గవర్నరు తన కుచితమని తోచిన రెగ్యులేషనుల గావింపవచ్చును. భారత, రాష్ట్రీయ శాసనసభలచే గావింపబడిన శాసనముల నా ప్రాంతములో రద్దుచేయుచుగాని, సవరించుచుగాని రెగ్యులేషనుల గావింపవచ్చును. ఈ విధముగ గావింపబడిన రెగ్యులేషనులను వెంటనే గవర్నరుజనరలుయొక్క అంగీకారమునకు పంపవలెను. అతడు అంగీకరించువరకును, అవి అమలులోనికి రావు. అట్టి అంగీకారమును బడసినపిమ్మట, శాసనసభచే గావింపబడిన శాసనములవలెనే చలామణి యగును. దీనిని, సవరించుటకుగాని, రద్దుచేయుటకుగాని భారతశాసన సభకుగాని, రాష్ట్రీయశాసనసభకుగాని అధికారము లేదు.

109. "మినహాయింపబడిన ప్రాంతము లను పరిపాలనకును సంబంధించిన వ్యవహారములను గురించిన చర్చలను, ప్రశ్నలను, నిషేధించుటకును, "కొంతవరకు మినహాయింపబడిన ప్రాంతముల" పరిపాలనను గురించిన వ్యవహారములకు సంబంధించిన తీర్మానములను, ప్రశ్నలను తన విచక్షణనుబట్టి నిషేధించుటకును, గవర్నరు, శాసనసభానిబంధనలయందు తగిన ఏర్పాటు గావింపవలెను.

## 3 వ భాగము

# కేంద్ర ప్రభుత్వము-స్థానిక ప్రభుత్వములు

## చట్టనిర్మాణవ్యవహారములు

110. సార్వభౌమునియొక్కయు, రాజకుటుంబముయొక్కయు అధికారములను బ్రిటిషు ఇండియాపై సార్వభౌముని ఆధిపత్యమును, బ్రిటిషు జాతీయతా శాసనము, సైనికశాఖ శాసనము, వైమానికదళ శాసనము, నౌకాదళక్రమశిక్షణ శాసనము, భారత ప్రభుత్వ నిర్మాణ శాసనములను, మార్చునట్టి శాసనమును గావించుటకు భారత శాసన సభల కధికారము లేదు.

111. ఏడవ అనుబంధము 1-వ పట్టియం దుదాహరింపబడిన విషయములలో భారతదేశమున కంతకును, శాసననిర్మాణ మొనర్చ నధికారము ఫెడరలు శాసనసభకు కలదు. ఈశాసనములు బ్రిటిషు ఇండియా కంతకును వర్తించును. కాని, ఫెడరేషనులోచేరిన భారత సంస్థానములయందు సంస్థానాధీశ్వరులు వ్రాసిఇచ్చిన సమ్మేళన షరతుల పత్రము ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ ఎక్సెషన్ నందలి నిబంధనల మేరకు మాత్రమే వర్తించును. ఫెడరలు శాసనములు బ్రిటిషుపౌరులకును, ప్రభుత్వోద్యోగులకును భారతదేశమందు వారే ప్రాంతమందున్నను వర్తించును. భారత దేశమునకు వెలుపల నెచటనున్నను సార్వభౌముని భారతీయ పౌరులందరకును వర్తించును. సైనికశాఖ శాసనము, వైమానికదళశాసనము నౌకాదళక్రమశిక్షణశాసనములు వర్తింపని విషయములలో సార్వభౌముని భారతీయసైనికదళము లన్నిటికిని వారే ప్రాంతమందున్నను గూడ వర్తించునట్టి శాసనముల గావించుటకు ఫెడరలుశాసనసభ కధికారము గలదు.

112. ఆరవ అనుబంధమునందలి రెండవ పట్టికయం దుదాహరింపబడిన విషయములలో తమ రాష్ట్రముయొక్క శాంతిభద్రతలకును,

సుపరిపాలనకును అవసరమగు చట్టముల గావించుటకు రాష్ట్రీయ శాసనసభ కధికారము గలదు.

113. కొన్ని ఫెడరలుపరిపాలనాశాఖలయందు ఫెడరలు ప్రభుత్వమువారి తరఫున కార్యనిర్వహణ మొనర్పవలసిన దని రాష్ట్రీయ ప్రభుత్వమునకు గాని, రాష్ట్రీయోద్యోగికిగాని అధికారమును, బాధ్యతలను విధించుచు శాసించుటకు ఫెడరల్ శాసనసభకు గల అధికారమునకు 111-112-వ పేరాలయం దుదాహరింపబడిన వాక్యములు బాధకములు గావు.

114 6-వ అనుబంధమునందలి మూడవపట్టికయం దుదాహరింపబడిన విషయములలో చట్టనిర్మాణమునకు రాష్ట్రీయ శాసనసభలకు ఫెడరలు శాసనసభలకునుగూడ అధికార ముండును. కాని రాష్ట్రీయ సభ గావించిన శాసనములు ఆ రాష్ట్రమున మాత్రమే చలామణి యగును. ఈపట్టికయందలి విషయములలో రాష్ట్రీయప్రభుత్వములపై వ్యయభారమును కల్పించునట్టి శాసనములను, ఫెడరలు శాసనసభ గావింపరాదు. రాష్ట్రీయశాసనసభలకును ఫెడరల్ శాసనసభలకును గూడ అధికార మున్న విషయములలో రాష్ట్రీయశాసనమునకును, ఫెడరలు శాసనమునకును వైరుధ్యము సంభవించినపుడు, అట్టి రాష్ట్రీయ శాసనము గవర్నరుజనరలుయొక్క ఆమోదమును బడసిననే తప్ప ఫెడరలుశాసనమే చలామణి యగును. గవర్నరుజనర లామోదము నొసగియున్న రాష్ట్రీయశాసనమును సవరించుటకుగాని, రద్దుచేయుటకుగాని, ఫెడరలుశాసనసభ ముందుగా గవర్నరుజనరలుయొక్క అనుమతి పొందిగాని శాసింప వీలు లేదు.

115. అనిర్వచితాధికారములు ఆరవ అనుబంధమునందలి మూడుపట్టికలలోను, ఇంచుమించు అన్ని విషయములును సమగ్రముగ శోధింపబడి యుండును. కాని, స్థానిక ప్రాముఖ్యముగల ప్రతి స్వల్ప విషయమునుగూడ, ఈ పట్టికలలో జేర్చుట సాధ్యము గాదు. అందుచే, కేవలము స్థానికమగు విషయములయందు రాష్ట్రీయశాసనసభయే శాసింపవచ్చుననీ, సాధారణాధికారముగూడ రాష్ట్రీయసభల కొసగబడెను కాని మొదట కేవలము స్థానికముగ నున్న వ్యవహారము కాలదికాలములోనే భారతదేశమున కంతకును సంబంధించినదిగ పరిణమింపవచ్చును. కనుక, గవర్నరుజనర లట్టి విషయములయందు ఫెడరలు శాసనసభలు చట్టనిర్మాణ మొనర్చుట కనుమతి యొసగుట కధికార మొసగబడును.

116 రాష్ట్రీయవిషయముగ పేర్కొనబడియున్న సందర్భములయందుగూడ చట్టనిర్మాణ మొనర్చుటకు రెండు, లేక, అంతకంటె నెక్కువరాష్ట్రముల కోరికపై ఫెడరలు శాసనసభ కధికార మొసగవచ్చును. పిమ్మట మరి యేరాష్ట్రమైన దాని నవలంబింపవచ్చును. అట్టి శాసనమును సవరించుకొనుటకుగాని రద్దుచేసుకొనుటకుగాని సదరు రాష్ట్రీయశాసనసభ కధికారము గలదు.

117. ఫెడరేషనుషరతుల ప్రకారము ఫెడరలువిషయముగ సంస్థానాధీశునిచే నంగీకరింపబడ్డిన విషయమునందు ఫెడరలుశాసనమునకును, సంస్థానపు శాసనమునకును వైరుధ్యము గల్గినయెడల సదరు సంస్థానమున ఫెడరలు శాసనమే చలామణి యగును.

118. శాసనము అధికార విరహితముగ గావింపబడినదను దావాల అవకాశమును తగ్గించుటకుగాను సదరు శాసననిర్మాణాధికారము శాసన మొనర్చిన సభకుగాక మరియొక సభకుమాత్రమే గలదని కోర్టులలో ఆక్షేపణల దెచ్చుటకు కొంతకాల పరిమితిగూడ నిర్ణయింపబడును.

## ముందుగా గవర్నరుఅనుమతి

119 బ్రిటిషు ఇండియాకు వర్తించు పార్లమెంటు శాసనములను లేక గవర్నరుజనరలుయొక్క శాసనములను, ఆర్డినెన్సులను సవరించునట్టియు, రద్దుచేయునట్టియు, లేక వానికి విరుద్ధమగునట్టియు గవర్నరుజనరలుయొక్క రిజర్వుడుశాఖలతో సంబంధము గలట్టియు, నాణెముల ముద్రణము-చలామణికి సంబంధించిన విషయములయందును ఫెడరలు రిజర్వుబ్యాంకు అధికారములను విధులను పరిపాలనపు ఏర్పాటులను మారకపురేటునకు సంబంధించిన వ్యవహారములకు సంబంధించి నటువంటియు, మతవిషయముల సాంప్రదాయములకు సంబంధించినట్టియు, యూరపియను బ్రిటిషుపౌరులపై క్రిమినలుచర్యల సందర్భములయం దవలంబింపబడుచున్న పద్ధతుల విషయములకు సంబంధించినట్టియు చట్టములను, ముందుగా గవర్నరుజెనరలుయొక్క అనుమతిని పొందినగాని, ఫెడరలు శాసనసభలయం దుపపాదించుటకు వీలు లేదు.

120 వెనకటి పేరాయం దుదాహరింపబడిన విషయములలో రాష్ట్రీయశాసనసభల కధికార మున్నంతవర కాసభలో, చట్టము నుపపాదింపవలె నన్నచో, అందుకుగూడ గవర్నరుజనరలు యొక్క ననుమతిని ముందుగా పొందియుండవలెను. గవర్నరు శాసనములు, ఆర్డినెన్సులు, ప్రజల మతవిద్యలు, ఆచారసాంప్రదాయములకు సంబంధించిన విషయముల గురించి చట్టముల నుపపాదించుటకు గవర్నరుయొక్క అనుమతిగూడ అవసరము.

121. చట్టమును చర్చించుటకు గవర్నరు జనరలును, గవర్నరును అనుమతి నొసగినంతమాత్రమున, చట్టము శాసనసభవారిచే నామోదింపబడిన పిమ్మట దానికి తమ అనుమతిని నిరాకరించుటకు గాని, పై అధికారియొక్క ఆమోదమునకు నిలిపియుంచుటకుగాని వారికి గల అధికారమునకు భంగము గలుగదు. కాని చట్టప్రకారము, తుదకు గవర్నరుయొక్కయు, లేక గవర్నరుజనరలుయొక్కయు, లేక సార్వభౌమునియొక్కయు ఆమోదమును బడసినయెడల సదరు చట్టము ప్రతి

పాదింపబడుటకు పూర్వము పై నుదాహరింపబడినవారి అనుమతిని బడయలేదను కారణముచే వశాస్త్రీయముగాదు.

## బ్రిటిషుపౌరులు - శాసనసభలు

122. బ్రిటిషుఇండియాలోనున్న, బ్రిటిషుపౌరునిగాని, కంపెనీనిగాని, శాసనప్రకార మేర్పడిన సంఘమునుగాని, భాగస్వాములనుగాని వారిజాతి మత వర్ణ జన్మ స్థానముల కారణములచే పన్నుల విషయమునను, ఆస్తిసంపాదనము, వాణిజ్యము, వృత్తి, పరిశ్రమల సాగించుట, ప్రయాణము,నివాసము,సేవకులను ఏజంటులను నియమించుకొనుటకు సంబంధించిన విషయములయందు, విచక్షణ మొనర్చుచట్టముల గావించుటకు ఫెడరలుశాసనసభలకుగాని రాష్ట్రీయ శాసనసభలకుగాని అధికారము లేదు. కాని ఆయాప్రాంతములందలి వ్యవసాయిక జాతులకు సంబంధించినవారు కాదనుకారణముచే వ్యవసాయిక భూములను విక్రయమును తణఖా వగైరా అన్యాక్రాంతములను పూర్తిగాగాని కొంతవరకుగాని ఇతరులకు నిషేధించు చట్టమెద్దియును, పైవిచక్షణ క్రిందకురాదు. పౌరులలో జాతిమతవర్ణకారణములచే విచక్షణ గన్పరుచు చట్టమైనను, ముందుగా గవర్నరుచేగాని, గవర్నరుజనరలుచేగాని భారతదేశప్రశాంతి భద్రతల కది అవసరమని ప్రకటించి అనుమతి నిచ్చియున్నచో పిమ్మట నాశాసనము, శాస్త్రవిరుద్ధమైనదని న్యాయస్థానములలో నాక్షేపించుటకు వీలులేదు.

123. ఫెడరలు లేక, రాష్ట్రీయ శాసనములక్రింద నేర్పడిన భారతీయ వర్తకులుగాని, వర్తకసంఘముగాని, పౌరులుగాని ఆంగ్లదేశమునందు చలాయించుచున్న హక్కుల సందర్భమున భారతదేశమునందు నివసించు బ్రిటిషుపౌరులకును వర్తక సంఘములకును అట్టి హక్కులను తొలగించునట్టిగాని, తగ్గించునట్టిగాని, విచక్షణగావించునట్టిగాని చట్టముల గావించుటకు, భారతీయ శాసనసభల కధికారము లేదు. బ్రిటిషు ఇండియాయందే ప్రాంతమున వెళ్లుటకును, నివసించుటకును, ఆస్తిని సంపాదించుకొనుటకును, వర్తకమును సాగించుకొనుటకును, బ్రిటిషు పౌరులకుగల హక్కులీపేరాయందు ద్దేశింపబడెను.

బ్రిటిషు ఇండియాయందు రిజిస్టరుచేయబడిన నౌకలవిషయమునను, ఆంగ్లదేశమున రిజిస్టరుజేయబడిన నౌకలవిషయమునను ఇట్టె పరస్పర సరిసమాన ప్రతిపత్తిని స్థిరపరుచుటకు శాసనమునందే అవసరమగు నిబంధన లేర్పరుపబడును.

(భారతదేశమునందలి వైద్యపట్టభద్రులకు ఆంగ్లదేశమున సరిసమాన ప్రతిపత్తి ఉండవలయును. విషయము ప్రత్యేకముగ నాలోచింపబడవలసియుండును. ఈ విషయమునకు సంబంధించిన చట్ట మొకటి భారత శాసనసభవారి యెదుటనున్నది.)

124. వాణిజ్యమును, పరిశ్రమలను ప్రోత్సహించుటకుగాను, విరాళములను నొసగుటకు గావింపబడు శాసనములు సదరు సహాయము భారతదేశమున కార్పొరేటు చేయబడిన కంపెనీలకు మాత్రమే యొసగ నుద్దేశింపబడెనను కారణముచే గాని, ప్రభుత్వ నిర్మాణ శాసనము గావింపబడక పూర్వము భారతదేశమున వర్తక మొనర్చుచునుండు కంపెనీలపై సదరు సహాయమును బడయగోరుచో బ్రిటిషు ఇండియా శాసనముల క్రింద రిజిస్టరు జేయబడవలెనని గాని, పరిపాలక వర్గనిర్మాణమును గురించిగాని భారతీయులకు తరిఫీదునొసగవలెనని షరతుల నేర్పరచెనను కారణముచే గాని, పైపేరాయందు నిషేధింపబడిన విచక్షణ నొనర్చుచున్నవను ఆక్షేపణకు గురికావు.

## పరిపాలనాధికారములు

125. తమరాష్ట్రమునకు వర్తించు ఫెడరలుశాసనముల కనుగుణముగ తమ పరిపాలనాధికారముల నుపయోగించుట రాష్ట్రీయప్రభుత్వముల కర్తవ్యము. ఫెడరలుప్రభుత్వమువారు రాష్ట్రీయప్రభుత్వముల కవసరమగు నుత్తరువుల జారీచేయుచుందురు. ఫెడరలు శాఖతో సంబంధముగల విషయముల యందు, రాష్ట్రీయ ప్రభుత్వము వారు తమ కార్యనిర్వహణాధికారము నెటుల నుపయోగించుచుండవలెనో సూచించుచుండుటకు గూడ ఫెడరలుప్రభుత్వమున కధికారము గలదు.

126. భారతదేశమునందు గాని, లేక అందే ప్రాంతమునగాని శాంతిభద్రతలకు భంగము గలుగకుండ జూచుటకుగాను రాష్ట్రీయ పరిపాలనాధికారమును వినియోగించుచుండవలెనో దెలుపుడు గవర్నరు జనరలు, గవర్నరులకు సూచనల నొనర్చుటకుగూడ అవకాశ మొసగబడును.

## సంస్థానములు-ఫెడరేషను

127. ఆయా సంస్థానమునకు వర్తించు ప్రతిఫెడరలు శాసనమును అమలు జరుపుట, సంస్థానాధీశ్వరుని కర్తవ్యము.

128. ఫెడరలువ్యవహారములను, సంస్థానములలో సంస్థానోద్యోగుల ద్వారా అమలు జరిపించుటకు సంస్థానాధీశ్వరునితో ఒడంబడికల కుదుర్చుకొనుటకు గవర్నరుజనరలు కధికార మొసంగబడును. ఫెడరలు కార్యములు అట్టి సంస్థానము సరిగ నమలు జరుపబడుచున్నది, లేనిది పరీక్షించి పరిపాలన సౌష్ఠవముగ నుండునటుల చూచుటకు గవర్నరుజనరలు కధికార ముండవలెను.

129. ఆయా సంస్థానములు తమ ఫెడరలు విధులను సరిగ నిర్వహించుచుండునటుల జేయుటకు సంస్థానప్రభుత్వమునకు సూచనల గావించుటకు గవర్నరుజనరలున కధికార మొసగబడును.

## ఆర్థికాధికారములు, సంబంధములు

### సొత్తులు, కాంట్రాక్టులు, దావాలు

130. ఇపుడు ఇండియామంత్రి సంఘముపైన చేయబడుచున్న దావాలను ఇటుపైని ఫెడరలు గవర్నమెంటు పైనను, రాష్ట్రీయ గవర్నమెంటు పైనను చేయవలెను.

131. ఫెడరేషను ఏర్పడుటకు పూర్వము రాజుగారికి చెందిన ఇండియాలోని సొత్తులన్నియును ఇటుపైనిగూడ రాజుగారికే చెందియుండును. ఇది ఫెడరలు గవర్నమెంటుకును, రాష్ట్రీయ దొరతనములకును చెందియుండును. రైల్వేలు మున్నగువాటి విషయమున ప్రత్యేకపు ఏర్పాటులు చేయబడును. ఫెడరలు గవర్నమెంటుకును, రాష్ట్రీయ దొరతనములకును జెందకుండ రాజుగారికి చెందిన సొత్తులకు ప్రత్యేకపుటేర్పాటులు వర్తింపవు.

ఇండియా గవర్నమెంటువారికి విదేశములలోగల సొత్తువిషయమునగూడ తగిన యేర్పాటు చేయబడును.

132 ఈ సొత్తులను గూర్చియు, ఇటుపైని సంపాదింపబడునట్టి సొత్తులనుగూర్చియు కంట్రాక్టులను గూర్చియు ఇండియా మంత్రి కిపుడున్న అధికారము లిటుపైని ఫెడరలు ప్రావిన్షియలు దొరతనములకు చెందును. ఈ కాంట్రాక్టులను చేయు ఉద్యోగులకు వ్యక్తిసంబంధమగు బాధ్యత యేమియు నుండదు.

133. చట్టము అమలులోనికి రాకపూర్వము ఇండియామంత్రి పైని చేయబడిన దావాలు ఇండియామంత్రి సంఘమునకుమార్చబడును.

134. చట్టము అమలులోనికి వచ్చు నప్పటి కొన్ని బాధ్యతలు పొనుల బదుళ్ల వడ్డిపైని యిండియాలో ఆదాయపు పన్ను వసూలు చేయకపోవుట మున్నగునవి చట్టము ఆమోది పబడిన పిమ్మట యిండియామంత్రి సంఘమునకుగాక యిండియామంత్రికి మాత్రమే వర్తించును. ఇండియా ఆదాయములే బదుళ్లకు ఆధారములో ఆదాయము. ఇటుపైనగూడ ఆబదుళ్లకాధారములే యగును.

135. ఇండియా మంత్రి యివ్వవలసినట్లుగా తీర్పు చెప్పబడిన మొత్తములను ఫెడరలు ఆదాయములలో నుండియే చెల్లింపవలెను. తరువాత వారు దానిని రాష్ట్రీయాదాయమునుండి వసూలు చేసుకొనుట కాధారమున్నచో వసూలు చేసుకొనవచ్చును. ఈ మొత్తములు చెల్లింపబడునట్లు చేయుటకు యిండియా మంత్రి కధికారముండును.

### ఆదాయముల విభాగము నిర్ణయించుట

నోటు :—పన్నులనువేసి ఆదాయమును వృద్ధి నొందించుటకు శాసనసభల అధికారములు 6-వ ఎపెండిక్సులో షెడ్యూళ్లలో వివరింపబడును.

136. రాష్ట్రీయ శాసనసభలకు ప్రత్యేకముగా గాని, సమష్టిగా గాని అధికారముగల విషయములు రాష్ట్రీయాదాయము లగును.

ఫెడరలుశాసనసభకు ప్రత్యేకాధికారము గల వసతులు ఫెడరలు ఆదాయము లగును. ఈ దిగువ వివరింపబడిన విషయములలో ఫెడరలు ఆదాయములలో నుండి రాష్ట్రములకును, సంస్థానములకును యేర్పాటులు జరుగవలెను.

137. ఉప్పు, ఫెడరలు ఎక్సైజు, ఎగుమతి సుంకములు, వీటివలన వచ్చిన ఆదాయమును పూర్తిగాగాని, కొంతవరకుగాని ఫెడరలు వారు రాష్ట్రములకును సంస్థానములకును ప్రత్యేకింపవలెను. జనుము (జూటు) ఎగుమతుల పన్నుల విషయమున అవి యే రాష్ట్రములలో పండినవో ఆ రాష్ట్రములకే ఆ నికరపు పన్నులో సగమువంతును విధిగా నియ్యవలెను.

138. మరణానంతరము యితరులకు చెందిన భూములుతప్ప తక్కిన సొత్తులపైన పన్ను, భూములుతప్ప యితర మూలధనముపైనను ఖనిజముల హక్కులపైనను పన్నులు, రైల్వేలు కాలువలు విమానములు వీటిపైని పంపబడిన సరుకులపైనను ప్రయాణముచేసిన మనుష్యులపైనను రైల్వే టిక్కెట్లపైనను సరుకుల రైలుఛార్జీ పైనను పన్నులు, ఫెడరేషను యేర్పడు నప్పటికి భారత శాసనసభ వోటుకు లోబడిన స్టాంపు పన్నులు, వీటి నికరము ఆదాయము రాష్ట్రముల కియ్యబడును. ఫెడరేషనువారు వాటిపైని సర్‌ఛార్జీ వేయవచ్చును.

139. వ్యవసాయపు ఆదాయముగాక తక్కిన ఆదాయముల పైని పన్నుల (కంపెనీల ఆదాయము పైనను మూలధనము పైనను పన్నులు దీనిలో చేరవు.) నికరము ఆదాయముపైనను 100కి 50 వంతులు రాష్ట్రముల కియ్యవలెను. రాష్ట్రములు వేసిన సర్‌చార్జీలు, ఫెడరలు కార్యాలయముల ఉద్యోగుల ఆదాయములపైన పన్నులు, చీఫ్ కమీషనరుల రాష్ట్రముల ఆదాయముపై పన్నులు, మున్నగునవి దీనిలో చేరవు.

ఇందులకు సమ్మతించి ఫెడరేషనులో చేరిన సంస్థానములలో గూడ నిట్టి యేర్పాటు చేయబడును.

క్రొత్తచట్టము అమలులోనికి వచ్చిన మొదటి మూడు సంవత్సరములలోను ఫెడరేషనువారు ఆరాష్ట్రముల కియ్యవలసిన మొత్తములలో కొంత భాగమును తమ వ్యయముల కొరకు వినియోగించుకొనవలెను. అటుపిమ్మటఏడేళ్లవరకును గత సంవత్సరము మినహాయించుకొనబడిన మొత్తముకంటె తక్కువ మొత్తమును అనగా మొదట నిర్ణయింపబడినదానిలో $\frac{1}{8}$-వ వంతును నిలువ యుంచుకొనవలెను. ఇటుల చేయుటవలన ఫెడరేషను ఆర్థికస్థితికి భంగము కలుగునని గవర్నరుజనరలుకు తోచినచో రాష్ట్రముల కేమియు నివ్వ నక్కరలేదని అతడు నిర్ణయించును.

140. పైని వ్రాయబడిన మూడు పేరాలలోను తెలుపబడిన పన్నులను గూర్చి చట్టములు చేయుటకు ముందుగా గవర్నరుజనరలు అనుమతిని బడయవలెను.

141. వ్యవసాయపు ఆదాయముగాక తక్కిన ఆదాయముల పైని, పన్నులపైని సర్‌చార్జీలను వేయుటకు ఫెడరలు శాసనసభకు అధికారముండును. ఆ ఆదాయము రాష్ట్రములకియ్యబడదు.

ఈ సర్‌చార్జీల పద్ధతి అమలులో నున్నపుడు ఫెడరలుశాసనసభవారు సంస్థానములలో ఆదాయపు పన్నును వసూలుచేయుటకు సమ్మతింపని సంస్థానములవారు ఫెడరలుకోశమునకు కొంత ధనము నియ్యవలెను. 1931-వ సెప్టెంబరులో వేయబడిన ఆదాయపు పన్నులో నుండి సంస్థానముల వారేమియును ఈయ నక్కరలేదు.

142. క్రొత్తచట్టము అమలులోనికి వచ్చిన పిమ్మట 10 ఏండ్లలోగా సంస్థానములలోని కంపెనీల ఆదాయముపైనను మూలధనముపైనను ఫెడరలుశాసనసభవారు పన్నులను వేయగూడదు. అట్టి పన్నులను ఫెడరేషనువారు వసూలు చేయుటకు సంస్థానముల వారంగీకరించినచో దానిని సంస్థానములవారి వద్దనుండియే వసూలు చేయవలెను గాని కంపెనీలవద్దనుండి వసూలు చేయగూడదు.

143. ఫెడరలుఆదాయములలో నుండి సంస్థానములకైవైన మొత్తములు మజరాల క్రిందను, మినహాల క్రిందను యియ్యబడవలసియున్నచో ఫెడరలుశాసనసభ చట్టములోని నిబంధనల ననుసరింపవలెను.

144. ఫెడరలు ఆదాయములలోనుండి కొన్ని రాష్ట్రములకు ధనసహాయము చేయవలసి యున్నది. ఆమొత్తములును, కాలములును గూడ నిర్ణయింపబడెను.

145. ఈమొత్తములను రాజుగారు నిర్ణయించుటకు ముందు పార్లమెంటువారు ఆమోదించెదరు.

## బదులుచేయుట కధికారము

146. ఫెడరలు ఆదాయముల పూచీమీద ఫెడరలు ఉపయోగముకొరకు ఫెడరలు లాలో నిర్ణయింపబడిన రీతిని బదులుచేయుటకు ఫెడరలు గవర్నమెంటుకు అధికార ముండును.

147. ఇపుడున్న యిండియను పౌనులబదుళ్లు ట్రస్టీస్టేటసు యిటుపైనిగూడ నుండును. ఇటుపైని చేయబడునట్టి పౌనులబదుళ్లకు గూడ నిది వర్తించును.

148. ఫెడరేషనులో చేరిన రాష్ట్రములకును, సంస్థానములకును బదుళ్లు నిచ్చుటకును, లేక వారి బదుళ్లకు పూచీపడుటకును ఫెడరలుగవర్నమెంటుకు అధికార ముండును.

149. రాష్ట్రముల ఆదాయముల హామీపైని రాష్ట్రముల ఉపయోగము నిమిత్తము రాష్ట్రముల దొరతనములవారు బదులుచేయవచ్చును. అదివరకు చేయబడిన బదులుకు ఫెడరలు గవర్నమెంటు వారు గాని గవర్నరుజనరలు కౌన్సిలువారుగాని పూచీపడియున్నచో బదులు పూర్తిగా తీర్చబడకుండనే మరల రాష్ట్రములవారు బదులు చేయగోరునెడలను, విదేశములో బదులు చేయగోరు నెడలను వారు ముందుగా ఫెడరలు గవర్నమెంటు వారి అనుమతిని బడయవలెను.

## జనరలు

150. ఫెడరలు ఆదాయములును రాష్ట్రీయములును యిండియా ప్రభుత్వముకొరకే వినియోగింప బడుటకు యేర్పాటు చేయబడును.

## నాల్గవ భాగము:

## న్యాయస్థానశాఖ — ఫెడరలు కోర్టు

151. ఫెడరలు కోర్టులో నొకప్రధానన్యాయమూర్తియును-తక్కువగాని యితర జడ్జీలును ఉందురు....కంటె హెచ్చుకాని యితర జడ్జీలను రాజుగారు నియమించుచుందురు.

వీరినందరిని రాజుగారు నియమించెదరు. వీరు యోగ్యులుగా నున్నంతకాలము ఆపదవులలో నుందురు. 62 ఏళ్లు వయసు పూర్తికాగానే ప్రతిజడ్జియును ఆపదవిని వదలివేయవలెను వారు రాజీనామాలను గవర్నరుజనరలుకు పంపవచ్చును.

152. ఈజడ్జీల జీతములు, పింఛనులు మున్నగు వాటిని కౌన్సిలువారు నిర్ణయించెదరు. కాని ఒక వ్యక్తి అధికారములో నున్నంతకాలము అతనికి నష్టము కలుగనట్లు జీతములు మున్నగునవి మార్చబడవు.

ఫెడరలుకోర్టుజడ్జీపదవికి అర్హతలు—

1. చార్టర్డు హైకోర్టులో కనీసము 5 ఏళ్లు జడ్జిగా పనిచేసియుండవలెను. లేక,

2. ఇతర హైకోర్టులలో కనీసము 5 ఏళ్లు జడ్జిగా పనిచేసియుండవలెను. ఉద్యోగ మియ్యబడిన తేదీనాటికి చార్టర్డు హైకోర్టులో జడ్జిగా పనిచేయుటకు అర్హుడుగా నుండవలెను. లేక,

3. ఇండియాలో స్టేటుకోర్టులో కనీసము 5 యేళ్లు జడ్జిగా పనిచేసి యుండవలెను. ఉద్యోగ మియ్యబడిన తేదీకి చార్టర్డు హైకోర్టులో జడ్జిగా పనిచేయుటకు అర్హుడుగా నుండవలెను. లేక,

4. ఇంగ్లాండులోగాని ఉత్తర అయిర్లండులోగాని బారిస్టరు పరీక్షనిచ్చి యుండవలెను. లేక, 15 యేళ్లకు తక్కువ లేకుండా స్కాట్లండు అడ్వకేట్సు ఫాకల్టీలో సభ్యుడుగానుండవలెను. లేక,



సంస్కృత హిందీ విద్యాలయము, రాజమండ్రి.
విద్యార్థులు, అధ్యాపకులు.



చెరుకువాడ వెంకటనరసింహారావు గారు



డా. డి. అప్పారావుగారు, యల్. ఐ. యం.

5. 15 యేళ్లకు తక్కువ కుండా ఒక హైకోర్టులోగాని, రెండు మూడు హైకోర్టులలోగాని అడ్వకేటుగాగాని, ప్లీడరుగాగాని పనిచేసి యుండవలెను.

154. ప్రధానన్యాయమూర్తి గవర్నరు జనరలుతో నాలోచించి నిర్ణయించిన ప్రకారము ఫెడరలుకోర్టు ఢిల్లీలోను, ఇతర స్థలములలోను సమావేశ మగుచుండును.

155. ఫెడరలు కోర్టువారికి ప్రత్యేక జూరిస్‌డిక్షను.

(1) కాన్‌స్టిట్యూషను చట్టముయొక్క వ్యాఖ్యానమునకు సంబంధించిన విషయములు.

(ఎ) ఫెడరేషనుకు— ఒక రాష్ట్రముతోగాని, ఒక సంస్థానముతోగాని (బి) రెండు రాష్ట్రములకుగాని రెండు సంస్థానములకుగాని, ఒక రాష్ట్రమునకును ఒక సంస్థానమునకును గాని, కాన్‌స్టిట్యూషను చట్టమునకు సంబంధించిన హక్కులను గూర్చి కలిగిన వివాదలు.

(2) కాన్‌స్టిట్యూషను ఆక్టు ప్రారంభింపబడిన పిమ్మట ఫెడరేషనుకును రాష్ట్రమునకును, లేక ఫెడరేషనుకును సంస్థానమునకును, లేక రెండు సంస్థానములకును, లేక ఒకరాష్ట్రమునకును ఒక సంస్థానమునకును జరిగిన యొడంబడికలో మరియొకరీతిగా నుండనిచో దాని వలన కలిగిన సమస్యకు సరియైన వ్యాఖ్యాన మొనరించుట.

ఈ కడపటి విషయమున ఫెడరలుకోర్టుకు వచ్చిన వివాదను మొదటి కోర్టు నిబంధనల ననుసరించి ఒకజడ్జీగాని హెచ్చుమంది జడ్జీలుగాని విచారించెదరు. తరువాత వీరి తీర్పుపైని ఫుల్ బెంచికి అపీలు చేయవచ్చును. జడ్జీలసంఖ్య...కంటె తక్కువగా నుండగూడదు.

156 కాన్‌స్టిట్యూషను ఆక్టుయొక్క వ్యాఖ్యానము దాని వలన కలిగెడుహక్కులు వీటిని గూర్చి రాష్ట్రములలోని హైకోర్టులలోగాని సంస్థానములలోని హైకోర్టులలోగాని ఈయబడిన తీర్పుల పైని ఫెడరలు కోర్టుకే అపీలు చెయ్యవలెను. దావా మొత్తము... రూపాయలకు మించినపుడు ఫెడరలుకోర్టువారియొక్క గాని హైకోర్టులయొక్క గాని అనుమతిని బడసిననేగాని అపీలుచేయుటకు వీలు లేదు.

157. ఏకేసుతీర్పుపైని ఫెడరలుకోర్టుకు అపీలు చేయబడునో ఆకోర్టువారు తెలిపిన అంశములను బట్టి స్పెషలుకేసులలో అపీలు చేయవలసి యుండును. అపీలు చేయుటకు అనుమతి నియ్యవలెనని ఫెడరలు కోర్టును కోరినపుడు స్పెషలు కేసును వివరింపవలెనని వారు కోరవచ్చును. ఇంకను వివరములను తెలియగోరినచో ఆ స్పెషలు కేసును మరల క్రిందికోర్టుకు పంపివేయవచ్చును.

158. కాన్‌స్టిట్యూషను ఆక్టు వ్యాఖ్యానమును గూర్చి ఫెడరలుకోర్టు అనుమతి అవసరము లేకుండనే ఫెడరలుకోర్టు తీర్పుపైని ప్రీవీకౌన్సిలుకు అపీలు చేయవచ్చునుగాని రాజుగారి అనుమతిని బడయవలెను. ఇతర విషయములలో దావామొత్తము...రూపాయలకు మించినపుడు ఫెడరలుకోర్టుఅనుమతితోనే ప్రివీకౌన్సిలుకు అపీలు చెయ్యవచ్చును.

159. హైకోర్టుల తీర్పులపైని ఫెడరలుకోర్టుకే అపీలు చేయవలెనని నిర్ధారణగా నున్న విషయములలో ప్రివీకౌన్సిలుకు అపీలు చేయగూడదు.

160. ఫెడరేషను అధికారమున్న అన్నిప్రదేశములలోను ఫెడరలు కోర్టు అధికారము గూడ నుండునుగాన ఆప్రాంతము లన్నిటిలోను సివిలుజుడిషియలు అధికారులు ఫెడరలుకోర్టువారి తీర్పులను అమలు జరుపవలెను. ఇతర కోర్టులవా రందరును ఫెడరలుకోర్టు పరిష్కారములకు బద్ధులు కావలెను.

161. ఒక విషయముపైని ఫెడరలు కోర్టువారి అభిప్రాయమును తెలుసుకొనుట అవసరమని రాజప్రతినిధికి తోచినపు డత డావిషయమును ఫెడరలు కోర్టుకు పంపును

162. ఇపుడు హైకోర్టుకు గల అధికారము లన్నియును ఫెడరలుకోర్టుకు నుండగలవు. కోర్టు నిబంధనలను చేయుట, రుసుములను నిర్ణయించుట మున్నగు విషయములలో గవర్నరుజనరలు అనుమతితో నిబంధనలను చేయుటకు ఫెడరలుకోర్టుకు అధికార మియ్యబడును.

## సుప్రీముకోర్టు

163. బ్రిటిషుయిండియాకు ప్రత్యేకముగా ఫెడరలు శాసనసభవారొక సుప్రీముకోర్టు నేర్పరచెదరు. హైకోర్టులకు గల అధికారము లన్నియును సుప్రీముకోర్టుకుగూడ నుండును. ఇందులకు చట్టము నుపపాదించుటకు ముందుగా గవర్నరుజనరలు అనుమతిని బడయవలెను. అనుమతి నియ్యవలెనను నిర్బంధ మతనికి లేదు.

164. సుప్రీముకోర్టు ప్రెసిడెంటును, జడ్జీలను రాజుగారు నియమించెదరు. 62 ఏళ్లవయసు వచ్చిన వెంట జడ్జీపదవిని వదలివేయవలెను. ఏజడ్జియైనను గవర్నరు జనరలుకు రాజీనామాను పంపవచ్చును.

ఫెడరలుకోర్టు జడ్జీల కుండవలసిన అర్హతలన్నియును సుప్రీముకోర్టు జడ్జీలకుగూడ నుండవలెను. జడ్జీల జీతములు, పింఛనులు, అలవెన్సులు మున్నగువాటిని కౌన్సిలువారు నిర్ణయించెదరు.

165. బ్రిటిషుయిండియాలోని హైకోర్టుల తీర్పులపైన మాత్రమే సుప్రీముకోర్టుకు అపీలుచేయవలసియుండును.

166. సివిలుదావాలలో నిపుడు ప్రీవీకౌన్సిలుకు అపీలు చేయుటకు గల నిబంధన లన్నియును సుప్రీముకోర్టు అపీళ్లకు గూడ నుండును. ఈ అపీలు అధికారమును తగ్గించుటకు ఫెడరలుశాసనసభలకు అధికార

ముండును. దావా మొత్తము 10000 రూపాయలకు తక్కువ గానపుడు మాత్రమే అపీలు అధికార ముండును.

క్రిమినలు కేసులలో మరణదండన విధింపబడినపుడును క్రిమినలు కేసులో క్రిందికోర్టు తీర్పును హైకోర్టువారు రద్దుపరచినపుడును హైకోర్టువారి సర్టిఫికేటును సుప్రీము కోర్టువా రంగీకరించి అనుమతి నిచ్చినపుడును మాత్రమే సుప్రీముకోర్టుకు అపీలు చేయవలసియుండును.

**167.** సుప్రీము కోర్టు ఏర్పడినపిమ్మట హైకోర్టు తీర్పులపైని ప్రీవీకౌన్సిలుకు అపీలు చెయ్యగూడదు. సివిలు కేసులలో మాత్రము సుప్రీముకోర్టు తీర్పులపైని సుప్రీముకోర్టువారి అనుమతితో ప్రీవీ కౌన్సిలుకు అపీలు చెయ్యవచ్చును. క్రిమినలుకేసులలో ప్రీవీ కౌన్సిలుకు అపీలు లేనేలేదు.

## రాష్ట్రములలోని హైకోర్టులు

**168.** రాష్ట్రములలో లెటర్సు పేటెంటుక్రింద ఏర్పరుపబడిన హైకోర్టులు ఛార్టరు హైకోర్టులనబడును. ఇవి యిపుడున్నటులే యుండును.

**169.** హైకోర్టుజడ్జీలను రాజుగారు నియమించెదరు. వారి ప్రవర్తనము సరిగా నున్నంతకాలమును వా రాపదవులలో నుందురు. 62 ఏళ్లవయసురాగానే జడ్జీలు పనిని వదలివేయవలెను. వారు రాజీనామాలను గవర్నరు జనరలుకు పంపవచ్చును.

**170.** ప్రధానన్యాయమూర్తులకును న్యాయమూర్తులకును యిపుడున్న అర్హతలే యిటుపైని గూడ నుండును. జడ్జీలలో మూడవవంతువారు బారిష్టరులుగాను, మరియొక మూడవవంతువారు యిండియను సివిలుసర్వీసువారుగాను నుండవలెనను నిబంధన యిపుడున్నది. ఇది రద్దుపరుపబడును.

జడ్జిపదవికి అర్హులగువా రందరును ప్రధానన్యాయమూర్తి పదవికిగూడ అర్హులగుదురు.

**171.** జీతములు, పింఛెనులు, అలవెన్సులు మున్నగువాటిని కౌన్సిలువారు నిర్ణయించెదరు. ఒకజడ్జి అధికారమునందున్న కాలములో అతని జీతమునకును సెలవుహక్కులకును పింఛెనుకును సంబంధించిన నిబంధనలు అతనికి నష్టకరముగా మార్చబడవు.

**172.** హైకోర్టులలో తాత్కాలికముగా అదనపు జడ్జీలను నియమించుటకును, తాత్కాలికములగు ఖాళీలను పూర్తిచేయుటకును రాజప్రతినిధికి అధికారముండును.

**173.** 111, 112, 114 పేరాలలో నిర్ణయింపబడిన అవకాశములకు లోబడి ఫెడరలు శాసనసభవారును రాష్ట్రీయశాసనసభవారు చేయు నిబంధనలకు అనుగుణముగా హైకోర్టుజడ్జీలకు కాన్‌స్టిట్యూషను చట్టము ప్రారంభింపబడినపుడున్న అధికారములన్నియునుగూడనుండును.

**174.** అవసరమునుబట్టి క్రొత్త ఛార్టర్డుహైకోర్టులను రాజుగారు యేర్పరచుచుందురు. ఒక హైకోర్టువారి పరిశీలనక్రింద నున్న ప్రాంతములను మరియొక హైకోర్టుకు మార్చుటకును, బ్రిటిషు ఇండియాలో ఒక హైకోర్టు పరిశీలనక్రింద లేనిప్రాంతముపైనను ఇండియాలో బ్రిటిషు యిండియాకు వెలుపలనున్న ప్రాంతములలోని బ్రిటిషుపౌరులపైనను హైకోర్టులకు పరిశీలనాధికారము నిచ్చుటకు గవర్నరుజనరలుకు అధికారముండును.

**175.** ఒకరాష్ట్రములోని సబార్డినేటు కోర్టులపైని ఆ రాష్ట్రములోని హైకోర్టుకు పరిశీలనాధికారములను ఫెడరలు శాసనసభవారు నిర్ణయించుచుందురు.

## అయిదవభాగము : ఇండియామంత్రి ఉపదేశకులు

**176.** కాన్‌స్టిట్యూషనుచట్టము అమలులోనికి వచ్చినపిమ్మట యిపుడున్న యిండియామంత్రిసంఘము రద్దగును. ఇండియామంత్రికి సలహాచెప్పుటకతడు ముగ్గురికి తక్కువ గాకుండను, 6 గురికి మించకుండను ఒకసంఘమును నియమించును. వారిలో కనీసము ఇద్దరైనను ఇండియాలో బ్రిటిషు గవర్నమెంటుక్రింద 10 యేళ్లకు తక్కువ గాకుండ పనిచేసి యుండవలెను.

**177.** అటుల నియమింపబడినవారు ఐదేళ్లు ఆ పదవిలో నుందురు. ఒకసారి ఆ పదవికి నియమింపబడినవారిని మరల నియమింప గూడదు. ఈ సంఘసభ్యులు అధికారమునందున్నపుడు గూడ పార్లమెంటుసభలలో కూర్చుండుటకును వోటు చేయుటకును వీరి కధికార ముండదు.

**178.** ఈ సంఘసభ్యులకు సాలుకు...పౌనులుజీత ముండును. పార్లమెంటువారు నిర్ణయించిన మొత్తములోనుండి వీరికి జీతమియ్యబడును.

**179.** ఈ సలహాదారుల సలహాను పుచ్చుకొనుటయును మానుటయును యిండియా మంత్రి యిష్టముపై నుండును. అతను వారినందరిని సమావేశపరచిగాని విడివిడిగాగాని వారితో నాలోచించును. ఇండియాలో పబ్లికు సర్వీసు ఉద్యోగుల పరిశీలననుగూర్చి యిండియా మంత్రి తనకు గల అధికారమును బట్టి నిబంధనలను చేయదలచినపుడును తనకు చేయబడిన అపీలుపైని ఉత్తరువు చేయదలచినపుడును సలహాసంఘములో అధికసంఖ్యాకుల ఆమోదమును బడయవలెను.

## ఆరవభాగము: పబ్లికు సర్వీసులు

### జనరలు

**180.** కాన్‌స్టిట్యూషను చట్టము అమలులోనికి రాకపూర్వము ఇండియాలో ప్రభుత్వోద్యోగులుగానున్నవారు సివిలు క్రిమినల

శాఖలలో తమ అధికారమును చలాయించుటలో చేసిన కార్యములకు వారికి సంపూర్ణరక్షణ యొసగబడును.

181. సివిలుద్యోగులు రాజుగారి కిష్ట మున్నంతకాలము తమ పదవులలో నుందురు. వారిని ఏ అధికారి నియమించెనో ఆ యధికారి పదవికి తక్కువపదవిలో నున్నవారు వారిని పనిలోనుండి తొలగింపగూడదు. అతడు చేసిన పొరబాటునుగూర్చి ముందుగా అతనికి తెలియజేయవలెను. అతడు వాదించుట కవకాశము నియ్యవలెను. క్రిమినలు కేసులలో శిక్షింపబడినపుడును, పారిపోయినపుడును యీ నోటీసు అవసరము లేదు.

## కాన్‌స్టిట్యూషను చట్టమునకు పూర్వమును దరిమిలాను యిండియా మంత్రిచే నియమింపబడినట్టియు నియమింపబడనున్నట్టియు ఉద్యోగులు

182. చట్టమునకు పూర్వము నియమింపబడినవా రందరును ఆ తేదీకి వారికిగల అధికారము లన్నిటిని కలిగియుందురు. ఆ అధికారములు తొలగినచో వారికి న్యాయముగా నియ్యబడదగిన పరిహారమును యిండియామంత్రి నిర్ణయించును. ఇతర విషయములలోగూడ న్యాయమైన మజరా నిచ్చుటకు యిండియామంత్రికి అధికార మియ్యబడును.

ఇండియామంత్రిచే నియమింపబడినవారి కిపుడున్న ముఖ్యములగు హక్కులు 7-వ అపెండిక్సు మొదటిభాగములో వివరింపబడెను. ఈ హక్కులలో కొన్ని చట్టములోను, కొన్ని యిండియామంత్రిచేసిన నిబంధనలలోను చేర్చబడును. ఫెడరలుగవర్నమెంటుక్రింద పనిచేయునట్టి ఉద్యోగుల కందరికిని యీహక్కు లిటుపైని గూడ నుండును.

183. చట్టము అమలులోనికి వచ్చినపిమ్మట గూడ ఇండియను సివిలు సర్వీసులోను, పోలీసులోను క్రైస్తవమతశాఖలోను యిండియామంత్రియే ఉద్యోగులను నియమించుచుండును. ఇండియామంత్రి చేసిన నిబంధనలు వీరి కందరికిని అన్ని విషయములలోను జీతములు పింఛనులు, ప్రవర్తనగూడ వర్తించును. ఇప్పుడున్న నిబంధనలకును, యిటుపైని చేయబడునట్టి నిబంధనలకును భేదమేమియు నుండదు. చట్టము అమలులోనికి వచ్చిన పిమ్మట సంస్థానములతో సంబంధించిన ఉద్యోగులు రాజప్రతినిధిపరిశీలనక్రింద నుందురు. వారిని బ్రిటిను దొరతనమువారు నియమించెదరు. విదేశ విషయములు గవర్నరు జనరలుపరిశీలనక్రింద నుండును. ఆశాఖ ఉద్యోగు లతనికి లోబడి యుందురు. ఈశాఖ ఉద్యోగుల నియమించు పద్ధతి యింకా స్థిరపడలేదు.

184. ఇండియామంత్రిచే నియమింపబడిన ఉద్యోగు లందరును వారి ఉద్యోగప్రారంభమున నున్న అధికారముల నన్నిటిని కలిగియుందురు అవి తొలగింపబడినచో వారికి న్యాయమైన పరిహార మియ్యబడును. ఇతరులకుగూడ న్యాయమని తోచిన పరిహారము నిచ్చుటకు యిండియామంత్రికి అధికార ముండును

185 బ్రిటిను దొరతనమువారును, ఇండియామంత్రి సంఘమువారును, ఇండియామంత్రియును, నియమించిన సివిలు ఉద్యోగుల సంఖ్యను, లక్షణములను, నిర్ణయించునట్టి నిబంధనలను యిండియామంత్రి చేయుచుండును రిజర్వుడు పదవులకు పైని వివరింపబడినవారిని తప్ప యితరులను నియమింపగూడదు ఇండియామంత్రి అనుమతిలేకుండ రిజర్వుడు పదవిని మూడు నెలలకంటె హెచ్చుగా ఖాళీగా నుంచగూడదు.

186 పింఛనులు, తత్సంబంధమగు హక్కులు — వీటినిగూర్చి చట్టము అమలులోనికి వచ్చుసరికి అమలులో నున్న నిబంధనలను యిండియామంత్రి మార్చగూడదు ఇయ్యదగిన మొత్తముకంటె పింఛను తగ్గింపగోరినచో యిండియామంత్రిఅనుమతిని బడయవలెను.

పింఛనుల నిచ్చుటకు ఫెడరలుగవర్నమెంటువారే బాధ్యులు. రాష్ట్రములతో వారే యేర్పాటులు చేసుకొనవలెను చట్టమునకు పూర్వము నియమింపబడినవారు స్థిరముగా విదేశములలో నివసించుచున్నయెడల వారి పింఛనులమీద ఇండియాలో ఆదాయపు పన్ను వసూలు చెయ్యగూడదు.

187. ఇటుపైని నిబంధనలను చేయుటకు రాజుగారు మరియొకరి కధికార మిచ్చువరకును రెండు పార్లమెంటుసభలవారును అటుల చేయవలెనని రాజుగారిని కోరుటచే యిండియామంత్రిచే నియమింపబడినవారికి సంబంధించిన నిబంధనలను యిండియామంత్రియే చేయుచుండును. ఇండియామంత్రి తన సంఘమువారి అనుమతితో నిట్టి నిబంధనలను చెయ్యవలెను.

188. ఇండియామంత్రిచే నియమింపబడినవారికి వర్తించునట్టి నియమము లన్నియును ఇండియామంత్రిచే నియమింపబడక పోయినను బ్రిటిను దొరతనమువారిచే నియమింపబడి ఇండియను సివిలు సర్వీసు హోదాను చేరిన సివిలు ఉద్యోగుల కందరికినిగూడ వర్తింపవలెను దీనిని యిండియామంత్రి నిర్ణయింపవలెను.

189 చట్టము అమలులోనికి వచ్చినపిమ్మట యిండియామంత్రి యేశాఖలకు ఉద్యోగులను నియమించునో ఆశాఖలలో ఖాళీలు నియామకములు మున్నగు వాటికి సంబంధించిన పట్టికలు సంవత్సరమున కొకసారి రెండుపార్లమెంటుసభలలోను ఉపపాదింపబడును.

క్రొత్త చట్టము అమలులోనికి వచ్చిన అయిదేళ్ల పిమ్మట విదేశ శాఖలోను, మతశాఖలోను తప్ప తక్కిన శాఖలలో ఉద్యోగులను నియమించుటనుగూర్చి మరల విచారణ జరుగును. ఈ విచారణసంఘము

వారి నివేదికను రెండు పార్లమెంటుసభలవారును చర్చించెదరు. బ్రిటను దొరతనమువారు ఉత్తరువులను ప్రకటించెదరు. ఈ విచారణతో ఇండియా దొరతనమునకు గూడ సంబంధ ముండును.

## ఇండియాసంఘమువలనను, ఇండియామంత్రివలనను నియమింపబడినట్టియు, నియమింపబడనున్నట్టియు ఉద్యోగుల శాఖలకు చేరనివారు.

190. ఫెడరలుగవర్నమెంటువారును, రాష్ట్రీయ దొరతనముల వారును కొంతమంది ఉద్యోగులను నియమించెదరు. వీరికి సంబంధించిన నియమములనుగూడ నిర్ణయించెదరు. వీరిచే నియమింపబడిన ఉద్యోగులకు మాత్రమే యివి వర్తించును

191. క్రొత్తచట్టము అమలులోనికి వచ్చుసరికి యీ ఉద్యోగములలో నున్నవారికి గల సివిలు హక్కులన్నియును అటుపిమ్మట గూడ నుండును. వీరి హక్కులు ఏడవ అపెండిక్సు రెండవ భాగమున వివరింపబడెను.

192. రాష్ట్రీయ-ఇండియా దొరతనములచేచట్టమునకుపూర్వము నియమింపబడిన సివిలుఉద్యోగుల జీతము పింఛను అలవెన్సులు-వీటికి సంబంధించిననిబంధనలను మార్చుటకు అధికారముగల ఉద్యోగులు గాని, యిండియా మంత్రి అధికారమును బడసిన ఉద్యోగులు గాని 8-9-1926 న మార్చియుండిన యెడల తప్ప, లేనిచో వీరి కిపుడున్న ఆ వరత్తు లట్లేయుండును

193. సెంట్రలు సర్వీసు మొదటిక్లాసుకును ప్రావిన్షియలు సర్వీసుకును సంబంధించిన ఉద్యోగులలో చట్టమునకు పూర్వము నియమింపబడినవారి జీతములు పింఛనులు అలవెన్సులు గ్రాటుయిటీలు మున్నగువాటిని తగ్గించుటకు సెంట్రలుసర్వీసునకు గవర్నరుజనరలును, ప్రావిన్షియల్ సర్వీసుకు గవర్నరును అంగీకరింపవలెను. ఈ పదవులను తగ్గించు సెడల వీరికి నష్టము కలుగుసెడల వీటిని తగ్గింపగూడదు ఈ నిబంధన అన్ని శాఖలవారికినిగూడ వర్తించును

194. చట్టమునకు పూర్వముగాని తరువాత గాని నియమింపబడి ఖాయమై పూర్తికాలమున సివిలు ఉద్యోగములలో నున్నవారికి మందలింపుశిక్ష, జీతములను తగ్గించుట, ఉద్యోగపు వరతులను మార్చుట మున్నగువిషయములలో వారు ఒకసారి అపీలు చేయుట కధికారముండును

## పబ్లికుసర్వీసు కమిషనులు

195 ఫెడరలు పబ్లికు సర్వీసు కమీషనును, ప్రతిరాష్ట్రమునకును ఒకరాష్ట్రీయ పబ్లికు సర్వీసు కమీషనును ఉండును. ఒక్క రాష్ట్రీయకమీషను రెండుమూడు రాష్ట్రములకు గూడ సంబంధించి యుండవచ్చును.

196. ఫెడరలు కమీషనును ఇండియామంత్రి యేర్పరుచును. అందలి సభ్యులసంఖ్య, కాలనిర్ణయము, జీతములు మున్నగువాటి నన్నిటిని అతడే నిర్ణయించును. ఈసంఘాధ్యక్షుల కాలనిర్ణయము పూర్తియైన పిమ్మట నతనిని యిండియాలో మరేపదవిలోను ప్రభుత్వాధికారము క్రింద నియమింపగూడదు. తక్కిన సభ్యులు అధ్యక్షపదవికి అర్హులగుదురు వారి కితర ఉద్యోగములనిచ్చు విషయము యిండియా మంత్రి ప్రభుత్వముచేసిన నిబంధనలకులోబడినది

197. రాష్ట్రీయ పబ్లికు సర్వీసు కమీషను సభ్యులను గవర్నరు నియమించును ఈ సంఘాధ్యక్షుని ఫెడరలు పబ్లికు సర్వీసు సంఘమున సభ్యునిగాగాని అధ్యక్షునిగాగాని నియమింప వచ్చును. కాని యితనికి మరేప్రభుత్వోద్యోగము నియ్యగూడదు. తక్కిన సభ్యులు పబ్లికుసర్వీసెసు సంఘములలో సభ్యులుగను, అధ్యక్షులుగను నియమింపబడుటకు అర్హులగుదురు తక్కిన ఉద్యోగములను గూర్చి గవర్నరు చేసిన నిబంధనలను చూడవలెను.

198 పబ్లికుసర్వీసు సంఘములవారి జీతముల పైని శాసనసభల కధికారములేదు.

199. ఫెడరలు సర్వీసులకును ప్రావిన్షియలు సర్వీసులవారు పోటీపరీక్షలను జరిపెదరు. ఉద్యోగముల నిచ్చుట, జీతములను హెచ్చించుట, ఉన్నతపదవుల నిచ్చుట బదిలీలను చేయుట, మున్నగు విషయములను గూర్చి దొరతనములవారు వీరితో నాలోచించు చుండవలెను.

200. ఒకఉద్యోగిని సస్పెండుచేయు విషయమున తప్ప తక్కిన విషయములలో దొరతనమువారికి వచ్చిన పిటిషనులను అపీళ్లను విచారించునపుడు దొరతనములవారు యీకమీషనులతో నాలోచించుచుండవలెను. ఒక ఉద్యోగి తనఉద్యోగధర్మమును నిర్వర్తించుటలో నతనిపై కేసుచేయబడినచో ఆ ఖర్చులను దొరతనమువారు భరించవలెనని అతడు కోరుట మున్నగు విషయములలోగూడ దొరతనమువారు వీరితో నాలోచించుచుండవలెను. ఇండియామంత్రిచే నియమింపబడినవారి విషయమునను రాష్ట్రీయశాఖలకు చేరనివారి విషయమునను ఈ కమిషనులవారి కెట్టి అధికారమునుండదు.

201. దొరతనమువారికి గాని యిండియామంత్రికిగాని యిష్టమున్నచో కొన్ని వ్యవహారములపైని వారి కమీషనులవారి అభిప్రాయమును తెలుసుకొనవచ్చును

## ఏడవభాగము: తాత్కాలిక దశలో నిబంధనలు

202 రాష్ట్రీయ స్వపరిపాలనము ముందుగా నేర్పరుపబడవచ్చును దానికి సంబంధించిన నిబంధనలుగూడ క్రొత్తచట్టములో నుండును. తాత్కాలిక దశకు సంబంధించిన నియమములుగూడ

దానిలోనుండును. ఇపుడున్న సెంట్రలుగవర్నమెంటుకు రాష్ట్రము లలో గల అధికారము చాలవరకు తగ్గింపబడునుగాని ఇపుడున్న యిండియాచట్టము ప్రకారము గవర్నరుజనరలుకు గల అధికారము లన్నియును తాత్కాలికదశలో సెంట్రలు గవర్నమెంటుకుగూడ నుండును.

## అనుబంధములు

ప్రభుత్వమువారిచే ప్రకటింపబడిన శ్వేతపత్రముయొక్క అనుబంధముల సంగ్రహము ఈ దిగువ ప్రకటింపబడినది—

### ఫెడరలు స్టేటుకౌన్సిలు సభ

ఫెడరలు స్టేటుకౌన్సిలుసభయందు 260 మంది సభ్యు లుండెదరు. ఫెడరేషనులో చేరిన సంస్థానాధీశులు 100 మంది సభ్యులను, ప్రభుత్వమువారు 10 మంది సభ్యులను నియమించెదరు. ఆ సభయందు బ్రిటిషుఇండియాకు ప్రత్యేకింపబడిన మిగత 150 స్థానములు ఈక్రింది విధమున పంచిపెట్టబడినవి వివిధ రాష్ట్రీయశాసనసభలకు ఈ దిగువ వివరింపబడిన విధమున 136 స్థానములు ప్రత్యేకింపబడినవి. రాష్ట్రీయ శాసనసభ్యులు సింగిలు ట్రాన్స్ఫరబులు వోటుద్వారా ప్రతినిధులను ఎన్నుకొనెదరు.

| | |
|---|---|
| 1. మద్రాసు, బొంబాయి, బెంగాలు, సంయుక్తరాష్ట్రములు, పంజాబు, బీహారు శాసనసభలకు ఒక్కొక్క శాసనసభకు 18 స్థానముల చొప్పున | 108 |
| 2. మధ్యపరగణాల శాసనసభకు స్థానములు | 8 |
| 3. అస్సాము, సరిహద్దురాష్ట్రము, సింధు, ఒరిస్సా రాష్ట్రములకు ఒక్కొక్క శాసనసభ 5 స్థానములు చొప్పున | 20 |
| మొత్తము స్థానములు | 136 |

రెండు రాష్ట్రీయశాసనసభలుండు బెంగాలు, సంయుక్త రాష్ట్రములు, బీహారురాష్ట్రములలో రెండుసభల సభ్యులు కలసి తమ ప్రతినిధులను ఎన్నుకొనెదరు. రాష్ట్రీయశాసనసభలయందు సభ్యులుగ నుండు క్రైస్తవులు, ఆంగ్లో-ఇండియనులు, యూరోపియనులు ఈ ఎన్నికలయందు పా్గనరు ఈ మూడుతెగలవారికిని దేశము మొత్తమువిూద ఫెడరలుస్టేటుకౌన్సిలునందు 10 స్థానములు ప్రత్యేకింపబడినవి. ఆ పదిస్థానములలో యూరోపియనులకు 7 స్థానములు, క్రైస్తవులకు 2 స్థానములు, ఆంగ్లో-ఇండియనులకు ఒక స్థానము ప్రత్యేకింపబడినవి. అన్నిరాష్ట్రీయశాసనసభలయందు సభ్యులుగనున్న ఈ తెగలవారు కలసి వారివారికి ప్రత్యేకింపబడిన స్థానములకు సభ్యులను ఎన్నుకొనెదరు.

కూర్గు, ఢిల్లీ, అజ్మీరు, బెలూచిస్థానములకు స్థానములు ప్రత్యేకింపబడినవి.

ఈ విధమున స్టేటుకౌన్సిలునందు బ్రిటిషుఇండియాకు ప్రత్యేకింపబడిన 150 స్థానములు భర్తీచేయబడును

## ఫెడరలు అసెంబ్లి

ఫెడరలు అసెంబ్లి సభలో 375 మంది సభ్యు లుండెదరు. 125 మంది సభ్యులను ఫెడరేషనులో చేరిన సంస్థానాధీశులు నియమించెదరు. మిగత 250 సభ్యులను బ్రిటిషుఇండియావారు ఎన్నుకొనెదరు సిక్కులకు, మహమ్మదీయులకు, క్రైస్తవులకు, ఆంగ్లో-ఇండియనులకు, యూరోపియనులకు ప్రత్యేకసాంఘికనియోజకవర్గములు ఏర్పరుపబడును. వోటు ఇచ్చుటకు అర్హతగలిగి ఈసాంఘిక నియోజకవర్గములందు చేరనివారు సాధారణ నియోజకవర్గములందు చేర్చబడెదరు ఈ సాధారణ నియోజకవర్గములందు కొన్నిస్థానములు నిమ్నజాతులకై ప్రత్యేకింపబడును. నిమ్నజాతులకు చేరిన వోటర్లందరు కలసి నలుగురిని ఎన్నుకొనెదరు. ఆ నలుగురే సాధారణ నియోజకవర్గమందు అభ్యర్థులుగ నిలచి ఎన్నికలయందు పోటీచేయవలయును. ఈ సభయందు స్త్రీలకు కొన్నిస్థానములు ప్రత్యేకింపబడినవి. రాష్ట్రీయశాసనసభ్యులు సింగిలు ట్రాన్సుఫరబులు వోటుద్వారా వోటింగు జరిపి ఈ స్థానములను భర్తీచేసెదరు వర్తకసంస్థలకును, భూస్వాములకును ప్రత్యేకింపబడిన స్థానములకు నిర్ణయింపబడిన ప్రత్యేక నియోజకవర్గములు వేరొకచో వివరింపబడినవి. కార్మికులకై కొన్నిస్థానములు ప్రత్యేకింపబడినవి. కాని ఇందులకు నియోజకవర్గముల నేవిధమున ఏర్పరుపవలయు నను విషయమై ప్రభుత్వమువారింకను ఆలోచించుచున్నారు

### ఫెడరలు అసెంబ్లీ - మద్రాసురాష్ట్రము

ఫెడరలు అసెంబ్లీయందు బ్రిటిషుఇండియావారికి ప్రత్యేకింపబడిన 250 స్థానములలో ఒక్కొక్క రాష్ట్రమునకు ఎన్నెన్ని స్థానము లొసగబడినది ఈ దిగువ వివరింపబడినది —

| | స్థానములు | | స్థానములు |
|---|---|---|---|
| మద్రాసు | 37 | సరిహద్దురాష్ట్రము | 5 |
| బొంబాయి | 30 | సింధు | 5 |
| బెంగాలు | 37 | ఒరిస్సా | 5 |
| సంయుక్తరాష్ట్రములు | 37 | ఢిల్లీ | 2 |
| పంజాబు | 30 | అజ్మీరు | 1 |
| బీహారు | 30 | కూర్గు | 1 |
| మధ్యపరగణాలు | 15 | బెలూచిస్థానము | 1 |
| అస్సాము | 10 | ఇతరప్రదేశములు | 4 |
| | | స్థానములు మొత్తము | 250 |

మద్రాసు రాష్ట్రమున కేటాయించబడిన 37 స్థానములు ఈ క్రింది విధమున భర్తీ చేయబడును.

| | స్థానములు |
|---|---|
| 1. సాధారణ నియోజకవర్గముల ప్రతినిధులు (ఈ స్థానములలో నాలుగుస్థానములు నిమ్న జాతులకై ప్రత్యేకింపబడినవి) | 19 |
| 2. మహమ్మదీయ నియోజకవర్గముల ప్రతినిధులు | 8 |
| 3. క్రైస్తవ నియోజకవర్గముల ప్రతినిధులు | 2 |
| 4. ఆంగ్లో-ఇండియను నియోజకవర్గపు ప్రతినిధి | 1 |
| 5. యూరోపియను నియోజకవర్గపు ప్రతినిధి | 1 |
| 6. స్త్రీలకు | 2 |
| 7. వర్తక సంస్థలకు | 2 |
| 8. భూస్వాములకు | 1 |
| 9. కార్మికులకు | 1 |
| మొత్తము స్థానములు | 37 |

## ఫెడరలు అసెంబ్లి వోటర్లు: వారి కుండవలసిన అర్హతలు

మద్రాసు రాష్ట్రమునందలి ఫెడరలు అసెంబ్లి వోటర్ల కుండవలసిన అర్హతలకు సంబంధించిన వివరములు ఈదిగువ ప్రకటింపబడినవి:—

### సాధారణ నియోజకవర్గములు

సాధారణ నియోజకవర్గములందు ఈ క్రింది అర్హతలు గలవారు వోటర్లుగ నుండెదరు:—

1. మునిసిపాలిటీలలో ఆస్తిపన్ను గాని, వృత్తిపన్ను గాని, కంపెని పన్ను గాని సంవత్సరమునకు 8 రూప్యములకు తక్కువ గాని మొత్తమును చెల్లించుట.

2. సంవత్సరమునకు 10 రూప్యముల శిస్తు చెల్లించు భూమి గలిగియుండుట.

3. మద్రాసు నగరమున సంవత్సరమునకు 60 రూప్యముల బాడుగ ఇచ్చు ఇంటియం దుండుట.

4. ఆదాయపుపన్ను చెల్లించుట.

5. మెట్రికులేషను పరీక్షయం దుత్తీర్ణులైనవారు, లేక స్కూలు ఫైనలు లీవింగుసర్టిఫికేటు పొందినవారు, లేక ఈపరీక్షలకు సమమైన పరీక్షలుగ ప్రభుత్వమువారిచే అంగీకరింపబడిన పరీక్షలయం దుత్తీర్ణులైనవారు.

6. సైన్యమున పెన్షను పొందినట్టియు, లేక డిస్చార్జి చేయబడినట్టియు నాన్‌కమిషన్డు ఆఫీసర్లు. రెగులరు ఫోర్సులయందలి సైనికులు.

### నిమ్న జాతులు

సాధారణ నియోజకవర్గములందే నిమ్న జాతుల వోటర్లు వోటు చేయుదురు. ఏయే జాతులవారు నిమ్న జాతుల చేరినవారో తెలుపు పట్టిక వేరొకచో ప్రకటింపబడినది. సాధారణ నియోజకవర్గములందలి వోటర్లలో నూటికి ఇద్దరు చొప్పున ఈనిమ్న జాతులకు చేరినవారుగ నుండవలయును. పైన వివరింపబడిన అర్హతల ననుసరించి వోటరులలో నూటికి ఇరువురు నిమ్న జాతులవారు కాకుండినచో, నిమ్న జాతులవోటర్ల అర్హతలు ఇంకను తగ్గింపబడును.

### ప్రత్యేక నియోజకవర్గములు

1. భూస్వాములు:—మద్రాసు రాష్ట్రీయశాసనసభ భూస్వాముల నియోజక వర్గమునందు చేర్చబడినవారు అసెంబ్లీ భూస్వాముల నియోజక వర్గమున కూడ నుండెదరు.

2. వర్తక సంస్థలు:—సాలునకు పదివేల రూప్యముల ఆదాయమునకు పైబడిన లాభముపొందు వర్తక సంస్థల యజమానులు, లేక భాగస్థులు కలసి భారతవర్తకుల నియోజకవర్గముగ నేర్పరుపబడెదరు.

భారత దేశమునందు నివాస మేర్పరచుకొనిన మద్రాసు ఛేంబరు ఆఫ్ కామర్సు సభ్యులు ఆంగ్లేయ వర్తకుల నియోజక వర్గముగ నుండెదరు.

3. కార్మికుల నియోజక వర్గము విషయమై ప్రభుత్వమువారింకను ఆలోచించుచున్నారు.

## మద్రాసు రాష్ట్రపు శాసనసభ

రాష్ట్రీయ శాసనసభలకు సాధారణ నియోజకవర్గములు, సాంఘిక నియోజకవర్గములు, ప్రత్యేక నియోజకవర్గము లుండును. నిమ్న జాతులు సాధారణ నియోజకవర్గములందే అభ్యర్థులుగ నిలువవలెను. వారికి కొన్నిస్థానములు ప్రత్యేకింపబడును. అసెంబ్లీ ఎన్నికలవలెనే రాష్ట్రీయ శాసనసభ ఎన్నికల సందర్భమునకూడ ప్రథమమున నిమ్న జాతులవారు తమలోతాము నలుగురిని ఎన్నుకొనుట, పిమ్మట వీరు నలువురు సాధారణ నియోజకవర్గములందు పోటీచేయుట జరుగును. స్త్రీలకును కార్మికులకును ప్రత్యేకింపబడిన స్థానములను ఏవిధముగ భర్తీచేయవలసిన దనువిషయమై ఇంకను ప్రభుత్వమువారు నిర్ణయము గావింపలేదు.

మద్రాసు శాసనసభయందు 215 స్థానములుండును.

1. సాధారణ నియోజకవర్గముల ప్రతినిధులకు (ఇందులో 20 స్థానములు నిమ్న జాతుల వారికి ప్రత్యేకింపబడినవి.) 152 స్థానములు

2. అనాగరిక ప్రదేశముల ప్రతినిధులకు 1 స్థానము

3. మహమ్మదీయ నియోజక వర్గములకు 29 ,,
4 క్రైస్తవ నియోజకవర్గములకు 9 స్థానములు
5 ఆంగ్లో ఇండియనుల నియోజక వర్గములకు 2 ,,
6 యూరోపియను నియోజకవర్గమునకు 3 ,,
7. వర్తకసంస్థలకు, ప్లాంటరులకు 6 ,,
8 భూస్వాములకు 6 ,,
9. విశ్వవిద్యాలయమునకు 1 ,,
10 కార్మికులకు 6 ,,

మొత్తము 215 స్థానములు

సాధారణ నియోజకవర్గములందు 6 స్థానములు, మహమ్మదీయ క్రైస్తవ నియోజకవర్గములందొక్కొక్క స్థానము స్త్రీలకై ప్రత్యేకింపబడినవి.

## వోటర్ల అర్హతలు: సాధారణ నియోజకవర్గములు

ఈ దిగువ వివరింపబడిన అర్హతలు గలవారు సాధారణ నియోజకవర్గములందు వోటర్లుగ నుండెదరు.

1. వోటర్లపట్టిక తయారగుటకు ముందు జరిగిన సంవత్సరమున మద్రాసు మోటారుబండ్ల పన్నులచట్టము ననుసరించి పన్ను చెల్లించినవారు

2 రిజిస్టరైన భూస్వాములు, ఇనాముదారులు, రైతువారీ పట్టాదారులు లేక మద్రాసు ఎస్టేటులాండు ఆక్టు ననుసరించి భూమిపై భుక్తపు హక్కులు గల రైతులు.

3. ప్రభుత్వమువారికి గ్రౌండురెంటు చెల్లించువారు.

4 మద్రాసు నగరపు మునిసిపాలిటీ చట్టము ననుసరించిగాని, జిల్లా మునిసిపాలిటీల చట్టము ననుసరించిగాని, లోకలుబోర్డులచట్టము ననుసరించి గాని, వోటర్లపట్టిక తయారగుటకు ముందు జరిగిన సంవత్సరము పూర్తిఆస్తిపన్ను చెల్లించినవారు.

5. కడచిన సంవత్సరములో మలబారు టెనెన్సీ చట్టము ననుసరించి కన్నందారు లేక వెరంపటందారుగ నున్నవారు.

6. మద్రాసు నగరమైనచో సంవత్సరమునకు 100 రూప్యముల బాడుగ వచ్చునట్టియు, ఇతర చోట్లైనచో సంవత్సరమునకు 50 రూప్యములు బాడుగవచ్చునట్టియు ఇల్లు కడచిన సంవత్సరమందు కుదువయం దుంచుకొనినవారు లేక బాడుగచెల్లించుచు ఇంటియందున్నవారు.

7. పైన వివరింపబడిన ఆస్తిగల మైనరుకు గార్డియనుగ నున్నవారు.

8 ఆస్తి పన్ను గాని, ఇంటి పన్ను గాని కడచిన సంవత్సరము చెల్లింపబడిన ఇంటియందు ప్రధానముగ కాపురస్థుడుగ నున్నవాడు.

9 అవిభక్తకుటుంబములయందు కుటుంబపు యజమానికేకాక ఇతరులకుకూడ ఈ క్రిందివిధమున వోటు ఇచ్చు అధికార మివ్వబడును 500 రూప్యముల శిస్తు చెల్లించు ఇనాం గ్రామములు గలవారికి 500 రూప్యములకు 1 వోటుచొప్పున రైతువారీ భూములలో 50 రూప్యములకు పైబడిన శిస్తు చెల్లించువారికి 50 రూప్యములకు ఒక వోటు చొప్పునను అవిభక్త కుటుంబమునందున్నవారికి ఇవ్వబడును

10 ఆదాయపు పన్ను చెల్లించువారు.

11 ఏ భాషయైనను చదువుటకును వ్రాయుటకును నేర్చినవారు. ఇందులకు గ్రామాధికారులు సర్టిఫికేటు ఇవ్వవలయును ఆ సర్టిఫికేటును తహసీలుదారు ఆమోదింపవలయును లేక, రికగ్నైజుడు పాఠశాల హెడ్‌మాస్టరుగారు ఎలిమెంటరీస్కూలు సర్టిఫికేటు ఇవ్వవలయును.

12 పైన వివరింపబడిన ఆస్తిఅర్హతగల వోటరు యొక్క భార్య, (ఒక్క భార్యకే యీహక్కు సంక్రమించును) హక్కు సంక్రమించిన పిమ్మట భర్త మరణించినను మరల వివాహ మాడునంతవరకు ఆమె వోటరుగ నుండును.

13. సైన్యమున నాన్‌కమిషన్డు ఆఫీసరుగను లేక, పెన్షనుగాని డిస్చార్జిగాని పొందిన ఆఫీసరుగాను, లేక రెగులరు ఫోర్సులయందు సైనికుడుగ నున్నవారు.

నియోజకవర్గమునందలి వోటర్లలో నూటికి 10 నిమ్నజాతులకు చేరినవారై యుండవలెను పైన వివరింపబడిన అర్హతలక్రింద ఈ దామాషా నిమ్నజాతివోటర్లు ఏర్పడనిచో నిమ్నజాతుల విషయమున వోటర్ల అర్హతలు తగ్గింపబడును

## ప్రత్యేక నియోజకవర్గములు

1. భూస్వాములు:—మద్రాసు రాజధానియందలి భూములపై సంవత్సరమునకు 3000 రూప్యముల ఆదాయము పొందువారు 11500 రూప్యముల అసెస్సుమెంటు గల జమ్మిభూమిగలవారు. ప్రభుత్వమువారివద్దనుండి సంవత్సరమునకు 3000 రూప్యములు వంతున అలవెన్సు పొందువారు భూస్వాముల నియోజకవర్గమునందు వోటర్లుగ నుండెదరు.

విశ్వవిద్యాలయము:—విశ్వవిద్యాలయపు సెనేటు సభ్యులు, ఆనరరిఫెల్లోలు, 7 సంవత్సరముల క్రింద మద్రాసు విశ్వవిద్యాలయపు పట్టభద్రులుగ రిజిస్టరు కాబడినవారు విశ్వవిద్యాలయపు నియోజకవర్గమున వోటర్లుగ నుండెదరు.

ప్లాంటర్లు — దక్షిణ ఇండియా యునైటెడ్ ప్లాంటర్ల సంఘపు సభ్యులు ప్లాంటరుల నియోజకవర్గముగ ఏర్పడెదరు.

వర్తకసంస్థలు — మద్రాసు ఛేంబరు ఆఫ్ కామర్సు సభ్యులు ఆంగ్లేయ వర్తక సంస్థల ప్రతినిధిని ఎన్నుకొనెదరు. దక్షిణ ఇండియా వర్తకసంఘమువారు, నాటుకోట నగరత్తారుల సంఘమువారు భారత వర్తక సంస్థలకై ప్రత్యేకింపబడిన స్థానములను భర్తీచేయుదురు.

కార్మికులకై ప్రత్యేకింపబడిన స్థానములను భర్తీచేయు విధానముగురించి ప్రభుత్వమువారింకను ఆలోచించుచున్నారు.

## నిమ్న జాతుల పట్టిక

మద్రాసురాష్ట్రమున ఈ దిగువ పేర్కొనబడిన జాతులవారు నిమ్నజాతులకు చేరినవారుగ పరిగణింపబడెదరు.

1. ఆదిఆంధ్ర
2 ఆదిద్రావిడ
3 ఆదికర్ణాటక
4 అజిల
5. అరనదను
6. అరుంధతీయ
7 బైర
8. బాకుడ
9 బంది
10. బరికి
11. బట్టడ
12 బావురి
13. బెల్లార
14. బైగారి
15. బాచటి
16. చక్కిలి
17. చలవడి
18 చమారు
19. చండాల
20. చెరుమను
21. దండాసి
22. దేవేంద్రకులడను
23. దొంబి
24 గాసి
25. గొడగలి
26. గొడారి
27. గొడ్డ
28. గోసంగి
29. హడ్డి
30. హస్ల
31. హొలియ
32. జగ్గలి
33 జంబువుల
34. కడను
35. కల్లాడి
36 కనక్కన్
37. కరింపాలను
38 కట్టునాయకను
39. కొడాలో
40 కూస
41 కొరగ
42 కుడియ
43 కుడిచి
44. కుడుంబను
45. కురవను
46 కురిచ్చను
47. కురుమను
48 మదురి
49. మాదిగ
50 మాల
51. మైల
52 మాలదాసు
53 మాలసారు
54. మాతంగి
55. మాలిలను
56 మోగరు
57. ముచ్చి
58. ముండల
59. నాలకేయవ
60. నాయాది
61. పగడై
62 పైడి
63. పైండ
64. పాకి
65 పల్లను
66 పంబడ
67 పమిడి
68 పంచమ
69. పణియన్
70. పన్నియాండి
71 పానో
72 పరయను
73. పరవను
74 పులయను
75 పుదిరైవన్నను
76. రానీయరు
77 రెల్లి
78 సమగర
79 సంబను
80 సపరి
81. సెమ్మను
82 తోటి
83. తిరవళ్లువరు
84 వల్లువను
85. వాల్మీకి
86. వెట్టువను

# శాఖా విభజనము: ఫెడరలు ప్రభుత్వము రాష్ట్రీయ ప్రభుత్వములు

పరిపాలనావిషయములందు ఫెడరలు ప్రభుత్వమువారి పరిపాలనకు లోబడిన అంశములు రాష్ట్రీయప్రభుత్వముల పరిపాలనకు లోబడిన అంశములు ప్రత్యేకముగ విభజింపబడును. ఇందులకు వేరు వేరు పట్టికలు తయారుచేయబడును. ఆ పట్టికలు ప్రభుత్వనిర్మాణ చట్టమునందు చేర్చబడును. ఫెడరలు ప్రభుత్వమువారికి సంబంధించిన విషయములందు రాష్ట్రీయశాసనసభలు, రాష్ట్రీయప్రభుత్వములకు సంబంధించిన విషయములందు ఫెడరలుశాసనసభ జోక్యము కలుగ చేసికొనకూడదు. కొన్ని విషయములందు ఫెడరలు ప్రభుత్వమువారికిని, రాష్ట్రీయప్రభుత్వములవారికిని కూడ అధికార ముండవలయు నని తోచుటచే రెండుప్రభుత్వములవారికి సమానాధికారములు గల అంశముల పట్టిక మరొకటి తయారుచేయబడినది.

## కేవలము ఫెడరలు ప్రభుత్వమువారి పరిపాలనమునకు లోబడిన విషయములు

(1) అవసరసమయమని గవర్నరుజనరలుగారిచే ప్రకటింపబడినకాలము భారతదేశపు అఫెన్సునకు సంబంధించిన విషయములు.

(2) భారతదేశమున సైనిక, నావికవైమానికదళముల నిర్మించుట ఆదళములలో చేరినవారికి తగుశిక్షణ నొసగుట మున్నగువిషయములు. రాష్ట్రీయప్రభుత్వములవారిచే ప్రత్యేకముగ నిర్మింపబడు సాయుధ పోలీసుదళముల విషయమునను, సైనికదళములవిషయమునను సంస్థానములందు సంస్థానాదీశులచే నిర్మింపబడు సైనికదళములవిషయమునను ఫెడరలుప్రభుత్వమువారికి అధికార ముండదు.

(3) నావిక సైనిక వైమానిక శాఖలకు సంబంధించిన భవన నిర్మాణాది కార్యములు.

(4) కంటోనుమెంటుల పరిపాలనము.

(5) రాష్ట్రములలో జరుగు అల్లరులను అణచుటకై భారత దేశపు సేనలు నుపయోగించుట.

(6) సంస్థానాధీశుల కుటుంబములవారి కొరకు ప్రత్యేకముగ ఏర్పరుపబడిన కళాశాలలు, సైన్యములోనివారి కుటుంబములవారికిని ప్రత్యేకముగ ఏర్పరుపబడిన విద్యాప్రతిష్ఠాపనలు, వారణాసి హిందూ విశ్వవిద్యాలయము, అలిఘురు మహమ్మదీయ విశ్వవిద్యాలయము.

(7) క్రైస్తవ మత శాఖ.



శ్రీ యం. యస్. ఆర్. ఎ. గుప్తగారు (కావలి)



శ్రీ టి. ఆర్. దేవరాజులుగారు బి. ఏ., బి. యల్. (మదరాసు)

స్టార్ ఆఫ్ ఇండియా ఇండస్ట్రియల్ అండు జనరల్ అస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్డు (మద్రాసు) స్థాపకులు, మేనేజింగు ఏజంట్లు.



గ. శ్రీ. న. ఆచార్యులు



అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ రూజువెల్టుగారు

(8) విదేశాంగ వ్యవహారములు, అంతర్జాతీయ బాధ్యతలు.

(9) వలసపోవుట, వలసవచ్చుట.

(10) భారతదేశము వెలుపలనుండు పుణ్యక్షేత్రములకు భారతీయులు పోవునప్పుడు వారు అనుసరింపవలసిన నిబంధనలు.

(11) ఎక్స్‌ట్రాడిషను (అనగా విదేశములందు నేరము లొనర్చినవారు ఈ దేశమునకు వచ్చినవారిని ఆ దేశముల పోలీసువారికి పట్టి ఇచ్చుట)

(12) బ్రిటిషు ఇండియాలో క్రొత్త రైల్వేమార్గములను నిర్మించుట సంస్థానాధీశులు అంగీకరించినచో సంస్థానములందుకూడ ఫెడరలు ప్రభుత్వమువారే రైల్వేనిర్మాణకార్యమునకు గడంగవచ్చును. కాని రాష్ట్రములలోనే ఒక ప్రదేశమునుండి మరియొక ప్రదేశమువరకు నిర్మింపబడు చిన్నరైల్వేమార్గముల విషయమున ఫెడరలు ప్రభుత్వము వారికి సంబంధముండదు ఫెడరలు ప్రభుత్వమువారికి సంబంధించిన రైల్వేలను నిర్వహించుట. రాష్ట్రములందును, సంస్థానములందును యున్న రైల్వేల విషయమున చార్జీలను, రేట్లను ప్రయాణీకులను సంరక్షించు విషయమై తగు కట్టుదిట్టములను గావించుట ఫెడరలు ప్రభుత్వమువారికి అధికార ముండును.

(13) వాణిజ్యము కొరకును, తపాలాలు తీసికొనిపోవుటకును ఏర్పరుపబడు వాయువిమానపు సర్వీసులు, వాయు విమానాశ్రయములపైకూడ ఫెడరలు ప్రభుత్వమువారికే అధికార ముండును.

(14) రెండు మూడు రాష్ట్రములందు కలసియున్న జలమార్గములు.

(15) నావల ద్వారా జరుగు వ్యాపారము.

(16) ఫిషరీలు.

(17) రాష్ట్రమునందలి జలమార్గములలో స్టీమర్లు నడచుటకు సంబంధించిన విషయములు.

(18) లైటుహవుసులు.

(19) క్వారెంటైను.

(21) పెద్దరేవులు (చిన్నరేవులు కొన్నిరాష్ట్రీయ ప్రభుత్వముల వారికి లోబడియుండును.)

(22) నాణెములు, నాణెముల చలామణి.

(23) ఫెడరేషనుయొక్క ఋణములు.

(24) పోస్టు ఆఫీసు సేవింగ్సు బాంకి.

(25) బాంకీలు, ఇన్సూరెన్సు కంపెనీలు, ఇతరవర్తక సంస్థలను రిజిష్టరుచేయుట.

26 ప్రజాలాభమునకు అవసరమని, ఫెడరలు శాసనసభికులచే నిర్ణయింపబడు పరిశ్రమలను అభివృద్ధికి తెచ్చుట.

(27) నల్లమందు ఉత్పత్తి, నల్లమందు ఎగుమతి

(28) పెట్రోలియము, ప్రేలుడు వస్తువులపై కంట్రోలు.

(29) తుపాకులు మందుసామగ్రి వ్యాపారముపై కంట్రోలు.

(30) కాపీరైటులు, ట్రేడుమార్కులు

(31) ఇన్సాల్వెన్సి

(32) నెగోషియబులు ఇన్‌స్ట్రుమెంటులు.

(33) ఫెడరేషను నందంతయు చెల్లునట్టి లైసెన్సులను మోటారుబండ్లకొసగుట.

(34) ఫెడరేషను సరిహద్దులలోనికి సరకుల దిగుమతులు, వెలుపలికి పోవు ఎగుమతులుపై కంట్రోలు, ఎగుమతులమీదను దిగుమతుల మీదను సుంకములను విధించుట.

(35) ఉప్పు

(36) ఎక్సైసు డ్యూటీలు(సారాయి మున్నగు మద్యపదార్థములపై విధింపబడు డ్యూటీల విషయమున ఫెడరలు ప్రభుత్వమువారికి సంబంధముండదు. పొగాకుపై విధింపబడు ఎక్సైసుడ్యూటి ఫెడరలు ప్రభుత్వమువారికి చేరిన విషయము.)

(37) ఆదాయము పన్ను, మూలధనముపై విధింపబడు పన్నులు.

(38) భారతదేశపు జియలాజికలు సర్వే.

(39) భారతదేశపు బొటానికలు సర్వే.

(40) మిటిరియోలజి(వాతావరణ స్థితి)

(41) జనాభా లెక్కలు.

(42) పరిశోధన ప్రతిష్ఠాపనలు.

(43) ఫెడరలు ప్రభుత్వమువారిచే నిర్వహింపబడుచున్న ఇంపీరియలు లైబ్రరి, ఇండియా మ్యూజియము, ఇంపీరియలు వార్ మ్యూజియము, విక్టోరియా మెమోరియలు మున్నగు సంస్థలు.

(44) ఫెడరలుప్రభుత్వమువారిచే చెల్లింపబడవలసిన పెన్షనులు.

(45) ఫెడరలు సర్వీసులు, ఫెడరలు పబ్లికు సర్వీసుకమిషను.

(46) ఫెడరలు ప్రభుత్వమువారికి చేరిన స్థిరాస్తులు.

(47) ఫెడరలు శాసనసభవారిచే ఆమోదింపబడిన శాసనములను అమలునకు తెచ్చుట.

(48) చట్టమునందు సూచింపబడి ఫెడరలు శాసనసభవారిచే మార్చబడినటువంటి ఇతర విషయములు.

(49) వ్యవసాయాదాయము, కంపెనీల ఆదాయములు కాక ఇతర ఆదాయములపై పన్నులను విధించుట. ఆ ఆదాయములపై సర్ఛార్జిలను విధించుటకు రాష్ట్రములకు అధికార ముండును

(50) భూస్థితి,ఇతర ఆస్తి,హక్కుదారుడు మరణించినపిమ్మట వారసులకు సంక్రమించునప్పుడు విధింపబడు పన్నులు.

(51) గనులు మున్నగువాటియందు పనిచేయుటకు లైసెన్సుల నిచ్చునప్పుడు విధించు పన్నులు

(52) రైల్వేలయందును, జలమార్గములందును, విమానపుసర్వీసులయందును విధింపబడు టర్మినలు పన్నులు.

(53) ఫెడరేషను ప్రారంభమగుసరికి భారతశాసనసభవారి చట్టములకు లోబడిన స్టాంపు డ్యూటీలు.

(54) ఫెడరలుప్రభుత్వమునకు సంబంధించిన విషయముల పట్టికయందు గాని, రాష్ట్రీయ ప్రభుత్వములకు సంబంధించిన విషయముల పట్టికయందుగాని చేర్చబడని క్రొత్తపన్నులను విధించుట. ఇట్టి పన్నులను విధించునప్పుడు ఫెడరలు ప్రభుత్వపు మంత్రులతోను, రాష్ట్రీయ ప్రభుత్వముల మంత్రులతోను గవర్నరుజెనరలుగారు కలసి ఆలోచించి తన ఆమోదము నొసగవలయును.

(55) విదేశములవారి హక్కులు, విదేశస్థులకు పౌర స్వత్వపు హక్కుల నొసగుట.

(56) ఫెడరలు శాసనసభల ఎన్నికలను జరుపుట.

(57) తూకముల ప్రమాణము.

(58) శాసనసభలు, లేక, ఛీఫ్ కమిషనరులచే పరిపాలింపబడు రాష్ట్రములకు సంబంధించిన అన్ని విషయములు. (బ్రిటిష్ బెలూచిస్థానము మినహా).

(59) భారతదేశపు సర్వే.

(60) ప్రాచీన వస్తువుల సంరక్షణ.

(61) జియలాజికలు సర్వే.

(62) రాష్ట్రమునందు ఆమోదింపబడు శాసనములు, రాష్ట్రములందలి రికార్డులు,న్యాయస్థానముల తీర్పులు, బ్రిటిషు ఇండియాలో ఆదరింపబడునట్లు చేయుట.

(63) ఈ లిస్టునందు వివరింపబడిన అంగములపై బ్రిటిషు ఇండియా కోర్టులకు గల అధికారము.

(64) పైన వివరింపబడిన అంశములకు సహజముగు సంబంధము గల ఇతర అంశములు.

## కేవలము రాష్ట్రీయ ప్రభుత్వములకు సంబంధించిన విషయములు

1. స్థానిక స్వపరిపాలనము (కాంటోనుమెంటులు మినహా)

2 రాష్ట్రములందు వైద్యశాలలు,శరణాలయములు, ధర్మ సంస్థలు నేర్పరుచుట, వాటిని పరిపాలించుట.

3. ప్రజారోగ్య శాఖ.

4. రాష్ట్రమునందు పుణ్యక్షేత్రములు.

5. మొదటి లిస్టు 6-వ క్లాజునందు చేరని విశ్వ విద్యాలయములు, ఇతరవిద్యా సంస్థలు.

6. రాష్ట్రమునకు సంబంధించిన పబ్లికువర్క్సు.

7 ప్రజోపయోగకరములగు కార్యములకు భూములను వశపరచుకొనుట (లాండు అక్విజిషను)

8. రోడ్లు, బ్రిడ్జిలు మున్నగునవి

9 ఫెడరలురైల్వేమార్గములతో సంబంధము లేక రాష్ట్రములందే చిన్న రైల్వేమార్గములను నిర్మించుట

10 మునిసిపాలిటీ పరిహద్దులలో ఏర్పరుపబడు ట్రాంవేలు.

11 నీటి సప్లయికాలువలు మున్నగునవి.

12. భూమిపన్ను నిర్ణయించి వసూలుచేయుట. ఇందులకు సంబంధించిన రికార్డుల నుంచుట.

13. భూమిపై ఎవ రెవరికి ఎట్టిహక్కు లుండవలయునో నిర్ణయించుట.

14. భూస్వాములకు రైతుల కుండవలసిన పరస్పర సంబంధములను నిర్ణయించుట.

15. కోర్టు ఆఫ్ వార్డ్సు.

16. భూమిని అభివృద్ధిచేయుట, రైతుల కివ్వబడు ఋణములు మున్నగు విషయములు.

17. రాష్ట్రమునందలి ప్రభుత్వములపై కంట్రోలు.

18. రాష్ట్రపు ఆదాయములనుండి చెల్లింపవలసిన పెన్షనులు.

19. ప్రిఎంప్షను.

20. వ్యవసాయాభివృద్ధికై ఏర్పరుపబడు పరిశోధన ప్రతిష్ఠాపనలు, మాడల్ ఫారములు మున్నగునవి

21. వెటరినరిశాఖ.

22. ఫిషరీలు (ఫెడరలు ప్రభుత్వమువారికి చేరనివి).

23. పరపతి సంఘములు.

24. రిజిష్టరుచేయబడిన ధర్మ సంస్థలు, విద్యాసంస్థలు.

25. అడవులు.

26. మద్యపదార్థముల ఉత్పత్తి విక్రయపు కంట్రోలు.

27. మద్య పదార్థములపై (పొగాకు మినహా) ఎక్సైసు డ్యూటీ విధించుట.

28. ఫెడరలు, సుప్రీం, హైకోర్టులు తప్ప ఇతర న్యాయ స్థానముల నిర్వహణము.

29 రెవిన్యూ కోర్టులు.

30. ఈ లిస్టునందు వివరింపబడిన అంశములపై న్యాయస్థానములకు గల అధికారమును అమలునందుంచుట.

31. అడ్మినిస్ట్రేటరు జెనరలు, అఫిషియలు ట్రస్టీ.

32. మొదటి లిస్టు 53-వ నెంబరునందు చేరని స్టాంపు డ్యూటీలు.

33 పత్రముల రిజిస్ట్రేషను.

34. జనన మరణముల రిజిస్ట్రేషను.

35. ధర్మాదాయములు, మఠాదాయములు.

36. రాష్ట్రములందలి గనులను అభివృద్ధికి తెచ్చుట (గనులపై కంట్రోలు ఫెడరలు ప్రభుత్వమువారి కుండును)

37 ఆహార పదార్థముల ఉత్పత్తి సప్లయిలపై కంట్రోలు

38. మొదటి లిస్టు 26-వ నెంబరునందు చేరని పరిశ్రమలను అభివృద్ధికి తెచ్చుట.

39. ఫ్యాక్టరీలు.

40. విద్యుచ్ఛక్తి.

41. బాయిలర్లు.

42. గాస్.

43. పొగవల్ల కలుగు ఇబ్బందులను తొలగించుట.

44. ఆహారపదార్థముల కల్తీ.

45 తూకములు, కొలతలు (వీని ప్రమాణములను నిర్ణయించు అధికారము ఫెడరలు ప్రభుత్వమువారి కున్నది).

46. రాష్ట్రమునందలి వర్తకము.

47 రాష్ట్రమునందు జరుగు నేరములపై చర్య తీసికొనుట.

48. పెద్దరేవులని ఫెడరలు శాసనసభవారిచే నిర్ణయింపబడని ఇతర రేవులు.

49. రాష్ట్రమునందలి జలమార్గములు.

50 పోలీసు (గ్రామ రైల్వే పోలీసుసహా) (క్రిమినలు ప్రొసీజరు కోడునందు విధింపబడిన నిర్ణయములకు భంగము కలుగకూడదు.)

51. జూదము.

52. జంతుహింసానివారణము.

53. అడవిమృగములను, అడవిజాతి పక్షులను సంరక్షించుట

54. రాష్ట్రమునందు మోటారుబండ్ల రెగులేషను.

55. నాటక ప్రదర్శనములు, సినిమా ప్రదర్శనములపై కంట్రోలు.

56 మరణవిచారణ పంచాయతీలు.

57. దొంగజాతులు.

58. వృత్తి లేని ఆంగ్లేయులు.

59. కారాగృహములు, బోర్‌స్టలు పాఠశాలలు మున్నగునవి.

60 ఖైదీలు.

61. బందెదొడ్లు.

62. నిధినిక్షేపములు.

63. మొదటి లిస్టు 43-వ క్లాజునందు చేరని లైబ్రరీలు, మ్యూజియములు మున్నగునవి.

64 రాష్ట్రీయశాసనసభలకు ఎన్నికలు జరుపుట.

65 రాష్ట్రమునందలి పబ్లికుసర్వీసులు, రాష్ట్రపు పబ్లికు సర్వీసుకమిషను

66. ఫెడరలు ప్రభుత్వమువారిచే విధింపబడు ఆదాయపు పన్నులపై సర్‌చార్జీలను విధించుట.

67. ఈ లిస్టునకు చేర్చబడిన అనుబంధమునందు వివరింపబడిన విధమున పన్నులను వసూలు చేయుట; గవర్నరుజెనరలుగారి అనుమతి పొంది ఇతర విధములగు పన్నులను వసూలుచేయుట.

68. బీదలకు సహాయ మొసగుట.

69 ఆరోగ్యపు ఇన్స్యూరెన్సు. వయస్సుచెల్లినవారికి పెన్షను ఇచ్చుట

70. ఋణము లిచ్చువారు, ఋణము లిచ్చుట.

71. శ్మశానభూములు.

72. రాష్ట్రీయ శాసనసభలచే ఆమోదింపబడు శాసనములను అమలునందుంచుట.

73. రాష్ట్రీయశాసనసభలవారిచే మార్పు చేయబడక చట్టమున సూచింపబడిన ఇతరవిషయములు.

74. మూడవ లిస్టునందు సూచింపబడిన విషయములపై ఫెడరలు ప్రభుత్వమువారు గావించు శాసనములను అమలునందుంచుట.

75. రాష్ట్రమునకు ఉపయోగకరమగు లెక్కలు.

76. మొదటి లిస్టునందుగాని, మూడవలిస్టునందుగాని చేరని కేవలము రాష్ట్రమునకు సంబంధించిన విషయములు,

77. పైనవివరింపబడిన విషయములకు సహజముగ సంబంధించిన ఇతర విషయములు

## ఫెడరలు, రాష్ట్రీయ ప్రభుత్వముల రెండింటికిని సంబంధించిన విషయములు

1. ఈ లిస్టునందు చేర్చబడిన విషయములపై న్యాయస్థానములకు గల అధికారములు

2. సివిలు ప్రొసీజరు.

3. కోర్టులలో సాక్ష్యమొసగుట, ప్రమాణము గావించుట మున్నగు విషయములు.

4. వివాహము, విడాకులు.

5 మెజారిటీ వయస్సు నిర్ణయించుట. మైనారిటీయందున్న వారికి గార్డియనులను ఏర్పరచుట.

6. దత్తస్వీకారము

7. చట్టము ననుసరించి నిర్బంధముగ రిజిష్టరు చేయవలసిన స్థిరాస్తులకు సంబంధించిన పత్రములు.

8. ఈ క్రింది విషయములకు సంబంధించిన చట్టములు — (1) వీలునామాలు (2) ఆస్తి విక్రయము కాంట్రాక్టులు (3) పవర్ ఆఫ్ అటార్నీ (4) భార్యకు భర్తకు ఉండవలసిన సంబంధము (5) మోత మోయువారు (6) పూటకూళ్లు (7) మధ్యవర్తిత్వము (8) ఇన్స్యూరెన్సు.

9 ఇండియను పీనలుకోడు.

10. క్రిమినలు చట్టములు.

11. వార్తాపత్రికలు, పుస్తకములు, ముద్రాక్షరశాలల కంట్రోలు.

12. పిచ్చి ఆసుపత్రులు.

13. గనులలో పనిచేయువిషయమునఏర్పరుపవలసిననిబంధనలు.

14 ఫాక్టరీలలో పనిచేయు విషయమున ఏర్పరుపవలసిన నిబంధనలు.

15. యజమానుల బాధ్యతలు, పనివారలకునష్టపరిహారము.

16. ట్రేడుయూనియనులు.

17. కార్మికులను సంరక్షించుట, వారికి ప్రావిడెంటుఫండు ఇన్స్యూరెన్సు సౌకర్యములను కలుగజేయుట.

18. కార్మికుల తగాదాలను పరిష్కరించుట.

19. విషములు, విషద్రవ్యములు.

20. ఒక రాష్ట్రమునందలి బాకీని మరియొక రాష్ట్రమునందు రాబట్టుట.

21 వైద్యవృత్తి అర్హతలను నిర్ణయించుట

22 ప్రాచీనవస్తుసంపదలను సంరక్షించుట

23 పైన వివరింపబడిన విషయములకు సహజముగ సంబంధించిన ఇతరవిషయములు.

## రాష్ట్రీయప్రభుత్వములవారు విధించుపన్నులు

[రెండవ లిస్టు అనగా రాష్ట్రీయ ప్రభుత్వముల పరిపాలనకు లోబడిన విషయములు లిస్టునందలి 67-వ ఐటమునందు సూచింపబడిన రాష్ట్రీయ ప్రభుత్వమువారిచే విధింపబడు పన్నులు ఆదాయము ఈ దిగువ వివరింపబడినవి ]

1. రాష్ట్రీయ ప్రభుత్వమునకు చేరిన భూములు, భవనములు, గనులు, అడవులు, ఫిషరీలు మున్నగువాటిపై వచ్చు ఆదాయము

2 ఇరిగేషను, ఎలెక్ట్రికు సప్లై, నీటిసప్లై, మార్కెటులు, జంతువధశాలలు, టోలుగేట్లు మున్నగువాటిపై వచ్చు ఆదాయము

3. బాంకింగువల్లను, నిలవ చేర్చియుంచిన మొత్తములపైనను వచ్చువడ్డీ, అప్పులు, అడ్వాన్సులు, లాటరీలు మున్నగువాటివల్ల గలుగులాభములు

4 రాష్ట్రీయప్రభుత్వమువారిచే విధింపబడు జరిమానాలు.

5. కోర్టుఫీజు స్థానికపురేట్లు, లైసెన్సు ఛార్జీలు, రిజిస్ట్రేషను ఫీజులు వల్ల కలుగు ఆదాయము

6 తలపన్ను, వలసవచ్చినవారిపై ఇతరపన్నులు.

7. భూమిపన్నులు, వారసత్వపు పన్నులు.

8. ఇండ్లు, జంతువులు, బండ్లు, వృత్తులు మున్నగు వాటిపై విధింపబడు పన్నులు

9. పనివారిపై విధింపబడు పన్నులు

10. మద్యపదార్థములపై విధింపబడు డ్యూటీలు, స్థానికః డ్యూటీలు.

11. వ్యవసాయపు ఆదాయముపై పన్నులు.

12. మొదటి లిస్టునందు చేరని స్టాంపుడ్యూటీలు.

13 వినోదప్రదర్శనములు, జూదములు, లాటరీలపై పన్నులు

14. రాష్ట్రములకు సంబంధించిన శాఖలను పరిపాలించు విషయమున ఏర్పడు ఇతర ఆదాయములు.

# ఆంగీరస సంవత్సర విశేషములు

౧౯౩౨

మార్చి ౧ మదరాసులో లోథియనుకమిటీవారి విచారణ.

,, ౩ వి. జె పటేలుగారి విడుదల.

,, ౮ లోథియన్ కమిటీవారు బొంబాయికి బయలుదేరిరి.

,, ,, ఫ్రాన్సు దేశపు ప్రధానామాత్యుని మరణము

,, ౯ ఐయిర్లండులో డివెలరాగారు ప్రభుత్వాధ్యక్షులుగ నెన్నుకొనబడిరి.

,, ౧౩ వానుహిండెన్‌బర్గుగారిని జర్మను ప్రభుత్వాధ్యక్షులుగ నెన్నుకొనుట.

,, ౧౪ లోథియన్ కమిటీవారు బొంబాయినుండి లక్నోకు వెళ్లిరి

,, ౧౭ కాంగ్రెసుపతాకము నెత్తుట నేరము కాదని అహమ్మదాబాదు జడ్జిగారి తీర్పు.

,, ,, ఢిల్లిలో దక్షిణాఫ్రికాసమస్యను గూర్చిన ప్రతినిధివర్గ సమావేశము.

,, ౨౧ రాజభక్తిప్రమాణమును తీసివేయుటనుగురించి డివెలరాగారి ప్రత్యుత్తరము

,, ,, లాహోరులో మహమ్మదీయ సభవారు రౌండుటేబిలు కమిటీలను బహిష్కరించుటకు తీర్మానించుట

,, ౨౪ పార్లమెంటు సభలో లేబరుపార్టీవారు ఆర్డినెన్సుల పరిపాలనను నిరసించుట

,, ,, కొచ్చిను మహారాజుగారి మరణము

,, ౨౯ కె వి రంగస్వామి అయ్యంగారి మరణము.

,, ౩౧ లోథియన్ కమిటీవారు లాహోరుచేరుట.

ఏప్రిలు ౧ బొంబాయిలో ఆల్ ఇండియన్ లీగు నిషేధము.

,, ౨ బొంబాయి రేవుపనివాండ్ర సమ్మెకట్టు ముగింపు.

,, ౫ దక్షిణ ఆఫ్రికా [illegible]యుల - క్రొత్త ఒడంబడిక.

,, ,, ట్రాన్సువాలు ఏషియాటికు టెన్యూరు (సవరణ) చట్టమున మార్పులు.

,, ౬ భారత జాతీయ మహాసభను జరుపగూడదని ఇండియా ప్రభుత్వమువారి ప్రకటన.

,, ౧౧ విమానముపై రవీంద్రుని పర్షియా పయనము.

,, ౨౨ సరిహద్దు రాష్ట్రశాసనసభా ప్రారంభము.

,, ౨౧ మౌలానా షౌకతాలీగారు ఆంగ్లేయ వితంతువును వివాహమాడుట.

,, ౨౩ ఢిల్లీలో సేటు రంఛోడ్‌దాసుగారి యధ్యక్షతను కాంగ్రెసు సమావేశము సుమారు ౬౦౦ అరెస్టులు.

,, ౨౫ సర్ దొరాబ్ తాతా (బొంబాయి) గారు ౩ కోట్ల ౨౫ లక్షల రూపాయలను ధర్మముల కొసగుట.

,, ,, ఇండియామంత్రి క్రొత్తగ నూరులక్షల పౌనులు అప్పు తీసిరి

,, ౩౦ మిడ్నపూరు మేజస్ట్రేటు, డగ్లసు హత్య

మే ౧ విక్రాల రామచంద్రాచార్యుల మరణము.

,, ౩ మంచూరియాను గురించి జాతిసమితి యుపసంఘమువారి నిర్ణయము.

,, ౪ అయిర్లండు పార్లమెంటులో ప్రమాణపు రద్దు బిల్లు ఆమోదింపబడెను.

,, ౬ ఫ్రాన్సు దేశాధ్యక్షుడు, డౌమరుగారి హత్య,

,, ౧౦ ఫ్రాన్సుకు నూతనాధ్యక్షుని యెన్నిక.

,, ,, లోథియను ప్రభువు కరాచినుండి విమానముపై లండనుకు పయనించిరి.

,, ౧౪ బొంబాయిలో హిందూ మహమ్మదీయ కలహములు: పోలీసువారి తుపాకికాల్పులు. అనేకుల మృతి.

,, ౨౧ బిపినచంద్రపాలు మృతి

,, ౨౯ బొంబాయిలో రెండవమారు అల్లరులు.

| | | |
|---|---|---|
| ,, | ౨౯ | చిలుకూరి వీరభద్రరావుగారికి చెన్నపురి ఆంధ్ర సారస్వత సంఘమువారి సమ్మానము. |
| జూన్ | ౧ | జర్మనీ నూతన ప్రభుత్వపు ఏర్పాటు. |
| ,, | ౩ | లోథియను కమిటీ నివేదిక ప్రకటన. |
| ,, | ,, | కొండ వెంకటప్పయ్య పంతులు మొదలయినవారి యరెస్టు |
| ,, | ,, | సర్ దొరాబు టాటాగారి మరణము. |
| ,, | ౫ | హెరియటుగారు ఫ్రాన్సుప్రధానామాత్యుడుగ ఎన్నుకొనబడుట. |
| ,, | ౧౦ | కాశీనాథుని నాగేశ్వరరావుగారి విడుదల |
| ,, | ౧౪ | చిటగాంగులో విప్లవకారులకును, మిలిటరీవారికిని యుద్ధము. |
| ,, | ౧౫ | బ్రిటిషు విద్యాశాఖ మంత్రి మృతి |
| ,, | ౧౬ | లాసేనులో ఆయుధవిసర్జన సభా ప్రారంభము |
| ,, | ౧౭ | ఐర్లండులో యూనియన్ జాకును దింపుట |
| ,, | ౧౯ | ఆర్డినెన్సులను రద్దు చేయవలయునని లండనులో సభ |
| జూలై | ౨ | పోర్చుగలు పూర్వపురాజు, మాన్యూలుగారి మరణము. |
| ,, | ౫ | దుకాణముల మూయుటగాని, మూయ ప్రోత్సహించుటగాని నేరము గాదని రామేశముగారి తీర్పు |
| ,, | ౮ | లాసేనులో ఒడంబడిక కుదురుట. |
| ,, | ౭ | రౌండు టేబిలు సలహా సంఘమునుండి సర్ ప్రూ జయకర్ల రాజీనామా. |
| ,, | ౧౫ | ఆంధ్రరాష్ట్రీయ "వైయిండియన్ లీగు" సమావేశము. అధ్యక్షులు పి. సి. రాయిగారు. |
| ,, | ౧౭ | టి. ప్రకాశముగారి విడుదల. |
| ,, | ౨౦ | ఇటలీలో మంత్రుల రాజీనామాలు. |
| ,, | ౨౧ | అట్టావాసమావేశ ప్రారంభము |
| ,, | ౨౨ | లండనులో ఉత్కళనివేదికకు ప్రతికూలముగ జోగయ్య పంతులుగారి అభిప్రాయము. |
| ,, | ౨౬ | జర్మనీలో సైనికశాసనములు రద్దుచేయుట. |
| ,, | ,, | అట్టావాసభలో ఆర్థిక సహకారోపసంఘమునకు అధ్యక్షుడుగ అతుల చటర్జీగారి నియమనము |
| ,, | ౨౭ | సంస్థానముల విచారణ సంఘపు నివేదిక ప్రకటన. |
| ,, | ౩౧ | బెజవాడలో ప్రత్యేకాంధ్రమహాసభ. |
| ఆగస్టు | ౮ | చీనాప్రధానమంత్రి రాజీనామా. |
| ,, | ౧౦ | స్పెయినులో రాజపక్షమువారి తిరుగుబాటు. |
| ,, | ౧౧ | ఆంధ్రోత్కళ సమస్యనుగూర్చి జోగయ్యపంతులు ఇండియా మంత్రికి విన్నపము పంపిరి. |
| ,, | ౧౩ | ట్రాన్సువాలులో భారతీయుల సత్యాగ్రహము. |
| ,, | ౧౮ | బ్రిటిషుప్రభుత్వమువారి సాంఘికసమస్యా పరిష్కార ప్రకటన. |
| ,, | ౧౯ | ఇంగ్లండు ఐర్లండులకు రాజీ కుదురుట. |
| ,, | ౨౦ | అట్టావా సభ ముగింపు. |
| ,, | ,, | ఇండియా బ్రిటనులకు వాణిజ్యసంబంధమయిన ఒడంబడిక కుదురుట |
| ,, | ౨౬ | ఇండియా లీగు ప్రతినిధులు మదరాసు చేరుట |
| ,, | ౨౮ | లంకాశాసనసభలోని పనిమాంత్రిక సమ్మె. |
| ,, | ,, | ప్రొఫెసరు సుబ్రహ్మణ్యముగారి మరణము |
| సెప్టెంబరు | ౮ | శ్యామసుందర చక్రవర్తిగారి మరణము |
| ,, | ౭ | అమెరికను మిషనరీ స్టోక్సుగారి హిందూమత స్వీకారము |
| ,, | ౧౨ | నిమ్నజాతి రక్షణార్థము మహాత్ముని ప్రాణత్యాగోద్యోగ నిశ్చయము |
| ,, | ,, | జర్మనుల పార్లమెంటు రద్దు. |
| ,, | ౧౮ | మహాత్ముని విడుదలను గురించి ప్రభుత్వమువారి ప్రకటన |
| ,, | ౧౭ | బొంబాయిలో నాయకుల సభ |
| ,, | ౨౦ | మహాత్ముని నిరశన ప్రాయోపవేశ ప్రారంభము. |
| ,, | ౨౧ | ఆయుధవిసర్జనసభలో పాల్గొనుటకు జర్మనీవారు నిరాకరించుట. |
| ,, | ౨౪ | నిమ్నజాతులను గురించిన ఒడంబడిక కుదురుట. |
| ,, | ౨౬ | పూనా ఒడంబడికకు, బ్రిటిషు ప్రధానిగారి ఆమోదదాని ప్రకటన |
| ,, | ౨౭ | బ్రిటిషుమంత్రుల రాజీనామా |
| అక్టో. | ౩ | లిట్టను సంఘమువారి మంచూరియా నివేదిక ప్రకటన |
| ,, | ౩ | అయిర్లండు గవర్నరు జనరలుగారి రాజీనామా. |
| ,, | ,, | బ్రిటిషు లేబరుపార్టీ వార్షికసమావేశము. |
| ,, | ౮ | ఏలూరులో ఆదిమాంధ్రసభ |
| ,, | ౯ | తంజావూరులో ౧౨-వ బ్రాహ్మణేతర మహాసభంగము |
| ,, | ౧౧ | అమెరికాలో ఇండియా ప్రభుత్వము తరఫున రీడింగు ప్రభువుగారి ప్రచారము. |
| ,, | ౧౬ | లక్నో సభలో సమాధానము కుదురుట. |

౧౮ లేబరు పార్టీవారు మెగ్డనాల్డు, స్నోడను, థామసు గార్లను పార్టీనుండి తొలగించుట.

౨౧ ఆంధ్రోత్కళ సమస్యను గురించిన ఆంధ్ర రాయబారము.

౨౨ రాజమహేంద్రవరమున శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారికి సమ్మానము.

౩౦ సర్ ఆలీ ఇమాముగారి మృతి

౧ బరోడా సంస్థానములో దేవాలయములన్నిట హరిజనులకు ప్రవేశము లభించుట

౩ పి టి రాజన్ కుమారస్వామి రెడ్డిగార్ల రాజీనామాలు.

,, బొబ్బిలిరాజాగారు చెన్నపురి ప్రధానమంత్రిగా నెన్నుకొనబడుట.

,, అలహాబాదులో అఖిలపక్ష నాయకుల సభ.

౭ ఇండియా లీగుసభ్యులు యూరపుకు మరలుట

౯ అమెరికా సభ్యులు రూజ్వెల్టుగారి యెన్నిక

౧౦ జానుగాల్సువర్దీ గారికి నోబిలు బహుమతి

౧౬ అలహాబాదులో సమిష్టినియోజక వర్గముల సమస్యా పరిష్కారము.

౧౭ లండనులో మూడవ రౌండు టేబిలుసభ ప్రారంభము.

౨౦ బర్నార్డుషాగారు ప్రపంచయాత్రకు బయలుదేరుట.

,, ఇండియాను గురించి ఇండియాలీగువారి అభిప్రాయములు వెల్లడియగుట.

౨౨ టంగుటూరు ప్రకాశముగారి భార్య హనుమాయమ్మ గారి మరణము.

౧ చీనా జపాను పోరాటము మరల తలయెత్తుట.

౩ కొండ వెంకటప్పయ్య పంతులుగారి విడుదల.

౫ ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్ట ప్రదానోత్సవము.

౮ సర్. బి యన్. శర్మగారి మృతి.

,, ౧౦ మదరాసులో కజిన్సు సతి అరెస్టు.

,, ౧౯ అట్టావా బిల్లు స్టేటు కౌన్సిలునందు ఆమోదింపబడుట.

,, ౨౫ రౌండు టేబిలు సభ ఆఖరు.

,, ౩౦ దక్షిణభారత హిందీప్రచార సభ ద్వితీయ పట్ట ప్రదానోత్సవము.

౧౯౩౩

జనవరి ౫ అమెరికా పూర్వపు అధ్యక్షులు కూలిడ్జిగారి మరణము

,, ౮ బొంబాయికి బర్నార్డుషాగారి రాక.

,, ౧౦ వరాహగిరి జోగయ్యపంతులుగారు ఇంగ్లాండునుండి తిరిగివచ్చుట.

,, ౨౩ రంగయ్యరుగారి బిల్లునకు రాజప్రతినిధి యనుమతి.

,, ౨౬ ఐర్లండులో డివెలరాపక్షమునకు జయము.

,, ౩౦ జర్మనీలో ప్రధానమంత్రి హిట్లరుగారి నియామకము.

,, ౩౧ ది బ. ఆరోగ్యస్వామి మొదలిగారి మరణము.

,, ,, గాల్సువర్దీ మరణము.

ఫిబ్రవరి ౩ ఢిల్లీ కుట్రకేసును ప్రభుత్వమువారు రద్దుచేయుట

,, ౪ కస్తూరిబాయి గాంధి అరెస్టు.

,, ౬ దక్షిణఆఫ్రికా మంత్రి డాక్టరు మాలన్‌గారి మరణము.

,, ౮ అయిర్లండుకు అధ్యక్షులుగ డివెలరాగారు మరల నెన్నుకొనబడిరి.

,, ౧౧ పూనాలో హరిజనపత్రిక జననము.

,, ౧౩ పిఠాపురము మహారాణిగారి మరణము.

,, ౧౮ జపానువారు నానాజాతిసమితివారి సూచనలను నిరాకరించుట.

,, ౧౯ విశాఖపట్టణమున ౧౧-వ ఆంధ్రవిద్యార్థి సభ.

,, ౨౦ నానాజాతిసమితినుండి విడిపోవుటకు జపానువారి నిశ్చయము.

,, ౨౧ చీనా జపాను యుద్ధమునకు మరల మొదలు.

---

ఆంధ్రపత్రికా ముద్రాలయము, చెన్నపురి.—1933.